# నవభారతి

## సాహిత్య. సాంస్కృతిక మాసపత్రిక

సెప్టెంబర్, 1979

సంపాదకులు:
చదలవాడ పిచ్చయ్య

మూల్యం : రెండు రూపాయలు

నవభారతి కార్యాలయము
3-4-1008/1, బర్కత్‌పుర
హైదరాబాదు - 500 027

# విషయసూచిక



# నవభారతి

సాహిత్య సాంస్కృతిక మాస పత్రిక

సంపుటి 7] హైదరాబాదు * సెప్టెంబర్, 1979 [సంచిక 11


## ఈ నాడు మన జాతీయ నాయకులు నేటి తమ కర్తవ్యమును గుర్తించి మెలగగలరని భావించవచ్చునా?

భారత జాతీయ విద్య సంస్కృత భాషలో నున్నది. సంస్కృత భాషలోనున్న భారత జాతీయ విద్యను మనము మన మాతృభాషలలో బోధించుకొన వలయును. మనము సంస్కృత భాషను అభ్యసించి మనము మన మాతృభాషలలో నైపుణ్యము సంపాదించుకొని మన జాతీయ జీవన విధానమునకు తగిన జాతీయ విద్యను, మన మీనాడు రూపొందించుకొన వలసి యున్నది. ఆంగ్లేయ భాష మన జాతీయ జీవనములోని భాషలన్నింటిని కుదించి, కుదించి వానిని మన జాతీయ జీవన ప్రయోజనమునకు వినియోగించని విధమున విద్యావిధానమును రూపొందించిన కారణమున మనము మన జాతీయ విద్యా విధానమునకు దూరము చేయబడి ఆంగ్ల విద్యయే మన సమస్యలన్నింటిని పరిష్కరించునని చెప్పుటకు సహితము వెరపులేక యున్నామని గ్రహించుకొన వలసియున్నది.

శాస్త్ర విద్యలన్నియు సంస్కృత భాషలందు వివరించబడి యున్నవని గ్రహించుకొన వలయును. మనము ఎప్పటి వరకు సంస్కృత విద్యయందు ప్రావీణ్యతను సంపాదించుకొనలేమో అప్పటివరకు మన జాతీయ విద్యలైన శాస్త్రములకు మనకు సంబంధమనునది ఏర్పడదని గ్రహించుకొనవలయును.

స్వరాజ్యము వచ్చినది. మనను మనము పరిపాలించుకొను చున్నామని చెప్పకొను చున్నాము. వాస్తవమునకు మనకు జాతీయ పరిపాలన యనునది నేటి వరకును ఏర్పడ లేదనియే చెప్పుకొనవలసియున్నది. మనకు జాతీయ భాష యనునది నిర్ణయించ బడక ఆంగ్లేయ భాషనే మన జాతీయ పరిపాలనకు వినియోగించు చున్నాము. ఇంతకన్నా అవివేక వంతమైన పద్ధతి మరియొకటి వుండదని గ్రహించుకొనవలసియున్నది.

స్వతంత్ర పరిపాలన యనునది స్వధర్మ నిర్వహణమునకు తోడ్పడిననాడే జాతీయాభ్యుదయమునకు తోడ్పడునని గ్రహించుకొన వలసి యున్నది. మనము మన పాలకులను ఎన్నుకొన

గలిగిన అవకాశమునే స్వతంత్ర పరిపాలనయని చెప్పుకొను చున్నాము. ఈ చెప్పుకొనునది వాస్తవమైన స్వతంత్ర పరిపాలన కాదని తెలిసికొనవలసియున్నది. భారతీయు లందరికి మాతృభాషలను విడనాడి యున్నవి జాతీయ భాషకు మాత్రము రూపుదిద్దుకొనబడక యున్నది. ఇందుకు కారణము మనలో జాతీయాభిమానము కొరవడి యున్నదని గ్రహించుకొన వలయును. ప్రపంచములోని మానవ జాతులలో భారత జాతీయ విద్య పరమోత్కృష్టమైనదని విధ్యార్థులు అన్నిటిని పరిశీలించినచో ప్రతి ఒక్కనికి సుబోధకము అగునని గ్రహించవలయును. ఇందుకు కారణము అనునది యున్నది.

ప్రపంచములోని అనేక దేశములలో సంస్కృత విద్యపై ఖర్చుపెట్టబడుచున్న ధనము ఎంతో హెచ్చుగా నున్నది. మన దేశములో సంస్కృత విద్యపై ఖర్చు పెట్టబడుచున్న ధనము బహు తక్కువగా నున్నది. మన జాతీయాదాయములో హెచ్చు భాగమును ఆంగ్లవిద్యపై వెచ్చించుచున్నాము ఈ విధానమును నేటి వరకును మనము మార్చుకొననేక పోవుటకు కారణమనునది యున్నది. ఆంగ్ల విద్యా వ్యామోహమును నేటి జాతీయ నాయకులు విడనాడని విధానమును అవివేక మనవలయునో లేక ప్రజల జాతీయాభిమానము కొరవడి యున్నదని అనవలయునో చర్చించుకొని నిర్ణయించుకొన వలసి యున్నది. నేటి జాతీయ నాయకులకు జాతీయ విద్య ప్రధానము కాదు. ఆంగ్ల విద్యయే ప్రధానమై జాతీయ విద్యలు అప్రధానములై ఈ అవ్యవస్థకు తోడ్పడు చున్నదని గ్రహించుకొనవలసి యున్నది మన జాతీయ నాయకులు ఎప్పటి వరకు జాతీయ భాషాభిమానమును పెంపొందించుకొనరో, ఆంగ్లేయ భాషావ్యామోహమును తగ్గించుకొనరో, మాతృభాషలయందు అభిమానము పెంపొందించుకొనరో, మన జాతీయ జీవనమును సుసంపన్నము చేసుకొనుటకై జాతీయ విద్యను రూపొందించుకొనరో అప్పటివరకు జాతీయాభ్యుదయము పూజ్యమని తెలయవలసియున్నది. ఇది ఈ నాటి తరుణ కర్తవ్యముగా ఎంచుకొని ఈ సమస్యను పరిష్కరించుకొనవలసి యున్నది.

పాశ్చాత్య దేశములలో భారతజాతీయ విద్యావిధానములలోని విశిష్టతను గ్రహించుకొన వలసి యున్నదని అచటి ప్రజలు కుతూహలముతో ఉండియున్నారని గమనించవలసి యున్నది. వేద విద్యా విధానమును గురించి, ఉపనిషత్తులను గురించి భాష్యములను గురించి అనేక భాషలలో గ్రంథములు వెలువడి యున్నవని తెలుసుకొనవలయును. న్యాయశాస్త్ర వైశేషిక విధానముల గురించి అనేక భాషలలోనికి అనువదించుకొనబడి భారత జాతీయ విద్యా విధానములోని ఉత్కృష్టమైన భావములను పాశ్చాత్యులు నిత్యము ప్రశంసించుట జరుగు చున్నదని గ్రహించుకొనవలసి యున్నది. ఇంకను మన కావ్యములలోని ఉత్కృష్టమైన పాత్రల గురించి. రచనాసరళిని గురించి, భావుకతను గురించి, కళానైపుణ్యమును గురించి అనేక విధముల భారత జాతీయ విద్యా విధానము ప్రశంసించు బడుట యనునది, జరుగుచున్నదని గ్రహించుకొన వలయును. ఇది భారత జాతీయ విద్యా విధానములో పరమోత్కృష్టమైన మానవ మానవతకు మార్గదర్శకమైనదని గ్రహించుకొనవలసియున్నది. మనకు ఈ గ్రహింపు బహుతక్కువగా నున్నది. ఇందుకు కారణమనునది యున్నది.

గ్రీకు తత్వవేత్తలను గురించి, రోమన్ సామ్రాజ్య విధానములను గురించి, ఫ్రెంచి వారి రాజకీయ తత్వశాస్త్రములను గురించి, జర్మనీ దేశస్థుల శాస్త్ర విద్యా విధానమును గురించి మన విద్యార్థులకు విద్యావిధానముల ద్వారా విశదీకరించి మన జాతీయ విద్యా విధానముపై మక్కువ తగ్గించుచున్నామని మనము ఈనాడు గ్రహించుకొనవలసియున్నది. నేడు మన జాతీయ జీవనమును తీర్చిదిద్దుటకు తోడ్పడిన జాతీయ నాయకుల చరిత్రలను సహితము తగ్గించి పాశ్చాత్య చరిత్రలోని వారి జాతీయ నాయకులను నిత్యమును మిక్కిలిగా ప్రశంసించు విద్యా విధానమునే ఈనాడు కూడా విశ్వ విద్యాలయములలో భోధించుట యనునది వివేకవంతమైన జాతీయ విధానము అనవలయునో లేదో విచారించుకొని నిర్ణయించుకొనవలసియున్నది

ఆంగ్ల విశ్వ విద్యాలయములు నానాటికి ప్రబలము చేయబడుచున్నవి. జాతీయ విద్యాలయములనునవి ఏర్పడుచబడక యున్నవి. మన స్వాతంత్ర్య పరిపాలనా కాలములో మనము నేడు అనుసరించు విధానము, ఈ విధానము ననుసరించి యున్నదని గ్రహించకొని దీనిని మార్చుకొనవలసినది, లేనిచో మన జాతీయ నాయకులు మనకు విశదము చేయవలసియున్నదని తెలుసుకొనవలయును.

భారత దేశములో పలుప్రాంతములనునవి యున్నవి. ఈ పలుప్రాంతములలో నివసించు వారిని సమన్వయ పూరితమైన పరిపాలన కొనసాగించుటకుగాను జాతీయ భాషయనునది ఏర్పడవలసి యున్నదని నేటినాయకులు గ్రహించుకొనవలసియున్నది. ఈ గ్రహింపు నాయకులకు సమకూరని యెడల పలుప్రాంతములలో నివసించు ప్రజలకు తమ దేశము యెడల ఏకత్వమును గురించి ఏవిధముగా జాతీయతకు తోడ్పడ వలయునో తెలియబడదని తెలిసికొనవలసియున్నది.

ఆంగ్లభాష మన పరిపాలనకు తోడ్పడక, మనలో మనను విభాగించుటకు తోడ్పడుచున్నదని గ్రహించుకొనవలసియున్నది. భారతదేశము ఒకే ఖండమై యున్నది ఈ ఖండములో నివసించు వారికి వారివారి మాతృభాషలనునవి ఉండియున్నవని గ్రహించుకొనవలసియున్నది. అన్ని ప్రాంతములలో నివసించు వారికి ప్రసిద్ధమైన సాహిత్యములనునవి యున్నవని గ్రహించుకొన వలయును. సాహిత్య, సంగీత, చిత్రకళా, శిల్ప శాస్త్రములలో అత్యున్నతమైన నేర్పరితన మనునది ఏర్పడియున్నదని గ్రహించుకొనవలసియున్నది. తరతరములజాతీయ సాంస్కృతిక సంపద కలిగిన భారత దేశములోని ప్రాంతీయ భాషలన్నింటిని సుసంపన్నము చేసికొనవలసియున్నదని గ్రహించ గలిగిననాడే జాతీయ నాయకులు స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన సజాతీయమైన జాతీయ నాయకులుగా గుర్తించబడి జాతీయ జీవనమునకు రూపురేఖలను తీర్చిదిద్దగల సామర్థ్యమును భారతజాతి రూపు దిద్దుకొన గలదని గ్రహించుకొనవలసియున్నది ఈనాడు మన జాతీయ నాయకులు నేటి తమ కర్తవ్యమును గుర్తించి మెలగ గలరని భావించవచ్చునా ?



# పానుగంటి వారి లాంటి రచయితల రచనలకు ఈ కాలములో కూడా అవసరము మిగిలివున్నది

డా॥ ముదిగొండ వీరభద్రశాస్త్రి

"పరిశుద్ధ స్నాన మాచరించుట, పందిగుంటలోఁ బడుట - దప్పు దిద్దుకొనుట, తిరుగఁ దప్పులోఁ బడుట - పై కెగురుట, పండ్లు విఱుగఁబడుట - ప్రకృతి మర్యాదయై యున్నది."

అనంతకాల ప్రవాహంలో ప్రజాజీవిత వాహినిలో వస్తూ పోతూ ఉండే వరదల గురించి వ్రాస్తూ సమీక్షగా సంగ్రహంగా పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు చెప్పిన వాక్యం ఇది. బుద్ధుడు, శంకరుడు, రామానుజుడు, మధ్వాచార్యుడు వంటి మహాపురుషులు ఉదయించారు. తమ కాలపు సమాజంలోని అవకతవకలను సరిదిద్ది శ్రేయోమార్గాలు కనబరిచారు. అయితే అతి స్వల్పకాలంలోనే దాంభికులు, కపటులు చేరి ఆ బోధనలను ఎప్పటికప్పుడు ఎంతవఱకు ధ్వస్తం చేయటానికి అవకాశం ఉన్నదో అంత ధ్వస్తం చేయనే చేశారు. ఈ చరిత్రనంతా పానుగంటి వారు సాక్షి (3వ సం. 8) లో స్పష్టంగా చిత్రిస్తూ పై సమీక్ష చేశారు.

1914 లో 'సువర్ణ లేఖ' పత్రికలో సాక్షి ఉపన్యాస పరంపర ఆయన ఆరంభించినప్పుడు సాక్షి సంఘం ఎందుకు నిర్మాణమైందో వివరిస్తూ చెప్పిన ప్రధాన హేతువు మానవుడు చేస్తున్న మహేంద్రజాలాన్ని ఎదుర్కొవాలన్నది. "ఆహా! మనుష్య చర్య లెంత విరుద్ధముగ మాఱియున్నవి! ముద్దులో ముక్కుఁ గొఱుకుట. కౌగిలింతలో గొంతుకోత. సాలగ్రామ తీర్థములో సౌవీర పాషాణముగ నున్నవి కదా! ప్రకృతి యెంత దల క్రిందయినది! అమృతమేదో హాలాహలమేదో, పూలబంతి యేదో తుపాకి గుండేదో, నమస్కారమేదో నెత్తిపెట్టేదో, మంచి యేదో చెడ్డ యేదో, మిత్రుఁడెవఁడో శత్రుఁడెవఁడో, స్వర్గమేదో నరకమేదో, పరమేశ్వరుఁ డెవఁడో బ్రహ్మరాక్షసుఁ డెవఁడో—భేదమంతయు నశించినది కదా!"

మాన, న్యాయ, ధన, ప్రాణాది విషయములగు వ్యాపారాలలో సైతం ఇట్లాంటి మహేంద్రజాల విద్యనే కనబరుస్తున్నారంటూ ఇలా చెప్పారు: "సత్య మసత్య మను నూఁటికోల లేక నడువలేదని మనవారు నమ్మియున్నారు. పతివ్రతలో మాయ; బ్రాహ్మల పాలిలో మాయ; న్యాయాధికారి కలములో మాయ; న్యాయవాద నాలుక కొనను మాయ; వర్తకుని త్రాసులో మాయ; వసుధా కర్షకుని నాగేటిలో మాయ; ఎక్కడఁ జూచిన మాయ."

సాక్షి సంఘం ఏర్పాటు చేసుకొని ఈ మాయని, మహేంద్రజాలాన్ని ఎదుర్కొవాలనుకున్నప్పుడు "రాజకీయ విషయములను గూర్చి యెన్నడును ముచ్చటింపఁ గూడదు, వ్రాయఁగూడదు" అనే ఒక నియమం పెట్టుకున్నారు. పరతంత్రంగా ఉన్న దేశం కనుక ఆనాడు ఆ నియమం పెట్టుకోవటం తప్పనిసరి అయినట్లు కనబడుతుంది. కాని నిజానికి పంతులు గారు మొదట సూచనమాత్రంగాను, ఆ తరవాత బాహాటంగాను రాజకీయాలను, ఆనాటి రాజకీయ పరిస్థితులను సమీక్షించారు; లోపాలను విమర్శించారు.

సమకాలిక రాజకీయాలలో అగ్రగణ్యుడుగా ఉన్న గాంధీమహాత్ముని పట్ల పంతులుగారికి విశేషమైన గౌరవం ఉండేది. పంతులుగారు ప్రధానంగా స్వస్థాన వేష భాషాభిమాని. గాంధీజీపట్ల ఆయనకు విశేషమైన అభిమానం కలగటానికి హేతువు అదే. గాంధీజీని గూర్చి ఆయన వ్రాసిన మాటలు సాక్షి 5-5) -

"అన్ని కాలములందు నన్ని దేశములందు దేవ భక్తు లెందఱో యుండిరి. వారిలో ననేకులు సంసారములరోసి; నివాసములఁ ద్యజించి యేగిరి. ఏ గహ్వరములందో, యే చెట్టు నీడనో తపస్సు చేసి కొని తాము తరించినవారే గాని యితరులఁ దరింపఁ జేసినవారు కాదు. అట్టివా రెంత యుత్కృష్టజీవు లయ్యును వారుకూడ నొకవిధముగ స్వార్థపరు లే గాని కేవల స్వార్థరహితులు గారు. "శ్లో. యస్మిన్ జీవతి జీవంతి బహవ స్పతు జీవతి." అని కవి గాన మొనర్చినాఁడు.

కాని దానికి మఱికొంత చేర్పవలసి యున్నది. ఎవఁడు తరించుటవలన ననేకులు తరింతురో వాఁడే తరించినవాఁడు కాఁడా? అందుచే మహాత్ముఁడు దేశ భక్తుఁడే గాక దేవభక్తుఁడు. ప్రజాభక్తుఁడు. ప్రపంచ భక్తుఁడు...

మనుజుఁడై పుట్టి స్వయంకృషిచే, స్వప్రయోజ కతచే, సాధనక్రమముచే నెంతవాఁ డగుటకు సృష్టి తత్త్వ మంగీకరించునో యంతవాఁడై నాఁడు అతఁడు మొదట నాంగ్లేయ భాషా పండితుఁడే, యాంగ్లేయ వేషధారియే. తరువాత స్వదేశీయ వస్త్రధారియైనాఁడు. పిదప స్వదేశ స్వాతంత్ర్య రక్షకుఁడై నాఁడు. పిమ్మట నింద్రియ నిగ్రహుఁ డై నాఁడు. దానిపై శమదమాది సంపన్నుఁడై నాఁడు. అందుమీద లోకా ద్భుత చరితుఁడై నాఁడు. దానిపై లోకపవిత్రుఁ డై నాఁడు."

గాంధీజీ అనుయాయులము అని చెప్పుకొనే వారిలో బహుసంఖ్యాకులు ఆ గౌరవానికి తగినవారు కారనే విషయాన్ని పానుగంటివారు అప్పటికే గుర్తించారు. బుద్ధుడు, శంకరుడు, రామానుజుడు, మధ్వాచార్యుడు మొదలయిన వారి బోధనలను ఎంత కంపు పట్టించి దాంభికులతో తెచ్చిపెట్టుకున్న ఆడంబరంతో ఎట్లా ప్రజను వంచించటానికి వారి అనుయాయులు కొందరు పాల్పడ్డారో గాంధీపేరు చెప్పు కొనేవారు అలాగే వంచనపరులు, నికృష్టులు అయినందుకు పానుగంటివారు ఆవేదన పడ్డారు. అనేక సందర్భాలలో ఎంతో మనః ప్రజ్వలనంతో ఆయన జంఘాలశాస్త్రిచేత, ఇతర పాత్రలచేత పలికించిన పలుకులు ఈ సత్యాన్ని స్పష్టంగా చాటుతాయి. ఆ మాటలు అపహాస్యపూరితంగా, వ్యంగ్యంతో ఉండి నవ్వుకలిగించినా పానుగంటివారు తమ పాఠకులు మనస్ఫూర్తిగా కులాసాగా ఒకసారి నవ్వుకోవాలని వ్రాయలేదు. క్రమక్రమంగా ఆయన ఆవేదన పట్ట రానిదై పోయింది.

పానుగంటివారు రాజకీయ పరిస్థితుల దగ్గరికి మొదటిసారిగా వచ్చింది, 1920-21లో- 'ఎన్నికలు' (సాక్షి 2-14) అన్న ఉపన్యాసములో. జంఘాల శాస్త్రి మదరాసునుంచి 'కార్యాంతరమున మఱి యొక్క పట్టణమునకు' వెళ్లినట్లు చెప్పుకొని అక్కడ జరుగుతుండిన ఎన్నికలపైన లేఖవ్రాసి సాక్షికి పంపించాడు. ఇందులో ప్రధానమైనది అప్పట్లో ప్రముఖాంశంగా ఉండిన బ్రాహ్మణా బ్రాహ్మణ వైరుధ్యాలు. సభ్యత్వం అపేక్షించి ఎన్నికలలో నిలిచినవారినిగూర్చి జంఘాలశాస్త్రి వ్రాసిన మాటలు:

"సభ్యత్వము నపేక్షించిన మహాపురుషులు కొందఱు పూటకూటిండ్ల వీధిగోడల నానుకొని, 'నేనుండగా దేశమునకేమి కొఱఁత' యని గర్వాటో పావన లోకనములలో, గనుతెప్ప వేయకుండఁ జూచుచున్నారు- కొందఱు మోటార్ల పార్శ్వ భాగముల నంటిపెట్టుకొని, చక్రముల ధూళి కమ్మలలో ముక్కులలోఁ బ్రవేశింప సహింపుచు' మా వంకఁ

జూడరేమి? మా వంక జూడరేమి?" యని చెప్ప హాంగులతోఁ గోడియంపులతోఁ బటుగువిడుచున్నారు- కొందఱు క్రోతులవలెఁ గొండ్రముచ్చులవలెఁ జెట్టు కొమ్మలనెక్కి యిగిలించుచు దేశోపకార మహాదీక్షా పరవశత్వమునఁ గాబోలు దమఁమీదఁ బక్షులు వ్రైచిన రెట్టలనైన నెఱుఁగక 'మాకు వోటీయ కుండిన యెడల మే మిటనుండి క్రిందికి దుమికి చచ్చెదమని బెదరించు చున్నారు."

వోట్లకోసం ఎక్కడబడితే అక్కడ అంటించిన అభ్యర్థుల బొమ్మల కుడ్యపత్రాల వర్ణన ఇది. ఆ తరువాత ఆయన దీనిని పతాక స్థాయికి తీసుకు వచ్చారు ఒక చిత్ర కథతో. ఒక ఆమె రాత్రివేళ చీకట్లో ఒక సందులోనుంచి వెళ్తూ దడుసుకుంది- బ్రహ్మరాక్షసుడెవడో ఆవేశించినట్లు అనుకుంటారు. జంఘాలుడు వెళ్ళి ఆ రాక్షసుణ్ణి వర్ణించమని ఆమెను అడిగాడు. "ఎఱ్ఱవాఁడు-లావుపాటివాఁడు-బొల్లిపెద వుల వాఁడు-బూరె బుగ్గలవాఁడు-గుండ్రని మొగము వాఁడు-గొఱుగుడు మీసాలవాఁడు-బోదకాలివాఁడు బొజ్జకడుపువాఁడు-అట్టి బ్రహ్మ రాక్షసుఁడు..." అని ఆమెవర్ణన.

ఆ వర్ణన విన్నాక జంఘాలశాస్త్రి ఆమెను ఒక ఆ సందులోకి తీసుకొనిపోయి అక్కడ పబ్లిక్ రెస్ట్రీన్ గోడపయిన అంటించిఉన్న కుడ్యపత్రం మీద ఉన్న ఒక అభ్యర్థి చిత్రాన్ని చూపితే తాను బ్రహ్మరాక్షసుడని భ్రమపడినది ఆ బొమ్మచూసేనని ఆమె తెలుసుకుంటుంది. "వీడే - వీడే! అన్నది. అప్పుడు శాస్త్రి చెబుతాడు: "అమ్మా! వీఁడని యన రాదు. ఈతఁడు మన రాజధానిలోని మహాజనులలో నొక్కఁడు. ఈతఁడేదో సభ్యత్వము నపేక్షించిన వారిలో నొక్కఁడు. జన సామాన్యమునకుఁ బ్రతి దినము నావశ్యకమగు స్థలమగుటచేఁ గాఁబోలు దీని గోడమీఁద నా మహానుభావుఁ డవతరించి సమస్త బాధలకు సహించి నిలువఁబడినాఁడు. మహా మహుఁడు, దేశభక్తుఁడు."

ఈ 'దేశభక్తుల' విపరీత చర్యాలగూర్చి జంఘాల శాస్త్రిద్వారా 'ఉన్మత్తుల' పాత్రలద్వారా పానుగంటి వారు చాలాచోట్ల సాక్షివ్యాసాలలో ఆక్షేపించారు, అవహేళన చేశారు.

"ఎనిమిది వర్షములలోపల నీ భారతవర్షమున బయలుదేరిన దేశ భక్తులసంఖ్య మిగిలిన సర్వ ప్రపంచమందు నెనిమిదివేల సంవత్సరములు కాల ములోగలిగిన దేశభక్తుల సంఖ్యకంటె నెన్నిమడు గులో హెచ్చని భావింపవలసినట్లున్నది. అసాధారణ మైన...యద్వితీయమైన యీ యభివృద్ధి యారోగ్య లక్షణమా, ఆమయ లక్షణమా? చింతల పెటపెటయా, క్రొవ్వు దవదవయా? సరము పారా, సింజునీరా?

ఏమి యుపన్యాసముల ఝూంకారములు?...... ఆ హాహా బుద్ధ దేవుఁడాడఁదగిన మాటలే! రామా నుజుఁడాడఁదగిన మా ట లే! దేశోద్ధరణమును సంకల్పించుకొనిన మీరు వట్టి మాటలతోఁ గృతార్థులు గాగలరా? మాటల కనుగుణమైన చర్త్వము మీలో నున్నదో లేదో పరిశీలించుకొంటిరా?...

పూర్వమొనర్చిన జాతి ద్రోహములు, దేశ ద్రోహములు, మత ద్రోహములు, దైవ ద్రోహ ములు ఖద్దరు టోపీతో సమూలముగ నెగిరిపోయి నవా? ఖద్దరు నీ యొడల మీదనా యుండవలసినది. నీ మనసులో నుండవలయును. నీ మనశ్శాటిలోని పడుగుపేక స్వదేశీయ భావ తంతువులతో నెప్పుడు చేయబడినదో యప్పుడు నీవు దేశభక్తుఁడ వగుదువు.

(5 సాక్షి 5-4)

మరోచోట అంటారు: తలపై నున్న గుడ్డయే కాదు; తల మీఁద జుట్టు కూడా స్వదేశీయపుదై యుండవలయును. తలలోని మెదడు కూడా స్వదేశీ యపుదై యుండుట యంతకంటె ముఖ్యము."

దేశ భక్తికి దేవ భక్తి, జాతీయత, స్వార్థ పరిత్యాగము అంగాలని పంతులుగారు చాలాచోట్ల వివరించారు.

"దేశభక్తి యెల్లరి హృదయములందిప్పుడు నిరంకుశముగఁ దాండవించుచున్నది. ఈ గుణ మనునది పుట్టుటతోఁ బుట్టవలసినది. గిట్టుటతోఁ గిట్టవలసినది, అంతేకాని నడుమ నడుమఁ గలుగుట నడుమ నడుమ సంచరించుట యుచితముగఁ గానఁబడదు. కలుగని గలుగని మనువారికి దేశభక్తి కలుగుట చేత గాబోలు వెట్టి వెట్టి కేక విడుచున్నారు. వీరావేశము నొందుచున్నారు. క్రిందుమీదు తెలియక యెగురుచున్నారు. ఎదుట మాటలాడఁదలచిన వారిని మొత్తుచున్నారు..."

జంఘాలశాస్త్రికి వచ్చిన ఒక స్వప్నంలో ఒక మైదానంలోకి ఒక భారత మాత పీఠం ఆకాశం నుంచి దిగివచ్చింది. దేశభక్తులు ఆ పీఠాన్ని సమీపించి ఒకరి వెనుక ఒకరు చేతితో స్పృశించి కన్నుల కద్దుకొమ్మని అన్నారు. నెలకు పదివేల రూపాయల రాబడినిచ్చే న్యాయవాద వృత్తిని విడిచిన వాడు ముందుకు వచ్చాడు. అడుగు ముందుకు పెట్టలేకపోయినాడు. "కన్నులున్నవి. కాళ్ళున్నవి. శక్తి యున్నది. అన్నిటినీ మించిన సింహాసన స్పర్శనాభిలాష యున్నది. ఒక్క యడుగైన ముందుకు బడనిదే." అతని విస్మయంలో జనం సాయం బట్టి ముందుకు తోశారు. తోసిన కొద్దీ వెనక్కి పోయినాడు. కారణం? దివ్య పురుషుడు వివరించాడు. పది లక్షలు సంపాదించినా అతడు తల్లిదండ్రులకు అన్నం పెట్టలేదు. "మాతృ భక్తి కంటే దేశభక్తి ఎక్కువది కాదు. పితృ భక్తి కంటే దేశ భక్తి ఎక్కువది కాదు. అవి రెండును లేని వానికి దేశభక్తి కలుగుట కల్ల — నీ కన్న దానినే తినుఁవాడెవ్వఁడును నీకు లేనప్పు డార్జన మింక మానితినని గర్వపడు టెందులకు?

ఇట్లాంటి వారే మరొకరు. పరోకరు ఒకడు చపల చిత్తుడు. "నీ కర్మము కీర్తియే ప్రధానము కాని మరియొకటి కాదు నీకు ప్రజలయందు విశ్వాసము లేదు. ప్రభువుల యందంతకంటే లేదు. ప్రభువు లాదరించినపుడు ప్రజల బాధించినావు. ప్రభువులు నిరాదరణము చేసినప్పుడు ప్రజల పక్షము చేరి ... గడబిడ కోలాహల మాచరించినావు."

పానుగంటి వారి దృష్టిలో దేశభక్తి, సచ్ఛీలము అని వేరు వేరుగా లేవు. జాతీయత అన్నా, సచ్ఛీలత అన్నా అంతా ఆయనకు ఒక్కటే. ఈ విధంగా ఆయన సమాజంలో వ్యాపించిన కృత్రిమత్వాన్నీ, కాపట్యాన్నీ, మిథ్యావేషాలను, డొల్ల భావాలను అధిక్షేపించారు.

ఆయన ఇవన్నీ వ్రాసి అర్ధ శతాబ్దం గడిచింది. కాని ఆ పరిస్థితులు పోలేదు. పోకపోవటం అటుంచి ముదిరినాయి. ప్రజా జీవిత రంగంలో పదవులార్జించి ప్రతిష్ఠలార్జించి పెద్ద మనుషులుగా అగ్రనాయకులుగా చలామణీ సంపాదించిన చిన్నా పెద్దా అటు గాంధీజీ కలలను, ఇటువంటి మహనీయుల కలలను అధిక్షేపిస్తూ జెముడు కంపలాగా వ్యాపించే ఉన్నారు. వారి ఆటలు సాగటానికి ప్రజలలో ఏర్పడిన నిస్తబ్ధత, నిర్వీర్యత కారణం. పానుగంటి వారి లాంటి రచయితల రచనలకు ఈ కాలంలో కూడా అవసరం మిగిలే వుంది.



# గీతాంజలి—రవీంద్రనాథ ఠాకూర్

## అనువాదం: శ్రీ లక్ష్మి

ఈ చిన్ని పూవును, కోసి, స్వీకరింపుము: ఆలసింపకుము ప్రభూ! లేకున్న, వాడి నేలపాలవుతుంది. నీ మాలలో దీనికి చోటులేకపోయినా, నీవు తుంచినప్పుడు, ఆ బాధ, తీయగా వుంటుంది. లేకపోతే, నాకు తెలికయనే, పూజాసమయం మించిపోతుంది.

ఈ పూవు, రంగులు నింపుకోకున్నా, సువాసనలు విరియకున్నా, నీ కైంకర్యానికి, దీనిని స్వీకరింపుము స్వామీ.

7

నా గానమూర్తి అలంకారాలను తీసివేసింది. అడంబరాలమీద ఆమెకు మనసులేదు. అలంకారాలు మన కలయికకు అడ్డుగా నిలుస్తాయి; వాటి గలగలలలో నీ మంజులవాణి వినిపించదు.

నీ ఎదుట నా కవితాగర్వం సమసిపోతుంది. విశ్వకవీ! నీ పాదాలచెంత నేను కూర్చుని వున్నాను.

నీ వేణువునువలె, నా జీవితాన్నికూడ, నీ మధుర గానంతో పూరింపుము స్వామీ.

8

మూర్ఖుడా. నీ మూపు మీదనే నిన్ను నీవు మోయాలని చూస్తున్నావు. భిక్షుకుడా, నీ యింటనే నీవు బిచ్చమెత్తవచ్చావు.

అన్నిభరించే ఆ విశ్వవిభుని చేతులలో నీభారాన్ని కూడా ఉంచు. జరిగి పోయిన దానికి ఎన్నడూ వగవకు.

నీ కోరికలే నీ దీపాన్ని ఆర్పివేస్తున్నాయి. వాటి మలిన హస్తాలలోని ఫలాలను అందుకోవద్దు. పవిత్ర ప్రేమ ప్రసాదించు వరాలు స్వీకరించు.

9

నా పయనము సుదూరము. సుదీర్ఘ కాలయాపనతో కూడకున్నది.

తొలి కిరణంతో నా పయనం ప్రారంభించి ఎన్నో లోకాలు కడచి పోతున్నాను.

సుదూర మార్గమే కడకు సుగమం అవుతుంది. సహజ సుందరంగా జాలువారే ఆ రాగాన్ని ఆలపింప చేసే సాధన మహత్తరమయినది.

బాటసారి ఇల్లిల్లూ తిరిగి, తన హృదయాలయాన్ని చేరుకుంటాడు. బాహ్యంగా పరిభ్రమించి అంతరరాముని తెలుసుకుంటాడు.

నా కన్నులు నీ కొరకే వెతకి వెతకి వేసారి పోయాయి. చివరకు హృదయాంతరాలల్లో నిన్ను కనుగొన్నాయి 'ఎక్కడున్నావు కన్నా' అనే ఆవేదన. 'నీవే నేను' సత్యస్ఫూర్తితో విశ్వమును దీప్తిమంతం చేసింది.

10

నేను పాడాలనుకున్న పాట ఈ నాటికీ పాడలేక పోయాను.

నా వీణకు తీగెలు వేయడం, తీయడంలోనే కాలం గడచి పోయింది.

పదాలు పొందికగా అమరలేదు. రాగం కమ్మగా కుదరలేదు. నా మదిలో ఆవేదన మాత్రం మిగిలింది.

పూవు వికసించలేదు. గాలి మాత్రం నిట్టూర్పులు విడుస్తున్నది

అతని మోము నేను చూడలేదు. పలుకైనా వినలేదు. నా యింటి పక్కబాటలో అతని మెత్తని అడుగుల సవ్వడి (చప్పుడు) మాత్రం విన్నాను

రోజంతా అతని కొరకు ఆసనం ఆయత్తం చెయ్యడంలోనే గడిచి పోయింది. ఇంకా దీపం వెలిగించలేదు ఇంటిలోనికి రమ్మని పిలువలేను. అతనిని పొందగలననే నమ్మకంతోనే బ్రతుకుతున్నాను.

11

నా కోరికలకు అంతులేదు. నా పరితాపం దయనీయ మయినది. కఠినంగా నా ప్రార్థన నిరాకరించి, నన్ను రక్షించావు. నీ కృప ఎల్లప్పుడూ నాకు ఉన్నది.

కోరకనే నీవు ప్రసాదించిన కొండంత వరాలు, ఈ ఆకాశం, వెలుగు, శరీరం, ప్రాణం, మనస్సు రోజు రోజుకూ నా పేరాశను తగ్గించి ధన్యను కావించావు స్వామి.

నేను కొన్ని వేళల ఉదాసీనంగా ఉండిపోతాను కొన్ని వేళల నా భాగ్యాన్ని వెతుక్కుంటూ వెడతాను ఆతృతగా. కాని నువ్వు నిర్దాక్షిణ్యంగా, నాకు కనిపించకుండా దాక్కుంటావు.

రోజురోజుకూ, నన్ను నీ సంపూర్ణ స్వీకృతికి అర్హనుగా చేస్తున్నావు, వ్యర్థమైన కోర్కెల బారి నుండి కాపాడుతూ.

12

ప్రభూ : నిన్ను కీర్తించుటకే నేను ఇక్కడ వేచి ఉన్నాను నీ ఆలయంలో ఒక మూల.

నీ విశ్వంలో నాకు పనిలేదు. నా సోమరి బ్రతుకు అర్థంలేని గీతాలను ఆలపిస్తుంది.

అర్ధరాత్రి గుహాలయంలో, మౌన ఆరాధన వేళ సమీపించినప్పుడే; నీ ఎదుట నిలబడి పాడమని నన్ను ఆజ్ఞాపించుస్వామీ.

ఉషోదయంలో నీ దివ్యవేణువు మ్రోయించినప్పుడు విని ఆనందించనీ

13

నా అదృష్టం పండి, ఈ విశ్వ వినోదంలో ఆనందించడానికి ఆహ్వానం వచ్చింది. వీనుల విందుగా కన్నుల పండుగగా అనుభవించాను

ఈ విందులో నా వీణ మీద ఆలపించడం నా వంతు. నాకు చేతనయినట్లు నా పాత్ర పోషణ చేయగలిగాను.

ఇంక ఇప్పుడు లోపలికి వచ్చి నీ దర్శనం చేసుకుని మౌనంగా నా ప్రణతుల సమర్పించుకునే సమయం ఆసన్నమయింది, కన్నా.

14

నన్ను నేను సంపూర్ణంగా అర్పణ చేసుకోవడానికే ఆ ప్రేమ మూర్తికై వేచియున్నాను. అందుకే కర్మాచరణంలో ఇంత జాప్యం జరుగుతుంది.

నన్ను వారి నిబంధనలలో బంధించాలని చూస్తున్నారు. నేను తప్పించుకుని తిరుగుతున్నాను. నన్ను నేను సంపూర్ణంగా అర్పణ చేసుకోడానికే ఆ ప్రేమ మూర్తికై వేచివున్నాను.

వారు నన్ను సోమరినని నిందిస్తారు. వారి అభియోగం సరికాదని నా అనుమానం.

పగలంతా వారు సందడిగా పనితో గడిపివేశారు. నన్ను పిలవడానికి వచ్చి వారు కోపంతో తిరిగి వెళ్ళారు. నన్ను నేను సంపూర్ణంగా అర్పణ చేసుకోవడానికే ఆ ప్రేమ మూర్తికై వేచివున్నాను.

15

శ్రావణ మేఘాలు దట్టంగా అలముకొన్నాయి. నీవు రాలేదు శ్యామా. నీకై వాకిట ఒంటరిగా వేచి ఉన్నాను.

ఇన్నాళ్ళూ పనిసందడిలో అందరితోపాటు గడిచి పోయింది. ఈనాడు చీకట్లో, ఒంటరినై నీ కోసమే ఎదురు తెన్నులు చూస్తున్నాను.

నువ్వు లేకుండా ఈ వర్షా సమయం ఎలా గడపాలో పాలుపోవడం లేదు.

సుదూర లోకాల నుంచి పయనించి వచ్చి, ఆకాశాన్ని అలముకుంటున్న మేఘమాలను పరదేశంగా చూస్తున్నాను. నా హృదయం బాధతో అల్లాడిపోతుంది. విశ్రాంతి ఎరుగని గాలికి మల్లే గుడ్లు పున్ను తిరుగుతుంది.

16

నీవు పలుకకున్న నీ మొహాన్నే నా మదిలో నింపుకుంటాను. సహనంతో, కళ్ళలో వత్తులు వేసుకొని, రజని వే వెలుగుల స్వామికై వేచి వున్నట్లు, సమ భావంతో నేను మౌనంగా వేచి వుంటాను.

ఉషోదయం తప్పక అవుతుంది. చీకట్లు మాయమవుతాయి. నీ దివ్య వాణి విశ్వ మంతటా విన వస్తుంది.

అప్పుడు పక్షుల కుసూజితాలలో, పూవుల సువాసనలో, నీ చక్కని పలుకులు రాగాలుగా జాలువారుతాయి.

17

నా హృదయ కమలం విప్పారి నప్పుడు నాకు తెలియనే లేదు. నా పూల సజ్జ ఖాళీగా వుండటం వల్ల పుష్పం అజ్ఞాతంగా వుండిపోయింది.

ఎప్పుడయినా దిగులుగా వుండడం, మెల్లగా తేరుకొని కమ్మని నవ్య సువాసనలు దక్షిణా నిలునిలో పొడచూడడం జరిగింది.

ఆ సన్నని కమ్మని వాసనలలో నా మది నిరీక్షింప సాగింది పూర్ణ వికాసం కొరకు.

అప్పుడు, అది ఇంత సన్నిహితంగా వున్నదని నా స్వస్వరూపమేనని, నా సహస్ర దళ పద్మం విచ్చుకున్నదని నేనెరుంగనైతిని.

18

నల్లని శ్రావణ మేఘాల నీడలలో నిశ్శబ్దంగా, అజ్ఞాతంగా, నువ్వు నడిచిపోతున్నావు ఎవ్వరినీ కానరాకుండా.

తూర్పు గాలులు మాటి మాటికీ దిగ్గరగా కేక లేస్తున్నా ఈ రోజు ఉషాబాల కన్నులు తిప్పనే లేదు. నిర్మల మయిన వినీలాకాశాన్ని దట్టమయిన నల్లని తెర ఒకటి కప్పివేసింది.

బేలలోని పాటలు ఆగిపోయాయి. అంతటా ఇండ్ల తలుపులు మూసి వున్నాయి. ఈ నిర్జనమైన మార్గాన నీ వొక్కడివే వెళుతున్నావు. రా ఏకైక మిత్రమా, ప్రియ బాంధవా, నా వాకిలి నీ కొరకు తెరచే వున్నది. కలలో వలె కదలిపోకుమా.

నేను అలసిపోయిన రాత్రి హాయిగా నిద్ర పోతాను నీలో నమ్మకంతో. ముకుళించుకుని పోయిన నా ఆత్మను నీ ఆరాధనకై యత్నింపమని బలవంతం చెయ్యను.

పగలంతా అలసిపోయిన భూమాత కనులకు నీవే రాత్రి యనే విశ్రాంతిని ప్రసాదించావు. మరునాడు నూతనోత్సాహంతో ఆమె మేలుకొంటుంది.

20

అతను వచ్చినప్పుడు రాత్రి విశ్చలంగా వున్నది. చేతిలో వేణువు వున్నది. నా కలలు వేణునాదంతో స్పందించాయి.

అతను వచ్చి నా ప్రక్కన కూర్చున్నాడు. నాకు మెలకువ రాలేదు. ఎంత దురదృష్టం.

అయ్యో, నా రాత్రులన్నీ ఇలాగే వ్యర్థంగా గడిచి పోయాయి. అతని శ్వాస నా నిద్రను స్పృశిస్తుంది. అయినా నేను అతనిని చూడలేకపోతున్నాను.

# "గయోపాఖ్యానము"నకు ఆధారము "చిత్రభారతము"

డి. అన్నపూర్ణ

"శతలేఖిన్యవధాన" బిరుదాంచితుడైన "చరిగొండ ధర్మన్న" కవిచే విరచితమైనది "చిత్రభారతము". భారత కథయందలి పాత్రలతో సంబంధము కలిగి వెలసిన విశిష్ట గ్రంథములలో చిత్రభారత మొకటి. "గయోపాఖ్యానము"ను ద్విపద కావ్యమును నిట్టిదే. దీనిని "నాదెండ్ల గోపమంత్రి" రచించెను. ఈ రెండు కావ్యములను పరిశీలించి చూసిన కొన్ని సామ్యములు, భేదములు గోచరించును. అయిన నీ భేద సామ్యములను గురించి చర్చించుటకు పూర్వము, నీ రెండింటిలో నేది తొలి గ్రంథమో, నేది మలి గ్రంథమో గమనింపవలెను. మఱియు ఎవరిని ఎవరు అనుకరించిరో లేక ఒకరి కావ్యమును మరియొకరు చదువగనే ఇరువురికిని యాదృచ్ఛికముగా అటువంటి ఇతివృత్తమును ఎన్నుకొని కావ్యమును రచింపవలె ననెడి ఇచ్ఛ జనించెనో తెలిసికొనవలెను.

"చిత్రభారతము" ప్రౌఢ ప్రబంధములలో నొకటి. ఇది ఎనిమిది ఆశ్వాసములు గల గ్రంథము. దీని కర్తయైన ధర్మన కవి క్రీ. శ. 1470–1530 ప్రాంతములకు చెందినవాడని చెప్పవచ్చును. ఈ కావ్యము క్రీ. శ. 1503–1512 మధ్య ప్రాంతములో రచింపబడినది. ఇది "ఎనుములపల్లి పెద్దయామాత్యు"న కంకితము చేయబడినది.

నాదెండ్ల గోపమంత్రి తన "గయోపాఖ్యానము"ను కొండవీటియందలి "రాఘవేశ్వర స్వామి"కి అంకితము చేసెను. ఇతడు రాఘవేశ్వరునికి ప్రాకార గోపుర ప్రాసాదాదులను, సోపానములను కట్టించినట్లును, హేమకుంభము లెత్తించినట్లును, మైలవరమను గ్రామమును, ఉత్సవ విగ్రహములను నొసంగినట్లును, కృత్యాది ద్విపదలలో గలదు. ఈ దానములు శాలివాహన శకము 1442–1443 (క్రీ. శ. 1520–22) లో గావించెను. వీనినిబట్టి "కృష్ణార్జున సంవాదము"ను నామాంతరము గల "గయోపాఖ్యానము" క్రీ. శ. 1522 నకు పిమ్మట రచియింపబడినట్లు తలంపవచ్చును.[1]

ఈ కవు లిరువురును రాయల యుగమున రాయలునకు సమకాలీనులై యుండిరని తెలియుచున్నది. చిత్రభారత రచన జరిగిన పిదప గోపమంత్రి ఆ రచనను చదివి యుండవచ్చును. దాని నాధారముగాఁ జేసికొని తన ప్రతిభతో "గయోపాఖ్యానము"ను ద్విపద కావ్యమును రూపొందించి యుండును.

గయోపాఖ్యానము నందలి ఇతివృత్తము: ఒక నాటి ఉదయకాలమునందు శ్రీకృష్ణుడు ద్వారకాపురి సమీపమున నున్న వనమునందు విహరించుచు నట గల సరస్సులో స్నానము చేసి, సంధ్యావందన మొనర్చుచు, సూర్యున కర్ఘ్య మిచ్చుచుండెను. అదే సమయమున "గయుడ"ను గంధర్వుడు బ్రహ్మదేవుని దర్శింప ఆకాశమార్గమున బోవుచు నుమిసెను. అది సూర్యున కర్ఘ్యమిచ్చుచున్న కృష్ణుని దోసిట పడినది. అంత నతడు మిగుల కోపించి, ఈ అపరాధమును చేసినవా రెవరై యుండునని ఆలోచించు చుండగా, జలదేవత "గయుడ"ని సమాధానము చెప్పినది. అంత కృష్ణ డుగ్రకోపముతో "ఎవ్వరడ్డము వచ్చినను గయుని సంహరింతున"ని ప్రతిజ్ఞ

1. కృష్ణార్జున సంవాద పీఠిక

చేసెను. ఈ ప్రతిజ్ఞా విధానమును ఆకాశవాణి ద్వార
వినిన గయుడు కడు భీతితో తన్ను రక్షించవలసి
నదిగా బ్రహ్మను శరణు వేడుకొనెను. "కృష్ణుడు
సాక్షాత్ విష్ణువు గావున అతని ప్రతిజ్ఞను తప్పించు
టలో నా సమర్థుడ ననియు, నీలకంఠుని ప్రార్థింపు
మనియు" చెప్పెను. పిదప గయుడు కైలాసమున
కేగి రుద్రుని ప్రార్థించెను. "కృష్ణుడు నేనును
ఒక్కరమే గనుక అతని పట్టు విడిపింప దగదు.
నీవే పోయి యాతనిని శరణు వేడుకొనుము" అని
పల్కెను. కృష్ణునియొద్దకే వెళ్ళినచో వెంటనే తన్ను
సంహరించునని ఆలోచించి, ఏమియు తోచక విచా
రించుచుండగా, నారదుడు అటకి వచ్చి "అర్జునుని
శరణు వేడుకొనుము, ఆతడు నిన్ను తప్పక రక్షిం
చును" అని చెప్పెను. ఆ విధముగా జేసినచో అర్జు
నుడు తన మిత్రుడగు కృష్ణునికి తన్ను అప్పగించు
నను భీతితో నాతడు ఆ పాండవ మధ్యముని కడ
కేగుటెంచుటకు వెఱచెను. అంత నారదుడు నాతనితో,
"భయకారణమును చెప్పకయే శరణు వేడుకొనుము,
ఆతడు నిన్ను తప్పక రక్షించును. పిదప భయ
కారణమును చెప్పినను ధనంజయుడు ఆడిన మాట
తప్పడు" అని చెప్పగా సంతోషించి, గయుడు
వెంటనే ద్వైత వనమునకు పోయి నట నున్న
అర్జునుని శరణు వేడుకొనెను. "ఎవ్వ రడ్డము వచ్చి
నను నిన్ను తప్పక కాచెదనని" అర్జునుడు గయుని
కభయము నిచ్చి, నీ భయమునకు కారణభూతు
డెవ్వరని? అని ప్రశ్నింపగా, గయుడు "శ్రీకృష్ణుడు"
అని సమాధానము చెప్పెను. ప్రాణ స్నేహితునితో
వైరము ప్రాప్తించెనని చింతించి, యుధిష్ఠిరునితో
ఈ విషయమును చెప్పెను. గయుని రక్షించుటయే
పరమధర్మమని పాండవులందరును నిశ్చయించిరి.
ఇది ఈ గ్రంథమందలి ప్రధాన కథ. పిదప కృష్ణుడు
గయుడు పాండవుల వద్ద నున్నట్లు తెలిసికొని 'పట్టు
వదలి గయుని నాకప్పగింపుమని' అర్జుననితో చెప్పు
మని వేగవంతుడను వానిని పంపెను. అర్జును
డాతనితో "శరణాగతుని విడువజాలనని చెప్పు
మనెను. కృష్ణుడు అక్రూరుని చేతను, చివరకు
సుభద్ర చేతను రాయబారము లంపెను. అర్జును
డందుల కంగీకరించక ప్రత్యుత్తరము లంపుటయు
నిందు విశేషముగా వర్ణింపబడినందున నీ గ్రంథ
మునకు కృష్ణార్జున సంవాదమనియు పేరు పెట్టెను.

—ఈ కథ భారతమునందు లేదు. మరి యే పురా
ణము లందును కన్పించదు. ఇది కేవలము కల్పిత
మని విజ్ఞుల అభిప్రాయము. మరి ఈ కథను గోప
మంత్రియే కల్పించెనో, మూలమెచ్చటనైన నను
గలదో యెరుగవలసి యున్నది. పరిశీలించి చూడగా
"చిత్ర భారతము నందలి కథ నాధారము చేసికొని
గోప మంత్రి ఈ కావ్యమును రచించి యుండునని
తోచుచున్నది.

చిత్ర భారతము నందు గయోపాఖ్యానమునకు
ఆధారమైన కథ ఈ విధముగా గలదు.—" తుల్యముని
శాప ప్రభావముచే అశ్వరూపమును దాల్చిన రంభ,
శాపవిముక్తికై ఆతని ఆదేశాను సారముకుండిన
నగరాధిపతియగు చతుర్థునికి వాహనమై ఆకాశ
మార్గమున సంచరించుచుండ, ఆ తురగము నోటి
నుండి వచ్చిన ఫేనము కాళిందీ నదీ తీరమున
సూర్యున కర్ఘ్య ప్రధాన మాచరించు శ్రీకృష్ణుని
దోసిట పడినది. అందులకు కోపించిన శ్రీకృష్ణు డీ
యప చారమునకు కారణ భూతుడైన వానిని మూస
ములో సహరింతునని ప్రతిజ్ఞ చేసెను. నారదుని
వలన ఈ ప్రతిజ్ఞను వినిన చతుర్థనుడు కృష్ణుని
బారినుండి తన్ను రక్షించ వలసినదిగా దేవేంద్రాది
దేవతలను వేడుకొనుటయు, వారు సహాయము చేయ
నసమర్థులమని చెప్పుటయు జరుగగా, పిదప నా
చతుర్థనుడు 'తాను ఎవరి బారినుండి శరణుకోరు
చుండెనో తెలుపకయే' అర్జునుని శరణు కోరుటయు
గలదు. అంత అర్జునుడు చతుర్థునునికి అభయ
మొసంగి, భయకారణమును అడుగగా, నాతడు

జరిగిన వృత్తాంతమును చెప్పెను. అర్జునుడు 'ప్రాణ మిత్రునితో వైరము సంభవించెగదా' యని మదిలో నెంతయు విచారించి, ధర్మజున కీ విషయమును తెలియజేయగా నతడును శరణాగతుని రక్షించుటయె ప్రధాన కర్తవ్యమని చెప్పి భీష్మాదులను సంప్రదించుటకు హస్తినాపురమునకు వెళ్ళుట గలదు పిదప కౌరవులు, పాండవులు, నానావిధ దేశరాజులు నొక్కచో సమావేశమై కృష్ణునితో పోరాడుటకు నిశ్చయించిరి. పిదప కృష్ణుడు "చతుర్ధనుడు పాండవుల యొద్దనున్నట్లు తెలిసికొని నారదుని నా కొప్పగింపుమని అక్రూరునితో అర్జునునికి చెప్పుమని చెప్పి పంపుటయు, నందు నర్జునుడేయ కొనక ప్రత్యుత్తరము లంపుటయు నందు గలదు. - ఇది ఇందలి ప్రధాన కథ. తరువాత కథలో కౌరవ, పాండవులకు, - యాదవులతో ఘోర యుద్ధము జరుగుటయు నందు ధర్మజు డొక్కరుడు తప్ప మిక్కిలిన పాండవ, కౌరవ బలములు నశించుటయు పిదప కృష్ణుడు రోదించుచున్న ధర్మజుని కడకేతెంచి అతనికి వరమిచ్చుటయు ఆ వర ప్రభావముతో చతుర్ధనునితో పాటు మృతులైన యావన్మంది వీరులు సజీవులై లేచుటయు గలదు.

గయోపాఖ్యానము నందు ముగింపులో కొలది మార్పుగలదు. నారదా దేశమున కౌరవులు పాండవులకు సహాయము చేయుటకుగాను ద్వైతవనమునకు వచ్చుట గలదు. పాండవ, కౌరవులకు, యాదవులకు మధ్య ఘోర యుద్ధము జరుగుటయు, కౌరవ-పాండవ బలములందు అర్జునుడు తప్ప అందరును మృతి చెందుటయు, పిదప కృష్ణార్జునులకు ద్వంద్వ యుద్ధము తీవ్రముగా జరుగుచున్న సమయమున శివుడు వారిరువురి నడుమ ప్రత్యక్షమై. వారిరువురిని సమాధాన పరచి యుద్ధమును ఆపివేయుటయు అర్జునునికి హరిహరులిచ్చిన వరప్రభావము వలన మొదట గయుడును పిదప ధర్మజుడును, సజీవులుగా నగుటయు ఆ పిదప ధర్మజునికి హరిహరులు వరము నొసంగగా అతని కోరికపై 'పుడమిపైనున్న రెండు భూరి సైన్యములు బ్రతికి తొల్లిటి యట్ల లేచుటయు' జరిగినది.

- ఈ కథ ఇంచుమించు 'చిత్రభారతము' నందలి కథను పోలియున్నదని చెప్పవచ్చును. కొన్ని పాత్రలు వేరైనను, ఇతివృత్తము కొలది మార్పులతో నొకేవిధముగా నున్నట్లు తోచుచున్నది.

చిత్రభారతము - గయోపాఖ్యానములను తులనాత్మకముగా పరిశీలించినచో కొన్ని సాదృశ్యములు కొన్ని భేదములును కన్పట్టుచున్నవి

శ్రీకృష్ణుడు సూర్యున కర్ఘ్య మిచ్చునపుడు అపరాధము సంభవించుట, ఆ అపరాధిని సంహరింతునని అతడు ప్రతిజ్ఞ చేయుట ఈ ప్రతిజ్ఞ విధానమును విని నేరస్థుడు భయము చెందుట, నంతట నతడు శ్రీకృష్ణుని నుండి తన్ను రక్షించవలసినదిగా బ్రహ్మాది దేవతలను శరణు వేడుకొనుట. వారు ఈ విషయమై సహాయము చేయుటలో తామశక్తులమని తెలియ జెప్పుట, మరియు భయకారణమును చెప్పకయే అతడర్జునుని శరణు వేడుకొనుట, అర్జునుడతనిని ధర్మజు నొద్దకు తీసికొని వెళ్లుట పాండవులందరును వానిని రక్షించుటయే తగిన కర్తవ్యముగా భావించుట. పాండవుల యొద్ద దోషి యుండుటను తెలిసికొనిన కృష్ణుడు అక్రూరునిచే రాయబారము నంపుట, అందుకు నర్జును డియ్యకొనకుండుట, తుదకు కృష్ణార్జునులకు యుద్ధము జరుగుట ఉభయ సేనలూ మొదట నిహతులై పిదప సజీవులగుట. 'శరణార్థి'నే మొట్ట మొదటగా బ్రతికించుమని యడుగుట - అను విషయములలో ఈ రెండు కావ్యముల యందును చక్కని సామ్యము గోచరించుచున్నది. అయిన సామ్యముతో పాటు భేదములును కొన్ని గలవు.

## శ్రీ భారతము

1. శ్రీకృష్ణుడు సూర్యుని కర్ఘ్యమిచ్చు సమయమున అతని దోసిట ఆకాశ మార్గమున విహరించు చతుర్ధనుని యొక్క గుజ్జము నోటి నుండి వచ్చిన శ్లేష్మము పడుట సంభవించినది

2. ఈ శ్లేష్మమును వేసిన వాని నెనిమిది దినములలో సంహరింతునని కృష్ణుడు ప్రతిజ్ఞ చేసెను.

3. ఈ ప్రతిజ్ఞా విధానమును చతుర్ధనునకు నారదుడు తెలిగించినట్లు గలదు,

4. వెంటనే చతుర్ధనుడు కడుభీతితో తన్ను రక్షించవలసినదిగా దేవేంద్రుని ప్రార్థించగా అతడు 'పారిజాతాపహరణ' వృత్తాంతమును చెప్పి, కృష్ణుని నుండి రక్షించుటలో తాన శక్తుడనని చెప్పెను. శంకరుని ప్రార్థించగా నతడు 'బాణాసుర వృత్తాంతము'ను చెప్పి తానశక్తుడనని తెలియఁజేసెను. బ్రహ్మను వేడుకొనగా 'బాలవత్సాపహారు' నన్ను భంగపరచె గాన తాను నశక్తుడననియే ఎరిగించెను

5. ముల్లోకములు తిరిగినను తన్ను రక్షించువారు లేరుకదా అని చతుర్ధనుడు చింతించుచుండగా, ఒక భిల్లుడరు దెంచి, అర్జునుడు వేటకు వచ్చెనని తెలియఁజేయగా, చతుర్ధనుడు 'భయకారణమును చెప్పకయే పార్థుని శరణు వేడుకొనెను.

6. అభయ మిచ్చిన యనంతరము అర్జునుడు అతని భయమునకు కారకుడు శౌరియని తెలిసికొని మిగుల విచారించి, ఈ విషయమును మొదట ధర్మరాజునకు చెప్పి పిదప విశ్వాదులతో సంప్రదించుటకుగాను హస్తినాపురమునకు వెళ్ళుట గలదు. వారు యుద్ధ సమయములో పాండవులకు సహాయముగా నిల్చిరి.

7. పాండవుల యొద్ద 'చతుర్ధనుడున్న విషయము తెలిసి' కృష్ణుడు 'అతని విడిచి సంధి చెప్పు చెప్పుమని' అక్రూరునిచే రాయబారము పంపుట గలదు పాండవులు దాని కిష్టపడక 'సహదేవుని' కృష్ణుని యొద్దకు తిరిగి రాయబారిగా పంపినట్లు గలదు.

8. అంత కృష్ణుడు కోపించి, చతుర్ధనునితో పాటుగ, ధర్మజుని తప్ప, అందరను సంహరింతునని మరియొక ప్రతిజ్ఞ చేసెను

9. యుద్ధానంతరము (ధర్మజుడు తప్ప అందరును మరణించగా) విచారించుచున్న ధర్మజుని కడకు కృష్ణుడు వచ్చి 'ఒక్క వరమిచ్చెదను కృష్ణుడు కోరుకొమ్ము' అనగా అతడు శరణార్థియై వచ్చిన చతుర్ధనుని సజీవునిగ 'జేయుమనెను'

అప్పుడు ఇతని సత్యశీలతకు మెచ్చి కృష్ణుడు 'చతుర్ధనునితోపాటు విగతులైన యావన్మంది నీ పునర్జీవితులగునట్లుగ చేసెను.

## గయోపాఖ్యానము

శ్రీకృష్ణుడు సూర్యున కర్ఘ్యమిచ్చు సమయమున అతని దోసిట గయుడను గంధర్వుడాకాశ మార్గమున విహరించుచు నుమియగా ఆ నిష్ఠీవనము పడినది.

నేరస్థుని సంహరింతు ననియే కృష్ణుడు ప్రతిజ్ఞ చేసెను.

ఇందు గయునకు 'ఆకాశవాణి' తెలియఁజేసినట్లుగ గలదు:

ఇట గయుడు మిక్కిలి భయము చెంది తన్ను రక్షించవలసినదిగా బ్రహ్మను శరణువేడు కొనగా నాతడు 'కృష్ణుడు సాక్షాద్విష్ణువుగాన నాతని ప్రతిజ్ఞ నుండి కాపాడుటలో తానసమర్థుడనని చెప్పెను.

కైలాసమునకేగి శంకరుని ప్రార్థించగా, కృష్ణుడు నేను నారాయణుడనే గనుక ఆతని నుండి రక్షించ నశక్తుడనని తెలియజేసి, ఆ కృష్ణునినే శరణువేడు కొమ్మని చెప్పగా అతడు ప్రాణ భీతితో అటకు దో నిశ్చయించక విచారించుచుండెను.

విచారించుచున్న గయునియొద్దకు నారదుడు వచ్చి అర్జునుని శరణువేడుకొమ్మని చెప్పగా, 'శౌరి అతని ప్రియమిత్రుడు గాన అభయ మిచ్చునో లేదో యని శంకించు చుండగా నారదుడాతనితో 'భయకారణ మును చెప్పకయే శరణు వేడుకొమ్మ' అనుట గలదు.

అభయమిచ్చిన యనంతరము అర్జునుడు ఆతని భయమునకు కారకుడు శౌరియని తెలిసికొని, మిగుల విచారించి పిదప ధర్మజునకు విషయమును చెప్పును. పాండవులందరు ఆతని రక్షించుటయే తమ కర్తవ్య మని పలికినట్లు గలదు. ధృతరాష్ట్రాదులకు యుదంత మంతయు నారదుని వలన తెలిసినట్లు ఇందు చెప్పబడినది. పిదప నారదాదేశమున వారు పాండవులకు సహాయము చేయుటకుగాను ద్వైత వనమునకు వచ్చినట్లు గలదు.

పాండవులయొద్ద గయుడున్న సంగతి తెలిసి కృష్ణుడు ఆతనిని తన కిప్పజెప్పుమని వేగవంతుని, అక్రూరుని, తుదకు సుభద్రను రాయబారిగా పంపును. యుద్ధ సమయమున ద్రౌపదియు అర్జును నకు నచ్చజెప్పుట ఇందు కలదు.

కృష్ణార్జునులకు ఘోర యుద్ధము జరుగుచున్న సమయమున (అంతకు పూర్వమే ధర్మజునితో సహా అందరును మరణించిరి) శివుడు వారిరువురిమధ్య ప్రత్యక్షమై కృష్ణుని సమాధానపరచి, అర్జునుని వరము కోరుకొమ్మనగా నాతడు 'శరణార్థియైన గయుని బ్రతికించుమని యడుగును.

రెండవ వరముగా ధర్మజుని పునర్జీవితునిగ చేయుమనెను. పిదప హరిహరులు ధర్మజునకును వరము నొసంగగా అతడుభయ సైన్యములందలి వీరులను తిరిగి జీవింపనట్లుగ కోరుకొనెను.

యుద్ధారంభమున, కృష్ణునితో తలపడినందులకు సిగ్గుపడుచున్న అర్జునునితో, శౌరి, "ముందు ముందు జరుగబోవు భారత సంగ్రామములో నీ ప్రతాపము ఎటులుండునోయని" ఈ విధముగా చేసితినని చెప్పి ఊరడించుట ఇందు గలదు

ఈ విధముగా నీ రెండు కావ్యముల యందును భేద సాదృశ్యములు గోచరించు చున్నవి 'చిత్ర భారతము' నాధారముగా జేసికొని గయోపాఖ్యాన మును' గోపమంత్రి రచించెననుటలో దోషముండ దనే చెప్పవచ్చును.

బాగుగా పరిశీలించి చూసినచో భావముల యందును కొన్నికొన్ని సామ్యములు గోచరించుచున్నవి. అయితే ఆ భావమును వ్యక్తీకరించిన వ్యక్తులలో భేదము కొలది తావులందు కన్పించును

( ) 'చిత్రభారతము'నందు చతుర్థనుడు, 'భయ కారణమునకు కారకుడైన వ్యక్తిపేరు చెప్పరాయే' తన్ను రక్షించమని అర్జునుని శరణు వేడుకొనగా, అతడు అభయ మొసగిన పిదప భయమునకు కారకుడైన వ్యక్తి కృష్ణుడని తెలియగనే మదిలో విచారించుచున్న సందర్భములలో......

క. "శరణాగతుడగువానిన్ గరుణం దనువైన
నిచ్చి కావగదగు భూవరునకు, బక్షికి
నై తనశరీర మాంసంబు శిబి యొసంగడె
రటణన్,"

—ఈ విధముగా తలపోసెను. ఇదే భావము 'గయోపాఖ్యానము' నందును గలదు. అయితే ఇట అర్జునుడు అక్రూరునితో చెప్పినట్లుగ వర్ణింపబడినది.

—"ఆవల ప్రాణ భయాతురుడగుచు
నీవె దిక్కని వచ్చి నిలిచిన వాని
భూపాల వర్యులు పుడమిని దొల్లి
చేపట్టి విడిచిరే చెప్పుమా నీవు
విని ప్రాణ భయమున వెనుక జొచ్చినను
గనికరంబున శిబి గావడే [illegible]

రెంటింటి యందును ఈ భావము అర్జునుని ద్వారముననే వ్యక్తమైనది

(ii) 'అక్రూరుని రాయబార ఘట్టమున' చిత్రభారతమునందు–

.. "క్రూరుడవుగాని నెపమున, సారెన సంభవుడు
నీకు సార్థకముగ నక్రూరుండనిపేరొసగెను."
గయోపాఖ్యానమునందు–
"అక్రూరుడైనట్టి యక్రూరుఁదిరిచి
సక్రోధ చిత్తుఁడై ......" అనిగలదు.
క్రూరత్వలేమిఁజేసి అక్రూరుడైనట్లుగ రెంటి
యందు చెప్పబడినది

(iii) చిత్రభారతమునందు అక్రూరుడు
ధర్మజునితో–
ఉ. "మీరును ధార్తరాష్ట్రులును మించిన వైరము
దక్కి క్షీరమున్
నీరముఁబోలె నేకముగ నెమ్మిఁ జరించుట...
అనియుండ,
గయోపాఖ్యానమునందు అక్రూరుడు సవ్యసాచితో–

" జలజాక్షుతోడ నీ జగడమేమిటికి
బలవద్విరోధంబు భావ్యంబుగాదు
నలిని క్షీరోదక న్యాయమైయుండ
వలదే కైటభ వైరియు నీవుః..."
అనిగలదు.

ఇట సామ్యము 'క్షీరోదక న్యాయమునందు కన్పట్టుచున్నది. చిత్రభారతమునందు పాండవులను కౌరవులను వర్ణించగా, గయోపాఖ్యానమునందు కృష్ణార్జునులను వర్ణించుట సంభవించినది.

(iv) కృష్ణార్జునులు యుద్ధసమయమున ఒకరి అస్త్రముల నొకరు ఏ విధముగా ఖండించుకొనుచు యుద్ధమును నేర్పుతో చేసిరో వర్ణించు సందర్భమున చిత్రభారతమునందు–

సీ. "కడు భయంకరలీల గరుడాస్త్రమేసిన
నర్జునుండును దాని నైంద్రబాణ
మున ద్రుత్తుమురుఁజేసె వనజాక్షుఁడలిగి రౌ
ద్రాఖ్య గంబు నిగిడ్చె ననిమిషేంద్ర..."

– ఇత్యాదిగలదు. గయోపాఖ్యానమునందును నిట్టి పద్యరచన గలదు.

"గరుడ కేళనుఁడంధ కారాస్త్రమేయ
సౌరిది నర్జునుఁడేయ సూర్యబాణంబు
పుండరీకాక్షుండు భుజగాస్త్రమేయ
గాండీవి దానికి గరుడాస్త్రమేయ..."
మొదలగు విధముగ గలదు.

(v) యుద్ధమునందు మరణించిన వీరవరులు వర ప్రభావముచే పునర్జీవితులగుటను వర్ణించునపుడు చిత్రభారతమునందు–.

ఆ. "......అఖిల జనంబును; నిగుర *నిదుర బోయి మేలుకొన్న* చెలువ మామతింపఁ జెక్కు చెమర్పక; లేచెనపుడు..." అని గలదు.

గయోపాఖ్యానమునందు–"సదయులై హరిహరులై
సైన్యయుగంబు బ్రదికించుటయు దంతిబటహయా
వలులు మిన్నక *నిద్దురమేల్కనినట్లు*
జెన్నొంద లేచెనా చతురంగ బలము..."
అని గలదు.

రెంటింటా 'నిద్దురబోయి లేచినట్లుగా' వర్ణింపబడుట గమనార్హము.

(vi) చిత్రభారతమునందు భీష్ముడు ధర్మజునితో
క. "కావలసిన యర్థంబులు; దైవ ప్రేరణము
కలిన దక్కెఁదామెయగున్
గావున నర్జును దూఱం; గావలదీ రాజుఁగావగా
దగు మనకున్"–
అనియుండ: గయోపాఖ్యానమునందు– ధర్మజుడు
అర్జునునితో–

" వెన్నున కెగ్గు గావించిన వాని
వెన్నుడ చేపట్టుటదియె ద్రోహంబు
దైవకృతంబిది దప్పింపరాదు.
నీవేమి సేయుదు నీకు వశంబె
కావలసినవని గాక పోరాదు
ఏ విధంబునసైన నేమన వచ్చు -"
అని గలదు

-శరణార్థియై వచ్చిన వారిని రక్షించుటయే తగిన కర్తవ్యము. కారకుదెవరైనను ఆలోచింపరాదు. దైవప్రేరణము వలన జరుగ వలసినవి జరుగక మానవు. కావున 'దైవకృతమును తప్పింపలేము' అనెడి భావము రెండింటను కన్పించుచున్నది.

(iii) కృష్ణార్జునులకు యుద్ధము సంభవించుటను గూర్చివినిన-

వ. "శకుని, కర్ణ, దుర్యోధన, దుశ్శాసనులు, తమలో విచారించి హర్షించిరి."అనియుండ, గయోపాఖ్యానమునందు - "ఆ సమయంబున నా సుయోధనుడు మీసంబుదెగదీసి మేను నిక్కించి గతి కనుదుకొని నేడు కౌంతేయులకును హరి మొనవచ్చినట్టు లెఱిగి మురారి దునిమిన. ధర్మ జాదులనెల్ల (బిదప నొనిలో సమయింతునని లోన దలచి..." అని గలదు.

ఇట పాండవులకు కృష్ణునితో యుద్ధము సంభవించినందులకు దుర్యోధనాదులు సంతోషించునటులు చెప్పుటలో సామ్యము గలదు.

ఈ విధముగా ఈ రెండు కావ్యములను పరిశీలించి చూచినచో- ఇతివృత్తములో, భావములో, పలుకు బళ్ళలో సామ్యములు గోచరించుచున్నవి. వీని నన్నింటిని బట్టి చూడగా 'గయోపాఖ్యాన' రచనలో గోపమంత్రికి చిత్రభారతము ఆధారమై యుండునని నొక్కి చెప్పవచ్చును.

నాదెండ్ల గోపమంత్రి రచించిన గయోపాఖ్యానమునను సరించి 'రామనామాత్యుడను' కవి రెండాశ్వాసముల పద్యకావ్యమును రచించెను. ఇతనిని గురించిన విష యములు తెలిసి కొనుట కాధారములులేవు. కాని ఇతడు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి కన్న 200 సం॥ ల ముందున్నవాడని కృష్ణార్జున సంవాద పీఠికలో గలదు అనగా ఇతని కాలము క్రీ శ. 1667 ప్రాంతమని చెప్పవలెను

గోపమంత్రి కృత గయోపాఖ్యానమును రామ నామాత్యుడు పూర్తిగ అనుసరించె ననుటకు రెండు గ్రంథములయందలి కొన్ని పద్యములను పరిశీలించిన విశదమగును

(i) అర్జునుడు యుద్ధ సన్నద్ధుడై యున్న సమ యమున ద్రౌపది అతనిని జూచి ఇట్లు పలికెను.

"అప్పుడు ద్రౌపది యమరేంద్ర సుతుని
తిప్పక చూచి యెంతయుం జేరి పలికె
వాలి యద్దములేక వనజాక్షసేన
నేల యీనిన రాతి నిండె నివ్వనము
ముంగొంగు రత్నంబు ముంగిటి బసిడి
తంగెటి జున్ను రాధావర్త మనకు
నిటువంటి శౌరికి నేలాకోనేదు
కటకటా ! మనమీద ఘటి యిల్లి గినుక ."
(గోపమంత్రి గయోపాఖ్యానము)

ఇదే భావము రామనామాత్య కృతిలో ఇట్లు గలదు-

కి. "అప్పుడు పాంచాలిని సురి; తప్పక యా
విజయు. జూచి ధైర్యమున ననెన్
గప్పుకొనె విష్ణు సైన్యము; లిప్పుడు నర్గెడల
నేల యీనిన భంగిన్."

క. "కొంగున గట్టిన రత్నము;
ముంగిట. జేకొన్న ధనము మునమలరంగా
దంగేటి జున్నుమనకా; యంగజ
జనకుండతండె యరియై.వచ్చెన్."

(i) గోపమంత్రి గయోపాఖ్యానమున; యుద్ధరంగమున సుయోధనుడు–

"గోపాల నీకేల ఘోరయుద్ధంబు
మాపాలబడవు గావు పొమ్మని యేసె."

అని కృష్ణుని తూలనాడుచు పల్కినట్లు గలదు. ఇదే భావము రామనామాత్య కృతిలో–

క. "మాపాలబడి గావు మాతో; గోపాలక పోర
నీవు......" అని గలదు.

ఈ విధముగా నున్న పద్యము లెన్నియో గలవు. స్థల విస్తరణ భీతిచే చెప్పనలవి గాకున్నది. రామయామాత్యుడు గోపమంత్రిని అనుసరించినను, తన ఇతివృత్తమునందు కొన్ని చిన్నచిన్న మార్పులు చేసెను. మఱియు గోపమంత్రి గ్రంథమున స్వల్ప వర్ణనలు గల తావు నందీతడు విస్తృత పరచి రచించెను.

శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు రామయామాత్యుని గయోపాఖ్యానమును అనుసరించి, కొన్నికొన్ని కల్పనలతో తమ ఇతివృత్తమును తీర్చిదిద్ది రమణీయమైన నాటకమును వ్రాసిరి. ఈ విషయమును అతడు తన 'స్వీయచరిత్రలో' "నేను కథా సంవిధానములో రామకవి పుస్తకమును అనుసరించితిని అని స్వయముగ చెప్పికొనిరి. అంతియే గాదు పద్య రచనయందును అనుసరణము గలదని చెప్పవచ్చును; కొన్ని తావులందు వారి పద్యములను చూచినచో రామయామాత్యుని పద్యములు వెంటనే స్ఫురణకు వచ్చును. చిలకమర్తి వారి గయోపాఖ్యాన నాటకమునకు అంతటి ఖ్యాతి వచ్చుటకు రామనామాత్యుని కావ్యంకూడ కారణమని చెప్పవచ్చును.

చిలకమర్తివారు రామనామాత్య కృత గయోపాఖ్యానము నాధారముగా మాత్రమే జేసికొని రచించినను భావములు కొన్ని యచ్చటచ్చట నొకే తీరుగనున్నవనుటకు రెండు గ్రంథములనుండి పద్యములను పరిశీలించిన విశదమగును.

శంకరుడు అభయమొసగమిచే గయుడీ విధముగా చింతించినట్లు రామనామాత్య కృతిలో గలదు.

సీ. "ఉదధి మధ్యము జొచ్చి యొదిగి
యుండెద నన్న
హరిమాయ యదియును నరసిచూడ
నగ్నికుండములోన నణగి యుండెద నన్న
నాకని సంహారమందు గలదు"

ఈ పద్యరచనా విధానమునే గ్రహించి లక్ష్మీనరసింహముగారీ విధముగా రచించిరి.

సీ. పాతాళమున కేగి బ్రదుకవచ్చు నటన్న
బలి చక్రవర్తి నన్నట్టి యిచ్చు
మర్త్యలోకమున జేరి మన వచ్చుననుకొన్న
నా లోకమున కృష్ణుడవతరించె...."

(ii) మఱియు యుద్ధానంతరము అర్జునుడు తన్ను క్షమించుమని శౌరిని వేడుకొనగా నాతడు కిరీటితో –

క. "పురుహూతాత్మజ! మీదను గురుపతికిని
మాకు గల్గు కుంభిని కొఱకై
ఉరుతరణంబు దానిం; దరమా మాన్పంగ
నల విధాతకునైనన్."

అ. "గట్టి వాడగుట, గార్ముక నిపుణత గలుగుట శరవిద్య ఘనుడవగుట
ధైర్యశాలి వగుట శౌర్య ధురీణుడవగుటచే
నేనెఱుంగనయ్య నిన్ను.

ఆ. "ఇపుడు చూడవలసి యీ పని చేసితి....."

అని పల్కెను. ఈ భావమునే గ్రహించి చిలకమర్తి వారీవిధముగా జెప్పిరి.

మ. "కుటిలాచారులు ధార్తరాష్ట్రులకు మీకు
న్గయ్యామౌ దానికై
పటు శస్త్రంబులఁ దత్తదర్థమయి సంపాదించితో లేదో యంచెటులైనంగనగోరి యాహవము నేనీ లీల
గల్పించితిన్
బ్రదుటిలోఁగూల్చెద నీవు శాత్రవుల నో
దుర్వార దర్పోన్నతా!"

'గయోపాఖ్యానము'ను ఇతివృత్తముగా స్వీకరించి పద్యకావ్యములుగా రచించిన వారిలో వెలిచేటి వెంకటరామ ప్రధాని, కస్తూరిరంగకవి! ఓబయామాత్యుడు. పోచిరాజు మొ॥ వారు గలరు దీనిని ధేనువు కొండ తిమ్మయ్య జంగం కథగా రచించగా, సాధువల్లి చంద్రశేఖర శాస్త్రి యను సరి దీ కథను కన్నడములో కావ్యముగా రచించెను. ఇంకను వచనములు, నాటకములును ఈ కథకు సంబంధించినవి చాల గలవు.

ఈ కథాఛాయ 'మార్కండేయ పురాణము'నందు గలదు. అందును 'శరణా' గతుని రక్షించుటయే ప్రధాన కర్తవ్యముగా భావించిన ఇతివృత్తము గలదు. అందు, "నాగులు కొందరు మునులను చంపగా, రాజగు మరుత్తుడు ఆ నాగులను దండింప సిద్ధుడయ్యెను. ఆ నాగులు భయమును జెంది మరుత్తుని తండ్రియగు 'అవాక్షిత్తుని తమ్ము రక్షించుమని శరణు వేడుకొనును. ఈ విషయమై తండ్రీ కొడుకుల మధ్య అభిప్రాయభేదము వచ్చి, తమ తమ ధర్మములను పరిపాలించుటకై ఒకరినొకరు సంహరించు కొనుట కుద్యుక్తులయిన సమయములో నాగులు వచ్చి, ఇక ముందు మునుల పకారము చేయమని చెప్పి, మరణించిన మునులను తిరిగి బ్రతికించిరి" ఇది ప్రధాన కథ.

'శరణాగతుని రక్షించుట' అను విషయము అన్నింటా ప్రధానమై యొప్పుచున్నది.

చిలకమర్తి వారి నాటకము ద్వారా గయోపాఖ్యాన 'కథ' విశేష ప్రచారములోనికి వచ్చినది. దీని నాటకమును చదువని వారు, వినని వారు ఆంధ్రలోకమున లేరని చెప్పిన అతిశయోక్తిగాదు. ఇంతటి సుప్రసిద్ధ గయోపాఖ్యానమున కాధారము రామనామాత్య కృతి కాగా, అతనికి గోపమంత్రి కృతి ఆధారమైనది. మరి గోపమంత్రి కావ్యమున కాధారము "చిత్రభారత" మనియే చెప్పవలెను. 'మార్కండేయ పురాణములో' ఈ కథా ఛాయ యున్నను, దానికంటెను 'చిత్ర భారతమే' ఎక్కువ ఆధారభూతమై ఒప్పినదని నిస్సందేహముగా చెప్పవచ్చును.



# చందాదారులకు వినతి

"నవభారతి"కి అన్ని విధాలా సహాయ సహకారములు అందిస్తున్నటువంటి పాఠకులకు, రచయితలకు, అభిమానులకు కృతజ్ఞతను తెలియచేస్తున్నాము. ఇంతవరకు తమ తమ చందాలను పంపుటకు వీలుగానివారు వెంటనే పంపించవలసినదిగాను, చందాదారులుగా ఉన్నటువంటివారు తమ సభ్యత్వమును పునరుద్ధరించి యధాతథంగా తమ సహాయము సహకారము లిచ్చి అన్నివిధాల తోడ్పడవలసినదిగా విజ్ఞప్తి చేస్తున్నాము.

—మేనేజరు.

# అధి వాస్తవిక కవిగా నారాయణబాబు

కతెవరపు వెంకట్రామయ్య ఎం. ఏ.

## 1

ఆధునికాంధ్ర కవిత్వంలో ఒక ఉద్యమంగా ప్రవర్తిల్లి పలువురి దృష్టిని ఆకర్షించిన అతి నవ్య కవితా ధోరణులలో "సర్రియలిజమ్" (Surrealism) ఒకటి. అభ్యుదయ కవితోద్యమ కాలంలో వెలువడిన ఈ కవితా ప్రక్రియ తెలుగు కవితా రంగంలో స్వయం సముద్భూతము కాదు. ఆంగ్ల కవితా ప్రభావంతో ఇది తెలుగున ప్రవేశించినది. అసలు ఈ కవితోద్యమమునకు పుట్టినిల్లు ఫ్రాన్సు. ప్రథమ ప్రపంచ సంగ్రామ ఫలితంగా ప్రపంచ రాజకీయాల్లోనే గాక మిగిలిన అన్ని రంగాలలోను చివరికి కళారంగంలో సహితం అనూహ్యమైన పరిస్థితులు చోటు చేసికొన్నవి. వ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థ యైనది. యాంత్రిక నాగరికత వెర్రితలలు వేయ నారంభించినది. నగర జీవిత ప్రభావం వలన వ్యక్తికి ఇదివరకు పూర్వములాగా కాక సమాజం నుంచి ఎడబాటు కలిగినది. సమాజపు టడవిలో మనిషి దిక్కు లేనివాడుగ తయారయ్యాడు. వ్యక్తి పరిస్థితి ఇలా ఉండగా మరోవైపు అత్యంత సమర్థంగా పురోగమించి ప్రకృతి శక్తులనే తన అధీనంలో ఉంచుకో గలిగినది ఆధునిక విజ్ఞానం. దీనితో తాను నిర్మించిన యంత్రానికి తానే బానిస అయ్యాడు. మానవుడు వీటన్నింటిని మించి యుద్ధరంగంలో కనిపించిన వాస్తవికత – యుద్ధంలో పాల్గొన్న దేశాలు తమ ఆశయాలను తామే పాటించక సర్వవిధాల నైతిక పతనాన్ని పొందడం వ్యక్తి మేధస్సుమీద గొప్ప దెబ్బ తీసింది. ఈ పరిస్థితే కళారంగంలోనూ ప్రతిఫలించినది. రాజకీయ, సాంఘిక రంగాలలో నైతిక సమగ్రతను నిలపటంలో కళారంగం విఫలమైనదని కళాకారులు భావించినారు. ఈ దశలో సాహిత్యవేత్తలు సహితం సంప్రదాయకంగా సృష్టింపబడుతూ వచ్చిన సాహిత్యం సాధించిన ప్రయోజనం శూన్యమని విశ్వసించిరి. వీరికి భవిష్యత్తు అంధకారబంధురంగా కన్పట్టినది. వర్తమానం అయోమయంగా పొడసూపినది. ఈ నైరాశ్యపు స్థితిలో సమాజ నాగరికతపై క్రోధము, వైరము ఏర్పడినవి. ఈ పరిస్థితిలోనే నవ్య సాహిత్యోద్యమములు బయలు దేరినవి. వీనిలో "డాడాయిజమ్" (Dadaism) ప్రథమంగా పేర్కొనదగినది.

## 2

ఆనాటి మత, సాంస్కృతిక, సామాజిక వ్యవస్థల మీద అసహనంతో, అసహ్యంతో ఆవిర్భవించిన నూతన కవితా ధోరణి డాడాయిజము. దీనికొక సిద్ధాంత దృక్పథం గాని, నిర్మాణాత్మక ధ్యేయం గాని లేవు. ఉన్నదల్లా పాతను ధ్వంసం చేయడం. దీని ప్రారంభకుడు ట్రిస్టన్ జారా (Tristan Tzara). క్రీ. శ. 1918 లో 'డాడాయిస్ట్ మానిఫెస్టో' (Dadaist Manifesto) ప్రచురింప బడినది. ఈ నూతన కవితోద్యమమునకు ఏ పేరు బాగుండునని ఆలోచించి చివరకు జారా కనులు మూసుకొని నిఘంటువులో ఒక పేజీ తెరువగా అప్పుడు అతనికి మొదట కన్పట్టిన పదం 'డాడా'. ఆ పేరుతోనే ఈ కవితోద్యమాన్ని పిలిచిరి. దీని కొక నిర్ణీత సిద్ధాంతం పట్ల నమ్మకం గానీ, ఒక

వ్యవస్థ యెడ విశ్వాసం గాని లేవు. అందుకే "Do not trust Dada. Dada is everything. Dada doubts everything. But the real Dada's are against Dada" అంటాడు ట్రిస్టన్ జారా. 20వ శతాబ్దపు నాగరికతను తీవ్రముగా దుయ్యబట్టిన కవితావాద మిది. అధిక్షేపణ, అవహేళన దూషణములను కవితాపరము చేసిరి.

జార్జి బ్రాస్ (George Brosz) అనే డాడాయిస్టు కవి తమ దృక్పథాన్ని వివరిస్తూ ఇలా అంటాడు. "Nothing was holy to us. Our movement was neither mystical communistic nor anarchistic. All of these movements had some sort of Program, but our's was completely nihilistic. We spart up on every thing including ourselves. Our symbol was nothingness, a vacum a void"[1]. వస్తురహితంగా, అర్ధరహిత వాక్య విన్యాసంతో, అవ్యవస్థీకృత రచనాక్రమంతో, అయోమయములగు శీర్షికలతో; గతనిరసనము, వికృత వీక్షణము మున్నగు లక్షణములతో సాగినది డాడాయిస్టు కవిత. క్రీ. శ. 1920 లో ఫ్రాన్సిస్ పికాబియా (Francis Picabia) అను డాడాయిస్టు తమ కవితా విశృంఖలతను ఇట్లు విస్పష్టపరచినాడు. "You do not understand, of course what we are doing well: my dear friends, we under stand is still less; How wonderful, is not, that you are right!...you donot understand? neither do I; How sad."[2]

1. *Quoted by* T. L. కాంతారావు. తెలుగు విద్యార్థి. సం. 24 సంచిక. 16 పే. 17.
2. *Quoted in From cubism to Surrealism in French Literature" P. 171.*

సాంఘిక, రాజకీయ రంగాలలో నైతికస్థాయి పెంచటంకోసం ప్రారంభమయిన ఈ విధ్వంసక వాదం సాహిత్యంలో ఒక అరాజక పరిస్థితిని అవ్యవస్థను సృష్టించినది. అయితే ఈ డాడాయిజము సాధించిన ప్రయోజనం మాత్రం గమనించదగినది. దీనితో కవులలో "ప్రయోగ వైచిత్రి ధోరణి" (Experimental Tendency) విస్తృతమయినది డాడాయిజమ్‌లోని విధ్వంసకలాలక్షణమే దానిని రూపు మాపినది. ఈ డాడాయిజమ్ శిధిలాలపైనే ఉద్భవించిన అతినవ్య కవితా ధోరణి 'సర్రియలిజమ్'

## 3

మొదట డాడాయిస్టు కవియేయైన తరువాత దాని నుండి విడివడిన ఆంద్రే బ్రిటన్ (Andre Breton) ఈ ఉద్యమ మూల ప్రవర్తకుడు. ఫ్రాయిడ్ మనో విశ్లేషణ సిద్ధాంతము (Psycho-Analysis); ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతము (Relativity Theory) ఆధారముగ ప్రభవిల్లినది సర్రియలిజమ్ కవితాధోరణి కవితారంగంలో మొదట ఒక తాత్త్విక దృక్పథంగా, మనో విశ్లేషణ సిద్ధాంతంగా చోటు చేసుకొన్న సర్రియలిజమ్ అనంతర దశలో విస్తృత పరిధినొంది ప్రముఖ ప్రచార ప్రశస్తిని పొందినది.

ఫ్రాయిడ్ మనస్సును మూడు పొరల కూడలిగ అభివర్ణించినాడు. అవి 1. వ్యక్తము (Conscious) 2. వ్యక్తావ్యక్తము (Sub-conscious) 3. అవ్యక్తము. (Unconscious)[3]. ఈ మూడింటి

3. conscious - sub, concious, Unconscious అను Dr. G. V కృష్ణారావుగారు వైశ్వానరము. తైజసము (preconscious) ప్రాజ్ఞములని అనువదించిరి- నవతోరణం. పుట. 89.

శ్రీ జి. రామమోహనరావుగారు చేతన, ఉపచేతన, అచేతనములని అనువదించిరి- ఆధునిక సాహిత్య ప్రస్థానములు. పు. 56. 57.

సూక్ష్మ పరిశోధనయే ఫ్రాయిడ్ మనో విశ్లేషణ సిద్ధాంతంగా రూపొందినది. "మానవునిలోని 'అవ్యక్తము' అనే కానుభూతులకు కూడలి. పూర్వ సంవేదనలనేకము ఈ 'అవ్యక్త' దశలో నిగూఢముగ నుండును. తీరని కోరికలు, తీరుతీయముం యూహాలు, మానవుని వ్యక్తావస్థలో సుప్తభుజంగము వలె అవ్యక్తముగా పడియుండును. స్వప్నములో ఇవి 'అవ్యక్త' దశనుండి పడగలు విప్పుకొని పైకి వచ్చునని ఫ్రాయిడ్ నిర్ణయించెను. ఈ విధముగా స్వప్నదృశ్యములకు సరిక్రొత్త వ్యాఖ్యానము చేసినా డీ దర్శనవేత్త. మానవుడు వ్యక్త స్థితిలో నున్నప్పుడు అతని వ్యక్తిత్వము సంపూర్ణముగా గోచరించదని. కృత్రిమస్వమునకు లోనై అతడు మహా వాహినిలో మంచుగడ్డ (iceberg) వలె కొంచమే పైకి కన్పించుచున్నాడని, మరుగుపడిన అతని మిగిలిన భాగమును పరిశీలించి దానిని పైకెత్తినప్పుడే అతని సంపూర్ణ వ్యక్తిత్వము సమస్తాంచలములతో గోచరమగునని ఫ్రాయిడ్ వివరించెను."[4] ఫ్రాయిడ్ ప్రతిపాదించిన ఈ సిద్ధాంతము నాధారముగ గొని అధివాస్తవికులు సాహిత్యములో అనేక నూత్న ప్రయోగములు చేసిరి. "I believe in the future resolution of these two states – outwardly so contridictory which are dream and reality into a sort of absolute reality a surreality–" అని సర్రియలిస్టు మానిఫెస్టోలో పేర్కొన్నారు. మానవుడు సంఘజీవి. సాంఘికముగ అతడు కొన్ని నియమ నిబంధనలకు, ఆచార సంప్రదాయములకు బద్ధుడై యుండును. ఈ నియమాలకు లోనై అతడు తన అనుభూతులు కొన్నింటిని మాత్రమే వ్యక్తములో బహిర్గత మొనర్చును. మిగిలిన అతని ఆశలు, కోరికలు, ఊహలు అవ్యక్తములో అణగిపోయి యుండును. అయితే అవ్యక్తంలో ఈ అణగారిన కోరికలు వెలికుబుకును. ఈ దశలో జీవిత గవాక్షమునుండి వీక్షించిన కృత్రిమతా సంబంధములేని అనేక విషయాలు బయల్పడునని అధివాస్తవికులు భావించి వానిని కవితా రూపమున పెట్టుటకు ప్రయత్నించిరి. "Pure psychic automatism, by which it is intended to exprres, verbally, in writing, or by other means, the real process of thought. Thoughts dictation, in the absence of all control excercised by the reason and out side all aesthetic or moral preoccupation."[5] అని 1924 లో తమ మానిఫెస్టోలో పేర్కొనిరి. దీనితో మనస్సునకు ఇంతఃపూర్వము లేని తీవ్రప్రాముఖ్యము కల్గినది. ఇలా వీరు మానసిక వ్యవస్థకు పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యములను ప్రసాదించడమే తమ కవితోద్దేశమనీ ప్రకటించుకొన్నారు. "Surrealism is not a new means of expression, nor a simple one, nor even metaphysic of Poetry. It is a means of toral liberation of the mind and of everthing resembling it"[6] ఈ విధంగా మనస్సుయొక్క యదార్థస్థితిని, అంతర్ముఖత్వాన్ని వెలుపలకు రానీయని సంప్రదాయ సంకెళ్లను ధ్వంసంచేసి అవ్యక్తంలోని ఊహలను, స్వప్నదృశ్యాలను తమ కవితకు భాష్యంగామలచుకొన్నారు అధివాస్తవికులు.

4. ఆధునికాంధ్ర కవిత్వము - డా॥ సి. నారాయణరెడ్డి. పు. 616.

5. *Quoted by 'From Baudelaire to Surrealism – Marcel Raymond. P. 284.*

6. *Surrealist Manifesto.*

అందుకే "Surrealism is not a poetic form. It is the cry of the mind turning toward itself and determined in despiration to crush its fellors. And if need be, by material hammers"[7] అంటారు. ఏవం విధమగు లక్ష్య సాధనలో వీరు గండనిరసనము, సంప్రదాయ విధ్వంసము వర్తమాన వ్యవస్థపై తిరుగుబాటు, అవహేళన, అధిక్షేపణ, వ్యంగ్యము, సౌందర్యాన్ని వికృతం చేయడం మున్నగు పద్ధతులను అవలంబించారు మెలుకవికి, సుషుప్తికి, కలకి; దర్శనానికి; బయటికి లోపలికి ఉన్నగోడలను బ్రద్దలుగొట్టి సుప్త చైతన్యాన్ని వెలికి తెచ్చారు. వ్యక్తావ్యక్త స్థితిలోని సమస్తమును హేతు బుద్ధికి ప్రమేయం లేకుండా ప్రకటించారు. కవితకు కృత్రిమతా సంబంధం ఉండ కూడదన్నారు. దీనినే వారు "అటోమాటిక్ రైటింగ్" (Automatic writing) అని పిలిచిరి. "Down with syllogisms, coraries Q E. D; cause and effect, the whole and the sum of its parts, open the gates to dream, make room for automatism, we are about to see a man as he is, we shall be whole men. "Unchained delivered, daring at last to be aware of our desires and daring to fulfill them."[8] అన్ని పలుకులు ఈ సందర్భములో గమనార్హములు.

అసలు ఈ కవితా ప్రక్రియకు అంకురార్పణ బహు విచిత్రము. 1919 లో కవిత్వంలో నూతన ప్రయోగాల కోసం కృషి చేస్తున్న ఆంద్రే బ్రిటన్ ఒక సాయంకాలం నిద్రోన్ముఖుడై యుండగా వ్యాకరణ రీత్యా సరిగా నున్న ఒక చరణము స్ఫురించినది. దానితోపాటు మరికొన్ని చరణములు మదిలో మెదలినవి. వీని నన్నింటిని కలిపిన మొక గేయమగునని ఆతడు భావించినాడు. తర్వాత బ్రిటన్, తన మిత్రుడు సోపాల్ట్‌తో కలిసి ప్రశాంతమైన గదిలో ఆలోచన రహితులై నిద్రోన్ముఖమైన స్థితిలో మనసులో మెదిలెడి భావములను వెనువెంటనే వరుసగా వ్రాయగా వానిలోని చరణములు, అర్థ రహితములు, అసంబద్ధములు యైనను ఏదో ఒక విచిత్రానుభూతి కలిగినది. ఇలా మనలో సుప్త స్థితిలో గుప్తముగా పడియున్న ప్రగాఢానుభూతులు వ్యక్తావ్యక్త స్థితిలో వెలికుబుక వానిని స్వేచ్ఛందంగా (Free) వెలువర్చిరి దీనితో ఈ కవితకు "వ్యక్తావ్యక్తం" (Subconcious) పునాది యైనది. దీనివలన అద్భుతమైన "ఇమేజరీ" (Imegery) ని సృష్టించవచ్చునని, పదాల యొక్క సంకుచిత తత్త్వాన్ని వీడి బహుళార్థ సాధకము లగునని వీరు గ్రహించి నూతన ప్రయోగాలు చేసిరి. బ్రిటన్, సోపాల్ట్‌ల ఆ కవితా ప్రయోగాలే 1920 లో "Les Champs Magnetique)" (Magnetic Fields") అనే పేరుతో ప్రచురింపబడినవి. మాగ్రెట్టి, సాల్వెదార్ డాలి, మార్క్స్ ఎర్నెస్ట్, హాన్స్ బెల్మార్ మున్నగు చిత్రకారులు; రేన్ క్రేవల్, రాబర్ట్ డిస్నాన్, పాల్ ఎలార్డ్ మున్నగు కవులును ఈ ప్రక్రియకు దోహదము చేసిరి. కాగా, క్రీ॥శ॥ 1929 కి ఈ సర్రియలిజం ఆంగ్ల సాహిత్యంలో చోటుచేసికొన్నది. డేవిడ్ గాస్కాయిన్ (Devid Gascoyne) (New verse" అను సంకలన కవితా సంపుటిని ప్రకటించెను. ఇది అధివాస్తవిక ముద్ర కలదే. అధివాస్తవిక రచనా ప్రచారము కొరకు రోజర్ రోటన్ (Roger Roughton) contemporory

7. *I. bid.*

8. *The History of Surrealism. P. 49.*
*Maurice Nadeau.*
*Tr. Richard Howard.*

Poetry and prose" అను సాహిత్య పత్రికను నడిపెను. డిలాన్ థామస్, హెర్బర్ట్ రీడ్‌లు ఈ కవితోద్యమమునకు ఊపిరులూదిన వారే. అయితే 1940 కల్లా ఈ ఉద్యమం ఇంగ్లండులో చల్లారిపోయినది. అచట అంతరించగా అపుడే ఇది తెలుగులో కాలూనినది.

## 4

తెలుగులో అధివాస్తవిక కవితను ప్రవేశ పెట్టిన ఘనత శ్రీశ్రీది. "రాజకీయాలలో నానా జాతి సమితి ఎటువంటిదో కళా ప్రపంచంలో సర్రియలిజం అట్టి"[9] దని శ్రీశ్రీ అభిప్రాయము. అయితే ఇక్కడ ఒక్క విషయం మాత్రం గమనింపదగినది. "పాశ్చాత్య దేశాలలో రూపొందిన ఈ అధివాస్తవిక ఉద్యమం తత్త్వత : రాజకీయమైన తిరుగుబాటు అనీ, విప్లవాత్మకమైన ప్రభావాలున్నదనీ, అప్పటి కమ్యూనిస్టు ఉద్యమంతో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కూడా సంబంధం ఉన్న ఉద్యమమనీ విస్మరించ కూడదు."[10] అన్న విమర్శకుల పలుకులు గమనార్హములు. మార్సెల్ రేమాండ్ పలుకులు దీనిని బలపరుస్తున్నాయి." **Breton and his followers approve of the famous words of the communist Manifesto where in Marx asserts that the time has come to change the world which the philosophers have been trying too long and vainly to explain. But in their view the will to transfrom this world is not Prejudicial to the will to know it. They strive to remain on the crest that seperates these two activities, and it is possible that they still hope in this way to work towards an increase of the powers and posibilities of that spirit, for the advent of which some of them were ready to sacrifice everything in 1925"**[11] ఇంత చరిత్ర గల అధివాస్తవిక కవిత తెలుగులోనికి వచ్చేటప్పటికి తన తాత్త్విక గాథలను కోల్పోయినది. కారణం ప్రపంచ వాస్తవికతను భగ్నం చేయవలసిన, హేతు వ్యవస్థని కూలదొయ్యవలసిన ఇరుకు పరిస్థితి తెలుగు దేశంలో ఏనాడు లేక పోవుటయే"[12] అందువలననే తెలుగులో అది వాస్తవిక కవిత కేవలం ఒక ప్రయోగ వాదం (**Expemental Tendency**) గానే మిగిలిపోయినది.

శ్రీశ్రీ "డాడా తిరుగుబాటు - అధివాస్తవిక ప్రయోగము" అను గ్రంథము చదివి ఏతత్ప్రభావముతో అధివాస్తవిక గేయ సృష్టి యొనర్చినాడు. దీనికి నాటి జ్వాల పత్రిక సంపాదకుల ప్రోత్సాహం లభించినది. ఆ పత్రిక సంపాదకులు ముద్దుకృష్ణ పలుకులు గమనింపదగినవి. "మనం కూపస్థంగా ఉండటం వల్లనో, పురాతన మగత చేతనో, రక్తంలో నీరసం చేరనో, నూతన తేజస్సునకు గుడ్లగూబల మౌతున్నాము. ఇది పనికిరాదు... యువకుల దృష్టికి ... ఒక కొత్తదారి కనబడుతూ ఉన్నది.... మార్పు తప్పదు. దీన్నికి అడ్డు వీల్లేదు. వచ్చినా ఆగదు. పిరికి వారికి ముక్తి లేదు. అందుచేత నచ్చని పాత బంధాలను తెంపివేయ

9. "నేటి కవిత - క్రొత్త పోకడలు" — శ్రీశ్రీ భారతి, 1939, [illegible]

10 తెలుగులో కవితా విప్లవాల స్వరూపం — శ్రీ వేల్చేరు నారాయణరావు, పుట. 170

11. *From Baudelaire to Surrealism - Marcel Raymodd. P. 284.*

12. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం — శ్రీ వేల్చేరు నారాయణరావు. పుట. 175.

దానికి ఎంతైనా సాహసిస్తాము మాకు మతం లేదు. జాతి లేదు. వర్ణం లేదు. ఆడవాళ్లిందుకు, మగవాళ్లిందుకు అనే భేదం లేదు ... యువకులు ఉద్రేకంతో ఉత్సాహంతో ఏది తెచ్చినా దాన్ని ప్రచారంలో పెడతాము ఉన్నది ఉన్నట్లు అంగీకరించి నిర్జీవంగా తుప్పు పట్టడం కన్నా, నష్టం కలిగినా సాహసించి ఏదో యత్నించి జీవించడం ఉత్తమం" [13]. ఇట్టి ఉత్సాహ, ప్రోత్సాహాలతో ప్రయోగ దృష్టికల శ్రీశ్రీ అధి వాస్తవిక గేయసృష్టి యొనర్చినాడు. De Compositions, కొంటెకోణాలు, అభిసారికకడసారి, అధివాస్తవికుల ప్రవేశం శ్రీశ్రీ అధివాస్తవిక గేయాలు? ఆఖరిమాట మొదటి మాట. మంచి ముత్యాల సరాల్లో కూడ అధివాస్తవిక ఛాయలు కలవే. ఇవి "ఖడ్గసృష్టి" [14] లో చేరినవి. 'కొంటె కోణాలు' లో శ్రీశ్రీ సర్రియలిజాన్ని ఇలా నిర్వచించినాడు.

"జీబ్రాకి algebra చిహ్నాల
లాంకోటు పాంకోళ్లూ తొడిగి
సాహిత్య పౌరోహిత్యం ఇస్తే
వెర్రికాదు Surrealism రా సోదరా [15]

దీనిలో జీబ్రా జంతువు, ఆల్‌జీబ్రా బీజ గణితం వీనిలో 'జీబ్రా' శబ్ద సామ్యం తప్ప వేరు విశేషం లేదు. రెండు సంబంధంలేనివి. జీబ్రాకి ఆల్‌జీబ్రా చిహ్నాల లాంకోటు పాంకోళ్లూ తొడుగుట అసంబద్ధము. దానికి సాహిత్య పౌరోహిత్యం ఇవ్వటంలో సంబంధం శూన్యము. కాగా వీరి దృష్టిలో సర్రియలిజమ్ 'అసంబద్ధము, అర్థరహితము అగు కవిత' అనుట స్పష్టము. అయితే పై గేయంలో ఒక విచిత్ర సౌందర్యం ద్యోతకమగుట స్పష్టము 'డికంపొజిషన్స్'లో ఈ పంక్తులు సర్రియలిజానికి చక్కని ఉదాహరణలు.

కాకికేమి తెలుసు Psycho analysis ?
ఆటవెలది ద్విపద కత్తిగాదు,
5. 3. 2 ఆముక్త మాల్యద
విశ్వదాభిరామ వినురవేమ.

ప్రారంభంలో, దీని భావమేమి తిరుమలేశ, [16] దీనిలో 'సైకో ఎనాలసిస్' సర్రియలిజమ్‌లోనిది దానికి కాకికి సంబంధము లేదు. ఆట వెలది, ద్విపదకత్తిగాదనుట ఛందస్సుపై అపహాసం. 5. 3. 2 కి ఆముక్త మాల్యదకు గల సంబంధము మృగ్యము. చివర శతక మకుటము. ఇందలి అర్థ రహితము-సర్రియలిజమ్ కవిత. అయితే 'అభిసారిక కడసారి' అన్న గేయం ఫ్రాయిడ్ సెక్స్ సిద్ధాంతం ప్రభావంతో వ్రాసినది. ఇందలి వస్తువు సిఫిలిస్ (సుఖవ్యాధి)కి సంబంధించినది. ఒకానొక సుఖవ్యాధి పీడితయగు వేశ్య కడకు లైంగిక తృప్తికై వెళ్లు ఒకానొకనిని వారించు గేయమిది.

"ఆకాశం మీద రాకాసికోట
ఏడకయ్యా పోతావు
...............
ఏమిటి దంతపు చర్మంమీద
ఎర్రని పచ్చని దేదో మచ్చ
లోతులోయలో భూతాలు
కొలిమి నిప్పులో గుర్రాలు
సూదికి కంట్లో సోపానం
కాళ్లకి కళ్లూ సంకెళ్లూ
సంకేతం నీ సాల్వర్సాన్
జలపాతరిలో జంఝూటి" [17]

13. నవ్యాంధ్ర సాహిత్య వీధులు. భాగ. 4. పు. 718 లో ఉదాహృతము.

14. విశాలాంధ్ర ప్రచురణ. 1966.

15. ఖడ్గ సృష్టి. పుట. 58. (1973 ముద్రణ).

16. ఖడ్గసృష్టి. పు. 63.

17. Ibid. పు. 79

ఈ గేయంలో స్త్రీ మర్మాంగ వర్ణన ప్రతీకాత్మక ముగా చిత్రింప బడినది." ఆకాశం మీద రాకాసి కోరా. కోరచుట్టు నెత్తుటి చుక్కలు. కనుమలోనిది కొలిమి, సంకేరం నీశ్మశానం, సంకేతం నాసరస్సు, దంతపు చర్మంమీద ఎర్రని పచ్చని దేదోమచ్చ" ఇత్యాదులన్ని ఫ్రాయిడ్ సిద్ధాంతానికి ప్రబల తార్కాణాలు. ఇట్టి లైంగిక ప్రతీకలు, అశ్లీల పదాలు వాడటం ద్వారా అకవితా జడత్వాన్ని, సామాజిక జడత్వాన్ని బద్దలు కొట్టడం అన్నది ఈ ఉద్యమ కర్తల మహదాశయం.

# 5

శ్రీశ్రీ తరువాత ఈ అధివాస్తవిక కవితారచనకు మూలస్థంభమై నిలిచిన వాడు నారాయణబాబు. "రుధిర జ్యోతిర్ జ్వలనాలలనా ప్రియుండ !... విప్లవ ఋషిని, విద్రోహకవిని, ఆహవరంగం నా హృదంతరంగం" అంటూ కదన కుతూహలరాగం వినిపించిన విప్లవ కవి శ్రీ రంగం నారాయణబాబు. ఆతని "రుధిరజ్యోతి" ఆధునికాంధ్ర కవితా వియత్తలంలో ధృవతార.

"ఈ కాలంలో వాత్స్యాయనుడూ మనువూ కారు మా ఋషులు, మార్క్సు, ఫ్రాయిడ్, యదార్థజగత్తు స్వాప్నిక జగత్తు తారుమారయాయి, యదార్థాన్ని గుర్తించము. కలలు మాకు యదార్థాలు. ఈ జగత్తుతో మాకు పనిలేదు. మాది స్వప్నజగత్తు సంపన్నులూ, భాషా సంపన్నులు మాకు విరోధులు. కావ్యలక్షణాలే అవలక్షణాలు. అందరం కవులమే. వ్యక్తాన్ని వదలి పెడతాము. వ్యక్తావ్యక్తంలో ఈత కొడతాము. ఏదో విధమైన శక్తి మమ్మల్ని పూనుతుంది. అదేదో రాయిస్తుంది. అదేది రాయిస్తే అదే కవిత్వం." ఇది అధివాస్తవికుల మతం [18] అంటూ ఆనాటి తమ కక్షి తాదృక్పథన్ని వివరిస్తాడు నారాయణబాబు రేటాల గోపాలకృష్ణగారి "సంఘర్షణ" కావ్యానికి పీఠిక వ్రాస్తూ.

"బుద్ధి హృదయం
ధ్యానబుద్ధులై
నిమీలిత నేత్రాలతో
నిద్రిస్తే
వ్యక్తావ్యక్తంలోంచి
వెలుగు బాటలు
చూపించే
నీవెవరే !"

అంటూ అధివాస్తవికకవితకు పునాదియైన 'వ్యక్తావ్యక్తాన్ని' "నీవెవరే" అనే గేయంతో ప్రశ్నిస్తాడు కవి. "జీవిత మొక ఆసుపత్రి. వ్యక్తా వ్యక్తం అనే గవాక్షంలోంచి వీక్షిస్తే మనోజగత్తులోని పబ్లిక్ బయళ్లూ, వృక్షచ్ఛాయలూ సెలయేళ్లగానము ఇంకా మీదికి సముద్ర కెరటాల హోరు - అంతే అవ్యక్తం వినిపించి కనిపిస్తాయి" [19] అని వ్యక్తావ్యక్తప్రాధాన్యాన్ని ప్రస్ఫుటం చేస్తాడు. ఈ మాటలకు ప్రత్యక్ష నిదర్శనం "చిన్నా" అను గేయము. ఈ గేయానికి కవి ముందుమాటలివి." వ్యక్తం చేరుకుందామని చైతన్య స్రవంతి యీది వ్యక్తం కంట బడకుండా వ్యక్తా వ్యక్తంలో రలదాచుకుంటున్న తలపులు చెప్పేందుకే ఇందులో చేసిన ప్రయత్నం"

"మన్ను తింటున్న చిన్నా !
మీనాన్న నిన్ను కొడితె
ఏమిటి అల్లా చూస్తావు
నీచూపులు ?
నాగమయ్య
గొంతును తడిపె
చవితినాడు
చిమ్మిలి తిన్నావా ?
పుట్టి బంగారం

18. రుధిరజ్యోతి పుట. ఆ శ్లో. అప్పన్నశతము.

19. 'సంఘర్షణ'కు వ్రాసిన 'ప్రవర' నుండి..

పెట్టుకున్నావా
'చెవిపోటుకు
మంద' ని చెపుతున్నాయి!"

వీనిలో పన్ను తింటున్న చిన్నాకి చవితి నాటి చిమ్మిలికి సంబంధం లేదు. పుట్టబంగారానికి చెవిపోటుకు సంబంధం లేదు. ఇవి కవి వ్యక్తంలో వేరువేరు సందర్భాలలోనివి. అవ్యక్తంలో ఒకదాని వెంట ఒకటి స్ఫురణకు రాగా ఈ చరణములు ఏర్పడినవి. తరువాతి పంక్తులు ఇంకా విచిత్రమైనవి.

నీచూపులు - వెదురు క్రోవి
సావాసం చేసిన - మోవి!
ధర్మక్షేత్రం - కురుక్షేత్రం
గీరామధువుల - జపాసుమం
నారాయణ చక్షువు నడిగి
మన్నురుచి తెలుసుకొమ్మని!"

వీనిలో చూపులు వెదురుక్రోవి అనటంలో అర్థం లేదు. అయితే క్రోవికి అనుప్రాసగా మోవి ఉపయోగించాడు. అలాగే ధర్మక్షేత్రం కురుక్షేత్రం భగవద్గీతలో మొదటి శ్లోకం. నారాయణ చక్షువు నడిగి మన్నురుచి తెలుసుకొమ్మనుట హాస్యాస్పదం. వ్యక్తంలోని భగవద్గీతా శ్లోకము చైతన్య స్రవంతిని దాటి వ్యక్తావ్యక్తంలో ఈ విధంగా తలుపు తెరచుకొని కవితగా వెలువడింది. అందుకే

"వ్యక్తావ్యక్తంలో
వెలుగునీడల మధ్య
ఈతకొట్టే కవులం!"

అంటాడు. అలాగే "భూమి పూతచుట్ట!" అంటాడు. బహుశా హిరణ్యాక్షుడు భూమిని చాపలా చుట్టటం స్ఫురించి "పూత రేకుల చుట్ట" అని ఉండవచ్చు. "నిశ్శబ్ద పురాణ సంవత్సర సంపుటముల దొంతి" అనటంలో అర్థం అధ్వాన్నమయినది. "వ్యాయానికి అతని కవిత్వమే నిశ్శబ్ద పురాణ సంపుటాల దొంతి. భావ మొక పూతరేకు. కొన్ని నిగూఢ రహస్యాలు అతని కవితలో తొంగిచూస్తాయి. శిల్పం రహస్యంగా వుండిపోతుంది. ఇంద్రియాలు గ్రహించిన అనుభూతులను ఆయా ఇంద్రియాలతో గాక, వానిని భిన్నభిన్న యింద్రియ సంపాదితములుగా పేర్కొవడం ఒక శిల్ప రహస్యం" అంటారు శ్రీ రోణంకి అప్పలస్వామిగారు నారాయణబాబు కవిత్వాన్ని విశ్లేషిస్తూ.[20]

"పూర్వం మీ పెరడు ఇనుపగని
ఇప్పటికీ మంటిలోన
ఇనుముందని పాండురోగానికి
మందని!"

మట్టిలో ఇనుముండుట, అది పాండురోగానికి మందనుట పరస్పర సంబద్ధములు కావు. పైగా విరుద్ధములు. ఇనుముందని-రోగానికి మందని అనుటలో లయ యేర్పడినది.

"నీ వెవరే" అనునది నారాయణబాబు మరొక అధివాస్తవిక గేయము "వ్యక్తావ్యక్తం". ఇందులోని వస్తువు

"దరిద్రంతో తాపత్రయాలతో
వెంటాడిన వెట్టికుక్క
దినానికి తిలోదకాలు"

సర్రియలిజానికి ముఖ్యమైన అస్పష్టత పై పంక్తులలో స్పష్టంగా గమనించవచ్చును. కవి తన అంతస్సుకు తోచిన భావాన్ని సూటిగా నివేదించే ప్రయత్నం ఇది. సర్రియలిస్టులు "Matter follows information" అని ప్రగాఢంగా విశ్వసిస్తారు. అందుకే మనస్సునుండి యథాతథంగా వచ్చినమాట బహిర్జగత్తుపట్ల మానవునికి గల నిగూఢ వాంఛలను, దమితానుభూతులను బయట

20. "రుధిరజ్యోతి-ఒక ప్రస్తావన" - శ్రీ రోణంకి అప్పలస్వామి. భారతి, సెప్టెంబరు 1952. రుధిరజ్యోతిలో పునర్ముద్రితము. పే. xvi)

పెడుతుంపని ఓరి అపంచ విశ్వాసం. ఈ క్రింది పంక్తులు దీనికి ప్రత్యక్షోదాహరణములు.

"హాయిగా అర్ధరాత్రి
అడావుగా ఓడిమినా తెలియని
తాంద్ర పాపారాయుడు తమస్సు"

ఇక్కడ అడవుగా ఓడిమినా తెలియని తమస్సుకి తాంద్ర పాపారాయుడికి పొంతన లేదు. ఈ పంక్తులు చదివినప్పుడు పాఠకునిలో ఒక విచిత్రమైన అనుభూతి కలుగుతుంది. ఆ విచిత్రమే కవిత్వమంటాడు శ్రీశ్రీ. "ఒక పదం అనేక అర్థాలను అంతఃపురంలో దాచుకొనే వివాహం. ఒక అర్థం అనేక పదాలతో విచ్చలవిడిగా విహరించే వ్యభిచారం. రెండూ నచ్చవు నవకవికి...అవ్యయం అనాచ్ఛాదితంగా ఆకాశమధ్యంలో ఊగవచ్చును. విభక్తి విశృంఖలంగా షికారు పోవచ్చును. విచిత్రమే సౌందర్యం. సౌందర్యమే విచిత్రం"[2].

"గేదెపెయ్య" నారాయణబాబు రచించిన మరొక అధివాస్తవిక గేయం. ఇందులో వ్యక్తంలో గేదెపెయ్య. వ్యక్తావ్యక్తంలో కవి.

"మేడమీద నేను మేడకింద
పాకలోన నీవు చైతన్యస్రవంతిలోన
మేడమీద మేడకింద నీతో నేను"

చైతన్య స్రవంతి (stream of conscious) లో గల కవి "నీతో నేను" అని గేదెపెయ్యతో అవ్యక్తంలో తనను పోల్చుకుంటున్నాడు.

"వ్యక్తంలో నీ నోటి గడ్డిపరక
వ్యక్తావ్యక్తంలో నా గీతం"

అనగా రెండూ వేరుకావని ఒకటేనని కవి [illegible] గేదెపెయ్య గడ్డి మేయును మరి తనో [illegible] తన గీతాలనే (భావాలనే) చర్వణ మొనర్చును ఇవి వీరికి గల సామ్య వైషమ్యాలివి.

"కుక్షింభర సర్వము నీది
దక్షయజ్ఞం నా బ్రతుకు
రాక్షసివై సుఖపడు నీవు
యక్షుడనై విలపించె నేను"

దీనిలో 'క్ష' కార ప్రాసము గమనార్హము ఇక గేదెపెయ్య పొట్టనింపుకొనుటే ధ్యేయంగా కలది కవి బ్రతుకు కక్కుల కల్లోలం లాంటిది అందుకే తాను యక్షుడిలా కాళిదాసు విలపిస్తానంటున్నాడు నైరాశ్యములో.

"నీ సజీవ 'అంభా' రవమునకే
చెవులు మూసుకొని
నా నిర్జీవపు గీతాలను
వినేందుకు సభ చేసిన లోకం
సెభాస్"

పై భావమునకు విరుద్ధమైనది ఇందలి భావము. అందు కవిగా తాను నైరాశ్యమును అనుభవిస్తున్నాడు. అంతలోనే గేదెపెయ్య సజీవ అంభారవాన్ని వినక, తన నిర్జీవపు గీతాలను వినేందుకు సభచేసిన లోకాన్ని వ్యంగ్యంగా దుయ్యబడుతున్నాడు కవి. ఈ గేయంలో గమనింపదగినది హేతువాద విరుద్ధంగా "Poetic Image"ని సృష్టించుట. వీనిని భావచిత్రాలు అనవచ్చు. ఆంద్రే బ్రెటన్, పాల్ ఎలార్డు లాంటి పాశ్చాత్యకవులు భావ చిత్రాలను అమోఘంగా ప్రయోగించారు.

"In coloured glasses .... a fan of alcohol"

"When I am asleep my throat is a ring with a tulle sign board" "The earth is blue as an orange" (paul Elard) "delirium with crystal fingers"

---

2. [illegible] — ఇంద్రో శ్రీశ్రీ.

(Pierre Reverdy) "On the bridge the cat faced dew rocked it self to sleep". "The pretty carpentary of sleep" "The rain lands reveled by rearls" (Andre Breton ; ఏ సంబంధంలేని రెండు వస్తువులను హేతువాద విరుద్ధంగా భావచిత్రాలుగ తీర్చిదిద్దటం "Mysterious luminosity"ని పెంచుతుందని బ్రెటన్ అభిప్రాయం.[22] ఇవి పాఠకులను ఆలోచనా మగ్నులను చేసి సుదూర తీరాలకు తీసికెళతాయని ఆ గుణమే కవిత కందమని జూలియన్ గ్రాక్ అభి భాషణము.

కాగా నారాయణ బాబు రచనల్లో "రెండోమ్ ఋషులు" "మౌనశంఖం" అనే గేయాలు ఫ్రాయిడ్ సిద్ధాంత ప్రభావంతో వ్రాసినవి. దీనిలో వస్తువు కామసంబంధి. "ఈ కాలంలో వాత్స్యాయనుడు మనువూ కారు మా ఋషులు – మార్క్స్, ఫ్రాయిడ్" అంటాడు నారాయణబాబు మానవుని వాంఛలన్నింటికి (Libido) "కామవాంఛ" మూలమని ఫ్రాయిడ్ ప్రతిపాదన. "రెండోమ్ ఋషులు" అన్న గేయంలో మానవ సహజమగు కామమును అణగ ద్రొక్కుట వలన ప్రయోజనం శూన్యమని నారాయణ బాబు అభివర్ణనము. "నిగ్రహం నిగ్రహం కోసమేనని దీనిని అణచ బూనడం ప్రమాదం ప్రయోజనంతో ఇతర కార్యాలలో దీనిని వ్యక్తిం చేయాలి. అప్పుడే అట్టి నిగ్రహం అర్థవంత మవుతుంది. ఈ దృష్టిలోపించిన వారికి, కవి ప్రకృతి అంతా సెక్సుమయంగా గోచరింప చేస్తున్నాడు. "రెండోమ్ ఋషులు" అనే గీతం మెరుపు యుద్ధం వంటిది." [23] చూడుడు.

"చినుకెప్పుడు పెద్దమీద
పళ్ళజోడు ముక్కుతోడ
వ్యభిచరించెః"
నట్టింట్లో చిల్లుపడిన
మజ్జిగకుండ కివ్వం
చీకటి తప్పే చేశాయి"

ప్రబంధమయిన లైంగికేచ్ఛను కవి ఈ విధంగా వ్యక్తంగా చేస్తున్నాడు. దాన్ని అణచ బూనడం వ్యర్థమని, ప్రకృతి సర్వాత్మనా ఇది గోచరిస్తుందని నిరూపణము.

"కుళ్ళిపోయిన కూరగాయలు
కునికిపాట్లు పడుతుంటే
టమాటపండు మాంసం ముక్క
కలసి అఖండ సంధ్యారాజ్యం
చేస్తున్నాయి"

ఇంతకన్నా ఇంకా హేయంగా సాగినది కవి వర్ణన. పవిత్రతను కవి జుగుప్సీకరించిన పట్టం యిది.

విరులంటేనే మండిపడే
విస్వస్తల పడక గదిలో
కంచెంబులో ఉద్ధరణి
కమ్మ విల్తు కేళిదేలె !

అంటూ సెక్సు అందునా సంభోగ, తీవ్రతను దారుణంగా వెల్లడించాడు.

"పత్తి గింజలు
చుక్కలు
గోళ్ళతో నొక్కండి"

అని మర్మావయవాల్ని సంకేతించి సూచించినాడు. ఇవి అన్నీ దమితమైన అనుభూతులకు నిదర్శనాలు సెక్సంటే మహాపాపంగా మండిపడి చూచేవారికి ఇది సవాలు. "సుర్తవిలాస వతులు చూచుకునే అద్దం చంద్రునిబిడ్డలు కొట్టండి." ఇదెంత అసంభవమో సెక్సు వాంఛల్ని అణగ ద్రొక్కటం అంత అసాధ్యమని, అసమంజసమని కవి అభిప్రాయము.

---

22. 'Losvases Communicants'-1932.
23. రుధిరజ్యోతి – ఒక ప్రస్తావన–శ్రీ రోణంకి పుట. xiii

"మౌన శంఖం" నారాయణబాబు అధి వాస్తవిక గేయాల్లో మకుటాయమానము. ఇది సుదీర్ఘ గేయము. ఇందులో జుగుప్సను చిత్రించడం, ప్రకృతి యందలి సుందర వస్తువులను వికృతంగా చూపడం, పురాణ పాత్రలను నీచంగా చిత్రించడం, దమితమైన కామవాంఛను ప్రకటించడం, సంప్రదాయాన్ని అధిక్షేపించడం కన్పడతాయి. సర్రియలిజానికి గల ప్రధాన లక్షణములన్నియు ఈ గేయంలో నిబిడీకృతమైనవి. అధివాస్తవికతకు ముఖ్యలక్షణమైన అసంబద్ధతకు నిదర్శనములీ ప్రారంభ వాక్యాలు.

"కాడ్ లివరాయిల్లో 'డీ' విటమి నుంటుంది
కోడి గుడ్లు ధాతుపుష్టి
కాకాతువ్వ తెలుపు, కోయిల నలుపు
ఆకాశం పొడవు. భూమి వెడల్పు
ఆకాశం ప్రవళీధరం
అందుకొస్తే కదా!"

మొదటి రెండు చరణాలు డాక్టర్లు రోగులకు చెప్పేవి అవి బలవర్ధకాహారములని, దీనికి నారాయణ రెడ్డి గారు చక్కని వివరణ మిచ్చిరి. "కాడ్ లివరాయిల్లో" (ఇంగ్లీషు శబ్దములో) 'డి' యున్నది ('డీ' విటమినున్నది. 'కోడిగుడ్లు ధాతుపుష్టి' ఇవి సహజగుణములే. కాకాతువ్వ' యన్నది శబ్ద చమత్కారము. ఇంగ్లీషులో 'Cacatoo అను శబ్దమున కిదివికృతి. Cacatoo అనగా తెల్లనిరామచిలుక."[24] ఆకాశం పొడవు, భూమి వెడల్పు, ప్రవళాధరం అనటం కేవలం పదాల కూర్పే, ఇది విచిత్రానుభూతిని కల్గిస్తుంది పాఠకునిలో "అర్థం వెంట అర్థం పదం వెంట పదం ఏకసూత్రతలేని సద్యః స్ఫురణ పొందుతూ, ఒక అతిలోకమైన చమత్కారాన్ని సాధించడం అధివాస్తవికత. ఏకసూత్రత లేకుండా రచించడం సులభమని భావించరాదు. మోడరన్ ఆర్టులో చూడగనే పిచ్చిగీతలుగ కనబడే చిత్రం, ఒక విశిష్టమైన అనుభూతిని ఎట్లా ధ్వనిస్తుందో, అదేవిధంగా అధివాస్తవిక రచనలో గూడ విలక్షణ శబ్దార్థ సంఘటన చేత ఒక విచిత్రమైన అనుభూతి కలుగుతుంది"[25] అంటారు శ్రీ అద్దేపల్లి రామమోహనరావుగారు.

"నీలగిరిలో పురుడు పోసుకుని
దాహం దాహం అంటూ మరణించిన
చూలాలి వక్షంలో గడ్డకట్టిన
చనుబాల బిడ్డును"
"తాగి చనిపోయిన ఒక పుండాకోరుని
డాక్టరు శవపరీక్ష చేసినప్పుడు
అతని కడుపులో అరగకుండా
పైకి ఒలికిన సారాచుక్కను"

అని "భుజంతట్టి నీ వెవరిని" ప్రశ్నించిన గాలికి, అత్యంతజుగుప్సాకరంగా చెప్పుకుంటాడు తన్ను గూర్చి. ఇంతకీ ఎవరైతేనేం?

"రుక్మిణి కళ్యాణ తపస్సులో
కుటుంబ చింతలో కలిసాం"

అంటాడు. ఇవి అసంబద్ధ విషయాలుగ తోచిన "రుక్మిణి" అనుటలో జలసూత్రం రుక్మిణీ నాథ శాస్త్రి; "కుటుంబ" అనటంలో కొడవటిగంటి కుటుంబరావు స్ఫురిస్తారు. ఇంతలో నారాయణబాబు. శ్రీ శ్రీ కలుసుకుంటారు. వీరు సిరాబుడ్డిలో కలం ముంచితే సిరాకి బదులు పాళీకి తగిలింది ఒక సాలె పట్టు, దాని మధ్యన చచ్చినా సాలెపురుగు పట్టులో సజీవంగా ఉన్న రెండు మక్షికాలు సాక్షాత్కరిస్తే కవి ప్రక్కనున్న శ్రీ శ్రీని అవి ఏమిటని ప్రశ్నింప శ్రీశ్రీ "సాలెపట్టు లేదు. అదంతా కవితావ్యూహం" అంటాడు. దీనిలో శ్రీశ్రీ ప్రసిద్ధ కవితా పంక్తులు-

24. ఆధునికాంధ్ర కవిత్వము-డా॥ సి. నారాయణ రెడ్డి, పు.

25. విమర్శ వేదిక. పుట. 110-111.

"ప్రపంచ మొక ప్రద్మవ్యూహం
కవిత్వ మొక తీరని దాహం"
స్ఫురింప జేస్తున్నాడు.

"ఈ మానవ జాతికి నీవు ఎర్రదీపానివి
ప్లేగు వ్యాధికి కనిష్టేపువి"

అంటాడు శ్రీశ్రీ నారాయణబాబును గూర్చి. ఇందులో "ఎర్ర దీపం" వారి దృక్పథానికి నిదర్శనం.

"కాశ్మీర సరస్సులో పడవల్లాగు
కాలప్రవాహంలో కలరా శవాలు కొన్ని"

అంటాడు. కాశ్మీర సరస్సుల్లో పడవలు సౌందర్యానికి ఆట పట్టులు. సౌందర్యాన్ని వికృతంగా నిరూపించడం అధివాస్తవిక కవితలో ఒక భాగం. అందుకే కాశ్మీర సరస్సును కాలప్రవాహంతోను, పడవల్ని కలరా శవాలతోను ఉపమించి వికృతత్వమును ధ్వనింప చేయుచున్నాడు కవి. అంతేకాదు పురాణ పాత్రలను అత్యంత నీచంగా చిత్రించాడు ఇక్కడే

"కుష్టురోగంతో కాళ్లూ చేతులు పడిపోతే
కిందపడి దొర్లుతూ ఏడుస్తున్న దేవేంద్రుడు
ఇంకిపోయిన అమృత భాండంలో
ఒక్కడైనా లగుల్తుందేమోనని
వ్రేళ్లతో స్పృశిస్తున్న శచీదేవి"

సంప్రదాయ సిద్ధమైన కవితా భావనను అధిక్షేపించడం, మార్చి చెప్పడం తద్వారా వికృత హాస్యాన్ని సృష్టించడమనే అధి వాస్తవిక కవితా లక్షణం పై పంక్తుల్లో ప్రస్ఫుట మౌతున్నది.

అక్కడ గండభేరుండ పక్షులు "కలరవాలు" చేస్తుంటే శ్రీశ్రీ పాడుదామన్నాడట, "కలరవాలు" కోకిలలవి. గండభేరుండ పక్షులవి "కఠోరరవములు" ఈ ఉపమానం భావకవిత్వంపై విసురు:

ఇంతలో అక్కడ రెండు అస్థిపంజరాలు. అందలి లింగభేదం అనవసరమట. అయినా ఒకటి స్త్రీ అస్థిపంజరం. రెండవది మగవానిది. స్త్రీ అస్థిపంజరం చేతిలో ఒక గులాబీ, అత్తరువు బుడ్డి, మెడలో మెరిసిపోతున్న కోహినూరు వజ్రమట. ప్రక్కన నిలబడిన మొగ అస్థిపంజరం ఏడుస్తూ నల్లబడిన ఎముకలతో వేడెక్కిన(?) ఎముకలతో చేతిలో-

"వజ్రపై ధూర్యాలు పొదివిన
బంగారపు గునపంతో
తాజ్‌మహల్ తవ్వేస్తూ"

ఉన్నదట. సౌందర్య ఖనిగ ప్రపంచ ప్రసిద్ధమైన తాజ్‌మహల్‌ని త్రవ్వినట్లు చిత్రించటం సౌందర్యాన్ని అధఃకరించి అపహాస్యం చేయుటయే. "వేడితో నల్లబడిన ఎముక" కామవాంఛకు ప్రతీక.

"ఉపనిషత్తులు తుమ్మెదలై
ఝుంకారం చేస్తున్నాయి
పార్వతి నగ్నంగానిలబడి
పూలు కోస్తున్నది,
ఈశ్వరుడు నిద్రపోతున్నాడు
పార్వతి దర్శనమయ్యేసరికి
నా బట్ట అంటుకున్నది"

ఇత్యాది పంక్తుల్లో దమితమైన కామానుభూతులే ప్రకటింపబడినవి. సంప్రదాయ సాహిత్యమందలి పాత్రలను, అందలి శృంగారరస ప్రాధాన్యతను వికృతంగా చూపి అపహసించుటయే ఈ రీతి కవితకు లక్ష్యము. గేయాంతము ఉదాత్తమైనను, ఆద్యంతములు కవి అధి వాస్తవిక కవితా రీతిని నిక్షిప్తపరచినాడనుటలో సందేహము లేదు.

'కవీ' అన్న గేయం కూడ అధి వాస్తవిక ముద్ర కలది. ఇందులో ప్రాచీన కవుల చేతను, భావ కవుల చేతను అత్యంత సుందరంగా వర్ణించబడిన సంధ్య, చీకటి, నక్షత్రాలు, ఆకాశం భీభత్స రసప్రధానంగా చిత్రింపబడినవి. ప్రియురాలి నఖాగ్రాలుగా చుక్కల్ని పూర్వ కవులు భావించినారు.

"నింగిమూలం
నీలి పందిళ్ళపైచి
వింత చిమమల్లితోడ
వేయించినాను"

అంటారు కృష్ణశాస్త్రి గారు. దానినే నారాయణబాబు ఇలా అంటాడు.

నల్లని గ్రామ కోటలు
తెల్లని మఘాచి కుండలు
గగనమ్మున చుక్కలు"

జుగుప్సను రేకెత్తించే విధంగా బీభత్సంగా చిత్రించడం అధివాస్తవిక కవితా వాదుల ఆదర్శం. ఇట్టిదే మరొక భావం

"ఒళ్లు తెలియని
పుళ్ల బాధతో
వెక్కి వెక్కి
ఏడ్చింది
చుక్కల ఆకాశం"

అంటాడు. అలాగే "కావాలి" అన్న ఖండికలో "సమాధిలో మృత శిశువట్టుల జలదాంతరశశి" ఉన్నదని వర్ణించినాడు. ఆ అందచందాల వరసీమ చందమామని. "నారాయణబాబు శబ్దాలను పదుగెత్తించడు. అతనిది అర్ధదృష్టి"[26] అన్న విమర్శకి వాక్యములు ఈ సందర్భంలో ప్రత్యక్ష సత్యములు.

నారాయణబాబు అనంతరం ఇతర కవు లెక్కువగా ఈ అధివాస్తవిక కవితా రీతిని చేపట్టలేదు. అయితే తెలుగులో అధివాస్తవిక కవిత సాధించిన ప్రయోజనం ఏమిటను ప్రశ్న ఉదయించటం సహజం. అప్పటికే భావ కవిత్వం కేవలం ఆత్మాశ్రయమై (subjective); సామాజిక స్పృహను కోల్పోయినది. అందునా అంధానుకరణ ప్రబలినది. భావ కవిత్వపు నీడలో అకవిత్వం కూడ కవిత్వంగా చలామణి కాజొచ్చినది. ఈ పరిస్థితుల్లో అధివాస్తవిక కవిత ద్వారా సామాజిక జడత్వాన్ని, అకవితా జడత్వాన్ని బ్రద్దలు కొట్టాడు. వీరు వస్తుపరంగా, భావపరంగా కవితలో మార్పులను ప్రవేశపెట్టి అభ్యుదయ కవితోద్యమానికి చేయూతనిచ్చారు వీరు." తెలుగు దేశం అధివాస్తవిక వాదాన్ని తూర్పారబట్టి దానిపై దమ్మెత్తిపోసి తన తెలివి తక్కువ తనాన్ని రుజువు చేసుకుంది. నిజం ఆలోచిస్తే అధివాస్తవికత నవకల్పనలకి ఎంత దోహద మిచ్చింది! ఎంత అలంకారం కలిగించింది!" అంటారు దాశరథి[27] ఆంధ్ర సాహిత్యరంగంలో ఎదురైన నిరసన. ప్రపంచ సాహిత్యరంగంలో అధివాస్తవిక కవితపట్ల కలిగిన అనాదరణకు నిదర్శనము. అభ్యుదయ కవితోద్యమము అధివాస్తవిక కవితకు గొడ్డలి పెట్టైనది. "......Surrealism is in retreat today on many world fronts. Progressive thought looks on surrealism with suspicion. Orthodox righlist criticism is shocked and scandalised by the surrealist excesses. All the same I think surrealism has not been given a fair chance here in our country. Telugu poetry at any rate is richer for the daring experiments of the neo-surrealists." [28] అని అంటాడు శ్రీశ్రీ సౌదామినికి పీఠిక వ్రాస్తూ. ఏవం విధముగ తెలుగులో ఈ అధి వాస్తవిక కవిత కేవలము ప్రయోగ వాదమే.

శ్రీశ్రీ దాదాపు లక్షణస్థాయికే పరిమితంకాగా దానిని లక్ష్య స్థాయికి గొనిపోయి నవ్యాంధ్ర సాహిత్యచరిత్రలో ఒక ప్రకరణం కల్పించినవాడు నారాయణబాబు. తెలుగులో నిజమైన అధి వాస్తవిక కవిశ్రీ రంగంనారాయణబాబు ఒక్కడే. ❁

26. "స్రవంతి"- జూలై 1978.

27. "త్వమేవాహం."- వ్యాఖ్య. దాశరథి. పుట. 68

28. Intro to 'Saudamini'- Sri Sri

# మాతృ పూజ

గాలి రోసినాయుడు

తల్లివి నీ వని పలుకుల
నల్లితి గాథల వినోద మరసెడి భంగిన్
తల్లహరి జీవంబున
ఉల్లసమందు కొనుమమ్మ ఓ జగదంబా.

పన్నుగ గట్టంజాలను
సన్నుతిగన్న భావనంబు సల్లాపమునన్
చెన్నలరఁ జేయజాలను
మన్నుతోఁ గట్టినదిదే సమర్పణమమ్మా.

ముద్దుపల్కుతో నిన్ను మురిపింపసేయుడే
కాని మరియొకటి కానలేను
నవ్వుమోముతో నిన్ను నతిజేయుచే కాని
వేరు భావంబింక వెదుకలేను
కూర్మితోఁ గౌగిలి కోరుటయే కాని
ఇసుమంత నీ రూప మెఱుగలేను
నిక్కువంబుగ నిన్ను నెమ్మితోఁ గొల్చుచే
కాని భోగములేని కలతలేదు
ప్రౌఢజనులు పల్వురు నిన్ను పల్కరించి
పూలమాలల నర్పించి పూజసేసి
భక్తి నర్పించిరే కాని బాలుడొలుకు
ముద్దుపల్కులే తల్లికి మురువుగొల్పు.

నీ ప్రేమవాహిని నిండారు కొలనుగా
రూపొందె నీనాడు తాపమడప
నీ భవ్యనామము నెలవంక పొల్పుగా
వినవచ్చె నీనాడు వెతలు మాప
నీ దివ్యరూపంబు నెఱివన్నె పెంపుగా
కనవచ్చె నీనాడు కలిమికూర్ప
ఏనాటి భాగ్యమో ఈనాటి భోగమై
ఎనలేని యానంద మెదురువచ్చె
శబ్దరూపమై చనుదెంచు సారమంత
యుగయుగాల స్రవంతియై యురుకులెత్తు
భావప్రతిమలై చెలువొందు పలుకులంత
తరతరాల యశముగూర్చి పరువులెత్తు

ఒడలెరుంగగలేని యొకనాటి బాధలో
కుందెడు నన్ను జోగొట్టినావు
దిక్కులేక తపించి తిరిగి నవయుచున్న
పెనుమార్గ మొకటి చూపెట్టినావు
నవ్వలేక కృశింప నయనమున నన్గని
లీలలఁ బరపి లాలించినావు
ఒంటరినై స్రుక్క వెంట తోడుగవచ్చి
డెందమలరగ వాడించినావు
మందువై, మార్గదర్శివై, మనుగడలకు
నెలవునై, చెలికానివై నెగడితమ్మ
ఎన్నిరూపులు నీకమ్మ అన్ని సొగసు
లావహించి నా యెదలోన నాడుచుండు.

***

# జానపద కథలలో భానుమతి

జి. శంకర్ రెడ్డి, ఎం.ఏ.

సంస్కృతమున వ్యాస భగవానునిచే విరచితమైన భారతము కవిత్రయము వారిచే (నన్నయ, తిక్కన, ఎఱ్ఱన) ఆంధ్రీకరింపబడింది. ఇది తెలుగు లోనే గాక ఇతర భాషలందును అధిక ప్రాముఖ్యత నొందినది. మానవునకు భారత స్వరూపము సమగ్రంగా సాక్షాత్కరించిన దన్నచో అతిశయోక్తి లేదు. ఇటువంటి భారతము నందు 'భానుమతి' పాత్ర చిత్రణ లేకపోవడము చాలా విచారకరమైనవిషయం. భానుమతి దుర్యోధనుని భార్య. దుర్యోధనుడు ధృతరాష్ట్రి గాంధారీ జ్యేష్ఠ పుత్రుడు. గాంధారీ ధృతరాష్ట్రులకు భానుమతి పెద్ద కోడలవుతుంది. భారతంలో అందరికన్న దుర్యోధనునిదే పైచేయి. రారాజు, కౌరవ నాధుడు, అభిమానధనుడు అయిన దుర్యోధనుని భార్య పాత్రకు ప్రాముఖ్యము భారతంలో నన్నయ సభాపర్వం, తిక్కన శాంతి పర్వం తప్పించి ఎక్కడా కన్పించదు ఆదియు నన్నయ పేరు మాత్రమే సూచించాడు, తిక్కన భానుమతి స్వయంవరాన్ని ప్రథమా శ్వాసములో వివరించాడు. ఇంకెక్కడనూ ఆమె అస్థిత్వం కనబడదు.

భానుమతి పాత్ర కావ్య భాషల్లో కన్నా జానపద కథల్లో అధికంగా కన్పిస్తుంది. తమిళ, తెలుగు జానపద కథల్లో ఈమె ప్రస్తావన చాలా చోట్ల వస్తుంది. అది కూడా భారత కథకు సంబంధించియే కథలల్లడం జరిగింది. తమిళ వీధి భారత కథల్లో భానుమతికి చాలా ప్రాముఖ్యం కలదని చెప్పవచ్చును. అందుకే కావ్య భాషల్లో భానుమతిని గురించిన వివరాలు లేకపోయినా జానపదులు తమ కథల్లో భానుమతిని కల్పించి భారతంలో ఆమెకు కొంత స్థానాన్ని కల్పించి కథలల్లినారు. దానివల్ల దుర్యోధనుని పాత్రకు కూడా కొంత మెరుగు వచ్చినట్లయినది.

**ఇప్పుడు కొన్ని జానపదుల కథలను పరిశీలిద్దాం:**

తెలుగు తమిళంలో వీధి భారతములు జరుగుతుంది. ఇది నాటక రూపాన రంగప్రవేశయోగ్యంగా జరుగుతుంది. ఇటువంటి నాటకాల్లో భానుమతి పాత్ర సభా పర్వమున వస్తుంది. ధర్మరాజు జూదమున ద్రౌపదితో సహా ఓడిపోవును. దుర్యోధనుడు దానికి ముందే రాజసూయాగమున మయసభలో ద్రౌపది ముందు అవమానితులై వస్తాడు. అందువలన ఆవేషతో ద్రౌపదికి వస్త్రాపహరణం చేయించాలని పట్టుబడతాడు. అప్పుడు తన భార్య భానుమతి సాటి స్త్రీకి మానహింస జరుగుతుందన్న బాధతో దుర్యోధనునకు పదేపదే వలదని వారిస్తుంది. కాళ్లా వేళ్లా పడుతుంది. స్త్రీ పాతివ్రత్యాన్ని వివరిస్తుంది. ఎంత చెప్పినా దుర్యోధనుడు లెక్క చేయక తాను అనుకొన్న పని చేయిస్తాడు.

పై కథలో భానుమతి గుణగణాలు బయటపడుతాయి. తానూ ఒక యిల్లాలు కావున మరియు ద్రౌపది ఎవరోకాదు తన తోడికోడలు. ఆమెకు అవమానం జరిగితే తనకు జరిగి నట్టే కదా ! యని తలచి భర్తకు బుద్ధి చెబుతుంది. ఇచ్చట మనకు ఒక స్త్రీ యొక్క సౌమ్యత, సౌశీలత, ఆదరము, గౌరవము తెలుస్తుంది. ఈవిధంగా భానుమతియొక్క అస్థిత్వం బయటపడుతుంది.

ఈ వీధి భారత నాటక కథలలోనే ఇంకొకమారు కూడా భానుమతి ప్రస్తావన వస్తుంది. పాండవులు వనవాసం వెళ్లుదురు. వన వాసానంతరం అజ్ఞాతవాసానికై విరాట పురానికి బయలుదేరుదురు. అప్పుడు ద్రౌపది, తిలల కోసమని (అడవుల్లో దొరకదు కదా) కొరవంజి వేషంలో (గువ్వల వేషం) హస్తినాపురికి వస్తుంది నేరుగా దుర్యోధనుని ఇంటికి వస్తుంది. సర్వసాధారణంగా కురవలు జోష్యం (సోదె, హస్త సాముద్రికము) చెబుతారు. కొరవంజిగా నున్న ద్రౌపది భానుమతికి సోదె చెబుతుంది. ద్రౌపది మున్ముందు జరుగబోవు కురుక్షేత్ర యుద్ధం, కౌరవ నాశనం, పాండవుల రాజ్యపాలనం అంతా సవివరంగా చెప్పును. అప్పుడు భానుమతి బాధపడి అనుమానించి దుర్యోధనునికి చెబుతుంది. దుర్యోధనుడు ద్రౌపది నిజస్వరూపం కనుక్కొని తన ఇంటిలోనే కట్టివేయును. ఇది తెలిసిన శ్రీ కృష్ణుడు అర్జునితో చెప్పగా అతను కురవర్ (గువ్వల వాడు) వేషమున హస్తినకు వచ్చి ద్రౌపదిని విడిపించుక పోవును. ఈ విధంగా కథ జరుగుతుంది.

తమిళ నాటకములలో (వీధి భారతంలో) ఈ "కురవంజి నాటకము అతి ముఖ్యమైనదిగా భావింతురు. కురవంజి నాటకము అన్నది మొదటగా యక్షగాన ప్రక్రియకు సంబంధించినది. తెలుగు సాహిత్యం దక్షిణాంధ్ర యుగంలో (16-17 ఈ యక్షగాన ప్రక్రియ ఎక్కువ ప్రాధాన్యత నొందినది. ఈ కురవంజి నాటకములో ఇద్దరూలేక ముగ్గురు మాత్రమే యుందురు. కురవంజిగా వేషము వేయునది మాత్రము స్త్రీయే. ఈమె సోదె (జోష్యం) చెప్పును. నాటకములో ముఖ్య పాత్రలైన స్త్రీలు గాని, పురుషులుగాని ఎవరికో ఒకరికి శాస్త్రము చెబుతుంది. ఈ విధమైన నాటక సంప్రదాయం తమిళ భారత వీధినాటకములలో కలదు. అందువలన ఈ భారత కురవంజి నాటకంలో ద్రౌపది కురవంజి వేషమున భానుమతికి సోదె చెప్పునట్లుగా కథ జరుగుతుంది. కావున భానుమతి పాత్ర ఈ సమయంలో కనబడుతుంది.

పైన వివరించిన కథలో మనకు భానుమతి యొక్క పాత్ర చిత్రణ ఆమె గుణములు ఏమీ చెప్పినట్లు కనిపించలేదు. కాని ద్రౌపది జరగబోవు కౌరవనాశనాన్ని గురించి చెప్పగా భానుమతికి బాధ కల్గి ఉదనడంలో పతినాశనాన్ని తలంచి దుఃఖించినది కావున ఇక్కడ పాతివ్రత్యము స్త్రీకి ఎంత గొప్పదో తెలుస్తుంది. అంతేగాని భానుమతికి ఏమంతగా ప్రాముఖ్యములేదు.

ఇంకనూ ఈ వీధి భారత కథలకు సంబంధించి కొన్ని మౌఖికమైన జానపద కథలూనూ గలవు. భారతము సభాపర్వమున పాండవుల రాజసూయానంతరం విందు భోజనము జరుగుతుంది. రాజసూయాగానికి వచ్చిన రాజులందరూ విందుకు హాజరగుదురు. కర్ణ దుర్యోధనులునూ ప్రక్క ప్రక్కనే కూర్చొందారు. విందుభోజనం వడ్డించడానికి ద్రౌపదికూడా పూనుకొంటుంది. వరుసగా వడ్డిస్తూ దుర్యోధనునికి వడ్డించే సమయంలో అతడు ద్రౌపదినుద్దేశించి 'ఈ రోజు నీవు ఎవరివంతు? (పంచభర్తృక కావున) అని ప్రశ్నిస్తాడు ద్రౌపది నిర్ఘాంతపోయి సిగ్గు, భయముతో వెళ్ళిపోతుంది. మరలా రెండవమారు వడ్డించక తప్పదుగదా! బాధను దిగమ్రింగి యథావిధిగా వడ్డిస్తుంది. ముందుమాదిరే దుర్యోధనుడు మరలా 'ఈ రోజు ఎవరివంతు?' అంటాడు. ద్రౌపది అవమానం భరించలేక గబగబా వెళ్లి జరిగినదంతా కృష్ణునితో చెబుతుంది. కృష్ణుడు తగినట్లుగ ఆలోచించి ఈ మారుకూడా అదేప్రశ్న వేస్తే భయపడక "ఈ రోజు అనంతునివంతు"- అని జవాబు చెప్పిరమ్ము- అని చెప్పిపంపును. ద్రౌపది యధావిధిగా మూడవమారు భోజనం వడ్డిస్తుండగా దుర్యోధనుడు ద్రౌపదిని ఖచ్చితంగా నిలదీసి

'ఎవరివంతు?' అని అడుగుతాడు. ద్రౌపది వెనుక ముందాలోచింపక 'ఈ రోజు అనంతునివంతు' అని చెప్పి వెళ్ళిపోతుంది. ఆ మాటలు వినగానే దుర్యోధనుడు ఖిన్నుడై అవమానంతో చేయి కడుగుకొని రొందరగా ఇల్లు చేరుకొనును.

**దీనికొక మౌఖికమైన కథకలదు—**

దుర్యోధనుని భార్య భానుమతి ఈమెను తమిళమున పెరుందేవి అంటారు పేరు అంటే పెద్దయని యర్థము. కౌరవులలో జ్యేష్ఠుడు కావున ఇతని భార్య పెరుందేవి అయింది. ఈమె తన భర్తను వశపరచుకోవలెనని (దుర్యోధనునికి చాలామంది భార్యలున్నారని యర్థము) తన బాధను ఇంటనున్న కాళమహాముని (తమిళమున)తో చెబుతుంది; అతను ఒక పసరు ఇచ్చి దీనిని నీ భర్త శిరస్సున పూయాలని చెప్పును

అంత భానుమతి పెరుందేవి ఆపసరును దుర్యోధనుడు నిదుర పోతున్న సమయాన పూయనారంభింపగ అదే సమయంలో ఎవరో అతనికినిద్రాభంగము కల్గించి పిలుచుకొని వెళ్ళిపోవును. అప్పుడు తను తలకు రాయుచున్న ఆ కాస్త పసరు క్రింద నేలమీద పడి అది అట్లే పాతాళలోకమున నాగుల శిరస్సులపై బడును. అంత నాగులన్నియు భానుమతి వశమై పైకి వచ్చిభానుమతిని బలాత్కారము చేయనారంభించును. జరిగిన ఉదంతమును గనుగొన్న దుర్యోధనుడు చేయునది లేక రోజుకొక్కరివంతున నాగులకు భానుమతిని అప్పగించును. దుర్యోధనుడు ద్రౌపదిని ఈ రోజు నీవెవరివంతు? అని ప్రశ్నించిన రోజు భానుమతి అనంతుడనే నాగుని వంతు. ఇది కృష్ణునికి తెలుసు. అందుకే ద్రౌపదికి చెప్పిపంపును. ద్రౌపది తగిన సమాధానము చెప్పును. దుర్యోధనుడు అవమానితుడు కావడం జరుగుతుంది.

ఇది కేవలము జానపదుల కల్పనలనియే చెప్పవచ్చును. కాని మామూలు సంప్రదాయములో ఇప్పటికిని మనుష్యులను వశపరచుకోవడం అనేది కలదు. అప్పటిలోనూ భానుమతి అదేవిధంగా చేసింది. దుర్యోధనునికి ఎక్కువ మంది భార్యలున్నారనేమో ఆమె తనపైనే భర్తను మరలించుకోవలెనని చేసి యుండవచ్చునని చెప్పవచ్చును. తన భర్త తానుగాక ఇతర స్త్రీలతో సంబంధము పెట్టుకొనుట ఏ స్త్రీయున్ను సహించదు ఇటువంటి సంప్రదాయము ఆనాడు భానుమతికి కలిగి ఆ పనికి సాహసించియుండును మొత్తానికి జానపదకథయయినను సాంప్రదాయ సిద్ధంగావుంది. ఇది కావ్య భాషల్లో ఎచ్చటా కన్పించదు మౌఖికంగానో లేదా, జానపద కథా రూపాల్లోనో ఇటువంటి కథలు కానవచ్చుచున్నవి.

దుర్యోధనునికి ఎంత మంది భార్యలున్ననూ పెద్ద భార్య భానుమతియే భానుమతి రారాణి. గాంధారికి భానుమతియనిన పంచప్రాణములు. ఎప్పుడునూ తన కోడలిని వెంటపెట్టుకొనియే యుండును అదుతే తిక్కన స్త్రీ పర్వము నందు పోలికలలో తొడలు విరిగిపడిన కుమారునిచూచి గాంధారి అతని చావుకన్న తనకోడలి దుఃఖమే భరించరాకున్నదని తెలియజేస్తారు. కావున భానుమతిపై గాంధారికి ఎంత అభిమానము కలదో తెలుస్తుంది. జానపద కథల్లోకూడా భానుమతియొక్క గుణగణాలు తెలియవస్తుంది భానుమతిని ఒక కులస్త్రీగాను, భారత నారీరత్నంగాను పాతివ్రత్య ధర్మాలను అనుసరించు అభిమానవతిగను, సౌశీలవతిగను జానపదులు పేర్కొనిరి.

ఈ జానపద కథలు ఎంతవరకు సమంజసమో గాని మొత్తానికి భానుమతిపై లెక్కలేనన్ని కథలు భారత కథ కనుగుణంగా అల్లి, నాటక రూపములలో పిట్టకథల రూపములలో వివరించడం మనం గ్రహించవచ్చును. వీటినిబట్టి మనము కావ్య భాషల్లో భానుమతికి అంత ప్రాధాన్య మివ్వకపోయినను జానపద కథారూపాల్లో ఆమెకు ఉన్నతస్థాయిని కల్పించిరని నిస్సందేహముగా చెప్పవచ్చును. కేవల కల్పితములైననూ కొన్ని జానపదులకథలు వినడానికి ఇంపుగ సొంపుగ ఉంటాయి. ఇటువంటి కథలు అల్లుటలో తమిళులు అందెవేసిన చేయి. భారతానికి సంబంధించి భానుమతికి సంబంధించి తెలుగు జానపద కథలకన్న తమిళులే చాలావరకు తెలియజేశారు. ఏదిఏమైననూ భానుమతికూడా భారతంలో ప్రముఖ పాత్రలలో ఒక పాత్రగా చెప్పవచ్చును.

[పై విషయ సంగ్రహమంతయు కొన్ని వీధి నాటకములు చూచియు, కొన్నికథలు జానపదుల వద్ద వినియు రచించినది. కావ్యములో ఎక్కడనూ ఇటువంటి కథలు లేవు.]

# జీవనస్మృతులు

రచన : మన్మథ

జీవితమంతా
విరిసిన పూదోట కాదు
వెన్నెల పంట కాదు
రతనాల రాజబాట కాదేది.

ఎన్నెన్నో నిమ్నోన్నతాలు
ఎన్నెన్నో వెలుగునీడలు
వీటి మధ్య జీవితం
వడబోసిన వేదాంతసారం.

కన్న కలలన్నీ
అనుభవాలు కాలేవు
కొన్నైనా తీయని వలపు స్మృతులై
మిగలనీ - శేష జీవితాన.

కన్నతల్లి తన పాప
ముద్దు మురిపాలతో
మురిసిపోనీ

పువ్వులా విరిసిన
ఆ చిన్న గులాబి నవ్వు
అంతరంగాన నిండిపోనీ.

సాంద్ర తీరాన సాయం సంధ్య
నా గుండెలో నిలిచింది
ఉప్పొంగే నీలి కెరటాల నీడల్లో
నింగిలో తారకలు తొంగిచూశాయి.

ఎక్కడో రాగం
నా గొంతులో పలికింది
ఏ అమర గానమో
నన్ను రమ్మంటూంది
ఆ రాగ మార్గాన నే తరలిపోతున్నాను.

# కాల్పనిక శక్తియుతుడయిన బాలుడు

డి. పూర్ణచంద్రరావు

(గత సంచిక తరువాయి)

**సృజనతా గుణపాలనపోషణ :**

అనుశేయమయిన మనః సంకల్పములు ఉద్వేగాన్వితమయిన మనః సంకల్పములు, సృజనాత్మకముగా పరిణామము చెందుచు సమాజమున కెంతవరకు ఏ విధముగాం ఉపకృత మగుచున్నవి ? మరియొక తరి ఈ సంకల్పములు గల వ్యక్తి ఏ విధముగా ఎంతవరకు సమీకృతుడగుచు ఆరోగ్యవంతుడు కాగలడు అనునదియును ఒక క్లిష్టమగు సమస్యగా పరిఢవిల్లుచున్నది. సాంస్కృతిక బృందములు సాంఘిక సేవా సంఘములు రాజకీయ సమాజములు మొదలయిన వివిధ సమాజములు వాటి వాటికి సంబంధించిన ఆదర్శ ప్రమాణములను కలిగియుండును. ఈ సామాజిక సభ్యులలో కొందరు ఒక కాలమున ఉదహరించిన సంకల్పములను గలిగి సృజనతా గుణము నంది కారణ జన్ములుగా రూపొందుచున్నారు. ఈ విధమయిన వ్యక్తులు తమ తమ ఊహాజనిత సంకల్పములను సమధికమయిన ఉత్సాహముతో బాహ్యముగా ప్రసరింపజేయుట కుద్యమింతురు ఈ వ్యక్తుల భావములు ఊహాన్వితములు సృజనాత్మకములు. సృజనాత్మకమయిన గుణాన్వితులయిన ఈ వ్యక్తుల యొక్క భావములు, ఆ యా సమాజముల యందు పెనవేసుకొని యున్న ఆదర్శములను ప్రమాణములను,సాంప్రదాయములను అధిగమించి, ఆ సమాజముల యందు వినూతన మయిన ఆవేశములను, ఉత్తేజములను పరికల్పన చేయుచు సమాజమునందు ఘర్షణను ఆపాదించి క్రమముగ పరిణామమును చెందుచూ నూతనమయిన ఆదర్శములను ప్రఫుల్లము చేయుటకు నాంది వాచకమును ఉద్ఘోషించును. సాంప్రదాయకమయిన భావనలు, ఆదర్శముల వలన సంపీడితలయిన ఆ యా సమాజము నందలి సభ్యులు సాహసికుడయిన ఉద్వేగాన్వితుడయిన సభ్యుని సృజనాత్మక భావములను అవహేళన చేయుట కుద్యమింతురు.

వినూతన భావనలు గల ఈ బాలుడు సమాజమునందు సామాన్యముగా ఏకాకిగా గుర్తించబడుట సహజము. సృజనతా గుణము ఆ బాలుని యందు మానసికమయిన స్వాతంత్ర్యమును సంక్రమింపజేయును. నిశితమయిన సృజనతా గుణము గల ఈ బాలుడు తన బృందమునందలి ఇతర సభ్యుల వలన గలుగు ప్రేరణ, సంసూచనలను నిరాకరించుట సహజము. ఆ బృందము అనుసరించు ఆదర్శ ప్రమాణములతో సమన్వయత చెందజాలకుండుట వలన క్లిష్టమయిన సమస్యలను ఈ బాలుడు ఎదుర్కొనుట అనివార్యమగుచున్నది. ఈ క్లిష్టమగు సమస్యలను ఎదుర్కొనుట కశక్తుడయిన ఈ సృజనతా గుణ శతురుడయిన ఈ బాలుడు తన యందలి సృజనతా గుణమును అనివార్య

ముగా నిగ్రహించును. లేక మరియొక్క విధానము నవలుపరచి ఈ సమస్యల వలన తరచుగా కలుగు ఆవేశములను, ఆవేదనలను ఎదుర్కొని తట్టుకొనగలుగుటకు అవగాహన చేసుకొనుటకు యత్నించవలయును. వ్యక్తి (బాలుని) యందు త్ఫుల్లమగుచున్న సృజనాత్మకమయిన అవసరముల నిగ్రహించుట అనివార్యమయిన యెడల ఆ బాలుని వ్యక్తిత్వము స్వరూప స్వభావములు ఛిన్నాభిన్న మగుట సహితము అనివార్యమగుచున్నది. కనుక ఆ బాలుని యందు నిగూహితమయిన విశిష్టమయిన సృజనాత్మక భావములు ఉత్ఫుల్లమయి అభివ్యంజితమగుట అను అంశము. ఆ బాలుని ఆ బృందము నుండి వేరు చేసి ఒంటరి వానినిగా చేయుట బృందము నందలి సభ్యులతో విసంవాదములను ఎదుర్కొనవలసి వచ్చుట సమస్వయతకు అనుబంధమయిన సమస్యలను సృష్టించుకొనుట అను అనారోగ్య ప్రదమయిన విషయములు అనివార్యముగా ప్రకోపించుచున్నవి.

కొందరు బాలురు చేయు ప్రశ్నలు, ప్రయోగములు, నిశితమయిన వారి భావములు, ఇతర బాలురకు ఉద్రేకమును గలిగించుచున్నవి. బాలుని యందలి సృజనాత్మకమయిన ప్రవర్తన సహితము బృందముల యందలి ఆదర్శ ప్రమాణములనతిక్రమించి విపరీత స్వభావము గలిదిగా పరిగణించబడుచున్నది. ఆయాబృందముల యందలి సంస్కృతులు తదితర విషయముల కన్నను వైవిధ్యమును ప్రదర్శించుట యందు ఆసక్తిని గలిగియుండును. ప్రత్యేక తరగతుల యందున్న బాలురు గీయు చిత్రములు కల్పించు కథలు సాధారణ తరగతుల యందున్న బాలురు ప్రదర్శించు చిత్రముల కన్నను ఆకర్షణంతమయిన ఆశ్వాసమును కలిగించుచున్నవి బాలుడు తనయందలి సృజనతాగుణమును బహిర్గతము చేయుటకు ద్యమించుట అను విషయము తరగతి యందలి సహాధ్యాయులగు విద్యార్థులను తన నుండి దూరము చేయుట అనియే అంగీకరించవలయును కనుక ఈ సృజనతాగుణ నిర్వహణ" అను అంశము బాలుని. అతనిసహాధ్యాయులను వేరు పరచుట అని అంగీకరించవలయును.

సృజనాత్మకుడయిన ఒక సాంకేతిక పరిజ్ఞానముగల బాలుడు ఉత్సాహపూరితుడయిన, సన్నిహితమయిన సంబంధములను గలిగి తన భావములను తన స్నేహితులయిన తోడి విద్యార్థులతోపాలు పంచుకొనవలయునని అభిలషించుట సహజము తను ఆశించిన సమస్యల వలన ఉత్పన్నమయిన విపర్యసితమయిన ఆయా అంశములను తోటి సహాధ్యాయులతో చర్చించి పరిష్కారమును కనుకొనుటకు యత్నించును. బాహ్య ప్రవర్తనలయందు తాను సహితము తోటి విద్యార్థుల వలే సాధారణమయిన విద్యార్థిగా వ్యవహరించుటకు యత్నించును. కారణము అతిశయితమయిన తన భావములను బాహ్యముగా ప్రకటించుటయను అంశము. తనకును, తన స్నేహితుల మధ్య నిర్దేశితమయిన అపేక్షితమయిన సంబంధములను విచ్ఛేదముచేసి ఆ బాలుని ఆ బృందముల నుండి విభిన్నము చేయుచున్నది. తను ఆశించిన స్వకీయమయిన ఆయా భావములను తనతోటి విద్యార్థులతో పాలు పంచుకొనుటకు గల అవకాశములు సహితము అసంగతమగుట అనివార్యమగుచున్న విషయము ? సహితము సహజము.

ఈ విధముగా విద్యార్థి స్వకీయమయిన సృజనతాశక్తిని బహిర్గతము చేసి తరగతి

యందు ప్రదర్శించుట, అనభిమతము. అనుచితము అను విషయము అద్యతన కాలమునందు ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలల యందు అనుసరించుచున్న విద్యా విధానము యొక్క ప్రభావమని గుర్తించవలయును. పాఠ్య ప్రణాళిక కనుబంధమయిన బోధన అభ్యాసములను గురించి తరగతియందలి విద్యార్థులలో పరస్పరము స్పర్ధను గలిగించుట అనుచితమని భావించ బడుచున్నది. కాని ఆటపాటల యందు మాత్రము విద్యార్థుల యందు ఈ స్పర్ధ ప్రోత్సహింపబడుచు అనుసరింపబడుచున్నది. ఈ స్పర్ధయను అంశము ఆయా పాఠ్యాంశములయందు విజ్ఞానమును గడించుట యందును, ఆయా భావముల కనురూపమున గుణగణములను పెంపొందించు కొనుట యందును విద్యార్థులను ప్రోత్సహించుచున్నది.

(2) సృజనతాశక్తి సంపన్నుడయిన ఈ విద్యార్థి వివిధ విషయముల యందు పారంగతుడయి యుండును. ఈ బాలుడు తను విజ్ఞానము గడించుకొనవలసిన వివిధ పాఠ్యాంశముల యందును అనురూపముగా ప్రగతి కలిగి యుండుట సహితము అసంభవము. ఏ ఒక పాఠ్యాంశము నందయినను ఒకదశ యందు వెనుకబడి యుండుట సహజము. సృజనతా గుణసంపన్నుడయిన విద్యార్థి ఇతర పాఠ్యాంశముల యందు మిన్నగా యున్నను వ్రాత ఉచ్చారణ పూర్వక మయిన శబ్దములు, పద వాక్య నిర్మాణ పాటవముల యందు వెనుకబడి యుండుట జరుగుచున్నది. కనుక ఈ సృజనతాగుణ సంపన్నులయిన బాలురు చదువుట యందును, వ్రాయుట యందును కొన్ని క్లిష్టమయిన సమస్యలను ఎదుర్కొనుట జరుగుచున్నది. తుదకు నిశితమయిన కల్పనాచతురత గల, ఊహా సంకల్పములుగలవాడుగా గుర్తింపబడిన బాలురు చదువుట యందు విపత్కరమయిన క్లిష్ట సమస్యలను ఎదుర్కొనుట గుర్తించబడు చున్నది.

ఈ బాలుడు తనయందలి విషయ సేకరణ శక్తిని ఆయా భావములను అభివృద్ధి పరచుట యందును, తనయందలి కల్పనా చతురతను, ఆ భావనల వలన ఉత్పన్నమయిన సమస్యలను పరిష్కరించుటయందు ప్రయోగించు చుండును. విషయ సేకరణ శక్తి కల్పనాచతురతతో సంశ్లేషమయి యుండును. ఈ విధమయిన సమస్యలు నాల్గవ తరగతి యందు అతిసూక్ష్మముగా కనిపించు చుండును. కొందరు బాలురు మంచి ఆలోచనా పరులుగను, పరిజ్ఞానముగల వారుగను యుందురు. ఉపాధ్యాయుడు ఊహించిన ప్రమాణములను అధిగమించి ఈ బాలురు వ్యవహరింతురు. పరిశీలకులు ఈ విధమయిన బాలుని కాల్పనిక చతురునిగను, అనునేయమయిన గుణాన్వితుడుగను, అపూర్వ శక్తి సంపన్నునిగను గుర్తించి యుండిరి.

అద్యతన కాలమునందు సమాజము శబ్దమునకు సంబంధించిన, పదవాక్యముల నిర్మాణము మొదలయిన వ్యాకరణాంశముల యందు నేర్పరితనముగను, సుదృఢముగను అభ్యసించుటయందు అవధానమును కేంద్రీకరించుచున్నది. విద్యాప్రణాళికకు అనుబంధమయిన ఈ వ్యాకరణాంశముల యందు సామాన్యముగా విద్యార్థులు ప్రతిభావంతులయి యుందురు. కాని సహజమయిన, సృజనతా గుణసంపన్నమయిన బాలురు మాత్రము చూచి చదువుట యందు సహితము క్లిష్టమగు సమస్యల నెదుర్కొను చుందురు.

(3) సృజనాత్మకులగు బాలబాలికలు లైంగిక విషయకముగా గుర్తించబడిన ఆదర్శ ప్రమాణముల నుండి విచలితులయిన విచ్ఛిన్న ప్రవర్తనగల వారుగా వ్యవహరింతురు. సృజనత సహజముగా చేతనా సంవేదనల వలన విదితమగుచున్న సుకుమారతను, స్వతంత్రత వలన విదితమగుచున్న పురుషకారమును అభిమతించును. మన సంస్కృతియందు సంవేదనా రూపకమయిన సున్నితమయిన భావము అనునది విస్పష్టముగా అతి సుకుమారమయిన గుణము. అటులనే స్వతంత్రత యనునది పురుషకారము నపేక్షించు అతి విలువయగు ప్రాతిపదిక యని గుర్తించవలయును. సృజనాత్మకుడయిన బాలుడు తన తోటి విద్యార్థుల కన్నను సుకుమారముగను వ్యవహరించుచుండును. అటులనే సృజనాత్మక గుణ సంపన్నమయిన బాలిక తన స్నేహితురాండ్రగు బాలికలకన్నను మిక్కుటమయిన పురుషకారముగల బాలికగా కనిపించుచు వ్యవహరించుచుండును.

అనేక సన్నివేశముల యందు సృజనతా గుణము వలన గలుగు సాంస్కృతికమయిన అంతరాయములుత్పన్నమగుచున్నవి. బాలబాలికలు గల తరగతి యందు "ఉత్పాదనాభివృద్ధినికష" ఒకటి నిర్వహించబడినది. ఈనికషను నిర్వహించుటకు గల ఆదేశముల ననుసరించి విపర్యయముగా ఆట వస్తువులను బాలబాలికలకు అందించిరి. బాలురకు దాదులకు సంబంధించి పరికరములు గల పేటిక ఇవ్వబడినది. అటులనే బాలికలకు అగ్నిమాపకదళమునకు సంబంధించిన పరికరములు గల పేటిక ఇవ్వబడినది. తొలిదశయందు బాలురు "ఇది దాదుల పేటిక" ఇది బాలురు ఉపయోగించి ఆడుట, అసముచితము లజ్జాకరమయిన అంశమని భావించి మొగమాటముతో సిగ్గుపడి తిరస్కారమును వెలిబుచ్చిరి. అటులనే బాలికలు. బాలికలు "అగ్నిమాపకదళమునకు సంబంధించిన పరికరములను బాలురు తమ ఆట వస్తువులుగా ఉపయోగించవలయును ఈ పరికరములను బాలికలు ఉపయోగించరాదను భావమును వ్యక్తము చేసిరి.

మూడవ తరగతి యందు గల సృజనాత్మకములగు బాలురు మాత్రము. యాదుల పరికరములను వైద్యాధికారుల పరికరము అని" ఆ పేటిక యందలి పరికరములను గురించి సున్నితమయిన పరిణతి నొందిన భావములను ఆరోపించుచు వ్యక్తము చేసిరి. అటులనే సృజనాత్మకులయిన బాలికలు సాంకేతిక శాస్త్రీయ పరికరములను ప్రయోగశాల యందుపయోగించుచు" అగ్నిమాపక దళమునకు సంబంధించిన పరికరముల యందు సహితము పురుషకారము గల భావములను వ్యక్తము చేసిరి. ఈ విధముగా సాంకేతిక, శాస్త్రీయ పరికరములను ప్రయోగపరచుట యందు సాహస కృత్యములను ప్రదర్శించుదురు క్లిష్టమయిన కార్యముల నాచరించుటకుద్యమింతురు.

(4) సృజనతాయుతులయిన అనేక మంది బాలురు అతి కఠినమయిన విషయములను అవగాహన చేసికొనుటకు యత్నింతురు. కాని అధికారులు ఈ విద్యార్థులకు కఠినమయిన విషయములను బోధించుట అయుక్తమని నిలుపుదలచేయుదురు ఈ విధమయిన పరిస్థితుల యందు వీరి ప్రతిభ వ్యర్థమగుచున్నది.

(5) ఈ బాలురు తమకు తాముగా అభ్యసించుట కుద్యమింతురు. ప్రత్యేక తరగతుల యందు ప్రతిభావంతులుగా నేర్చుకొనుచుందురు.

(6) ప్రమాదకరమయిన కార్యకలాపముల నాచరించుటకుద్యమింతురు.

(7) ప్రయోజనకరమయిన కార్యముల నాచరించుటకుత్సహింతురు.

(8) ఈ బాలురు వివిధములయిన ప్రమాణములను, ఆదర్శములను, కలిగియుందురు. వీరు విపరీతమయిన భావములను కలిగియుందురు. వీరి ఆలోచనలు ధైర్య యుతముగా యుండును ఉన్నతమయిన స్థాయికి చెందిన ఆలోచనలు కలిగి యుందురు. తన భావముల యందు, ప్రమాణముల యందును దృఢమయిన సంకల్పములను గలిగియుందురు. సామాజికముగా అంగీకరించబడిన ప్రవర్తనను అధిగమించి వ్యవహరించుచుందురు. కనుక వారి వారి బృందముల ఆదర్శ ప్రమాణముల నుండి వీరి భావములు విభిన్నమయి యుండును. కనుక తమ సహాధ్యాయుల చేత వీరు నిరాకరింపబడుట వలన సంకటమగు సమస్యలను ఎదుర్కొనవలసివచ్చుచున్నది.

(9) ఈ బాలురు తాము గుర్తించిన విషయములకు సంబంధించిన ఆలోచనల యందు విరామము లేకుండుట వలన తాము చేపట్టిన కార్యములను నిలుపుదల చేయక సంపూర్ణముగా నిమగ్నులయి యుందురు. వీరు ప్రతిఫలము నపేక్షింపరు. తాము ఆచరించు కార్యమునందు తనమేధో శక్తి నంతయు కేంద్రీకరింతురు.

10) ఈ బాలురు తమ ప్రత్యేకమయిన ఉనికిని వ్యవస్థాపితము చేసుకొనుటకు అన్వేషణాత్మక మయిన కార్యకలాపములను కొనసాగింతురు. వీరు తమ వ్యక్తిత్వమును నిలుపు భావములను వదిలి సమాజము అందించు ప్రమాణములను గ్రుడ్డిగా అనుసరించుటకుత్సహింతురు. కనుక సమాజముయొక్క ఆదర్శము లనుతిరస్కరింతురు. అధికారులు చెప్పిన దానిని చెప్పిన విధమున అంగీకరించుట కుత్సహించరు. ఆయా సమస్యలను గురించి యధాతధమయిన వివరణలను సులభముగా వెనువెంటనే అంగీకరించరు. కనుక ఈ బాలురు అనుసారకులు గాజాలరు (11) విచికిత్సను గలిగి యుందురు. సృజనతా గుణముగల ఈ బాలుడు అధికముగా తన పరిసరములను గురించి తెలిసికొనుటకు జిజ్ఞాసను గలిగి యుండును. (12) స్వతంత్ర నిర్ణయమును గలిగియుండును. సంకట సమయముల యందు స్వతంత్రమయిన నిర్ణయము లను చేపట్టును. (13) ఆలోచనా స్వతంత్రత:- వివిధములయిన సమస్యలయందు స్వతంత్రమయిన ఆలోచనలను గలిగియుండును.

(14) పరిజ్ఞానము : తన సమస్యలయందు అపేక్షితమయిన పరిజ్ఞానమునుకలిగియుండును,

(15) సంకటములను ఎదుర్కొన గలిగిన శక్తి కలిగియుండును.

(16) దూరదృష్టి :- ఈ బాలురు భవిష్యత్సమస్యను గురించి దూరదృష్టి కలిగి యుందురు.

మనోవైజ్ఞానికమయన విచ్ఛేదము:- తరగతి యందు సృజనాత్మకమయిన బాలురు సామాన్య బాలురనుండి విభిన్నముగా గుర్తింపబడుటయనునది మూడు అంశముల వలన సంభవించు చున్నది. (1) ఈ సృజనతాగుణము గల బాలురు స్వల్పమయిన లేక ఉన్మాదముతో గూడిన భావములను ప్రదర్శించుచు తాము ప్రసిద్ధిని పొందవలయునని కోరుచుందురు. (11) అసాధారణమయిన భావములకు సంబంధించిన ప్రయోగముల వలన వీరి ప్రవర్తన

విశిష్టమయినదిగా గుర్తించబడు చున్నది ('11) వారు ప్రదర్శించు హాస్యము వలనను, వీరు ఆచరించు నిరంతరమయిన ఆటల వలనను వీరి గుణగణములు నిర్దేశింపబడు చున్నవి. ఈ విధముగా ప్రదర్శితమయిన గుణములు వారిని విభిన్నమయిన వారినిగను సృజనత గలవారినిగను గుర్తింప బడుచుండురు.

నిశితమయిన సృజనతాభావముగల ఒక బాలుని ఇతి వృత్తము:—

ఈ సృజనతాగుణముగల బాలుడు ముప్పదిమంది విద్యార్థులుగల తరగతియందు విచిత్రముగా ప్రవర్తించుచుండును. ఈ విద్యార్థి తన తోటి విద్యార్థులకు ఏ విధముగను అవగాహన కందనివాడుగా గుర్తింపబడు చుండును. కాని ఈ బాలుని ఒక ఇంటిని గురించి చిత్రమును గీయవలయునని ఆదేశించుట జరిగినదయినది. ఆ బాలుడు ఆ ఇంటిని తలుపులు కిటికీలు లేనిదానిగను, ఎత్తు తక్కువయిన ఇల్లుగను చిత్రించెను. ఈ బాలుడు తన ఆలోచనలయందు సిమగ్నుడగుటవలన తరగతియందు ఏది బోధించుచున్నదను విషయమును సహితము గుర్తించకుండగా యుండును. ఈ విధముగా ఆలోచనలను గలిగియుండుట వలన ఆ తరగతియందు ఏయది బోధింపబడు చున్నదో, దానిని తిరిగి వ్రాయుటకును చదువుటకును నిస్సహాయతను ప్రదర్శించు చుండును తరగతియందు ఈ విధముగా అసంగతమయిన పరిస్థితులను ఎదుర్కొనుచున్నను ఈ సృజనాత్మకుడయిన బాలుడు ఆయా శాస్త్రీయ సాంకేతిక విషయములయందు మిక్కుటమయిన సమాచారమును సంగ్రహించు చుండును. తను సేకరించిన విషయములను ఆయా సమస్యలను పరిష్కరించుటయందును, నూతన మయిన, అపూర్వమయిన భావనలను ఆలోచించుట యందును ప్రయోగ పరచు చుండును. ఈ బాలుని తరగతియందు ముప్పది మంది విద్యార్థులుగలరు. ఈ ముప్పదిమంది విద్యార్థులయందును పన్నెండు మంది విద్యార్థులు ఆ సృజనాత్మకశక్తివంతుడయిన బాలుని గురించి కేవలము ఏదానికిని ఉపయోగపడని పూజ్యముగా గుర్తింపబడుచున్న సున్నగా భావింతురు. 12మంది ఇతర బాలురు ఈ బాలునిగురించి అసభ్యకరమయిన ఉన్మాదకర మయిన భావములు గల వానినిగా ఎన్నిక చేయుచుండురు. ఏ ఒక్క సహృదయుడయిన ఆతని సహాధ్యాయుడయిన విద్యార్థియును ఆ బాలుని ఉత్కృష్టమయిన భావములుగల విద్యార్థిగా ఎన్నిక చేయుటకుత్సహించ రయితిరి. వాస్తవ రూపమున మాత్రము ఆ బాలుడు అతివిశిష్టమయిన సృజనాత్మకమైన భావనలుగల విదార్థిగా ఎన్నికచేసి గుర్తించుట అనివార్యమయిన విషయము.

ద్వితీయ పరిశీలన :-

ఆయా తరగతులయందు నిశితమయిన సంకల్పములను వ్యక్తము చేయుచున్న బాలుని ఎన్నికచేసి వేరుపరుప వలయును. ఈ విధముగ ఎన్నిక చేయబడిన బాలుని సాధారణమయిన నలుగురు బాలురను ఒకచో సమావేశపరచి 5 మంది విద్యార్థులుగల ఒక బృందముగా ఎన్నిక చేయవలయును. సృజనాత్మకమయిన ఆలోచనలుగల బృందమునందలి సభ్యులు పరస్పరము వ్యవహరించి స్పర్ధను పెంపొందించు కొను విధముగా సన్నివేశములను కల్పించి ఆ విధమయిన సన్నివేశములయందు ఈ బృందములు వ్యవహరించు విధముగా పరిస్థితులను కల్పించవలయును. ఆ విధమయిన సన్నివేశము

నందు ఆ బృందమునందలి సభ్యులగు బాలురు సృజనాత్మకమయిన ప్రవర్తనను నియమనము చేయుటకు యత్నింతురు. కాని సంకల్పయుతుడయిన ఆ బాలుడు ఆ విధమయిన వత్తిడులను ఎదుర్కొనుటకు ప్రయత్నించుట సంభవించుచున్నది ఈ విధమయిన పరిశీలనవలన సృజనాత్మకగుణాన్వితుడయిన ఆ బాలుని ప్రవర్తనయే ఆతని అనేకవిచారములకు కారణమగుచున్నది అను విషయము విదితమగుచున్నది. సంకల్పయుతులయిన కొందరు బాలురు ఇతర సామాన్య బాలురతో సహకరించుటకు సహితము అంగీకరించరు. కాని ఈ విధమయిన సృజనాత్మక గుణయుతులయిన బాలురు పై తరగతులయందు కొనసాగుచున్న సమయముల యందు తన ప్రతిభను బాహ్యముగా ప్రదర్శించి నాయకత్వమును వహించుటకు యత్నింతురు. తుదకు 4 5. తరగతులయందు సంపూర్ణమయిన నాయకత్వమును ప్రదర్శించుదురు.

సృజనత నిగ్రహాత :- సృజనతాగుణములుగల బాలుర యందు కొందరు పై నుదహరించిన క్రమమునననుసరించి వారియందలి వ్యక్తమగుచున్న సృజనాత్మకమయిన అవసరములను నిగ్రహించుట వలనను, సృజనాత్మకమయిన కార్యకలాపములను వదలుట వలనను తమయందు నిబిడితమయియున్న సృజనతాగుణములను పరిత్యజించుట జరుగుచున్నది. కొందరు బాలురు లేప్రాయముననే శిశుపాలన కేంద్రముల యందున్న దశయందే ఈ సృజనతా గుణమును వదలుట సంభవించుచున్నది.

దోషయుతమయిన లేక అనిశ్చితమయిన ఆత్మభావన :- ఈ విధముగా సృజనతాగుణమును పరిత్యజించిన బాలుడు తుదకు అధికారుల చేతను సమాజము చేతను నిర్దేశింపబడిన నిర్ణయములను అనుసరించి నిర్ణీతమయిన భావములను గలిగియుండును. నిర్ణీతమయిన భావములను గలిగియుండుట అనగా సృజనతాశక్తిని కోల్పోవుటయని అంగీకరించవలయును. అతి వినయవంతుడుగా తయారగుచుండును. ఈ ఈ విధమయిన బాలుడు తనయందు కలుగుచున్న ఆలోచనలయందు విశ్వాసము లేకుండగనే పెరిగినవాడగుచుండును. స్వీయ భావనల యందు సహితము ఏ విధమయిన నిర్ణయము లేకుండగనే యుండును ఆయా సమస్యలను పరిష్కరించుటయందు తీసుకొనవలసిన నిర్ణయముల కొరకు అధికముగా ఇతరులయందు ఆధారపడి యుండును. సర్వసాధారణముగనే ఏ బాలుడయినను ఆయా అంశములను ప్రయోగించుటవలన పరిశోధన చేయుటవలన తనశక్తి సామర్థ్యములను అవగాహన చేసికొనగలిగి యుండును. బాలురకు ఏ అంశములను పరిశీలించ కుండగనే యథాక్రమమున సులభమయిన సుఖదమయిన క్రమమున ప్రయోగములను జరుపుటకు అవకాశమును సమకూర్చవలయును. ఆయా వివిధ విషయములయందు ఆయా ప్రయోగములను అమలు పరచిన క్రమముననే బాలురయందు "నేను" అను ఆత్మభావన పెంపొందుటకు అవకాశము లుండును. ఆచరణరూపమున ప్రయోగములనములు జరపని బాలుడు వాస్తవిక రూపమున ఈ ఆత్మ భావనను పెంపొందించుటయందు విఫలుడగుచున్నాడు :-

అభ్యాస విషయకమయిన అసామర్థ్యము : ఏ బాలుడు తమయందలి సృజనాత్మకమయిన గుణమును నిగ్రహించుకొనుచుండనో, ఆ బాలుడు ఆయా పాఠ్యాంశములను అభ్యసించుట

యందు సామర్థ్యమునుకుంఠితమయిన దానినిగా
తయారు చేయుచుండును. ఫలితము. పాఠ్యాం
శములను అవగాహన చేసికొనుటకు అశక్తుడ
గుట అని వివరించవలయును. సృజనాత్మక
మయిన ఆ బాలుని యందలి ప్రవృత్తి ఆయా
వివిధమయిన అంశములను ప్రశ్నించుటవలన,
ఊహించుటవలన, పరిశోధన జరుపుటవలన,
ప్రయోగములనమలుపరచుటవలనను నిగ్రహరచు
చుందురు. దీని ఫలితము కేవలము ఉపాధ్యా
యుడు బోధించు విషయముల నభ్యసించుట
కును, తెలిసికొనుటకును మాత్రముఅలవడుచుం
డును. కొందరు బాలురుసృజనాత్మకముగాఅభ్య
సించుటకు గల అవకాశము నిరాకరింపబడినయె
డల పర్యవసానముగా ఆ బాలురు ఆయా విష
యములను అభ్యసించుట యందు గల ఆసక్తిని
సహితము కోల్పోయిన వారగుచున్నారు. అటు
పై పర్యవసానముగా ఉపాధ్యాయుడు తరగతి
యందు బోధించు దానిని సహితమువినుటకును
తిరస్కరింతురు.

ప్రవర్తనా విషయక సమస్యలు : ప్రాథమిక తరగతుల యందు ప్రజ్ఞావంతుల
యిన బాలుర కన్నను నిశితమయిన సృజనతా
గుణమును గలిగియున్న ఈ బాలుడు ఉపద్రవ
ముగా వ్యవహరించునటుల కనిపించుచుండును.
పర్యవసానము తరగతి యందున్న అనేక మంది
బాలురు పలువిధములుగా ఈ సృజనాత్మకుడ
యిన బాలుని పరిగణించుచుందురు. ఈ కారణ
ములవలన ఆతని యందలి సద్భావములను సహా
ధ్యాయుడయిన ఏ ఒక విద్యార్థియును గుర్తిం
చుటకుత్సహించకుండుట సంభవించుచున్నది.
ఈ విధమయిన సృజనతాగుణ సంపన్నుడయిన
బాలుడు తీవ్రమయిన వివసంవాదములను ఎదు
ర్కొనుచుండును. ఈ విధముగా క్లిష్టమయిన
సమస్యల నెదుర్కొనుచు నిరుత్సాహమునందిన
వాడయి నిర్వేదము నంది తుదకు మానసిక
రుగ్మతకు గురియగుట సంభవించుచున్నది.

సృజనతాగుణసంపన్నుడయిన ఈ బాలుడు
ప్రవర్తనకు సంబంధించిన సమస్యలవలన తన
ఆలోచనల యందు ప్రధానమయిన రెండు
లోటుపాటులను గలిగియుండును ప్రథమముగా
ఈ బాలుడు అసముచితమయిన రీతిని తన ఆలో
చనలను కొనసాగించుచుండును. పర్యవసానము
ఆ బాలుడు పొందు అనుభవము సుసంపన్న
ముగా నుండదు, ఆ విధముగా బాలుని అను
భవము సహితముకుంఠితమగుటవలన ఆయావిష
యములను అవగాహన చేసికొనుట యందు
విఫలత నొందుచున్నాడు. ముఖ్యముగా పాఠ
శాల యందలి పాఠ్య ప్రణాళిక సహితము
సృజనతాగుణయుతుడయిన బాలునకు స్పర్ధను
గలిగించు కృత్యమును కల్పించుట యందు
అపర్యాప్త మగుచున్నదనియే వివరించవల
యును. పాఠశాల యందలి పాఠ్య ప్రణాళిక
సహితము స్పర్ధరహితమయిన విసగట కలిగించు
నటువంటియు పునరావృతమయిన కార్యములను
కల్పించుటవలన ఆ బాలుని యందు ప్రతి
క్రియగా దుష్ప్రవర్తన గలిగించుట కవకాశ
మును చేకూర్చుచున్నది. బాలుని యందు
వేలూనికొనిన ఈ దుష్ప్రవర్తన బాలుని
యందలి సృజనతాగుణమును అపగతము
చేయుటయందు కారణమగుచు బాలునియందలి
శక్తిని కుంఠితముచేయ కలుగునా? ఈ విధ
ముగా కుంఠితమయిన శక్తి ఆ బాలునియందలి
సృజనతాగుణమును నిర్వీర్యము చేయుచున్న
దియా?. ఏది ఏమయినను బాలునియందు
అభివ్యక్తమగుచున్న సృజనతాగుణము నిర్వీర్య
మయినదగుచు ఆ బాలునకు ఆవేదనలను

గలిగించు ఆదేశములను కలిగించుట మాత్రము తథ్యము. ఈ విధములయిన పరిస్థితులయందు ఈ బాలుడు కొన్ని మార్గదర్శక సూత్రములను అపేక్షించును:-

నరముల లేక వసన, శిరలవైకల్యత:- సృజనాత్మకమయిన అవసరములు బలీయమయిన వయినను ఈ అవసరములను నిగ్రహపరచుట తీవ్ర రూపము దాల్చియున్నను లేక చిరకాలము కొనసాగినను, ఆవ్యక్తియందు గలుగుచున్న ఆవేదనలు పైకి వెల్లుబుకుట సహజము. పర్యవసానము మానసికరుగ్మతలకు ఆ బాలుడు బలియగుట అనివార్యమగుచున్నదని గుర్తించవలయును. ఈ మానసిక వ్యవస్థితియొక్క సామాన్య వ్యవస్థితి యనునది ఆ బాలుని యొక్క ఆలోచనలయందు జాడ్యమును గలిగియుండుట లేక పరిశీలన లేకుండగా ఆలోచించుట లేక తిరిగితిరిగి ఊహించుచుండుట అని వివరించవలయును.

మానసికరుగ్మతను, సృజనాత్మక ప్రవృత్తిని విభిన్నము చేయుట అనునది అతి సున్నితమయిన విషయము. సమాజము ఈ సృజనాత్మక ప్రవృత్తిగల బాలుని గుర్తించి వ్యవహరించు విపర్యయ క్రమము వలననే ఆ బాలుడు తనయందు స్థానము చేసికొన్న మానసికరుగ్మతలకు సంబంధించిన దోషములను పెంపొందించుకొను చుండును. ఉదాహరణ :- నిశితమయిన సృజనాత్మక ప్రవృత్తిగల బాలుడు తన ఉత్కృష్టమయిన ఆలోచనవలన, ఆచరణ వలనను ఇతరులను బెదరించువాడుగా యుండును. వాస్తవిక స్థితియందు మాత్రము అతను అత్యధికమయిన ఉపద్రవమును ఎదుర్కొనుచుండును. వాస్తవిక మయిన ఆతని ప్రతిక్రియలు మాత్రము మానసికరుగ్మత గల వ్యక్తియొక్క ప్రవర్తన చేష్టలను పోలి యుండును. ఏ చేష్టలు పరావృత్తమయిన విగను లేక మానసికరుగ్మతా చిహ్నములుగను నిర్ణయింపబడు చుండునో ఆక్రమముననే తన సృజనాత్మక చర్యలను అమలు పరచుకొనుటకు ఆ బాలుడు ప్రవర్తించుచుండును. సమాజము, దాని పరిస్థితులు, పరిసరములనుండి విడివడి దూరముగా యుండుచుయున్న శాస్త్రవేత్తలు కొందరు ఈ సామాజిక మయిన వ్యాకులతలనుండి దూరగతమయిన వారగుట వలననే తాముచేపట్టిన సమస్యలయందు తమ అవధానమును కేంద్రీకరించుటకు శక్తివంతులగుటవలన చరిత్ర ప్రసిద్ధమయిన నూతన అంశములను కనుగొనకలుగుచున్నారు.

ముఖమోటముగల అతిసున్నితమయిన భావములు గల కవి తనను గురించి సమాజము ప్రదర్శించిన పరిహాసములను నిరాదరణలను తన పద్యకదంబముల యందు కమనీయమయిన గాథలునుగా మార్పుచేసి సుకుమార సౌందర్య సుమముల సువాసనలతో సుస్వాగతమునందించి ఆనంద రసానుభూతిని పొందుట సర్వజనీనము విశ్వజనాదరమయిన అంశము. సృజనాత్మకులయిన వ్యక్తులు తమతమ లక్ష్యనిర్దిష్ట మయిన అంశములతో సమన్వయత నొందుట యందు ఏకాల్పనికమయిన చోద్యములను పగటి కలలను ప్రయోగించియుండిరి ఆ అంశములనే తమ తమ మానసిక ఆదేశములకు మూలాధారముగా ఉపయోగించుచుందురు. ఈ సృజనతాగుణ సమన్వితగల బాలురయొక్క ప్రవర్తనలు వాస్తవిక రూపమున మానసికరుగ్మతగల వ్యక్తుల ప్రవర్తనలనుండి విభిన్నమగుచునే యుండును.

సృజనాత్మకభావ ప్రతిపాదన, నిగ్రహముల మధ్య చెలరేగిన విసంవాదములను పరిష్కరిం

చుట కష్టతరమయినను, ఆ విసంవాదముల నెదుర్కొని పరిష్కరించుటకుచేయు ప్రయత్నములయందు కొన్ని వ్యూహరచనలను చేయుట ఎంతయు సముచితము ;-

i సృజనాత్మకుడయిన బాలుడు తన భావములను ఇతర బాలుర భావముల కనుగుణముగా మార్పుచేయుట. ఈ బాలుడు చేయు ఉపకృతిని తనతోటి సహాధ్యాయులయిన విద్యార్థులు తమ తమ ప్రయోజనములకు ఉపకరణములుగా యుండునని తలచు విధముగా అనుకరణము చేయుచు ప్రయత్నించవలయును.

(ii) సృజనాత్మకుడయిన బాలుడు చేయు విమర్శ ఇతర బాలురకు అనుకూలమయిన నిర్మాణాత్మకమయిన విధముగా యుండవలయునని తలచవలయును.

(iii) తను సభ్యుడుగాయున్న బృందముల యందలి ఆదర్శముల కనుగుణముగనే వ్యవహరించుచు ప్రత్యక్షముగనే తన ఆశయములను ప్రదర్శించుచు వ్యవహరించవలయును.

(iv) తన వలన వ్యక్తిగతమయిన బెదిరింపులు తన సహాధ్యాయుల క్షేమమాత్రమును సంభవించవనియును తనువారిని గౌరవించుచున్నాననియును తన సహాధ్యాయులు భావించునటులగా వ్యవహరించవలయును.

(v) తత్కాలీనమయిన అవసరములను, ఆదేశములను అమలుపరచుట వలన సమాజమునందు తగువిధముగా గుర్తింపు గలిగియుండుటకు యత్నించవలయుమ.

(vi) ఆయా వ్యక్తులను స్థానములను గురించి తన ప్రయత్నముల నమలు జరుపట కాకుండగా విధినిర్వహణలో తన కర్తవ్యాంశములను గురించి తన ప్రయత్నముల నమలు జరుపవలయును.

(vii) తన సహాధ్యాయులు గుర్తించరాని విధముగా తన ప్రతిభలను మరగుపరచి తగు విధముగా ఆయాకృత్యముల నాచరించవలయును.

(సశేషము)

---

# విలాక్షణిక రాగ సౌందర్యం

గుమ్మనూరు రమేష్‌బాబు

విరిజల్లులో
పులకరించడమే కాదు
నా హృదికి తెలిసింది -
వడగళ్లలో సైతం
పరవసించడం కూడ.
చిరుగాలిలో
మేనుమరవడమే కాదు
నా మదికి తెలిసింది -
సుడిగాలిలో సైతం
ఎదురొడ్డి నిలబడడంకూడ.
అందుకే
నామటుకు నాకు...
జీవితం-
ఓ స్థితప్రజ్ఞైక భావమాధుర్యం
విజ్ఞతాయుత విలాక్షణిక రాగ
సౌందర్యం.

# జీవన స్మృతులు

రచన : రాధిక

జీవితమంతా
విరిసిన పూదోటాకాదు
వెన్నెల పంటాకాదు
రతనాల రాజబాటాకాదు

ఎన్నెన్నో నిమ్నోన్నతాలు
ఎన్నెన్నో వెలుగునీడలు
వీటిమధ్య జీవితం
వడబోసిన వేదాంతసారం

కన్నకలలన్నీ
అనుభవాల ప్రతిరూపాలు కాలేవు
కొన్నైనా గతంలోని
తీయని వలపుస్మృతులై మిగిలిపోనీ

శేషజీవితాన అవి
వెలుగు రేఖలై నిలచిపోనీ.
కన్నతల్లి తనపాప
ముద్దుమురిపాలతో
మురిసి పోనీ

పువ్వులా విరిసిన
ఆ చిన్ని గులాబినవ్వు
అంతరంగాన నిండిపోనీ

సాంద్రతీరాన సాయం సంధ్యలు
జ్ఞాపకాల కెరటాలై
నాలోని వుద్వేగంకడలై పొంగి
మిన్నంటాలని విరిసిపడే
వడిలో- నేనోడిపోయాను

ఈ జీవన నావ అనంతపయనం
ఏ తీరం చేరాలనో
తన గుండెలోపాట
ఏగొంతులో పలికించాలనో
రాగరాగిణీ మధురిమలన్నీ
నింపుకున్న - నిరీక్షణ
అంతం యింకెన్నాళ్ళో ?

# ఆంధ్ర శబ్ద చింతామణి నన్నయ కృతమా?

డాక్టర్ కోర్లపాటి శ్రీరామమూర్తి, ఎం.ఏ., పిహెచ్., డి లిట్

ఆంధ్రశబ్ద చింతామణి నన్నయకృతమని ఒక అభిప్రాయము కలదు. నన్నయకృతము కాదని మరొక అభిప్రాయము కలదు. ఇదొక ఉత్థిత సమస్య. అసలు నన్నయకృతము కాదని ప్రథమతః కందుకూరి వీరేశలింగముగారి ప్రతిపాదనము. తదుపరి నన్నయకృతమని వజ్ఝల చినసీతారామ శాస్త్రిగారి ప్రతివాదనము. కనుక పరిశీలనావశ్యకము కలదు.

1. 'కేతన ఆంధ్ర భాషాభూషణమునందు "మున్ను తెలుఁగునకు లక్షణ మెన్నఁడు నెవ్వరును జెప్ప"రని కలదు.[1] కనుక నన్నయకృతముకాదు. గణపవరపు వెంకటకవి ఆంధ్రకౌముదియందును అట్లుకలదు.[2] కనుక నన్నయకృతము.'

కేతన ఆంధ్ర భాషాభూషణమునందు "సంస్కృత ప్రాకృతాది లక్షణముఁజెప్పి తెలుగుఁనకు లక్షణముఁ జెప్పకునికి" అని ఉండగా, గణపవరపు వేంకటకవి ఆంధ్ర కౌముదియందు "సంస్కృతమునకును బ్రాకృతమునకుఁగల లక్షణములు చెప్పి తెనుఁగున కావిధంబున లక్షణంబు చేయరాకున్కి" అని కలదు. అంతే కాదు. "కుకవిజనాజ్ఞాన ఘోరాంధతమ సముఁబోఁగొట్టఁగల్గు కౌముది విధమున నిటమున్ను తెనుఁగున నెవ్వారెఱుంగని యాంధ్రకౌముదియను నట్టి కృతిని సీసమాలికగాఁగఁజేసెద—" అనికూడ ఆంధ్రకౌముదియందు కలదు. ఇందు మొదటి పంక్తిలోని "ఆవిధంబున" అను ఉపక్రమణమునకు రెండవ పంక్తిలోని "కౌముది విధంబున" అను వివరణము ఉపసంహారము. అనగా గణపవరపు వేంకటకవికి పూర్వము తెలుగునకు లక్షణము ప్రక్రియాకౌముదివలె, సిద్ధాంతకౌముదివలె లేదని మాత్రమే అర్థము, లేనిమాట. యథార్థము. కనుక గణపవరపు వేంకటకవి ప్రతిపాదనము యథార్థము. అట్లు కేతన ప్రతిపాదనమును యథార్థము. అనగా కేతనకు పూర్వము తెలుగునకు లక్షణగ్రంథము అనగా వ్యాకరణ గ్రంథము లేదని అర్థము. అంతే కాదు. "ఏఁజెప్పెద విద్వన్నికరము మదిమెచ్చఁగ నన్నయ భట్టాది కవిజనంబుల కరుణన్" అని కూడ ఆ పద్యమునందే నన్నయను స్మరించిన కేతన, నన్నయ నిజముగ ఆంధ్రశబ్ద చింతామణి రచించిన, తెలుగునకు లక్షణము ఎవ్వరును చెప్పరనుట సంగతము కాదు. కాఁబట్టి పదమూడవ శతాబ్ది కేతన ప్రతిపాదనమునుబట్టి ఆంధ్రశబ్దచింతామణి అర్వాచీన గ్రంథమగుట అపరిహార్యము.

2. 'ఆంధ్రశబ్ద చింతామణి నన్నయకృతమని బాలసరస్వతి, అప్పకవి చెప్పిన కథలు కట్టుకథలు[3] కనుక నన్నయకృతముకాదు. "చింతామణి హఠాత్తుగ బాలసరస్వతికి లభించుటచేత, ప్రాచీనుల అలవాటుచొప్పున సిద్ధుని కల్పనమును చేసి యుండ వచ్చును.[4]" కనుక నన్నయకృతము.'

ఆంధ్రశబ్ద చింతామణి "విద్యానగరిలో నచింత్య కారణోపాగమ స్నేహ సాహచర్యుండగు శివయోగి

వచ్చుచే దేవచోదనం బరిప్రాప్తమైన"దని, "పెక్కు వత్సరము లంతర్భూతమై యున్న" దానిని "సిద్ధుడు" ఇచ్చెనని బాలసరస్వతి రచనము. తన ఛందోగ్రంథమును అణచివేయుటకు నన్నయ ఆంధ్ర శబ్ద చింతామణిని రచించెనని భీమన దానిని అణచి వేయగా, రాజరాజనరేంద్రుని తనూజుడైన సారంగ ధరుడు శైశవమున నన్నయ రచించునెడ పఠించి తండ్రి ఆనతిని కరచరణ ఖండితుడై, మత్స్యేంద్రుని సంగతిని మరల కరచరణమండితుడై, సిద్ధుడై, మతంగగిరికడ కీలకనామ సంవత్సరమున బాల సరస్వతికి ఇచ్చెనని అప్పకవి గ్రథనము. అంతే కాదు. అది మతంగనివాసి తనకును ఇచ్చెనని అప్ప కవి అనుపల్లవి. శివయోగి వర్యులైన సిద్ధుల కథలు నవనాథచరిత్రమున కలవు. ఉపలబ్ధము కాని శ్రీగిరి పద్యకావ్యము సంగతి ఊహ్యము. ఉపలబ్ధమైన గౌరవ ద్విపదకావ్యమున మత్స్యేంద్రనాథుని కథ కలదు. అందు సారంగధరుని కథయును కలదు. అది మాళవ దేశమున జరిగినకథ. ఆంధ్రదేశమున జరిగినట్లు జనశ్రుతి. అది బాలసరస్వతి సూత్ర ప్రాయముగను. అప్పకవి భాష్యప్రాయముగను ఆంధ్రశబ్ద చింతామణికి లగించుట జరిగినది. అందు కును, ఆంధ్రశబ్దచింతామణి హఠాత్తుగ లభించుటకును కార్యకారణ సంబంధము కానరాదు. అంతేకాదు. గ్రంథప్రాప్తి విషయమున సిద్ధుని కల్పనము బాల సరస్వతికి పూర్వము, తర్వాతను మృగ్యము గనుక అది ప్రాచీనుల అలవాటుకాదు. అంతేకాదు. మాళవ దేశ కథలోని సారంగధరుడు ఆంధ్రదేశ చరిత్ర లోని రాజరాజ నరేంద్రుని తనూజుడై ఆంధ్రశబ్ద చింతామణిని పఠించుట ఎంత అసందర్భమో, భీమన అణచివేయుట వలన ఆంధ్రశబ్ద చింతామణి అయిదారు వందల సంవత్సరములు అజ్ఞాతవాసము చేయుట అంత అసంగతము. నన్నయ రచించిన ఆంధ్రశబ్ద చింతామణి పెక్కువత్సరములు అంతర్భూతమగుట, అది సిద్ధుడు బాలసరస్వతికి అందిచ్చుటకూడ అంత కంటె అసంభావ్యము. నన్నయకు సంబంధించిన రాజరాజనరేంద్రునికి రత్నాంగి, చిత్రాంగి అను భార్యలు, సారంగధరుడను తనూజుడు వేరు. రాజ మహేంద్రవరములోని రత్నాంగిమేడ, చిత్రాంగి మేడ, సారంగధరుని మెట్ట కల్పితములు. కనుక అప్పకవి కథ అభూతకల్పన. బాలసరస్వతి కథ అద్భుత కల్పన. పదునాల్గవ శతాబ్ది శ్రీగిరి, లేక పదునైదవ శతాబ్ది గౌరన రచించిన నవనాథచరిత్ర పదునారవ శతాబ్ది బాలసరస్వతి కథకు స్ఫోరకము. పదునేడవ శతాబ్ది అప్పకవి కథకు ప్రేరకము. అనగా ఆంధ్రశబ్ద చింతామణి నన్నయకృతమగుట కథార్థముకాని, యథార్థము కాదని పరమార్థము

అప్పకవి కథార్థమునందు ఒక యథార్థము కలదు.

"ఆదిని శబ్దశాసన మహాకవి చెప్పిన భారతంబుల్
నేది వచింపఁగాఁబడియె నెందును దానిసెకాని
సూత్రసం
పాదన లేమిచేఁ దెనుఁగు పల్కు మఱొక్కటిఁ
గూర్చి చెప్పఁగా
రాదని దక్షవాటి కవి రాక్షసుఁడీ నియమంబుఁ
జేసినన్. 46.

ఆ మూఁడు పర్వములలో
నా మాన్యుఁడు నుడువు తెలుఁగు లరసికొని
కృతుల్
దాము రచించిరి తిక్కన
ధీమణి మొదలైన తొంటి తెనుఁగు
కవీంద్రుల్." 47.

ఇది అప్పకవి కథలోని ఇతోధిక విశేషము. ఇందు కవిరాక్షసుడు కల్పిత పురుషుడు కాడు. కవి రాక్షసీయమను గ్రంథము కలదు. అది ముద్రితము. "కవి రాక్షస మహాకవి నా ప్రణీతకు కవిరాక్షస నామం" అని అంతర్ముఖ పత్రమున కలదు. అది సంస్కృత గ్రంథము. శతశ్లోకి. "కవిరాక్షసుని భాషఁ గాళిదాసు" అని జక్కన విక్రమార్క

చరిత్రమున సంస్కృతి ఒ విస్తృతి యందు ఒలదు (11ప. 1ఆ.) కనుక సంస్కృతకవి. అంతేకాదు. అప్పకవికి పూర్వము కల సంస్కృతాంధ్ర లక్షణ గ్రంథములందు కవిరాక్షసీయము ఒలదనిఅప్పకవియే అందిచ్చిన సమాచారము (5వ చ. 1ఆ.) ఉపరి, కస్తూరి రంగకవి ఆనందరంగరాట్ఛందమున కవి రాక్షసీయమను లక్షణ గ్రంథము నుండి పద్యములు ఉదాహరింపబడినవి. కనుక ఆంధ్రకవి కూడ. అతడు పయి అప్పకవి పద్యములను బట్టి నన్నయ, తిక్కనల నడుమ కాలమువాడు. ఆ కాలమున సూత్ర సంపాదనము అనగా తెలుగు వ్యాకరణము లేక పోవుట వలన కవిరాక్షసుడు ఒక నియమము చేయుట జరిగినది అందుకు హేతువు ఆంధ్రశబ్ద చింతామణిని భీమన అణచివేయుట అని అప్పకవి కథ. భీమన అన వేములవాడ భీమకవి అతడు, నన్నయ సమ కాలికులు కారు. కనుక భీమకవి రాఘవ పాండవీయ మును నన్నయ అణచివేయుట, నన్నయ ఆంధ్ర శబ్ద చింతామణిని భీమన అణచివేయుట అభూత కల్పన. అది కథార్థము అందు కవిరాక్షసుని కాల మున ఆంధ్రశబ్ద చింతామణి అసలు లేకపోవుట యథార్థము అనగా ఆంధ్రశబ్ద చింతామణి అర్వా చీన గ్రంథమని అవగాహకము.

3 'అప్పకవీయములోని శబ్దాను శాసన మూల సూత్రమున "నుమ్యోచ్చతోహల్య ధర్వణార్యమతాత్" అని కలదు [5] కనుక నన్నయ కృతము కాదు. బాల సరస్వతీయమున 'హల్యధర్వణార్యమతాత్' అను పంక్తి లేదు.[6] కనుక నన్నయ కృతము.

అప్పకవీయములోని చింతామణి శ్లోకమిది:

"ప్రథమా వైభక్తిక మోర్ధుక్ పూర్ణోవా
ప్రతిక్రియార్థేతు
తస్య సమాసే పుంపూ నుమ్యోచ్చతోహల్యధర్వణార్య
స్మతాత్." 13 శ్లో. 5 ఆ.

ఇందు ప్రథమావిభక్తి ముపర్ణమునకు లోపము, పూర్ణ బిందు ప్రాప్తి, పుంప్వాదేశము, నుమాగ మము క్రమబద్ధము. ఇక,

బాల సరస్వతీయములోని చింతామణి శ్లోకమిది:

"నుమ్యోచ్చతః పరుషాణాం గసడదవాస్స్యుః
పదాద్ద్వన్ద్వే
సామాన్యాధి కరణ్యేషూదన్తానాం
టుగాగ మోఽచి స్యాత్."

ఇందు "నుమ్యోచ్చతః" అను సూత్రము నుమా గమ విషయము "పరుషాణాం...పదాద్ద్వన్ద్వే "అను సూత్రము గసడదవాదేశ విషయము "సామా న్యాధి కరణేషు ... స్యాత్" అను సూత్రము టుగాగమ విషయము నుమాగమ, టుగాగమ సూత్రముల మధ్య గసడదవాదేశ సూత్రము సమాస విషయమైనను సందర్భశుద్ధము కాదు. అంతే కాదు. "గసడదవాస్స్యుః ప్రథమామాత్రాత్" అను గసడ దవాదేశ సూత్రము బాల సరస్వతీయమున ముందే కలదు అది నిత్యవిధి అందు వలన ద్వంద్వసమా సములందును గసడదవా దేశము విధాయకము కనుక "పరుషాణామ్...పదాద్ద్వన్ద్వే" అను సూత్రము పునరుక్తభూతము. ఉపరి, ఆ సూత్రము హేమోక్తి అని అప్పకవీయ శబ్దాను శాసన మూల సూత్రమున కలదు. ఆ శ్లోకమిది:

"ప్రథమలు గపి ద్విమలోప్యర్ధుశ్రితస్య సర్వత్ర
లుక్సమాసేషు
హేమోక్తేః పరుషాణాం గసడదవాస్స్యుః
పదాద్ద్వన్ద్వే." 17 శ్లో. 5 ఆ.

అప్పకవికి పూర్వము సంస్కృతాంధ్ర భాషలకు గల లక్షణ గ్రంథము లందు హేమచంద్ర ఫక్కిక కలదని అప్పకవియే అందిచ్చిన సమాచారము. (5వచ. 1ఆ.) అనగా హేమోక్తి (168 ప. 5ఆ.) హేమచంద్ర ఫక్కికలోని సూత్రమని అర్థము.

అది నెడు అనుపపన్నము. అంత మాత్రమున హోమచంద్ర పక్కిక అసలు లేవనుట అతి సాహసము. కనుక "పదసంజ్ఞానామ్...పదాద్యన్ద్వే" అను సూత్రము ఆంధ్ర శబ్ద చింతామణి సూత్రము కాక హోమచంద్ర పక్కిక సూత్రమగును. అయిన అంధ్ర శబ్ద చింతామణి అధర్వణ కారికావళి కంటె అనంతర గ్రంథము కాదుగాని, హోమచంద్ర పక్కిక కంటె అర్వాచీన గ్రంథమగును. హోమచంద్ర పక్కిక ఆంధ్ర భాషా భూషణము కంటె అర్వాచీన గ్రంథము అనగా ఆంధ్ర శబ్ద చింతామణి అర్వాచీన గ్రంథమగుట అనివార్యము.

4. 'భారతమును బట్టి పదాదియందు యకారము లేదని నన్నయ భట్టు మతము ఆంధ్ర శబ్ద చింతామణి యందు "అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః" అను సూత్రమున పదాదిని యకారమున్నట్లు కలదు.[7] కనుక నన్నయ కృతము కాదు. యేఁబది, వోయెన్ మున్నగు చోటులందు యాఁబది, వోయన్ మున్నగు నుచ్చారణములు వ్యవహారమున సంభవించును. కావుననే యట్టి చోటులందు సాధ్వసాధుతా నిర్ణయము చేయుటకయియే "అద్యః క్రియాసు...వినాసర్వః" అను సూత్రము పదేశింపఁ బడినది[8]. కనుక నన్నయకృతము."

వ్యవహారమున సంభవించు ఉచ్చారణములను బట్టి శబ్దముల సాధుత్వా సాధుత్వములు నిర్ణయము చేయుట ఆంధ్ర శబ్ద చింతామణి ఆశయమైన, వుపూవో వోల సాధుత్వాసాధుత్వములను నిర్ణయము చేయవలయును. ఆంధ్ర శబ్ద చింతామణి అట్టి నిర్ణయముచేయ లేదు అంతేకాదు పథౌరంథవశతాబ్ది శాసన లేఖనములందును "యేంబది, యెంబదియు, ఇన్వ యెడ్లు, యేనాటికి" అను సుష్టురూపములు కలవు.[9] లేఖకుల ఉచ్చారణ వ్యవహారము లందు లేవి 'యాఁబది' మొదలైన భ్రష్టరూపములు.. కన్నల ఉచ్చారణ వ్యవహారములందు ఉండునని ఆకారణమున సూత్రించన చేయుట ప్రసంగతము కాదు. అంతే కాదు. ఉచ్చారణ వ్యవహారములోని భ్రష్టరూపములను ఉద్ధరించుట కంటె, కావ్య ప్రయోగముల సాధుత్వా సాధుత్వ నిర్ణయము చేయుట వ్యాకరణ శాస్త్రమునకు ప్రధాన విషయము. కనుక 'యాఁబది, వోయన్' మున్నగు అపశబ్దములు కావ్యప్రయుక్తములైనపుడు మాత్రమే అసాధు రూప నివారణము, సుసాధురూప నిరూపణము చేయుట వ్యాకరణ శాస్త్రమునకు ఆవశ్యకము అట్టి అపశబ్ద ప్రయోగములు అర్వాచీన కావ్యములందు మాత్రమే అవకాశము. పదునారవ శతాబ్ది బైచరాజు వేంకటనాథుని పంచతంత్రమున అట్టి ప్రయోగములు కలవు.

"అయ్యేటన్ సలిలంబులాడఁగఁదటన్యస్తాంఘ్రి నాళూద్ధతం
బయ్యో నీపుతు గ్రద్ద దన్నుకొని వోయన్
భీతి వాపోవంఁగన్ " 780 ప. 1 ఆ.

"శన్మయ్యం జాలక నిద్రగాచి యిపుడే మో
కూర్కిలి న్మాడుజా
యియ్యె న్నాలవ జాముఁజొచ్చెఁ దడవాయన్వచ్చి
విచ్చేయునీ " 258 ప. 4 ఆ.

ఇందు 'వోయన్', 'ఆయన' అను రూపములు యతిమైత్రిఘటితముగ ప్రయుక్తములయినవి. కనుక నిర్ధారక ప్రయోగములు. ఇట్టి ప్రయోగములను బట్టి, అట్టి సూత్రమును కల్పించుట ఆవశ్యకము. అనగా ఆంధ్రశబ్ద చింతామణి అర్వాచీన గ్రంథమగుట అప్రదృష్యము.

5. ఆంధ్రశబ్ద చింతామణిలోని "సర్వత్రాజ్యాత్కార్యం జ్ఞేయం యస్య ద్రుత ప్రకృతికేభ్యః" అను సూత్రమున ద్రుత ప్రకృతికములకంటే పరమైన యకారమునకు అంతట అచ్చువలె కార్యమగునని కలదు, అది భారత ప్రయోగములకు విరుద్ధము.[10]

కనుక నన్నయ కృతముకాదు. అది భారత ప్రయోగములకెట్లు విరోధించునో తెలియకున్నది...... భారత ప్రయోగములకు విరోధించునపుడు మఱి ఏ గ్రంథమునకు విరోధింపకుండును?"[11] - కనుక నన్నయకృతము.

"సర్వత్రాజ్వత్కార్యంజ్ఞేయం యస్య ద్రుత
ప్రకృతికేభ్యః
లుక్సంశ్లేషౌనాచి ద్రుతస్య సర్వత్ర లుక్స
మాసేషు"

అను శ్లోకమునకు

"ద్రుతప్రకృతికముల మీఁద నుండెడు యకారమునకు అంతటను అచ్చునకు వలెను వచ్చెడు కార్యము తెలియఁదగినది లుక్సంశ్లేషములు లేవనుట కలిగె. నకారలోపమును దత్సంశ్లేషమును అచ్చు పరమైనపుడు లేవు. ద్రుతమునకు సమాసములయందు అంతటను లోపమగును." అని బాలసరస్వతి టీక. అహోబల పండితుని అర్థవివరణమును అట్లే కలదు (72-74సూ.) ద్రుతప్రకృతికముల కంటె పరమైన పదాది యకారమునకు అజ్వత్కార్యము విధించిన. కళల కంటె పరమైన యకారమునకు అజ్వత్కార్యము రాదని అర్థము వచ్చును, అందువలన "అతఁడు యెవ్వడు" వంటి అనిష్టరూపములు సిద్ధించును. అది భారత ప్రయోగములకు విరుద్ధము. ఒక్క భారతప్రయోగములకు మాత్రమేకాదు; సర్వాంధ్ర కావ్యప్రయోగములకును విరుద్ధమే. ఇది ఆంధ్రశబ్ద చింతామణి యశ్రుతిని అంగీకరించుట వలన అనర్థకము. అసలు యశ్రుతి ప్రాకృత వ్యాకరణ విషయము. అంతేకాదు. ప్రాకృతశబ్ద పరిణామక్రమ సహజము. ఆంధ్రభాషకది కృతకము అయినను ఆంధ్రశబ్ద చింతామణిని రక్షించుటకు "యకారమునకు అంతట అజ్వత్కార్యము వచ్చును; ద్రుతప్రకృతికములకంటె పరమైవి అచ్చునకు లోప సంశ్లేషములు రావు" అని సరికొత్త అన్వయ భేదమున వజ్ఝలవారి అర్థ వివరణము.[12] కాని, ఆంధ్ర శబ్ద చింతామణికి అధర్వణకారికావళి పూరణ గ్రంథమని వజ్ఝల వారి అభిప్రాయమే.[13] అందు,

"వికృత్యాదిగతో యోఽత్ర స్యాచ్ఛబ్దాన్తర
యోగతః
ప్రాణమాత్రావశేషస్స్యాదత్ర శ్రీకవి సమ్మతే,"
22 శ్లో. 1 పరి.

అను సూత్రము కలదు. అది "అతఁడు యెవ్వండు" వంటి అనిష్టరూపములను పరిహరించునది. అనిష్టపరిహారమిది పూర్వగ్రంథమైన ఆంధ్ర శబ్ద చింతామణి ఆశయమయిన, పురాణగ్రంథమైన అధర్వణ కారికావళి సూత్రమునకు పైయర్థము వచ్చును. కాఁబట్టి వజ్ఝలవారిఅర్థవివరణముఆంధ్రశబ్ద చింతామణికి సంరక్షణము కాని సంలక్షణము కాదని స్పష్టము. కనుక "సర్వత్రాజ్వత్కార్యం...... ద్రుతప్రకృతికేభ్యః" అను సూత్రము సర్వప్రయోగ విరుద్ధము. అనగా ఆంధ్రశబ్ద చింతామణి సూత్రము అసమగ్రమని అర్థము ఆంధ్రశబ్దచింతామణి సూత్రములు అనేకములు అసమగ్రములు కనుకనే అధర్వణకారికావళి అవతరణము. అధర్వణకారికావళి అనుబంధము లేనిచో, ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ ప్రయోగములకు నాందీవాచకము కాని సందర్భములు అనేకము కలవు. అట్టి అసమగ్రమైన ఆంధ్రశబ్ద చింతామణి "విపుల శబ్దశాసను"డైన నన్నయ రచించుట అసంభవము.

6. 'ఆంధ్రశబ్ద చింతామణిలోని "నిత్యమనుత్తమ పురుషక్రియాస్వితః" అను సూత్రమున ప్రథమ మధ్యమ పురుషక్రియాపదముల ఇకారమునకు సంధి నిత్యమని కలదు. ప్రథమ పురుషక్రియా పదముల ఇకారమునకు సంధి వైకల్పిక మయినట్టు నన్నయ ప్రయోగములు కలవు.[14] కనుక నన్నయ కృతముకాదు. తెలుగున పాదాంతమున వాక్యాంత

మైన సంధి పైపక్షమని నన్నయ అభిప్రాయము నన్నయ ప్రత్యేకము.'
కనుక సంధి లేకుండుట విరుద్ధముకాదు.[15] కనుక

(సశేషం)

## సూచికలు

1. ఆంధ్ర కవుల చరిత్రము. ప్రథమభాగము పుటలు 42 – 3.
2. చింతామణి విషయ పరిశోధనము. సానుబంధము. పుటలు 48 – 9
3. ఆం. క. చ. పుటలు 44 – 5; 56 – 64.
4. చిం. వి. ప. పుటలు 56 – 57; 60–1.
5. ఆం. క. చ. పుటలు 41–2.
6. చిం. వి. ప. పుట 65.
7. ఆం. క. చ. పుట 46.
8. చిం. వి. ప. పుటలు 46–7; 182–4; 193–4.
9. ప్రాచీనాంధ్ర శాసనాలు. పుటలు 117 119. 129 130. 131. 141.
10. ఆం. క. చ. పుట 46.
11. చిం. వి. ప. పుటలు 53–5; 182–3
12. అదే. పుటలు 182–3
13. వికృతి వివేకము అను అథర్వణ కారికావళి సటీకాథర్వణ కారికావళి విమర్శనము. ప్రథమ ప్రకరణము. పుట 12. ద్వితీయ ప్రకరణము పుటలు 22–4.
14. ఆం. క. చ. పుట 47.
15. చిం. వి. ప. పుటలు 55–6.

# నవభారతి

## సాహిత్య, సాంస్కృతిక మాసపత్రిక

అక్టోబర్, 1979

సంపాదకుడు:
చదలవాడ పిచ్చయ్య

మూల్యం : రెండు రూపాయలు

నవభారతి కార్యాలయము
3-4-1008/1, బర్కత్‌పుర
హైదరాబాదు - 500 027

# విషయసూచిక



నవభారతి
సాహిత్య సాంస్కృతిక మాస పత్రిక

సంపుటి 7]    హైదరాబాదు * అక్టోబర్, 1979    [సంచిక 12

# నేటి భారత జాతీయ కర్తవ్యము

విద్య యనునది లోకానుభవమును వివరించవలయును. లోకమనునది చాల విస్తృత మైనది. ఈ విస్తృతమైన లోకమును గురించి మానవుడు నిరంతరము పరిశీలించ వలసి యున్నది. ఈ పరిశీలనలోని లోకము, నిత్య నూతనానుభవమును కలిగించు చున్నదని తెలిసికొన వలయును. విద్యకు నిరంతరమైన అనుశీలనము కావలయును. నిరంతరాను శీలనమైన లోకానుభవమే మానవానుభవమని గ్రహించవలయును. మానవుడు తన ప్రయోజనమును గురించిగాని, తన వలెనే జీవించుచున్న వివిధ విధములైన ప్రాణులను గురించి గాని, పదార్థములను గురించిగాని, వివేచన చేయబడుచున్నదని చెప్పు విధానమును విద్యకు ప్రమాణముగ ఎవరికి తోచిన విధమున వారు నిర్ణయములను చేయుచున్నారని చెప్పవచ్చును.

విద్యకు శాశ్వత రూపమనునది నిర్మించుట సాధ్యము కానిదని గ్రహించుకొన వలసి యున్నది. లోకము నిత్య నూతనమైనది. లోకములోని లోకానుభవము మానవానుభవముగ పరివర్తన చెందబడు చున్నదని చెప్పుచున్న వాదమంతయు కొన్ని నిబంధనల మేరకు కట్టుబడి వివరించబడు చున్నదని తెలిసికొన వలయును. శాశ్వతత్వ మనునది లోకములోని దేనికి పరిమితమై లేనిదై యున్నదని గ్రహించని కారణమున ఒక్కొక్కరు ఒక్కొక్క విధమున విద్యకు శాశ్వతత్వ మనునది కల్పించి, ఈ కల్పించబడిన శాశ్వతత్వమే విద్యకు ప్రమాణ మైనదని నిర్ణయించి, నియమన విధానములను సూచించి యున్నారని గ్రహించ వలయును.

నేటి విద్యావిధాన మంతయు లోకములోని బహుతక్కువ కాలమునకు సంబంధించిన సమస్యా పరిష్కారముల గురించి వివరించ బడినదని తెలిసికొన వలయును. నేటి విద్యకు ప్రమాణమును వివరించునది విశ్వవిద్యాలయ విద్యావేత్తలని చెప్పబడు చున్నది. ఈ విశ్వ విద్యాలయ కాలపరిమితి బహుతక్కువ కాలమునకు పరిమితమై యున్నదని గ్రహించ వలయును. గ్రీసులో ప్రప్రథమముగ ప్రారంభింప బడిన విశ్వ విద్యాలయ ప్రాభవ ప్రాబల్యములే నవీన నాగరికతకు, నవీన విద్యకు ప్రమాణములని కల్పించి చెప్పబడు చున్నదని గ్రహించ వలయును. నేటి నవీనులు ఈ ప్రమాణములనే ఆరాధించు చున్నారని తెలిసికొన వలయును.

ప్రపంచము సువిశాలమైనది. ఈ ప్రపంచములో అనేక దేశములున్నవని, అనేక జాతులున్నవని చెప్పబడు చున్నది. ఈ దేశములలో నివసించు వారికి జాతీయ సంస్కృతు లనునవి ప్రత్యేకించబడి యున్నవని వివరించబడు చున్నది. ఈ లోకములో నివసించుచున్నది మానవ జాతి మాత్రమే కాదని మానవు డవగాహన చేసికొనవలసి యున్నది. లోకములో ఏ ప్రాంతమం దున్న మానవుడైనను ఒకే జాతికి చెందినవాడని అవగాహన చేసికొనవలసిన సమయ మాసన్నమైనదని గ్రహించ వలయును.

లోకములోని జాతులలో స్త్రీ జాతియని, పురుష జాతియని ప్రత్యేకించి చెప్పబడు చున్నది లోకములోని జాతులలో స్త్రీ, పురుష జాతులనునవి ప్రత్యేకమైన జాతులు కావని గ్రహించుకొన వలసి యున్నది. సృష్టిలోని జాతులన్నింటికి తమ తమ సంతతిని తాము నిర్మించు కొనుటకై ఏర్పరచ బడిన భిన్నమైన ప్రవృత్తులను జాతిగ వివరించుట యనునది విద్యలో అవివేక వంతమైన విధానమని యవగాహన చేసికొన వలసి యున్నది. ప్రకృతిలోని సమస్తమైన జీవరూపములకు ఆడ, మగ భేదముల తారతమ్య మనునది సహజమైనదని, ఏకీకృతమైన మానవ జాతి మనుగడకు సంబంధించిన మాననీయమైన మానవీయగల మానవజాతి భావనను గ్రహించని కారణమున అనేక జాతులను కల్పించి, అనేక జాతుల కల్పనలో ఆడ, మగ భేదమును కల్పించి, ఈ కల్పించబడిన భేదభావముల విద్యా విధానమునే ప్రామాణికమైన విద్యా విధానమని నిర్ణయించి విశ్వ విద్యాలయములలో విద్యాబోధన చేయుచున్నారని గ్రహించుకొన వలయును. ప్రకృతి సహజమైన జీవి నిర్మాణమునకు మానవ నిర్మితమైన నిర్మాణ జీవితమునకు అంతులేని వ్యత్యాస మున్నదని గ్రహించని విద్యా విధాన నిర్ణేతలు విశ్వ విద్యాలయముల ద్వారా విద్యా విధానములను నిర్ణయించి విద్యను బోధించిన కారణమున మానవుడు మానవతా భావమును విశదీకరించ గలిగిన శక్తి యుక్తులను నిర్మూలనము చేసికొని యున్నాడని తెలిసికొన వలసి యున్నది.

ప్రకృతి సహజమైన నిర్మాణమునకు సూత్రములనునవి యున్నవి. ఇవి సహజములై యున్నవి. మానవ నిర్మితమైన నిర్మాణమునకు సూత్రములనునవి యున్నవి. ఇవి యాంత్రికములై నవని అందరికిని తెలియును. ఒక విధానము సహజమై యున్నదని గ్రహించి మరియొక విధానము యాంత్రికమై యున్నదని గ్రహించి ఈ రెండింటిని సహజ ప్రకృతి విద్యయని నిర్వచించు విధాన మేదై యున్నదో అది మానవుని అవివేకమునకు తోడ్పడు చున్నదని తెలిసికొన వలయును. లోకము ఎప్పుడు ప్రారంభమైనది మానవునికి తెలియదు. మానవునికి తెలియని లోకమును గురించి మానవుడు లోకము ఇట్లు ఏర్పడి, ఇట్లు పరిణామము చెంది, ఇట్లు పరివర్తన చెంది, ఈనాడు ఈ రూపము ధరించి యున్నదని చెప్పబడు విద్యా విధాన మేదై యున్నదో, ఆ విధానము మానవుని అవివేకమునకు తోడ్పడు చున్నదని గ్రహించుకొన వలయును. లోకములో గ్రీసు దేశము ఒక చిన్న భాగమై యున్నది. ఆ చిన్న భాగములో నివసించువారు నిర్వచించు విద్యా విధానమే ప్రపంచ వ్యాప్త విద్యా విధాన మేదై యున్నదో, ఆ విద్యా విధాన ప్రమాణమే ఉత్తమమై యున్నదని చెప్పుటలోని ఆ సంబద్ధతను లోకము గ్రహించు

కొనవలసి యున్నది. ప్రపంచములో పదార్థములనునవి, రసాయనములనునవి, జీవ నిర్మాణములనునవి, ఒకే తీరున నిర్మించబడిలేవని గ్రహించవలయును. భిన్న భిన్న రీతులలో, భిన్న భిన్నమైన తీరులలో భిన్న భిన్న విధానముల ననుసరించి, భిన విభిన్నములైన రూపులను సంతరించుకొని, భిన్న విభిన్నములైన భాషా భేదములను గల్పించుకొని, భిన్న విభిన్నములైన సూత్రనిర్వచనముల ద్వారా భిన్న భిన్నాత్మకములైన మానవానుభవములను వ్యక్తము చేయుటకు ప్రయత్నించ బడినటుల మానవానుభవము మనముందుంచ బడినదని గ్రహించ వలయును. మనముందుంచ బడిన ఈ విధానములోని లోపాలోపములను సమీక్షించి, సదవగాహనకు సంబంధించి మానవుని మానవానుభవమును విశదీకరించుకొని, విద్యకు ప్రమాణమును నిర్ణయించ వలసిన సమయమాసన్నమైనదని గ్రహించ వలయును. లోకములో అన్ని దేశముల వలెనే భారత దేశము గూడ ఏర్పడి యున్నదని గ్రహించవలసి యున్నది. భారత దేశములోని విద్యా విధాన నిర్ణయములలో ప్రత్యేక ప్రతిపత్తి యున్నదని తెలిసికొనవలయును. మానవుని పరిపూర్ణమైన మానవతా వికాసమునకు భారత జాతీయ విద్యా విధానములలో వివేచనాత్మకమైన పద్ధతిని ప్రవేశ పెట్టిన దానిని గ్రహించని కారణమున గ్రీకు విద్యా విధాన నిర్ణయములే భారత జాతీయ విద్యా విధానములని అవగాహన చేసికొన వలసి యున్నది. ఈ గ్రీకు విద్యా విధాన నిర్ణయములే నేటి భారత జాతీయ వ్యవస్థకు అవ్యవస్థను సమకూర్చి పెట్టియున్నదని తెలిసికొన వలయును.

భాషలు భిన్నాత్మకమైన రూపములను ధరించి యున్నవి. భావము మాత్రము సార్వజనీనమైనది, సార్వకాలీన మైనదని గుర్తించని కారణమున భాషా భేద కల్పనలో విద్యా విధాన నిర్ణయమునకు ఆటంకములను కల్పించుకొని, విద్యను అవ్యవస్థాపరము చేయుచున్నారని గ్రహించవలయును. లోకములోని మానవత్వ భావమంతయు ఒక్కటిగ భావించి, ఎవరి కనుకూలమైన భాషను వారు నిర్ణయించుకొని, ఎవరి ప్రయోజనమును వారు పెంపొందింప వలసి యున్నదని గ్రహించని కారణమున ఆంగ్లేయ విద్యా వ్యామోహముతో విద్యా విధానమును అవ్యవస్థలోను చేయుచున్నారని అవగాహన చేసికొన వలయును.

జాతీయత, అంతర్జాతీయత, ప్రాంతీయత, భేదములను నానాటికి పెంపొందించు ఈ విద్యా విధాన నిర్ణయములు సువ్యవస్థకు మార్గదర్శకములు కావని గ్రహించి మానవ జాతి ప్రయోజనమునకై మాన్యమైన విద్యా విధానమును నిర్ణయించ వలసి యున్నదని గ్రహించ వలయును.

సహజమైన ప్రకృతి నిత్యనూతనమైనది. ప్రకృతిలోని భాగస్వామ్య రూపమును ధరించిన మానవజాతి జీవితము నిత్యనూతన మైనదని గ్రహించ గలిగిననాడే మానవజాతి మాన్యమైన జాతిగ రూపొందించుటకుగాను విద్యావిధాన నిర్ణయమును నేర్పుతో సమకూర్చుకొన గల శక్తిని సంపాదించుకొన వలసి యున్నదని గ్రహించ వలయును. ఇది నేటి భారత జాతీయ కర్తవ్యమై యున్నది.

# నా స్వామి

రమ

ఏ చోట చూసినా
ఏ తోట పూసినా
నీ రూపమే ప్రతిబింబమై
పరిభ్రమిస్తోంది - నా భావాంబరాన

నా వులిలో నిన్ను శిలగ జేసి
ఎన్నెన్నో భంగిమల మలిచి
నిలచి కన్నార్పక చూశాను
నా కలాన-

అక్ష అక్షర రత్నాలతో
నిన్ను పొదిగి దివ్యరూపముగ
నా ఎదలోన పొదివివుంచాను
కలనైనా చేరలేని నీరూపం

సుదూరాల వ్యాపించే
నా పాట నీ పాదాల
స్పృశించాలనే నా ఆకాంక్ష
పంచరంగుల కుంచెతో
నీ రూపం చిత్రించాను

విచిత్రం - ఆ సుందరరూపం
ఆ కన్నుల్లో మమతాపాశం
ఆ మోవిపై మాయని నగవు
పగవారి నైనా బంధించుశాంత స్వరూపం

కాలకూట విషజీవితాన
ఆశా అమృత చినుకు వై కురియంగ
వరము లేవి కోరని
ఈ చిన్ని గుండెలో నిండిపో

ఇన్నిన్ని రీతుల
నీరూపం నా తలపుల్లో
క్షణమైన ఎడబాయని స్మృతులై
అణువణువున నిండెను

కరుణింప రావేల నాస్వామి
కరిగి వాగై ఈ చిన్న అలను
నీలోన లీనము చేసికోన
రావా...నా స్వామి.

# గీతాంజలి - రవీంద్రనాథ ఠాకూర్

## అనువాదం: శ్రీలక్ష్మి

(గతసంచిక తరువాయి)

### (21)

వెలుగు ఎక్కడ వున్నది? ఆశాకిరణముతో దానిని వెలిగింపుము

హృదయమా, నీలో దీపమున్నది. కాని, వత్తి వెలగడం లేదు. ఈ దీనావస్థకన్న, నీకు మరణము ఎంతో మేలు. శోకదేవత నీకు సందేశాన్ని తెచ్చింది - నీ ప్రభువు మేలుకొని వున్నాడు. రాత్రి, ప్రేమ నికుంజం వద్దకు నిన్ను రమ్మని పిలుస్తున్నాడు - అని.

ఆకాశము కారుమబ్బులతో నిండివున్నది. ఎడతెరపి లేకుండ వర్షం కురుస్తున్నది. నాలోని ఈ సంచలనానికి అర్థం తెలియడం లేదు.

ఒక్క క్షణం మెరిసే మెరుపు నాకు మిక్కిలి ఆవేదనను కలిగిస్తుంది. నా మది, రజని పిలుపును వెతుక్కుంటూ వెడుతుంది.

వెలుగు ఎక్కడ వున్నది? ఆశాకిరణముతో దానిని వెలిగింపుము ఉరుములు, మెరుపులు, గాలి హోరు, ఒంటరి చీకటిరాత్రి. కాలం చీకటిలో గడచిపోనివ్వరాదు. నీ జీవనరాగంతో ప్రేమజ్యోతిని వెలిగింపుము.

### (22)

నా వ్యసనాలకు అంతం లేదు. వాటిని వదిలించుకోవాలంటే, నా మనసు బాధ పడుతుంది.

నాకు కావలసిందల్లా స్వేచ్ఛ కాని కలలోకూడా అది నాకు లభ్యం కాదు.

నీలో అక్షయమయిన నిధి వున్నదనీ, నీవు నా ప్రాణసఖుడవనీ, నాకు బాగా తెలుసును అయినా, నాలోని మాత్సర్యాన్ని తొలగించడానికి, నా మనసు ఒప్పదు.

నన్ను కప్పిన మాయ అధోగతికి దారి తీస్తుంది. నేను ఆమెను ద్వేషిస్తాను; అయినా ప్రేమతో కౌగలించుకుంటాను.

ఎన్నో అపజయాలు పొందాను. ఎంతో పాపం చేశాను కాని నా తరుణోపాయంకోసం నిన్ను వేడుకున్నప్పుడు, నా ప్రార్థన నువ్వు మన్నిస్తావని భయంతో వణకిపోతాను.

### (23)

మన సంకేత స్థలానికి నేను ఒంటరిగా బయలు దేరాను. ఈ నిశ్చల నిశీధిలో నన్ను ఎవరో వెంబడిస్తున్నారు

అతని బారినుండి తప్పించుకోవడానికి నేను దారి మళ్ళించాను. అయినా అతడు నా వెంట వున్నాడు.

దుమ్ము రేపుకుంటూ, నన్ను వెంటనంటి వస్తున్నాడు. నా గొంతులో గొంతు కలిపి పాడుతున్నాడు.

అతడు నా ఆత్మ, స్వామీ అతనికి వెరపు లేదు. కాని అతనితో నీ దగ్గరకు రావడానికి నాకు సిగ్గుగా వుంది.

(24)

ఈ ప్రపంచం నన్ను తన ప్రేమ వాగురులలో బంధించింది. నీ ప్రేమ అతి లోకమయినది. నీ దివ్య ప్రేమ నన్ను ముక్తను గావించింది.

నేను వారిని ఎక్కడ మరచిపోతానో అని, వారు నన్ను ఏకాంతంగా వుండనివ్వరు. రోజులు గడచి పోతాయి. కాని నువ్వు కనుపించవు.

నేను నిన్ను ఆరాధించలేకపోయినా, నా హృదయంలో నిన్ను ప్రతిష్ఠించుకోక పోయినా, నా ప్రేమ పుష్పం వికసించేదాకా, నీవు వేచివుంటావు, రన్నా.

(25)

పగలు వారు నా యింటికి వచ్చి, 'మేము వుండ టానికి కాస్త చోటు చాలు' అని అడిగారు.

వారు అన్నారు, 'నీ దేవతార్చనకు మేము సహాయం చేస్తాము అతని దయకు పాత్రుల మవు తాము.' ఒక మూల నెమ్మదిగా ఒదిగి కూర్చున్నారు.

కాని, రాత్రివేళ, నా పవిత్ర హృదయాలయంలో ప్రవేశించారు. నా స్వామికి నేను అర్పణం చేసుకున్న నివేదనలు, పేరాశతో దొంగిలించారు.

(26)

నాలో రవ్వంత స్వార్థం మిగలనీ, నిన్ను నా సర్వస్వంగా భావించునేటందుకు.

అంతటా, అన్నిటా, అన్నివేళలా, నిన్ను చూచి, ఆరాధించుకునే స్ఫూర్తి, రవ్వంత నాలో వెలుగనీ.

నిన్ను ఎన్నటికీ మరచిపోని ఆ ఎరుక, రవ్వంత నాకు కలుగనీ.

నీ మధుర ప్రేమబంధం మాత్రం నాకు మిగలనీ. నీ లీల నా బ్రతుకులో పండనీ.

27

ఎచట హృదయం ధైర్యాన్ని కోల్పోవదో;
ఎచట శిరము ఉత్తుంగమో;
ఎచట జ్ఞానము నిరవధికమో;
ఎచట ఎల్లలోకములు ఐకమత్యముతో నుండునో;
ఎచట వాక్కులు సత్యపూర్ణములో;
ఎచట సునాయాసంగా పరిపూర్ణత లభించునో;
ఎచట వివేకఝరి గుడ్డినమ్మకంలో ఇంకిపోవదో;
ఎచట హృదయం సువిశాల భావాలలో ముందుకు సాగిపోతుందో;

అట్టి నీ దివ్య చైతన్యంలో నా భరతాంబను మేలుకొలుపుము, ప్రభూ.

(28)

ఇది నా ప్రార్థన, ప్రభూ. నా హృదయ కమ లాన్ని వికసింపచెయ్యి.

సుఖదుఃఖాలను సునాయాసంగా అనుభవించే శక్తిని నాకు ప్రసాదించు.

నా ప్రేమ సేవాభావంలో ఫలించే భాగ్యాన్ని నాకు ప్రసాదించు.

దరిద్రనారాయణుల పట్ల ఆదరణ, అన్యాయం పట్ల నిరాదరణ భావం, నాకు ప్రసాదించు.

నిత్యజీవితంలోని చింతలకు, అతీతంగా వుండు శక్తిని నాకు ప్రసాదించు.

అన్నిటనీ మించి, పూర్ణ శరణాగతి భావం నాకు ప్రసాదింపుము, స్వామీ.

(29)

నీవే కావాలి నాకు, నీవే – అనినా ఎడద అనవ రతం జపించాలి, శ్యామా. రాత్రింబవళ్లు నన్ను వేదించే కోరికలు, ఎండమావులకు మల్లే అసత్య ములు.

రజని ఐన విషాదంలో వెలుగుకోసం అభ్యర్థించినట్లు, నా అంతరాంతరాల్లో - నీవే కావాలి నాకు, నీవే అన్న పిలుపు ధ్వనిస్తుంది.

పెనుతుపాను శాంతిని రూపుమాపినా, శాంతములోనే లీనమైనట్లు, నా విప్లవాత్మ నీ ప్రేమను ఎదురిస్తుంది. అయినా - నీవే కావాలి, నీవే అని పిలుస్తుంది.

(30)

నా ఎడద ఎండి బీటలు వారినప్పుడు, నీ కృపా వర్షములో ముంచెత్తుము కన్నా.

నా జీవితము మోడువారినప్పుడు, నీ గానామృతంలో చిగిరింప చేయుము.

ఎద తెరిపిలేని కర్మలు చుట్టుముట్టి, ఆవలి తీరం కానరానప్పుడు, నీ శాంతముతో, విశ్రాంతితో నన్ను ఆదరింపుము, శ్యామా.

నా దయనీయమైన హృదయకమలం ముకుళించుకుని పోయినప్పుడు, కమనీయముగా వికసింప చేయుము, స్వామీ.

అంతులేని కోరికలు, వివేకాన్ని నశింప చేసినప్పుడు, పావనమూర్తీ, నీ వెలుగును ప్రసాదింపుము.

(31)

వారందరి వెనుక, నీడలలో దాగొని వున్నావా, శ్యామా. వారు నిన్ను లెక్క చెయ్యకుండా, నిన్ను దాటుకుని వెడుతున్నారు. నీ కోసం నేను ఇక్కడ కాచుకొని వుండి అలసిపోయాను. నీకని వుంచిన పూలు, అందరూ తీసుకున్నారు.

పగలు గతించి పోయింది. సాయం సంధ్యావేళ కనురెప్పలు నిద్రతో మూసుకు పోతున్నాయి. ఇంటి దారి పట్టినవాళ్లు నన్ను చూచి మందహాసం చేసినప్పుడు, నాకు అవమానంగా వుంది. బిచ్చకత్తె మాదిరి కూర్చునివున్న నన్ను చూచి, ఏమి కావాలి, అని వారు నన్ను అడిగినప్పుడు, మౌనంగా తల వంచుకుంటాను

నేను నీ కోసం వేచివున్నానని, నువ్వు వస్తానని మాట ఇచ్చావని, ఎలా చెప్పను. ఈ దారిద్ర్యాన్ని నీకు కానుకగా ఇవ్వాలనుకున్నానని సిగ్గు లేకుండా ఎలా చెప్పను. ఈ నా అదృష్టాన్ని పదిలంగా నాలో దాచుకుంటాను.

పచ్చికమీద కూర్చుని, నింగిలోకి చూస్తూ కలలు కంటాను. నీ రథము దీపాలతో వెలిగిపోతున్నది, అందరూ ఆశ్చర్యంతో కన్నార్పకుండా చూస్తున్నారా, నీవు దిగివచ్చి నన్ను తీసుకువెళ్ళి నీ పక్కన కూర్చోపెట్టుకుంటావు; నేను, వడగాలికి వణకిపోయే తీగెలాగా, సిగ్గుతోనూ, ఆనందంతోనూ, ఊగిపోతాను.

కాలం జారిపోతుంది. కాని నీ రథచక్రాల శబ్దం ఎక్కడా వినబడదు. ఎన్నో ఊరేగింపులు కోలాహలంగా సాగిపోతున్నాయి. వీటన్నిటి వెనుక, మౌనంగా, నీడలో నిలిచియున్నది నీవేనా, శ్యామా. నిన్ను గుర్తించలేక, నేను అలాగే నీ కోసం చూస్తూ, అలసిపోయాను, ప్రభూ.

(32)

వేకువనే నువ్వు అన్నావు, మనమిద్దరమే నావలో పయనిద్దామని, మన పయనం సుదూర లోకాలకని.

తీరం లేని ఆ జలనిధిలో, నీవు నగుమోముతో వింటున్నప్పుడు, నా గీతాలు అలలలాగా సహజంగా పొంగుతాయి, మాటల కందని మాధుర్యంలో.

ఇంకా సమయం కాలేదా, ఇంకా చెయ్యాల్సిన పనులు వున్నాయా? సాయంకాలం అయిపోయింది. అలముకుంటున్న చీకట్లలో నీటిపక్షులు గూళ్ళు చేరుకుంటున్నాయి.

ఎవరికి తెలుసు, గొలుసులు ఎప్పుడు విడిపోయి ఈ నావ చీకట్లలో కలసిపోతుందో.

33

నీ ప్రకృతిదేవిలోని అద్భుతాలను చూస్తూ వుండడం నాకు సరదా. తెల్లవారడం, పొద్దు క్రుంకడం, వర్షం కురవడం, అన్నీ నన్ను పరవశింప చేస్తాయి.

తెలియరాని లోకాలనుండి నీ సందేశాన్ని వినిపించి వెళ్ళిపోతూంటాయి.

తెల్లవారింది మొదలు, పొద్దు క్రుంకేదాకా, ఇక్కడ నా వాకిటి ముందు కూర్చుని వుంటాను నాకు తెలుసు, ఆకస్మికంగా నిన్ను చూచే శుభ సమయం వస్తుంది.

ఈ లోపల ఆనందంగా పాడుకుంటూ వుంటాను ఒక్కతెనూ. ఈలోగా నీ ఆగమన సువాసనలలో వాతావరణం గుబాళిస్తుంది.

(34)

అతని మృదు మధురమైన అడుగుల సవ్వడి వినలేదా? అతను వస్తాడు, ఎప్పుడూ వస్తాడు.

ప్రతిక్షణము, ప్రతియుగము, ప్రతిదినము, ప్రతిరాత్రి, అతను వస్తాడు, ఎప్పుడూ వస్తాడు. ఎన్నో రాగాలలో, ఎన్నో పాటలు పాడాను. అన్నీ అలపించేది ఒకటే భావం – అతను వస్తాడు, ఎప్పుడూ వస్తాడు.

సువాసనలు వెదజల్లే ఆ మనిలో, తోట బాటన, అతను వస్తాడు, ఎప్పుడూ వస్తాడు.

శ్రావణ మాసపు వర్షరాత్రిలో, ఉరుములతో మెరుపులతో, అతను వస్తాడు, ఎప్పుడూ వస్తాడు.

నా దుఃఖంలో, అతని పాదాలు నా ఎడదను హత్తుకుంటాయి. అతని దివ్యపాద స్పర్శ నా ఆనందానికి మెరుగులు దిద్దుతుంది.

(35)

నువ్వు ఎంత దీర్ఘకాలంనుంచి నన్ను చేరవస్తున్నావో తెలియదు నీ సూర్యచంద్రులు నా నుంచి నిన్ను మరుగుపరచలేవు.

సంధ్యవేళ ఎన్నోమార్లు నీ పదముల సవ్వడి వినిపించింది. నీ రహస్యవాణి నా హృదయాకాశంలో పలికింది.

ఈవేళ ఏదో తెలియని ఆనందం నన్ను ఆవరించింది.

నా పనులు ముగియు సమయం ఆసన్నమయినట్లుంది. ప్రకృతిలో నీ సుందరరూపం గోచరిస్తున్నది.

(36)

రాత్రంతా అతనికోసం చూస్తూవున్నాను. తెల్లవారుజామున అలసిపోయి, నేను నిద్రపోయినప్పుడు అతను అరుగుదెంచునేమో. స్నేహితులారా, అతనికి దారి వదలండి. అడ్డగించకండి.

అతని అడుగుల సవ్వడికి నాకు మెలకువ రాకపోయినా, దయచేసి నన్ను లేపవద్దు. పక్షుల కలకలము, ఉదయ సంధ్యలోని చల్లని పిల్లగాలులు, నన్ను మేలుకొలుపుట నాకు సమ్మతం రాదు. ఒకవేళ, అనుకోకుండా, నా స్వామి నా యింటికి ఏగుదెంచినా, నన్ను హాయిగా నిద్రపోనిండు.

నా సుషుప్తి, అతని స్పర్శతో మాయమగుటకు కాచుకుని వున్నది. నిండు నిదురలోనుండి అవతరించు కమ్మని పిలలాగా, అతను చిరునవ్వులు చిందుతూ నా ఎదుట నిలబడినప్పుడే, నా కన్నులు విప్పుకుంటాయి.

ఎల్ల వెలుగులకు వెలుగైన అతను, ఆది పురుషుడు, నాకు సాక్షాత్కరించాలి. మేలుకొలిపిన నా

ఆత్మకు మూలప్రేమ, అతని చల్లని చూపులనుండి లభ్యం కావాలి. నా స్వస్వరూప సందర్శనం అతనిలో జరగాలి.

(37)

ఉదయకాల నిశ్శబ్దనీరధి, పక్షి సంతతుల కిలకిలా రావాలలో తరగలుగా ప్రవహించింది. పూవులు విచ్చుకుని పరిమళాలు వెదజల్లుతున్నాయి. ఆకాశంలోని అరుణిమలు ముచ్చటగా అలముకున్నాయి. మేము ఇవేమీ గమనించకుండానే మా మార్గాన త్వరగా వెళ్ళిపోయాము.

మేము సంతోషంతో ఆడలేదు, పాడలేదు. ఒక్క మాట పలుకలేదు చిరునవ్వు అసలే లేదు. కాలం గడచే కొద్దీ త్వరగా వెళ్ళిపోయాము.

సూర్యుడు గగనమధ్యాన నిలిచాడు. ఎండుటాకులు వడగాలికి రాలి పడుతున్నాయి. గొల్లపిల్లవాడు, మర్రి నీడన కలలు గంటున్నాడు. నేనుకూడ, ఏటి పక్కన, పచ్చిక మీద నడుము వాల్చాను.

నా సహచరులు నన్ను చూచి పరిహసించారు. గర్వంగా ముందుకు వెళ్ళిపోయారు. వారు వెనుదిరిగి చూడనూ లేదు, విశ్రమించనూ లేదు. వారు కనుమరుగయిపోయారు; కొండలూ కోనలూ గడచిపోయారు, కొత్త కొత్త ప్రదేశాలకు. పరిహాసం, నన్ను పురిగొలిపింది, కాని నేను లేవలేదు. ఒక అనిర్వచనీయమైన ఆనందం నన్ను అలముకున్నది.

నిద్రాదేవి నన్ను ఆవరించింది. కమ్మని కలలు పండించింది.

చివరకు, మేలుకొని, కండ్లు తెరిచాను. నీవు నా పక్కన నిలబడి, నన్ను నీ చిరునవ్వులలో ముంచెత్తుతున్నావు కన్నా. నిన్ను చేరు మార్గం సుదూరమని, ప్రయాసతో కూడుకుని వున్నదని, ఎంతగా అధైర్య పడ్డాను.

(38)

నువ్వు నీ రథం దిగివచ్చి నా యింటి ముంగిట నిలుచున్నావు.

నేను ఒక్కడినే ఒకమూల కూర్చుని పాడుకుంటున్నాను. నా గానం నీ చెవిన బడింది నువ్వు దిగివచ్చి నా యింటి ముంగిట నిలుచున్నావు.

నీ దర్బారులో ఎందరో విద్వాంసులు వున్నారు. నిరంతరం పాడుతుంటారు. అయినా ఈ దాసుని గీతం నీ ప్రేమను చూరగొన్నది. నా చిరు గీతం, విశ్వసంగీతంలో వినదించింది. నీవు సుందర పుష్పాన్ని బహుమతిగా ఇచ్చావు.

(39)

రాత్రి బాగా పొద్దుపోయింది. పనులన్నీ ముగిశాయి. అతిథులు అందరూ రావడం అయిందనుకున్నాము. తలుపులన్నీ మూసివున్నాయి. ఎవరో అన్నారు, రాజు వస్తున్నాడని మేము నమ్మలేదు.

తలుపు తట్టినట్లయింది. గాలి తెమ్మనుకున్నాము. దీపాలు ఆర్పేసి పడుకున్నాము. ఎవరో అన్నారు, రాజదూత వచ్చాడని. మేము నమ్మలేదు.

అర్ధరాత్రి శబ్దమయింది. దూరాన పిడుగు పడిందనుకున్నాము. భూమి కంపించింది. గోడలు కదిలాయి. నిద్రలో కలవరపడ్డాము. ఎవరో అన్నారు, అది రథచక్రాల ధ్వని అని. మేము నిద్రలో గొణిగాము, అది ఉరుముల ధ్వనిఅని.

భేరీ మోగింది. మేలుకొనండి, ఆలసింపకండి అని వినిపించింది. ఎవరో అన్నారు, 'అదిగో, రాజు జండా', అని. అందరం లేచి నిలబడ్డాము, ఇంక ఆలస్యం చెయ్యకుండా.

రాజు వేంచేశాడు. దీపాలు ఎక్కడ. దండలు ఏవి? కూర్చోబెట్టడానికి పీఠం ఏది? ఎవరో అన్నారు,

'ఇప్పుడు విచారించి లాభం లేదు. చేతులు జోడించి అతనిని ఆహ్వానించండి. కాళీగా వున్న మీ పంచలోకి తీసుకొని వెళ్ళండి'. శంఖాలు పూరించండి. మన గుహాశయంలోని ప్రభువు, నిశీధి లోతులలో ప్రత్యక్షమయాడు.

ఆకాశంలో ఉరుములు, మెరుపులు. మీ చింకిచాప తెచ్చి పరవండి. తుపానుతోపాటు, ఈ కాళరాత్రి, మన ప్రభువు ఏతెంచినాడు.

(40)

నవరత్నాలతో పొదిగిన నీ కంకణం అందంగా మెరుస్తున్నది. కాని నీ ఖడ్గం ఇంకా అందంగా వున్నది విష్ణుమూర్తి గరుడపక్షి రెక్కలకిమల్లె వంపు తిరిగి, హరివిల్లుకిమల్లె రంగులు ఈనుతూ.

చివరి క్షణంలో, యమబాధతో మెలికలు తిరిగి పోయే ప్రాణంలాగా, ఝళిపిస్తుంది. ప్రాపంచిక విషయ వాసనలను ఒక్క దృష్టిలో కబళించివేసే పావన అగ్నిశిఖలాగా ప్రకాశిస్తున్నది.

నవరత్నాలలో పొదిగిన నీ కంకణం అందంగా మెరుస్తున్నది. కాని నీ ఖడ్గం ఇంకా అందంగా ఉన్నది, అద్భుతంగా, భావాతీతంగా.

(41)

నేను నిన్ను ఏమీ కోరలేదు. నా పేరు నీకు చెప్పలేదు. నువ్వు వెళ్ళిపోతున్నప్పుడు మౌనంగా వుండిపోయాను. నేను ఒక్కతెను బావి దగ్గర ఉన్నాను. తోటివారందరు నీళ్ల తీసుకుని ఇండ్లకు వెళ్ళిపోయారు. వారు నన్ను పిలిచారు. 'ఇంటికి పోదాం రా, పొద్దెక్కుతున్నది' అని. నేను నా ఊహాగానంలో వుండిపోయాను.

నీ అడుగుల సవ్వడి నాకు వినిపించలేదు. నీవు నావైపు చూచినప్పుడు, నీ కన్నులు విచారంగా వున్నాయి. నీ కంఠం నీరసంగా ధ్వనించింది - 'దాహంగా వున్నది' అని అడిగినప్పుడు. నా పగటి కలలలోనుంచి తేరుకుని, కడవలోని నీరు నీ చేతులలో పోశాను పైన మామిడాకులు గలగలమన్నాయి అకుల మాటున కోయిల కూసింది. వీధి మలుపులో మల్లెలు గుబాళించాయి.

నీవు నా పేరు అడిగినప్పుడు సిగ్గుతో మౌనంగా వుండిపోయాను. నీవు నన్ను గుర్తు పెట్టుకోవలసినంత గొప్ప సాయం ఏమి చేశాను? కాని నీకు నీళ్ల ఇవ్వగలిగాననే మధురస్మృతి మాత్రం నా మదిలో పరిమళాలు కురుస్తుంది మధ్యాహ్న సమయం. కోయిల కూస్తున్నది. నేను నా ఊహాలలో తేలిపోతున్నాను.

(42)

నీ మనసు స్తబ్ధంగా వున్నది. నీ కన్నులు నిద్ర మత్తుగా వున్నాయి.

ముళ్ళలోనుంచి పూవు వికసించిందని చూడలేదా. లెమ్మా, మేలుకొనుము. వృథా కాలయాపన చేయకుము.

రాళ్ళబాట చివర, నిర్మల ప్రశాంత ప్రదేశంలో నా చెలికాడు ఒంటరిగా కూర్చుని వున్నాడు. అతనిని మోసగింపవద్దు. లెమ్మా, మేలుకొనుము.

ఆకాశం ఎండతో మండిపోనిమ్మా. ఎడారిలో ఎండమావులు వుండనిమ్మా. నీ హృదయాంతరాళంలో ఆనందం లేదా? నీ ప్రతి పదస్పర్శతో భూమి పులకించి పోతుంది.

(43)

నీ ఆనందం నాలో పరిపూర్ణంగా వికసించింది: నీవు నా కోసం అవతరించావు. భువనేశ్వరా, నేను లేకున్న, నీ ప్రేమకు తావు ఏది?

ఈ ఐశ్వర్యానికి భాగస్వామిగా నన్ను నీవు ఎన్నుకున్నావు. నీ లీలావినోదం నా హృదయంలో

చోటు చేసుకున్నది. నీ చిత్తం నాలో రూపు దిద్దు కున్నది.

నన్ను ఆకర్షించడానికి నువ్వు అందంగా అలంక రించుకున్నావు స్వామీ. నీ ప్రేమ నాలో సార్థక్యం పొందింది. పరిపూర్ణ అద్వయంలో నీవు సాక్షాత్క రిస్తావు ప్రభూ.

(44)

వెలుగు, నా వెలుగు, విశ్వాన్ని ఆవరించిన వెలుగు, కనులను మురిపించు వెలుగు, హృదయాన్ని పులకింపచేయు వెలుగు.

ఆహా, ప్రియతమా, నాలో నినదించే వెలుగు, నా ప్రేమ తంతులను మీటే వెలుగు; ఆకాశం విప్పు కుంటుంది. వాయుదేవుడు మేలుకుంటాడు. పుడమి తల్లి కిలకిలా నవ్వుతుంది.

సీతాకోక చిలుకలు, కులాసాగా నాట్యం చేస్తాయి. వెలుగు వెల్లువలలో మల్లెలు గుబాళిస్తాయి

మబ్బుకన్నెలు రంగులు దిద్దుకునే వెలుగు. మణు లను మెరిపింపచేయు వెలుగు.

ఆకునూ, పూవునూ పరవశింపచేయు వెలుగు, శ్యామా. గగన గంగ గట్లు తెగి ప్రవహించుచున్నది. ఆనందామృతం పొంగి పొరలుచున్నది.

(45)

ఆనంద ఝరులన్నీ నా చరమగీతంలో కలవనీ - భూమాత ముచ్చటగా పచ్చికను ప్రసవించే ఆనందం: జనన మరణములు జంటగా విలయతాండవం చేసే ఆనందం; పెనుతుఫాను చెలరేగి, లోకాలను చైతన్య వంతం చేసే ఆనందం; బాధను ధైర్యంగా భరించే ఆనందం; మౌనంగా, అన్నీ వదులుకోగల ఆనందం.

(46)

నాకు తెలుసు, హృదయేశ్వరా, ఇది నీ దివ్య ప్రేమ. ఆకులపై ఆడుకునే ఈ బంగరు వెలుగు, ఆకాశంలో తేలిపోయే రంగురంగుల మేఘాలు, చల్లగా స్పృశించి కదలిపోయే మలయానిలము.

ఉదయారుణ కాంతులు నీ సందేశాన్ని తెచ్చాయి. నీవు వంగి, నా కళ్లలోకి చూస్తావు. నా హృదయం నీ పాదాలను స్పృశిస్తుంది.

(47)

నీ కోసం రంగురంగుల బొమ్మలు తెచ్చినప్పుడు. నా కన్నయ్యా, నాకు అర్థం అవుతుంది. మేఘాలలో అన్ని రంగులు ఎందుకు వున్నాయో; నీళ్ళలో నాట్యం చేసే రంగులు; పువ్వులపై అన్ని రంగులు ఎవరు అద్దారో.

నువ్వు ఆడాలని నేను పాడినప్పుడు నాకు బోధ పడుతుంది. ఆకులలో సంగీతం ఎందుకు వున్నదో, భూమాతకు వీనుల విందుగా కెరటాలు తమ సంగీ తాన్ని ఎందుకు వినిపిస్తాయో.

నీకు అనడానికి మధురపదార్థాలు నేను తెచ్చి నప్పుడు, నాకు తెలుస్తుంది - పూలబాల హృద యంలో తేనెలు ఎందుకు నింపుకుందో, పండ్లలో మధుర రసం ఏల దాగివున్నదో.

నువ్వు నవ్వాలని నేను ముద్దు పెట్టుకున్నప్పుడు, నా బాబూ, నాకు చక్కగా బోధ పడుతుంది. ఆకాశం లోని వెలుగు యిచ్చు ఆనందం, మలయమారుతం యిచ్చు చల్లని హాయి.

(48)

నాకు తెలియని స్నేహితులను నాకు ఇచ్చావు. పరాయి పంచలలో నన్ను నిలిపావు. అందరాని చందమామను చేతికి ఇచ్చావు. కొత్త మమతలను అందించావు. నా పరిసరాలను వదలిపెట్టి పోవాలంటే భయం. కొత్త అనుభవంలో కూడ హాయి వుంటుం దని, అక్కడ కూడ నువ్వు వుంటావని, మరచి పోతాను.

జననంలో మరణంలో, ఈ లోకంలో, ఇతర

లోకాలలో, నీవే నా జీవనాధారం, ఎనలేని ఆనందంలో ముంచెత్తుతావు.

నిన్ను పొందాక, అంతా ఆత్మీయతే గోచరిస్తుంది. నా ప్రార్థన మన్నించు దేవా, అంటూ నిన్ను కనుగొనే ఆత్మీయత నాకు ప్రసాదించు.

(49)

ఏటి మలుపున, పచ్చిక బయలులో ఆమె కనుపించింది 'దేవీ, కొంగుమాటున నీ దీపంతో ఎక్కడికి వెడుతున్నావు? నా యిల్లు చీకటిగా వుంది. నీ దీపం పెట్టు' అని అడిగాను. మసక వెలుగులో ఆమె నావైపు ఒక్క క్షణం చూసి, అన్నది - 'సంధ్యావేళ, నా జ్యోతిని నీటిలో వదలడానికి ఏటికి వచ్చాను' ఆమె దీపం మిణుకుతూ, వ్యర్థంగా ఏటిలో కొట్టుకుని పోవడం చూస్తూ వుండిపోయాను, ఒంటరిగా.

చీకట్లు దట్టంగా అలముకున్నాయి. 'దేవీ, నీ దీపాలన్నీ వెలిగాయి. మరి నీ దీపంతో ఎక్కడికి వెడుతున్నావు? నా యిల్లు చీకటిగా వుంది. నీ దీపం వెలిగించు' అని అడిగాను. ఆమె నా కళ్ళలోకి ఒక్క క్షణం చూసి అన్నది - 'నా దీపాన్ని ఆకాశానికి అర్పణ చెయ్యడానికి వచ్చాను.' ఆమె దీపం వ్యర్థంగా వెలగడం చూస్తూ నిలబడ్డాను.

చంద్రుడు లేని అర్ధరాత్రి వేళ, 'దేవీ, నీ దీపాన్ని హృదయానికి హత్తుకొని ఎక్కడికి వెడుతున్నావు? నా యిల్లు చీకటిగా వుంది. నీ దీపం వెలిగించు' అని అర్థించాను. ఆమె ఒక్క క్షణం ఆగి, నావైపు చూసి, 'నా దీపాన్ని, దీపావళిలో కలపడానికి తెచ్చాను, అన్నది. ఆమె దీపం, వ్యర్థంగా, దీపాలలో కలసిపోవడం చూస్తూ వుండిపోయాను.

(50)

పొంగి పొరలే నా జీవన రాగంలో, ఏ మధువును ఆస్వాదిస్తావు, శ్యామా?

విశ్వకవీ: నా కనులతో నీ అందాల సృష్టిని తిలకించడం, నా చెవుల దగ్గర నిశ్శబ్దంగా నిలబడి నీ అఖండ నాదాన్ని వినడం నీకు సదా కావాలి.

నీ విశ్వం నా మనసుకు మాటలు నేర్పుతుంది, నీ ఆనందం వాటికి రాగాలను కూర్చుతుంది. నీవు నీ మాధుర్యం నాలో చూచుకుని మురిసిపోతావు,

నీ దివ్య ప్రేమతో నన్ను స్వీకరిస్తావు, స్వామీ.

---

# చందాదారులకు వినతి

"నవభారతి"కి అన్ని విధాలా సహాయ సహకారములు అందిస్తున్నటువంటి పాఠకులకు, రచయితలకు, అభిమానులకు కృతజ్ఞతను తెలియచేస్తున్నాము. ఇంతవరకు తమ తమ చందాలను పంపుటకు వీలుగానివారు వెంటనే పంపించవలసినదిగాను, చందాదారులుగా ఉన్నటువంటివారు తమ సభ్యత్వమును పునరుద్ధరించి యధాతథంగా తమ సహాయము సహకారము లిచ్చి అన్నివిధాలా తోడ్పడవలసినదిగా విజ్ఞప్తి చేస్తున్నాము.

—మేనేజరు.

# యదార్థం

గుమ్మనూరు రమేష్ బాబు

సున్నపు పూతను చూచి
పున్నమి వెన్నెల వెల్లనుకొంటే ఎవరిది తప్పు ?
ఎడారిలో తిరుగాడే తీతువును చూచి
కుహూరాగాల కోయిలను కొంటే ఎవరిదితప్పు ?
మాధవుడు చూచింది
నీల రూపం కానే కాదు -
మచ్చపెట్టలేని కమ్మని హృదయం !
మహా కల్పాల తరబడీ నిలచే మధురోదయం !
మదన గోపాలుడు వలచింది
రాధికానృత్య సంపత్తిని చూచికాదు-
ఎనలేని మమతను చూచి !
ఏనాటికీ కొనలేని ఆ మృదులాలతిని చూచి !
మురళీలోలుడు పాణిగ్రహణము గావించినది
రుక్మిణి అపురూప లావణ్యవతి యని కాదు-
ఆ మగువ సదాతొణికిసలాడే అనురాగ మూర్తియని !
ఆ చెలువ నూరుపాళ్లుగా నిండుకొన్న వాత్సల్యప్రభంగిమని
మందహాసాల గోపీప్రియుడు మనసిచ్చింది
మీరా ప్రణయసితార కీర్తనానికి మురసి కాదు-
ఆలలన మనోహర లాలనకు పరవశించి !
ఆ చెలియ మనసార పెంచుకొన్న అనుభూతిని దరిసించి !
మనుగడ నిలిపే ద్వారకా వాసుడు దాసోహమన్నది
సత్యభామా సౌందర్య ప్రభావ లహరికి భ్రమసికాదు-
ఆ మహిళ కోమల హృదయ కమలమునకు ముదమొంది !
ఆ వనిత సతత హరిత ఆత్మీయతకు అచ్చెరు వొంది !
మరి..........
నీలో ఆ గీతాచార్యుని తత్త్వముందా ?
సంపూర్ణత సిద్ధించిందా ?
నీవు మనసిచ్చిన నీ చెలిలో ఆ మనస్తత్వముందా ?
పరిపూర్ణత సాధించిందా ?
అందుకే.........
ఆ యదార్థం తెలియనిదే
ఆ పరమార్థం తెలుసుకోనిదే
నీవు ఏనాటికీ ప్రేమమూర్తి కాలేవు !
నీవు కోరుకొన్న ప్రేయసిని చూడలేవు !

*

# ఆశయవాదములు (IDEOLOGIES)

(ఈ వ్యాసం: జీవనంతో పరామర్శలు "Commentaries on Living" శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారి రచనలు ఆధారంగా ప్రకటితమైన గ్రంథంలో వక పరామర్శకి అనుసరణ. వారితో ప్రసంగించేవారి సంభాషణని సంభాషణ మర్యాద ననుసరించి "... ..." లతోను శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారి వ్యాఖ్యని మామూలుగాను ఆ గ్రంథంలో అనుసరించిన పద్ధతినే అనుసరించి వ్రాయడమైనది. ఇది ఇరువురిమధ్య సంభాషణ అందులో ఒకరు శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు)

"ఈ మనస్సు యొక్క అంతర్వ్యవహారాల తీరు తెన్నుపైనా మనస్తత్వ శాస్త్రం పైనా చేసిన మీ ప్రసంగం అంతా వ్యర్థం. అనవసర కాలయాపన శుద్ధ దండగ. ప్రజలకి కావలసింది తిండి. అందుకు కావలసినది పని ఈ విధంగా మానవుడి ఆర్థిక పరిస్థితిపై నిజమైన సంగ్రామం మొట్ట మొదట జరగాల్సి ఉందని ప్రత్యక్షంగా కనిపిస్తుంటే మీరీ విధంగా ప్రసంగించడం ప్రజలని కావాలని ప్రక్క దారులకి పట్టించడం కాదా? మీరు చెప్పే విషయాలకి కట్టకడపట ప్రాధాన్యం: ఆవశ్యకత ప్రభావం ఉంటే, ఉండవచ్చు. కాని ప్రజలు ఆకలితో మాడిపోతుంటే ఈ పొల్లుమాటలు అన్నీ ఏమి మేలు చేస్తాయి? కడుపు నిండనిదే మీరేమీ చేయలేరు. ఆలోచించనూ లేరు."

నిజమే: జీవన వ్యవహారం కొనసాగించ గలగాలంటే కడుపులో ఏదో కొంత ఉండాలన్నది ప్రత్యక్ష విషయమే. కాని అందరికీ తిండి ఉండాలంటే మౌలికమైనదీ, మన ఆలోచనా ధోరణులను కూకటి వ్రేళ్ళతో సహా కదిలించేదీ అయిన మహా విప్లవం ఉండాలి. అనుకనే మానసిక రంగంపై మన యుద్ధానికి ప్రాముఖ్యం ఏర్పడింది. మీకు ఒక "ఆశయ వాదం" (Ideology) ఆహారోత్పత్తికంటే కూడా ఎంతో ప్రధానమయినది. పేదలకి కడుపు నిండా తిండి విషయమై మీరెంతైనా ప్రసంగించవచ్చు. వాళ్ళ కోసమే మీ సర్వ ప్రయత్నాలూ, అసక్తి ఉన్నట్లు ఆ ప్రసంగాలుండవచ్చు కూడా. కాని వీటన్నిటికంటే కూడా "ఆశయం" లేదా ఆ "భావం" పైన మీకు అసక్తి మెండు. మీ ఆశయ వాదంపైన మీ అసక్తి మెండు.

"అవును. నిజమే. మాకు మా ఆశయం పైనే అసక్తి. కాని ఈ ఆశయవాదం, ముఖ్యంగా సామూహిక కర్మాచరణకి ప్రజలని ఒక దగ్గరికి చేర్చేందుకు ఒక సాధనం మాత్రమే. ఒక ఆశయం లేకుండా సామూహిక క్రియాశీలత లేదు గదా! ఒక ఆశయం లేదా ఒక ప్రణాళిక ముందు వస్తుంది. తరువాత దాన్ని అనుసరించి కర్మాచరణం వస్తుంది. కాదా?"

అనుక మీరు కూడా మానసికాలయిన కారకాల తోనే మొట్టమొదట అసక్తి వ్యవహారమూ కలిగి వున్నారు. మీరు అనే కర్మాచరణం దానినుండే, దాన్ని అనుసరించి వస్తోంది. అనుక ముందు మానసిక కారకాలపై ప్రసంగించడం ప్రజలని పెడదారి పట్టించడం అనేది మీరు అలా ఉద్దేశించి అనలేదను కోవాలి కదా! కనుక మీ తాత్పర్యం ఏమంటే, మీవద్ద మాత్రమే హేతుబద్ధమయిన ఆశయవాదం లభిస్తోంది. అనుక ఇంకా ఈ విషయాలపై అనవసర కాల యాపనా, అసక్తీ ఎందుకూ అని. మీ ఆశయ సిద్ధి కోసం సామూహికంగా ప్రయత్నించాలని మీ కోర్కె. అందుచేతనే మీరు "ఈ మానసిక ధోరణులపైన వ్యవహారాలపైనా చూపే అసక్తి శుద్ధ దండుగ.

ప్రధాన సమస్య నిలచి పెడదారి పట్టడం పట్టించడం మాత్రమే. అసలు ప్రధానమయినది ఏమంటే అందరికీ పని కల్పించగలిగి, అందరికీ తిండి నిచ్చే వర్గ రహిత సమాజ నిర్మాణం మాత్రమే వగైరా: వగైరా" అని అనడం కదా.

"అయితే మా ఆశయవాదం విస్తృతమయిన చారిత్రక అధ్యయనం ఆధారంగానూ, వాస్తవిక విషయాల కనుగుణంగా చరిత్రని వ్యాఖ్యానించడం ద్వారానూ ఏర్పడింది. ఇది వాస్తవిక విషయాల అధ్యయనం. అంతేగాని మతంలో లాగా మూఢ విశ్వాసాల కట్టకాదు. ప్రత్యక్షమైన, సూటి అయిన మానవానుభవం మా ఆశయవాదానికి వెన్నెముక. (మతంలో లాగా) ఊహా జనిత మిథ్యలూ ఏవో భావావేశపు కలలూ, ఆదేశలూ, దృశ్యాలూ కాదు

వ్యవస్థా రూపంగల మతాలు ఆశయాలూ, సిద్ధాంతాలు అన్నీ కూడా అనుభవాన్ని ఆధారం చేసుకొని ఉన్నవే. కాక పోతే అవి వాటిని బోధలుగా ప్రవచనాలుగా చెప్పిన వారిని ఒక్కరినే చెప్పవచ్చు. అవి కూడా చారిత్రకమైన వాస్తవాల మీదే ఆధారపడినాయి. అయితే మీ ఆశయవాదం ఒక వేళ అయితే, ఇంకా విస్తృత అధ్యయనం ఫలితంగానూ; ఇతరాలతో పోల్చుకోవడం ద్వారానూ, కొన్ని వాస్తవాలను స్వీకరించి మరి కొన్నిటిని తిరస్కరించడం ద్వారానూ, ఏర్పడి ఉండవచ్చు. మీ నిర్ణయాలు, అనుభవం నించి లభించినవి కావచ్చు. అయితే ఇతరుల ఆశయవాదాల్ని మిథ్యావాదాలుగా తిరస్కరించడం ఎందుకు? అవి కూడా మానవానుభవాన్నే ఆధారం చేసుకొని జన్మించాయి కదా! ఇంక పోతే మీ ఆశయవాదానికి వెనుక ఒక సంఘాన్ని చేరదీస్తారు. ఇతరులూ ఇదే చేస్తారు. అయితే అది వారి ఆశయవాదం వెనుక మీకూ సామూహిక కర్మాచరణం కావచ్చు. అలాగే వారికిన్నీ: కాక పోతే మరో తీరుగా, ప్రతి సందర్భంలోనూ మీరనే సామూహిక కర్మాచరణం ఒక ఆశయాన్ని ఊతగా తీసుకొని వస్తుంది. కావాలనో, కాదనో సామూహిక క్రియాశీలతకి ఏదో ఒక రూపంలో ఉండే ఒక భావం యెడలనే మీ ఏల్లరికీ ఆసక్తి, ప్రతి ఆశయవాదానికి మానవానుభవమే ఊత కర్ర కాకపోతే మీరు వారి అనుభవాన్ని దాని విలువనీ తిరస్కరిస్తారు. వారూ అలాగే మీ పద్ధతిని సాధ్యమయేది కాదనీ, వినిసత్వానికి దారి తీస్తుందనీ, వగైరా ఉపపత్తులలో మీ అనుభవాన్ని తిరస్కరిస్తారు. మీరు వారిని యుద్ధోన్మాదులనీ వారి వ్యవస్థ చిట్ట చివరకి ఆర్థికంగా సర్వనాశనానికి దారితీసి తీరుతుందనీ అంటారు. కనుక మీరిరువురూ కేవలం మీ, మీ ఆశయవాదాల యెడల మాత్రమే ఆసక్తిని చూపుతారు. కాని మానవుని ఆకలి కడుపుని నింపడం మీదగాని, వానికి సుఖ సంతోషాలు చేకూర్చడం మీదకాని కాదు. ఇంక ఈ రెండు ఆశయవాదాల మహా సంగ్రామంలో మానవుడు మాటుకు పోరాడు.

"మానవుని రక్షించడానికే మానవుని మరిచి పోవడం జరుగుతుంది. భవిష్యన్మానవుని రక్షించడానికి నేటి మానవుని త్యాగం చేస్తాము. బలి చేస్తాము."

కనుక మీరు భవిష్యత్తుకోసం వర్తమానాన్ని బలి చేస్తారు. మీరు ఆది దేవుని శక్తి సామర్థ్యాలనురాజ్యం పేరిట ఆరోపించుకొంటారు; భగవంతుని పేరిట చర్చివారు చేసినట్లే. మీఇరువురకూ మీమీ దేవతలున్నారు. మీ మీ పవిత్ర గ్రంథాలున్నాయి. మీరిరువురకూ ఆగ్రంథాలను వ్యాఖ్యానించి తెలియజెప్పేపూజారులూ, సత్య ప్రవచకులూ ఉన్నారు: మీరు నిజమైనదిగా శాసించే దాని నుండి ఈషత్తైనా అవతలకు జారినవాడిగతి అధోగతీ, సర్వభ్రష్టతే. మీ ఇరువురిలోనూ పెద్ద భేదం ఏమీ లేదు. మీరిరువురూ పూర్తిగా ఒకని పోలి రెండవ వారు ఉంటారు. మీ మీ భావ వాదాలు వేరు వేరు కావచ్చు. కాని వాటి తీరు తెన్నులూ నిర్మాణమూ, మాత్రం ఇంచు మించు ఒకటే. ఇద్దరూ

భవిష్యన్మానవుని కోసం వర్తమాన మానవుని బలి పెట్టేవారే: అక్కడికి ఆ భవిష్యత్తు విషయం పూర్తిగా మీకు తెలిసినట్లు: అదేదో అభవిష్యత్తనేది ఒక నిశ్చలమైన వస్తువైనట్లూ, దానిపై పూర్తిహక్కు భుక్తాలు మీకు మాత్రమే చెందినట్లు: మళ్ళీ విచిత్రం ఏమంటే మీలో ఒకరికి రేపనేది ఎంత అనిశ్చితమైనదో రెండవవారికి అంతే భవిష్యత్తుని ఏర్పరచేవీ, ఊహాతీతాలయినవీ, అయిన వాస్తవిక విషయాలెన్నో అనేకం వర్తమానంలో ఉన్నాయి. మీరు ఇరువురూ భవిష్యత్తులో మానవునికి ఒక మంచి బహుమతిని, ఒక స్వర్గాన్ని, ఒక రామరాజ్యాన్ని వాగ్దానం చేస్తారు. వాని భవిష్యత్తనేది ఏదో ఒక ఆశయవాదపు తుది నిర్ణయం కాదే! భావాలు, ఆశయాలూ వీటికి భవిష్యత్తు ఏదో, భూతకాలం మీదో దృష్టి ఉంటుంది తప్పించి ఎన్నటికీ వీటికి వర్తమానంపై చూపు ఉండదు. వర్తమానం గురించి ఒక భావం లేదా ఆశయం అనేదే ఉండదు. ఎందువల్లనంటే వర్తమానంలో ఉండగల్గింది కర్మాచరణం: వర్తమానమే కర్మాచరణ రంగం. లేదా కార్యామైన దాని చేయడం అనేది వర్తమానంలోనే ఉంటుంది. మిగిలిన అన్ని కార్యాలూ, కర్మాచరణమూ; ఆలస్యాన్నీ, వాయిదా వేయడాన్నీ సూచిస్తాయి కనుక అది కార్యాచరణమే కాదు, అంటే నిజమైన కార్యాకరణాన్ని తిరస్కరించడమే. దానినించి తప్పించుకు పోవడమే. భూతకాలానికి సంబంధించినది కానివ్వండి, భవిష్యత్తుకి సంబంధించినది కానివ్వండి, ఈ కాలానికి సంబంధించిన ఒక భావం లేదా ఆశయం మీద ఆధారపడిన చర్యలన్నీ నిజంగా అకర్మలు. జడత్వంతో కూడినవి. నిజమైన కర్మ అనేది వర్తమానంలోనే ఉంటుంది. ఇప్పుడులోనే చేయడం ఉంటుంది. కాని ఆశయం భూత భవిష్యత్తులకి చెందినది, వర్తమాన పరమైనది కాదు. ఆశయ వాదికి గడిచిపోయినది గాని, రాబోయేదిగానీ, రెండూ రెండు స్థిరమైన స్థితులు. ఎందువల్లనంటే తను కూడా గడిచిపోయిన దానికో రాబోయో దానికో ముడిపడి స్థిరంగా ఉంటాడు గనుక, ఆశయవాది ఎప్పుడూ వర్తమానంలో ఉండడు. అతనికి జీవితం అనేది ఎప్పుడూ భూతకాలంలోనో, భవిష్యత్కాలంలోనో ఉంది, వర్తమానంలో అతనికి జీవితం ఏనాడూ ఉండదు. ఆశయం అనేది భూతకాలంలోంచి వర్తమానం గుండా భవిష్యత్తులోనికి దూసుకొని పోయేవి. ఆశయవాదికి వర్తమానం కేవలం భవిష్యత్తుకి దారి మాత్రమే. కనక ప్రధానం కాదు. ఏరీతినైనా, ఏ పద్ధతినైనా సరే గమ్యం చేరాలి. గమ్యమే కాని రీతి గాని పద్ధతిగాని చేరేమార్గంగాని ప్రధానం కాదు. ఫలితమే వారి గమ్యానికి ప్రధానం. ఏ మార్గాన్నైనా అనుసరించు గమ్యముచేరు. గమ్యం స్థిరమైనది. భవిష్యత్తు అంతా తెలిసిందే జ్ఞానమే. గనుక గమ్యం చేరడానికి ప్రతిబంధకంగా ఎవరడ్డు నిలిచినా సర్వ నాశనం చేయి. అంతేగదా!

"అనుభవం అనేది, కార్యమయిన కర్మాచరణానికి అత్యంత ముఖ్యము. భావాలూ, వివరణలూ, వ్యాఖ్యానాలూ, అనుభవం నించివస్తాయి. నిశ్చలంగా మీరు అనుభవాన్ని తిరస్కరించడం లేదుగదా! భావాల ఆశయాల చట్రంతో పనిలేని కర్మాచరణం, పిచ్చిది, చిందరవందర అయినది. నిర్లక్ష్యమయినది. ఒక లక్ష్యం అంటూలేని అవ్యవస్థ వంటిది. అలాంటి కర్మాచరణం మనల్ని తీసుకుపోయే చోటు ఒక్కటే. అది పిచ్చి ఆసుపత్రి. ఒక ఆశయంయొక్క సుసంఘటిత శక్తితో ప్రమేయం లేని కర్మాచరణాన్ని మీరు బోధిస్తున్నారా? అసలు ఏదో ఒక భావం లేదా ఒక ఆశయం లేకుండా మీరేమి చేయగలరు".

సరి: మీరన్నట్లుగా ఒక భావం, నిర్ణయం, వివరణ. ఇవి అనుభవాన్నించి వచ్చేదే, అనుభవం లేకుండా విజ్ఞానం లేదు, విజ్ఞానం లేకుండా కర్మాచరణం లేదు. అయితే ఒక ప్రశ్న: అసలు భావం నుంచి, ఆశయం నుంచి కర్మాచరణమా? లేక

కర్మాచరణం నుంచి భావమో ఆశయమోనా? లేక ముందు ఆశయం ఆ తరువాత కర్మాచరణమా? మీరు అనుభవం ముందు వస్తుంది అంటున్నారు కదా! అంటే అనుభవం ముందు తరువాత కర్మాచరణమా? అసలు అనుభవం అనడంలో మీరనదలచింది ఏమిటి?

"అనుభవం ఏమిటంటే ఒక గురువుది గాని, రచయితది గాని ఒక విప్లవవాదిది గాని అయిన విజ్ఞానం. ఈ విజ్ఞానాన్ని అతడు తన కృషితోనూ, అధ్యయనంతోనూ, తన అనుభవాలనించీ, లేదా తన వంటి ఇతరుల అనుభవాలనించీ, పేర్చి, అమర్చి, ఏకీకృతం చేసినది. ఈ విజ్ఞానం నించిగాని అనుభవాన్నించి గాని భావాల లేదా ఆశయాల నిర్మాణం జరుగుతుంది. ఈ ఆశయవాదపు మహా నిర్మాణం నుంచి కర్మాచరణం సాగు వారుతుంది, స్రవిస్తుంది"

అయితే అనుభవం ఒకటీ (కర్మాచరణకి) ముఖ్య లక్షణమా? ఇది ఒక్కటీ కర్మాచరణాన్ని కొలవడానికి ప్రామాణికమైన కొలబద్దా? అనుభవం అనడంలో మనం ఉద్దేశించేది ఏమిటి? మన ఇరువురం కూడి ఇలా మాట్లాడుకోవడం ఒక అనుభవమే. మీరు ప్రేరణలని ప్రతిస్పందనలని చూపుతున్నారు. ఇలా ప్రేరణకి చూపే ప్రతి చర్యలే అనుభవం కాదా? అయితే ప్రేరణా ప్రతిచర్యా ఇంచుమించు ఒకే సారిగా జరిగే రీతి. మన పూర్వ రంగం యొక్క చట్రంలో ఇవి స్థిరమైన కదలికలు ఈ పూర్వ రంగమే ప్రేరణకి ప్రతిస్పందనని చూపుతోంది. కాదా? ఈ ప్రతిస్పందన మన పూర్వ రంగం నుంచి అంటే ఒకానొక సంస్కారావరణ నించి. అనుభవం ఎల్లప్పుడు ఈ ఆవరణతో కూడినదే. కనక అప్పుడు భావం లేక ఆశయం కూడా అలాంటిదే గదా! కనుక ఆశయం మీద ఆధారపడిన కర్మ శీలతకి కూడా ఈ ఆవరణం ఉంటుంది. అది పరిమితమయినది. నియమిత మయినది. అనుభవం, ఆశయం ఇవి తనకే వ్యతిరేక మైనఅనుభవం, ఆశయంతో తలపడి ఒక సుసమ్మేళిత తత్వాన్ని తయారు చేయదు. ఇంకా ఎక్కువైన పైరుద్ధ్యాన్ని కలిగిస్తుంది. ద్వంద్వాలు వ్యతిరేకాలు ఏనాటికి ఒక సుసంయోగ తత్వాన్ని తయారు చేయలేవు సమ్యక్ కలనము లేదా యస్తిలో (Integration) పైరుద్ధ్యం లేనిచోటనే సాధ్యం కాని ఆశయాలూ, భావాలూ, పైరుద్ధ్యాన్ని, ద్వంద్వాల సంఘర్షణ కాని జనింప చేస్తాయి ఏ పరిస్థితులలోనూ అవి ఒక సమ్యక్ తత్వాన్ని (synthesis) తేలేవు.

ప్రేరణకి పూర్వరంగం చూపే ప్రతిచర్యే అనుభవం పూర్వరంగం భూతకాలపు ప్రభావమే భూత కాలపుదే స్మృతి కూడా స్మృతియొక్క ప్రతిచర్య భావం కనుక అనుభవం పేరుతోనూ, విజ్ఞానం పేరుతోనూ, స్మృతినించి నిర్మించిన ఒకానొక ఆశయ వాదం ఏదైనసరే విప్లవాత్మకమైనది కాదు. అది తనను తాను విప్లవాత్మకమైన దానినిగా వర్ణించుకోగాని! అది కేవలం మరో రూపంలో తెంపు లేకుండా సాగుతున్న భూతకాలపుదే. ఇలాగే దీనికి వ్యతిరేకమయిన ఆశయవాదం గాని, సిద్ధాంతం గాని. ఏదైనా ఒక భావమే. ఏనాడైన భూతంగత కాలానికి చెందిందే ఏ ఆశయ వాదమూ ఏకైక ఆశయ వాదం కాజాలదు కాని నీవు నీ ఆశయవాదం మరి ఏ ఇతర ఆశయవాదం వంటిదే. పరిమితమైనదనీ నియమితమైనదనీ, పూర్తిగా ఆవరణ ప్రతిబంధం కలిగినదేననీ వివిధ విషయాలపై పూర్వ నిర్ణయం చేసుకొన్నదేననీ, అంటే ఎవరూ నిన్ను నుసరించరు. కనక నీ ఆశయవాదమే ఏకైకమనీ, ప్రపంచాన్ని రక్షించడానికై ఏర్పడిన ఆశయవాదమనీ, అని తీరాలి. మనలో చాలా మందిమి, సూత్రాలకీ, నిర్ణయాలకీ, నినాదాలకీ అలవాటు పడిన వాళ్ళమే కనక మనం అనుసరిస్తాం. మనం పూర్తిగా దోపిడీ అవుతాం. ఇలాగే ఈ దోపిడీకి పాల్పడే దోపిడీ దారు కూడా పూర్తిగా దోపిడీ అవుతాడు.

ఒక భావంపై ఆధారపడిన కర్మ ఏదీ విడుదల ఇచ్చే కర్మ ఏనాటికీ కాలేదు. కాగా ఎల్లప్పుడూ ఇంకా బంధాన్ని కలిగించేదే అవుతుంది. ఒక గమ్యం

కోసం. ఒక చివరకోసం ఒక లక్ష్యం కోసం ఉద్దేశించిన కర్మ పోనుపోను కాలాంతరంలో అకర్మ లేదా కారణం అవుతుంది. కొద్దిపాటిలో చూచినప్పుడు పరిమిత దృష్టితో చూచినప్పుడు, అది ఒక కర్మ పాత్రని ధరించవచ్చు. కాని అలాంటి కర్మ ఆత్మ వినాశకారి ఇది మనకి నిత్యజీవితంలో స్పష్టంగా తెలుస్తున్న విషయమే

"కాని ఎవరైనా తన పరిమితత్వాన్నించి, లేదా తన ఆవరణంనించి పూర్తిగా ఏనాటికైనా విడివడగలరా? మేము ఇది అసంభవం అని అనుకొంటున్నాము"………

మళ్ళీ ఒక భావం, లేదా ఒక విశ్వాసం మిమ్మల్ని బందీ చేస్తుంది. మీరు విశ్వసిస్తున్నారు. మరొకరు విశ్వసించరు. మీరెప్పుడూ మీ మీ విశ్వాసాలకి బందీలే మీ మీ ఆవరణలకి అనుగుణంగానే మీరు అనుభవాలు పొందుతారు. ఆవరణంయొక్క; ఒత్తిడుల యొక్క; ప్రభావాల యొక్క; తీరు తెన్నుల పూర్తి వివేచనలేక విచారం వల్ల మాత్రమే విడుదల సాధ్యం కావచ్చు. ఈ నిర్మాణం, ఈ రీతి, ఈ ప్రవృత్తి యొక్క బోధయే దానిను గురించిన ఎరుక. అంటే బంధం నించి ముక్తి ఆ ఎరుక ద్వారా మాత్రమే అంతేకాదు. ఈ ఆత్మ విచారం, ఈ వివేచన, ఈ ఆత్మ జ్ఞానం, అన్ని ఆశయవాదాలూ, అన్ని రకాల విశ్వాసాలూ, అన్ని ఉద్దిష్టమైనదీ, వాటికి అతీతమైనదీ, వాటింటే స్వతంత్రమైనదీని ఇటువంటి విడుదల ఉంది ఈ విడుదల ఎటువంటి విశ్వాసపు, ఎటువంటి ఆశయవాదపు, ఎటువంటి మనః కల్పిత పరిచ్ఛిన్నరా, ప్రతిబంధక స్పర్శ లేనట్టిది

# మేలుకో స్వామీ! మేలుకోరా!

కల్యాణ శ్రీనివాసా
జగమేలు చిద్విలాసా
మేలుకో నా స్వామి మేలుకోరా
పలుకో. నాస్వామి పలుకోరా
తొలిపూవు పూజకై
తోటలో పూసింది
తూరుపు కిరణాలు
వెండితోరణాలు కడుతుంటే
"మేలుకోరా...పలుకోరా"
చీకటి తొలి సంధ్యలో
ప్రేమ చితిమంటల పాలైతే
గుండె గుండె రగిలి
పగిలిపోతూంటే
"మేలుకో...పలుకోరా"

అలముకున్న అజ్ఞాన
చీకటి తెర తొలగించరా
ఆరని వెలుగువై నిండరా
కరిగి కరిగీ రార నా స్వామి
కరుణ వాగై రారా నా స్వామి
॥మేలుకో॥

చిన్నారి గొంతులూ
మూగ బోయాయి
మూగ గుండెలలో
నీవు పలుకరా
మా మొరలాలకింపంగ
నీవు కదలిరా...కదలిరా...
"మేలుకో...పలుకోరా..."

# శాకుంతలమున శాప వృత్తాంతము

శ్రీ గుఱ్ఱం వేంకట సుబ్రహ్మణ్యం

కాళిదాసు తన నాటకమున నూతనముగా సృష్టించినది దుర్వాస శాపము. భారత కథా స్వరూపమునే మార్చి వేసినది. దుష్యంతుని ఋజుస్వభావమును పరిరక్షించినది. మన పురాణ గాథలలో శాపమన్నది పలు తావులలో దవులుచున్నదే. బ్రహ్మకును బ్రాహ్మణునకును గల విచిత్ర సంబంధమునకు శాపమొక నిదర్శనము. బ్రహ్మనుండి అనిస్యూతముగా ప్రవహించుచున్న వేద ప్రవాహము బ్రాహ్మణ వాక్కునను ఆ విధిత్వమును ప్రాపింప జేసినది. విధిజ్ఞులే గాదు విధి ప్రవర్తకులు కూడ తపశ్శాలురైన బ్రాహ్మణులు. వారి అనుగ్రహాగ్రహములు ఇతరులకు శుభాశుభ ప్రదాయకములు. దైవమే ఋషుల వాక్కున ప్రవర్తిల్లి భావి వ్యవహారమును అనుసంధించునది.

శాకుంతలమున శాపకథకు ముందే అనుగ్రహ కథ యున్నది. లేడిని తఱుముకొని పోయిన దుష్యంతుని వారించి శరమునుడింప జేసిన వైఖానసుని వాక్కు అది.

పురుకుల ప్రభూత భూపాలునకు నీకుఁ
దగుఁగదయ్య దొడ్డతన మిదెల్లః
పడయుమయ్య చక్రవర్తి యౌపుత్త్రుని
నిన్నుఁబోలు సుగుణ నికర నిలయు

ఈ ఆశీస్సునకు మహారాజు "బ్రాహ్మణ వచనమును పరిగ్రహించితిని" అని నమ్రశిరస్కుడై బదులు పల్కినాడు. "బ్రాహ్మణ వచనము" అనుటలోనే 'బ్రహ్మనిర్ణయము' అను స్ఫురణ యున్నది. 'పరిగ్రహించితిని' అనుటలో "శకుంతలా పరిగ్రహణము" ఉన్నది. తృతీయాంకమున గాంధర్వ విధిని రాజు శకుంతలను పరిగ్రహించుట యన్నది కార్యరూపము దాల్చిన యీ వాక్ పరిగ్రహణమే. వైఖానసాశీర్వాదరూపమున పరిదత్తయైనదిగా భావించవలె శకుంతలను. కణ్వుడు ఆశ్రమమున లేనప్పుడు అట్టి అధికారమున్నది గావలె వైఖానసునకు. ఇదంతయు గుప్తమైయున్నది. పైకి సామాన్యముగా దోచు మంచి మాటయైన ఆయాశీస్సులో.

బహుపరిగ్రహములున్న మహారాజునకు వెతసేయుచున్న అనపత్యతను తొలగించి, పుత్త్రప్రాప్తిని అనుగ్రహించుచున్న ఈ వైఖానస వాక్కును ఫలింప జేయుటకు అవసరమైనది కన్యాపరిగ్రహణము. సద్యఃఫల ప్రదాయినియైన వాక్కు గావుననే ఆశ్రమ ద్వారము యీప్సితఫలసిద్ధికి ముఖద్వారమైనది.

దృశ్యకావ్యము కాబట్టి 'అభిజ్ఞాన శాకుంతలము' అని నామకరణము చేసినాడుగాని శ్రవ్యకావ్యమే యైనచో 'భరత సంభవము' అనియే 'కుమార సంభవము' వలె నామకరణము చేసియుండును మహాకవి. ఈ శృంగార కథకు ప్రయోజనము ఆ సంతాన ప్రాతిపాదనమే. శృంగారము ధర్మ్యమైనది, వంశ సాతంత్యఫల కారణమౌట చేతనే.

పరిగ్రహమునకు శాపమునకు కూడ బీజము ప్రథమాంకమున ఒక్క వాక్యములోనే ఇమిడి యున్నది. అది గూడ వైఖానసుని నోట వెలు వడినదే. మహర్షులవారు ఆశ్రమమున లేరని తెలుపుచు, 'అతిథి సత్కారార్థము కుమార్తెను శకుంతలను నియోగించి యున్నారు' అని పల్కుటలో దుష్యంతుడు 'విశిష్టాతిథి' యని ప్రియంవద పేర్కొనుచు, 'నాయనగారే యింట నుండిన నెట్టి అతిథి సత్కారము కావిం చెడివారో' అన్నది; శకుంతలను దుష్యంతునకు సమర్పించువాడని సూచించుచున్నది. మహా రాజునకు అతిథి సత్కారమును తన్నియుక్త యైన శకుంతల సను గముగా జరిపినది. తన్ను తానే సమర్పించుకొను గాంధర్వ విధి ప్రకారం మున గుప్తముగాను, వైఖానసాశీర్వాదముఖ మున మఱింత గుప్తముగాను మహారాజు సత్కారము పొంది హస్తినకు వెడలిపోయి నాడు. వారము రోజులలో శకుంతలను తోడ్తె చ్చుటకు పరివారము పంపెదనని మాట యిచ్చి దానికి విఘాతము కల్పించినది శాప వృత్తాం తము.

ఆశ్రమమునకు వచ్చిన అతిథి దుష్యంత మహారాజే కాదు, దుర్వాస మహర్షి గూడ. ఇతనికిని అతిథి సత్కారము చేయవలసిన బాధ్యత శకుంతలపై నున్నది. తండ్రిగారి అజ్ఞానుసారము. కాని యీ అతిధికి సత్కా రము జరుపలేదు శకుంతల. అందువలననే శాపము పాలైనది.

తొలుత ఆశ్రమ వాసినియై అతిధి సత్కార పరాయణమై యున్న ఋషికన్య యిప్పుడు (split Personality) మహారాజ గృహీతయై మనస్సుచేత హస్తినాపుర వాసిని. శరీర మాత్ర మున కణ్వాశ్రమవాసిని. అందువలననే ఆశ్రమ మున అతిధి సత్కార లోపము జరిగినది. షష్ఠేం ద్రియమైన మనస్సెక్కడ నుండునో జీవుడు మూడు పాళ్ళు అక్కడ నుండును. ఒక్కపాలే తదితరేంద్రియములున్న చోట. కుటీరమున శకుం తల కూర్చొని యున్నది కన్నులు తెఱచు కొనియే. మనస్సు మహారాజును వెదకికొని హస్తినకు పోయియున్నది. ఆ వేళకే మహా రాజు సైతము యీమె అంతర్యవనికపై మెదలుచున్నాడు గావలె మహారాజు చెప్పి పోయిన వారము రోజుల గడవులో ఆఖరు రోజేమోయది. ఆమె అదృష్టదేవతకు పూజ చేయవలెనని పూజ కోయుచుండినారు అన సూయా ప్రియంవదలు. ఆమెను కొంపోవు టకు రాజపరివారము రాకేగు సరిగదా వచ్చి నది తదంతరాయము రూపుగొన్న దుర్వాస మహర్షి.

"భో! నేను అతిధిని" అనుచు, నిలబడి నాడు కుటీర ద్వారమున, కనుల తెఱచుకొని చెవులు విచ్చుకొని. మనసు మూసికొనియున్న శకుంతల ప్రమోల. కనులు చెవులు పనిచేయ లేదు. కావున చేయి కాలు కదలలేదు. ప్రత్యు త్థానము జరుగలేదు. మఱి అర్ఘ్యపాద్యాదు లకు ప్రసక్తి యెక్కడ! ఈ తిరస్కారమునకు అసులభకోపునకే చిరాకు కలుగుననగా సులభ కోపునకు ఆగ్రహము కలుగుటలో ఆశ్చర్య మేమి ?

అతిథి పరిభావినీ !

ఇట్టులమిట్లనన్యమతినెవ్వని (జింతన సేయు<br>దానవై<br>కట్టెదుటం బరంగినను, గానవో<br>నన్నుదపై ప్రభావుని,

నె ట్టులు నున్ స్మరింపఁడతఁ డెట్టెదుటంబడి
జ్ఞప్తి సేసియున్
గట్టిగ బాపఁజేసి వెనుకన్ మధుపాయి
స్మరింప కున్న టుల్

అని శపించినాడు.

ఈ శాపము విచిత్రమైనది. మహర్షికి కోపకారణమైన నిశకుంతల మఱపు (ఏమఱుపాటు) ఆమె మరచినది తండ్రిగారి యాజ్ఞను. అతిథి సత్కారము చేయవలయుట తండ్రిగారి యాజ్ఞ. అందునై తాను నియుక్తయై యున్నది. తత్కార్యమున ప్రమాదము గుర్వాజ్ఞోల్లంఘనము, విశిష్టాతిథ్యవమానము, ధర్మహాని. మఱపుగొన్నది శకుంతలకదా! దుర్వాసుడు విధించిన మఱపు శకుంతలకు గాదు దుష్యంతునకు. ఆ మఱపు వలని ఫలితము శకుంతలకు ప్రాపిలు దుఃఖము. "నీవు గుర్వాజ్ఞను మఱచినావు. నన్ను ఏ మఱచినావు. కావున నీకు మఱపుగలుగుగాక! నీవు ఎవనిని గూర్చి ఆలోచించుచున్నావో అతనిని నీవు మఱచి పోదువుగాక!" అని శాపము పెట్టలేదు దుర్వాసుడు. మఱపు అతనికి, కలుగునన్నాడు, శకుంతల దుష్యంతుని మఱచిపోవుచో ఆమెకు బాధ కలుగదు. కావించిన ధర్మహానికి ఫలము ఆమెకు తగులవలెను. అనగా శాపఫలము ఆమెకు తగలవలెను. శాపము వేఱు, శాపఫలము వేరు. శాపము తగిలినది దుష్యంతునకు. అతనికి మఱపు ప్రాప్తించినది. శాపఫలము తగిలినది శకుంతలకు. ఆమెకు ప్రాప్తించినది నిరాకరణ-దుఃఖము.

ఈ శాపము దుష్యంతునకు ఎట్లు తగిలినది? ఎందువలన తగిలినది? నూర్ల మైళ్లు దూరమున నున్న దుష్యంతునకు స్మృతిచ్యుతి యెట్లు సంభవించినది? ఇందులకు సమాధానము – దుర్వాసుడు శకుంతల కన్నెదుట నిలబడి యుండగా, ఎన్నెదుట అతనికి కనబడుచున్నది ఆమె మనసులోని యవనికపై కదలాడుచున్న దుష్యంతమూర్తి. ఆతఁడే దుర్లభగదా మహర్షిని కోపకలితుని జేసిన అపచారమునకు కారణము ఆ మూర్తియతని కంటనే గోచరమైనది. తన్ను గుర్తింపక విస్మరించి యున్న శకుంతలకన్నులు వట్టి రంధ్రములే గావున వానిగుండా దూసికొని పోయి మహర్షి చూపు, ఆమె మనోయవనికపై చలించుచున్న రాజమూర్తిని ఎదుర్కొన్నది. మహర్షి మహారాజసంఘర్షణము. వాక్ప్రహారము ఆ మనోమయ తనువుపై. ఆ వజ్రాఘాతము స్మృతి విదళనము. హతమైనది ఆ స్మృతి తనువు మూర్ఛపోయినది. ఉపశమన వాక్యముగా 'అభిజ్ఞాన దర్శన పర్యంతము' అన్నది లోలో లుప్తమయ్యెడిదే. శాపఘాత వలన మూర్ఛపడి యుండినది దుష్యంత మనశ్శరీరమున ఈ స్మృత్యంగము.

బహిరంతస్సుల తారతమ్యమును తేల్చుచున్నాడు - దుర్వాసుడు. బహిస్సునతాను నిలబడియున్నాడు మహర్షి. అంతస్సున నిలబడి యున్నాడు మహారాజు. శకుంతల శరీరము అచేతన ప్రాయముగానున్నది. ఛాయాతనువు మహారాజునది. అది శక్తిహీనము శక్తియుతమై యున్నతనువు మహర్షిది వాగాయుధమును ప్రయోగించగలిగి యున్నది. తద్ఘాత పడవలసినదే గాని ప్రతీకారము చేయలేనిది దుష్యంతుని ఛాయాతనువు. ఆనాడు మృగముపై అమ్ము నెక్కు-పెట్టిన మహారాజు ఈనాడు దుర్వాసుని శాపశర ప్రయోగమునకు ఛాయారూపమున తానే మృగమైనాడు. అప్పుడు సాధువాక్యమున కొగ్గి తాను శరముదించినాడు. ఇప్పుడు ప్రియంవద వేడికోలు మాటలకు కొంచెము మెత్తపడి దుర్వాసుడు శాపావధిని అనుగ్రహిం

చినాడు. బహుశః ఆనాడు దుష్యంతుడు కరుణాహృదయుడై శరముడించుటన్నదే యీనాడు దుర్వాస శాపోశమనము సహోక్తికి కారణమైనది దారుణాఖండల శత్రుఖల్గమైనను బ్రాహ్మణశాపము ఉపశమించగ మం. దుర్వాసుని వంటికోపిష్ఠిపట్ల సైతము కనిమము ఉపశమన ప్రవృత్తిము.

ఈ శాపవృత్తాంతమంతయు తెరమఱుగున నడిచినది. ప్రేక్షకులకు ప్రత్యక్షముగాదు. ప్రేక్షకులకేగాదు ముఖ్యపాత్రలకును అప్రత్యక్షమే శాపము పాలైతినని శకుంతలకు తెలియదు. దుష్యంతునకును తెలియదు అనసూయా ప్రియంవదలకు మాత్రమే తెలియును. 'భారత కథలో తెఱమఱుగున నడిపోయినది ఈ క్రమము నేను సముద్ధరించుచున్నాను' అని కాళిదాసు మనలను హెచ్చరించుచున్నాడు గావలె. శ్రుతిగోచరమైనది మాత్రమే దుర్వాస వాణి ఆకాశవాణివలె భారత కథలో ఆకాశవాణి గదానారించినది నిరాకరణమును హాస్తినలో, దానిని పూర్వభాగము కావించినాడు కాళిదాసు. ఈ దుర్వాసవాణి రూపమున శకుంతల అదృష్టము మెలిపడినది. ఈ శాపము చేత అందువలన ఈ శాపము సంగతిగూడ అదృష్ట పరచినాడు కవి నాటక రచనలో విష్కంభమున చేర్చి, అందువలు శ్రుతిమాత్రము గాజేసి విన బడువాడేగాని దుర్వాసుడు మనకు కనబడడు. విధిప్రకారములట్లే కార్యరూపమున కనపడునే గాని కారణరూపమున గోచరించునవిగావు.

శకుంతలా ప్రణయస్మృతి దుష్యంతుని మనస్సులో సుప్తమైనదేగాని లుప్తముగాలేదు. శాపావధి యొకటి యేర్పడియుండుటయే దీనికి కారణము. అభిజ్ఞానదర్శనము అన్న ఆ యవధి సైతము సంవిగ్ధరూపమైనది ఉంగరము న్నది గాదా దీని చూపినచో రాజు స్మృతి ప్రబుద్ధ మగును అనుకొన్నారు. అనసూయా ప్రియంవదలు ఎందుచేతనేమి భర్తా... సుహరాజు నెన్ని గుర్తుపట్టుచో ఈ అభిజ్ఞానము చూపు మని ... బోధి... "తెన్నెందుకు గుర్తుపట్టక పోవు... అను నూన మేమిటి?" అనుకొన్నది శకుంతల. మనస్సు ... అతి స్నేహము పాపశంకి యగును సమాధానముతో ... కలవరపాటు

తరువాతగాని మనకు వ్యక్తముగాదు ఆ శాపావధి స్వరూపము. చూపుట వేఱు. చూచుట వేరు. చూపుటకు కర్త శకుంతల కానలె చూచుటకు కర్త దుష్యంతుడు కావలె. విస్మృతియన్నది తగిలినది. శకుంతలకుగాదు. అది తగిలినది దుష్యంతునకు. కావున దానిని తొలచికొనవలసినవాడు అతడు. అభిజ్ఞానమును చూడవలసినవాడు అతడు. తత్కర్తృత్వము అతనిది. సఖీ ప్రభోదితయై శకుంతలకు శాప స్వరూపముగాని అదవధి స్వరూపముగాని తెలియక నేపోయె. చూపుమన్న దిగదా చూపుద మని ప్రేఱు తడవుకొన్నది. ఉంగరము లేదాయె స్మృతి నష్టమునకు కారణము తెలియకట్లే అభిజ్ఞాన నష్టమునకును కారణము శకుంతలకు తెలియదు. సుఖదుఃఖములను అనుభవించు జీవులకు తత్తత్కారణములు ఇట్లే అగోచరములు. కేవలము అనుమానితములు. పశ్చిమ కాలమున విధి విలాసము నిర్వర్తితమైన విస్మృత మాత్రమే

అభివ్యక్తములు. అవధివాక్య వాస్తవార్థము దుష్యంతుడు అభిజ్ఞానమును చూచుటయే గావున అంగుళీయకము నష్టముగావలసినదే ఈ నష్టమును శకుంతలకు అజ్ఞాతమే. తెలియకయే స్మృతి నష్టమైనది దుష్యంతునకు తెలియకయే తత్స్మృత్యుద్ధారకమైన అంగుళీయకము నష్టమైనది శకుంతలకు శక్రావతారమున శచీతీర్థమున ముఖము కడిగినప్పుడు జారిపోయియుండునని అనుమానించినది గౌతమి. ఆ యనుమానముగూడ శకుంతలకు కలుగలేదు. సజ్జనుల అనుమానములెపుడును సుసంబద్ధములే. అట్లే జరిగినది. అభిజ్ఞానాభరణ నష్టము ఆమెకు తరువాత తెలియనైనది.

రాజునకు శకుంతలా స్మృతి సుప్తమైనదికదా సుషుప్తిలో కలవరింతలవలె; పంచమాంకమున పరంపరగా కొన్ని అంశములు నిగూఢమైన నిరూఢి కొనియున్నవి. మొదటిది హంసపదిక గీతము. రాజువిన్నాడు ఆమె రాగమును గీతార్థము ప్రణయినీ విస్మరణము, తదుపాలంభనము వెంటనే తోచినది. రాజునకు ఒకానొక ప్రియ నొప్పరికించుట శ్రుతమగుచున్నది హంసపదిక గీతిగాన ఆమెయనొక ప్రియురాలు గాన ప్రసక్తవిస్మృతి ఆమెనట్లనే అనుకొన్నాడు రాజు. అట్టి అన్యాన్వయమునకు రామాయణమునను తార్కాణమున్నది రావణుడు రామాశ్రమోపాంతమును చేరినాడు. వెంటనే సీతాదేవి మనస్సులో ఒక ఛాయపడినది ఎవరో తన్ను కాంక్షించుచున్నారని "హా సీతా! హా!లక్ష్మణా!" అని మారీచుని మాయా స్వరోక్తిని వినగానే ఆమె అన్వయించుకున్నది అట్టి దురాకాంక్ష యెదుటనున్న లక్ష్మణునిదేనని. అందువలన అనర్థహేతుకముగా అన్ని మాటలు ఆడినది. అతనిని నిర్గమింపజేయు పర్యంతము, అదొక అన్యాన్వయము.

దుష్యంతునిపట్ల విస్మృతి దుప్పటిలోని పోగులు పిగులుటగా భావించవలెను; పంచమాంకములోని పోకడలు, అజ్ఞాతంపు తలపోతలు, హంసపదిక గీతికలో చూతమంజరి ప్రస్తావ యున్నది. రాజు శకుంతలను త్రోయుత పూవిరిసిన చూత తరువుచెంత ప్రకృతియే దానికి కాబోవు పరిణయమునకు కట్టిన మంగళతోరణమును స్ఫురణయున్నది. చూతతరుసౌరూపణలో చూత తరువుచెంత ఏలో పోయియున్న దానిగానే షష్ఠాంకమున రాజు చిత్రపు తీర్పుటకూడ చూత తరువుచెంతన జరిగిన ప్రథమాలోకమునే స్మరించుచుండిన వాడుగావలె దుష్యంతుడు, హఠాత్తుగా దుర్వాస శాపవశమున స్మృతిచ్యుతమైనప్పుడు, చూత మంజరిని ముద్దాడి యిపుడు కమల వసతిమై దాని మఱచినావు! అన్న గీతార్థములో నిగూఢమై యున్నది. కణ్వాశ్రమమున చూత తరువు చెంత శకుంతలా ప్రణయారంభ గాథ అన్వాన్వయము చేసి హంస పదికను విదూషకుని వలన నేదో సమాధాన సందేశము పంపుటతో జోక్కొట్టబడినదీ కలవరింత.

ఈ దారములోని పోగొకటి ఊహావాయువులో నెగిరి చింతనాపరమైన ఒక లోకోత్తర సూక్తిని రాజునోట వెలువరించినది.

> రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
> పర్యుత్సుకో భవతి యత్సుఖితోపి జంతుః
> తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
> భావస్థిరాణి జననాంతర సౌహృదాని

తన పర్యుత్సుకతకు రాజు జన్మాంతర సౌహృద స్మరణను కారణముగా భావించు చున్నాడు. విస్మృతిలోని స్మృతి స్ఫురణయిది. తనకు చెందిన విషయమును సాధారణీకరించుకొని సమాధాన పడుచున్నాడు. శాపమునకు పూర్వవృత్తాంతము

జన్మాంతర వృత్తాంతమువలె నైనది. పెద్ద నిద్దుర (మరణము)చే స్మృతినష్టము లోకమున స్థిరపడి యున్నదేకదా! పెద్ద వ్యాధి పడిలేచిన వానిని పునర్జన్మ పొందిన వానినిగా సంబోధించుట వాడుకలో నున్నదే. శాపము కోల్పిన దట్టంపు చీకటిలో మినుకు మినుకుమను చున్నవి ప్రత్యాఖ్యాన సమయమున రాజు మాటలలోని స్ఫురణలు.

మునికుమారులతోను గౌతమితోను శకుంతల రాజాస్థానము చేరుకొన్నది. రాజుతో సమావేశము జరిగినది. అగ్న్యాగారమున రాజ పురోహితుని-సమక్షమున. శకుంతలా దుష్యంతుల వివాహము ఆశ్రమమున గాంధర్వ విధిగా జరిగినపుడు అగ్ని సాన్నిధ్యములేదు. పురోహిత సమక్షములేదు. మరి నిరాకరణమునకు మాత్రము కాళిదాసు పట్టణమున అగ్న్యాగారమును పురోహితసాన్నిధ్యమును కల్పించినాడు. ఇది నిజముగా విచిత్రమైనదే. ఇదొక విధమైన విధి ప్రతీకారమేమో. ఆశ్రమమున ప్రథమాలోకనమున శకుంతలరూపు తన్ను ఆకర్షించి నట్లుగా,హస్తినలో పునరాలోకనమున నైతము ఆ రూపు తన్ను ఆకర్షించుట విస్మృతి దుప్పటిలో మఱొక పోగు వీడివచ్చుట ప్రణయ వృత్తాంతము మరుగుపడి యున్నందులకు బాహిర చిహ్నముగా శకుంతలను అవగుంఠనవతిగా ప్రవేశ పెట్టుట. అప్పుడు జిల్లేడు మీద పడిన జాజిక్రొన్ననగా రాజు రూపించిన శకుంతల యిప్పుడు తపోధనులమధ్య, పాండు పత్రముల మధ్య కిసలయమువలె తోచుచున్నది. "అథాత్ర భవతీకాస్విదవగుంఠనవతీ" అన్న తొలిమాటలోనే ఇంతకు ముందేదో జరిగి యిపుడు దానికి తరువాతి అధ్యాయము ప్రారంభమగుచున్న స్ఫురణయున్నది. తొలి జరిగినదేదో ఆయనకు స్ఫురణలో లేదు. కాని 'అథ' (మఱి) అని అవశముగా ప్రారంభోక్తిలో అజ్ఞాతము గుప్తమై యున్నది. ఆశ్రమమున మున్నామెను సమవయో రూపలావణ్యాలైన చెలులిద్దరిమధ్య రాజుకన్నాడు. ఇపుడు రూపలావణ్య ప్రసక్తిలేని వారు వయోధికులునైన యిద్దరు తాపసులు మఱొక వృద్ధ తాపసి మధ్య ఆమెను కనుచున్నాడు. రెంటికిని విప్రతిపత్తి ప్రత్యక్షమే.

గౌతమి శకుంతలావగుంఠనము తొలగించినను విస్మృతిరూప గుంఠనము రాజు మనస్సునుంచి తొలగలేదు. శాపావధి అభిజ్ఞాన దర్శనముగాని ఆకార దర్శనముగాదు. ఆకార దర్శనముతో అనుమానము మాత్రము కించిత్తు రేకెత్తినది. ఆమె లావణ్యాకృతి చూచి రాజు అనుచున్నాడు.

ఇదము పనత మేవం రూపమక్లిష్ట కాంతి
ప్రథమ పరిగృహీతం స్యాన్నవేత్య
వ్యవస్యన్
భ్రమర ఇవ విభాతే కుందమంత స్తుషారం
నచఖలు పరిభోక్తుంనై వశక్నోమిహాతుమ్

'కొనవా విడనా మనమూగునూయెలన్' అనుకొనుచున్నాడు. ఊగించినది రాజు మనస్సును కాని ప్రత్యయము కలుగలేదు. తాను మున్నామెను చేపట్టితినని, "మంచులోనున్న మొల్ల మొగ్గను భ్రమరము వేకువ వేళను చేపట్టుటా, వదలుటా అన్న దశలోనున్నాను" అనుచున్నాడు రాజు. ఆమెకెవని పరిభోక్తనుగా నిర్ణయించెనో విధాత అని అయోగ దశలో ఆశ్రమమున ఆరాట పడిన వాడితడే. పరిభోక్త శబ్దము ఆనాటిది మరల రాజు నోట వచ్చినది. మఱి ఆమెలో నున్నది తన బిందువేనని యెట్లు గుర్తించగలడు ఆమెను గుర్తించనప్పుడు? ఉత్ప్రేక్ష వలన తన్ను భ్రమరముగా మాత్రము

రూపించుచున్నాడు. మొదటినుండియు శాకుం
తలములో భ్రమరమునకు ముఖ్యస్థానమున్నది.
తీవపాదులో నీటిపోతతో శకుంతల మోముపైకి
జుమ్మని వచ్చి బాధసేయ బూనినది భ్రమరమే
గదా! ఇది మన్మథుని పంటివారిలోని తుమ్మెద
బారులోనుండి వచ్చి శకుంతల మోము చెంత
యెగురు లాడినది. ఆ సన్నివేశము స్మరింప
దగినది. ఆశ్రమమున ఈ ఋషికుమారికి అంత
వఱకు శృంగార స్ఫురణలేదు. రాజు ఆశ్రమ
మును ప్రవేశించుటతో మన్మథుడు ఆశ్రమ
మును ప్రవేశించినవాడు కావలె. రాజును
అప్పటికామె చూడలేదు. కాని యేదో కామ
వికారము వంటిది ఆమె మనస్సులో పొడసూపి
నది దానికి బాహిర చిహ్నమే ఈ భ్రమర
బాధ కవి ద్రష్టలు కాముడు నేర్చినది గావు
అటువంటివిగా రాజుకు గోచరించినవి రాజు
చూపే ఆ భ్రమరము. రాజు కాంక్ష ఆమె
మోము చుట్టు పరిభ్రమించుచే ఆమె పడిన
భ్రమరబాధ. కాంక్ష చూచుట వలన కలిగినది.
కాన మనఃకాంక్షకును, చూపునకును అభేదాధ్యవ
సాయము, నాయకుని చూపులు తుమ్మెద
లుగా నాయిక వెంట నంటుట కావ్యసిద్ధమే.
భట్టుమూర్తి పద్యము—

> వనతరు మల్లికా కుసుమ వాసనలొల్లక
> శైలకన్యకా
> ఘనతరవేణి కాభరము కమ్మని తావికి
> విచ్చి మ్రోయుచున్
> వెనుచనియెన్ ద్విరేఫములు వేమరు
> తావి వియోగ చింతచే
> వనరుచు వెంటబోవు నరపాలుని చూపుల
> ప్రోవు లోయనన్.

మఱి భ్రమరముగానే సంబోధితుడై నాడు
రాజు హంసపదిక గీతిలో. తానట్లే అర్థముచేసి
కొన్నాడు ఆ గీతికను.

ఇప్పుడు ఉత్కంఠావశమున తన్ను భ్రమర
స్థితిలో పెట్టుకొనుచున్నాడు అంతస్తుషారకుండ
యైన శకుంతల భ్రమాల. మనసు ఊగిసలాడు
చుండగా మిన్నకున్న రాజును ముని శిష్యుడు
'ఏమయ్యా! మాటాడకున్నావు' అనగా
"నఖలు స్వీకరణమాత్రం భవతాం స్మరామి" అని
బదులాడినాడు. 'ఆమెను స్వీకరించలేదు నేను'
అనలేదు. "స్వీకరించినట్లు స్మరించలేకున్నాను"
అన్నాడు. ఇందులో విస్మరణ స్ఫురణ లీలగా
నున్నది మనస్సులోని ఇరవ్వల ఊపు అది.
ఆమె సౌందర్య ప్రవాహము తన కులము
గట్టును, గట్టుకట్టుకున్న తానన్న తిరువును
కూలద్రోయునా అన్న అనుమానము కలిగించు
నట్టి ఊపు అది. తెచ్చికోలు జ్ఞాపకము
నటించి ఆమెను చేపట్టు దశకు దిగజాఱలేదు
ఆ విశుద్ధ వర్తనుడు. రాజాసకులకల పరదార పరి
గ్రహశంకను వారించుటకు శకుంతల అభిజ్ఞాన
మును ప్రేలవెదకి లేక డిల్లవోయిన పిదప,
కంటికి నమ్మకము కలిగించలేక శ్రుతుకి నమ్మ
కము కలిగించుటకై, నీటి దొన్నెతో లేడిని
పిలచిన కథను, 'ఇరువురును అరణ్యకులే గదా'
యని రాజు తన్ను లేడిని జతచేసి చెప్పిన
మాటను జ్ఞప్తికి తెజూచినది. శాపావధి అభి
జ్ఞాన దర్శనముగాని శ్రవణముకాదు. అందు
వలన ఫలించలేదు. అపుడామె బొమలు ముడి
వడి కన్నుల నెఱుపులు రేగినవి. మన్మథ శరా
సనము భగ్నమైనదా యన్నట్లనిపించినది రాజు
నకు. ఆమె భ్రువులలో మన్మథుని విల్లును రాజు
రూపించుచున్నాడనగా ఆమెనట్లు తన శృంగార
పరాయణత ప్రచ్ఛాదితమై యున్నది. శాప
విరుద్ధమై బహిర్వ్యక్తము కాలేని పూర్వ
సౌహృదచ్ఛాయ లీలగా భాసించుచున్నది.
శ్రవణమును విఫలమైనది. 'ఈ అసత్యవాఙ్మక
రందమునకు విషయాతురులు లోనగుదురు'

అన్నాడు రాజు. ఇట్టి జాణతనము స్త్రీ జాతికే ఉన్నదన్నాడు

స్త్రీణామ శిక్షిత పటుత్వమమానుషీషు
సందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః
ప్రాగంతరిక్ష గమనాత్ స్వమపత్యజాత
మన్యైర్ద్విజైః పరభృతాః ఖలు పోషయంతి

ఇందులో అజ్ఞాతముగా శకుంతల పుట్టు పూర్వోత్తరము లున్నవి. శకుంతములకే నేర్పుండగా శకుంతలకు జాణతనము కొఱవా? అని తాకనాడుట గలదు. ఒక ద్విజునికి పుట్టి మఱొక ద్విజునిచేత పెంపకము అందిన శకుంతల పుట్టువును గూర్చి ఎత్తిపొడుపు రాజు ఉద్దేశించకనే యిమిడిపోయి యున్నది. రాజు ఉద్దేశించుటకు అవకాశము లేదు. ఏలయనగా, అతనికామె శకుంతలయన్న గుర్తులేదు గనుక. అతని నోట వచ్చిన మాటలలో ఆ యర్థమునకు అవకాశము కల్గించినది కవి నేర్పు. జాణతనము శకుంతము లది కాదు. శకుంతలది కాదు. కవి రాజశకుంతముది కాని ఆ స్ఫురణ, ఆ తాకిడి శకుంతలను ఉడికించివేసి యుండవలె. అప్పుడు ఆమె తెగువ చేసి రాజును అనార్యా! అని నిందించుట, "ధర్మకంచుక ప్రవేశి" "తృణచ్ఛన్న కూపోపమ" అనుట తన్ను గుర్తించియు గుర్తించనట్లు నటించుచున్నాడు రాజు అని తాను రూఢి చేసికొన్నది గావలె శకుంతల.

కంచుక ప్రయోగము చేత మఱొక స్ఫూర్తియున్నదేమో. నీవొక ధర్మకంచుకము తాల్చినాడవు' అనగా నీవొక కాంచుకీయుడవు ధర్మమను బొంత తొడుగుచున్నావు. ఆనాడు అట్లు నన్ను చేపట్టిన నీ పుంస్త్వము ఏమైనదయ్యా! పుంస్త్వము లేని కంచుకివేమయ్యా! పెండ్లాడిన భార్యను గర్భవతియైన పిమ్మట నిరాకరించు చున్నావే, పౌంస్త్వము లేదని మిషపెట్టి. నీవు మగవాడవేనా?" అంతదనుక పోగుచున్నది.

సీత, రాముడు తన్ను అరణ్యమునకు తోడ్కొని పోవుటకొప్పక యెన్నో అడ్డంకులు పల్కగా విసిగి వేసారి అన్నదిగదా మా తండ్రి నిన్ను పురుష విగ్రహమున్న స్త్రీ అని గ్రహించలేకపోయినాడయ్యా "స్త్రియం పురుష విగ్రహమ్" అని. అట్టిదే అనుకోవలెనా శకుంతల చేసిన 'ధర్మకంచుక ప్రవేశి' ప్రయోగము.

శాప ప్రభావము వలన రాజునకు స్మరణ కలుగలేదు నిరాకరణము జరిగిపోయినది కాని విస్మృతి దుష్యంతునిలోని మఱొక పోగు విడుట అంకము చివరి శ్లోకమున

కామం ప్రత్యాదిష్టాం స్మరామి న
పరిగ్రహం మునేస్తనయామ్
బలవత్తు దూయమానం
ప్రత్యాయయతీవ మే హృదయమ్

"ఆమెను నిరాకరించినాను. మున్ను పరిగ్రహించినట్లు స్మరింపలేను. ఐనను నాహృదయములోని బాధ నన్ను నమ్మించునట్లున్నది." అనుకొనుచు నిష్క్రమించుచున్న రాజు మనసులో సుప్తమై యున్న ఆ జాణయస్మృతి మేల్కొనుటకు ఉన్ముఖమై అభిజ్ఞాన దర్శనావధి తటివేచి యున్నదా యనిపించుచున్నది

శాపముతో సుప్తమైన దుష్యంతవిస్మృతి అంగుళీయ ప్రాప్తితో ప్రబుద్ధమైనది. అనుకొనని విధమున అంగుళీయకము హస్తమైనట్లే అనుకొనని విధమున నది పునర్బద్ధమైనది. 'అనుకొనని' అనగా 'మానవమాత్రుల సంకల్ప సంబంధము లేని విధమున' అనగా దైవచేష్టితముగా. ఈ దైవచేష్టిత మనుదానికి మానవుని పూర్వచేష్టితమేదో కారణమై యుండును. అదియే

కర్మ సిద్ధాంతము. ఈ కార్యకారణ సంబంధమును విడమరచి గ్రహించుట అదృష్ట ద్రష్టలైన ఋషులకే చెల్లినది. శకుంతలకు ప్రతికూలముగానున్న దైవమును గూర్చి శాంతి చేయుటకు కణ్వుడు సోమతీర్థమునకు పోవుటతోగదా కథ ప్రారంభమైనది. ఏతత్క్రియలును దైవ ప్రకారమును నివర్తించలేవు. ఉపశమింపజాలినవి మాత్రమే. ప్రతికూలమునో అనుకూలమును సాధింపగలిగినవి. దైవ ప్రతికూలముయొక్క ప్రత్యక్ష రూపమే దుర్వాస శాపము. తదుపశమనమే కణ్వతపఃక్రియా ఫలితమే దుర్వాసులు శాపావధిని చెప్పిచనుట. శాంతి క్రియా పరిణామమే ప్రియంవద శాపము విన్నదై దుర్వాసుని బ్రతిమాలగల్గుట, అతడు మెత్తబడుట. దైవ ప్రాతికూల్యబలమొగాని (అదే శాపబలముగాని) సారహీనములుగా చాల చులకనగా తోచి యుండెడివి, అంగుళీయకము నష్టముగాక, శకుంతల రాజ సన్నిధిలో దాని దర్శనము రాజునకు కల్గించిన యెడల. దైవ ప్రాతికూల్యబలమే అంగుళీయ నష్టము. అది జరిగినది శక్రావతారమున, శచీతీర్థమున పునస్సమాగమమైన పిదప మారీచ మహర్షి శకుంతలను దీవించినది. నీ భర్త శక్రసముడు నీ కొడుకు జయంత సదృశుడు, నీవు శచీ సమానవుకా' అని శాప ప్రభావమున అంగుళీయము నష్టమైయెనను ఆ నష్టమైన స్థలమున స్థల దేవతలు శచీశక్రుల అనుగ్రహమున (ఇది దుర్వాసశాపోపశమనానుగ్రహోక్తి నిదర్శనము) జాలరివానికి దొరకి, వాడు రాజభటులకు దొరకి, రాజునదేయైన ఆ యుంగరము రాజునకే మరల దొరకినది. శకుంతలా దుష్యంతుల అదృష్టవలయమే అంగుళీయకము. ఉంగరము జారి పోవుట యనగా శకుంతలకు అదృష్టము జారి పోవుట. ఉంగరము రాజునకు దొరకుట యనగా అదృష్టముగా శకుంతల రాజునకు లభ్యపడుట. దృష్టముగా శకుంతల రాజునకు లభ్యమైనది సప్తమాంకమున మారీచాశ్రమమున.

మధ్య షష్ఠాంకమున రాజు అనుభవించినది వియోగ బాధ. సుఖదుఃఖ సమ్మిశ్రితమైనది భూలోకము. అశోక లోకము నాక లోకము మాత్రమే. భార్యా నిరాకరణ మన్నది రాజు తెలియక చేసినదేయైనను అకార్యమే. దాని ఫలితము వెంటనే దుఃఖ రూపమున అనుభవించినది శకుంతల. మఱి ఆ యకార్య ఫలమును శోక రూపమున రాజును అనుభవించవలయుట విధాయకమే. కణ్వాశ్రమమున తొలుత తాననుభవించినది ప్రణయ సుఖము స్వర్గతుల్యము. రాచనగరున స్మృత్యుద్బుద్ధుడై పశ్చాత్తప్తుడై తాననుభవించిన వియోగ దుఃఖము నరక సదృశము. ఈ స్వర్గ నరకములు రెండును పుణ్యాపాప ఫలములుగ భూలోక ప్రాప్యములే.

రాజు నిరుత్సవోద్యానమున కన్నీటితోను, ఇంద్రాహూతుడై నాకమున యుద్ధసాహాయ్యుడై సంహరించిన దైత్యుల రక్తముతోను తన భార్యా నిరాకరణాపచార పంకిలమును కడిగి వైచినవాడాయెను. తుణకాలపు దేనులు పాటున తాను గావించిన అతిథి సత్కారోపేక్ష యన్న అపచారమునకు ఆ జేండ్ల విరహవ్రత మనుష్ఠించి మారీచాశ్రమమున పరిహారము గావించుకొన్నది శకుంతల. అప్పుడు అయినది మరి వారి పునస్సమాగమము.

ఈ ప్రకరణమునగూడ దుష్యంతునకు ముందు లబ్ధమైనది పుత్త్రి దర్శనము. తరువాతనే శకుంతలా దర్శనము.

తొలుత కణ్వాశ్రమమునను వైఖానసాశీర్గర్భితమైన పుత్త్రి దర్శనము ముందు జరిగిగాని

శకుంతలా దర్శనముగాలేదు. శకుంతలా విషయకమైన యీ దర్శన పునర్దర్శనములు రాజునకు వంశోద్ధారకమైన పుత్త్రప్రతిపాదక ప్రయోజనములే.

భవబంధము వలన కలిగిన సుఖదుఃఖములు, సంయోగ వియోగములు, ప్రణయ పశ్చాత్తాపములు, దృశ్యమానము గావించు యీ నాటకము ప్రారంభములో నాందీ శ్లోకమున అష్టమూర్తులనైశ్వర్యముల నిరూపించు ఈశ్వరుని స్తుతించిన కాళిదాసు, నాటకాంతమున శక్తిసఖుడైన అనీల లోహితుడు తనకును భవబంధ విమోచనమును కలిగించుగాక యని ప్రార్థించుచున్నాడు. మఱెవ్వరికైననుగూడ ఆబంధమోచనమును ఉద్దేశించినాడా యనుచో అది శకుంతలా దుష్యంతులకే కావలయును. 'నాయనా' ఎప్పుడో మరల నేనీ యాశ్రమమును చుచూట' అని శకుంతల చతుర్థాంకమున అడిగినప్పుడు -

వననిధి కాంచి కావని సపత్నిగ నీవు చిరం
బెసంగి, నీ
తనయునిం బౌరవున్ విజయ ధర్మ్య వివా
హితు సాభిషిక్తుగాం
బొనరించి, వంశ ధూర్వహానిముంద దధీన
మొనర్చు తత్త్వచిం
తనుఁడగు భర్తతో మఱి సందంబిడెదమ్మ
ప్రశాంతమివ్వనన్

అని యాశీర్వదించినాడు. కణ్వాశీస్సు పొల్లువోదు. భరతుని రాజ్యాభిషిక్తుని జేసి శకుంతలా దుష్యంతులు కులవ్రతమైన వానప్రస్థమును కణ్వాశ్రమమున అనుష్ఠించియే యుందురు. పరతత్త్వచింతనులై ముక్తిప్రాప్తి సాధించియే యుందురు. కవి యెంతగా తన్ను తన కావ్యనాయికా నాయకులతో ఐక్యము గావించుకొన్నాడో మఱి, తనకును వారికిని భవవిముక్తి నర్థించుటకు.



# యియాసవునై ...........

వి. సంపత్కుమారాచార్య M. A (Eng); M. A. (Tel)

ఎక్కణ్ణించొచ్చానో నాకే తెలీదు ! ...
ఎంతకొట్టుకున్నా గుర్తుకు రాదు ! ...
ఆలోచించకుండా అందర్లాగా
తింటూ తిరుగుతూ నవ్వుతూ తుళ్ళుతూ
ఈ మనుష్యుల్లో ... ఈ నాగరకతలో
ఈ ఆలోచనల్లో ... ఈ ఆవేదనల్లో
నిజంగా కనిపించే భ్రమల్లో
భ్రమగా రుజువయ్యే బ్రతుకుల్లో
ఎన్నాళ్లు కృత్రిమంగా కాలం గడపను ?
ఎన్నాళ్లీ ఎదలోరేగే పుండుని
ఏదో టాబ్లెట్ వేసి సప్రెస్ చెయ్యను ? ...
ఎన్నాళ్ళు పైపై నవ్వుల్తో
లోపలి ఏడుపుని దాచను ? ...
ఎన్నాళ్లీకుళ్ళుమీద
కృపణత్వపుటను బోధాన్ని చిలకను ? ? .. ...
ఈ విచిత్రమైన ఇంటాక్సికేషన్ నించి
ఎలా బయట పడను ? ? ...
నిరంతరం ఆలోచనా మార్గంలో
యియాసవునై పరుగులిడే నేను
ఏ దిక్కుకని సాగను ? ఏ మలుపుని నమ్ముకోను ? ? ....
అలసిపోయి కూలబడేదాకా
ఇలాగే యీ దురంతధ్వాంతంలో వెలుగుని వెతకనా ?
ఎక్కడో ఏదో నాదంటూ లేకపోతే నాలో ఈ తపన పుట్టదు ! !
యియాస యే నా ఊపిరి అయితే గమ్యమనేది లేకుండా ఉండదు ! ! ...

*   *   *   *   *   *   *

# ఆంధ్ర శబ్ద చింతామణి నన్నయకృతమా ?

డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి, ఎం. ఏ., పి హెచ్. డి. లిట్

పాదాంతమున వాక్యాంతమైన సంధి వైకల్పికి మను సూత్రము ఆంధ్రశబ్ద చింతామణియందు లేదు. అథర్వణ కారికావళియందును లేదు. "వాక్యాస్తగత పదానాంచ" అను చింతామణి సూత్రము. "వాక్యావసానగస్య స్యాల్లోపోనః ప్రాయశోఽత్రహి" అను అథర్వణ కారికయు వాక్యాంతద్రుత లోపమును మాత్రమే వివక్షించును. విసంధిని వివక్షింపదు. అంతేకాదు "సరియుఁగావు, ఎఱుఁగుమెల్ల" అను పాఠమునుబట్టి నన్నయకు విసంధి సమ్మతమనుటకైన "సరియుఁగావ యెఱుంగుమెల్ల" అను పాఠాంతరము కలదు.[6] అవధారణార్థకరూప ప్రయోగము నన్నయకు అనభ్యస్త విద్యకాదు. కనుక పాదాంత వాక్యాంత విసంధి నన్నయ అభిప్రాయమగుట నిర్ధారితము కాదు. పక్షాంతరమున నన్నయ అభిప్రాయమైనను, ఆంధ్రశబ్ద చింతామణియందు విసంధి విధానము లేకపోవుట మఱల నన్నయకు విరుద్ధము. ప్రథమ పురుష క్రియాపదేకారవికల్పసంధి ఆంధ్ర శబ్దచింతామణికి విరుద్ధము అనగా ఆంధ్రశబ్ద చింతామణి నన్నయకృతము కాదని అనుమేయము.

7. 'ఆంధ్రశబ్ద చింతామణిలోని "వసంతేరనుబన్ధ కస్స్యాద్వర్తమానార్థో వివక్షితస్తత్ర" అను సూత్రము వర్తమానార్థక క్రియలందు ఉన్నాను బంధమును, "అస్తేరనుబన్ధకస్స్యాద్భవిష్యదర్థో వివక్షితో ధాతోః" అను సూత్రము భవిష్యదర్థక క్రియలందు కలానుబంధమును విధించుచున్నవి. అట్టి క్రియారూపములు నన్నయ భారతమున లేవు. అంతేకాదు. కేతన ఆంధ్ర భాషాభూషణము, విన్న కోట పెద్దన కావ్యాలంకార చూడామణి ఉన్న, కలానుబంధములను విధింపలేదు.[7] కనుక నన్నయ కృతము కాదు. వసతిశబ్దముచే ఉండు ధాతువు. అస్తి శబ్దముచే కలుగు ధాతువు అనుబంధములగును. ఉన్న, కల శబ్దములు అనుబంధములు కావు.[18] కనుక నన్నయకృతము.'

"వసతి = ఉన్న, అస్తి = కల" అని బాల సరస్వతి అర్థనిర్దేశము. అంతేకాదు. అనంతర సూత్రటీకను "ఘటింపుచున్నాఁడు, ఘటింపఁగలడు- అనుబంధములు" అనికూడ బాలసరస్వతి సోదాహరణ నిరూపణము. ఉపరి, అనుబంధరములు ఉన్న, కల అనియే అహోబల పండితుని అర్థ వివరణము. అనగా వర్తమానార్థక క్రియారూపమునందు ఉన్నాను బంధము, భవిష్యదర్థక క్రియా రూపమునందు కలాను బంధము ఆంధ్రశబ్ద చింతామణి ఆశయమని బాల సరస్వత్యహోబల పండితుల అంగీకారము. అది ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ కృతమనుటకు బాధకము. అందుకు ఉండు, కలుగు అనునవి అనుబంధకములని అర్థాంతరము. "రక్షించుచుండు + డు = రక్షించుచున్నవాఁడు. రక్షింపఁగలుగు + డు = రక్షింపగలవాఁడు" అని రూపసాధనము. ఇది ఆంధ్రశబ్దచింతామణి నన్నయకృతమనుటకు సాధకము. ఇందు బాధక విధానము స్పష్టసమన్వయము. సాధక విధానము క్లిష్ట కల్పనము. అంతేకాదు. బలపదార్పృష్టము. అనగా ఆంధ్రశబ్ద చింతామణి అర్వాచీనగ్రంథమగుట అవిరోధము.

8 'ఆంధ్రశబ్ద చింతామణియందు "కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే" అను సూత్రము కలదు. క్రియాపదముల, నామపదముల ఉకారము లోపింపవలెనని కవిభల్లటుని చేత విధింపబడినదని అర్థము. కవిభల్లటుడు నన్నయకు తర్వాతివాడు. కనుక నన్నయ కృతము కాదు. కవిభల్లటుడు క్రీ. శ. 1230 సంవత్సరపు ప్రాంతము వాడని వ్రాసిన కవుల చరిత్రవ్రాత నిరాధారము. కనుక నన్నయ కృతము'

కవుల చరిత్రములోని కవిభల్లటునికాలనిర్ణయము నిరాధారము కాదు. కవిభల్లటుని పదమంజరిలోని

"లక్ష్మీర్బుద్ధ నృపాలేన యం ప్రాప్తా కవిభల్లటమ్
తేన కావ్యదృశా ప్రోక్తాః సప్రాసా పదమంజరీ."

అను శ్లోకమును బట్టి కవిభల్లటుడు "బుద్ధనృపాలుని కాలములో అనగా 1230 వ సంవత్సర ప్రాంతముల రంగనాధరామాయణ కాలములో ఉండినట్లు" కవుల చరిత్రమున కలదు.[21] ఇందు కవిభల్లటుడు బుద్ధనృపాలుని కాలము వాడనుట సప్రమాణము. ఆ బుద్ధనృపాలుడు రంగనాధరామాయణకర్త అనుట సంభావ్యమైన సమన్వయము "కవిసార్వభౌముడు, కవికల్పతరువు, కవిలోక భోజుడు, కవిపురందరుడు, సుమనీషి పోషణోత్సుకసుఖోన్నతుడు" అయిన గోనా బుద్ధభూవిభునివలన కవిభల్లటుడు లక్ష్మీసంపన్నుడగుట అసంభవముకాదు. కనుక సమన్వయమిదిసమంజసము. అప్పటికవి పూర్వము సంస్కృతాంధ్ర భాషలకు గల లక్షణ గ్రంథములందు కవిభల్లట ఫక్కికయును కలదు (6 వచ. 1ఆ.) అది కూడ ఆంధ్ర భాషాభూషణము కంటె అనంతర గ్రంథము. గోన బుద్ధారెడ్డికాలము పదమూడవ శతాబ్ది లేదా పదునాల్గవ శతాబ్ది కావచ్చును. కనుక కవిభల్లటుని కాలమును పదమూడవ శతాబ్ది లేదా పదునాల్గవ శతాబ్ది అగును. పదమూడవ శతాబ్ది లేక పదునాల్గవ శతాబ్ది [illegible]

కవిభల్లటుని ప్రసక్తి కల ఆంధ్రశబ్ద చింతామణి తదనంతరకాలికి మగుట విధ్యము.

అయినను ఆంధ్రశబ్ద చింతామణి పదొకండవ శతాబ్ది గ్రంథమనుటకు వజ్జులచిన సీతారామశాస్త్రి గారు ప్రదర్శించిన పటిష్ఠమైన ఉపపత్తులివి.

9 "ఇపుడు వాడుకలోనున్న "త్రాళ్ళు" మున్నగు రూపములు నన్నయ భట్టారకుని కాలమున "త్రాడ్లు" మున్నగు రూపములతోనే పండిత వ్యవహారములో నుండెడివి... Nel i s R. 36 గుడ్లు 1249 పుట. 1129 పుటలో మామిడ్లు.) "డలటాముదితాం తస్య చవాలుక్" అని యిట్లు (ఆంధ్రశబ్ద చింతామణి) 'త్రాడులు' మున్నగు వాని కుల్లోపమును మాత్రము చెప్పెనుగాని యచటి డకారమున కధునాతనుల వలె ళత్వమును విధింప లేదు."[22] కనుక నన్నయ కృతము.

నన్నయ కాలమునందు మాత్రమే గాక, తదనంతరకాలమునందును శాసనములందు గుడ్లు, మామిడ్లు వంటి లేఖనములు కలవు. అవి పండిత వ్యవహారములు కావు. పామరలేఖనములు.

"గడుసరి లోభి యర్థన్ మది గన్నపుంగానికి
బంద్ది కానికిం
బుడమికి నన్య కాంతలకు భూపతి కింజను
మంత్రి యన్ననిం
పడిసిన యర్థన్ మిష్టకు బన్ధు జనాలికి
దీనకోటికిని
గుడ్ల కవారి సత్రముల కుంజను సుద్ద
చరిత్రం బాత్రమై."

ఇది 1128 వ సంవత్సరము సందలి కొణిదెన శాసన పద్యము. ఇందు "ఇష్టకు", "గుడ్లకు" అను లేఖనములు ఇష్టులకు, గుడులకు అను రూపములు కానిచో గణభంగము ప్రాసభంగము ఘటిల్లును, కనుక "గుడ్లు" అను లేఖనము లేఖక దోషముకాని,

ఆంధ్ర శబ్ద చింతామణి గుణము కాదని అవగాహ కము శాసనములందలి గెడ్లు అనగా గుడులు. మాడిడ్లు అనగా మాడలు. ఉడ్లిపము లేదు. అంతే కాదు. ఆంధ్ర శబ్ద చింతామణి అసమగ్ర వ్యాకరణ గ్రంథమని, అథర్వణ కారికావళి అనుబంధము లేనిచో నన్నయ ప్రయోగములకు నాంది వాచకము కాదని పూర్వోక్తము. "డలటా ముదితాం తస్య చ వాలుక్" అను చింతామణి సూత్రమును బట్టి త్రాడు + లు = త్రాడ్లు, త్రాడులు; గుడి + లు = గుడ్లు గుడులు అను రూపములు మాత్రమే నిష్పన్నము లగును "లుకి భవేల్లడయోరేఫ రూపతా" అను అథర్వణ కారికను అనుబంధము చేసిన త్రాళ్ళు, గుళ్ళు అను రూపములు వ్యుత్పన్నములగును. నన్నయ భారతమున "సంజుళ్ళు" అను ప్రయోగము కలదు. (197 ప. 198 పచ. 2 ఆ. ఆది. ప. "రెన్నాళ్ళు" అను ప్రయోగము కలదుగాని (69 ప. 1ఆ. ఆ. ప. ప్రక్షిప్తము. "ఒక్లాండ్ళు" అను ప్రయోగమొకడు (218 వచ. 5 ఆ. ఆ.ప.) విలక్షణము. ఇవి అథర్వణ కారికావళి అనుబంధము లేనిచో అనుపపన్నములు. అంతేకాదు. "డలటాముదితాం తస్య చ వాలుక్" అను ఆంధ్ర శబ్ద చింతామణి సూత్రము డ, ల, లు వర్ణముల ఉత్వమునకు, ఇత్వమునకు వికల్పముగ లోపము విధించును. నన్నయ భారతమున డ, ట వర్ణముల ఇత్వమునకు లోపమువచ్చిన సందర్భము మచ్చునకైన లేదు. కనుక ఆ సూత్రమును నన్నయ సృష్టించవలసిన ఆవశ్యకము లేదు. డ, ట వర్ణముల ఇత్వమునకు లోపము వచ్చిన సందర్భములు అర్వాచీన కావ్యములందు మాత్రమే కలవు అనగా ఆంధ్ర శబ్ద చింతామణి అర్వాచీన గ్రంథ మగుట సాధకము.

10. 'నన్నయకు పూర్వకాలమందలి పండరంగని అద్దంకి శాసనమున, యుద్ధమల్లుని బెజవాడ శాసనమున తెలుగు ప్రథమావిభక్తి ప్రత్యయముల మీదను, లుప్త ప్రథమావిభక్తి ప్రత్యయములగు ఆచ్ఛిక శబ్దముల మీదను గసడదవాదేశము నిత్యము నన్నయ కాలమున లుప్త ప్రథమా విభక్తి ప్రత్యయకములగు సంస్కృత సమ శబ్దముల మీదను గసడదవాదేశము నిత్యము "సవిభక్తి శబ్దాద్వ్యతిరిక్తః సాంస్కృతికానాం భవన్తి గసడదవాః" అను ఆంధ్ర శబ్ద చింతామణి సూత్రమునకు "సాంస్కృతికానాం = సంస్కృత సమ శబ్దములలో సవిభక్తి శబ్దాద్వ్యతిరిక్తః = విభక్తి చిహ్నము గు 'డుముపులు' అనెడి ప్రథమా ప్రత్యయములు లేవియనగా సవి లోపించిన శబ్దమున కన్న పరమైన పరుష వర్ణములకు సైతము గసడదవాః = గసడదవలు, భవంతి = అగుచున్నవి" అని అర్థము. కనుక నన్నయ కృతము

"సవిభక్తి శబ్దాద్వ్యతిరిక్తః
సాంస్కృతికానాం భవన్తి గసడదవాః"
అను సూత్రమునకు

"తెలుగు మాటలందె పరమైయుండెడి సంస్కృత శబ్దములకు గసడదవలు లేవు" అని బాల సరస్వతి అర్థ వివరణము. "ఆంధ్ర శబ్దముల మీద సంస్కృత పదాదిగల పరుషములు నిజరూపము చెడక నిలుచును" అని అప్పకవి అర్థ వివరణము "సంస్కృత సమ వ్యతిరిక్త శబ్దములకంటె పరమైన సంస్కృత శబ్దాది గల పరుషములకు గసడదవలు రావు" అని అహోబల పండితుని అర్థ ప్రపంచీకరణము. అయినను "సంస్కృత సమశబ్దములలో ప్రథమా విభక్తి ప్రత్యయములు లోపించిన శబ్దములకు పరమైన పరుషములకు గసడదవలు వచ్చును" అని వజ్ఝలవారి అర్థ నిర్ణయము। కారణము అట్టి గసడదవాదేశము నన్నయ కాలమున కలదు; నన్నయ పూర్వ కాలమున లేదు" అను స్వమతము. అందుకు నిమిత్తము శాసనలేఖనములు। శాసనము గని అద్దంకి శాసనమున "సేనపట్టంబు గట్టించి ప్రస్పష్టము. యుద్ధమల్లుని బెజవాడ శాసనమున "విఖ్యాత గ్రంథపస్థుర —" అని గసడదవాదేశము

రాని లేఖనములు కలవు[25]. అంతేకాదు. యుద్ధమల్లుని బెజవాడ శాసనమున "ఇందు ప్రత్యక్షబు" అనుగసడదవా దేశము కల లేఖనము కలదు. "సేనపట్టంబు గట్టించి, విఖ్యాతకీర్తి ప్రస్తుత --" అను శాసనలేఖనములను బట్టి నన్నయకు పూర్వ కాలమున లుప్త ప్రథమావిభక్తి ప్రత్యయ సంస్కృత సమముమీద గసడదవాదేశము లేకపోవుట లక్షణమైన, "ఇందు ప్రత్యక్షబు" అను శాసన లేఖనమును బట్టియే నన్నయకు పూర్వము ప్రథమేతర విభక్తి కంటె పరమైన సంస్కృత సమపదాది పరుషమునకు గసడదవాదేశము వచ్చి తీరుట లక్షణమగును. "ఇందు" సప్తమీ విభక్తి ప్రత్యయమని ఆంధ్రశబ్ద చింతామణి యందు కలదు. "అన్విందు వాస్తు సప్తమీ." అట్టి గసడదవా దేశము నన్నయకాలమున లేదు కనుక ఆంధ్ర శబ్ద చింతామణి నన్నయ రచించిన ప్రథమేతర విభక్తి కంటె పరమైన సంస్కృత సమపదాది పరుషమునకు గసడదవాదేశము రాదను సూత్రమును రచింపవలయును. ఆంధ్రశబ్ద చింతామణియందు అట్టిసూత్రము లేదు. అంతేకాదు. అద్దంకి శాసనమున "సేన, పట్టంబు గట్టించి, విఖ్యాత కీర్తి, ప్రస్తుత -" అను స్థలములు పాదాంతములు. ఉపరి, తొమ్మిదవ శతాబ్ది నుండి పదొకండవ శతాబ్దివఱకు ఉపలబ్ధమైన ఇతర శాసనములందు గసడదవా దేశమునకు నియతస్థితి కానరాదు. నన్నయభారతమునందును లుప్తప్రథమా విభక్తి ప్రత్యయకమైన సంస్కృత సమముమీద గసడదవాదేశమునకు నిర్ధారక ప్రయోగము మృగ్యము. కనుక "ఏ వికృతి శబ్దాత్పరతః -" అను సూత్రమునకు వజ్ఝలవారి అర్థ నిర్ణయము కేవలముకల్పనా గౌరవమునకు తావలము. అది ఆంధ్ర శబ్దచింతామణి ప్రాచీనతకు ప్రమాణము కాదు. అనగా ఆంధ్రశబ్ద చింతామణి అర్వాచీన గ్రంథమగుట నిర్బాధకము.

11. 'ఆంధ్ర శబ్ద చింతామణి యందు ఆంధ్ర లిప్యుద్ధారక శ్లోకములు కలవు ఆ లిపిలోని చ్, ట్, త్, ప్, వ్, శ్, హ్ అను వర్ణముల ఆకారములు; దీర్ఘపు గుర్తు పదవ శతాబ్ది లిపికి సరిపడి యున్నవి కావున చింతామణి కారికలు పదునొకండవ శతాబ్ది ఆరంభములోనివని అంగీకరింపక తప్పదు. రాజరాజ నరేంద్రుని కోరుమిల్లి శాసనమున నన్నయవర్ణించిన అర్ధచంద్రాకృతి తలకట్టుగలదు[27]. కనుక నన్నయ కృతము '

అప్పకవీయ చింతామణిలోని ఆంధ్ర లిప్యుద్ధారక శ్లోకములందు అనెవంట, ఇ పరివేషము. ఉ కొమ్ము. ఋ సిరసి డి, ౠ దర్పము. ఎ కొండవలి, ఒ గొడ్డలి వలెను; వానిదీర్ఘములు వానిపైన ఏనుగు తొండము ఆకారములతోను; ఐ, ఔలు తూములు వలెను; క శంఖము, చ శార్ఙ్గము, ట పిప్పలదళము, త అంకుశము. ప సర్పము వలెను; వాని ద్వితీయాది వర్ణములు వానిపైన స్తంభాకార రేఖల సంవ్యాకరమముతోను; య చిలుక, ర ఓడ, ల ఏనుగు తల, వ ముత్యపు చిప్ప, శ త్రాసు, ష నేత్రాసనము స వేదిక, హ నాగలి వలెను; దంత్యచజలు చజలపైన బిందువులతోను; శకట రేఫముపైన బిందువుతోను ఉండునని కలదు. ఇందు హ్రస్వదీర్ఘములకు భిన్న లిపి లేదు. వర్గద్వితీయాది వర్ణములకును భిన్న లిపి లేదు. రేఫ శకట రేఫములకును భిన్న లిపి లేదు. ఇది యెల్ల ఆంధ్ర లిపికి విరుద్ధము అది నుండి ఆంధ్రలిపి యందు అ, ఇ ల హ్రస్వ దీర్ఘములకు, వర్గ ద్వితీయాది వర్ణములకు, రేఫ శకట రేఫములకు భిన్న భిన్న లిపులు కలవు[28]. అంతేకాదు. అయిదవ శతాబ్ది నుండి పదునైదవశతాబ్దివఱకు క్రమవికాసము కల తూర్పు చాళుక్య లిపియందుగాని, కాకతీయ లిపి యందు గాని, రెడ్డిలిపియందుగాని, విజయనగర లిపి యందు గాని పయి ఆకృతులు లేవు [29]చ్,ట్,త్,ప్, వ్,శహ్, అను వర్ణముల ఆకారములు; దీర్ఘపుగుర్తు పదవ శతాబ్ది లిపికి సరిపడవు.[30]చింతామణి విషయ పరిశోధనమున సరిపెట్టబడినవి. (పుట 72.) తల కట్టు నెలవంకగ పదొకండవ శతాబ్దిని తలయెత్తి పదునారవ శతాబ్దికి పరిణతి చెందినది. పదొకండవ

శతాబ్ది రాజరాజ నరేంద్రుని కోరుమిల్లి శాసనము నందు కంటె, పదునారవ శతాబ్ది సదాశివరాయల హంపీ రంగస్వామి దేవాలయ శాసనమునందు వల కట్టు నెలవంకగ ప్రస్ఫుటముగ కలదు.[1] పరివేషము (వరద గుడి) గుడిగను, శృంగము కొమ్ముగను, నీటి సుడి వట్రు సుడిగను శబ్దతః, అర్థతః నేటికిని అట్లే కలదు. అంతేకాదు ఏడవ శతాబ్దినుండి పదొకండవ శతాబ్ది వఱకు ఆంధ్ర లిపియందు అను ప్రాచీన లిపి చిహ్నముల ప్రత్యేక వర్ణము కలదు.[2] ఆ వర్ణము, తల్లిపి అప్పకవీయ చింతామణిలోని ఆంధ్ర లిప్యుద్ధారక శ్లోకములందులేదు కనుక అప్పకవీయ చింతామణిలోని ఆంధ్ర లిప్యుద్ధారక శ్లోకములు అతి ప్రాచీనములు కాక అర్వాచీనములని అవగాహనము. అనగా ఆంధ్రశబ్ద చింతామణి అర్వాచీనగ్రంథమగుట నిర్ధారితము[1]. "ఆంధ్ర శబ్ద చింతామణిలోని స్వస్థాన వేష భాషాభిమతాః" అను శ్లోకము తద్గ్రంథ ప్రాథమికావస్థను బోధింపజాలి యున్నది."[38] కనుక నన్నయ కృతము.

పయి శ్లోకము చింతామణి శ్లోకముగ ప్రసిద్ధము. అప్పకవీయము నందు, అహోబల పండితీయము నందు, వావిళ్లవారి బాల సరస్వతీయమునందు అట్లే కలదు కాని అంధ్ర సాహిత్య పరిషత్ప్రకాశితమైన బాల సరస్వతీయము నందు అట్లు లేదు ఇట్లు కలదు. "విశ్వశ్రేయః కావ్యం" అను శ్లోకమునకు అర్థము వివరించుచు, అన్యశ్లోకములు, పద్యములు ఉదాహరించుచు, "ఓయి రసస్థితి యుండిన భాషా కావ్యములైనను బవిత్రములే యంటివి. విదేశ భాషలు స్మృతి నిషేధములు మ్లేచ్ఛనములు గనుక శ్రుతి నిషిద్ధములును. అవి యెట్లు పవిత్రములు ? అంటే-"అని బాలసరస్వతి

"స్వస్థాన వేషభాషాభి మతాస్సన్తో
రస ప్రలుబ్ధధియః
లోకే బహుమన్యన్తే వైకృత కావ్యా
నిచాన్యదపహాయ్యు"

అను శ్లోకమును ఉట్టంకించి, అర్థమును వివరించి, ఆ తర్వాత మరొక శ్లోకమును ఉదాహరించి అర్థము వివరించును. (పుటలు 4-5) అది ప్రకరణోచితము. అంతేకాదు. "విశ్వశ్రేయః కావ్యం" అను శ్లోకము ప్రథమ శ్లోకముగ, "సిద్ధిర్లోకాత్" అను శ్లోకము ద్వితీయ శ్లోకముగ కలదు. (పుటలు 3, 6) అనగా "స్వస్థాన వేషభాషాభిమతాః" అను శ్లోకము ఆంధ్ర శబ్ద చింతామణి శ్లోకము కాదని అవగాహనము. అంతేకాదు. ఆ శ్లోకము కేవలము ఆంధ్ర భాషా విషయము కాదు "వైకృత కావ్యానిచ" అనగా "దేశ భాషా కావ్యములను"అని బాల సరస్వతి టీక. ఉపరి, "ప్రాకృతాది దేశభాషా మిశ్రమునైన రూపక కావ్యములు యుగయుగముల పెద్దలేల స్వీకరించెదరు?" అని కూడ బాలసరస్వతి అర్థ వివరణమున కలదు. అనగా ఆ శ్లోకము దేశభాషా విషయకము అది బాలసరస్వతి ఉట్టంకనము. కనుక ఆంధ్రశబ్ద చింతామణి ప్రాథమికావస్థను భేధించుటకు నిర్ధారక సాధనముకాదు. వాపక్షముగనైన ఆ కావ్యములను లోకమున బహుమానింతురని ఆ శ్లోకమునందే కలదు "లోకే బహుమన్యన్తే". అది ప్రాథమికావస్థకు బోధకము కాదు. బాధకము అనగా ఆంధ్రశబ్ద అర్వాచీన గ్రంథమగుట నిరాఘాటము.

13. "ఆంధ్రశబ్ద చింతామణి పరిచ్ఛేదాంత గద్యములందు "ఇతిశ్రీ సకల భాషావాగను శాసన నన్నయ భట్ట విరచితాన్ధ్ర చిన్తామణౌ"అని కలదు."నన్నయ శబ్ద శాసనుడని భారతమున కలదు. కనుక నన్నయ కృతము.'

నన్నయ భారతావతారికను "విపుల శబ్దశాసను" డని కలదు. (9 ప. 1 ఆ. "సకల భాషావాగను శాసను"డని లేదు. అంతేకాదు. నన్నయకు వాగను శాసన వ్యవహారము ప్రథమతః భట్టు మూర్తి సృష్టి, కారణము శ్లేషాశ్లేషము. మహిమున్ వాగనుశాసనుండు సృజియింపం గుండవీంద్రుండు తన్మహనీయ

స్థితిమూలమై నిలువ- (10 ప. 1ఆ. వసు.చ) అను పద్యమున తిక్కనకు కుండలీంద్ర వ్యవహారమువలె నన్నయకు వాగనుశాసన వ్యవహారము శ్లేషకు ఆవశ్యకము. శబ్దశాసన వ్యవహారము శ్లేషకు అనుకూలము కాదు. అంతేకాదు భట్టుమూర్తికి పూర్వము నన్నయకు శబ్దశాసన వ్యవహారమే కలదు. "శబ్దశాసన వరేణ్యులు నాఁగ(బ్రశస్తికెక్కిరే యేమెడ నన్నెపార్యగతి" అని జక్కన స్తుతి. (12 ప. 1ఆ. విక్ర. చ) అంతేకాదు,నన్నయ "ఉభయ భాషాకావ్య రచనాభి శోభితు"(డని మాత్రమే భారతావతారికను కలదు. అయినను "సకల కవితా ప్రవర్తకు"డని బాల సరస్వతి అవతారికను కలదు. (11 వచ.) నన్నయ సకల కవితా ప్రవర్తకుడు కాడు. సకల భాషావాగను శాసనుడును కాడు. అసలు సకల భాషా కావ్యరచనా సామర్థ్య ప్రకటనము. ఎఱ్ఱన కంటె పూర్వము కానరాదు. ఎఱ్ఱన "సకల భాషా కవిత్వ విశారదు"డని హరి వంశమున కలదు. (38ప.1.అ) కవిభల్లటుడు "సకలభాషా కవిత్వ నిర్వాహకు"డని గణమంజరి యందు కలదు. [35]బాలసరస్వతి "సకల కవితా స్వతంత్ర భట్టారకు"డని బాలసరస్వతీయము నందు కలదు. కనుక నన్నయకు సకల కవితా ప్రవర్తక వ్యవహారముతోపాటు సకల భాషావాగను శాసన వ్యవహారము బాల సరస్వతి వర ప్రసాదము. అది ఆంధ్ర శబ్ద చింతామణి నన్నయ కృతమనుటకు ప్రకృష్ట సాధనము కాదు. అంతేకాదు నన్నయకు సకల భాషావాగను శాసన బిరుద ప్రదానమువలె, ఆంధ్రశబ్ద చింతామణీ కర్తృత్వ గౌరవమును బాల సరస్వతి బహూమానము కావచ్చును. ఆంధ్ర శబ్ద చింతామణి పరిచ్ఛేదాంత గద్యలకు ఆకరము బాలసరస్వతీయమే. అంతే కాదు. "ఇది శ్రీ సకల భాషా వాగను శాసన నన్నయభట్ట విరచిత"మని చాముండికా విలాసమునందును కలదు.[36] కనుక నిర్ధారక సాధనము కాదు. అనగా ఆంధ్ర శబ్ద చింతామణి అర్వాచీన గ్రంథమగుట అప్రతి బంధకము.

ఆంధ్ర శబ్ద చింతామణి కేతన ఆంధ్ర భాషా భూషణము కంటె అర్వాచీన గ్రంథమనుటకు శ్రీపాదలక్ష్మీపతి శాస్త్రిగారు ప్రతిపాదించిన ఉపపత్తులివి ;

14. రాముణ్డు, రాముండు, రాముఁడు అను రూపములలో మొదటిది సానునాసిక రూపము. అతి ప్రాచీనము. రెండవది పూర్ణబిందు పూర్వకరూపము. తర్వాతిది. మూడవది సార్ధబిందు రూపము తత్పరిణామము. కావున హ్రస్వముమీది పూర్ణ బిందువు అర్థ బిందువగుట ప్రాచీన ఫక్కి. అర్ధ బిందువు పూర్ణ బిందువగుట ప్రాచీన ఫక్కి కాదు. కేతన ఆంధ్ర భాషాభూషణమున పూర్ణబిందువు అర్ధ బిందువగునని విధింపఁబడినది. చింతామణి యందు అర్ధబిందువు పూర్ణబిందు వగునని విధింపఁబడినది. ఇందు కేతన ప్రక్రియ ప్రాచీనము. చింతామణి ప్రక్రియ నవీనము."[37]

అనగా ఆంధ్రశబ్ద చింతామణి అర్వాచీన గ్రంథమని అవగాహకము.

15. ఎదంత రూపములకు ఇయాంతరూపము లుండవచ్చునని కేతన భావము. ఇయాంత రూపములకు ఎదంత రూపము గలుగవచ్చునని చింతామణి యందు కలదు. లంజికా, మల్లికా అను సంస్కృత రూపములకు లంజిఆ, మల్లిఆ అను ప్రాకృత రూపములు కలుగును. అవి తెలుగున లంజియ, మల్లియ అగును. ఎదంతత్వ మంగీకరించిన లంజె, మల్లెఅగును. కేతన ప్రక్రియ కంటె చింతామణి ప్రక్రియశాస్త్ర సంప్రదాయానుసారము. అది కేతన చూచిన అనుసరించును. అంతే కాదు. అది నన్నయ భట్ట మతమనిగాని, నన్నయ వ్యాకరణ మనిగాని తెలిసిన నెత్తిమీద పెట్టుకొనును.[38]

అనగా ఆంధ్ర శబ్ద చింతామణి అర్వాచీన గ్రంథ మని అనుమేయము

16. 'ప్రాచీన శాసనములను గ్రంథ ప్రతులను పరిశీలించిన ప్రథమమీద విభక్తిపరులకు గసడద వాదేశము నిత్యమనియును సాంస్కృతికములకు గూడ కలుగుననియు తేలును. కనుక ఆంధ్ర భాషా భూషణమున ప్రథమాంతముల పయి గసడదవాదేశము నిత్యమని కలదు (62 ప.) ఆంధ్ర శబ్ద చింతామణి యందు వికృతి పదము మీది సంస్కృత పదములకు రావు అని కలదు.[39]'

ప్రాచీన శాసనములందు ప్రథమ మీద గసడదవాదేశములేని లేఖనములు కలవు. కేవల లక్ష్య ప్రదర్శనము సంస్కృత సమ పదములమీది ఆచ్ఛిక పరుషములకు మాత్రమే పరిమితము. (63 ప.) కనుక నిర్ధారక సాధనము కాదు.

ఇంతకంటె నిర్ధారక సాధనములు ఇంకను కలవు. కొన్ని—

17. ఆంధ్ర శబ్ద చింతామణియందు "ప్రాయస్తు స్యాత్కిమాదిక స్యైతః" అను సూత్రము కలదు. ఆ సూత్రమునకు "కిమర్థాదులయొక్క ఇకారమునకైన తఱుచుగా సంధి కలదు. ఏమమ్మ, ఏమయ్య, ఏమందు. ప్రాయః అన్నాఁడు గనుక యేమియమ్మ యనియును గలదు." అని బాలసరస్వతి టీక. ఏమి, మఱి, కిషష్ఠి, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి అనునవి ఏమ్యాదులని చిన్నయసూరిగారి వివరణము. నన్నయ భారతమున "ఏమ్యాదుల యందు కిషష్ఠి లేదు; ఏమ్యాదుల యిత్తునకు సంధిలేదు." అని డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారి ప్రతిపాదనము.[40] నన్నయ భారతమున ఏమ్యాదులకు సంధి కలదని వజ్ఝల చినసీతారామశాస్త్రిగారి ప్రతివాదనము.[41] నన్నయ భారతమున "ఏమి"కి మూడు స్థలములందు సంధికల పాఠములు కలవు. 1. "నీ పేరేమం(దెవ్వరి తనూజవు." (120 ప. 8ఆ.ఆ.ప.) ఇట "నీ పేరేమీ యెవ్వరి తనూజవు", "నీ పేరేమిటి యెవ్వరి తనూజవు'' అను పాఠాంతరములు కలవు.[42] 2 "ఏమని తలంచునొకొ బుద్ధి నిష్ఠులు దానున్'' (238 ప. 1 ఆ ఆది ప) ఇట పాఠాంతరములేదు[43] కాని, "ఏమియని తలంచునొ బుద్ధి నిష్ఠులు దానున్" అను పాఠమునకు అవకాశము కలదు. 3. నీకేమని చెప్పుదు" (120 వచ. 4 ఆ. అర.ప) ఇట కూడ పాఠాంతరము లేదు.[44] కాని, "నీకేమియని చెప్పుదు" అను పాఠమునకు అవకాశము కలదు. కనుక "ఏమి''కి సంధి కల మూడు పాఠములను నిర్ధారక ప్రయోగములుకావు. నన్నయ భారతమున అచ్చుపరమైన "ఏమి'' శబ్ద ప్రయోగములు మొత్తము ముప్పది నాలుగు కలవు[45] అందు "ఏమి''కి సంధి కలదనుటకు ఒక్క నిర్ధారక స్థలమును లేదు. అచ్చుపరమైన "మఱి" శబ్ద ప్రయోగములు నలుబది నాలుగు కలవు.[46] ఒక్క స్థలమునందును "మఱి''కి సంధిలేదు. అచ్చుపరమైన "అది" శబ్దప్రయోగములు నూటపండ్రెండుకలవు.[47] అందు రెండు స్థలములందు మాత్రము సంధి కల పాఠములు కలవు. 1. "చేసినదెట్లనిన'' (139 వచ. 1 ఆ ఆ.ప.) ఇట "చేసితెట్లనిన'' అను పాఠాంతరము కలదు.[48] "చేసినది యెట్లనిన'' అను పాఠమునకును అవకాశము కలదు. 2. శప్తుఁడై యదేల సంభవించె'' (260 ప. 4 ఆ.ఆ ప.) ఇట "శప్తుఁ డగుచునేల సంభవించె'' అను పాఠాంతరము కలదు.[49] కనుక "అది"కి సంధికల రెండు పాఠములను నిర్ధారక ప్రయోగములు కావు. అంతేకాదు. అచ్చుపరమైన "అవి" శబ్ద ప్రయోగములు పది కలవు.[50] ఒక్క స్థలమునందును "అవి''కి సంధి లేదు. అచ్చుపరమైన "ఇది'' శబ్ద ప్రయోగములు డెబ్బది తొమ్మిది కలవు.[51] ఒక్క స్థలమునందును "ఇది"కి సంధిలేదు, అచ్చుపరమైన "ఇవి'' శబ్ద ప్రయోగములు తొమ్మిది కలవు.[52] ఒక్క స్థలమునందును "ఇవి''కి సంధి లేదు. అచ్చుపరమైన

"ఏది "శబ్దప్రయోగము లేదు.[53] "ఏవి" శబ్దప్రయోగమే లేదు[54] కనుక నన్నయ భారతమున కిషష్ఠికి వినా కిమాదులకు సంధి లేని మాట యదార్థము. అయినను "కిమాదుల ఇకారమునకు సంధి ప్రాయికముగ అగును," అను సూత్రము ఆంధ్రశబ్ద చింతామణియందు కలదు వాపక్షముగ "ఏమి"కి రెండు స్థలములందు "అది"కి ఒక స్థలమునందు సంధికలదని సమ్మతించినను, నన్నయ భారతమున కిషష్ఠికి వినా కిమాదులకు సంధికల సందర్భములు మూడు, సంధిలేని సందర్భములు రెండువందల యెనుబదియైదు అగును. అయిన, నన్నయ ఆంధ్ర శబ్దచింతామణిని రచించిన "కిమాదుల ఇకారమునకు సంధి ప్రాయికముగ అగును" అను సూత్రముకాక, "కిమాదుల ఇకారమునకు సంధి ప్రాయికముగ కాదు" అను సూత్రము ఉండవలయును. ఆంధ్రశబ్ద చింతామణి యందు అట్లు లేదు అంతేకాదు. కిషష్ఠికి వినా కిమాదుల ఇకారమునకు సంధి నన్నయకు తర్వాతి సంగతి. కనుక ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ కృతము కాదని కరతలామలకము.

18, నన్నయ భారతమున "కడు, నిడు శబ్దంబుల దవర్ణంబున కచ్చు పరంబగునపుడు ద్విరుక్త టకారంబగు"నని డాక్టర్ చిలుకూరి నారాయణరావు గారి ప్రతిపాదనము.[55]

నన్నయ ప్రయోగములివి :

"అ య్యాదవు ముందటన్ జయజయ ధ్వను
లిచ్చిరిగాని వాని శౌ
ర్యోదయవృత్తి కట్టెదుర నోపర యెవ్వరు
విక్రమింపగన్." 97 ప 2 ఆ స.ప.

"నిద్రలేక వంది నిట్టూర్పులూర్చుచు
నుండె నలుఁడు శోకమత్కటముగ."
133 ప. 2 ఆ అర.ప.

ఇందు 'కట్టెదురు', 'నిట్టూర్పు' అనుపదబంధములు. గణబద్ధములు. అంతేకాదు. పాఠాంతరములు లేని ప్రయోగములు. ఉపరి అన్యపాఠములకు అవకాశము లేని సందర్భములు. కనుక నిర్దారిత ప్రయోగములు. కాఁగా, ఆంధ్రశబ్ద చింతామణియందు ద్విరుక్త టకార విధాయక సూత్రము లేదు. కాని, "సామాన్యాధికరణ్యేదన్తానాం టుగాగమోఽబస్యాత్" అను టుగాగమ సూత్రము కలదు. ఆ సూత్రమునకు "కర్మధారయ సమాసములయందు అచ్చుపరమై యుండిన ఉకారాన్త పదములకు టుక్ అనునాగమము అగును" అని బాలసరస్వతీ టీక. ఇది నిత్యవిధి. కట్టెదుట, నిట్టూర్పు అను పదబంధములు కర్మధారయ సమాసములు. కనుక కడు + ఎదురు = కడుటెదురు. నిడు + ఊర్పు = నిడుటూర్పు అను అనిష్టరూపములు ద్విరుక్తటకార విధానము లేని ఆంధ్రశబ్ద చింతామణికి ఫలము. కట్టెదురు, నిట్టూర్పు అని ప్రయోగించిన నన్నయ ఆంధ్ర శబ్ద చింతామణి రచించిన, అనిష్ట పరిహారము ఇష్టసిద్ధి కలుగు సూత్రమును కూడ రచించుట అవశ్యకము. అట్టి సూత్రము ఆంధ్రశబ్ద చింతామణి యందు లేదు. ఇది ఆంధ్రశబ్ద చింతామణి అసమగ్రతకు మాత్రమే గాక, అప్రౌఢతకును నిదర్శనము. కాఁబట్టి ఆంధ్ర శబ్దచింతామణి విపులశబ్ద శాసనుడైన ట నన్నయ కృతము కాదని కరబదరికము.

19. ఆంధ్రశబ్ద చింతామణియందు "దీర్ఘాణాం హ్రస్వస్స్యాన్నచ దేశ్యపదే" అను సూత్రము కలదు. ఆ సూత్రమునకు "దీర్ఘములకెల్ల తెనుగున హ్రస్వమవును. దేశీయపుఁదెనుఁగునందు లేదు. నవలా, నేజా, లకోరి ఇత్యాది." అని బాలసరస్వతి టీక. నవలా, నకిలీ, లకోరీ, పకోడీ మొదలైన పదములు నిజమునకు దేశీయ పదములు కావు. అనగా ద్రావిడ భాషాపదములు కావని అర్థము అరబీ భాష, తురుష్క భాష మొదలైన విదేశీయ భాషా పదములని సువిశదము. అట్టి పదములు ఆంధ్రభాష యందు పదమూడవ శతాబ్దినుండి ప్రవేశించుట

చారిత్రకసత్యము. అంతేకాదు. పదునాల్గవ శతాబ్ది తుదిని విదేశీయ భాషాపదము చివరి దీర్ఘమునకు హ్రస్వము వచ్చిన సందర్భము కలదు. "ఖుసి మీఱన్ సురథాణి నిండు కొలువై కూర్చున్నచో నీ కరా భ్యసనంబున్నతియించురా" అని శ్రీనాథుని ప్రయోగము. (22 ప 1 ఆ. హర. వి.) హ్రస్వము రాని ప్రయోగములు అనేకము "నవలా నౌకానౌక మదున్నారీ శిరోరత్నమున్" అని పెద్దన్న ప్రయోగము (25ప. 2ఆ. మను. చ.)" నవలాలవ్వేళ హిందోళవైభరిఁదేల్చన్" అని భట్టుమూర్తి ప్రయోగము. (129ప. 1ఆ. వసు. చ.) ఇట్టి ప్రయోగములకు గతికల్పనములేని ఆంధ్రశబ్దచింతామణి అర్వాచీన గ్రంథమగుట అత్యంత సహజము.

20. నన్నయ భారతమున ధర్మువు అను పదము బహుధా ప్రయుక్తము. అది నన్నయ నాటి ఆంధ్ర భాషకు ధ్వజస్తంభమువంటి చిహ్నము. ఎనిమిదవ శతాబ్ది అద్దంకి శాసనమున "దమ్ముమువులు" అని, తొమ్మిదవ శతాబ్ది బెజవాడ శాసనమున "తన ధమ్మున్ వాడుంబడి" అని కలదు.[56] అంతేకాదు. తొమ్మిదవ లేక పదవశతాబ్ది కొరవి శాసనమున "ధమ్మువులు, ధమ్మువుల" అని, పదునొకండవ శతాబ్ది జుత్తిగ శాసనమున "ధమ్ముకావు" అని, దక్షారామ శాసనమున "ధమ్ముకావుగా" అని కలదు.[57] మఱి పదకొండవ శతాబ్ది నన్నయ భారతమున ధర్మువు అను రూపము సర్వత్ర కలదు ఒక ప్రయోగ మిది:

"అవని యరాజకంబయిన యప్పుడ భూప్రజ లందు సర్వథ
ర్మువులుఁ దొలంగు దేవముని ముఖ్యులు
వాయుదు రోలి వృష్టిలే
దవు మఱి యర్థువుల్ దఱుఁగునందురు గావునఁ గాఁయాపనం
బవితథవాక్య చేయక నయంబున రాజ్యము నిల్పు మిత్తఱిన్."

219ప. 1ఆ. ఆ. ప.

ఇందు "ధర్మువు" ఇదమిత్థము. ప్రాసఘటితము సమస్తరూపము. "అర్థువుల్" అనుచోట "అగ్గువుల్" అను పాఠాంతరము కలదు[58] అయినను ఉత్వ, వువర్ణములు కలవు. ఏతదర్థము ఆంధ్రశబ్ద చింతామణియందు సూత్ర సంపాదనములేదు. ఎనిమిదవ శతాబ్ది నుండి పదొకండవ శతాబ్ది వఱకు వ్యవహార ప్రసిద్ధమైన "ధర్మువు" అను శబ్దమును భారతమున వ్యస్తముగను, సమస్తముగను బహుధా ప్రయోగించిన నన్నయ, ఆంధ్రశబ్ద చింతామణి రచించిన తద్రూపనిష్పాదక సూత్రమును రచించుట తథ్యము తదభావము ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ కృతము కాదనుటకు నిర్ధారక సాధనము.

ఇంకను "నేని" (112 ప. 1 ఆ.ఆ ప; 141 ప. 7 ఆ.ఆ ప. 95 ప. 2 ఆ స ప), "కుమ్మొనని" (138 ప. 5 ఆ.ఆ.ప ). "కోడంద్రురు" (257 ప. 2 ఆ.స.ప.) మొదలైన నన్నయ ఆచ్ఛికపద ప్రయోగములకును ఆంధ్రశబ్ద చింతామణియందు గతికల్పనము లేదు. "నన్నయ భట్టారకుడు రసప్రధానమగు తన భారత కావ్య నిర్మాణ సందర్భమున గ్రహించు నియమములనే యాంధ్రశబ్ద చింతామణిగ రచింపఁ బూనినవాఁడు[59]" అయిన, విలక్షణములైన నన్నయ పదప్రయోగములకు ఆంధ్రశబ్ద చింతామణి విధాన సమర్థము కావలయును. ఏవం విధమైన విధాన సామర్థ్యము ఆంధ్రశబ్ద చింతామణియందు లేదు. సరికదా ఆంధ్రశబ్ద చింతామణి పదునారవ శతాబ్ది కంటె ప్రాచీన గ్రంథము కాదని బహువిధ భాసమానము.

ఆంధ్ర శబ్ద చింతామణికి అనుబంధమైన అథర్వణ కారికావళి కూడ పదునారవ శతాబ్ది కంటె ప్రాచీన గ్రంథము కాదు.[60] అథర్వణకారికావళి యందు "అహోయ మస్య దేశీయం యత్తి దేవ

ప్రయుజ్యతే" (9 శ్లో. 1 పరి.)" డోలా భూషోత్త రీయాది విన్నైత్వం నాస్తి మధ్యయః" (24 శ్లో. 1 పరి. అను కోరికలు కలవు "రసముగల అన్య దేశ్యపదము ప్రయోగింపఁబడు చున్నది", "ఉయ్యెల, తాయెతు, పయ్యెద అను శబ్దములను వదలి మధ్యయకారమునకు ఎత్వములేదు" అని ద్వితీంత్రి కి సీతారామకవి టీక. ఇందు తాయెతు అను పదము అన్యదేశ్యము. అనగా విదేశీయ పదము. తావీజు శబ్దవికారము. అది రక్షార్థకముగను, భూషార్థకముగను తెలుగున "తాయెత్తు" అను పదమయినది. ఉభయార్థములు శ్రీనాథుని పలనాటి వీరచరిత్రయందు ప్రయుక్తము "మేనికి రక్షయై మించు తాయెతులు దండ చేతుల రెంటధారిణచేసి" (2-128, 129.), "దండ కడియములు దంట తాయెతులు" (16-56) పదరవితా ప్రభేదమైన పలనాటి వీరచరిత్రయందు లేఖక పారక ప్రమాదములతో పాటు గాయక ప్రమాదములును అవకాశము. కనుక పలనాటి వీరచరిత్రలోని తాయెతు పదములు శ్రీనాథుని ప్రయోగములగుట నిర్ధారకము కాదు. రక్షార్థకమైన తాయెత్తు శబ్దము ధూర్జటి శ్రీకాళహస్తి మహాత్మ్యమునందు ప్రయుక్తము. "మందుల తాయెత్తులు గట్టినన్ శబర పుత్త్రిక గూడి యాడంబురిన్." (32 ప. 3 ఆ.) భూషార్థకమైన తాయెతు శబ్దము తరిగొప్పుల మల్లన్న చంద్రభాను చరిత్రమున ప్రయుక్తము. "ఒక కొంత యొరగిన సికమీఁద ముడిపువ్వుటెత్తుల దొరయఁ దాయెతులఁజుట్టి" (89 ప. 1 ఆ.) ఇట తాయెత్తు శబ్దములోని మధ్య యకారము ఎత్వవిశిష్టముగ యతిమైత్రి ఘటితము. కనుక నిర్ధారక ప్రయోగము ఉయ్యెల, తాయెత్తు, పయ్యెద అను శబ్దములందు పదమధ్య యకారము అత్వవిశిష్టమనే ముద్దరాజు రామన చెప్పినట్లు, అది మిథ్య అని కాకునూరి అప్పకవి ఖండనము (184 ప. 2 ఆ.) ధూర్జటి, తరిగొప్పుల మల్లన్న, ముద్దరాజు రామన పదునారవ శతాబ్ది కవులు. పదునారవ శతాబ్దియందు ప్రయుక్తమైన, భూషార్థకమైన, తాయెత్తు శబ్దములేని పదమధ్య యకారము ఎత్వవిశిష్టమని విధించిన అధర్వణ కారికావళి పదునారవ శతాబ్దికంటె ప్రాచీన గ్రంథము కాదు. అంతేకాదు. అందలి, "శ్రీకవి సమ్మతే" 22-1) విష్ణుశర్మణాకథితః" (28-1) "హరి సమ్మతే") "(11-2) "ఇతి శృంగార భూషణః" (14-2 "హరేర్మతే" (17-2) "మతే కవి శిఖామణేః" (9-3) భవతి ధూర్వితేః" (45-3) ఇత్యాది కూట సాక్ష్యములును అధర్వణ కారికావళి అర్వాచీనతకు పూటకాపులు. కాఁబట్టి అధర్వణ కారికావళి అను బంధమును బట్టి కూడ ఆంధ్ర శబ్ద చింతామణి ప్రాచీన గ్రంథము కావలసిన ఆవశ్యకము లేదని స్పష్టము.

సమష్టిపై అసమగ్రమైన, అసమర్థమైన, అప్రౌఢమైన, అర్వాచీన గ్రంథమైన ఆంధ్ర శబ్ద చింతామణి నన్నయ కృతము కాదని సిద్ధాంతము.

## సూచికలు

16. ఆంధ్ర మహాభారతము. సంశోధితముద్రణము. ఆదిసభాపర్వములు. పుట. 204.
17. ఆం. క. చ. పుటలు 47-9: 50-2.
18. చిం. వి. వ. పుటలు 175-81.
19. ఆం. క. చ. పుట 53.
20. చిం. వి. వ. పుట 10
21. ఆం. క. చ. పుట 683.
22. చిం. వి. వ. పుటలు 35-8.
23. శాసనపద్యమంజరి. ప్రథమభాగము. పుటలు 12-3.

24. చిం. వి. ప. అనుబంధము. పుటలు 14-8.

25. శా. ప. మం. ప్ర భా. పుటలు 1-3.

26. అదే. పుట 3.

27. చిం. వి. ప. పుటలు 69-74.

28. Epigrapny and south Indian script pp 59,64,57-154.

29. Medieval Indian Alphabets. canares and Telugu.

30. Elements of south Indian palaeography plate No. iv.

31. ESIS pp 216, 221.

32. ఆంధ్రభాషావికాసము. పుటలు 92-3.

33. చిం. వి. ప. పుట 12.

34. అదే. పుటలు 3, 50.

35. ఆం. క. చ. పుట 683

36. అదే. పుటలు 69-84.

37. ఆంధ్రభాషాభూషణము. వావిళ్ళ ప్రచురణ. పీఠిక. పుటలు 14-20.

38. అదే. పుటలు 20-1.

39. అదే. పుటలు 21-3.

40. రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక. పుట43.

41 చిం. వి. ప. అను. పుట 18.

42. ఆం. మ. భా. సం. ము. ఆ. స. ప. పుట 505

43 అదే. ఆ. ప పుట 53.

44. అదే. పుట 316

45. నన్నయ పదప్రయోగ కోశము. పుటలు301-2.

46. అదే. పుటలు 687-8

47. అదే. పుటలు 73 77.

48. ఆం మ భా. సం. ము. ఆ ప. ప. పుట 45.

49. అదే పుం 248

50. నన్నయ పదప్రయోగ కోశము. పుటలు159-60

51. అదే. పుటలు 201-4.

52. అదే. పుటలు 209-10.

53. అదే. పుట 292

54. అదే. పుట 307.

55. రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక. పుట44.

56. శా ప. మం. ప్ర. భా పుటలు 1,3.

57. ప్రాచీనాంధ్రశాసనాలు పుటలు 68, 141, 154.

58. ఆం. మ. భా. సం. ము. ఆ. స.ప. పుట 244.

59. చిం. వి. ప. పుట 21

60. ఆంధ్ర కవుల చరిత్రము. ప్ర. భా. పుటలు 256-262.

నటీ కాదర్పణ కారికావళివిమర్శనము. పుటలు 30-43.

భాషాచరిత్రకవ్యాసావళి. పుటలు 85-95.




# కాల్పనిక శక్తి యుతుడయిన బాలుడు

## డి. పూర్ణచంద్రరావు

(గత సంచిక తరువాయి)

సృజనతా గుణ సంకలితులైన బాలురు సహజముగనే మిక్కుటమైన అవసరములను కలిగి యుందురు. సృజనతా గుణయుతులైన ఈ బాలురు నిగూహితమైన అవ్యక్తమైన అనిర్వచనీయమైన అంశముల వలన ఆకర్షింపబడి ప్రబోధితులు కాబడుట జరుగుచున్నది. సామాన్య జ్ఞానవంతుడగు బాలునకు తన కలలయందు సహితము తన ఊహాల కందని నిగూఢమైన విజ్ఞాన పరధియందలి శాస్త్రీయ, సాంకేతిక కళాత్మక విజ్ఞానముల నన్వేషించుటయందు సాహసోపేతులై ఉద్యమించుటకు కారణము కేవలము సృజనతా గుణయుతుడైన ఆబాలుని యందు ప్రాకృతికముగా ప్రదీప్తి నందుచున్న సృజనాత్మకమైన ప్రతిభ పాటవముల వలన పెల్లుబుకుచున్న ఊహోజనిత సంకల్ప తరంగ జ్వాల యను విషయము సృశాలోక మధ్యవర్తియైన సమనస్కేంద్రియ సన్నికృష్టమయిన ఘటము వలె సర్వజన విదితము. ఈ బాలురు తమయందు పెల్లుబుకుచున్న ఆయా సృజనాత్మక భావనల స్వరూప స్వభావములను ప్రశ్నించుటకు తిరిగి ఆ భావనలను వివరించుకొనుటకు అటుపై ఆ భావనలను పరిశీలించుకొనుటకును ఇతరులకు ఆ తమభావనలను తెలియపరచుటకును ఐలీయమైన అవసరములను కలిగియుందురు ఈ సృజనాత్మక శక్తి సంపన్నులైన బాలురు తమ భావములను వ్యవస్థాపితము చేసికొనుట కొఱకు చేయు ప్రయత్నముల నెలకొల్పుటకు బాహ్యముగా సమాజమునందలి ఉపాధ్యాయులు జీవిత ఉపథోపదేశకులకు సాంకేతికుల యొక్క ప్రోత్సాహ సహకారముల నపేక్షించుట అను విషయము అనివార్యమగుచున్నది. సమాజము సామాన్యమైన ప్రవముస ఈ ప్రతిభా సంపన్నులైన బాలురకు ప్రోత్సాహమున దించజాలదు. కేవలము ఉపాధ్యాయులు జీవిత పథ ఉపదేశకులగు సాంకేతికులు తమ వైదుష్య అనుభవముల వలన ఆపేక్షితమయిన ప్రవాహనలను అందించుటలో ఈ బాలురకు సహకరించ గలుగుచున్నారు.

సృజనతాగుణ సంకలితుడైన బాలునకు జీవితపథ ఆదర్శములను ఉపదేశించుట యందలి ఆశయము కేవలము ఆరోగ్య ప్రదమైన వ్యక్తి స్వరూప స్వభావములను ఆ బాలుని యందు నెలకొల్పుట అని గుర్తించవలయును. సృజనతా నిర్ణీత రూపకమయిన భావములను నిరంతరము ఆ బాలుని యందు అనుస్యూతమగునట్లును ప్రోత్సహించ వలయును. స్థిర రూపమయిన నిర్ణీత భావములు సంచలన రూపమయిన సృజనతా భావములు రెండును చీకటి వెలుగులవలె పరస్పర విరుద్ధమయిన భావములని గుర్తించుట అసముచితము, అసంగతము. సృజనతా గుణయుతులైన బాలురు అనేక మంది తమయందు స్థిర, సృజనతా గుణముల రెండి

టిని విస్ఫురితము చేసి ప్రఫుల్లము గావించుట కుత హింతుకు. సృజనత, స్థిర భావముల మధ్య సమన్వయస్థితి నెలకొని యున్నయెడలనే ఆ రెండు గుణములును ఉత్తేజిత మగుట సంభవించు చున్నది. పరస్పర విరుద్ధముగా కన్పించు చున్న ఈ సృజనతా, స్థిరభావముల మధ్య సమన్వయస్థితి నెలకొల్పుకొనుటకు ఈ బాలరు జీవిత పథోపదేశకులగు సాంకేతికుల యొక్క సహాయము నపేక్షించుదురు. ఈ బాలురకు ఉపాధ్యాయుల యొక్కయు జీవిత పథోపదేశకులగు సాంకేతికులైన ఉపాధ్యాయుల యొక్కయు సహాయ సహకారములు విద్యార్థిగమి యొక్క అన్ని దశల యందును ఒక క్రమమున అపేక్షింపబడుచునే యుండును. కారణము ఈ సృజనతా గుణ సంకలితమైన వ్యక్తిత్వము ఏకస్మాత్తుగను, ఆశ్చర్యకరముగను ప్రాదుర్భవించి విస్ఫురిత మగునది మాత్రము గాజాలదు ఈ సృజనతా గుణ సంకలితమైన వ్యక్తిత్వము శిశుపాలన కేంద్రముల నుండి విశ్వవిద్యాలయముల వరకు పర్యాప్తమైన అభ్యసన రూపకమైన ఉపకరణము నాధారముగా వివిధ ఆయంతరములనధిగమించి పాలన పోషణ చేయబడవలసి యున్నది.

ఈ సృజనతా గుణ ప్రాదుర్భావ వికాసముల యందు ప్రాక్ చేతనావస్థ నిర్వహించుపాత్రయు గణనీయమగు విధమున గమనించ వలసి యున్నది. ప్రాక్ చేతనావస్థ ప్రచోదితమైన మేథోక్రమమును ఆచరణ రూపమున అనులు పరచు బాలుని లక్షణములను ఆ బాలుని చుట్టు ఉన్న పరిసరములను గురించియు వివరించవలసి యున్నది. ప్రాక్ చేతనావస్థయందు సంభవించు ఆలోచనలను గురించియు ఈ అహంప్రత్యయము యొక్క నిగ్రహమును గురించియు [illegible] యున్నది. స్వప్నయందును, ఊహా ప్రపంచము నందును, మత్తుగ నున్న స్థితియందును మానసిక రుగ్మత నెలకొన్న పరిస్థితుల యందును ఈ అహం ప్రత్యయ నిగ్రహమును గురించి వివరించ వలసి యున్నది. స్వయం నియమనమును జాని విడువకు డను, ఉద్వేగము వలన అధోస్వ్రాయము గాకుడను ఆయా ఉత్పత్తి క్రమముల యందును, వ్యక్తి ఈ అహం ప్రత్యయమును నిగ్రహించుటకు తన పాటవమును బాహ్య చేష్టలను సహించు విధమును ప్రదర్శించును. సుప్రసిద్ధులైన శాస్త్రవేత్తలు శాస్త్రీయ పరిశోధకులు తదితర కాల్పనిక కర్తలు ఈ అహం ప్రత్యయ నిగ్రహములను గురించి వివిధ రూపముల ప్రతిపాదించిరి. వీరు తమ సంకల్పిత తరంగములకు పరిష్కారములను కనుగొనుటకు ఎంతయు కృషిసల్పి యుండిరి. తుదకు స్నానము చేయునపుడు, తదితర నిత్య కృత్యముల నాచరించు నప్పుడును, విశ్రాంతి ననుభవించునప్పుడను పరిష్కారము నందించు ఆలోచనలు ఈ వ్యక్తులకు స్ఫురించుట సంభవించు చున్నది. ఈ అహం ప్రత్యయ నిగ్రహము ప్రాథమికమైన సృజనతా తరంగముగా సహితము నిర్దేశితమగు చున్నది. ఈ ప్రాథమికమైన సృజనత అను తరంగము ఆటలాడు సమయము అందును, ఊహించు సమయము అందును, నవ్వునపుడును, ప్రశాంతముగా యుండునప్పుడును ప్రాదుర్భావమగు చున్నది. ఈ విధమైన ఉపదేశము యొక్క ఆశయములు ఈ సృజనతా గుణమును లేక అహంప్రత్యయ నిగ్రహమును లేక ప్రాక్ చేతనావస్థ యందు గలుగు ఆలోచనను పరిపోషించు పరిస్థితులకు దోహదము చేయుటవలన ఆ పరిస్థితులను అవశ్యము అవగాహన చేసికొన వలయును. సృజనతను ఉత్పన్నము చేయు ప్రాక్ చేతనావస్థకు సంబంధించిన మేధో క్రమమును

నిరాటంకముగా వ్యవహరింప చేయుటకు అవసరమయిన పరిస్థితులను అవగాహన చేసికొన వలయును. బాహ్య పరిశీలనముల వలన తన తనమును గురించి ఏ విధమయిన బెదరింపు లేకుండుట - (1) సాంకటములను నెదుర్కొనుట కుత్సహించుట, (2) తనను తాను గుర్తించు విధానము. తన భావనలతో సంబంధము కలిగి యుండుట (3) తనను తాను ప్రత్యేకించి విభిన్నమయిన వ్యక్తిగా అవగాహనచేసికొనుట. ఇతరుల స్వరూప స్వభావముల నుండి తన తనమును విభిన్నముగా గుర్తించుకొనుట. (4) ఇతరుల భావముల ఎడ నిర్వ్యాజముగా యుండుట. వాస్తవిక విషయములకు సంబంధించిన ప్రత్యక్షజ్ఞానము నందును, తన భావనల యందును విశ్వాసము కలిగియుండుట (5) ఆయా వ్యక్తుల అంతర్గత సంబంధములయందు పరస్పర అవగాహన కలిగియుండుట. సామాజిక సంబంధములను గురించి తీవ్రమయిన కోరికలను తను కలిగియుండుట. ఆ సామాజిక సంబంధములను తను అసంగతమైనవిగా నిరాకరించుట అను విషయముల మధ్య సమవ్యవస్థిని కొనసాగించ వలసి యుండవలయును.

మిక్కుటమయిన ప్రజ్ఞ నిశితమయిన సృజనతా గుణ సంపన్నులైన బాలుర యొక్క తల్లిదండ్రులు తమ సంతతి యందున్న ప్రతిభను అభివృద్ధి పరచుట కేమాత్రమును అభిలషించకుందురు. కేవలము తమ సంతతి జీవిత సమస్యలతో అనుగుణముగా సమన్వయత చెంది ప్రవర్తించుటకు మాత్రమే ఇచ్ఛగింతురు. తమ బాలురు నిశితమయిన సృజనతా రూపకమయిన ప్రజ్ఞను పెంపొందించుట కన్నను జీవితము నందు కలుగు తీవ్రమగు సమస్యలతో సమన్వయత నొంది సామాన్యమైన భావములను అలవర్చుకొని ప్రవర్తించవలయుననియే అభిలషింతురు. కారణము నిశితమయిన ప్రజ్ఞ సృజనతా గుణము రెండును బాలుని కొన్ని సమయములందు సమీక్షము చేసి కల్లోలితుని గావించుటకు అవకాశములు కల్పించుచున్నవి.

## ప్రత్యేక ఆశయములు.

ప్రతి బాలుడును సత్ఫలితములను పొందించు ప్రతిఫలయందే ఆసక్తిని పెంపొందించుకొనుచుండును. కొందరు తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు నిశిత ప్రజ్ఞ, సృజనతాగుణ సంపన్నులైన బాలుర అభిమతములను గుర్తించక నిరాకరింతురు. ఈ బాలురు అడుగు విభిన్నమయిన ప్రశ్నలను, వారి భావములను వారి అభిమతములను అవగాహన చేసికొని వారందించు ఉపకృతులను యధాతధముగా గౌరవ పురస్కరముగా ఆదరించి అంగీకరించుట ఈ తల్లిదండ్రులకు అనివార్యమైన అంశమని గుర్తించుట సముచితము.

ప్రతిభావంతులైన ఈ బాలురను మూడు విధములుగా వర్గీకరించుట జరుగుచున్నది. (1) నిరంతరం విద్యావ్యాసంగం చేయు విద్యార్థి (2) సాంఘిక సేవ చేయుటయందు ఆసక్తి గల విద్యార్థి (3) సృజనతా గుణయుతుడైన జిజ్ఞాసగల విద్యార్థి.

(1) విద్యావ్యాసంగముగల విద్యార్థి ఉపాధ్యాయులు బోధించిన పాఠ్యాంశము లను చదువుతూ అనుబంధమైన విషయములను పరిశీలించుచు, నిర్దిష్టమైన పరీక్షలయందు ప్రథముడుగా ఉత్తీర్ణుడగు చున్నాడు.

2. సాంఘిక సేవాసక్తి గల విద్యార్థి ఆయా పరీక్షలకు నిర్దిష్టమైన పాఠ్యాంశములను మాత్రము చదివి సామాన్యముగానే ఉత్తీర్ణుడగుచుండును.

3 సృజనతా గుణముగల జిజ్ఞాసువైన విద్యార్థి మాత్రము తాత్త్విక గ్రంథములను,

రాజకీయ, ఆధ్యాత్మిక నవలా గ్రంథములను చదువుట యందే కాలమును గడుపుచుండును ఈ విధమైన గ్రంథ పఠనము గావించు వారి యందున్న సృజనతా గుణము గాని పరీక్షించుటయందు ఉత్తీర్ణులగుటకు ఏమాత్రము సహాకరించ జాలకున్నవి. సృజనతా గుణసంకలితులయిన బాలుర యందలి వైవిధ్యము గల ప్రతిభను పరీక్ష చేయుటకు వంటి జాతీయ ప్రతిభకు పరిశోధనా రూపమున నున్న ప్రజ్ఞానికషలు (ప్రశ్నావళి) సృజనాత్మకులైన ఈ బాలుర యందలి వైవిధ్యం గల ప్రజ్ఞను వారియందలి మనస్సంకల్పితమైన విజ్ఞాన తరంగములను పరిగణన చేసి ప్రమాణీకరించుట కెంతయో సహాకరించుచున్నది.

## స్వకీయ ప్రతిభను గుర్తించుట

సృజనాత్మకులైన అనేకమంది బాలురు తమ యందలి ప్రతిభను గురించిన అవగాహనను కలిగియుండుటయు ఒక సమస్య అయిఉన్నది. ఈ బాలురు సహజమయిన తమ ప్రతిభను గురించి ఆయా ప్రయోగములను అమలు పరుపవలయునన్న అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులయొక్క ఉపదేశరూపకమైన సహాకారము ఎంతయు ఆవశ్యకమైయున్నది. ఈ విధంగా అనుభవజ్ఞులైన వారు ఈ బాలురకు తగు క్రమమున ఉపదేశించి సహాకరించకున్న ఆ బాలురయందు నిగూహితమైన ఈ సహజ ప్రతిభా పాటవములు ఈ బాలురకు నిరుత్సాహంతో, నిస్సారమైనవిగానే పరిగణింపబడుచున్నవి. కారణము సృజనతగల ఈ బాలురు ప్రదర్శించు చర్యలు సాధారణమైనవిగను, క్రమబద్ధమైనవిగను కాకుండుటవలన ఇతర బాలురచే హాస్యాస్పదంగా ఎన్నిక చేయబడుచున్నవి. కనుక వీరియందలి ప్రతిభాపాటవములు విలువైనవిగా గుర్తింపబడక అతిక్లిష్టమయిన సమస్య అగుచున్నది వాస్తవిక రూపమున బాలురు తమ ప్రతిభను ప్రయోగపరచుటవలన సహజమయిన ప్రతిఫలమును పొందిన వాడయినను ఆ బాలుడు మాత్రము హాస్యాస్పదుడైన వ్యవస్థితి నుంచి తప్పించుకొన జాలకున్నాడు. బాలుని యందలి ప్రతిభ ఈవిధముగా సత్ఫలితమునొంది ఒక రూపమును ఆపాదించుకొనబడిన దైనను ఆ ప్రతిభ ప్రమాణీకరణమునకు ఆధార భూతుడుగా బాలుడు అగుటవలన ఆ బాలుడు హాస్యపాత్రుడగుట అసమంజసము, అనౌచిత్యము అయిన విషయము. కనుక ఉపాధ్యాయులు విభిన్నమయిన సంకేతములను అమలు పరచి సృజనతా గుణసంకలితుడైన ఆ బాలునకు తగు విధమైన ఉపదేశములను సూచనలను అందించి ఆ బాలునియందలి ప్రతిభను, ఆ బాలుడు అనురూపమున గుర్తించి క్రమపథమున ప్రవర్తించుటకు అనువగు విధంగా ఉపకరించి, సహాకరించవలయును.

విచేష్టల నివారణ ;—సృజనతాగుణయుతులయిన బాలురు తమ ప్రతిభలను అవగాహన చేసికొనకున్నయెడల అది ఒక తీవ్రమయిన సమస్యగా పరిణమిల్లుచున్నది. వీరియందున్న ప్రతిభా పాటవములు అవగాహనలేని దానివలన హాస్యాస్పదమయినయెడల ఈ బాలురు కల్లోలితులగుట సంభవించుచున్నది. అటుపై ఈ బాలురు అనేకమయినవిచేష్టలవలన ఆ బాలుర యందలి ప్రతిభా పాటవములను విపర్యయంగా ప్రయోగించుటయందు ప్రతిఫలించుచున్నవి. పర్యవసానము ఈ బాలుర యందున్న ప్రతిభా పాటవములు నిష్ఫలమగుచున్నవి. ఈవిధమయిన పరిస్థితులయందు ఈ బాలురకు ఉపాధ్యాయుల సహాకారమెంతయు అపేక్షితమైయున్నది. ఉపాధ్యాయులు తమయందున్న సహజ ప్రతిభాపాటవములు విపర్యయముగా ప్రయోగింపబడుచున్న

వని ఆయా బాలురు గుర్తించువిధముగా వివరించి ఉపదేశించవలయును. ఆయా బాలురను ఈ విధముగా గుర్తించునటులచేయుటవలన ఉపాధ్యాయులు ఆ బాలురయందలి ప్రతిభ చేష్టల నాచరించుటయందు ఉపయోగపడకుండ గాని వారించుటకు ఉపాధ్యాయులు ఎంతయు సహాకరించుచున్నారు.

అవధులను లేక పరిమితులను గుర్తించుట:- బాలుడును, పరిసరములు రెండును కొన్ని పరిమితులను, అవధులనుగలిగియుండుట సహజము బాలురయందున్న ప్రతిభాపాటవములను,భావనలను పరీక్షించుకొనుటకును అభివృద్ధి పరచుకొనుటకును అవసరమయిన పరికరములను ఆర్థిక వవరులను అనివార్యముగా గలిగియుండవలయును తల్లిదండ్రులు, పాఠశాల, సమాజము మొదలయిన పరిసరముల పరిస్థితులుకొన్ని పరిమితులను కలిగియుండుటవలన అవసరమయిన వనరులను ఈ పరిసరములు బాలురకు సమకూర్చుటయందు విఫలమగుచున్నవి. అటులనే సృజనాత్మకుడయిన బాలుడు సహితము తమ సంకల్పములను పరిష్కరించుటకు అవసరమయిన నేర్పరితనమును కలిగియుండనందున వైఫల్యమునందిన వాడగుచున్నాడు. సృజనాత్మకుడయిన బాలుడు ఈ విధమయిన పరిమితులను నిరుత్సాహ పడకుండగా అంగీకరించి తన చతురతతో ప్రతిభా పాటవములను సృజనాత్మకముగా అమలుపరుచుటకు ప్రయత్నించవలయును. నిర్మాణ చతురడయిన సృజనతాగుణ సంకలితుడయిన బాలుడు తనయందున్న పరిమితులను, పరిసరములయందున్న పరిమితులను అవగాహనచేసికొని గుర్తించి సముచితమయిన ఉత్సాహాముతో ఆయా సమస్యలను సృజనాత్మకముగానే పరిష్కరించును. సృజనతగల బాలుడు నిర్మాణ చతురత లేనివాడయినయెడల తన యందున్న, పరిసరములయందున్న పరిమితులను గ్రహించుట నావశ్యకముండును.

కనిష్ట పరిమితిగల నైపుణ్యాము సలవరచుకొనుట:- సృజనతాగుణముగల బాలురు అనేకమంది శిశువైన విన్యాసముల నాచరించుటయందు అవసరమయిన కనిష్ట పరిమితిగల నిపుణతను సహితము గలిగియుండని వారగుచుందురు. సృజనతాగుణయుతులగు ఈ బాలురు శాస్త్రీయ సాంకేతిక విద్యావ్యాసంగముల యందు నిమగ్నులయి యుందురు ఈ బాలురు మాత్రము తాము ధరించు గుడ్డలయందును స్నేహితుల నెన్నుకొనుటయందును తమ కార్యకలాపములను ఆచరించుటకును అవసరమయిన కనీసమయిన నిపుణతను కలిగియుండరు. ఆ విషయములందు నేర్పరితనముతో వ్యవహరించునటుల వారిని ప్రోత్సహించవలయును.

అవకాశములను ఉపయోగపరచుట :- సృజనతా గుణయుతులయిన ఈ బాలుర యందుఅకస్మాత్తుగన ,అనపేక్షితముగను కొన్ని ఆలోచనలు గలుగుట సంభవించుచున్నది. ఆయా సంఘటనలవలనను, ఇతివృత్తములవలనను పరిష్కారరూపకమయిన పర్యాలోచనలు ఉత్పన్నమగుచున్నవి. ఈ బాలురు సహితము సామాజికమయిన అనేక సమస్యలను ఎదుర్కొనవలసి యుందురు. ఈ సమస్యలవలన అవిష్కృతమయిన ఆలోచనల గురించిన విజ్ఞానము అరుదుగా కలిగియుందురు. అకస్మాత్తుగా ఆవిష్కృతమయిన తమతను ఆలోచనలకు భావనలకు పరిష్కారములను కనుగొనుటకు గల అవకాశములను తెలిసికొనుటయందు విఫలమగుచున్నారు. కనుక ఉపాధ్యాయులు ఈ బాలుర

మయిన కృత్యముల నాచరించి ఎంతయు సహకరించుచుందురు.

ఈ కారణము వలన సమాజము ఈ బాలుర యెడ వారాచరించు మ[illegible] కృత్యములవలన [illegible] తగ్గి[illegible] యుండుట సహి[illegible] సంభవ[illegible]డి.

సృజనాత్మకమయిన ప్రతిభావంతమయిన భావములను వర్ధిల్లనీయకుండగా కాపాడుట యనునది సమాజము యొక్క బాధ్యతాయుతమయిన కర్తవ్యము. సామాజికమయిన చర్య బాలునకు తనయందలి సృజనతా గుణములను నిర్వీర్యతనందకుండగా కాపాడుకొనుటకును, ఆ బాలునకు ప్రతికూలముగా అనుమతించు శాసనములను తగ్గించుటకును సహకరించుచున్నది. ఉపాధ్యాయులు తగు విధమున హితోపదేశము చేయుటవలన బాలుడు తన చేష్టల యందు మార్పును చేయుటవలన సృజనతా గుణమును పెంపొందించుకొనుచు సమాజమునందు నింద్యార్హమయిన చేష్టల నాచరించుటను తగ్గించుచుండును.

ఏకాంత వాస నివారణ :-

ప్రతిభావంతులగు బాలురు ఏకాంతముగా కాలము గడుపు ఆలోచనలను కొనసాగించు విధానము వలన ఎదురగుచున్న సమస్యలు విస్తృతముగా చర్చింపబడుచున్నవి. విభిన్నమయిన ఆలోచనలు సృజనాత్మకమయిన గుణములుగల బాలుడు ఒంటరిగా యుండుటకు అభిలషించుచుందురను విషయము సహితము సర్వజన విదితము. వీరు తుదకు తమ సహాధ్యాయులతో, ఉపాధ్యాయులతో కలిసిమెలసి యుండుటయు అవసరమని అంగీకరించవలెయును. ఈ విధముగా సృజనతా గుణయుతుడయిన బాలుడు ఏకాంతముగా యుండుట అను విషయము సహితము అతిక్లిష్టమయిన విషయము. నిశితమయిన సృజనతా గుణయుతులయిన బాలుడు ఇతరుల సంబంధ సహకారములను అపేక్షించి తమయందు త్పుల్లమగుచున్న ప్రతిభావంతమయిన భావములను తమ స్నేహితులయిన ఆ బాలురకు తెలియపరచుట కుత్సహింతురు.

ఉపాధ్యాయుడు సహితము ఆ బాలుని ఏకాంత స్థితిని అవగతము చేసికొని ఆమోదించవలసియున్నది. అటు పై ఆ విధమయిన బాలురు అస్తవ్యస్తముగా ప్రవర్తించుటకు అవకాశము లేని విధముగా ప్రవర్తించుకొను విధముగా ఆదర్శములను ఉపదేశములను గరపవలయును. సమానమయిన ప్రతిభావంతులగు బాలురతో కలిసిమెలసి సంచరించు విధముగా బాలురకు హితమును గరపవలయును.

తమ సాటి ప్రతిభావంతమగు సృజనతా గుణముగల బాలుని కలియుట సంభవించిన యెడల ఆ తరుణమున తమ యందలి విశిష్టమయిన సృజనతా లక్షణములను అప్రతిహతముగా నిలుపుకొనుటకు నూతన పరిష్కారములను కనుగొనుటకును యత్నించుచుందురు. పరిశోధకులగు చరిత్రకారులు మాత్రము ప్రతిభావంతులగు బాలురు ఏకాంతముగా యుండుట అనుచితమని ప్రతిపాదింతురు. ఈ బాలురు తమ సహచరులతో కలిసిమెలసి తిరుగాడుచు తమ సంవేదనలను వారి కెరుక పరుచుచు వారితో సందేశ సహకారములను పరస్పరము కలిగియుండవలయుననియు ప్రతిపాదించుచున్నారు.

**ఆవేదన భీతావహస్థితిని ఎదుర్కొనగలిగి యుండుట :-**

ప్రతిభావంతులయిన బాలురు సృజనతా గుణయుతులయిన శాస్త్రజ్ఞులయిన వారు చిత్తోద్వేగములకును శంకా భయములకును గురియయి సంపీడుతులగుట సహజముగనే జరుగుచున్నది. ఉద్వేగాదులవలన పీడితులగుచున్న తరుణమున ఈ బాలురు శంకా భయములకును సహించగల ఓర్పును వహించుట కితరుల ప్రకృతి నపేక్షింతురు. ఉద్వేగ్రగస్తులయిన బాలురు తగు సలహా సంప్రదింపులు ఉపదేశికులయిన ఉపాధ్యాయుల నుండి పొందకున్న పక్షమున ఈ బాలురు మానసికమయిన ఆలోచనలకు ఆందోళనలకు గురియయిన వారగుతమ నిత్య వ్యవహారముల యందు సహితము వైఫల్యమునందిన వారగుచుందురు. ఉద్వేగాన్వితులయిన ఈ బాలురు ఆయా కార్యకలాపముల నాచరించుటయందు తగు సహాకారము ఇతరులనుండి పొందని వారగుచు అస్తవ్యస్తముగా వ్యవహరించుటవలన విభిన్నమయిన స్వభావముగల వారగుదుమని భయభ్రాంతులగుచుందురు. విభిన్న లక్షణములుగల ఈ బాలురు తిరిగి ఆవేదన శంకా భయముల వలన సంపీడితులగుట సహజము. ఆయా పరిస్థితులు అనుకూలించిన యెడలను తగు విధమయిన ఉపదేశములు ఉపాధ్యాయుల నుండి పొంది అవగాహగలిగిన యెడలను ఈ బాలురు ఆవేదన శంకా భయము లధిగమించి ఆయా సన్నివేశములను అమలు పరచగలిగి యుందురు.

**క్లిష్టమయిన పరిస్థితులను, ఆయా వైఫల్యములను అధిగమించ గలుగుటకు అనుసరించు అభ్యాసము:-** విఖ్యాతినందిన ప్రసిద్ధ వ్యక్తుల జీవిత చరిత్రను పరిశీలించునటుల ఈ బాలురను ప్రోత్సహించ వలయును. కఠినమయిన సమస్యలను జీవితమునందు గలిగిన వైఫల్యములను ఎదుర్కొనుట, ఆసమస్యలను అధిగమించుటలో చరిత్రగల వ్యక్తులు నిర్వహించినపాత్ర విదితమగుచున్నది. ఈ పరిశీలన ఫలితము పరిగణించ దగిన విధముగా ఆలోచించ గల ప్రతిభా వంతులగు బాలురు కఠినమయిన సమస్యల నెదుర్కొని ఆసమస్యలను పరిష్కరించు విధముగా ప్రోత్సహించ బడి ఉత్తేజ పరుపబడ వలయును అని గుర్తించుట అగుచున్నది. కనుక ఈ సృజనతా గుణయుతులయిన బాలురు కఠినమయిన సమస్యలను ఎదుర్కొని వాటిని అవగాహనతో అధిగమించి ఆ సమస్యలను పరిష్కరించుకొనుటకు నేర్చుకొనునటుల ప్రోత్సహించవలయును. ఆలోచనా పూర్వకముగా క్లిష్టమయిన సమస్యలను కల్పించి ఆ సమస్యలను ఎదుర్కొని పరిష్కరించ వలయునని ఈ సృజనత గల బాలురను నిర్బంధపరుచుట మాత్రము ఏమాత్రమును సముచితము గాజాలదు. ఈ బాలురు ఈ క్లిష్టమయిన ఆయాసకరమయిన సమస్యలు మిక్కిలి వ్యర్థమయినవిగను. తమ శక్తి పాటవములను వ్యర్థపరచునవిగను అనావశ్యకమయినవిగను భావించుదురు ఈ ప్రతిభావంతులగు ఈ బాలురు తమ భావములను పరిశోధించుటకును, ఆ భావములను ప్రయోగపరచుటకును ఆయా పథకములను ఉపక్రమించు విధముగా ప్రోత్సహించ బడవలయును. ఆ విధముగా ప్రోత్సహించ బడిన బాలురు ప్రచోదితులయిన వారగుచు ఆయా సంఘటన ఉత్పన్నమగు సహజమార్గముననే తగు విధమయిన క్లిష్టమయిన సమస్యలను ఆయాసములను గలిగించు సమస్యలను వివిధ వైఫల్యములను ఎదుర్కొనుచుందురు. బాలురు ఆ ఉన్నత ప్రమాణముల

కనురోధముగా తన భావనలను ప్రయోగ
పరచుట యందు గలిగిన తప్పిదములను గురించి
శిక్షింపబడుట కనుమతించబడుట అసము
చితము. తను పరిశోధనల యందు గలుగు
దోషములకు శిక్షింపబడవలయునని
సందేహము [illegible] లేకుండగ స్వేచ్ఛగా
ఆయా తన ప్రతిభా సంపన్నములయిన సమస్య
భావములను ప్రయోగపరచి అమలు పరచు
నపుడు రాగల ఆయాసములను, వైఫల్యములను
ఉత్సాహముతో ఎదుర్కొనుట కుత్సహించి
పరిశోధనలు జరుపుట కుద్యమించుట తథ్యము.

Frencher ఒక పరిశోధకుడు ఒక సన్నివేశ
మునందు బ్రతుకుతెరవుల మధ్య కష్టించి పని
చేయుచున్న బాలురను చూచుట తటస్థించెను.
ఆ బాలుర దీనస్థితిని పరిశీలించి ఎంతయు వగ
చినవాడయ్యెను. ఆ సన్నివేశము ఆదిమవా
సులు జీవితమును గురించి అవగాహనతో
సలుపు కృషికి సంబంధించిన విన్యాసము.
ఆదిమవాసుల నాయకులు ఆ పరిశోధకునకు
పనియందు నిపుణులయి కష్టించు ఆ బాలురు
తమ జాతికి భవిష్యన్నాయకులని వివరించి
చెప్పిరి. ఈ దినము నాయకులుగా వ్యవహ
రించుచున్న తమ నాయకులందరును ఒక తరుణ
మున అనాధలయిన బాలురనియును వివరించిరి.
తమ బాలురు నాయకుల సంతతి అగుటవలన
అన్ని వసతులు సంపన్నత గలిగియుందురు. ఈ
విధమయిన బాలురు సహితము అతిక్లిష్టమగు
సమస్యలను ఎదుర్కొని ఆయాసముతో కూడిన
పనులను చేయు విధముగా నిర్బంధపరచి అభ్య
సింప చేయుదమనియు చెప్పియుండిరి. సంప
న్నుల తనయులు సహితము ఈ విధముగా కఠిన
మయిన శిక్షణను పొంది విషయానుభూతి
[illegible] సత్ఫలితముల చవిచూచుదురు. తుదకు
వీరే రాగల కాలమునందు నాయకులగు
చుందురు. ఈ విధముగా సంపన్నులయిన అన్ని
వసతులు గల కుటుంబముల నుండి వచ్చుచున్న
బాలురు కొందరు ఈ క్లిష్టమయిన సమస్యలను
ఎదుర్కొనుట కశక్తులగుచుందురు. ఆ విధ
ముగా అశక్తులయిన బాలురు నిరాకరింపబడి
ఆ శిక్షణ వ్యాసంగముల నుండి వదలిపెట్టబడు
చుందురు. తుదకు అనాధలయిన బాలురు తమ
ప్రతిభా పాటవములను ప్రదర్శించి వివిధ క్లిష్ట
తరమయిన శారీరక మానసిక శిక్షణలను అనుభ
వించి అవగాహనతో పూర్తిచేసి సత్ఫలితముల
నందగలుగుచున్నారు. పర్యవసానము సుశిక్షి
తులయిన అనాధలయిన బాలురు భవిష్య
త్కాలమున నాయకులగుట సంభవించుచున్నది.
గృహవసతి గలిగి శ్రీమంతుల ఇంటి పుట్టిపెరిగిన
బాలురు ఈ బలప్రదర్శన రూపకమయిన శిక్షణ
వ్యాసంగములయందు విఫలులయిన వారగుచు
సమ వయస్కులగు నిశిత ప్రతిభా పాటవము
లను ప్రదర్శించిన అనాధ బాలురకు అభినంద
లను తెలుపుకొనుచు ఆ అనాధ బాలుర నాయ
కత్వమును గుర్తించు పరిస్థితులను చవిచూడ
వలసిన వారగుచుందురు.

ప్రపంచమునందున్న వివిధ సమాజములు,
తమ బాలురను పరిశీలించి సృజనతా గుణము
ప్రతిభా పాటవములు గలవారిని ఎన్నిక చేయ
వలయును. ఆ విధముగా ఎన్నిక చేయబడిన
ప్రతిభావంతులయిన బాలురను క్లిష్టమగు సమ
స్యలను ఎదుర్కొను విధమున శిక్షణ పొందు
విధముగా నిర్బంధ విద్యా విధానము అమలు
పరచవలయును: ఈ విధమయిన శిక్షణ నొందు
ఆ ప్రతిభావంతులయిన బాలురు తమ నిపుణత
చతురతను ప్రదర్శించుచుందురు. అవశ్యకత
అనునది అధిగమించవలసిన స్థితిని ఎదుర్కొన్న వ్యక్తి

హరించునటుల ఆ యా బాలురను ప్రచోదితముచేసి ప్రోత్సహించుచున్నవి కేవలము ఉపాయము వలన ఆయా కఠినమయిన పరిస్థితులను కల్పించుట వలన, వీరోచితమైన కృత్యములను ఆచరించుటయందు ప్రవేశపింప బడుచుందురని చెపుట అసమంజసము. అసంగతము. సృజనతా గుణసంకలితులయిన ఈ బాలురు ఎంత తీవ్రముగా ప్రచోదితులయినను ఆయా కృత్యములయందు న్యాయ యుతమయిన ఆవశ్యకమయిన అంశములు లేకున్నయెడల తమయందు నిగూహితమయిన సహజమయిన అమూల్యమగు ప్రతిభా పాటవములను ప్రయోజన రహితముగా ప్రయోగపరచుటకేమాత్రమును అంగీకరించరు.

పాఠశాల సృజనతగల బాలురు ఒనరులు:- విశ్వాసము: కార్యకలాపములయందు బాలురకు విశ్వాసమును నెలకొల్పుకొనుటకు ప్రోత్సహించు పరిస్థితులను ఉపాధ్యాయులు అన్వేషించి వ్యవస్థాపితము చేయవలయును. ఉపాధ్యాయులు తమ విద్యార్థులను తమకు నిర్దేశితమయిన కార్యకలాపములను చేయుట యందు విశ్వాసమును కలిగి యుండునటుల ప్రోత్సహించ వలయును. (ii) అభివ్యక్తత:- ఉపాధ్యాయులు సృజనతగల బాలురు తమయందు నిగూహితమయి యున్న ప్రతిభావంతమగు భావపరంపరలను బహిష్కృతము చేసి ప్రయోగపరచుటకు అవకాశములను కల్పించ వలయును. తరగతియందు విశిష్టమయిన వారిచర్యలను పెంపొందించుకొనుటకు అవకాశములను కల్పించ వలయును (3) మేధోవికాసము:- సృజనాగుణయుతులయిన బాలురయందు సహజమయిన ప్రతిభాప్రవృత్తులను బహిష్కృతము చేసి అభివ్యక్తమగు నటుల చేయుట కవసరమయిన సనోవైజ్ఞానికమయినభద్రత స్వేచ్ఛ మొదలయిన అంశములు అనివార్యముగా సమకూర్చబడవలయును. బాలురయందు నిర్దేశితమయిన అపేక్షితమైన ఈ మేధోవికాసము సముచిత క్రమమున పెంపొందుటకు అవకాశములను కల్పించవలయును. (4) స్వీయ ప్రమాణీకరణము:— ఉపాధ్యాయుడు సృజనతగల తన విద్యార్థులను తమంతటతాము స్వయము తమ కృషి ఫలితములను ప్రమాణీకరించుట కవసరమైన నేర్పును గలిగియుండు విధముగా తయారు చేయవలయును: (5) యధాతధము- ఉపాధ్యాయులు సమయందలి సృజనతి ప్రతిభా గుణములు తమంతటతాము యధాతధముగా అభివ్యంజిత మగుచు కార్యరూపము వహించుటకు అవసరమైన అవకాశములను సమకూర్చుకొను చతురతను కలిగియుండు విధముగా తమ బాలురకు నేర్పవలయును.

—o—

# ఎవరివో - నీవెవరివో

రాధిక___

ఎవరివో నీవెవరివో
నాలోని నీవెవరివో
చీకటి ఎడారిలో
గమ్యం మెరుగని
గమనంలో సౌదామినివై
తోచిన నా జీవన జ్యోతివో ॥ఎవరివో॥

నిలువు పేదల గుండెలో
కొండంత వెలుగు వై
కోటి కోర్కెల నింపావు మళ్ళీ
మరచిపోయిన వసంతం
మళ్ళీ వస్తుందని
శాంతి సందేశ మిచ్చిన దూతవో ॥ఎవ॥

కమ్మని తావిలా తలపుల్లో నీవై
ఆశల వూపిరు లూది
ఈ నిరాశలో ఆశవై వచ్చిన
ఎవరివో - నీ వెవరివో
నాలోని నీవెవరివో
బంధ మేదీ లేదు
మనలోన మనకు
కలిపింది అనుబంధ మేదో
మమతల రాగబంధం
తరతరాల బంధమై
అంత రంగాన నిలచిన ॥ఎవరివో......॥

కరుణ నీ రూపమై
జీవన సంధ్యా సమయాన
నిశిరాతిరి నీలా కాశంలో
చుక్కానివై ఎన్నెన్నో నావల
ఆవల జేర్చిన అజ్ఞాత నావికుడవో
॥ఎవరివో......॥

గ్రంథ సమీక్ష

# శ్రీ మద్రామాయణము బాల కాండము

## ఆంధ్ర తాత్పర్య సాహితము

"సమమధురోపనతార్థ వాక్యబద్ధం,
రఘువరచరితం, మునిప్రణీతం"

అయిన రామాయణం మళ్ళీ తెలుగు తాత్ప ర్యంతో ప్రకటింపబడుతున్నది. బాలకాండం అచ్చయి అమ్మకానికి వచ్చింది. దీనికి తెలుగు తాత్పర్య కర్త శ్రీమాన్ చలమచర్ల వేంకట శేషాచార్యులు ప్రచురణ: శ్రీజయలక్ష్మి పబ్లికేషన్స్, కేశవనగర్, శ్రీనగర్ కాలనీ, హైదరాబాదు-500 873.

రచించిన పురాణ కథలనే మళ్ళీ రచించు కోవడం అవసరమే అవుతున్నది. మాటవరసకు తరాలు మారిపోతుంటాయి. పాఠకుల అవ గాహన స్థాయి మారే తరాల వెంట, మారు తునే ఉంటుంది. భాష ఒకటే అయినా ఆయా తరాలలో అయా పాఠక వర్గాల అవగాహన భేదాలను బట్టి, ఆయా రచయితలు అనుసరిం చిన శైలిని బట్టీ అదీ మారుతూనే ఉంటుంది. ఇలాంటి అవసరాలే ఎదురై రచించిన గ్రంథా లనే మళ్ళీ రచించే రచయితలు బయలుదేరు తారు.

శ్రీశేషాచార్యుల తాత్పర్య రచనను బట్టి చూస్తే మూలంలోఉన్న వాక్యార్థాల వెంట తెలుగు వాక్యార్థాలు అమరించి చేసిన ప్రయ త్నం ఉత్తమమైంది. విశ్వసనీయమైన అను వాద పద్ధతికి శ్రీ ఆచార్యుల రచన చక్కని ఉదాహరణ. అనువాద రచనలో అందమయిన మెళకువలు వేరు, విశ్వసనీయమైన మెళకువలు వేరు. "Translation is like a lady : if it is beautiful it is not faithful and it is faithful it is not beautiful" అనే ఇంగ్లీషు చతురోక్తి అనువాదకులందరూ గుర్తుంచుకోదగింది. శ్రీ శేషాచార్యులు మూలార్థాలు తెలుగులోకి బాగా వడపోయా లనే పట్టుదలతో చేసిన ప్రయత్నమిది అరవసర్గ ప్రారంభంలో దశరథుని ప్రభుశక్తిని వర్ణిస్తూ మూలకర్త 'పౌరజానపదప్రియః' అన్నాడు. 'పట్టణవాసులకు, సకలదేశవాసులకునభిమతుడు' అని తాత్పర్యకర్తవాక్యం ఇలాంటి కొన్ని దొర్లుపాట్లు కనిపించినా అనువాదం అంతటా మూలవిధేయంగా నడిచింది.

అగస్త్యభ్రాత పేరు:-బాల కాండంలో నార దుడు వాల్మీకికి చెప్పిన సంక్షేప రామాయణం ఉందిగదా! అక్కడ గబగబా చెప్పుకపోవడమే నారదుని పద్ధతి:- అడవికి వెళ్ళిన రాముడు చాలా మందిఋషులనుదర్శించాడు, అగస్త్యుని, అగస్త్యునిభ్రాతను కూడా చూశాడు(అగస్త్యంచ అగస్త్యభ్రాతరం తథా) ఇలా చెప్పుకపోయిన నారదుని పద్ధతిలో ఈ అగస్త్యభ్రాత ఎవరో? అని తరతరాల పండితులూ, పాఠకులూ ఆమా టను అలాగే చదువుకొంటూ, వింటూ, నవ్వు కొంటూ గడిపారు. చివరకు 'అగస్త్య భ్రాత'

అంటే పేరూ వెంపూ లేనివాడు అనే సామెత భారతదేశంనిండా వాడుక కెక్కింది.—అగస్త్య భ్రాత సుదర్శనుడు అని ఈ తాత్పర్యకర్త చెప్పాడు. ఏదో ఆధారంనుంచి ఈ పేరును సేకరించి చూపిన తాత్పర్యకర్త ప్రయత్నం మెచ్చదగిందే. కాని ఆ ఆధారం ఏదో ఫుట్‌నోట్‌లో తెలిపితే బాగుండేది. ఇలాంటి విశేషాలతో కూడిన శేషాచార్యుల అనువాదం, ఇది అచ్చు కావడానికి ప్రోత్సహించిన ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, శ్రీ జి. పుల్లారెడ్డి వంటి వారి దాతృత్వం ప్రశంసనీయమైంది.

ఈ గ్రంథాదిలో "నచేత్ వాల్మీకి రభవిష్యత్" (వాల్మీకియే పుట్టియుండనిచో) అనే శీర్షికతో రచించిన నలభై శ్లోకాలు — శ్రీమాన్ ఎస్.టి. జి. వరదాచార్యులు రచించినవి — సాహిత్య విద్యార్థులనూ, రామాయణతత్వజిజ్ఞాసువులనూ నిత్యమూ ఆకర్షించేవి.

డా॥ ముకురాల రామారెడ్డి

---

# ఓ పాట పాడవే సిరివల్లికా

రచన: మస్రూణ, కర్నూలు

ఓ పాట పాడవే
సిరి మల్లికా
నా పాట పాడవే
ఓ రాధికా

గగనాన మేఘమై
నను పయనించనీ
నీ పయనాన
తోడుగ నను వుండనీ

మెఱుపులో రేఖగ
నను మెరవనీ
నీ సిగలోని
సిరిమల్లిగ నను విరియనీ

ఓ పాట పాడవే
ఓ మల్లికా
నా పాట పాడవే
నవమల్లికా

నీ కన్నుల్లో పాపనై
నను చూడనీ

నీ అధరాల మధువునై
నను నిండనీ

కరుణ నిండిన గుండెను
కరకుగా సేయకూ
కరిగి కరిగి రావె
ఓ మల్లికా

నా కలల రూపమై
రావె ఓ మల్లికా
అలక వలనే ఓ మల్లికా
చిలకలా పలకాలి నా మల్లికా

గల గలా నవ్వాలి ఓ మల్లికా
జల జలా పారాలి సెలయేరులా
ఓ పాట పాడవే
సిరిమల్లికా

నా గాథ పాడవే
నవ మల్లికా.

# నవభారతి

## సాహిత్య, సాంస్కృతిక మాసపత్రిక

నవంబరు, 1979

సంపాదకులు:
చదలవాడ పిచ్చయ్య

మూల్యం : రెండు రూపాయలు


నవభారతి కార్యాలయము
3-4-1008/1, బర్కత్‌పుర
హైదరాబాదు - 500 027

# విషయసూచిక



నవభారతి
సాహిత్య సాంస్కృతిక మాస పత్రిక

సంపుటి 8] హైదరాబాదు నవంబర్, 1979 [సంచిక 1

# ఇదే నేటి భారతీయ సామాజికుని కర్తవ్యము

భారత జాతీయ మార్గ దర్శకులుగా మహాత్మాగాంధి, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ గార్ల జన్మదినోత్సవములను దేశవ్యాప్తముగా ఏటేట జరుపుకొను చున్నాము. స్వతంత్రము సంపాదించు కొనిన అనంతరము ఈ జన్మదినోత్సవముల కార్యక్రమము నానాటికి క్షీణించి ఇది యొక ఆచారముగా పరిగణించ బడినదని యనిపించు చున్నది. నాయకుల మార్గదర్శక విధానములను గాని, వారు ఎప్పటి కప్పుడు అనుసరించిన జాతీయ విధానములను గాని నేడు మనసారా మననము చేయబడక యున్నవని గ్రహించుకొన వలసి యున్నది. ఇందుకు కారణము యనునది యున్నది. స్వతంత్రమునకు పూర్వము దేశభక్తి, జాతీయతాభావము ప్రధానముగా ఎంచబడినది. స్వతంత్రానంతరము పరిపాల నాధికారము, వ్యక్తి ప్రయోజనము, ప్రధానమై దేశభక్తి, జాతీయతాభిమానము కొరవడి మార్గదర్శకులైన నాయకుల జాతీయ భావములను నామ మాత్రముగా చేయబడు చున్న వని గ్రహించుకొనవలయును. నానాటికి అధికార వ్యామోహము ప్రబలి వ్యక్తి ప్రయో జనమే జాతీయ ప్రయోజనముగా యెంచబడుస్థితి ఏర్పడియున్నదని మన మవగాహనము చేసుకొన వలసి యున్నది.

జాతీయ, రాజకీయ పక్షము లన్నియు ఎక్కడి కక్కడ విభాగములై పోవు చున్నవి. ఇందుకు కారణము యనునది యున్నది. ప్రతివ్యక్తి తానొక రాజకీయ పక్ష మునకు నాయకుడై, తన నాయకత్వమున ప్రజాప్రతినిధులను ఎంపికచేసి, ఈ ఎంపిక చేసిన వారిని నెగ్గించుకొని, తనకుతాను పరిపాలనా బాధ్యతను స్వీకరింప వచ్చునని, తద్వారా తన స్వార్థమును తాను పూరించుకొన వచ్చునని ఎవరికి వారు ఈనాడు తమ తమ ఆరాటములను పెంపొందించుకొని వివేకరహితమైన వాగ్దానములను చేయుచున్నారని గ్రహించుకొన వలసి యున్నది. తామేర్పరచు కొనిన రాజకీయ పక్షములు, పరిపాలనా బాధ్యతలను స్వీకరించుకొనుటకు తగిన శక్తి యుక్తులను సంపాదించుకొన వచ్చునా? లేదా? యని తర్కించక తమకు తోచిన విధానమునననుసరించి ప్రణాళికలను రూపొం దించుకొని ఎవరికి వారే తమ తమ ప్రణాళికలద్వారా ప్రజాభ్యుదయమునకు దోహదము చేయ వచ్చుననుకొని, ఈ విధానము ననుసరించుచున్నారా యని యనిపించుచున్నది.

రాజకీయ పక్షము లన్నింటికి ఆశలు అధికమై చేయ తగినవి, చేయకూడనివి అను విచక్షణ లేని వాగ్దానములతో ఎన్నికల ప్రచారమును చేయుచున్నారని గ్రహించుకొన వలసి యున్నది.

ఇది దేశమని గాని, ఇందులో నివసించువారు మానవులని గాని, ఈ మానవులు మంచి చెడ్డలను తర్కించుకొని తమ తమ విచక్షణలను వినియోగించుకొని తిరిగి ప్రశ్నించ గల శక్తి కలవారు కాదను భావముతో ఎట్టి వాగ్దానములను మనము చేసినను ఏమియు పోవునది లేదని తెలిసియే, ఈ విధానము ననుసరించుచున్నారని యవగాహన చేసికొన వలసి యున్నది. జాతీయ మార్గ దర్శకులైన నాయకులు అనుసరించిన విధానము తిరస్కరించి సమిష్టి ప్రయోజనమును తిరస్కరించి వ్యక్తి ప్రయోజనమే ప్రధానమను కొనిన రీతిని ఎవరికి వారు వాగ్దానములు చేయును. ఒకరిని మరొకరు నిందించుకొనుచు, ఈనిందా విధానమే జాతీయ భావ సమైక్యతా విధానమని వివరించుటలో ఏమి ఔచిత్యమనునది యున్నదో ఈ పక్షములను ఏర్పరచుకొని, ఈ పక్షముల ద్వారా ప్రచారములు చేయు చున్న వారే స్పష్టము చేయవలసి యున్నదని ఎక్కడి కక్కడ ఎవరికి వారే స్వతంత్రించి ప్రతి యొక్క రాజకీయ పక్షములను ప్రశ్నించి సమాధానను చెప్పవలసి యున్నదని గ్రహించు రీతిని నేడు సమాజములోని ప్రతి ఒక్కరు బాధ్యత తీసుకొన వలసి యున్నదని గ్రహించుకొన వలయును.

ఇది మానవ సమాజమని, ఈ మానవ సమాజములోని వారికి మనస్సు, హృదయము వున్నదని, ఈ వున్న వారందరిని సమాధాన పర్చుకొన వలసిన బాధ్యత రాజకీయ పక్షముల నేర్పరచిన వారిపై యున్నదని గ్రహించుకొన వలసిన సమయ మాసన్నమైనదని తెలిసికొన వలయును.

ఏటేట అక్టోబరు, నవంబరు మాసము లనునవి వచ్చు చున్నవి. ఈ మాసము లలో జన్మించిన మహాత్మా గాంధి, జవహర్ లాల్ నెహ్రూల జన్మదినోత్సవములను జాతీయ మార్గదర్శక దినములుగా పరిగణించి జాతీయ పురోభివృద్ధికై వారే విధానముల ననుసరించి, ప్రజలను అనుసరింపజేసి ప్రజాభ్యుదయమునకు జాతీయతాభావమును వ్యాప్తి జేసిరో ఆ విధానమును భారతీయు లందరు అనుసరించి, ఆచరించునటుల సామాజికులను ప్రోత్సహించి మార్గ దర్శకులుగా మానవులందరు తమను తాము తీర్చి దిద్దుకొనునటుల చేయ వలసి యున్నదని గ్రహించుకొన వలసి యున్నది.

సమాజమనునది బహుళ సంఖ్యాకమైనదని గ్రహించుకొన వలయును. సమాజమును నడిపించు పరిపాలనా యంత్రాంగ మనునది తక్కువ సంఖ్య గలది మాత్రమేనని గ్రహించుకొన వలసి యున్నది. సమాజములోని వారుకాని, సమాజమును పరిపాలించు వారు కాని, సమాజములోని వారేనని గ్రహించ వలసి యున్నది. అందరూ సామాజికులే. సామాజికులలో కొందరు పరిపాలనా బాధ్యతను స్వీకరించినంత మాత్రమున సమాజము

లోని సామాజికుల కన్న మిన్న యనుకొనుట వివేక రహితమైన విధానమని గ్రహించుకొన వలసి యున్నది. మానవ సమాజములోని మానవులను తారతమ్యములతో విభజింపరాని ఈ విధానమునే ప్రజాస్వామ్య విధానముగా చిత్రించు విధానమేదై యున్నదో ఆ విధానము అవివేకవంతమైన విధానముగా భారతీయ సమాజములోని సామాజికు లందరు గ్రహించుకొన గలిగిన నేర్పరితనమును పెంపొందించుకొనుటకై మార్గ దర్శక నాయకుల జన్మదినములను ఆదర్శముగా జేసికొని ఆచరించుకొనుటకై సభలు జరుపుకొనుటకు బదులుగా నామ మాత్రమైన జన్మదినోత్సవములు జరుపుట యనునది జాతీయ ప్రయోజనా విధానములకు భంగము కల్పించు విధానముగా సామాజికు లందరు గుర్తుంచుకొన వలసి యున్నదని గ్రహించ వలయును.

జాతీయ స్వాతంత్రోద్యమమునకు మార్గ దర్శకులుగా భారతీయులచే గుర్తించ బడిన మహాత్మా గాంధి, జవహర్ లాల్ నెహ్రూ మొదలయిన నాయకులు ఎందరో జాతీయాభ్యుదయమునకై కృషి చేసి యున్నారని, ఆ కృషిని మనము కొనసాగించుకొన వలసి యున్నదని ఎప్పటికప్పుడు సామాజికులకు సవిమర్శ చేసి చెప్పి ప్రోత్సహించు మానవుడు మార్గ దర్శక సామాజికము అనుసరించుటకుగాను జన్మదినోత్సవములు జరుపుకొనుటలో ఔచిత్యమున్నదని గ్రహించుకొన వలయును.

ఏది సామాజికులకు ఆదర్శప్రాయమైనదో దానిని ఎరుక పరచక జన్మదినోత్సవముల పేరుతో అధికార వ్యామోహితులయిన రాజకీయ పక్షములవారు ప్రజాభిమానము చూరగొని కీర్తిశేషులయిన మహాత్మా గాంధిని, పండిట్ నెహ్రూను తమ తమ ప్రయోజనాలకై వుపయోగించు విధానము ననుసరించుటలోని అవివేకమును ఈనాడు గుర్తించవలసిన సమయ మాసన్నమైనదని గ్రహించుకొన వలయును.

ఈనాడు అనుసరించబడుచున్న రాజకీయ విధానములు లోపభూయిష్టములై మానవుని అవివేకమును కోల్పోవునటుల చేయుచున్నదని యవగాహన చేసికొన వలయును. ఈనాటి సామాజికుడు తమ కర్తవ్యమును తాను గుర్తించి సమాజములో మెలగ వలసిన నేర్పును సంపాదించుకొని భావిభారత భాగ్యోదయమునకు కృషి చేయవలసి యున్నదని గ్రహించుకొన వలయును. ఇదే నేటి భారతీయ సామాజికుని కర్తవ్యమై యున్నదని తెలిసికొన వలయును.

# జనారణ్యం

—శ్రీ మధుర్‌జీ

స్వార్థం మర్రి ఊడలలా విస్తరించి
వంచన అల్లిబిల్లి తీగల్లా అల్లుకొని
కపటం కాల సర్పాల్లా రహస్యంగా దాక్కొని
క్రౌర్యం క్రూరమృగాలుగా విహరిస్తున్న
ఇది కాదు కాదు మానవ సమాజం
నిజం నిజం ఇది మహాజనారణ్యం॥

పెద్ద జంతువులు క్షుద్ర జంతువుల్ని పట్టి
కరకరా నమిలి మింగటం అక్కడి నీతి
బలవంతులు బలహీనుల్ని బడుగుల్ని పట్టి
వారి రక్తమాంసాలు పీల్చటం ఇక్కడి రీతి
ఆకలి తప్ప ఆలోచన లేదక్కడ
దురాలోచన తప్ప యోచన లేదిక్కడ
అందుకే మళ్లీ మళ్లీ అంటున్నాను
ఇదికాదు కాదు మానవ సమాజం
నిజం నిజం ఇది మహాజనారణ్యం॥

ఒక్క కడుపుకోసం వందల ప్రాణులు బలి
తనొక్కడి బాగుకోసం వేల బ్రతుకులు ఆహుతి
అమానుషత్వం తప్ప అక్కడ మరేదీ మనదు
నినాదాల్లో తప్ప యిక్కడ మానవత్వం
దొరకదు.
నీతిన్యాయలకు అణుమాత్రం స్థానం లేదక్కడ
పుస్తకాల్లో తప్ప మస్తకాల్లో దాని వునికే
లేదిక్కడ
అందుకే మళ్లీ మళ్లీ వక్కాణిస్తున్నాను
ఇదికాదు కాదు మానవ సమాజం
నిజం నిజం ఇది మహాజనారణ్యం."

స్వార్థానికి చలవ పందిళ్ళు వేసి
వంచనకే పట్టాభిషేకాలు చేస్తున్నారు.
దౌర్జన్యానికి దొరగారిలా వేషం వేసి
వాగ్దానాల పల్లకీలో ఊరేగింపులు చేస్తున్నారు
రక్తాన్ని త్రాగి కారాకిళ్ళీలు నములుతూ
అహింసపై ఉపన్యాసాలు చేస్తున్నారు
అందుకే మళ్ళీ మళ్ళీ ప్రవచిస్తున్నాను
ఇదికాదు కాదు మానవ సమాజం
నిజం నిజం ఇది మహా జనారణ్యం॥

ప్రక్కవాడు పస్తులతో అలమటిస్తున్నా
పట్టించుకోని 'విశిష్టవ్యక్తిత్వాల' పెద్దలు.
అధికార సౌధాల్ని అందుకోవటానికి
మానాభిమానాలను తాకట్టు పెట్టి
అడ్డమైన గడ్డికరిచే ప్రముఖులు.
ప్రజా సేవయని అభ్యుదయ నినాదాలు
వల్లిస్తూ
ప్రజల రక్తమాంసాల్ని ఫలహారంగా
సేవిస్తూ
ఊసరవెల్లులలా రంగులు మార్చే రాజకీయ
రాబందులు.
అందుకే మళ్లీమళ్లీ అంటున్నాను
ఇదికాదు కాదు మానవ సమాజం
నిజం నిజం ఇది మహా జనారణ్యం॥

# మేఘమాలిక

శ్రీమతి జి. కమలారాఘవన్

ఉ॥ సంతస మారఁగా గగనసౌధము లెన్నియొ సృష్టిజేసి మా
కంటలో మాయమౌదు కనుకట్టుగ గారడివాని బోలియున్
వింతగ ధాత సృష్టిని వేడుకమై ప్రతిసృష్టి జేయుచున్
రంతులదేలి దంపతులు రాగిల తొల్కరి మేఘమాలికా!

ఉ॥ తొల్లి నిదాఘకార్శ్యమున దుఃఖిత యోషధీబీటు వార నీ
చల్లని తోయహస్తముల సాదర మొప్పఁగ నూరడింపగా
పెల్లున మొల్క పూరియును ప్రీతినిమై పులకాంకురంబులై
మల్లడి గొల్పెధాత్రికిని మాయురె తొల్కరి మేఘమాలికా!

ఉ॥ దూరము నుండు దంపతుల దూతవునై పరతెంచియ
వ్వారల హృద్గతుల్ కలితవారగ జేసిన యల్లె జేసి వే
కూరిమి గూర్చుచుండు విలకోమల భావము మీరు నిన్నహో
దూగుదురేల యజ్ఞతను దొత్తలను తొల్కరి మేఘమాలికా!

ఉ॥ మద్దెల మ్రోతలై బొదల మందముగా నుదుమంగ గాంచినిన్
పద్దగు నీదునీడలను భావమెలర్పగ నిల్చి ప్రీతిమై
ముద్దుగ నీల కంఠములు మోహ వశమ్మున జేయునర్తనల్
పెద్దగు కాన్కలై ప్రబలె వేడుక తొల్కరి మేఘమాలికా!

ఉ॥ కన్నుల నీరు వెట్టి కడకంటన నింగిని పారజూచుచున్
నిన్నను జూచు భాగ్యమును నెన్నుచు నుండియు నీదు రాకకున్
మిన్నను ముట్టు సంతసము మేకొన కర్షక చాతకాళియున్
కన్నమనోరథంబునకు గ్రాలిది తొల్కరి మేఘమాలికా!

ఉ॥ మెల్లన రత్నసానువుల మేయుచు నీవు పరిభ్రమించు చో
నల్లని గంధ సింధురపు సవ్యవిలాసముబోలి వేడ్క మా
కళ్ళకు చోద్యమౌగతిని కానగవత్తువు ఎన్నియే నియో
వెల్లగు చిద్విలాసముల బేర్తువు తొల్కరి మేఘమాలికా!

చ॥ గగనమునందు నిన్నుగని కామిత మొప్పధరిత్రి కాంతయున్
అగణిత వైభవంబు దనరారగ కెంపుల హారతుల్ తమిన్
సుగుణత బట్టెనా నెగడి చోద్యముగా భువిమీద నంతటన్
పగడపు దీవలున్ మొలిచె భద్రత తొల్కరి మేఘమాలికా!

ఉ॥ అంబుధిలోని క్షారజల మల్లన గ్రోలియు సత్కృపామతిన్
సంబరమార మాకిలను చక్కెర మాధురులూరు నీరమున్
అంబర వీథి నుండి ప్రియమార నొసంగుదు వేమిచెప్ప శ్రీ
దంబుగ నీవె దాతవన ధారుణి శ్రావణ మేఘమాలికా!

ఉ॥ అల్లన నీవు సాగు తరియంబర వీథిని నీదు మాటునన్
అల్లరి చందమామ ముదమారగ దాగుడుమూత లాడగా
ఉల్లములుల్ల సిల్లమరి యూహల మోహము రేపిచెల్లరే
చల్లెదు నీటి పూవులను చక్కని జల్తరు మేఘమాలికా!

ఉ॥ కర్షక పాళికిన్ గలుగు కష్టములెల్లను దీరి పోవగా
వర్షము నింపి వాంఛితము వారక నీయుము నిస్తులంబుగా
హర్ష మనస్కులై హాలము లందియు వేతురు పైరు పచ్చలన్
వర్షము వర్ష మిట్లు నిలువారక శ్రావణ మేఘమాలికా!

ఉ॥ పింజలు పింజలై యెగసి పిమ్మట యూహల బోల్చు వస్తువుల్
రంజకమౌచు కానబడ రాణ చరింతువు భవ్యరీతులన్
మంజుల సాలభంజికల మాడ్కిని మారుచు కన్ను దోయికిన్
అంజన వేసినట్లె గనవయ్యెదు జల్తరు మేఘమాలికా!

ఉ॥ కంధిని మీరునట్టి ఘనకారుణి కోత్తమనీ బలిష్ఠమౌ
స్కంధము లందునన్ దివినిగాం చెడి పోలిక నొప్పుచుందువా
భూధర తుల్యమై లలినభోంతర సీమల నావరించుచో
పాంథుల సేద దీర్చెదవు భద్రత జల్తరు మేఘమాలికా!

ఉ॥ నీవును కోపగించినను నింగియు నేలయు నేకమై మహా
దీవులు సైతమున్ పొరలి దీప్తిని పొంగుచు ముంచు లోకమున్
నీవును సత్కృపన్ గనగ నిస్తుల సస్య సమృద్ధి గాంచుచున్
భావుకమై చరించు ధరవారక జల్తరు మేఘమాలికా!

ఉ॥ సృష్టికి మూలకారణులు చోద్యముగా గను మూడు మూర్తులున్
ఇష్టత మంత్ర దండవతు నెంచియు నిన్నును చేతబట్టిరో
సృష్టిలయంబులన్ సలుపు శక్తిని గగ్గెడి వారలై రిగా
స్రష్టవు నీవె మాకిల నిజంబుగ శ్రావణ మేఘమాలికా!

# మే ఘ మా లి క

ఉ॥ మెత్తని పొత్తులై బొదలి మేలగు మందిర కుడ్యజాలమై
దెత్తువు చూడ్కికిన్ మెరుపు దివ్వెల హారతు లెత్తుచున్
ముత్తెపు ఛత్రమై మొగిలు మొత్తముతో గగనేందిరా సతీ
చిత్తము బొంగ కాన్కలను జేతువు జల్తరు మేఘమాలికా !

ఉ॥ జాలరు లుల్లసిల్లుచును జాలెల బట్టిరి చేప పిల్లలన్
పాలెము లెల్లెడన్ కనగ భద్రతభాసిలె పాడిపంటలన్
తేలిరి తెప్పలాటలను తేజము మీరగ బాల సంఘముల్
శాలిమి నీడురాక శుభదావహ మయ్యెను మేఘమాలికా !

ఉ॥ ఇక్షు శరాసనుండు శశియావు ప్రభంజను లేకమైనచో
ఈక్షితి నా కులత్వమున యేర్పరె యెంతటి మానులైన మీ
రూశణ కామ తంత్రముల లోలత జిక్కక పోవజాలరే
రశుకులైవ యాప జనరాదట శ్రావణ మేఘమాలికా :

ఉ॥ కానగ మేఘ దూతమను కావ్య రసంబున కాళిదాసు ని
న్నానతి సేసె రామగిరియందు వియోగత మీర కాంతకై
దీనత యక్షు డొక్కరుడు ధీరత దప్పగ నీయు దాత్తమున్
తానెరిగుంట గాదె నిను తార్చెను దూతగ మేఘమాలికా !

ఉ॥ వేడుక యొక నంగధర వేసట బెట్టుదు రాళ్ళమొత్తి నీ
దాడికి నిల్తుమే మహిత దర్పము వీడియు సౌమ్య వృత్తిమ
ల్లాడుము మా మనంబులను రాగముతో నెల మూడు వానలన్
పోడిమిగుర్యు మోయుదక భూషణ శ్రావణ మేఘమాలికా !

ఉ॥ కాలువ లెల్లెడన్ నదుల గర్భము జొచ్చెను మున్గె నేలయున్
జాలికలుండ పోతలను సస్యము లెల్లను పాడుచేయగా
గ్రాలు ననుగ్రహాగ్రహము ఖండిత వృత్తిని బూనకుండ మ
మ్మేలు మితంబుగా గురిసి యీప్సిత మొప్పగ మేఘమాలికా !

ఉ॥ పూచెను సన్న జాజులును పొల్పెసలారు గులాబి పూవులున్
పూచెను పారిజాతములు భూరిగ గేదగి చంపకంబులున్
పూచెను మెట్టుదామరలు పుల్ల సరోజములు త్పలంబులున్
పూచెను నీడురాశకును పూవుల దోటల మేఘమాలికా !

ఉ॥ కాచెను అల్లనేరెడులు కామిత మొప్పగనిమ్మ వెల్గలన్
కాచెను జామలున్ బలుసుగంపలకెద్ది పునాస మామిడుల్
కాచెను వాకరాచుసిరి కంటికి నింపగు గంగరేగులున్
కాచెను కొండలందు తమికానుక నీకిడ మేఘమాలికా !

ఉ॥ ఉన్నత శైల పంక్తులను ఓషధు లెల్లను మేయుచున్ దివిన్
తిన్నగ జారి సింధుజల తిక్తము గ్రోలియు మత్తుమత్తుగా
సన్నగ తేలిసాగునెడ చక్రిని నినును నీల దేహమున్
వెన్నుని బోల మామదికి వేడుక గూర్తువు మేఘమాలికా !

ఉ॥ జీవకణంబు లెల్ల నినుజేరియు తొల్లిని వర్షధారలన్
భావ మనోహరంబగుచు భాసిలి సస్యములందు ప్రాప్తమై
చేవగు నన్న రూపమున స్త్రీ పురుషాంతర మగ్నమౌ చొగిన్
అవల దేహధారణము నందవె నీ కృప మేఘమాలికా !

ఉ॥ శ్రీలగు నింద్ర చాపమది శీర్షమునందు మయూర పింఛమై
లీల యురంబునన్ మెరుపు శ్రీయునునై లలి నొప్పుచుండగా
మేలగు భాను దీప్తి మెయి మేలములాడ సువర్ణ చేలమై
గ్రాలెదు కారు నీల రుచి కృష్ణుడ వేచును మేఘమాలికా !

ఉ॥ చుక్కల దారిలో సురిసి చూడ్కుల కెంతయు వింత గొల్పుచున్
దిక్కుల పిక్కటిల్లుచును దీవుల నల్లన నావరించుచున్
మక్కువ నీటి భారమున మందగతిన్ జనగాడ్పు త్రోయనిన్
గ్రక్కున కుంభవృష్టి దనరారగ దన్పెదు మేఘమాలికా !

ఉ॥ వాయు జలాగ్ని ధూమముల వర్తిలు నీదగు రూపమెన్నగా
ధీయుతమోహనాంజనము దీప్తము నౌనును మేని తేజమున్
మాయురె అవియంత్రముగ మారిదివంబున సంచలించునీ
మాయని ప్రజ్ఞకున్ నతులు మానక సల్పెద మేఘమాలికా !

ఉ॥ జీవనమిచ్చి నిల్పెదవు జీవము లన్నిటి దివ్యశక్తిచే
ఆవిధికర్త కర్మక్రియ లందున కారణ భూతమైసదా
భావిత భావనాకలిత భవ్య మనోజ్ఞ సుభావ మొప్పగా
ఈ వుచరించెదుప్పరిగ ఈప్సిత మొప్పగ మేఘమాలికా !

# గీతాంజలి — రవీంద్రనాథ ఠాకూర్

## అనువాదం : శ్రీ లక్ష్మి

(51)

నా హృదయాంతరాలలో నెలకొని వున్న ఆ మూర్తిని, ఎండ కన్నెరుగని ఆదేవిని, నాచరమ గీతంలో అందంగా మలచి, కడసారి కానుకగా నీకు అర్పించుకుంటాను, నా ప్రభూ. ఆమె పలుకులకు అందనితల్లి. ఆమెను నా హృదయంలో పొందు పరచుకుని, భూ ప్రదక్షణం చేసి వచ్చాను. నా కర్మ లలో, భావాలలో, నిద్రలో, మెలకువలో, ఆమె సదా నన్ను కనిపెట్టుకుని వున్నది.

ఎంతోమంది ఆమెకోసం వచ్చారు. కాని ఆమె నన్ను వదలి వెళ్ళలేదు.

ఆమెను ప్రత్యక్షంగా చూచిన వారు ఎవరూలేరు. నీ పిలుపుకోసం ఆమె వేచివున్నది. స్వామీ.

(52)

నీవు మహాకాశం. గూడుకూడ నీవే.

సుందరమూర్తీ, ఈ గూటిలో నీ ప్రేమయే, ఆత్మను, రంగు రుచి వాసనలతో బంధిస్తుంది.

ఉదయసంధ్య. అందమయిన పూలమాలతో. భూదేవిని అలంకరించ వస్తుంది.

సాయం సంధ్య, అలమందలు వదలిపోయిన మైదానములకు చల్లని దక్షిణానిలుని తెస్తుంది. కాని ఆచోట, ఆత్మ విహరించే మహాకాశంలో, అమలిన కాంతి పుంజము నిండివున్నది. ఆచోట, పగలు, రాత్రి, నామము, రూపమూ ఏమియూలేవు.

(53)

సూర్య కిరణములు, దినమంతా, నా యింటి ముగింట్లో వేచి వుంటాయి. నా కన్నీళ్ళను, పాటలను. నీలిమేఘాలుగా, నీ పాదాలచెంతకు కొని వచ్చుటకు నీవు మురిపెంగా, ఈ మబ్బుతెరలకు రంగులు అద్ది, నీ సుందర హృదయాన్ని కప్పుకుంటావు.

తేలిపోయే మబ్బుతునకలను, ఓ పావనమూర్తీ, నీవు ఇంతగా ప్రేమిస్తావు. అవి నీ అద్భుతమైన కాంతిని వాటి నీలి నీడలలో కప్పివేస్తాయి.

(54)

నిరంతరంగా నాలో ప్రవహిస్తున్న ప్రాణశక్తి విశ్వంలో కూడ ప్రవహిస్తున్నది, లయ బద్ధంగా నటనమాడుతున్నది.

భూమాత ముదముమీర ప్రసవించే ఆకులలో, అలములలో, ఇదే ప్రాణశక్తి.

నాలోని ప్రతి అణువు నీ ప్రాణశక్తి స్పర్శతో పులకించి పోతుంది. అనాదిగా వున్నది దివ్యప్రాణ శక్తి, నాలో నినదిస్తున్నది స్వామీ.

(55)

సచ్చితానంద హేలలో హాయిగా వుండడం నీకు చేతకాదా? నటరాజు దివ్యానంద తాండవంలో విలీనం కావడం. సృష్టిలో అన్నీ ముందుకు సాగి పోతున్నాయి. ఆగకుండా, వెనుదిరిగి చూడకుండా

వీళ్ళ క్తి వాటిని ఆపలేదు. అన్నీ ముందుకు సాగి పోతాయి.

అవిరళ, అఖండగాన మాధురిలో లాస్యం చేస్తూ ఋతువులు కదలిపోతాయి. రంగులు, రాగాలు, రూపాలు, వెల్లువలై ఆనందంలో జాలువారుతాయి, లయించి పోతాయి.

(56)

నేను విశ్వరూపం దాల్చి, రంగురంగుల నీడలు నీ దివ్య తేజస్సుపై ప్రసరింప చేయాలని నీ లీలా వినోదం నీకు నీవే వియోగం కల్పించుకుని, నీ సహ చరిని మురిపెంగా చేరరమ్మంటావు, నీ అర్ధ నారీశ్వర త త్త్వం నాలో రూపు దిద్దుకున్నది.

ఓంకార నాదం ఆకాశమంతటా ప్రతిధ్వనిస్తుంది. సుఖదుఃఖాలలో, ఆశా నిరాశలలో; అలలు లేస్తాయి. లయం పొందుతాయి, కలలు అల్లుకుంటాయి, కరగి పోతాయి. నాలో, నీ ఆత్మ అపజయం పొందుతుంది. ప్రభూ.

ఈ విశ్వమనే తెరపైన నీవు ఎన్నో చిత్రించావు. దాని వెనుక నీ సింహాసనం అద్భుతంగా అమరి వున్నది.

మన ఇరువురి నటనము గగనవీధిని అలము కున్నది. మన యుగళ గానం గాలిలో స్పందిస్తుంది. మన దాగుడు మూతలలో యుగాలు గతించి పోతాయి.

(57)

నా లోని నా స్వామి. తెలియరాని మృదు స్పర్శతో నన్ను మేలుకొలుపుతాడు,

ఈ కనులను తన మాయలో కప్పి, నా హృదయ తంతులను లీలగా మీటుతాడు. సుఖదుఃఖాల రాగ మాలికలో రంగు రంగుల మాయాజాలం ముసుగులో నుంచి అతని పాదాలు తొంగిచూస్తాయి. ఆ సుందర పాద పద్మాల స్పర్శలో మైమరచి పోతాను.

యుగాలు గడచిపోతాయి. నా ఎదను అతను కదిలిస్తాడు, ఎన్నో నామరూపాలలో, సుఖదుఃఖాల మేలు కలయికలో.

(58)

నాకు సన్యాసంలో ముక్తి లేదు. వేయి మమతా బంధాలలో నాకు స్వేచ్ఛదొరుకుతుంది. రంగు రంగుల మధువుతో నువ్వు ఎల్లప్పుడు ఈ మట్టి పాత్రను నింపుతూంటావు,

నీ దివ్య దీపశిఖతో నూరు దీపాలను వెలిగించి నీ గర్భ గుడిలో అలంకరించుతాను.

నా జ్ఞానేంద్రియ కవాటాలను నేను ఎన్నడూ మూసి వుంచను. నా దృష్టి, శ్రవణం, స్పర్శ, అన్నీ నీ కైంకర్యానికే.

నా భ్రమలన్నీ ఆనంద జ్యోతులుగా వెలుగొందు తాయి. నా కోరికలు నీ ప్రేమలో ఫలిస్తాయి. ప్రభూ.

(59)

పగలు గతించి పోయింది. భూమిమీద చీకట్లు అలముకుంటున్నాయి. నా కడవ నింపుకోవడానికి ఏటికిపోయే వేళ అయింది.

నీటిమీది గాలులు చల్లగా వీస్తున్నాయి. వీధిలో జన సంచారంలేదు. ఏటిలో అలల హోరు వినిపి స్తున్నది. ఇంటికి తిరిగి వెళ్ళాలనిపించడంలేదు. ఎవరిని కలుసు కుంటానో ఎరుగను. ఏటి మలుపులో నావలో, నిత్య నూతనుడు మురళి వాయిస్తున్నాడు.

(60)

మాకు నువ్వు ప్రసాదించిన కానుకలు మా అవస రాలను తీర్చి, చెక్కు చెదరకుండా మళ్లీ నిన్నే చేరుకుంటాయి.

నదీమ తల్లి తన దైనందిన కార్యక్రమం కొనసాగిస్తుంది. పొలాలలో. జనపదాలలో పారుతూ. కాని ఆమె నిరంతర ప్రవాహం నీ చరణాలను అభిషేకించడానికే ఉవ్విళ్ళూరుతుంది.

పూల బాల సువాసనలు విరియ బూస్తుంది. అయినా నీ కైంకర్యమే ఆమె పరమావధి.

నీ ఆరాధనతో విశ్వం ఎన్నటికీ కొల్లబోదు, ప్రభూ. కవి పదాలను తమ చిత్తం ప్రకారం అర్థం చేసుకుంటారు జనులు. అయితే యథార్థంగా ఆతత్త్వాలు నిన్నే సూచిస్తాయి.

(61)

ప్రతిరోజూ నీ సన్నిధిలో నేను నిలిచి వుంటాను. భక్తితో చేతులు జోడించి, భువనేశ్వరా, నీ ఎదుట నిలిచి వుంటాను

నీ మహాకాశం నీడలో మౌనంగా, ఏకాంతంగా, ఆర్ద్ర హృదయంతో నీ ఎదుట నిలిచియున్నాను, స్వామీ. ఈ నీ కల్లోలిత భువనంలో, జనసమూహంలో, నీ ఎదుట నిలిచి యున్నాను.

ఇచట ఈ లోకంలో నాపని పూర్తి అయాక, దేవదేవా, మౌనంగా, ఏకాంతంగా, నీ సన్నిధిలో నిలిచి వుంటాను.

(62)

నిన్ను నా ప్రభువుగా భావించి దూరంగా నిలిచి పోతాను. నా ఆత్మీయుడవని తలంచి దగ్గరగా రాలేను. నా తండ్రిగా భావించి పాదాభివందనం చేస్తాను. స్నేహితునిగా నీ చేయి పట్టలేను.

నువ్వు ఆత్మీయంగా నన్ను చేరవచ్చినప్పుడు, నా సన్నిహితునిగా నిన్ను దరియలేను.

. నా ప్రియ బాంధవుడివి నీవు. నా సర్వస్వం నీకు సమర్పించుకున్నాను.

సుఖములో, దుఃఖములలో నిన్నే శరణు పొందుతాను. సంసార సాగరంలో మునిగిపోకుండా. నన్ను నీకు సమర్పించుకున్నాను, శ్యామా,

(63)

సృష్ట్యాదిలో తారలు తొలివెలుగు కురిసినప్పుడు, దేవతలు నింగిలో సమావేశమై గానం చేశారు. ఆహా, పరిపూర్ణ సృష్టివై చిత్ర్యం. అఖండ ఆనంద నిలయం!

ఆకస్మికంగా ఒకరు కేకపెట్టుదురు- 'దీపావళిలో ఎక్కడో కాంతి ఏర్పడినట్లున్నది. తార ఒకటి రాలి పోయినట్లున్నది.

వారి బంగరు వీణియ తీగె తెగిపోయింది. గానం ఆగిపోయింది. వారు ఆలజడి చెందారు. 'అవును. రాలిపోయిన ఆతారామతల్లి నింగికి ఎనలేని శోభ' అనివాపోయారు.

ఆనాటినుంచీ, ఆ నక్షత్ర బాల అన్వేషణం సాగుతూనే వున్నది. ఆమెలోనే లోకం ఆనందాన్ని కోల్పోయిందని వాపోతూనే వున్నారు.

నిశ్శబ్ద నిశీధిలో మాత్రం తారకలు దమలో తాము నవ్వుకుంటాయి. 'ఈ అన్వేషణ నిరర్థకం. అఖండమైన పరిపూర్ణత అంతటా వ్యాపించివున్నది.

(64)

ఈ జన్మలో నిన్ను కలుసుకునే అదృష్టం నాకు లేక పోతే, నిన్ను చూడలేక పోయాననే ఆవేదన నాకు నిరంతరం మిగలనీ- ఒక్కక్షణంకూడ మరచి పోకుండా, ఈ తీయనిబాధ, నాకలలో మెలకువలో, అనుభవించనీ.

నిత్య కర్మలలో, భోగభాగ్యలలో, నేను ఏమీ పొందలేక పోయాననే నాకు మిగలనీ- ఒక్క క్షణం కూడ మరచి పోకుండా ఈ బాధ, నా కలలో, మెలకువలో, అనుభవించనీ.

అలసిపోయి, బాట పక్కన, విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు, గమ్యస్థానం సుదూరంగా వున్నదని తెలుసుకోనీ- ఒక్క-క్షణంకూడా మరిచిపోకుండా, ఈ బాధ, నా కలలో, మెలకువలో, అనుభవించనీ.

నా ప్రాంగణం అలంకరింపబడి, మంగళ వాద్యాలు మ్రోగుతున్నప్పుడు, నిన్ను నేను నా యింటికి ఆహ్వానించలేదని తెలుసుకోనీ- ఒక్క-క్షణం కూడా మరచిపోకుండా. ఈ బాధ నా కలలో, మెలకువలో. అనుభవించనీ,

(65)

నేను ఒక మబ్బుతునకవోలె గగనంలో నిష్ప్రయోజనంగా సంచరిస్తున్నాను, తేజోమూర్తీ. నీ పావన స్పర్శనన్ను ఇంకా కరుణించలేదు, నీ వెలుగులో ఐక్యం చేసుకోలేదు. నీ వియోగంలో రోజులు లెక్కించుతూ వున్నాను. ఇది నీ లీల అయితే, ఈ నా శూన్యాన్ని, రంగులతో దిద్ది, అద్భుతంగా, గాలిలో ఎగరవేయి, స్వామీ.

మళ్లీ నీ చిత్తం వచ్చినప్పుడు, ఈ ఆట కట్టేసి, నన్ను చీకట్లలో కలిపివేయి. లేకపోతే, ఉదయ సంధ్యారాగంలో చల్లని చిరునవ్వుగా వికసింప జేయుము, ప్రభూ.

(66)

పని లేనప్పుడు ఎన్నోమార్లు, వృధాగా గతించిపోయిన కాలం గురించి విచారించాను. కాని ఆ సమయం ఎన్నడూ వ్యర్థం కాలేదు, ప్రభూ. నా జీవితంలోని ప్రతిక్షణం స్వయంగా నీ చేతులలోకి తీసుకున్నావు.

ఎల్ల భూతములలో మాటుగా వుండి, బీజములను మొలకలుగాను, మొగ్గలను పూవులుగాను, పూవులను పండ్లగాను రూపొందిస్తున్నావు,

నేను అలసిపోయి, బద్ధకంగా నిద్రపోతూ, పనులన్నీ స్తంభించిపోయినవను కున్నాను. ఉదయం మేలుకుని చూచే లోపల, నా తోట రంగు రంగుల పూవులతో ముచ్చటగానిండి వున్నదిదేవా.

(67)

నీ కాలం అనంతం, ప్రభూ. నీ కాలగతిని ఎరిగిన వారు ఎవ్వరూ లేరు.

దివానక్తాలు, యుగాలు, ఉద్భవిస్తాయి, లయించిపోతాయి, పూలకి మల్లే. ఎలావేచి వుండాలో నీకు తెలుసును.

ఒక చిన్న పూబాల పరిపూర్ణత్వంలో యుగాలు గడచిపోతాయి.

మా కాలపరిమితి అతిస్వల్పం. అందుకని మేము త్వరపడతాము.

నా సమయమంతా ఇతరుల కొలువులోనే గతించిపోయింది. నీ పూజాపీఠం నివేదనలేకుండా అలానే వుండిపోయింది.

పగలు గతించి పోయింది. నీ గుడితలుపులు మూసి వేస్తారని హడావుడిగా వచ్చాను. అయినా ఇంకా ఎంతో సమయం వున్నది. శ్యామా.

(68)

అంబా, నా కన్నీళ్లతో ముత్యాలసరాలు గుచ్చి, నీ మెడలలో అలంకరిస్తాను.

నక్షత్ర బాలలు, మణిమంజీరాలతో నీ పాదాలను అలంకరించారు. నా హారం నీ హృదయంలో చోటు చేసుకున్నది.

భోగభాగ్యాలు నువ్వు ప్రసాదిస్తావు. నీ చిత్త ప్రకారం. ఈ నా దుఃఖము నాది. దీనిని నా కానుకగా నీకు సమర్పించినప్పుడు నీ కృపా కటాక్షముతో నన్ను సంభావిస్తావు తల్లీ, అలరిస్తావు.

(69)

విరహబాధ విశ్వమంతటా వ్యాపించి వున్నది. మహాకాశంలో ఎన్నోన్నిరూపాలకు జన్మను యిస్తుంది.

ఈ వియోగ దుఃఖం రాత్రంతా మౌనంగా తపించి, ప్రభాతంలో ఆకుల గలగలలలో భావ గీతాలు ఆలపిస్తుంది.

ఈ తీయని బాధ ఆశలుగాను, మమతలుగాను, సుఖదుఃఖాలుగాను, మనలో రూపు దిద్దుకుంటుంది. నా కవితా హృదయంలో గీతాలుగా జాలు వారు తుంది.

(70)

ప్రభువు మందిరం వదలి, జీవనరంగలోనికి అడుగుపెట్టిన వీరులు, వారి ప్రతాపం ఎక్కడ దాచారు? వారి ధనుర్బాణాలు ఏవి?

వారు ఏమీ లేనివారుగాను, నిస్సహాయంగాను కనుపట్టారు. ప్రభువు మందిరం వదలి వచ్చిన రోజున వారికి ధనుర్బాణాలు ఇవ్వబడ్డాయి.

వారు ప్రభువు మందిరానికి తిరిగి వెళ్ళిపోయి నప్పుడు వారి ప్రతాపం ఎక్కడ దాచారు?

వారు అస్త్రసన్యాసం చేశారు; వారి ముఖాలు ప్రశాంతంగా వున్నాయి. జీవన ఫలాలను ఇక్కడే వదిలేశారు. వారు ప్రభువు మందిరానికి తిరిగి వెళ్ళిపోయిన రోజున.

(71)

మృత్యు దేవత నా తలుపు తట్టింది. వైతరణి గడచివచ్చి, నీ ఆదేశం తెచ్చింది.

చిమ్మచీకటి. నాకు మిక్కిలి భయంగా వున్నది ప్రభూ. అయినా దీపం తీసుకుని వెళ్ళి తలుపులు తెరుస్తాను. ఆమెను ఆహ్వానిస్తాను. నీదూత నా వాకిట నిలిచి వున్నది.

చేతులు జోడించి,కన్నీళ్ళతో ఆమెను అర్చిస్తాను. నా ప్రియ బాంధవిని ఆమెకు సమర్పించుకుంటాను.

ఆమె తనపని ముగించుకుని తిరిగి వెళ్ళిపోతుంది. నా గుండెలో ఆవేదన మిగిల్చి, నా తుది కానుకగా నీకు ఆత్మార్పణం చేసుకుంటాను దేవా.

(72)

ఆమె కొరకు నిరాశతో ఇల్లంతా దేవులాడాను. ఆమె కనుపించలేదు.

నాయిల్లు చిన్నది. ఒకసారి అందులోనుంచి పోయి నది మళ్ళీ దొరకదు.

కాని నీ భవనం సువిశాలమయినది. ఆమెను వెతు క్కుంటూ నీవద్దకు వచ్చాను. ప్రభూ.

సాయం సంధ్యావేళ నీ మహాకాశం నీడలో నిల బడి నీ కృపా కటాక్షంకోసం అర్థిస్తున్నాను.

అనంతత్వపు అంచును చేరుకున్నాను. అచట దేనికీ లోటులేదు. అవిరళ ఆనందం తాండవిస్తుంది.

మోడువారిన నా బ్రతుకును నీ ఆనంద సంద్రంలో మునకలు వేయనీ, సర్వాంతర్యామీ, పోగొట్టుకున్న మధుర ప్రేమ నీలో పొందనీ.

(73)

శిధిలాలయంలోని దేవా, తెగిన ఈ వీణియ ఇక నిన్ను స్తుతించుట లేదు. నీ ప్రాంగణాన గంటలు మోగడం లేదు. సమీప వాతావరణం నిశ్చలంగా వున్నది.

దక్షిణానిలుడు నీ ఆలయంమీద గాడ్పుల సందే శాలు వినిపిస్తున్నాడు. ఒకనాడు నీఆరాధనకు అంకిత మైన పూవులు అవి.

నీ పూజారి నీకరుణకై వేచివున్నాడు. సాయం కాలం అలసిపోయి, నీవద్దకు వస్తాడు.

నీ ఆలయంలో, పండుగరోజు నిశ్చలంగా గడచి పోతుంది. దీపారాధన లేకుండానే రాత్రి గడచి పోతుంది.

చతురులైన శిల్పులు ఎన్నో విగ్రహాలను ప్రతిష్ఠించి, అభిషేకించారు. శిథిలాలయంలోని స్వామికి మాత్రం పూజలేదు. దారుణంగా మరచిపోయారు.

(74)

నేను బిగ్గరగా మొరపెట్టుకొనుటలు ముగిసినవి. ఇది నాస్వామి చిత్తం. ఇకమీద మౌన ఆరాధనమే.

నాగుండె గొంతులోని నివేదన గానంగా సాగుతుంది.

జనులు రాచనగరుకు వెడుతున్నారు. కాని నాకు పనివేళలో, విశ్రాంతి లభించింది.

సమయం కాకపోయినా నా తోటలో పూవులు వికసింపనీ. తుమ్మెద ఆ నాదంతో పులకించనీ. మంచి చెడుల మధ్య ఎంతకాలం గడచిపోయింది. కాని ఇప్పుడు నా చెలికాని ప్రేమ నన్ను ఆలరించింది. ఈ ఆకస్మిక ప్రణయం ఏలనో నే నెరుగను.

(75)

మృత్యువు నీతలుపు తట్టినరోజున నువ్వు ఆమెకు ఏమి సమర్పించుకుంటావు?

నా అతిథికి నా నిండు జీవితం సమర్పించుకుంటాను. వట్టి చేతులతో ఎప్పటికీ పంపివేయను.

నా తీయని వసంతోదయాలు, పున్నమిరాత్రులు, భోగభాగ్యాలు, సర్వంఆమెకు అర్పణచేసుకుంటాను. మృత్యుదేవత నా తలుపు తట్టి పిలిచినప్పుడు.

(76)

భూమాతకు మౌనంగా వీడ్కోలు యిచ్చి, శాశ్వతంగా కన్నుమూసే రోజు వస్తుందని నాకు తెలుసును.

కాని యధా ప్రకారంగా, తారకలు వెలుగుతాయి. సూర్యుడు ఉదయిస్తాడు. సుఖ దుఃఖాల కలయికలో కాలం దొర్లిపోతుంది.

నా అటకిట్టే ఈ క్షణం గురించి ఆలోచన వచ్చినప్పుడు, బంధాలు సడలిపోతాయి. మృత్యు దేవత వెలుగులో నీ విశ్వం స్పష్టంగా గోచరిస్తుంది. నీవు దుర్లభమయిన ఈమానవజన్మ ప్రసాదించావు, ప్రభూ.

కావాలనుకున్న మమతలు, పెనవేసుకుని ఉన్న బంధాలు వదులుకుంటాను. నీ మధుర ప్రేమకోసం అర్థిస్తాను, శ్యామా.

(77)

నాకు పిలుపు వచ్చింది. సోదరులారా, నాకు వీడ్కోలు ఇవ్వండి. మీకు అభివందనము చేసి సెలవు తీసుకుంటున్నాను.

నా యింటి తాళాలు ఇస్తున్నాను. తుది క్షణంలో మీ ఆప్యాయత కోరుకుంటున్నాను.

మనం ఎంతో కాలం కలసి మెలసి వున్నాము. నేనుఇచ్చినదానికంటె అధికంగా మీనుంచి పొందాను. ఇప్పుడు వెలుగు వచ్చింది. నాచీకటి గుహలోని దీపం ఆరిపోయింది.

పిలుపు వచ్చింది. నేను పయనానికి తయారుగా వున్నాను.

(78)

ఈ లోకంలోకి అడుగు పెట్టిన ముహూర్తం నే నెరుగను.

రాత్రివేళ పూవుకి వలె, నన్ను అద్భుతంగా వికసింప చేసిన ఆ దివ్య శక్తికి జోహార్లు.

ఉదయ సంధ్యలో కనులు విప్పి చూచినప్పుడు నేను ఒంటరిగా లేనని, నామ రూప రహితమయిన

అవ్యక్త ప్రేమ, నాతల్లి రూపంలో నన్ను లాలిస్తున్న దని గ్రహించాను.

ఇలాగే, విలయంలో కూడ, ఈ అవ్యక్త ఆదరణ లభిస్తుంది. ఈజీవితాన్ని ప్రేమించినట్లు, విలయాన్ని కూడ ప్రేమించగలనని నాకు తెలుసును, శ్యామా,

(79)

నేను వెళ్లిపోయేప్పుడు, ఇక్కడ పరమానందాన్ని చవి చూచానని, తుది మాటగా పలుకనీ.

దివ్య ప్రకాశ జలధిలో వికసించిన కమలంలో దాగివున్న అమృతం చవిచూచాను. ధన్యత గాంచాను అని పలుకనీ.

నీ నాట్యశాలలో, సహస్రనామ రూపాలలో, ఆడాను. రూపరహితుని కనుగొన్నాను.

ఆస్వామి అపరూప స్పర్శలో నిలువెల్ల పులకించి పోయాను. నా విలయం ఇచ్చోటనే కలుగనీ. అని పలుకనీ.

(80)

నీతో కలసి ఆడినప్పుడు, నువ్వు ఎవరో అడుగ లేదు. జీవితంలో వెరపు, భయము లేకుండెను.

వేకువజామున నిదురలేపి, చెలికాడా నీతోపాటు కొండలూ కోనలూ తిప్పావు.

ఆరోజులలో నువ్వు వినిపించిన గీతాలకు అర్థం తెలియదు. నా ఎడద నీ గానంలో ఊగిపోయింది.

ఇప్పుడు, ఆట ఆగిపోయింది. అంతరదృష్టి వికసించింది. నిఖిల భువనాలునీపాదాలచెంత మౌనంగా మోకరిల్లాయి ప్రభూ.

(81)

నా అపజయాల దండతో నిన్ను అలంకరిస్తాను. కన్నా, అపజయాలను తప్పించుకోవడం నాకు చేత కాదు.

నా గర్వం కరగిపోతుందనీ, సంసార బంధాలు తొలగిపోతాయనీ, నా శూన్య హృదయం, మురళికి వలె, గానంగా జాలువారుతుందనీ తెలుసును స్వామీ.

సహస్రదళ పద్మం వికసించి, అమృతపానం చేస్తా నని తెలుసును,

నీలాల నింగిలో నుంచి నాకు పిలుపు వస్తుంది. నాదంటూ ఏమీ మిగులకుండా, నీపాదాల దగ్గర లయమయి పోతాను శ్యామా.

(82)

నన్ను నీ చేతులలో పెట్టుకున్నాను కన్నా. కానున్నది కాకమానదు. ఈ ఆరాటం అనవసరం.

నీ ఓటమిని అంగీకరించి, ఓ మనసా, నీఅదృష్టానికి సంతసిల్లవే. స్వామి ప్రసాద భాగ్యంలో హాయిని అనుభవించవే,

చిరుగాలికి కొండెక్కే నా దీపాలను మళ్లీమళ్లీ వెలిగించడంలోనే కాలం దొర్లిపోయింది.

కాని ఈమారు తెలివిగా చీకటిలోనే వేచివుంటాను. నీకై ఆసనం సిద్ధపరచి. నీ చిత్తం వచ్చినప్పుడు ఏగుదెంచి, నీ పీఠాన్ని అలంకరింపుము, శ్యామా.

(83)

నామరూపాల సంద్రపు లోతులలో నిరాకార రత్నం కోసం దేవులాడుతున్నాను.

నా భగ్ననావ రేవురేవుకీ పయనించుటలు ఇంక ముగిసినవి,అలలపై ఊయలలో తేలియాడుటలు ముగిసినవి. కన్నా.

ఇప్పుడు అమృతత్త్వంలో లయంకావాలని తపించి పోతున్నాను.

అగాధ జలనిధిలోని నీ అవ్యక్త రాగాలతో నా జీవిత మీణను మీటుతాను.

నీ అనంత నా దంతోశృతి కలుపుతాను. చరమ గీతాలాపన పిమ్మట, నిశ్శబ్దంగా నీ పాదాల మీద ఉంచుతాను, స్వామీ.

(84)

నా గానంలో నిన్ను అర్చించాను. నా కీర్తనలు నీ లోకాన్ని నాకు పరిచయం చేశాయి.

నా గీతాలు నాకు జ్ఞానబోధ చేశాయి. రహస్య మార్గాలు చూపాయి. నా హృదయాకాశంలోని నక్షత్రాలను నాకు చూపాయి.

కష్టసుఖాల వింత లోకంలో దారి చూపాయి, నా తత్త్వాలు. చివరకు, నా ప్రయాణం ముగియగా నీ పాదాల ముందు నిలిపాయి, శ్యామా.

(85)

నువ్వు నా స్వామివని నా సహచరులతో ముచ్చటగా చెప్పాను.

నా పనులలో వారు నీ రూపం చూశారు. వారు నన్ను అడుగుతారు. 'అతను ఎవరు?' అని వారికి ఎలా సమాధానం చెప్పాలో నాకు తెలియదు. 'నేను చెప్పలేను' అంటాను. వారు నన్ను నిందించి ఎగతాళిగా వెళ్ళిపోతారు. నువ్వు నవ్వుతూ చూస్తూంటావు.

నీకథలు కీర్తనలుగా పాడుకుంటాను. నా హృదయంలోని రహస్యం బయట పడుతుంది. వాళ్ళు నన్ను అడుగుతారు – 'నీ భావం చెప్పు' అని వారికి ఎలా సమాధానం చెప్పాలో నాకు తెలియదు. 'భావం ఎవరికి తెలుసు' అంటాను. వారు ఎగతాళి చేసి వెళ్ళిపోతారు. నువ్వు నవ్వుతూ చూస్తూంటావు.

(86)

నా పంచప్రాణాలూ శరణాగతి భావంలో నీ చరణాలమీద అర్పించుకోనిమ్ము కన్నా,

శ్రావణ మేఘం వలె నా నిండు హృదయం నీ ప్రమోల మోకరిల్ల నిమ్ము.

నా గీతాలన్నీ ఒకే నాదంగా, ఎనలేని మధుర భావంలో నిన్ను కీర్తించనిమ్ము.

దివా రాత్రములు తపియించి నా బ్రతుకు నీలో లయించి పోనిమ్ము స్వామీ.

# కవి బ్రహ్మ సీసపద్యము

డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు

కవిబ్రహ్మ సీసపద్యము సుకృతము అనగా స్వకృతము. వైదిక వాఙ్మయమునందు పరమేశ్వర నిర్మాణమైన సృష్టి సుకృతమన్నారు. ఈ చక్కగా చేయబడుట అనగా ఏమి?

"అసద్వాఇదమగ్ర ఆసీత్ తతోవై సదజాయత,
తదాత్మానమ్ స్వయమసుకృత, తస్మాత్ తత్
సుకృతమిత్యుచ్యతే,
యద్వైతత్ సుకృతమ్, రసోవై సః రసంహ్యే వాయం
లబ్ధ్వానందీభవతి॥

"సృష్టికి మొదట అసత్తున్నది. దానినుండి సత్తు పుట్టెను. అది తనంతటతాను సృష్టించుకొన్నది. దానికి కర్త మరొకడుకాడు. ఇందువల్ల అది సుకృత మని పిలువబడుచున్నది. అది నిజముగా చక్కని నిర్మాణము కలది, అది రసము. ఈ రసమును పొంది ఆనందమగుచున్నాడు". ఇట్లు తైత్తిరీయోపనిషత్తు సర్వసృష్టికి మూలము రసమని అదేసృష్టిగా సుష్ఠగా అభివ్యక్తమై సుకృతమైనదని చెప్పినది.

అసత్తు అక్రమము. అనగా క్రమములేనిది. దేశకాల రూపాదిబద్ధము కానందున దీనినుండి దేశకాలరూపాత్మకమైన సృష్టి అనగా సత్తు పుట్టినది.

ఈశ్వరుని కవిగా మనిషిగా పరిభువుగా స్వయంభువుగా చెప్పుమంత్రము ఈశావాస్యమునందున్నది.

సపర్యగాత్ శుక్రం అకాయం అవ్రణం అస్నావిరమ్ శుద్ధం అపాపవిద్ధమ్.

కవిః మనిషిః పరిభూః స్వయంభూః యాథా
తథ్యతోర్థాన్వ్యదధాత్ శాశ్వతీభ్యః సమాభ్యః

"అశరీరుడు, శుద్ధుడు పరిపూర్ణుడు, అస్నాయువు, అపాపవిద్ధుడునై నతడు ఈ సర్వమును వ్యాపించియున్నాడు. అతడు కవి, మనిషి, పరిభువు, స్వయంభువు, నైన ఈశ్వరుడు సర్వపదార్థములను యథాతథముగా నిర్మించెను". ఏది ఎక్కడ ఎట్లుండవలెనో అట్లు నిర్మింపబడినది కావున సృష్టి సుకృతము. అప్పుడది ఒక నిర్మాణవంతమైనది. ఈ కవి నిర్మాణమునకు హేతువు. ఈశ్వరుని యందున్న మనిషి. మనిషి యనగా దివ్యప్రజ్ఞ. దీనినే వేదము "దేవం మనః" అని వర్ణించినది. ఈ దివ్యమైన మనస్సు - మనిషి - ప్రజ్ఞ వస్తువుల యథాతథముగా సంఘటించును. కవియనగా దార్శనికుడు 'రసోవై సః' అన్నచోట 'సః' అనగా కవి: అని అర్థము. రసస్వరూపుడైన ఆ కవి తనయొక్క దివ్యప్రజ్ఞ ద్వారా సృష్టిగా అభివ్యక్తమగుచున్నాడు. కాబట్టి అభివ్యక్తము-సత్తు సమము. అనభివ్యక్తము అసత్తు విషమము. అనగా ముక్కు మొగము లేనిది.

సమమనగా 'యాథాతథ్యతోర్థాన్ వ్యదధాత్' అన్న మాట.

తత్త్వమునుగూర్చి వర్ణించుచు శ్రుతి ఋతసత్ (ఋగ్వేదము 4.40.5 - కఠోపనిషత్తు. 2.2.2.) అని వర్ణించినది. అనగా ఋతమునందున్నవాడు అని అర్థము.

ఇట్టి ఋతము సమన్వయసూత్రము. అనగా పైన చెప్పిన మనీషయే. సృష్టినిర్మాణసూత్రము ఋతము, లేక మనీష.[1] ఇది దర్శించినవానికి విశాల విశ్వగత సర్వపదార్థ సమన్వయము – అనగా భిన్నపదార్థాంతర్గత ఏకైక తత్త్వము – రసము అవగతమగుచున్నది. అప్పుడతడానందీభూతుడగుచున్నాడు. ( తైత్తిరీయ మంత్రము చెప్పినదిదా ) ఋతవానికి వాతములు ఋతములు. అనగా మధురములు అగుచున్నవి. సింధువులు మధువును స్రవించుచున్నవి. ఈ ఋతస్వరూపుని సూర్యునిగా వేదమభివర్ణించినది. ఇచట సూర్యుడనగా జ్ఞానతేజస్సు. ఇందుచేతనే ఈశావాస్యమిట్లన్నది. హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితమ్ ముఖమ్। తత్ త్వమ్ పూషన్, అపావృణు సత్యధర్మాయదృష్టయే. "ఓయీ పూషుడా సత్యముయొక్క ముఖము బంగారుపాత్రచే మూయబడియున్నది. నీవు దానిని తొలగింపుము నేను సత్యధర్మమును దర్శింతును" ఇక్కడ ధర్మమనగా ఋతమే. సత్యమనగా దానికాధారమైన కేవల పరిశుద్ధతత్త్వము.

కాబట్టి పరమేశ్వరునియొక్క మనీషారూపమైన ఋతమునుండి అసత్తు సృష్టిగా అభివ్యక్తమై సుకృతమైనదని స్పష్టపడినది. ఇందువల్ల అభివ్యక్తసూత్రము మనీషి లేక ప్రజ్ఞ.

ఈ ప్రజ్ఞాచేష్టయే శిల్పము. కవి - 'త్వము' అనగా కవియొక్క ఆత్మలక్షణము. అనగా రసము. ఇది శిల్పము – మనీషద్వారా అభివ్యక్తమై సుకృతమగుచున్నది. అప్పుడది కావ్యము. కవి, బ్రహ్మ కావ్యము సృష్టి, రెంటియందును నిర్మాణసూత్రము శిల్పమే. ఇద్దరును రసస్వరూపులే. కావ్యము సృష్టియు రెండును కవి-బ్రహ్మలయొక్క స్వయంకృతములు, వానికి వేరొక కరణసామగ్రిలేదు. దీనికి అభినవశ్రీగుప్తపాదులు లోచన మంగళశ్లోకమున 'అపూర్వమ్ యద్వస్తు ప్రథయతి వినాకారణకలామ్' అని ప్రతిభాస్వరూపిణియైన వాగ్దేవతత్త్వమును స్తుతించిరి. ఆమె ప్రతిభనుండి కావ్యసృష్టి చేయుచున్నది తప్ప దానికి ఉపకరణము మరియొకటి లేదు. ఈ వాక్యము 'తదాత్మానమ్ స్వయమకురుత' అన్న తైత్తిరీయమంత్రవాక్యమే. ఇట్లు శిల్పము భిన్నార్థసంఘాతమును పరమార్థభూతమైన రసమునకు వ్యంజకసామగ్రిగా యథోచితముగా నిబంధించు సూత్రము. ఈ శిల్పమునుండి కావ్యము పుట్టుచున్నది. ఇందుచే శిల్పశబ్దము తాత్త్వికము.

కవిబ్రహ్మ తాత్త్వికకవి :– ఋషియైనవాడే కవి. ఋషి అనగా ఏవని కవిత్వమునందు తత్త్వము–సత్యము శిల్పముద్వారా పరమార్థత వ్యంజింపబడునో అట్టి కవి. అంతేగాని వేదాంతములు చెప్పువాడుకాడు పురాణ ధర్మములను ప్రవచించువాడును కాడు. తిక్కనగారి శిల్పమంతయు పరమార్థభూతమైనది. ఈ దృష్టితో ఆయన సీసపద్యము సమీక్షింపబడుచున్నది.

ఉర్వీధరంబుల నొప్పెడు జేవురు జాజుల కాంతికి
నునుమెఱుగు వెట్టి
ధరణీజగుల్మలతా వితానము పల్లవములకు గట్టిఱ
వన్నె యొసగి
యరుణాంబుజంబుల యంతర్దళంబుల తళతళ
యనుజగి దళముకొల్పి
చక్రవాకద్వయసంతతియెఱకల కొమరారు
కెంజాయ గొప్పిత్తచేసి
తనయుజాలబింబ [illegible]
గగనభాగ [illegible]
నల్లనల్ల జగములెల్లను విలసిల్ల పూర్వ శిఖరి
మీద బొడిచె నినుడు.

(ఉద్యో - 2-114)

1. మధువాతా ఋతాయతే. మధుక్షరంతి సింధవః (ఋగ్వే 1-90-6) ఋతదర్శనమున్న వానికి గాలులు మధురములు నదులు మధువును స్రవించుచున్నవి.

ఈ పద్యమునందు సూర్యోదయము యొక్క క్రమపరిణామము వర్ణింప బడినది. సూర్యోదయము వర్ణింపుట కొంచెపు పైనగదా. అందుచేత చదువు కాంతికి మెఱుగుపెట్టి ఉర్వాపై క్రిందికిదిగి చెట్ల చిగురాకుల కొత్తగుపెట్టి ఉర్వాపై క్రిందికిదిగి చెట్ల చిగురాకుల కెఱ్ఱదనాలద్ది, ఉరువాల ఇంకను క్రిందకు ప్రాకి నేలబారుగా పచ్చి తామరపూవుల లోపల రేకరేకలు దిద్ది అచటనే ఉన్న చక్రవాకములకు రంగు లద్ది కాంతి జగత్తునంతను పరచుకొన్నది.

> నీరజాతరములు నిష్ఫమై జేసిన భవ్యతపంబుల
> ఫలమనంగ
> దివసముఖాధినందిర చక్రయుగ్మకంబుల యను
> రాగంబు ప్రోవనంగ
> హరిహరబ్రహ్మ మహానుభావంబు లొక్కటగాగ
> గలిగిన గుటికయనగా
> సతుల వేదశ్రియ లతికాచయము పెనుపొంద
> బుట్టెడు మూలకందమనగ
> సభిజగముల కన్నెఱయగుచు జనసమాజకరపుట
> హృదయ సరోజములకు
> ముకుళనంబును జృంభణంబును నొనర్చి
> భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె
>
> (విరా. 2-141)

సీసపద్యమున మొదటి రెండు పాదములు లౌకిక విషయము - దిగువ రెండుపాదములు అలౌకిక విషయమును చెప్పుచున్నవి. సూర్యుడు తామరలకు తపఃఫలము-చక్రవాకముల అనురాగరాశి. ఇది లౌకికము. తర్వాతి హరిహరబ్రహ్మతత్త్వ ఘటిక-వేదలతలకు కందము. ఇది అలౌకికము. ఇదియు సూర్యుని లౌకిక విధినుండి శ్రుతితత్త్వము దనక పైపైకి తీసికొనిపోయినది.

సామాన్యముగా తిక్కనగారి వర్ణనలందు తత్త్వము సూత్రము. అనగా కేవల ఆలంకారిక సౌందర్య లేక తాత్త్విక సద్యవృష్టిగల వి. ఇది ఋషిపద్ధతి- ఐతిహాసిక విపద్ధతి.

> పంచరీ కావరి ఝుంకృతుల్ గర్వింప -
> దిగ్గజరకంధురాకారములను
> ధరిణీపరాగ సంతానంబు బెరింప - పచ్చ
> టా ప్రాణములను
> ఘంటికాటంకృతి కాంతి సంభావింప - నిర్భర
> బృంహిత నిస్వనములు
> సంబరిభాగంబు నల్పంబుగావింప - సున్నత
> గాత్రసముద్ధతులను
> జారుభీషణరేఖలు - భూరిమదాభి రామయా
> నంబులు నాహవోచి
> తోగ్రకల్పనాభంగులునుల్లసిల్ల - గరుల ధాత్రీ
> తలంబు గ్రక్కదల నడచె.
>
> (శల్య. 1-102)

ఈ పద్యము యుద్ధమునకు బయల్వెడలుగల సైన్య వర్ణన. సామాన్యముగ తిక్కనగారుయుద్ధప్రారంభము లందు ఇట్టి సీసములు వ్రాయును. అందలి రచన భారావహము. దంతురము. అట్టి పద్యములు మరల ఎవ్వడును వ్రాయ లేదు

> తురగరింఖాముఖోద్ధూతధూళీపట - లములు
> నల్దిక్కు-లలంకరించె
> మాతంగకటగళన్మదజల బహుల ప్రవాహ
> విలాసంబు దానినడచె
> బహువిధవాదిత్ర భైరవారావంబు - పెల్లంబరము
> పిక్కటిల్లజేసె
> శింజనీటంకార సింహనాదంబులు - పెక్కుపయో
> మోత్రితబిలుచుకానియె
> రధికభూషణముల రశ్మల గేతన - చ్ఛత్త్రచా
> మరోపస క్తమణుల
> రుచుల సుభటహేతిరోచుల బవలింటి చంద
> మయ్యె దినకరునంతు
>
> (కర్ణ. 1-62)

ఇందు 1, 2, పాదములకు 3, 4 పాదములకు సమన్వయము మొదటి పాదమందలి ధూళిని రెండవ పాదమునందలి జలముగ్రహించినది. మూడవపాదము నందలి వాద్యధ్వనించే పైకుబ్బిపోవు ఆకాశమును నాల్గవ పాదమందలి శింజినీటంకారము క్రింది కాకర్షించినది. ఎత్తుగీతి ప్రత్యేకమైన మూడవ ఖండముగా చెప్పబడినది. ఇట్లు పద్యము మూడు ఖండములుగా విభాగింపబడ్డది. పద్యమున వర్ణింపబడినవి చతురంగ బలములు. నాల్గవ పాదము కాల్బలవర్ణనగా మిగిలిన పాదములచేత వ్యంజింపబడుట ఒక చమత్కారము.

'రాత్రిమైదాకి కూర్చిరబోరిమగటిమివాసిన
యంగారవర్ణురంటె - కర్ణ. 3.24.
'గొంతియు నందఱు గొడుకులు సపుత్రై -
యుండంగలక్కయిల్ మండజేసి- కర్ణ. 3.356

పద్యమందు పూర్వ పూర్వ కథాంశములు క్రమమున గుదిగ్రుచ్చబడుట స్పష్టము.

మొదటి పద్యమున అంగారవర్ణుని. చిత్రసేనుని. ఇంద్రుని. త్రిలోచనుని. విజయుడు జయించిన విషయములున్నవి. 1. ఆదిపర్వము. 2. ఘోషయాత్ర (అరణ్య. 3 ఆ) 3. ఖాండవదహనకథ (సభాపర్వము) 4. పాశుపతాస్త్రప్రదానకథ (అరణ్య 1 ఆ). ఇందు క్రమములేదు. అనగా చారిత్రకాంశములు వ్యత్యస్తములుగా కూర్చబడిన వసతి తెలియుచునే యున్నదిగదా. కాని విజయుని చేతిలో నోడిన వారిలో దరతమభేదమున్నదిగదా.

[illegible] క్రమదృష్టితో కవి కథాంశక్రమమును కూర్చెను.

రెండవపద్యమున లక్క [illegible] కాల్చుట (ఆది.), జూదమాడి ధర్మజుని [illegible] గొనుట-వరే సభాపర్వము. ద్రౌపది [illegible] (అజ్ఞాతిదే), ఘోషయాత్ర (అరణ్య), అభిమన్యుని చంపుట (ద్రోణపర్వము). ఇందు కథాంశక్రమము సుసంఘటితము.

కాంచనమయవేదికాకనత్కేతనోజ్జ్వల విభ్రమము
వాడుకలశజుండు
సింహలాంగూల భూషితనభోభాగకే -
తుప్రేంఖణమువాడు ద్రోణసుతుడు
గనక గోవృషసాంద్రకాంతిపరిస్ఫుట - ధ్వజస
ముల్లాసంబువాడు కృపుడు
లలితకంబు ప్రభాకలితపతాకా విహారంబువాడు
రాధాత్మజుండు
మణిమయోరగ రుచిజాలమహితమైన - పడగ
వాడు కురుక్షితిపతి, మహోగ్ర
శిఖరఘనతాళరురువగు సిడమువాడు - సురన
దీసూనుడేర్పడ జూచికొనుము

(విరాట 5-1)

తరువాత పద్యము మహారథిపర్ణనము. ఇది బహుప్రసిద్ధమైనది. కాని బహు విచిత్రము. ద్రోణుడు, అశ్వత్థామ, కృపుడు కర్ణుడు, దుర్యోధనుడు, భీష్ముడు క్రమమున వర్ణింపబడిరి. విరాటపర్వ చతుర్థాశ్వాసము (237ప) చివర దీని రహస్యమున్నది అందు ద్రోణుడు ఇట్లు చెప్పెను. 'ఈ బలంబున నాలవపాలుగొని మహీపాలుండు-మునుఅపోవలయు. అంతియ సేన తదనంతరంబ కదుపులంబొదివికాని చనవలయు. శక్తిపగంబుతో [illegible] నిలిచి మోహరించి అన్న మాటలు [illegible] యమును చెప్పెను. తర్వాత [illegible] వ్యూహనిర్మాణ విషయమున్నది. దానికి నడుమ నాచార్యుడు వలపట కృపాచార్యుడు ముందట కర్ణుడు వెనుక భీష్ముడు దాపట అశ్వర్థామ - ఈ వ్యూహనిర్మాణమునే పై పద్యము సూచించును. ఐదవ ఆశ్వాసమున పై పద్యము తరువాత అర్జునుడు ముందట కర్ణునితో

తరువాత ద్రోణునితో తరువాత అశ్వత్థామతో తరువాత కృపాచార్యునితో చివరకు భీష్మునితో యుద్ధము చేసినట్లు చెప్పబడినది. సైన్యమంతయు ద్రోణ భీష్ములకు నడుమ నున్నట్లు చెప్పబడినది. అట్లది దుర్భేద్యము ఇట్టిపద్యము ఆ యుద్ధవర్ణనమునకు కాలికి పూసవలె పొదగబడినది

ప్రాణంబుతోగూడఁ బీల్చి చన్నులఁబ్రాలుఁద్రావిన
 ప్రౌఢ బాలుడితడె
వ్రేల్మిడి జాణూరు విరిచి లోకములు మెచ్చించిన
 యాజగజెట్టి యితడె
దుర్వృత్తుడగు కంసు దునిమియాతని దండ్రి
 బట్టంబు గట్టిన ప్రభువితండె
సత్యభామకు బారిజాతంబుపైగల కోర్కెదీర్చిన
 రసికుండితండె
వెన్నలను గోపికాచిత్త వృత్తులను
నరసిమ్రుచ్చిల నేర్చిన హరి యితండె
శ్రుతిశిరోభాగమున తన శుభగచరణ
సరసిజా మోదమును గూర్చు చతురుడితడె
 (ఉద్యో -3-175)

1. సీస పద్యమందలి మొదటి నాల్గు పాదములు శ్రీకృష్ణుని వయఃపరిణామమును చెప్పుచున్నవి. బాల్యముతో ప్రారంభమై నాల్గవ పాదము వచ్చు వరకు అతడు యౌవనవంతుడైనాడు.

2. శ్రీకృష్ణుని భిన్నలక్షణములు నాల్గుపాదములు వయఃపరిణామానుసారముగ చెప్పబడెను.

3. అతని చరితలోని భిన్నాంశములు క్రమము తప్పక చెప్పబడినవి.

4. ఒక్కొక్క వాక్యమునకు ఒక్కొక్క విషయము చొప్పున తెగవేసి చెప్పిన లక్షణమును ఈ పద్యమును అనుకొన్న అంగనాజనముల యొక్క భిన్న మనఃప్రవృత్తిని ధ్వనించుచున్నది. అనగా ఒక్కొక్క వాక్యము ఒక్కొకతె చెప్పినది. అనగా ఆ వాక్యము వెనుక ఆమె మనస్సున్నది. భగవంతు నొక్కొక్కరు ఒక్కొక్క విధముగా నారాధింతురు. ఒకడు అతని శిశువుగా మరొకడు మహావీరునిగా మరొకడు చక్రవర్తిగా మరొకడు భర్తగా మరొకడు భక్తి దృష్టితో మరొకడు జ్ఞానదృష్టితో చూచును. అన్నియును యోగములే. ఈ ఉపాసనావృష్టిని పద్యము ధ్వనించుచున్నది. గీతపద్యము నందు మొదటి రెండు పాదములు ఒక వాక్యము అందు వెన్నెలవంటి గోపికల చిత్తములను హరించిన హరి యందలి భక్తితత్త్వము చెప్పబడగా క్రింది రెండు పాదములు కలిసిన ఏకవాక్యమునందు అతనిని గురించి ఉపనిషద్బ్రహ్మముగా జ్ఞానదృష్ట్యా దర్శించిన విధానము చెప్పబడినది.

5. బాలునితో పద్యము ప్రారంభమై వేదాంత వీధులందు విహరించు పరబ్రహ్మముతో అంతమైనది. విశ్వేశ్వరుని సమస్త విశ్వరూపము అభివర్ణింపబడినది.

మొదటి నాలుగు పాదములు మానవుడైన భగవంతుని వర్ణన. ఎత్తుగీతిలోని మొదటి రెండు పాదములు అల్లరిపిల్లవాని-అవతార లక్షణమును, భక్తి సులభుడైన పరమాత్మను చెప్పుచున్నవి. అనగా దేశ కాలబద్ధ మానవ స్వరూపమును లదతీతమై నిత్యమైన పరమేశ్వర మూర్తిగా చిత్రించినది. చివరి రెండు వాక్యములు కేవలం ఆత్మమూర్తిగా చెప్పుచున్నవి. దీనికి తాత్పర్యమిది మొదటి నాలుగు పాదములు మానవుడు. ఎత్తుగీతి మొదటి రెండు పాదములలో సగము మానవుడు సగము దైవము - అనగా సగుణమూర్తి. చివరి రెండు పాదములలో కేవలము నిర్గుణతత్త్వము అభివర్ణింపడుట ఒక మహాక్రమవికాసము ఇది ఉపాసనా విధానము. మొదటిది కర్మయోగము, రెండవది భక్తియోగము మూడవది జ్ఞానయోగము.

కరుణారసము పొంగిపొరలెడు చాడ్పున-శశిరేఖ
సమృతంబు జాలువాఱ
హరినీల పాత్రిక సురభి చందమమున్న గతి -
నాభిధవళ పంకజము మెఱయ
ప్రథమాద్రి దోతెంచు భానుబింబమునాను -
రమ్మున కౌస్తుభరత్న మెప్ప
గుఱియైన చెలువున నెరసిన లోకర - క్షణమన
గరళంబు చాయదోప
సురసదియు కాళిందియు బెరసినట్టు -
కాంతిపూరంబు శోభిల్ల శాంతమూర్తి
నామనంబు నానందమన్నముగజేయ - నెలమి
సన్నిధిసేసి సర్వేశ్వరుండు (అవతారిక)

హరనాథ తత్త్వమనగానే మో చిత్రమున పద్య మిదే.

ఇందు 1, 3 పాదములు శివత్వవర్ణన, శివుడు నిర్గుణమూర్తి. 1, 3 బేసి సంఖ్యలు. బేసి విషమము. 'విషమస్థుడై యున్కి వృషవాహనుండంద్రు' అని శాంతిపర్వము. శివుడు విషమాక్షుడనగా ఇదేఅర్థము. ఇందుచే శివునకు పద్యమున మూర్తిని వర్ణించలేదు. కేవలము శశిరేఖ, గరళము చాయ అన్నాడే తప్ప మౌళి, కంఠము చెప్పలేదు.

2, 4 పాదములు వ్యక్తమూర్తియైన నారాయణ వర్ణనము. ఇందుకే నాభి, ఉరము అని అంగవిర్దేశము చేయబడ్డది. రెండు, నాలుగు సమ సంఖ్యలు. సమము వ్యక్తము. సత్తు, శివుడసత్తు. అసత్తు నుండి సత్తు పుట్టినదని తైత్తిరీయ మంత్రము చెప్పినది. విష్ణువు విశ్వాకృతి. విష్ణు సహస్రము విశ్వశబ్దముతోనే మొదలగుచున్నది. తదాత్మ స్వరూపుడు శివుడు. శివసహస్రము స్థాణుశబ్దముతో మొదలు. ఇది కదలని అచలతత్త్వము. దానినాధారముగా గ్రహించి కదలు - అవతరించు తత్త్వము పేరు హరి.

ఎత్తుగీతిలో కేవలము కాంతిపూరము వర్ణింపబడునది. సురనదియు కాళిందియు బెరసినట్లున్నదట. రెండు తేజస్సులు కలసిపోయిన ఒకానొక మహాచైతన్యమది.

మొదటి పాదము శివుని వర్ణింపగా రెండవ పాదము విష్ణువును వర్ణించుచున్నది. మరల మూడవది శివుని, నాల్గవది విష్ణువును. మొదటిది మౌళిని సూచింపగా మూడవది కంఠమును సూచించుచున్నది. రెండవది నాభిని, నాల్గవది ఉరమును వర్ణించుచున్నది. ఇల్లును సమత్వము హరిహరాభేదము స్థాపింపబడ్డది. శివవర్ణన నిరలంకృతము, విష్ణువర్ణన సాలంకారము శివతత్త్వమును చెప్పుచోట్ల అలంకారమున్నను అది గుణద్యోతకము విష్ణువర్ణనలో అలంకారము వస్తుద్యోతకము. శివుడు అచ్చవస్తువైన సత్యము. విష్ణువు సౌందర్యము రెండును పరస్పరాధారములు కాబట్టి (చూ. అనుశాసనికపర్వ పీఠిక - ఆకాడమి ప్రతి)

మణిహేమపర్యంక మహితోపవేశను - సురుచిర
బాణ విస్ఫురితగాత్రు
గౌస్తుభరత్న వికాసివక్షస్థలు - పీతకౌశేయ
సంప్రీతమూర్తి
మేరుతటీగత మేఘసంకాశు నక్షత్రగణావృత
గగనసదృశు
నూతనోదిత రవిద్యోతితోదయగిరి - విభు,
రుక్మబద్ధేంద్ర నీలతుల్యు
నమ్మురారిగని కృతాంజలియై భక్తి - జిత్తవృత్తి
గరముజొత్తిలంగ
నంతకంత కాననాంబుజమలరంగ - నిట్టులనియె,
దియ్యమెసర మెసగ.

(శాంతి 2-3)

ఈ పద్యములో 1,3 పాదములు, 2,4 పాదములు పరస్పర సమన్వితములు, మణిహేమ సింహాసనమున

నున్నవాడు కాబట్టి మేరుతటీగత మేఘనిభుడైనాడు. మణిహేమపర్యంకము మేరుతటి ప్రష్ఠుడు మేఘుడు. సురుచిరాభరణవిస్ఫురిత గాత్రుడు గాబట్టి నక్షత్రగణావృత గగన సదృశుడు. కౌస్తుభరత్న వికాసి వక్షుడు కాబట్టి నూతనోదితరవిద్యోతితోదయగిరి నిభుడు. పీతకౌశేయసంపీతమూర్తిగాబట్టి రుక్మబద్ధేంద్ర నీలతుల్యుడు. గగనసదృశుడనుటలో 'ఆకాంశః తల్లిం గాత్' అన్న బ్రహ్మసూత్రమున చెప్పబడ్డ పరబ్రహ్మమే ఆకాశము అను చెప్పిన చాందోగ్యమంత్ర విషయమగు సంధేయమగుచున్నది ఉపనషత్తులందు బ్రహ్మమాకాశముగా చెప్పబడిన విషయము బహు ప్రసిద్ధమైనది. దహరాకాశశబ్దవాచ్యుడు పరబ్రహ్మమే ననుటను 'దహరఉత్తరేభ్యః' అన్న బ్రహ్మసూత్రము చాందోగ్యశ్రుతిననుసరించి చెప్పబడినది. దీనిని గురించి బ్రహ్మసూత్రము లనేకములు చెప్పబడినవి.

'సర్వాణి హవా ఇమానిభూతాని ఆకాశదేవ సముత్పద్యంతే'

అస్య లోకస్యకాగతిరితి. ఆకాశ ఇతిహోవాచ (సర్వప్రాణులకు మాత ఆకాశము. సర్వలోకములకదేగతి) (చాందోగ్యము)

ఈ మూర్తిదర్శనము చేసినది భక్తుడైన ధర్మరాజు. అనగా భక్తునిహృదయమున ప్రతిఫలించిన భగవన్మూర్తివర్ణనమిది. భావనలోని మూర్తితప్ప భౌతికమూర్తిగాదు. దహరాకాశద్యోతితము. ఇందుకే గీతపద్యమున 'చిత్తము భక్తిజొత్తిలంగ' అనబడినది. భావనలో నిరాకార భగవత్పదార్థము క్రమక్రమముగా సాకారమగుచున్నది. ఇది దర్శించిన ధర్మరాజుయొక్క ఆసనాజ్ఞము అంతకంతకలరినదట. అంతకంతకలనికి తియ్యమెసక మెసకినదట. దానికి కారణమామూర్తి మాధుర్యము. అది బంగారు వస్త్రముచే పొదుగబడినది. బంగారమున పొదుగుబడ్డ ఇంద్రనీలమువలెనున్నది. ఇట్లు మూర్తి మాధుర్యమొప్పినది పద్యము పద్యమంతయు ఒక వాక్యమున మరియొకవాక్యము చొచ్చుకొనిపోయి అక్కడక్కడే సుడితిరుగుచున్నది. అంటియునొక తేజోవృత్తము.

ఇందలి కౌస్తుభరత్నవికాసితవక్షస్థలు, నూతనోదితరవిద్యోతితోదయగిరినిభు, అన్న మాటలు అవతారికలోని హరిహరనాథవర్ణనమందలి. "ప్రథమాద్రిదోతెంచు భానుబింబమునా నురమ్మున కౌస్తుభరత్న మొప్ప" అన్న వాక్యమును తాకుచున్నవి.

ఇట్టి పద్యములు శిల్పమహితములనుట నిరూపింపబడినదే గాని రచనా సౌందర్యశోభితములనుట చెప్పబడలేదు. రచనలో శబ్దములు, సమాసములు, వాక్యముల విరుపులు, యతిప్రాసలు శైలి మొదలగునవి చెప్పుకోదగినవి ఉదా. కనత్కేతనోజ్వల అన్న సమాసమున 'కనత్' శబ్దము పతాకరెపరెపలను ధ్వనించును. 'నోజ్వల' అన్నచోట 'ఓ' యన్న దీర్ఘము మహత్వమును వ్యంజించును. 'జ్వల' నుండి అన్యవాక్యఖండమారంభమగును, పూర్వవాక్యాంతభారమంతయు 'జ్వ' మీదపడును. అట్లే 'కేతుప్రేంఖణము' అన్నచోట 'కే' వరకు పూర్వపాదము తెగి 'తు' తో తర్వాతి పాదము ప్రారంభమగును. ఇట్టి విరుపులు తిక్కనగారి కవిత్వమున మహాభారతమన్నియున్నవి. ఇవి చెప్పబడలేదు.

తిక్కనగారి శిల్పమహితమైన పద్యము ఆకారమాధుర్యమును చిత్రించు గాంధార శిల్పముకాదు. భావరహితమైన బహుళాలంకారశోభితమైన హాళిబీడు శిల్పముకాదు. అది దివ్యమైన, అగాధమైన, భావావహమైన ఎలిఫెంటాగుహలోని త్రిమూర్తిశివుని విగ్రహము, బాదామి నటరాజ విగ్రహము, చోళశిల్పమైన గజాంతక శివమూర్తి.

# విశ్వనాథ వారి కథానిర్మాణ శిల్పము

By- "సూరి"

"ఈ జీవుని ఆర్తి, జీవుని వేదన,
అదీ సమస్త సాహిత్య సృష్టికీ, మౌలిక ప్రేరణ;
సర్వరస ప్రపంచ విస్తారానికి మూల భూమిక,
సర్వ కావ్య శిల్పమునకూ అంతరాత్మ"[1]-

అను డా॥ కోవెల సుప్రసన్నాచార్యులవారి వాక్యములు, విశ్వనాథ వారి నిర్మాణ శిల్పమును విదితము చేయుచున్నది. అది యెట్లు, యిది కావ్యమునకు చెందినది గదా! యని సందియ ముదయింప వచ్చును. కావ్యమునుండి కథ యుద్భవించినది గనుక యిది సమంజస మన వచ్చును.

విశ్వనాథ వారి కథా లక్షణములు ఆంతర, బాహిరములని ద్వివిధములు. ఆంతరము కథకు ఆత్మ, బాహిరము కథకు శరీరము. శ్రీమద్రామాయణ కల్పవృక్షమున, జటాయుః ఖండమున రావణాసురుడు లౌకికుడు. భోగిగ దృశ్యమాన మగును. బాహిరముగ సీతను పొగడును. ఆంతరమున, ఆదేవి మూర్తి నుపాసించును. ప్రణయ భావము బాహ్యస్థితి, పూజ్యభావము అంతరదృష్టి. విశ్వనాథ వారి చిన్న కథలు కూడ నీరీతిగ ఆంతర, బాహిర రూపములు గలవి.

విశ్వనాథ వారి కథా నిర్మాణ శిల్పమును గూర్చి పరిశీలింపవలెను. శిల్పమనగా నేమి? రచయిత భావములను కథనందు అలంకరించు తీరును శిల్పమందురు. భావము అర్థ సంబంధమైనది. ఏ భావము ఎట్లు చెప్పవలెనో, చెప్పునది శిల్పము. చిన్నకథకు శిల్పము ప్రాణము. అది ఎచ్చోట నుండును? ఇతివృత్త నిర్మాణము, కథా కథనము, పాత్ర చిత్రణ, సన్నివేశ చిత్రణ, వర్ణనలు, ప్రారంభము - ముగింపు, నామౌచిత్యము లందును దీనిని కథా నిర్మాణ శిల్పము అందురు.

ఇతివృత్త నిర్మాణము :-

మానవ జీవితములోని సంఘటనలు, భావములు, ఆదర్శములు, సమస్యలు నేటి కథల యొక్క ఇతివృత్తములు. ఇతివృత్తమును స్థూలముగ ముప్విధములుగ విభజించవచ్చును. 1. చారిత్రక ఇతివృత్తము, 2. పౌరాణిక ఇతివృత్తము, 3. సాంఘిక ఇతివృత్తము. విశ్వనాథ కథలన్నియు నీ విధములగు నితివృత్తములకు చెందినవి. చారిత్రక ఇతివృత్తమునకు చామర గ్రాహిణి కథ. పౌరాణిక ఇతివృత్తమునకు మిగిలిన కథలు పేర్కొనవచ్చును.

సాంఘిక ఇతివృత్తము గల కథలయందు- స్త్రీ సమస్య, జాతిభేదము, వ్యక్తి ధర్మ, వృత్తి

1. మహాగ్రంథాలు-సహృదయ చక్రం-సుప్రసన్నాచార్యులు-జాగృతిదీపావళి ప్రత్యేక సంచిక 1978పుట-23.

ధర్మములు బోధించు కథలు గలవు తిరోధానము కథ స్త్రీ సమస్యకు చెందినది. మాక్లీదుర్గంలో కుక్క జాతి భేదమునకు చెందినది. పరిపూర్తి వ్యక్తి ధర్మమునకు చెందినది వెలుగు మెట్లు వృత్తి ధర్మమునకు చెందినది.

విశ్వనాథ వారి 'తిరోధానము' - స్త్రీ సమస్యను ఇతివృత్తముగ స్వీకరించబడిన కథ. వివాహానంతరము భర్తచేత విడువబడుట మరొక సమస్య, అట్టి స్త్రీ సంఘమున బ్రతుకుట కష్టమని "జమీందారుని కొడుకు" కథ ద్వారా తెలిపిరి. భర్త యున్నప్పటికి, తగిన ఆదరణ పొందలేని శకుంతల మరణము కూడ స్త్రీ సమస్యనుగూర్చి విదితము చేయుచున్నది. మనకున్న మరొక సమస్య జాతిభేదము. అయ్యది మనుష్యులందు జంతువులందు లేదని దానిని విడనాడ వలెనని, "మాక్లీదుర్గంలో కుక్క" కథ ద్వారా, స్టేషన్ మాష్టరు పాత్ర ముఖమున వ్యక్త పరచిరి విశ్వనాథ. వ్యక్తి ధర్మమును, దాంపత్య ధర్మమును ప్రబోధించు నీతి వృత్తముగల కథ పరిపూర్తి. చంద్రశేఖరరావు రాధను వివాహమాడెను. రాధ ధర్మపత్నియై తన ధర్మమును నిర్వహించి, తన కోర్కెను తనకు గలిగిన సంతానమున పరిపూర్తి మొనర్చుకొనెను. వృత్తి ధర్మమునకు - వెలుగుమెట్లు- సరితూగుచున్నది. 'సంధ్య' గూఢచారిణిగ వెళ్లిన భారతీయ నాట్యకత్తె. ఆమె వృత్తి ధర్మమును విస్మరించలేదు కనుక వెలుగు మెట్లెక్కి ఇంద్ర సభలో స్థానమును బడసినది.

కథాకథనము :- కథాకథన మనగ కథ చెప్పు పద్ధతి. ఇది ద్వివిధములు. 1. ఆత్మాశ్రయ పద్ధతి. 2. పరాశ్రయ పద్ధతి. ఎక్కడ వ్యాఖ్యాతగా రచయిత కథను అనుసరించుచు విమర్శలనుకథకు అంతర్భాగముగ చేసి వ్యాఖ్యానాత్మకముగ రూపొందించునో అక్కడ పరాశ్రయ పద్ధతి యుండును. అట్లే కథాకథనముతో తనకు సంబంధము లేనట్లు దూరముగ ఆయా పాత్రలచేత కథ నడిపించిన పరాశ్రయమగును. రచయిత నాయకుడై, తాను భావించిన కథకు తానే కథకుడై కేంద్రీకృతమైన ఒకే దృష్టి నుండి కథను నడిపించుట ఆత్మాశ్రయ పద్ధతి. ఎక్కడ రచయిత ప్రధాన కథకుడై "నేను" అని ప్రారంభించి చెప్పదలచుకొన్న కథను ఉత్తమ పురుషలో చెప్పు పద్ధతి ఆత్మాశ్రయ పద్ధతి. ఇది మరల రెండు పద్ధతులు. 1. కాలసరణి (సాధారణ పద్ధతి) 2. హేతుసరణి (సంశ్లిష్ట పద్ధతి). దీనినే కథనాత్మక పద్ధతి, సంఘటనాత్మక పద్ధతి అన వచ్చును. కాలసరణిలో సామాన్యముగ కాలమానములో ఎక్కడో ఒక చోట కథ ప్రారంభింపబడి క్రమానుగతముగ సాగిపోవును. ఉదా॥ విశ్వనాథవారి "కాళిదాసుని అపకీర్తి" కథ:- "నైమిత్తిక ప్రళయం అయిపోవడంతోనే నూతన బ్రహ్మనిశ్వాసాలు బయలు దేరినై."[1]

హేతుసరణి పద్ధతిలో కథ కంతటికి ప్రధానమైన విమర్శతో ప్రారంభమై, ప్రధాన పాత్రను గురించిగాని, ప్రధాన సంఘటన గురించిగాని పరిచయము చేయబడను ఉదా॥ విశ్వనాథ వారి "యూరిక్లీ మీథెయ్" కథ.

"ఉరిఖిలా నీగ్రో నాయకుడు. అతనికి నాకు మొదటిసారి పరిచయము చిత్రముగా నైనది"[2] పరాశ్రయ పద్ధతియందు రచయిత

1. చిన్న కథలు–విశ్వనాథ సత్యనారాయణ పుట–25.

2. చిన్న కథలు–విశ్వనాథ సత్యనారాయణ పుట–1.

చివర ప్రత్యక్షమగును. ఆద్యంతములు కథలోని పాత్రలతో సంబంధము లేక, చివర ప్రవేశించిన అది కథకు ప్రాణప్రదమగు చున్నది. విశ్వనాథ వారి 'పుణ్య ప్రేమము' కథ పరాశ్రయ పద్ధతిలో ప్రారంభింపబడినది చివర, బాలసన్యాసి ప్రవేశము, కృష్ణరాయలు, శుభ దరి ప్రేమ, పుణ్యప్రేమము కాదని నిర్ణయించుట, పరాశ్రయ పద్ధతికి ఉదాహృతి. ఇచ్చట బాల సన్యాసి-విశ్వనాథయని చెప్పక తప్పదు

**పాత్ర చిత్రణ:-**

పాత్రచిత్రణ కథకు ఆత్మ వంటిది. మన పురాతన కథ లన్నింటియందు పాత్రలను కొన్ని భావములకు ప్రతినిధులుగ స్వీకరించి, సృష్టించుచుండిరి మంచి, చెడులను నిర్దేశించుటకు. రామ-రావణ పాత్రలు సృష్టించిరి. కాల క్రమమున, నవీనశాస్త్ర సిద్ధాంత సమన్వయము నేటి పాత్రలందు కన్పించుచున్నది. ఏ పాత్ర, కేవలము మంచి, చెడును మాత్రము కలిగి యుండదు. ప్రతి మనిషి మంచి చెడుల కలయిక యగుటచే ఈ భావము, నేటి కథలలో గోచరమగు చున్నది.

విశ్వనాథ వారి చిన్న కథల యందలి పాత్రలను స్థూలముగ స్త్రీపాత్రలు, పురుష పాత్రలని విభజించ వచ్చును.

1. కాపుస్త్రీ:- 'జీవుడియిష్టము' కథలో కాపుస్త్రీ పాత్రను ప్రత్యేక ప్రతిభతో పోషించెను విశ్వనాథ. ఆమె నియంత చేతిలో చిక్కుకొనుట, మహమ్మదీయుల చేతిలో చిక్కి, ఆర్తనాద మొనర్చిన భారతస్త్రీ నిస్ఫురింప జేసెను. కాముకహృదయులై పశుప్రవృత్తితో ప్రవర్తించిన మహమ్మదీయుల పరిపాలన విధానమును "నీకు తగినమాట, నీ జాతికి జీవుని యిష్టము తెలియదు" యను మాటల వలన విదితమగు చున్నది.

2 సంధ్య:- సంధ్య [illegible] యామిని-ఆమె [illegible] ప్రవేశించినది. యామినితో పాటు, సన్యాసిని సంగారై నిందలు మోపినది. చివరకు దోషులుగ యామిని, సన్యాసిని శిక్షింపబడిరి నిష్కల్మష చిత్తముతో తన ధర్మమును నిర్వహించిన సంధ్య వెలుగు మెట్లెక్కినది.

శిరీషాదేవి:- "ప్రతీక్ష" కథలో నాయిక-శిరీషాదేవి కథలో అప్రత్యక్షముగా కన్పించదు. మధ్యలో లేఖద్వారా కన్పించును పూర్వ కథను తెలిసికొనుట కీ పాత్ర యుపయోగ కరమగు చున్నది.

విచ్ఛగత్తె:- రోధము కథకు కీలకపాత్ర-విచ్ఛగత్తె. ఆమె ప్రౌఢవయః, పరిపాక. ఆమె కాముక దృష్టితో విచ్ఛమియ్య నెంచిన యువకుని తిరస్కరించినది. అతని ధార్ష్ట్యము నంగీకరింప లేదు. విచ్ఛగత్తెలో సహితము' నీతి యుండునని చెప్పుటకు నీపాత్ర సృష్టి జరిగి యుండును.

**పురుషపాత్రలు:-**

1 రాధారాముడు:- [illegible] మనసు మారుటకు, నీలలోచనుని గూఢము తిరోధానమగుటకు కారకుడయ్యెను

2 చందిరనాథుడు:- చందిరనాథుడు. 'పరివర్తనము' కథయందు నాయకుడు. నిరంతర వ్యాపారశీలి. మనస్సునేదో ఆలోచించుచుండును. రాత్రియంతయు కుంచతో బొమ్మలు గీచి, ప్రొద్దున నొక దివ్యమగు చిత్తరువును గీయును. ఒకనాడతని చిత్తరువు

'ఈగ' యొకటి చెడిపివేసినది. ఆ సంఘటన చందిరనాధునిలో పరివర్తనమునకు కారణమైనది.

విశ్వనాథవారి కథలలో పురుష పాత్రలు, స్త్రీపాత్రలు సమానముగాయున్నవి. స్త్రీపాత్రలు స్వతంత్రతను వ్యక్తము చేయునట్లు, పురుష పాత్రలు గూడ స్వతంత్ర మనస్కులై యొప్పుచున్నవి.

సన్నివేశ చిత్రణ:- చిన్నకథకు సన్నివేశ చిత్రణ ఆయువుపట్టు. ఎట్లు? కథ పాఠక హృదయగత మగుటకు సన్నివేశ చిత్రణ యుపకరించును. కథలో సౌందర్యము, కథాగత సన్నివేశము, అందముగ చిత్రింపబడక పోయిన అయ్యది ప్రత్యక్షీకృతము కాదు. అనగా పాఠక హృదయ గతము కాదు. ఇది రెండు రకములు. 1. వస్తుగత సన్నివేశము. 2. పాత్రగత సన్నివేశము. పాత్రగత సని వేశ చిత్రణ-ఏమి సంబంధము కథలో నిక్షిప్తమై యున్నది. రచయితకు నాయికమగు అజ్ఞాత స్త్రీకి-మధ్య గల సంబంధమును గూర్చి రచింపబడిన కథ ఆమె మరణించినపుడు-రచయిత వాహకుడు. ఆర్ద్రమైన ఈ సన్నివేశము పాఠకుల హృదయములలో నిలచిపోవును. వస్తుగత సన్నివేశ చిత్రణ "యొ్యాం-హిహీఖెయ్" కథలో దాగి యున్నది.

"ఇటరి, ఇటరి
ఒత్తిడి పొండకోయ్
నెత్తురు ప్రక్కకోయ్
ఇటరి, ఇటరి."[1]

యను పాట-తరువాత హిహీఖెయ్ మరణమును ద్యోతకము చేయు చున్నది. ఈ విధముగ వస్తుగత సన్నివేశము 'యొ్యాంర్హిహీఖెయ్'యందు పాత్రగత సన్నివేశము, ఏమి సంబంధమువందు నెలకొని యున్నవి.

వర్ణనలు:- విశ్వనాథ వారు పాఠకులకు చెప్పదలచు కొన్నది కథద్వారా చెప్పకునన్నచో తృప్తి యుండదు. అందుచే వారు అచ్చటచ్చట వర్ణనలు ఎక్కువ వాడుదు వర్ణనల వలన కథాగమనమునకు ఆటంకము యుండదు. వీరి వర్ణనలు కథాగమన సూచకములు "ఆషాఢస్య ప్రథమ దివసమునందు మేఘము భాగ్యవంతుడయిన యతునికాక యందఱకు కనబడునా? అని జమిందారుని కొడుకు కథారంభ వర్ణన. ఇందు నాయిక పున్నమ్మ. భర్త రాజారావు నకై నిరీక్షించు చుండెను. మేఘము యక్షునికి కన్పించునుగాని, యితరులకు కన్పించదని యిచ్చటి వర్ణనార్థము. పున్నమ్మ యక్షిణి కాదని, మానవమాత్రురాలని, భర్త కొఱకు ప్రతీక్షించుట వలన ఫలితముసూన్యమని నీవర్ణన వలన ద్యోతకమగు చున్నది.

ప్రారంభము-ముగింపు:-

"భయానకం సుఖపరం గర్భేచకరుణోరసః
అద్భుతోంతే సుక్లృప్తార్థానోదాత్తాసాకథానిక"

అని అగ్నిపురాణమున కథానిక (చిన్న కథ) లక్షణములను గూర్చి నిరూపింపబడి యున్నది. ప్రారంభమున భయానకరసమును, మధ్యభాగమున కరుణరసమును, అంతమున అద్భుత రసమును గలది కథానిక (చిన్న కథ) యని యర్థము. కథా సరిత్సాగరము, కాశీ మజిలీ కథలు మొదలగునవి పైలక్షణములను గలవి. ఆధునిక కథలు పై మూడు లక్షణము

1. చిన్నకథలు-విశ్వనాథ సత్యనారాయణ. పుట-7

లతో పాటు ఉపోద్ఘాతము, సంఘటనలు, సామెతలు, సంభాషణలతో ప్రారంభమగుచున్నవి.

విశ్వనాథవారి కథలు ఉపోద్ఘాతముతోను, సామెతలతోను, ప్రకృతి వర్ణనలతోను ప్రారంభింప బడుచున్నవి పరిపూర్తి, కపర్ది కథలు - ఉపోద్ఘాతముతో ప్రారంభింపబడుచున్నవి. "దేవుడు వరమిచ్చిన పూజారి వరమియ్యడు" - అను సామెతతో దొరగారు - 'దివాన్జీ' కథ ప్రారంభింపబడినది. "సాయంవేళ ప్రశీతలమంద మరుత్తరంగములచే కృష్ణవేణికి ... " అని రోధము కథ ప్రారంభింపబడినది కథముగియునపుడు కొస మెరుపులు చూపుట విశ్వనాథవారి కథలందు మిక్కుటముగ యున్నవి. అందరు అనుకున్నట్లు ముగింపు జరిగిన, అందు ప్రత్యేకత యుండదు. కథ యింకను యున్నదని పాఠకుడు తలచినపుడు జరిగిన ముగింపు రచయిత ప్రత్యేకతను సూచించును. "కృష్ణాప్రవంతికి యానకట్ట పటలకు లంక చేర్చుచున్నది. ఆనకట్ట నిరుపయోగమగునేమో, కొన్నాళ్ళకు నిశ్చయము[1]. అని- రోధము కథ ముగింపు చమత్కారముగ, పాఠకుడు ఊహింపని విధముగ ముగింపబడినది.

నామౌచిత్యము:- విశ్వనాథవారి కథలన్నియు నొక ప్రత్యేకతను సంతరించుకొన్నవి. నామకరణమున వారి ప్రత్యేకత గోచరమగును. వారికథల నామములనుబట్టి ఐదువిధములుగ విభజించ వచ్చును.

1. ఇతివృత్తసూచకములు:- కథయొక్క యితివృత్తమంతయు, ఆకథయొక్క నామమునందు నిక్షిప్తమై యుండును. ఉదా:- తిరోధానము, జీవుడి యిష్టము, పరిశోధకులు మొదలగునవి.

2 పాత్రగతములు:- పాత్రల స్వభావమును ననుసరించి రచింపబడిన కథలు ఉదా:- ముగ్గురు బిచ్చగాళ్లు, సప్తాశ్వము మొదలగునవి.

3. ప్రతీకప్రాయములు (Symbolic) :- ఒకప్రతీకననుసరించి, అందుకొంత నీతిని పొదగి రచింపబడిన కథలు. ఉదా:- వెలుగు మెట్లు, రోధము.

4. నుడికారము:- ఒకసూక్తిని, సామెతను, నానుడిని, లోకోక్తిని, వీనియందు ఏదైన యొకదానిని స్ఫురించునట్లు రచింపబడిన కథలు.

5. సామాన్యములు:- సాధారణమగు నామములతో రచింపబడిన కథలు. ఉదా:- పుణ్యప్రేమము, పరిపూర్తి, ఇంకొక విధము.

ఈ విధముగ విశ్వనాథవారి చిన్న కథా నిర్మాణశిల్పము ఇతివృత్త నిర్మాణము, కథాకథనము, పాత్రచిత్రణ, సన్నివేశచిత్రణ, వర్ణనలు, ప్రారంభము, ముగింపు, నామౌచిత్యాదులను అంగములను గలిగి వికసించి యున్నది.

## ఉపయుక్త గ్రంథములు


1. విశ్వనాథవారి చిన్నకథలు.
2. పింగళి సూరన కథా నిర్మాణము వ్యాసము - డా॥ ఆర్. చంద్రశేఖర రెడ్డిగారు. సెప్టెంబరు - స్రవంతి - 1979
3. తెలుగు నవలా వికాసం — మొదలి నాగభూషణ శర్మగారు
4. శ్రీసాయిలీలామృతము — ఎక్కిరాల భరద్వాజగారు
5. జాగృతి - దీపావళి ప్రత్యేక సంచిక 1978


1. చిన్నకథలు - విశ్వనాథ సత్యనారాయణ పుట:- 234

# రామకృష్ణుని పదగుంఫన శిల్పం

డా॥ ఆర్. చంద్రశేఖర్ రెడ్డి, లెక్చరర్, తెలుగుశాఖ, పి.జి. సెంటర్, అనంతపురం

"అల్లసానివాని యల్లిక జిగిబిగి
ముక్కుతిమ్మనార్యు ముద్దు పలుకు
పాండురంగ విభుని పదగుంఫనంబును
కాకుమాను రాయనీకు దగుర"-

అన్నది పాంచాలీ పరిణయ వాక్యం. ఇందులో పాండురంగ మహాత్మ్యంలో రామకృష్ణుని పదగుంఫన వైభవం కీర్తింపబడింది. ఆ శిల్ప వైభవాన్ని దర్శించడానికి ముందు పదగుంఫనమంటే ఏమిటో చూద్దాం.

పదగుంఫనం- గుంఫనః శబ్దాన్ని కూర్పు అనే అర్థంలో ప్రాచీనులు వ్యవహరించారు.
గుఫ్-ధాతువునకు 'to string together' 'tie or string as a Garland' అని సంస్కృతాంగ్ల నిఘంటువు.

యత్ప్రీత్యైత త్వన్మృదు బాహువల్లీ
స్మృతిస్రజం గుమ్ఫతి దుర్వినీతా
నతోవిధత్తే ఒధికమేవతాపం

తేనస్రితా శైత్యగుణామ్మృథాశీ - అన్న నైషధశ్లోకం (8-82)లో గుంఫ శబ్దం క్రియా పదంగా ప్రయోగింపబడి 'కూర్చుట' అనే అర్థాన్నిస్తోంది.

'బహూనాం యుగపద్భావ భాజాం
గుంభస్సముచ్చయం'
'క్రమికైక గతానాంతు గుంభః
కారకదీపకమ్'

అన్న చంద్రాలోక వాక్యాలు (112, 114) 'గుంఫ' శబ్దానికి 'గుంభ' అన్న రూపాంతరాన్ని ఇస్తూ, కూర్పు అనే అర్థాన్నిస్తున్నాయి.

కాబట్టి 'గుంఫనం' అంటే కూర్పు, పొందిక కలయిక, ఘటన అని అర్థాలు చెప్పవచ్చు. ఈ గుంఫనం పదాలకు సంబంధించినది కాబట్టి పదగుంఫన మన్నమాట ఏర్పడింది.

పదగుంఫనం కావ్య రచనలో ప్రాథమిక విషయం. పునాది వంటిదిగూడ. కాబట్టి ప్రధానాంశం. ఈ పునాది లేకుండా కవి కావ్యభవనాన్ని నిర్మించలేడు. కనుక పదగుంఫనం కావ్య నిర్మాణ సాధనాలలో అతిముఖ్యమైనది. పంచామృతంలో తేనె వంటిది. ఒక భావాన్ని వ్యక్తం చెయ్యడానికి అనేక పదాలుండగా, ఏదో ఒక ప్రత్యేక పదాన్ని ఎన్నుకోవడం, దీర్ఘపదాన్ని సంక్షిప్తం చెయ్యడం. హ్రస్వపదాన్ని దీర్ఘీకరించడం, చిన్న పదానికి ముందు కొన్ని విశేషణాలు కలపడం. సంస్కృత రూపాన్ని తెలుగు చేయడం, తెలుగు రూపాన్ని సంస్కృతీకరించడం, పదరూపాన్ని అధునాతనం చేయడం ప్రజావ్యవహారం లోని జాతీయాలను పలుకుబడులను, లోకోక్తులను సమీకరించుకోవడం ఇలా పదాలను ఎన్నుకొని ఏ పదాన్ని ఎక్కడ వెయ్యాలి - యతిస్థానం, పద్యం ఎత్తుగడ ముగింపు మొ... ఏ పదం ప్రక్కన ఏ పదాన్ని వెయ్యాలి, పదాన్ని విరచడం, కాకు ప్రధానం

చెయ్యడం, వాక్యాన్ని పొడిగించడం, బిగించడం, ఏక బహు వచన, క్రియా, నామ వాచకాదుల ప్రయోగాలు-ఈమొదలైన విషయాలన్నీ కూర్పునకు సంబంధించినవి. ఈ లక్షణాలన్నీ కావ్యంలో పటిష్టంగా ఉంటే కవితావిద్య తళ తళలాడుతుంది.

పదగుంఫనశిల్పం:- పదాలను కూర్చడంలో కవి చూపిన నేర్పు అని ఈ మాట కర్థం. 'చేయితిరిగినతనం' అనే మాట ఉంది. ఒక పనిలో సంపూర్ణత్వం సౌందర్యం భాసిస్తూన్నప్పుడు అది మనహృదయానికి పట్టినపుడు ఇందులో చేయితిరిగినతనం ఉంది అంటాం. దాన్నే పనితనం అని, ఆపని చేసిన వ్యక్తిని 'అందెవేసినచేయి' అని అంటాం. ఆ చేయితిరిగినతనమే, పనితనమే శిల్పం. 'అందెవేసిన చేయి'యే శిల్పి. పదగుంఫనశిల్పం అంటే పదాలను ప్రయోగించడంలో కవిపాడిన పాటన్నమాట పదాలను ఎన్నుకోవడం, ఎనుకొన్న వాటికి సముచిత రూపం కల్పించడం, కల్పించినవాటిని సముచితస్థానంలో ప్రయోగించడం-ఇవి పదగుంఫనంలో కవి చేసే ప్రయత్నాలు. ఈ ప్రయత్నం శిల్పం. ఇది సిద్ధిస్తే కవి శిల్పి.

కావ్యం అనంతముఖశిల్ప భూయిష్టమైన ఆలయం. పదగుంఫనశిల్పం ప్రథమ గోపురం దేవాలయానికి గోపురం తిలకాయమానం. కావ్యానికి పదగుంఫనం రమణీయతాపాదకం. పదగుంఫనవిద్య శిల్పమయం కావాలంటే, పదాల కూర్పు అర్థవంతం కావాలి. సూత్రానికి వివిధ రకాల పూసలను ఉచితరీతిలో కూర్చినట్లుగా, విభిన్నపదాలను అందంగా కూర్చాలి.

'పొసగము త్రపుసరుల్ పోహళించినలీల
దమలోన దారయు శబ్దములగూర్చ' వలెనని
'శబ్ద సంస్కార మెచ్చట జాలగనీక
పదమైత్రి యర్థసంపదల బొదల' వలెనని పింగళి సూరన సిద్ధాంతం. ఒక పదము చక్కగా ప్రయోగింప బడినట్టిది, ఎఱుంగబడినట్టిది కామదేనువగును అన్న పదార్థాక కావ్యంలో పదగుంఫన ప్రాముఖ్యాన్ని వెల్లడిస్తోంది. ఒక్క అందమైన పదాన్ని మనోజ్ఞంగా ప్రయోగిస్తే పది అలంకారాలు సాధించలేని చమత్కారాన్ని, వక్రోక్తిని సాధిస్తుంది. అది పదగుంఫన శిల్పం.

**పదగుంఫన శిల్ప వైవిధ్యం:**

ఒక పదం పాత్రయొక్క స్వరూపస్వభావాల్ని వ్యాఖ్యానిస్తుంది. ఇంకొకపదం కథాగమనాన్ని పూర్వాపరాల్ని గుర్తుచేస్తుంది. మరొకపదం రసాన్ని సృజిస్తుంది. మరింకొక పదం పదాని హాయువుగా చేస్తుంది. ఈ పదాలన్నీ కవిని పదగుంఫనశిల్పిని చేస్తాయి. కాని, ఒక్కోపదం ఒక్కొక్క ప్రయోజనాన్నే కలిగించదు. మహాకవి ఒక పదాన్ని ప్రయోగించి ఈ అన్ని ప్రయోజనాలను సాధిస్తాడు. రామకృష్ణుడట్టి మహాకవి.

**రామకృష్ణుడు :**

ప్రబంధయుగం తెలుగు కవిత్వ ఉద్యానవనానికి వసంతఋతువు. రామకృష్ణుడు పూవిలుకాడు, అతని పదంగుంఫనం 'నవవికసిత పుష్ప గుచ్ఛం' ఆంధ్ర సరస్వతికి అతడు అనన్వయాలంకారం. ప్రబంధ కవులామెకు సమర్పించిన కావ్యమాలలో పాండురంగ మాహాత్మ్యం కౌస్తుభం. అతడు సరసార్థబోధఘటనాపాటవ పరిష్కారుడని, శారదాస్వరూపుడని విరూరి వేదాద్రి మంత్రి తీర్పు. అతడు రామకృష్ణునికి ఇతి వృత్తాన్ని సూచిస్తూ

'స్కంద పురాణ నీరనిధి కౌస్తుభమై ప్రభవించు
దేవకీ

నందను సత్కథోద్యమము నవ్య కవిత్వ కళా
కలాపమున్
కుందనమున్ మటించి కడు గ్రొత్తగు
సొమ్మొనరించి విష్ణు సే
వం దులకించు సిప్పరను వైష్ణవకోటి నలంక
రింపుమా - అన్నాడు

ఇక్కడ ఘటన అంటే - గుంఫనం దాని ఫలితం 'కడు గ్రొత్తగు సొమ్మొనరించ'డం అంటే శిల్పించడం. కవి స్వర్ణకారుడు ఏకస్థానీయులు. ఇద్దరి పని చెక్కడమే ఒకరు శబ్దాలతో, ఇంకొకరు ఉలితో ఆభరణానికి పూజలు నొక్కులు చెక్కడం స్వర్ణకారుని పని. పదాలను అందంగా సులచుకోవడం కవిపని ఈ పనిలో రామకృష్ణుడు అందె వేసిన చేయి. ఆయన పద గుంఫనంలోని వైవిధ్యాన్ని పరిశీలిద్దాం.

పదగుంఫనం - కథావ్యాప్తి:- పాండురంగ మాహాత్మ్య కావ్యంలో నిగమ శర్మ కథ గుండె కాయ - అది మూడో అశ్వాసంలో ఉంది. ఆ కథ పరమేశ్వరుడు నారద మహర్షికిచెప్పాడు. నిగమశర్మ వల్లి దండ్రులిన్నిగూర్చి చెప్పి, నిగమ శర్మను పరిచయం చేస్తూ -

తే. గీ. 'అతడనూచాన సంతతి నవతరిలియు -
సకల నిగమశిఖా రహస్యములు గనియు
మనసుందార్తీయ పురుషార్థమునకెతార్చి
దైవ ఘటనా వశంబున నో వశీంద్ర'

అన్నాడు 'వశీంద్ర అన్నది నారదుణ్ణి గూర్చిన సంబోధన అయినా, అమాట నిగమశర్మ కథా తత్వాన్ని వ్యతిరేక ముఖముగా వ్యంజిస్తూంది. వశము చేసికొనిన ఇంద్రియములు కలవాడాఅని అమాట అర్థం. నిగమశర్మ ఇంద్రియాలను అదుపుచడంలేపోయి, :మ్మానసేంద్రియాన్ని కామ్యూ నికి తార్చి పతనమైనాడు కాబట్టి వశీంద్ర ! అని నారదుణ్ణి పిలవడంవల్ల, ఆ కథాతత్వాన్ని సూచించడం ఇక్కడ ప్రధానోద్దేశ్యం. దానికి 'తృతీయ'ను 'తార్తీయ' చేయడం, 'తార్చె' అనే మాటలను ప్రయోగించడం ఉపబలకాలు.

పరార్రైపోయి ఇంటికి తిరిగివచ్చిన నిగమ శర్మకు సంతుష్టికరమైన భోజనంపెట్టిన అతని అక్క.

క. 'ఇంతలు నంతలు పగుతన

సంతానము చంటవెంట సందడి సేయన్' వచ్చి అతని ప్రాంతంలో నిల్చినదట. ఇక్కడ జంటపదగుంఫనంద్వారాసన్ని వేశాన్ని చమత్కారంగా ప్రత్యక్ష కల్పం చేస్తున్నాడు కవి. 'ఇంతలు', 'అంతలు' అన్న మాటలు ఆమెపిల్లల వయోభేదాన్ని, పరిమాణ భేదాన్ని చెబుతున్నాయి. ఇంత (చిన్న) యిన సంతానం 'చంట'ను, అంత(పెద్ద) అయిన సంతానం 'వెంట'ను ఉన్నారని అర్థం. వారు చంట వెంట చేరి ఊరకే ఉండక, సందడి చేస్తున్నారనడంతోసన్ని వేశానికి చైతన్య లక్షణం సిద్ధించింది. పిల్లల వయోభేదాన్ని, వాళ్లు అలంకరించినస్థానాలను వాళ్ళు చేస్తున్న పనిని తదనుకూల పదాలను కూర్చడంద్వారా కవిసన్ని వేశాన్ని శిల్పమయం చేశాడు.

నిగమశర్మ అక్క అతనికి వంటచేసి, తల స్నానం చేయించి, అన్నం వడ్డించి, తలవెంట్రుకలను దువ్వి, పేన్లు కుక్కి, మరల జుట్టు ముడివేసి, అతని మెడమీద మన్ను తుడిచి, చేతులు కడుక్కొని వచ్చింది. ఇది కొంతకాలం పట్టేసన్ని వేశం. కాని ఆమె ఆ పనులన్నీ ఏకధాటిగ్గా చేసింది. ఆ ఏకధాటి లక్షణాన్ని కవిఎలా చెప్పాలి. వంటచేసెను, వడ్డించెను - అని అంటే

ఏ పనికి ఆ పనిగా తయారయి సన్నివేశం శిథిలాభూతమౌతుంది. ఆ సన్నివేశం సుశ్లిష్ట సంధిబంధం కావాలి. ఆ బంధాన్ని సాధించడం కోసం రామకృష్ణుడు అక్కడున్న పద్యాలన్నిటినీ క్త్వార్థక క్రియలతో ముగించి, ఏకవాక్యతను సంతరించాడు.

అగస్త్యుడు ఉత్తరభారతం నుండి, దక్షిణానికి వచ్చి, వింధ్యను గర్వభంగం చేసి. దక్షిణాపథం లోని పుణ్యక్షేత్రాల్ని తిలకిస్తూ, విశేషాలను లోపాముద్రకు వివరిస్తుంటాడు. ఆసమయంలో కవి అగస్త్యునికి ఉద్దండ 'వింధ్యాద్రి నిర్బంధ బాంధవుండు (1-129) వింధ్యాహార్య స్తంభయిత (1-137) వింధ్యాద్రి స్తంభయిత (1-148) వంటి విశేషణాలను చేస్తుంటాడు. అలాగా ఆ విశేషణాలను గుంఫించడంద్వారా, కవి అగస్త్యుని దక్షిణాపథగమన రహస్యం వింధ్యాగర్వ భంగమే అని సూచించడం, తత్ప్రధాన ఘట్టాన్ని ఉపకథల్లోకూడా స్మరించడం ఆకథాప్రాధాన్యాన్ని గుర్తుచేయడం.

రామకృష్ణుడు అటువంటి విశేషణాలతోనే కుమారస్వామి కథను చిత్రీకరించాడు కేకిధ్వజుడు (1-149), పురభిత్తనయుడు (1-153), గుహుడు (1-157), బ్రహ్మగర్భుడు (1-160), శితికంఠసుతుడు (1-163), మహాసేనుడు (1-172), సుబ్రహ్మణ్యుడు (1-167), తారకవైరి(1-179), ఆఱుమోములవాలుడు(1-200) మొదలయినవిశేషణాలు వేశాడు. ఈవిశేషణాలు వేసినచోట పెద్ద ప్రయోజనం కలుగకపోవచ్చు గాని, వీటన్నిటినీ ఒకచోట చేర్చి చూస్తేమహా ప్రయోజనమే కలుగుతుంది.

ఇలాగా రామకృష్ణుడు సమర్థవంతము లయిన పదాలను ఆయా స్థలాల్లో కూర్చి కథాకథనాన్ని నిర్వహించాడు.

**పదగుంఫనం పాత్రదృష్టి :**

రామకృష్ణుడు పరమ ఔచితీబ్రహ్మ పాత్రల స్వరూప స్వభావాలను తదుచిత పదగుంఫనం ద్వారా సాధించిన శిల్పి. నిగమశర్మను అడవిదొంగలు కొట్టి, ధనం లాక్కొనిపోగా, ఒక కాపు అతన్ని కాపాడి తన ఇంటికి తీసుకొనిపోయాడు. ఆ ఊర్లో ఒకసారి గంగజాతర జరుగుతుంది. ఆ కాపులు శ్రమజీవులు వ్యవసాయదారులు. బయటి ప్రపంచంతో అంతగా సంబంధం లేనివారు. పీఠికాపురానికి, ఆఊరికి మధ్య 'ఘోరాటవి' ఉంది ఆ కాపులు జాతరకు అలంకరించుకొని శక్త్యాలయానికి వెళ్ళారు ఎలాగా -

'ఎడ్డెతనపు గయిసేతల
దడ్డులునడచిరి పురస్సరద్వార్గంబుగా'
[3-75]

ఆ కాపుల మోటుతనాన్ని 'ఎడ్డెతనము', 'దడ్డులు' అన్న పదాలద్వారా ప్రదర్శించాడు. ఆ కాపులు పశుబలి ఇవ్వడాన్ని కూడా 'బత్తులునునువాకతుల మొత్తిరి పశుసమజ ముండములు' అని పేర్కొన్నాడు. పశువుల తలలను నరికిరనో, ఖండించిరనో అనకుండా 'మొత్తిరి' అనడం ఇక్కడ చమత్కారం. మంచి పదను కలిగిన కత్తిని తీసికొని, కళ్ళుమూసుకొని బలమంతా ఉపయోగించి ఒక్క దెబ్బకి ఆ పశువుల తల ఎగిరి క్రిందపడేట్టు నరికితే అది మొత్తడం అవుతుంది. ద్విత్తతకారయుత పదత్రయాన్ని ఆ విధంగా కూర్చి ఆ పాత్రల మోటుతనాన్ని మనోజ్ఞంగా చిత్రించాడు కవి

నిగమశర్మను రక్షించిన కాపు ఇంటికోడలు ఈకథలో ప్రముఖ పాత్ర వహించింది. ఆమె

స్వరూపస్వభావలను కవి ఒక ఒక్క మాటతో ప్రత్యక్షీకరించాడు.

కం కలదాశూద్రవసతి శశి
కలదాననజాలు నొకవికారపు గోడల్
[3-60]

ఆమెశారీరకంగాసౌందర్యవతి మానసికంగా వికారి. శారీరకసౌందర్యానికి, మానసిక వికారానికి ఉన్న అవినా భావసంబంధాన్ని నిరూపిస్తుంది, ఈ పాత్ర మానసిక వికారంగల స్త్రీని 'వికారపుగోడల్' అని అనడం చాలా సొగసుగా ఉంది. దానికిముందు 'ఒక' అన్నమాట "మా ఊళ్ళో ఒక వెధవ ఉన్నా" డన్న ప్రజా వాక్యాన్ని తలపిస్తుంది. ఆమెమీద వక్తకు ఉన్న తేలిక భావం తెలుస్తూంది మానసిక వికారి అంటే, ఆమెచేష్టలు మంచివికావు ఆమె మనస్సు పలుపిధాలుగా పోతుంది. చేష్టలలో ఉన్న దౌష్ట్యంచేత ఆమె "దుర్లలితాతను విలసను" మనసులో ఉన్న దౌష్ట్యంచేత "నిర్లజ్జస్వాంత" అన్నాడు. ఆమె తనువులలితంగా ఉందిగాని, ఆ తనువుయొక్క విలసనమాత్రం దుర్లలితంగా ఉందట. నిర్లాలిత్యంకన్న, దుర్లాలిత్యం అసహ్యం. అటువంటి ఆమెమోహం 'వీర్లయి పారిం'దట. బంగారముక్కల్లాంటి ఈ మాటలతో ఆ కోడలి వికారాన్నంతటినీ మూసపోశాడు రామకృష్ణుడు.

## పదగుంఫనం – రసదృష్టి

శృంగారం. కరుణ, హాస్యం, శాంతం, భక్తి రసాలు, సుకుమారాలు, ఆ రసాభివ్యక్తి తదనుగుణంగా ఉండాలి

అగస్త్యుడు కుమారస్వామిని స్తుతించాడు. స్తుతివాగ్రూపం. ఆ వాక్కు సుకుమారంగా ఉండాలి. రచనిమస్మణం, పేశలంకావాలి-ఒక ఋషి చేసే స్తుతికాబట్టి హిరణ్యాకశిపుని స్తుతి సుకుమారంగా ఉండదుగదా. అంటే ప్రార్థయిత స్వభావాన్నిబట్టి స్తుతి స్వభావం మారుతుం దన్న మాట. అగస్త్యుడు కుమారస్వామిని మధురంగా స్తుతించాడు ఆమాధుర్యాన్ని ఎలా చెప్పాలి? రామకృష్ణుడు –

'కలసుతుండు బలుకుల
మొలకలుపుష్పోపహారములచెలు వొసగన్'
[1-144] నుతించెనన్నాడు.

పుష్పాల్ని ఉపహారంగా చేసి పూజిస్తే ఎంత అందంగా ఉంటుందో అంత అందాన్ని అగస్త్యుడు తన పలుకులతో సాధించాడట? ఎందువల్ల? అని పలుకులు మొలకయిమొలకసౌకుమార్యానికి, మాధుర్యానికి నిదానం. పుష్పం సుకుమారం-మొలకసుకుమారం ఎంత మధురమైన వాక్కులైతే ఆ సౌకుమార్యం సిద్ధిస్తుంది ఆ మధురమైన వాక్కులు పలికిన అగస్త్యుడు హృదయార్ద్రిత భక్తి, పరమమధురం, సుకుమారం.

కాపుకోడలు నిగమశర్మను కామించింది. ఆ కామాన్ని ఆమె చేష్టలద్వారా వ్యక్తం చేసింది. ఒక్క చేష్టనుచూస్తే - రామకృష్ణుని శృంగార రస నిర్వహణకు పదాలు ఎంత దాస్యం చేశాయో తెలుస్తుంది. ఆమె -

'పిరాలిపట్టి బిట్టెత్తి చెక్కిలి నొవ్వగఅచి
వాడేడ్చిన గౌగిలించు'నట.

నిగమశర్మ చిన్నారిపొన్నారి వయసువాడు వాణ్ణి చూడగానే ఈమె వెకలి అయింది. ఆ వెకలితనాన్ని తనతోడికోడలు బిడ్డను పైకెత్తి చెక్కిలి నొప్పిపుట్టేటట్టు కరచి, వాడేడిస్తే కౌగలించుకొనడంద్వారా వ్యక్తంచేసింది.ఆమె

అరణ్యప్రాంత నివాసి, ఆ చేష్టలుకూడ అలాగే ఉండాలి. ఆమె మొరటుగా ప్రవర్తించడమే సౌకుమార్యం. తదనుకూలపదాలను ప్రయోగించడం అక్కడ పదగుంఫన శిల్పం. అందుకు రామకృష్ణకవి 'బిట్టెత్తు', 'చెక్కిలొవ్వగఅను అన్న రెండుపదాలను ప్రయోగించి ఆ తల్లీ బిడ్డల శిల్పాన్ని చెక్కాడు

**పదగుంఫనం - పద్యరచనాదృష్ట**

పద్య విద్య తెలుగువారిసొత్తు. అది వారి తపఃఫలం. నన్నయ తిక్కనాదులటుండగా. ప్రబంధకవులు పద్యరచనకు ఎక్కువప్రాముఖ్య మిచ్చారు. రాయలు, పెద్దన, తిమ్మన, ధూర్జటి, రామకృష్ణుడు, రామరాజభూషణుడు పద్య రచనలో ప్రముఖులు. వారిలో ఎవరిదారి వారిది 'పాండురంగసుకవి పద్యంబుహరువు'చాటూక్తి. 'హరువు' అంటే మనోజ్ఞం, సౌందర్యం, ఈ మనోజ్ఞతను సంపాదించడానికి పదగుంఫనం సాధనం. పద్యరచనలో మనోజ్ఞత అనేకరకాలుగా సిద్ధిస్తుంది. గాఢపదబంధం [సుదీర్ఘ సమాసరచన] శిథిలబంధం [పొడిపొడిపలుకుల కూడిక] అన్నవి రెండు ప్రధానమార్గాలు. శిథిలబంధంలో కవి ఒకటి రెండు ముఖ్యమైన మాటల్ని వేసి శిల్పాన్ని చేస్తాడు. పద్య నిర్మాణమంతా చేయగల పనిని ఆ ఒకటి రెండుమాటలే చేస్తాయి. ఆ మాటలు తీసేస్తే ఆ పద్యం అంగహీనం అవుతుంది.

ఇష్టములైన వంటకములిట్లు భుజించి,
యతండు భార్య సంతుష్ట మనస్కుడై తనదు
దొయ్యలి వాద్యముచుట్టి యీ మహాశిష్టుడు
జోతి దిన్నెపయి చిర్నగవొప్పగ గూరుచున్నచో
దృష్టి సమస్త మంగదిపి పృచ్ఛి తదగ్రజపూర్ణ
చిత్తయై

పకరాసపాట్లు పడిపట్టి చేతులతో 'చక్ర తెగిపడిన పడువున' ఒకనాడు ఇంటికి వచ్చిన నిగమశర్మకు అతని అక్క సకల సపర్యలుచేసినది. అతడు తల్లిదండ్రులతో, బావతో కలిసి భోంచేసి, తిన్నెమీద కూర్చొని, భార్య తాంబూలం ఇవ్వగా, మహా వినయవంతుడు వలె చిరునవ్వులు చిందిస్తూ ఉన్నాడు. ఈ పద్యంలో 'తొయ్యాలి', 'చిర్నగువు' అన్న రెండు మాటలు పద్యాన్ని శిల్పించినాయి. 'తొయ్యలి' అన్నది స్త్రీని సంబోధించే పదం. స్త్రీకి 140కి పైగా విశేషాలున్నట్లు గుర్తు. రామకృష్ణుడు ఈ పదాన్ని స్వీకరించడం అతని పదగుంఫన శిల్పంలో చిటారుకొమ్మ. నిగమశర్మ భార్య 'అనివార్య జృంభణంబగు యౌవనారంభ' భర్త లేని లోటు ననుభవిస్తూ, బయటికి పొక్కనీకుండా ఉంది. ఆమెను "తొయ్యలి" అన్నాడు కవి. తొయ్/తయ్ అంటే

అని ద్రావిడ భాషావ్యుత్పత్తి పదకోశం (డి ఇ.డి). అంటే లేతయిన అందమైన తీగ స్త్రీని లతాంగి, అనడం కవి సాంప్రదాయం. అది కూడా స్త్రీ సౌందర్యాన్ని వ్యంజించేదే. కాని రామకృష్ణుడు "తొయ్యలి" పదంవాడి ధ్వనినే ధ్వనించాడని చెప్పవచ్చు. నిగమశర్మ భార్య అంతరంగంలో విరహానలబాధిత. పైకి సంతోషాన్ని వ్యక్తం చేస్తూంది. ఆ యుక్త వయస్వి సౌందర్యవతి. ఇదంతా తొయ్యలి శబ్దం వెనుక నుండి తొంగిచూస్తూంది. దానినే విశేషు వక్రత అని కుంతకుడన్నది

విశేషణస్య మాహాత్మ్యాత్ క్రియాయాః
కారకస్యవా
యత్రోల్లసతి లావణ్యం సావిశేషణ
వక్రతా (2-15)

ఇందలి చమత్కారం విచార్యమాణరను జేయం. అది శబ్దార్థగతం నిగమశర్మ మహాశిష్టుడు. బోలె కూర్చున్నాడట. "పోలె" అన్న ఉపమావాచక ప్రయోగం చమత్కారం. 'మహా' శబ్దాన్ని ద్వితీయ పాదాంతంలో వేసి అక్కడ పదాన్ని విరిచి, శిష్టశబ్దాన్ని తృతీయ పాదాదిలో వేసి, వాని అశిష్టతను ధ్వనించాడు కవి. భార్య వీడ్యం చుట్టి ఇవ్వగా వాడు, తిన్నె మీద కూర్చున్నవాడు. ఒక్కసారి చిన్నగా నవ్వుకున్నాడు. దాన్ని 'చిర్నగవు' అన్నాడు కవి. 'చిరునగవు' అనేపదాన్ని సంక్షిప్తంచేసి 'చిర్నగవు' అని రూపించి, వాడి నవ్వు అని సూచిస్తున్నాడు. మనసులో నవ్వుకున్నాడు - అనే మాట ఉంది. దానికి మారుపేరు చిర్నగువు. వాడి భార్య అమాయకతను చూచి వాడు అలా చేశాడన్నమాట-"తొయ్యలి చిర్నగవు" అన్నమాటలు యతిస్థానంలో వెయ్యడం "మహాశిష్ట" పదాన్ని విరవడం, 'ష్ట' ప్రాస ప్రయోగం-ఇవన్నీ కలిసి పద్యాన్ని శిల్పం చేశాయి.

పద్యమంతా ఒక రకమయిన విషయం చెబుతూపోయి, పద్యాంతంలో తద్వ్యతిరిక్తమయిన ఒక్కమాటవేసి. పై విషయమంతా బూటకమన్న భావాన్ని హఠాత్తుగా కల్గించడం ఇతని పద్య రచనలో ఒక విధానం. నిగమశర్మ "మహాశిష్టుడు వోలె" ప్రవర్తించడాన్ని "రాజాలయమ్మునకు రాకపోకలు సేయు" అనే పద్యంతో చెప్పాడు సీసం నాలుగుపాదులు, ఎత్తుగీతిలోని మూడుపాదాలు వాడి సత్కర్మలే ఆక్రమించాయి. ఎత్తుగీతి చివరి పాదంలో "తేనె పూసిన కత్తి ధాత్రీశ్వరుండు" అని ఒక్క విశేషణ వేశాడు. దాంతో పద్యంలోని విషయమంతా తలక్రిందు లయింది.

పద్యమంతా ఎవో విశేషాలు చెప్పుకుంటూ పోయి, చివర్లో ఆ విశేషాలన్నింటినీ నూత్రీకరిస్తునట్లు-ఒక్క పదాన్ని వెయ్యడం ఇంకొక పద్ధతి.

"కలదు లేదను వాదముల కోర్చి మీసుమీ
సమువంటి యొంటిజందెము మెఱవగ"

అన్నపద్యంలో వాడి భోగలాలసనువర్ణిస్తూ, చిట్టచివర "జాతి మాత్రోపజీవి" అన్నాడు. అట్లే "ఉపానిహోమాగ్నియూద నొల్లడు గాని విరహాజ్వరార్తితో వెచ్చనూర్చు" అన్న పద్యం చివర.

"ఆదుర్వి హోరహోరి" అన్న పదం వేశాడు. చిత్రకారుడు బొమ్మనువేయడం పూర్తిచేసి ఎక్కడో ఒక్కచోట కుంచెను ఒక్కసారి అలా విసరుతాడట.

రామకృష్ణుడు ఈ విధంగా పదాలను యతిస్థానంలో, పద్యాంతంలో, వెయ్యడం ఆ విసుర్లు. అవి లేకపోతే ఆ పద్యం హారువు కాదు. అతని గాఢ పదబంధ రచనకు -

"ఉత్తాలఫణిభుగ్గరుత్తాలవృంతా నిలాచాంత ఘర్మాంబువయ్యో మేను" (3-110)

"కఠిన కంఠీరవాహత నఖక్షత జరత్కరి శిరశ్శుక్తి శార్కరిలతలము (3-83)

మొదలైన పద్యాలు. గాఢశిథిల పదబంధ సమ్మిశ్రణ పద్ధతికి -

"గతిమధ్యాస్తన కుంతలస్త బకవీణాగర్వ దుర్వార" (3-84)-మొదలైన పద్యా లుదాహారణము

అతని కొన్ని స కుమా సమాసాలను చూస్తే నోట్లో నీళ్ళూరుతాయి. పచ్చి తేనె, పనస గొబ్బండ్ల వేసము (1-118) ముదురు వెన్నెల (2-112). ఆయన వికట పదబంధం చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. "సన్నని నడుము గలది' అనడానికి అందరు "తనుమధ్య" అని: "సింహ మధ్య" అని అంటుంటే, ఈయన "పరమాణు విభవమధ్య (2-115) అంటాడు "చంద్రముఖి" అనడానికి చంద్రార్థనిటల" 2-116) అంటాడు సరస్వతిని "మినకు జేడియ" అనీ, అగస్త్యుని "చుళికితపోథోధి"అని గొల్ల పడచును "పసిగాపు పూపవయసాకే' అని అంటాడు. అతని పద హ్రస్వదీర్ఘ కరణలను చూస్తే మనస్సు కూడ సంకోచవ్యాకోచాలను పొందుతుంది. "కను గొనక ఉనికి" అనడానికి "కన్గొకున్కి" అని "అర్థరాత్రి దాక" అనడానికి "అద్దమ రెయి దాక" అని అంటాడు. ఇదంతా పదౌచిత్యమే గదా అని అనిపించవచ్చు. కాని రామకృష్ణుని పదాలు సాధించే అందాన్ని నిర్వచించడానికి పదౌచిత్యం అన్న మాట చాలదు తేలిపో తుంది. ఆపదగుంఫనం శిల్పమే.

పొద్దున్నే ఆవిసెచెట్టును ఊపితే రాలుతున్న ఆవిసె పూలలాగా ఉంటుంది. రామకృష్ణుడుపద గుంఫనం అన్న సహృదయవ్యాఖ్య రామకృష్ణునిలోని పదగుంఫన శిల్పికి అద్దం పట్టుతున్నది. సరస్వతిని "పలుకుం దొయ్యలి" అన్న రామకృష్ణుని పదగుంఫన శిల్ప రామణీయకత అనన్యం. అతడు పదాలకు వేదభూమి.

---

# చందాదారులకు వినతి

"నవభారతి" కి అన్నివిధాలా సహాయ సహకారములు అందిస్తున్నటువంటి పాఠకులకు, రచయితలకు, అభిమానులకు కృతజ్ఞతను తెలియచేస్తున్నాము. ఇంతవరకు తమ తమ చందాలను పంపుటకు వీలుగానివారు వెంటనే పంపించవలసినదిగాను, చందాదారులుగా ఉన్నటువంటివారు తమ సభ్యత్వమును పునరుద్ధరించి యథాతథంగా తమ సహాయము సహకారము ఇచ్చి అన్నివిధాల తోడ్పడవలసినదిగా విజ్ఞప్తి చేస్తున్నాము.

—మేనేజరు

# దాసు శ్రీరామకవి దేవీ భాగవతము

డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం

భారతీయ ప్రాచీన సాహిత్య ప్రక్రియలలో అత్యంత ప్రజాదరణమును చూరగొనినది పురాణ ప్రక్రియ. దానికి పంచలక్షణములు ప్రాథమిక లక్షణములు కాగ, దశాధిక లక్షణములు ప్రక్రియావ్యాప్తిని సూచించునవి. పురాణవాఙ్మయమునకు ప్రతిష్ఠ తెచ్చినవి మహాపురాణములు. అవి పదునెనిమిది యని ప్రసిద్ధి. వాని యందు దేవీభాగవత మొకటి యని కొందరు, శ్రీమద్భాగవత మొకటి యని మరి కొందరు భావించుచున్నారు. ఈరెండు భాగవతముల ప్రాచీనత్వ నిర్ణయమునందును వాదోపవాదములు కలవు. దేవీభాగవతము అష్టాదశ మహాపురాణముల నామాద్యక్షరములను కూటములుగా పేర్చి సూత్రప్రాయమైన యొక శ్లోకము ప్రతిపాదించినది.

"'మ'ద్వయం, 'భ'ద్వయం చైవ 'బ్ర'త్రయం
'వ' చతుష్టయం
'అ' 'నా' 'ప' 'లిం' 'గ' 'కూ' 'స్కా'ని
పురాణాని పృథక్ పృథక్",

ఇందు 'భ'ద్వయ మనగా భాగవతపురాణ మనియు, భవిష్యపురాణ మనియు తెలియనగుచున్నది. భాగవత మనగా దేవీభాగవత మని యొకమతము; శ్రీమద్భాగవత మని మరియొకమతము. పండితులయభిమతము లెట్లున్నను రెండు భాగవతము లుండుట మన యదృష్టము. వానియం దొకదానిని మహాపురాణము కాదని మరి యన్నను దానికి వచ్చు లోప మేమియు లేదు. కాని, మనము స్మరింపు నొంటి తన్నుచూచి మాత్రము లోకమునకు తెలియును.

దేవీభాగవతము శక్తితత్త్వమును వ్యాఖ్యానించునది. శ్రీమద్భాగవతము భక్తితత్త్వమును ప్రపంచించునది. శక్తిని సాధించినచో భక్తి యలవడును, భక్తి వలన ముక్తి కరతలామలక మగును. ముముక్షువులకీ సోపానపంక్తి నందించుటకై వెలసిన దీభాగవతద్వయము. వీనిగొప్పతనములనుగూర్చి గొడవలు పడుటకంటె అధ్యయనమార్గము నెరిగి ఆరాధించుట మనకు శ్రేయస్కరము

దైవప్రాధాన్యమునుబట్టి మహాపురాణములను మూడు విధములుగా వర్గీకరింపవచ్చును. మొదటి వర్గము వైదికదైవములను కీర్తించునది; రెండవ వర్గము విష్ణుమహాత్మ్యమును ప్రతిపాదించునది; మూడవ వర్గము శైవమహత్వమును కొనియాడునది వీనియందవతారతత్త్వమును చెప్పెడివి వైష్ణవములు. దుష్టశిక్షణమునకును, శిష్టరక్షణమునకును ఆయాయుగములందు విష్ణువెత్తెడి అవతార విశేషములనుగూర్చి చెప్పుచు భగవత్తత్త్వమును, భక్తిమార్గమును బోధించుటకు శ్రీమద్భాగవతాదు లవతరించినవి. ఇక శక్తితత్త్వము నామూలాగ్రముగ నభివ్యక్తీకరించు పురాణము దేవీభాగవతము. ఆపురాణకథకు బీజభూతమైన దుర్గాసప్తశతిని ప్రసాదించిన ప్రతిష్ఠ మార్కండేయమునకు దక్కుచున్నది. శైవవైష్ణవ పురాణములలో దుష్టశిక్షణ గావించు ప్రవృత్తి పురుషదైవతములందు ప్రవర్తిల్లుచుండగా దేవీభాగవత మాప్రవృత్తిని శక్తియందు ప్రతిష్ఠాపించుచున్నది. అందువలన పురాణములలో నొక ప్రత్యేక ప్రతిపత్తిని సంతరించుకొనుచున్నది.

సగుణ నిర్గుణోపాసనలు సాధకలోకమున ప్రసిద్ధములు. సగుణము సాధనము; నిర్గుణము ధ్యేయము. నిర్గుణమును సగుణముగా భావింపచేయునది ప్రకృతి నామరూపగుణక్రియాసహితమైన సగుణము వెనుక నున్న నిర్గుణచైతన్యము నెఱుగుట జ్ఞానము. నిర్గుణమును వేదాంతులు బ్రహ్మ మని వ్యవహరింతురు. బ్రహ్మమునకు స్త్రీపుంసలింగభేదము లేదు. కాని, దానిని వేదాంతులు పురుష డని వ్యవహరింతురు. నిష్క్రియారూపు డైన పురుషుడు నిర్వికారుడు, నిరంజనుడు. ప్రకృతి అతనిని ఆవహించినపుడు అతడు సంకల్పవికారమును చెంది సృష్టికార్యమును నిర్వహించును. ప్రకృతిని స్త్రీశక్తిగా భావించుట వేదాంతమున ప్రసిద్ధము. ఇట్లగుటచే నిష్క్రియాశక్తి పౌరుష మనియు; క్రియాశక్తి స్త్రైణ మనియు నేర్పడుచున్నది. పురుషునివలన బ్రహ్మాండమును సృష్టించుశక్తి ప్రకృతి. సృష్టిస్థితిలయాత్మక మైన జగద్వ్యాపారమును సాగించునది క్రియాశీల మైన శక్తి. జగత్తునందు పాంచభౌతిక మైన ఆకృతియు; దానియందు చైతన్యరూపముగా నిలచుశక్తియు కానవచ్చుచున్నవి. ఆకృతి ప్రకృతిలోని ఒకఉపాధి, ఆవరణము. దాని నాశ్రయించి జీవశక్తి ప్రవృత్త మగుచున్నది. ఆజీవశక్తి పరబ్రహ్మశక్తికి ప్రతిబింబరూపము అట్లగుటచే బ్రహ్మము; జీవుడు; శరీరము అను నంశము లేర్పడుచున్నవి. వీనిని శక్తి ఆవరించియున్నది. అది బ్రహ్మమునని ష్క్రియారూపముగను, జీవునియందు శరీరవ్యాపారప్రేరకమైన శక్తిగను ప్రవర్తించుచున్నది. ఈరెండిటినడుమ నిష్క్రియాశక్తిని క్రియాశక్తిగా మార్చు శక్తియు గమ్యమానమగుచున్నది. ఆకృతులకు లింగవివక్ష కలదు కాని శక్తికి లేదు; అయినను, సృష్టికార్యమున నది స్త్రీపుంసయోగరూప మైన క్రియాశక్తివలె భాసించుచున్నది. పురుషుడే స్త్రీయందు తేజోరూపమున ప్రవేశించి తనను తాను సృష్టించుకొని, ప్రతిబింబమునవలె తనసృష్టిని చూచి తనవిచెందుచుండుట లోకసృష్టిస్వభావము. ఈసృష్టినే బ్రహ్మాండసృష్టికి వర్తింపజేసి పురాణములు వ్యాఖ్యానించుచుండును.

ఈవ్యాఖ్యానమునందు భాగవతసంబంధు లైన రెండు ప్రస్థానములు కలవు. ప్రకృతి పురుషులను స్త్రీపుంసప్రవృత్తులనుగా భావించి బ్రహ్మాండసృష్టికి వ్యాఖ్యానము చెప్పు ప్రస్థాన మొకటి. ప్రకృతి పురుషుల నిద్దరిని శక్తిరూపులుగా నన్వయించు ప్రస్థాన మొకటి. ఇందు మొదటిప్రస్థానము శ్రీమద్భాగవత సంబంధి; రెండవప్రస్థానము దేవీభాగవత సంబంధి.

"ఎల్లయెడల శక్తియే కనవచ్చెడి
శక్తి లేని యుత్తస్థలము లేదు
సర్వగతము శక్తి; శక్తి లేనప్పుడు
వస్తు వేడ కలదు పరీక్షయందు?" 1.260

"శక్తిమయము జగమంతయు
శక్తి జగన్మయము వేఱ సందియ మేలా?
శక్తిమయము గానిది ని
శ్శక్తిక మణుమాత్ర మైన జగమున గందే?" 1.266

"తగు శక్తి రెండువిధముల
సగుణము నిర్గుణము సనగ; సగుణాభిధ రా
గిగణము కొల్చును; నిర్గుణ
నగణితవైరాగ్యమార్గు లర్చింతు
రాగిన్."

దేవీభాగవతమతమున నిర్గుణ మైన బ్రహ్మము శక్తి; అతని నావహించి జగత్సృష్టిని సాధించుమాయ శక్తి జగద్వ్యాపారరూపమై ప్రవర్తిల్లునది శక్తి. ఇట్లు శక్తికి సర్వవ్యాపకత్వమును భావించునది దేవీభాగవతతత్త్వము. నిర్గుణమైనప్పుడును సగుణమైనప్పుడును శక్తిని స్త్రీశక్తిగా సంభావించుట ఈ పురాణవిశేషము.

పురాణదృష్టిభేదము నెఱుగవలె నన్నచో సర్గమును వర్ణించెడి విధము నరయవలెను. శ్రీమద్భాగ

వతము — "నిర్గుణుం డైన పరమేశ్వరుండు గలుగుచు లేకుండుచుఁ ద్రిగుణంబులతోడం గూడిన తన మాయచేత నింతయు సృజియించి గుణవంతుని చందంబున నిజమాయావిలసితంబు లైన గుణంబులలో బ్రవేశించి విజ్ఞానవిజృంభితుండై వెలుంగు; నగ్ని యొక్కరుం డయ్యుఁ బెక్కు ద్రాఁకులందుఁ దేజరిల్లుచు బెక్కండ్రై తోఁచు తెఱంగున విశ్వాత్మకుం డైన పురుషుం డొక్కండ తనవలనం గలిగిన నిఖిలభూతంబులందు సర్వాంతర్యామిరూపంబున దీపించు" నని సర్గారంభమును నిర్దేశించినది. సకలావతారంబులకు మొదలిదైన శ్రీమన్నారాయణదేవుని దివ్యరూపము నిట్లు నిరూపించినది-

"పురుషరూపంబు ధరియించి పరుఁ డనంతుఁ
డఖిలభువనైకవర్తినయత్న మమర
మానితోదార జలరాశిమధ్యమునను
యోగానిద్రావిలాసి యై యొప్పుచుండు"

దేవీభాగవతమునందు భగవతి బ్రహ్మాదులకు నిజరూపమును గూర్చియు, బ్రహ్మాండోత్పత్తినిగూర్చియు చెప్పెడి సందర్భమున సర్గార్థములప్రసక్తి కానవచ్చుచున్నది. దేవి తనకును బ్రహ్మమునకును అభేదమని చాటినది.

"పురుషునకు నాకు భేదంబు పొఱయ దెందు
నరయ నేకత్వమునకును హాని లేదు
వాఁడె నే నేనె వాఁ డనువాఁ డొకండె
ముక్తుఁ డట్టులఁ గాకున్న మూఢుఁ
డతఁడె". 3.110

'భేద ముత్పత్తికాలంబుఁ బెనగియుండుఁ
బేర్మి నుత్పత్తి లేన ప్డభేద మగును
భేద మది కల్పితంబు నిర్వాదలీల
సత్య మేకంబు బ్రహ్మ దా నిత్య
మరయ' 3.112

'ఆపురుషుండును శక్తియు
వ్యాపకు లని యెఱుఁగు జగమునం దంతట నే
రూపము లేకయ యందున
రూపింపఁగ వారి లేక రూపులు వమ్మి.' 3.152

బ్రహ్మము సత్యము, నిత్యము బ్రహ్మమునకును శక్తికిని భేదము లేదు. ఉత్పత్తికాలమున నా భేదము కానవగును కాని అది కల్పితము. పురుషునివలెనే శక్తియు నిర్గుణమై జగత్తంతయు వ్యాపించి యుండును. నిజమున కాయిరువురును ఏకరూపులే. అను తాత్పర్యము పైవాక్యమునందు కలదు. అనగా- బ్రహ్మాండోత్పత్తి లేనప్పుడు పురుషశక్తులు రెండు నభిన్నము లై భాసించును; ఉత్పత్తికాలమున శక్తి పురుషులిరువురును స్త్రీపుంసప్రవృత్తులను భజించి సృష్టికార్యమును నిర్వహించెదరు. సగుణమైన సృష్టి యందు వా రిరువురును ఆత్మశక్తి రూపులుగా వ్యాపించియుందురు ఆత్మకును, శక్తికిని రూపములు లేవు; అవి వ్యాపకములు. ఆరెండింటికిని భేదమును పాటించుట బుద్ధిమంతుల లక్షణము కాదు అట్లగుటచే జీవకోటియందలి ఆత్మచైతన్యము, క్రియాశక్తియు అభేదప్రతిపత్తితో నరయవలసిన సంశములు. శక్తి లేనిది ఆత్మకు క్రియాచైతన్యము లేదు; ఆత్మ లేనిది శక్తికి ఆధారము లేదు. ఆధార ఆధేయములైన ఈరెండింటిని వేరని భావించి తార్కికక్షోభ పడుట కంటె ఒకటి యని భావించి యుపక్రమించుట మే లని దేవీభాగవత మతము.

దేవీభాగవత నవమస్కంధమునం దీయంశము స్పష్టము చేయబడినది.

"ప్ర యనఁ బ్రకృష్టవాచకము, పైకృతి
సృష్టిని దెల్పుఁగాన నా
క్రియఁ గన సృష్టియందునుఁ బ్రకృష్టత
గాంచిన దేవి కర్థమౌఁ
బ్ర యనఁగ సత్త్వముం గృ యనుపల్కు-

రజంబు తి నాం దమం బగున్
నయగుణధుర్య యిట్టులయినం ద్రిగుణాత్మక
శక్తియే యగున్" 9.4

"ప్ర యనంగఁ బ్రథమవాచక
మయి వర్తిలుఁ గృతి యనంగ నది
సృష్టియనున్
బ్రియ మగు సృష్టికి మొదలై
జయ మందిన దేవి ప్రకృతిశబ్దము
గాంచున్" 9.5

ఆత్మ రెండువిధము లయ్యె సృష్ట్యాదిని
గుడినిఁ బురుషుఁ డింక నెడమఁ బ్రకృతి
యదియె బ్రహ్మరూప యదియె నిత్యము నయ్యె
ఖ్యాతినొందు నది సనాతని యని." 9.6

"ఆత్మశక్తులకును నగ్నిదాహికలకుఁ
బోలె భేద మెన్నఁ బోల దెపుడు
బ్రహ్మమయము దృశ్యమానంబు సర్వంబు
భేదబుద్ధి లేని సాధులకును" 9.7

ప్రకృతిపురుషుల నద్వైతదృష్టితో దర్శించునది దేవీ భాగవతము. ప్రకృతి శబ్దమునకు మూడర్థము లిందు చెప్పబడినవి. 1. సృష్టికి మొదలైనది. 2. సృష్టి క్రియయందు ప్రకృష్టతను గాంచునది. 3. సత్త్వ రజస్తమోగుణాత్మక మైనది వీనిసమన్వయ మిట్లు సాధింపబడినది. సృష్టికి పూర్వమున్నది బ్రహ్మము. అది నిష్క్రియారూపము. అది సృష్టి కున్ముఖ మయి నప్పుడు తనయందే కుడియెడమల పురుషప్రకృతి భావములను భజించి రెండువిధములుగా భాసించు చున్నది. సృష్టిక్రియాకారణజన్య మైన అద్వైత భావము తాత్త్వికులకు భేదదృష్టిని కల్పింపదు. ప్రకృతిపురుషులలో సృష్టికి పురుషుని ప్రేరేపించు శక్తి ప్రకృతి గాన అది ప్రకృష్టమైనది. అది త్రిగుణాత్మక మగుటచే సృష్టియు త్రిగుణాత్మక మగుచున్నది. ఇట్లగుటచే శక్తిరూపిణియైన దేవి బ్రహ్మమనియు, సృష్టిక్రియాశక్తియనియు, సృష్ట మైన జగత్తునందలి గుణత్రయ రూపమనియు గ్రాహ్యము.

జగత్క్రియాశక్తి మూడుఅవస్థలను మూడుగుణములను ఆశ్రయించి ప్రవర్తిల్లుచున్నది. సృష్టిస్థితిలయాత్మకమైనది అవస్థాత్రయము. సత్త్వరజస్తమోరూపమైనది గుణత్రయము. గుణములకును అవస్థలకును కారణకార్యసంబంధము లేదు. మూలశక్తి యొకటియే యయ్యును త్రిగుణముల నాశ్రయించి అవస్థాత్రయ మునకు కారణ మగుచున్నది. ఒక కొమ్మనుండి మూడురెమ్మలు పుట్టినట్లు త్రిగుణాత్మక మైన లోకవ్యాపారము సాగుచున్నది. సర్గమహార్ధ సారభూత మైన యీతత్త్వమునుగూర్చి మహాపురాణములవలెనే దేవీభాగవతముకూడ ప్రతీకాత్మకప్రకరణమును ప్రపంచించినది. సృష్టిస్థితిలయాత్మక మైన క్రియాకలాపమును నిర్వహించెడి మూర్తిత్రయమును సంభావించుట పురాణసంప్రదాయము. బ్రహ్మవిష్ణుమహేశ్వరు లామూర్తుల నామధేయములు. నామక్రియలతోపాటు రూపగుణములను గూడ మూర్తిత్రయమునకు ముడిపెట్టబడినవి. మూలశక్తిని క్రియాశక్తిగా మూర్తికట్టించునదియే మూర్తిత్రయము. మూలశక్తిని గుర్తింపక మూర్తిత్రయమునే పరమార్థముగా భావించినచో నానార్థమే కాని పరమార్థము లోకమునకు తెలియదు. నానార్థము విక్షేపహేతువుకాని జ్ఞానార్థసాధకము కాదు. అట్లగుటచే దేవీభాగవతము నానావిధ జగత్క్రియాశక్తులకు లింగభూతములుగా నిర్దేశింపబడుచున్న దేవతామూర్తులకు క్రియాశక్తి నిచ్చెడి మూలశక్తి దేవి యని ప్రపంచించినది. భగవతి, బ్రహ్మతో పలికిన మాటలను గమనింపుడు.

"శక్తి యొకటి గల్గ శక్తుండు శర్వుండు
సకలజగంబులు సంహరింప
శక్తి యొకటి గల్గ శక్తుండు విష్ణుండు
సకలజగంబుల సాకి నిలుప

శక్తి యొకటి గల్గ శక్తుండ వీవును
సకలజగత్సృష్టి సలుపుటకును
శక్తి యొకటి గల్గ శక్తుండు సూర్యుండు
సకలజగత్ప్రకాశకుఁడు గాఁగ
శక్తి యొక్కటి గల్గగా శక్తుఁ డింద్రుఁ
డంబుదంబులఁ బంచి తోయంబు లిడఁగ
శక్తి లేకున్న వీర లశక్తు లగుచు
నోరు దెఱచుక పడియుంద్రు పేరు లేక." 3 116

"శక్తి లేనియది యశక్తంబు; శక్తిని
నేను దెలియు మీవిధాన మెల్ల
నాదకాక యొండు లేదు లే దిది సత్య
మిదియ సత్య మనుచు నెంచు మీరను." 3.117

లోకమున పదార్థము ప్రకృతి; ప్రవృత్తి శక్తి. ప్రవృత్తి లేని పదార్థము జడము; ప్రవృత్తిగల పదార్థము చైతన్యము లోకమునందు శిలాదులు జడము లనబడుచున్నవి. కాని వానియందు సైతము పరిణామము మందముగా కాననగుచున్నది. సృష్టి యందలి జడములందును శక్తి సంగుప్త మై యున్నది. శక్తి జడములందు స్వల్పముగను, జంగమములందు ప్రకృష్టముగను కానబడుచున్నది. స్థావరజంగమాత్మక మైన ప్రకృతియందు తాత్పర్య ముగా మిగులునది శక్తి. ఆశక్తి ఉపాధి నాశ్రయించి నిలచినచో సృష్టి; ఉపాధి నాశ్రయించి ప్రవృత్తిని సాగించినచో స్థితి; ఉపాధిని వదలి నిజస్థితిని పొందినచో లయము. ఈ అవస్థాత్రయ మొక వలయము; ఈ వలయమునందు క్రియాచైతన్యముగా వెలుగొందినదియే శక్తి. క్రియ యెచ్చట కలదో కర్తృభావ మచ్చట కలదు. సృష్టిస్థితిలయాత్మక మైన క్రియాకలాపమునకు కర్త యెవరు? 'నేను కర్తను' అను భావ మెచ్చట నుండునో అది అహంకారము. ఉపాధి నాశ్రయించిన జీవు డిట్టి అహంకారమును భజించును. తనకర్మకు తాను కర్త యను భావముతో జీవుడు వర్తించును. ఆవర్తించుట తా నొక మూలశక్తిచే ప్రేరితుడై నిమిత్తమాత్ర ముగ నియతకర్మ నాచరించుచున్నా నను తెలివిడి లేకపోవుట. దీనినే వేదాంతు లజ్ఞాన మనుచున్నారు. దీని వలన దేహమే ఆత్మ యను భ్రాంతి కలుగుచున్నది; దేహశక్తియే మూలశక్తి యను మౌఢ్య మొదవు చున్నది; ప్రకృతియే పరమార్థ మను పాశవికత ప్రబలుచున్నది. జీవికి అహంకారమువలన క్రియాశీలము ప్రవృత్త మైనను అతని నావహించియున్న గుణముల ననుసరించి అతనిశీలము భాసించుచుండును. లోకమున సాత్త్వికు లున్నారు. వారిది సాత్త్వికాహంకారము; మూలశక్తి నెఱిగి తనక్రియాశక్తి తత్ప్రేరిత మని భావించి తదర్పణముగా తన కర్మను సాగించి తనదేహమునం దనాసక్త మైన భావమును సాధించి కర్తృభావము తనయం దుంచు కొనకుండెడి శీలము సాత్త్వికాహంకారప్రవృత్తులకు సహజము. ఇక రాజసప్రవృత్తుల విధము దీనికంటె భిన్నము. ప్రకృతిని జయించెడి శక్తిని సాధింపయత్నించుట వీరి స్వభావము. ఆ సాధించుటలోని కర్తృభావమును తామే వహించెదరు. దేహశక్తియే మూలశక్తి యను భ్రాంతి నొంది మూలశక్తిని గుర్తింపరు. ఉపాధి నాశ్రయించిన శక్తియే సత్య మని ఉద్యమించెదరు. శరీరపతనముతో వీరి చరిత్ర ముగియుచుండును. తామసప్రవృత్తులవిధము మఱియు నింతకంటె విపరీతము. వీరికి పాంచభౌతిక మైన ఉపాధియే పరమార్థము. దేహశక్తినే నమ్మిన వీరికి ఆత్మశక్తియొక్క తెలివిడి యుండదు. ఇది పాశవికతకు ప్రమాణము. ఇంద్రియభోగదృష్టి వీరి ప్రవృత్తిశీలము. దేహమువెంట వీరును నశించెదరు.

దేవిభాగవతమునందలి కథార్థములు ప్రధానముగా నీత్రివిధాహంకార ప్రవృత్తులను నిరూపించునట్టివిగా కాననగుచున్నవి. అందు మొదట పేర్కొనదగినది తృతీయస్కంధమందలి భువనేశ్వరీ దర్శనఘట్టము. సృష్టిస్థితిలయకారకు లైన బ్రహ్మవిష్ణుమహేశ్వరు

లకు శక్తి మూలమను నంశ మీకథార్థమునందు వ్యక్తీకరింపఁబడినది. ఆదిశక్తి యైన భగవతి బ్రహ్మకు సరస్వతీశక్తిని ప్రసాదించి సృజనకార్యమును నిర్వహింప నియమించినది అట్లే విష్ణువునకు లక్ష్మిని శివునకు గౌరిని ప్రసాదించి స్థితిలయాత్మక కార్యములఁ గావింపు డనినది. గుణవిభాగముచే విష్ణువు సాత్త్వికుడు; బ్రహ్మ రజఃప్రధానుడు; శివుడు తమఃప్రధానుడు. చతుర్ముఖశంకరులిద్దరును తపముచేత సాత్త్వికస్థితి నందఁగలరు దుష్టశిక్షణమున సాత్త్వికుడైన విష్ణువు వీరి కండగా నిలువగలడు. గుణస్థితిచేతను, కార్యనిర్వహణముచేతను వీరు భిన్నులుగా దోచుచున్నను మూలశక్తితాత్పర్యమున నభిన్నులుగనే భావింపఁదగినవారు. త్రిమూర్తుల కేకత్వము శక్తిసూత్రము ననుసరించి ప్రతిపాదించుట దేవీభాగవత తాత్పర్యము. దేవి శివునితో చెప్పినమాట లిందులకు సాక్ష్యములు-

"కారణంబు కాని కార్యంబు నేఁ గాను
గాన నేను సగుణఁ గావలయును
బురుషునొద్ద నేను బూని నిర్గుణ కాదు
శశికళావతంస ! సత్య మిదియ" 3.177

"సతిని నేను నన్నె స్వతంత్రుఁడు నాయందహంకృతియును బుట్టె నందువలన
నేనె కారణంబు నీయజాండములకు
మూడుగుణములందు మొనసియుందు." 3.179

త్రిమూర్తులు త్రిశక్తియుతులు. వారి కార్యముల కాశక్తులు కారణములు. ఆశక్తు లాదిశక్త్యంశములు. అట్లగుటచే త్రిమూర్తుల కహంకారభావము లేదు. శక్తియందాయహంకారభావ మర్పితము. సృష్టికార్యనిర్వహణమునందు సగుణగా నిలుచు శక్తియందాయహంకృతియును బుట్టును. అది యామె కంటదు; త్రిమూర్తులు తా మంటించుకొనరు. దైవికము సాత్త్వికము నైన అహంకార స్వభావమట్లుండును.

నిర్గుణ మైన బ్రహ్మమునందు పురుషప్రకృతి భావ మెట్లుండునో సగుణ మైన బ్రహ్మమునందు సర్వ స్వత్వాదిశక్తిభావములు కూడ నట్లు నెలసియుండును.

దేవీభాగవతకథార్థములలో సారభూతము లైనవి మూడు. అవి : 1. మధుకైటభసంహారము 2 మహిషాసురసంహారము. 3 శుంభనిశుంభవధ ఈమూడు కథార్థములద్వారమున సాత్త్విక రాజసతామసాహంకార స్వరూప స్వభావములను ప్రతీకాత్మకముగా ప్రపంచించి శక్తితత్త్వము నుపాసించుటకు నువైన చిత్తపరిపాకమును, భక్తిప్రవృత్తిని పరిరక్షణ వ్యంగ్యముగా నీపురాణ మందించుచున్నది.

జగము లేకార్ణవ మై యున్నయెడ శ్రీమహావిష్ణువు వటపత్రశాయియై యోగనిద్రా ముద్రితుడై యున్నయెడ నాతని కర్ణమలమునుండి మధుకైటభులును, నాభికమలమునుండి విరించియు నుద్భవించిరి. మధుకైటభులకు తమ జన్మకారణము తెలియ దయ్యెను. అవర్ణముస కాధార మగమ్యమయ్యెను. కైటభునకు మహాశక్తియే సృష్టి కారణ మనియు, మహోర్వాధార మనియు స్ఫురించెను. అంతట నాకాశమున నొక మహనీయశబ్దము వినవచ్చెను. దానినే మంత్రముగా గ్రహించి వారిరువురు శక్తినిగూర్చి తప మొనర్చిరి. శక్తి కరుణించి వారి కిచ్ఛామరణమును ప్రసాదించెను. దానితో వారికి పట్టపగ్గములు లేవయ్యెను. బ్రహ్మయు తనజన్మకారణము తెలియక తప మాచరించుచుండెను. బ్రహ్మ నీరాక్షసుల యుద్ధమునకు పిలిచి వేధించిరి. బ్రహ్మ విష్ణువును స్తుతించెను. అతడు యోగనిద్రాముద్రితు డై యుండుటచే నారని మేల్కొల్ప శక్తిని ప్రార్థించెను. ఆమె విష్ణువునుండి నిర్గమించి ప్రత్యక్షగా నిలచియుండెను. విష్ణువు బ్రహ్మప్రార్థనను మన్నించి మధుకైటభులతో నైదువేల దీర్ఘ హాయనములు పోరాడి గెలువలేక డస్సిపోయెను. అపై నాతడు శక్తిని ప్రార్థించెను. ఆమె

యమనికి దుష్టశిక్షణశక్తిని ప్రసాదించెను. మధుకైటభులయెదుట మోహినీరూపము దాల్చి నిలచి వారిని మోహపెట్టెను మోహావిష్టులైన మధుకైటభులను తనయూరువులపై నిలిపి విష్ణువు సంహరించెను. వారి మేధస్సుచే భూమిని నిర్మించెను. స్థూలముగా మధుకైటభవధా వృత్తాంత మిది. సృష్టికార్యమున కున్ముఖమైన పురుషప్రకృతియొక్క సగుణ ప్రవృత్తియే యోగనిద్రాముద్రితమై యున్న విష్ణుదేవుని స్థితి. అందుండి సురాసురాంశలు గల బ్రహ్మయు, మధుకైటభులును జన్మించిరి. మూలశక్తి జ్ఞానము వారిమువ్వురికి కలదు. మువ్వురును తపస్సు చేసినవారే. దనుజులు శక్తివరప్రసాదులుకూడ. కాని, శక్తిదత్తమైన వరశక్తిని తమశక్తిగా భావించి విరించివిష్ణువులపై వారు పోరు సాగించినారు. విష్ణువు తనయందలిశక్తి ఆదిశక్తి యని గుర్తించిన వాడగుటచే సాత్త్వికాహంకారి; మధుకైటభులు రాజసాహంకారులు. బ్రహ్మ సృజనవ్యాపారనియుక్తుడైనను శక్తియుక్తుడు కాలేదు. తనకంటె పరమైన శక్తిని గుర్తించి భక్తిని ప్రపంచించుటచే విష్ణువు పరుల సంహారకారి యై, సృజనకార్యనియుక్తుడైన బ్రహ్మను రక్షించి లోక నిర్వాహణ దక్షుడయ్యెను. బ్రహ్మయు సృజనశక్తియుక్తుడయ్యెను. సాత్త్వికాహంకార ప్రవృత్తి, మోహావిష్టమైన రాజసాహంకారమును నిగ్రహించెడి లోకవృత్తికి ప్రతీకాత్మకమైన పురాణ కథన మీ మధుకైటభ సంహారము.

భాగవతమునం దవతారముల కాదిమూర్తి యైన శ్రీమహావిష్ణువునందు శక్తి యై నిలిచిన దేవీతత్త్వమును చెప్పి, లోక సృజననిర్వహణాది క్రియాకలాపములం దుపాస్య యైన సగుణ శక్తిస్వరూపమును నిర్దేశించుట మధుకైటభవధాకథా తాత్పర్యము.

శిష్టరక్షణము, దుష్టశిక్షణము అవతారప్రయోజనములు. దేవీభాగవతమున ప్రతిపాద్యము శక్తిమహత్త్వము కనుక శక్తియే అట్టి అవతారకార్య నిర్వహణము చేయునది యని నిరూపించబడినది. అట్టి నిరూపణమునకు తోడుపడునవి మిగిలినరెండుకథలు. ఇవి పంచమస్కంధమునందు చెప్పబడినవి.

(సశేషం)

# చెహోవ్ కథానికా శిల్పం

—ముదివేడు ప్రభాకరరావు

### జీవితం

చెహోవ్ ప్రపంచ ప్రఖ్యాత రష్యన్ కథకుడు. నాటకకర్త. పూర్తి పేరు - చెహోవ్ అన్‌తోన్ పావ్లోవిచ్. ఈయన 1860వ సంవత్సరంలో రష్యాలోని టాగన్‌రాగ్‌లో జన్మించారు. తండ్రి చిన్న దుకాణాదారుడు. నిరుపేద. తాత ఒక బానిసరైతు కాని కొంత పరిహారం చెల్లించుకొని స్వేచ్ఛ పొందాడు.

చెహోవ్ మాస్కో మెడికల్ కాలేజీలో చదివి 1884లో డాక్టర్ పట్టం పొందారు. విద్యార్థి దశలోనే ఆయన కథలు వ్రాయడం ప్రారంభించారు. జీవితం తనకు నేర్పిన అనుభవాలను సూటిగా కథల్లో చిత్రించారు. హాస్యం చమత్కారం జీవిత శిల్పంలో దాగి వుంటాయని ఆయన కథలు చదివిన వారికి తెలుస్తాయి. మానవుల్లోని సంకుచిత మనస్తత్వాన్ని, నైచ్య భావాలను ఆయన మెత్తగా దుయ్యబట్టాడు. తాను నిరుపేద అయినప్పటికీ జీవితంలో విరక్తి చెందకుండా నిత్య నూతనోత్సాహంతో ప్రజాసేవ చేసిన త్యాగి చెహోవ్. జీవిత సమస్యలను సౌమ్యంగా ఎదుర్కొన్న వీరుడు సామాజిక సమస్యలను రాజకీయాలతో కలుపకుండా ఆయన సానుభూతితో విమర్శించ గలరు.

ఎన్నో మైళ్ళ దూరం కాలి నడకన పోయి పసిఫిక్‌లోని సఖాలిన్ ద్వీపాలకు యాత్రగావించి అక్కడి శిక్షితుల నెంత ఘోరంగా హింసిస్తున్నారో కళ్ళారా చూచి మానవతా దృక్పథంతో రచనలు సాగించిన వారు చెహోవ్ వారి విధంగా ప్రజల్ని మేలుకొల్పారు. కలరా వ్యాధితో రైతులు చచ్చిపోతుండగా కలం మూలబెట్టి తిరిగి తన వైద్యవిద్యకి పని చెప్పిన వాడు. ఏదో రక్తికోసం ప్రారంభించిన రచనా వ్యాసంగమే ఆయన జీవిత లో ప్రధాన వృత్తిగా మారిపోయింది. చెప్పే మాటకూ చేసే పనికీ పొంతన వుండాలనేది ఆయన నమ్మిన సత్యం. ఆయన జీవితంలో పాటించిన సూత్రం యిదే. అకలంకమైన సత్యావిష్కరణమే ఆయన కథా సాహిత్యానికి లక్ష్యం. మాక్సిం గోర్కి వంటి మహాకవికి రష్యన్ సాహిత్య అకాడెమీలో జార్ ప్రవేశం నిరాకరించేసరికి చెహోవ్ దానికి నిరసనగా తన సభ్యత్వానికి రాజీనామా యిచ్చారు. ఆయన జీవితంలో లాగానే కథల్లోకూడ సందేశం పాఠకులే వూహించుకోవాలి. సంఘటనల వెనుక నిల్చిన సత్యాన్ని తరచి చూడాలి. చెహోవ్ జీవితమే ఒక మహత్తర కళాఖండం. ఆయన హృదయ సౌందర్యమే కథల్లో, నాటకాల్లో ప్రతిబింబిస్తుంటాయి.

### రచనలు:

1879లో చెహోవ్ మొట్టమొదటి కథ వ్రాశారు. ఆ తరువాత నాటకం వ్రాయాలని

సంకల్పించి 1895 లో 'సీగల్' అనే నాటకం వ్రాశారు. పిమ్మట అంకుల్ వాన్యా (1901) ముగ్గురు సోదరీమణులు (1903), చెర్రీ ఆర్చర్డు అనే నాటకాలు వ్రాశారు. దీనితో చెహోవ్‌కు సాహిత్య రంగంలో శాశ్వతస్థానం లభించింది. 'గై-డీ-మపాసాను మించిన ప్రతిభాశాలి' అని అందరూ ప్రశంసించారు. 'చెర్రీ ఆర్చర్డు' నాటకంలో 'నూతన జీవిత విధానానికి స్వాగతం' అంటుందో పాత్ర. ఇది చెహోవ్ మహాకవి వ్యక్తిని సాక్షాత్కరింప జేస్తుంది. తన నిర్యాణానికి కొద్దికాలం ముందు చేసిన రచనల్లో రష్యాదేశపు ప్రజా జీవితంలో అప్పుడప్పుడే అంకురిస్తున్న నవీనతను, విప్లవ ధోరణులనూ స్వాగతం చెబుతూ నమస్సు లర్పించాడు చెహోవ్. ఆయన ప్రముఖంగా మానవతా వాది మానవసేవే మాధవసేవ' అనేది ఆయన జీవిత ధ్యేయం.

నిరంతర శ్రమవల్ల, బాల్యంలోనే దారిద్ర్యం వల్ల సంక్రమించిన క్షయవ్యాధి వల్ల చెహోవ్ 1904 జూలై 15 వ తేదీని తన 44వ యేట చనిపోయారు. ఆయన రచించిన కథలు నూటికి పై చిలుకు వున్నా అనూదితమై తెలుగులో లభ్యమవుతున్నవి కొన్ని మాత్రమే. వాటిలో కొన్ని కథల పేర్లు.

1. వాంకా (Vanka)
2. మంచివక్త (The Orator)
3. కళారూపం (A work of Art)
4. ముసలితనం (Old Age)
5 పొరబాటు (An Inadvertence)
6, ముద్దు (the Kiss)
7. ఊరవెల్లి (on the Fence)
8. గృహాచ్ఛేదం (Home Drudgery)
9 కన్నీటిగాథ Grief)
10. దారి తప్పిన పిల్లవాడు (the Runaway)
11. కుక్కపిల్లను వెంటబెట్టుకున్న మహిళ
12. అగ్గిపుల్ల (the Safty Match)
13. డాక్టరు (the Doctor)
14. సాధారణ సంఘటన (A Trifling Occurence)
15. నాటకం చూచిన మీదట (After the Theatre)

కథ - నిర్వచనం :

కథ వేరు. చిన్న కథ వేరు. చిన్న కథనే కథానిక అంటారు. కథను పెద్ద కథ అనవచ్చు. ఇది చిన్న కథకు రెండు మూడింతలు పెద్దది కావచ్చు. పెద్దకథలో నాలైదు సంఘటనలు అనుస్యూతంగా చెప్పబడితే చిన్నకథలో కేవలం ఒకానొక సంఘటన మాత్రమే హృద్యంగా చిత్రింపబడుతుంది. పెద్దకథలో కథాంతర్గత కథ. (story within a story) ఉండవచ్చు. కాని చిన్న కథ 'ఒకే విషయాన్ని సూటిగా చెబుతుంది. (A short story is a brief narrative in prose) 'ఒక సంక్షిప్త వచన కథనమే చిన్నకథ'. కాబట్టి, చిన్నకథకు సంక్షిప్త (brevity) ప్రాణం. చెప్పదలచింది క్లుప్తంగా సూటిగా మూడు ముక్కల్లో చెప్పగల్గి వుండాలి. ఆ చెప్పేదేదో ప్రభావోత్పాదకంగా వుండాలి.

ఆధునిక కథానిక ఎడ్గార్ ఆలెన్ పో (Edgar Allen Poe) తో సృష్టింపబడింది.

మపాసాం (Maupassant) చిన్నకథతో తన ప్రావీణ్యాన్ని శిల్పాన్ని చూపి అది తనదిగా చేసుకున్నాడు. కిప్లింగ్ (Kipling) అద్భుత కథలి సృష్టించాడు కాథరిన్ మాన్‌ఫీల్డ్, డి. హెచ్ లారెన్స్, ఎలిజెబెత్ బొయెన్ వీళ్లు చాలాభాగం కథా జగత్తును విస్తృతం చేశారు. అత్యాధునిక కథానికా రచయితల్లో ఓ. హెన్రీ (విలియమ్ సిడ్నీ పోర్టర్ - అసలు పేరు), సోమర్ సెట్‌మామ్, టి. ఎఫ్. పొవెస్, ఎ. ఇ. కప్పర్డ్ ప్రముఖులు.

**కథానికా శిల్పం:**

శిల్పాన్నే ఆంగ్లంలో Technique అంటారు టెక్నిక్ దృష్ట్యా మాట్లాడితే రచనకు పూర్వం విశ్లేషణం (Analysis) రచనలో సమన్వయం (Synthesis) గా మారడమే కథానికా శిల్పం. అసలు ఏకథకైనా ముడిసరుకు జీవితం. జీవితంలో సాధారణంగా సగం కథ మాత్రమే దొరుకుతుంది. మిగిలిన కథాభాగాన్ని వూహించియైనా కల్పించియైనా కథాశరీరాన్ని సమగ్రం చేసుకోవడం కథకుడి బాధ్యత కథలో నిత్యనూతనత్వం ఉట్టిపడాలి. ఇతివృత్తాన్ని ఎన్నుకున్న తర్వాత ఆద్యంతాలకు ఒక చక్కని సమన్వయం కుదుర్చుకుని మనస్సులో కథా స్వరూపాన్ని నిర్ధారణ చేసుకోవడం కథకుడిలక్షణం. కథ ఏకఅవస్థాత్మకం. A short story deals with a single situation, కథా ప్రారంభం అంటే ఎత్తుగడ రెండు రకాలుగా చేయవచ్చు. 1. సూటిగా కథలోకి జారబడడం ఒక పద్ధతి 2. యథాలాపంగా యిష్టాగోష్టి ప్రారంభిస్తున్నట్లుగా ఉపోద్ఘాతంతో మొదలుపెట్టడం ఒక పద్ధతి. లేదా కథా పర్యవసానాన్ని సూచిస్తూ ప్రకృతివర్ణనతోనో సంభాషణతోనో ప్రారంభించవచ్చు. అదంతా కథకుడే ఔచిత్యాన్ని దృష్టిలో పెట్టుకొని నిర్ణయించుకోవాలి. చిన్న కథ ఏకరస ప్రతిపాదకం. కాబట్టి ప్రధానవస్తువును ఐదుభాగాలుగా విభాగించుకోవడం మంచిది.

1. ఆరంభం (Exposition)
2. యత్నం (Rising action)
3. సంఘర్షణ (Catastrophe)
4. ఉత్కర్ష (Climax)
5. ముగింపు (Denouement)

శిల్పం అనేది కథకుడి ముద్రదండం. రచయిత ఉపజ్ఞ అంతా శిల్పంలో వ్యక్తమౌతుంది. మరొక సమ్మోహనాస్త్రం శైలి (Style) అది కథాకథనశైలి. ఉచితమైన భాషా శైలి. భావవ్యక్తీకరణలో వైచిత్రి, సంభాషణల్లో ఒడుపు, దానిచే పాత్రల శీలచిత్రణ, ఒకవిధమైన వాతావరణ సృష్టి (Atmospheric creation) పాఠకుడి అనుభూతిలోకి రావాలి. అప్పుడే కథకుడు శిల్పంలో కృతకృత్యుడైనట్లు. ఒక ప్రత్యేక శైలిని సాధించినట్లు.

ఇక ముగింపు లేక దింపుగడ ఎలావుండాలి? కథను హఠాత్తుగా ముగించటాన్ని 'కొనమెఱుపు' (Surprise ending) అంటారు. An unexpected twist at the end of the narrative. ఇలాంటి కొన మెఱుపులు అమెరికన్ కథకుడు ఓ. హెన్రీ కథల్లో ఎక్కువ. అసలు కథానికల్లో కొనమెఱుపులకు ఆ యన పెట్టింది పేరు. విశ్వనాథవారి 'ఏమిసంబంధము?' అనే కథలోని స్త్రీపాత్ర మరణం, 'మాబాబు' అనే నవలలో 'స్వామి' అనే పాత్ర మరణం పాఠకుణ్ణి ఆశ్చర్యంలో ముంచివేస్తుంది. అది కొనమెఱుపు అంటే. కథంతా చదివేసరికి పాఠ

కుడి మనస్సు ఒక్కక్షణం మూగబోతుంది. కథకుడు హఠాత్తుగా తిప్పిన మలుపు దానికి కారణం. దానితో కథంతా తారుమారై పోతుంది. అనగా అంతటితో కథ అంతం కాక తప్పదు. ఇలాంటిదే ఇంకో రకం ముగింపు సుఖాంతం చెయ్యటం. అదంతా యిలాగే వుండాలని నియమమేమీ లేదు. ప్రతిభావంతుడైన కథకుడి చేతిలో వస్తువు నవనవోన్మేషంగా తయారౌతుంది. అది రచయిత పనివాడితనాన్ని, రచనానుభవాన్ని బట్టి యింకా జీవిత నిశితపరిశీలనపై ఆధారపడివుంటుంది. ఇకమనం చెహోవ్ కథలన్నిటినీ కాకపోయినా స్థాలీపులాకంగా ఏ రెండు కథలైనా గ్రహించి అందలి శిల్పచాతుర్యాన్ని పరీక్షిద్దాం.

**చెహోవ్ కథానికా శిల్ప చాతుర్యం:**

కళారూపం (A work of Art) అనేది చెహోవ్ వ్రాసినకథానికల్లో ఒకటి. సంఘంలో 'కళ' 'కళ' అని నోటితో చెప్పడమే గాని కళకు సముచితస్థానం లేదని ఏకాస్తో వున్నా అదిసంఘంలో గొప్పవ్యక్తులనబడే వారియొక్క సంకుచిత మనస్తత్వాల మధ్య నలిగి చితికిపోయిన స్థానమేనని ఈకథ చెబుతుంది ఆధునిక మానవుడు మహా నాగరకుడైపోయాడని అంటున్నారు. కాని,'ఎక్కడున్నావురా గొంగళీఅంటే వేసినచోటేపడివున్నా నన్నదట'అలావుంది మన పురోగమనం. అత్యాధునికులమనుకునేవారి ఏహ్యమైన అంతరప్రవృత్తిపై సునిశితమైన దెబ్బతీశాడు చెహోవ్ ఈ కథలో.

ఈకథ ఎక్కడప్రారంభమయిందో ముగింపు తిరిగి అక్కడికే రావడం కథాశిల్ప దృక్పథంతోనే గాక ఒక సామాజిక దుర్నీతిని రచయిత వ్యాఖ్యానించిన తీరు కథనంలో ప్రస్ఫుటమౌతుంది. పురాతనకాలపు శిల్పకళా ఖండాలనమ్మె

ఒక బీదపిల్లవాడు తన ప్రాణదాతయైన వైద్యుడికి ధనం యిచ్చుకోలేక తన యింట్లో వుండే ఒక పురాతన సాంఘికమైన నగ్న శిల్ప కళాఖండాన్ని కానుకగా యివ్వబోతాడు. ఆబొమ్మకు జతగా మరొకటి యివ్వలేక పోయినందుకు పాపం ఎంతో బాధపడతాడా వెర్రివాడు.

కాని ఆ వైద్యుడా బహుమానాన్ని చాలాసేపు నిరాకరిస్తాడు. కుర్రవాడు డబ్బు యివ్వలేదని కాదు. బహుమానం అతనికి నచ్చకపోవడమే అసలు కారణం. చివరికెట్లో తీసుకుంటాడు. అదీ ఆ పిల్లవాడి సంతృప్తికోసమే. ఆ బొమ్మను తనవద్దకొచ్చే ధనికులైన రోగగ్రస్తులెవరైనా చూచి ఏమనుకుంటారోనని దిగులుపడిపోతాడు. వట్టినామోషీ ఫీలవుతాడు. రాత్రంతా ఆలోచించి బుర్ర వేడెక్కిపోతుంది. ఎట్టకేలకు ఓ నిర్ణయానికొస్తాడు. తెలతెలవారుతుండగానే లేచి, తనకు చాల క్లిష్టమైనకేసుల్లో సాయపడ్డ వకీలుకు యివ్వాలని దాన్ని తీసుకెళ్తాడు. ఆయన మొదట దాన్ని తీసుకున్నా తరువాత తన క్లయింట్సు చూచి ఏమనుకుంటారో, తనను గూర్చి నీచంగా తలపోస్తారేమోనని భయపడి పోతాడు. వద్దంటాడు. ఆ డాక్టరు అతణ్ణి 'డబ్బులు తీసుకోనివాడివి, యిదైనా తప్పక తీసుకో'మని ప్రాధేయ పడుతాడు. పట్టుబట్టి ఒప్పిస్తాడు. కాని ఆపెద్దమనిషికి బుర్రలో పురుగు తొలుస్తుంది.

వెంటనే దాన్ని పేపర్లో చుట్టి తనస్నేహితుడు నటశిఖామణికి పంపిస్తాడు. ఆ నటుడది చూచి బెంబేలయి పోతాడు. తనను చూడటానికి ఎవరెవరో ప్రఖ్యాత కళాకారులు వస్తుంటారు. వారిది చూస్తే తన పరువేమై పోవాలి? ఈపీడ ఎట్లా విరగడ అవుతుందా అనుకుని దాన్నితన

నౌకరుద్వారా ఆ పురాతన శిల్పాలమ్మే బాలు డికే విక్రయిస్తాడు. అమాయకుడైన ఆబాలుడు తనకు ఇంకొక జత బొమ్మ దొరికినందుకు సంతోషించి దాన్ని తీసుకెళ్ళి డాక్టరుగారికి బహూకరించి సంతృప్తిచెందుతాడు. కాని ఆ బొమ్మ ఎన్నిచేతులు మారిందో ఎవ్వరికీ తెలియదు. ఇక్కడ కథాగత రహస్య సందేశం నిక్షిప్తమైవుంది. దాన్ని భావించిన కథకుడు పాఠకునికి కథాముఖంగా చెబుతున్నాడు. చివరికి ఆశ్చర్యంగా నోరుతెరుస్తాడు డాక్టరుమహాశయుడు. దీంతో కథ అంతమవుతుంది.

కళకు స్థానం ఎక్కడ? దేవాలయాల్లోనా? మ్యూజియంలోనా ? లేక వర్తకుని దుకాణంలోనా? వ్యక్తి కళను అభిమానించడంవల్ల సంఘంలో చెడ్డపేరు వస్తుందా? అది వ్యక్తి (పవిత్ర?) జీవితానికి కళంకం ఆపాదిస్తుందా? మానవసేవ చేసే వైద్యుడివద్దా, న్యాయ విచారణచేసే న్యాయవాదివద్దా, కళను జీవికగా చేసుకుని నటించి పొట్టపోసుకునే నటకునివద్దా కళకు ఎలాంటిస్థానం లేనప్పుడు ఇక సామాన్య మానవుడు కళకు ఏపాటి గౌరవస్థానం ఇవ్వగలడు? మానవుల నీచాతినీచమైన ప్రవృత్తుల కన్నా- సంకుచిత మనస్తత్వానికన్నా, నిష్కల్మషమై, నిర్మలమై హృదయాన్ని విప్పిచూపే ఒక్కటే ఒక్క చిన్న శిల్పకళాఖండం ఎన్నో రెట్లు మిన్న ! ఇలాపైకి అసహ్యించుకునేవారే లోలోపల వికృతమైన, అమానుషమైన మనస్తత్వం కల్గి వుంటారనేది రచయిత కథాధ్వని.

పాత్రలను ఎన్నుకోవడంలోనూ, వారి వయోనిర్ణయంలోను కథకుడెంతో ప్రతిభావంతుడై వుండాలి. శిల్పాలనుఅమ్మే పాత్రను బాలుడిగా సృష్టించటంలో కథకుని ఆంతర్యమేమిటి? భావుకత్వం శిశుహృదయంవంటి హృదయంగలవారికే సాధ్యమని వారే రససృష్టిననుభవింపగల సహృదయులనీ చెహోవ్ నిర్ణయం. తక్కిన పాత్రలలోగల దోషమేమిటి? వాళ్లు అనగ్న శిల్పాన్ని కామదృష్టితో చూచారు. కాని దాన్ని చూడవలసింది రసదృష్టితో. శృంగారరసదృష్టితో. దీన్ని పాఠకుని వూహాకే వదలి పెట్టిన చెహోవ్ చాల గడుసువాడు,

చెహోవ్ భావన అనే తీగ యిలా ప్రతికథ వెనుకా ఆలోచించేకొద్దీ ఎడతెగకుండాపడే జలపాతం లాంటిది. ఆలోచన అనే సమ్మెటతో కొట్టేకొద్దీ కమ్మచ్చు తీగలా సూక్ష్మాతిసూక్ష్మంగా సాగే ధారావాహిని ఆయన కథాసృష్టి. ఈ విద్య అతనికి కరతలామలకం. ఆ భావనాశక్తి ముందు ఏది తట్టుకొని నిలబడగలదు?

ఒక చిన్న సంభాషణాశిల్పం చూద్దాం. నటకుడి దగ్గర శిల్పం వుంది. ఇంకా అమ్మలేదు. ఇంతలో "లోపలికి రావచ్చా?" అని ఎవరో అడిగారు. నటకుడు కంగారుగా బొంగురు గొంతుతో తాను ఒంటినిండా బట్టలు వేసుకొనున్నా 'అయ్యో! వద్దు, వద్దు, నేనింకా బట్టలు వేసుకోలేదు' అనేసి ఆ నగ్నశిల్పాన్ని చూస్తూ నాలిక కరుచుకోవడం అతని మనోస్థాయిని సూచిస్తోంది. ఇక్కడ కథకుని సంభాషణా వైచిత్రి పరాకాష్ఠనందుకొంది. సామాజిక దృష్ట్యా ఈ సందేశమేమి? సంఘంలో కళారాధన అనేది బీదవాళ్ల బలహీనతలేగాని కలవాళ్ళకెంతమాత్రమూ కాబట్టవని కవి నిరూపించాడు.

ముద్దు (The kiss) అనే కథాశిల్పం పరిశీలిద్దాం. ఇది చెహోవ్ కథల్లోకెల్ల అత్యుత్తమమైన కల్పన. మనస్తత్వ ప్రధానంగా కొంత దూరం. ఘటనా ప్రధానంగా కొంత

దూరం తిరిగి భావనా ప్రధానంగా మరికొంత దూరం యిలా వివిధరకాలుగా పయనించి మెలు గుబడిద్ది చివర ఒక కరోరమైన సత్యాన్ని కొన మెలుపులో చూపిన పెద్దకథ. రసవత్తరమైన కథ యిది. కథలో ప్రధానపాత్ర ఒక్కడే అయినా ఆ పాత్రచుట్టూ పరిభ్రమించే వివిధ వ్యక్తుల తాలూకు వర్ణన - వారి స్వభావాలు సజీవాలు. విచిత్ర సంఘటనలతో కథ అద్భుతంగా నడిచింది. కథాపరిసర ప్రకృతికూడ కథకు పూర్తిగా అతికిపోతున్న సార్థక శకలాలను సమకూర్చుతున్నది.

ఒక సైనిక పటాలన్ని ఒక ఉన్నతోద్యోగి తనకు ఇష్టంలేకపోయినా గౌరవభంగానికి జంకి ఆహ్వానిస్తాడు. ఇల్లు వారికి విడిదిగా యివ్వనందుకు చింతించినట్టు మాట్లాడతాడు. తరువాత విందు జరుగుతుంది. అందులోనే మన కథానాయకుడున్నాడు. ఆఫీసరు భార్య మహోదారురాలిలా అందరినీ చూచి మందహాసం చేస్తుంది.

కథానాయకుని పేరు రియాబోవిచ్. సైనికాధికారి బ్రహ్మచారి. కళ్ళజోడు, గుండ్రని దిగుభుజాలు, చిన్న విగ్రహం యిదీఅతని బాహ్య రూపం. ఇక ఆంతర రూపం నిగూఢం, గుంభనం లోపలిమనిషి. ఆఫీసరుభార్య అందర్నీ చూచి నవ్వేసరికి ఈయన వెలుతురులోకి వచ్చిన మానుపిల్లి మొగం పెట్టాడు. అతడు కళ్ళెత్తి దేన్నీ చూడలేదు. మనస్సంతా గజిబిజిగావుంది. ఆ భావం యిలాంటిది' అని నిర్దుష్టంగా చెప్పలేనిది. దానికి కవి చూపించిన వస్తుసంకేతాలన్నీ రంగుల చిత్రమే. ఆ బ్రహ్మచారికి యిట్టే తపోసాధ్యమైన శూన్యదృష్టి లభించిందట! ఇది కథకుని చమత్కారం! ఆ శూన్యం కథానాయకుడిలో అస్పష్టమైన నిరాశా నిస్పృహాలను పరోక్షంగా వ్యక్తీకరించే సంకేతం. అతడు అందమైన ఆడవాళ్ళను చూచి తన వికారస్వరూపానికి ఈసడించుకున్నాడు. పిల్లవాయువులు తోటలోని పుష్పపరిమళాలను గుబాళిస్తుంటే రియాబోవిచ్ త్రాగిన మత్తులో కిటికీ మీదకు జారి వెర్రినవ్వులు నవ్వుకున్నాడు. వెంటనే అతనికా వాసనలు రమణుల అందమైన శరీరాలనుండి వస్తున్నాయనిపించింది. ఆడా మగా కలిసి నృత్యం చేస్తుంటే తానెందుకో నీరసించిపోయాడు.

ఇక అక్కడ వుండలేక లేచివెళ్ళి ఓ గది తలుపు తోసాడు. అది చీకటి గది. అక్కడ ఎవరో స్త్రీ తన ప్రియుడికి ముందే చెప్పిన సంకేతానుసారం అతడే వచ్చాడని ఈతణ్ణి గాఢంగా కౌగలించుకుని ముద్దెట్టుకుంది. స్థాణువులా నిలుచుని పోయిన వాణ్ణి చూచి తప్పు తెలుసుకుని అసహ్యించుకుంటూ వెళ్ళిపోతుంది. అసలు కథ యింతవరకే ఆ తరువాతిదంతా రియాబోవిచ్ వెర్రెత్తిన వాడిలా, భగ్నప్రేమికుడిలా ప్రవర్తించిన తీరు చెప్పడం కథాకథనశిల్పంలోని వైశిష్ట్యం. అక్కడి ప్రధానమైన సంకేతార్థం యిది. చీగటిగది కథానాయకుని హృదయం. కథలోని స్త్రీ వ్యక్తి ఎవరో తెలియనట్లుగా కథానాయకుని హృదయమందిరంలో ఉన్న స్త్రీ కూడ అజ్ఞాత వ్యక్తియే. ఇక్కడ కథకుడు ప్రముఖంగా చెప్పదలచుకొన్నదేమిటంటే లోకదృష్ట్యా వ్యక్తి ఎటువంటివాడైనా ప్రతిజీవికీ ఆంతరంగా కామభావన నిక్షిప్తమై వుంటుందనీ, ఇది స్త్రీ పురుష సాధారణ ధర్మమని నిరూపించాడు.

పై హఠాత్ సంఘటనకులోనైన రియాబోవిచ్‌లో ఒక్కక్షణం నిరాశ పటాపంచలయింది. ఆశాజీవిగా మారిపోయాడు. అంతకు ముందు తనకు సాధారణంగా కనబడిన వస్తు

వులే యిప్పుడు కొత్తగా కనబడసాగాయి. జనరలు భార్యతో మాట్లాడాలని ఉవ్విళ్ళూరుతూ ఏం మాట్లాడాలో తోచక "మీ యిల్లు చాలా బాగుందండి" అంటాడు. ఆవిడ నవ్వుతూ వెళ్ళిపోతుంది. ఇది కథకుడు ప్రయోగించిన భావగర్భిత చమత్కార భాషణం.

వెంటనే వెర్రి ఆకలితో రియాబోవిచ్ ఆహార పదార్థాలన్నీ తినేశాడు. తప్ప తాగేశాడు. ఆ మత్తులో తనకు ముద్దిచ్చిన ముద్దరాలు ఎవరా అని అయా స్త్రీల అవయవ సౌందర్యం చూడసాగాడు. భోజనం చేసి అందరూ నవ్వుతూ మాట్లాడుతోంటే వాళ్ళకంతా తన చుంబన రహస్యం తెలిసి పోయిందేమోనని భయపడతాడు పాపం. ఇక్కడ కథకుని ప్రకృతి వర్ణన గమనార్హం. చీకటిలో నల్లని నీటిలో నక్షత్రాలు ప్రతి ఫలించడం కథా నాయకుని మనస్సులోని ఆశా కిరణకాంతికి సంకేతం. నదీ ప్రవాహవేగం అతని ఆశా తీవ్రత్వానికి, నైటింగేలు పాట తన్మయతాస్థితికి, అడవి కోళ్ళ ధ్వనులు చివరకు మిగిలే అవ్రశుతికి సంకేతాలు.

కొన్నాళ్ళకు పటాలం గుడారమెత్తి మరోవూరి కెళ్ళిపోతుంది. ఆ గ్రామం వైపు జాలిగా చూచాడు రియాబోవిచ్. మళ్ళా విరక్తి అతణ్ణి ఆవరిస్తుంది. పురుగుల్ని తినే మాలకాకులు అతడి విరక్తిని మరింత ఎక్కువ చేస్తాయి. కాని దీనికి అర్థం పాత్రకు తెలియక పోవచ్చు. కథకుడు పాఠకునికి చెప్పేదేమిటి? పురుగుల్ని తినే మాలకాకి సంసారంపై వైరాగ్య భావాన్ని అలవర్చుకొమ్మని జీవుడికి పరోక్షంగా బోధిస్తూవుంది. కాని శ్మశాన వైరాగ్యం ఎలా కల్గుతుంది? కాని కవి ప్రవృత్తీ, ప్రకృతి సందేశమూ ఎప్పుడూ ఉదాత్తమైనవి కదా! అందుకే పై వర్ణన. ఇక్కడ చెహోవ్ ఒక ఋషియైన కవివలె దర్శించి వర్ణించినాడని చెప్పాలి

ఒకరోజు ఉండబట్టలేక తన అనుభవం చెప్పేస్తాడు రియాబోవిచ్. తోడి సైనికులతో, వాళ్లు అది తమకు జరక్కపోయినా కల్పించి మరీ విచిత్రంగా కథలల్లి చెబుతారు. ఇక్కడ చెహోవ్ మానవ మనస్తత్వంలోని ఒక అజ్ఞాత కోణాన్ని ఆవిష్కరించాడు. అది స్త్రీ విషయంలో పురుషుల విశృంఖలమైన భావన. అక్కడ వున్నంత కాలం ఆకోణంలో ఏదో ఆశాకిరణం మెరుస్తూనే వుంది రియాబోవిచ్‌కి. తనకు ఆ అజ్ఞాత స్త్రీ వ్యక్తికి పెళ్ళయినట్లు ఆమెను బిడ్డలనువదలి తానుయుద్ధానికివెళ్ళినట్లు పేకమేడలు కట్టుతూ కాలం గడపసాగాడు' ఈ దృశ్యమైన భావన సంసారంలో భ్రమించే జీవుని స్వభావాన్ని చెబుతున్నది.

చివరికి ఒకరోజు మళ్ళా అదేవూరు రావడం తటస్థించింది. రియాబోవిచ్ ఇంకా 'యింగువ కట్టిన గుడ్డే' అంటే జీవుణ్ణి వాసనలు ఒకంతట వదలిపెట్టవని అర్థం. కాని సుళ్ళా ఆ జనరలు తమను అహ్వానించలేదు. తానే వెళ్ళాడొక సాయంత్రం. దారిలో గుడిసెల మసకనీడలు అతని గుండెలో దోబూచులాడే అస్పష్టమైన కోర్కెలకు సంకేతాలు. దారి అంతా రాళ్ళు రప్పలు. అది తన జీవితంలోని ఎగుడుదిగుళ్ళకు ఎండిన రెల్లుగడ్డి తాను పొందబోయే నిరాశా నిస్పృహలకు సంకేతాలు. నైటింగేలు పాటలు లేవు. జనరల్‌గారి తోటలో తొంగిచూశాడు. అప్పుడే చీకటి పడింది. నిశ్శబ్దం ఆవరిస్తోంది. కథలో కడపటి రెండు పుటలు అద్భుతంగా వ్రాశారు రచయిత. ప్రాణం విసిగి వెనక్కు తిరిగాడు' అనే వాక్యం అతడెంతనేవు ఓపిగ్గా

వేచి వున్నాడో తెలియజేస్తోంది. అతడి ఆశా సౌధం కూలిపోయిందని ఆ వాక్యానికర్థం.

చెహోవ్ మాటల్లోనే చెప్పాలంటే - "నడుస్తున్నాడు, నది దగ్గరికి వచ్చే సరికి ఎందుకో ఆగాలనిపించింది. ఎదురుగా చీకట్లో మెరుస్తూ జనరల్ స్నాన మందిరం అమాయకంగా నిలబడివుంది. దగ్గరలోనే నది మీద చిన్న వంతెన. దాని రెయిలింగ్‌ని వేలాడుతూ ఏదో కాగితం!" మళ్ళీ ఏదో ఆశ! ఆరే ముందు వెలిగే దీపం లాగా ప్రజ్వలించింది. అప్రయత్నంగా వంతెన మీదికి చేయి చాచి అందుకున్నాడు 'గుప్' మని ఆరిపోయింది. అంటే ఆశాజ్యోతి ఆరిపోయిందని అర్థం. అది వట్టి కాగితం. తన ప్రయత్నం నిష్ఫలం అయింది. స్నానమందిర స్తంభాల నొరుసుకు పోతున్న ప్రవాహం అస్పష్టంగా ముర్మర ధ్వని చేస్తూ పోతున్నది. ఆవలి గట్టున అప్పుడే ఉదయిస్తున్న ఎర్రని చంద్రుడు అందని ఆశా ఫలానికీ,నీళ్ళలో ప్రతిఫలించిచంద్ర బింబం అలలకు ముక్కముక్కలు కావడం-ఆశలు తునాతునకలు కావడాన్ని చెబుతున్నాయి. 'ఎంత బుద్ధి తక్కువ' అనుకున్నాడు రియాబోవిచ్. ఇది కథా పరమార్థం.

ఒక వర్ణన చూడండి. "నీరు ప్రవహిస్తోంది ఎక్కడికో! ఎందుకో! చిన్ననది పెద్దనదిలోకి ఆవి సముద్రంలోకి, ఆ నీరు మేఘాల్లోకి తిరిగి వర్షం చర్విత చర్వణం!" ఇక్కడ కవి-జీవుని ప్రయాణాన్ని, ఆశానిరాశల మధ్య జీవితం, మరణం, మరల పుట్టుక వీటిని తెలియజేసేలా వ్రాయడం గొప్ప శిల్పం. 'చర్విత చర్వణం' అనే మాట 'గతానుగతికో లోకః నలోకః పారమార్థికః' అనే వేదాంత వాక్యాన్ని 'నదీనాం సాగరోగతిః' అను మాటను విప్పిచెప్పే జల ప్రవాహం 'ఎచ్చట నుండి వచ్చె తానచ్చటికేగుట నైజము ప్రాణి కోటికిన్' అన్న పోతన్న గారి వాక్యాన్ని వ్యాఖ్యానిస్తున్నది.

అందని మేఘాల్లోని తెల్లదనాన్ని చూచిన క్షణంలో రియాబోవిచ్‌కి ప్రపంచమే ఓ పెద్ద పరిహాసంగా కన్పించింది. ఎందుకంటే తెల్లని మేఘాలు వర్షించవు కదా! వెంటనే నిరాశలో తలదాచుకున్నాడు. ముసుగుతన్ని పడుకున్నాడు ఒక జీవి జీవితంలో ఆశ ఎలా చిగిర్చి మళ్ళీ ఎలా మోడై పోతుందో రచయిత కథా కథన చాతుర్యంచే నిరూపించారు. దేనిని పొందడానికైతే మానవుడు జన్మ యెత్తుతున్నాడో దానియందు కాక మరొక దాని యందు మక్కువ కలిగి యుండడమే 'ముద్దు' అనబడుతుంది. జీవుణ్ని ఆవరించిన 'మాయ'కే మరోపేరు 'ముద్దు'. ఈ దృశ్యమైన జీవుడు సంసారమందు 'ముద్దు'కలవాడుగాని వైరాగ్యమందు కాదు. ఈ విధంగా 'ముద్దు' అన్న ఈ కథ పేరు అక్షరాలా సార్థక మవుతున్నది. ఇది అత్యుత్తమ కథానిక. ఇదొక ధ్వన్యాత్మకమైన, సంకేతాత్మకమైన కథగా తీర్చిదిద్దారుచెహోవ్.

చివరగా ఒకమాట. రష్యా దేశపు మార్క్సిస్టు సిద్ధాంతాన్ని నమ్మి సామ్యవాదాన్ని సామవేదంలా వినిపించిన శ్రీశ్రీ మహాప్రస్థానంలో తన నవకవితా సిద్ధాంతాన్ని చెబుతూ,

> అగ్గిపుల్లా సబ్బుబిళ్ళా
> కుక్కపిల్లా కాదేదీ కవిత కనర్హం!

అన్న మాటలు రష్యన్ కథకుడైన చెహోవ్ ఏనాడో వ్రాసిన అగ్గిపుల్ల the Safty Match ) 'కుక్కపిల్లను వెంట బెట్టుకున్న మహిళ' వంటి కథలు చదివి నవ్యకవిత్వానికన్నీ అర్హమైనవేఅనిచెప్పాడేమోనని నాకు అనిపిస్తుంది. ఏది ఏమైనా నేటి అష్టావధానాల్లో అప్రస్తుత ప్రశంసల్లో వీటికొక స్థానం వుండనేవుంది కదా!

# నీకోసం

—గుమ్మనూరు రమేష్‌బాబు

ద్వాపరాంతపు గాండీవాన్ని చూచి
మోసపోవద్దు.
అది మేకపోతు గాంభీర్యం!
ధృతరాష్ట్రుడి కళ్ళను నమ్ముకొని
ముందుకు పోవద్దు
అది చీకటి నిండిన మృత్యు గహ్వరం!
శేషతల్పాన్ని కని మురిసిపోయి
పవళించ వద్దు
అది చివరి నిద్దరకు స్వాగత వంధి మాగధం!
మన రాజకీయ దురంధరుల ఉపన్యాసాలు విని
గర్వపడవద్దు
అది పదవికోసం రూపొందిన ఓట్లనోట్ల కోలాహలం!
వంటింటి కుందేలు
పందెం వేస్తుందని వినలేదా?
ఎదురు తిరిగితే పిల్లి
పులిలా విరుచుకు పడుతుందని తెలియదా?
నిదురలేచి
నిజాన్ని తెలుసుకొని
నిర్భయంగా ముందుకుపో
నిస్వార్థంతో దూసుకుపో
ద్వాపరాంతాన్ని
ఆది పర్వానికి తీసుకురా!
ధృతరాష్ట్ర నేత్రాల్ని
విశ్వరూప సాక్షాత్కారానికి తీసుకురా!
శేషతల్పాన్ని
సత్యసాయీ సాన్నిధ్యానికి తీసుకురా!
రాజకీయ ఉపన్యాసాన్ని
అమృత చైతన్య గీతోపదేశాన్ని చేసి పంచేందుకు తీసుకురా!
అప్పుడే
నీవు అసలుసిసలైన మనిషివి!
అంతవరకు
అనుమానం అక్కర్లేని మరోరకం జీవతువి!

# నవభారతి

సాహిత్య. సాంస్కృతిక మాసపత్రిక

డిసెంబరు, 1979

సంపాదకుడు:
చదలవాడ పిచ్చయ్య

మూల్యం : రెండు రూపాయలు

నవభారతి కార్యాలయము
3-4-1008/1, బర్కత్‌పుర
హైదరాబాదు - 500 027

# విషయసూచిక



నవభారతి

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

సంపుటి 8]    హైదరాబాదు    డిశంబర్, 1979    [సంచిక 2

# రాజకీయ పక్షములు ఉన్నతమైన విధానములను రూపొందించుకొనగలవో లేవో వేచి చూడవలయును

భారతీయులకు తమను—తాము పరిపాలించుకొనే హక్కు వచ్చినది. ఈ పరిపాలించు కొనే హక్కును సంపాదించుటకు అనేక విధముల కృషి చేయబడినది. ఈ కృషి చేయబడిన ఫలితమే పరిపాలించుకొనే హక్కును పొందడానికి కారణమైనది. ఈ కారణమున ప్రజలకు ప్రజాసామ్య విధానము ననుసరించి ప్రజలలో ప్రజలను ప్రతినిధులుగా ఎన్నుకొను అవకాశమును ఏర్పరచినది. దీనికి ప్రజలే పాలకులు· పాలకులే ప్రజలు. ప్రజలకు, పాలకులకు మధ్య విభాగ మనునది కల్పించు కొనకూడదు. ప్రజలచే ప్రతినిధులుగా ఎన్నుకొనబడిన ప్రజలు పరిపాలనా బాధ్యతను స్వీకరించి ప్రజలకు క్రమబద్ధమైన విధానము ననుసరించే పరిపాలన చేయవలసి వున్నది.

ఈ పరిపాలనా విధానమునకు మూడు విభాగములు అనునవి యున్నవి· 1. న్యాయ విభాగము, 2. కార్యవర్గము· 3. కార్యనిర్వాహక వర్గము. ఈ మూడు విభాగములు పరస్పరము సహకరించుకొని ప్రజాభ్యుదయమునకు కృషిచేయవలసి యున్నది. ఈ మూడు విభాగములు కలిసిమెలిసి పనిచేయ గలిగిన సామర్థ్యమునే ప్రజాసామ్య మనవలయును. కాని ఈనాడు ప్రజాసామ్య మనగనే రాజకీయ పక్షముల అభిప్రాయ ప్రకటన స్వాతంత్రమునే ప్రజాసామ్యమని నిర్వచన చేయబడుచున్నది. ప్రజాస్వామ్య విధానమును పరిపూర్ణమైన మానవ ప్రయోజన విధానమని మానవుడు అవగాహన చేసుకొనవలసి యున్నది.

నేడు రాజకీయ పక్షములు భారత దేశములోని అన్ని ప్రాంతములను సమైక్య పరచి పరిపాలనా విధానమును ప్రజోప యోగకరముగా తామెటుల కృషి చేయవలసినది చెప్పుకొనవలయును ఈ కృషికి న్యాయవిభాగము యొక్క సహకారము, కార్యవర్గము యొక్క సహకారము, కార్యనిర్వాహక వర్గ సహకారము తామెటుల సమకూర్చు కొనగలిగినది వివరించి చెప్ప వలయును. ఈనాటి రాజకీయ పక్షములు ఈ విధమైన ఆలోచనకు బదులుగా భిన్నమైన ఆలోచనలు వ్యక్తము చేయుచున్నారని చెప్పవలయును· రాజకీయ పక్షములు సిద్ధాంతపరమైన ఆలోచనలను ఆచరణాత్మకముగా ఎటుల రూపొందించు కొనవలయునో తెలియనివారై వ్యక్తి

గతమైన దూషణలకు, వ్యక్తిగతమైన నిందలకు ఒకరినొకరు గురి చేసుకొనుచు ప్రచార విధానమును సాగించుచున్నారే గాని సామాజికుల ప్రయోజనమునకై ఏ విధానమును ననుసరించి ఏ రీతిన సమాజమునకు ప్రయోజనము సమకూర్చగలరో వివరించను విధానమును వెల్లడించుచున్నారని చెప్పవలయును. ఈ విధమైన విధానము ననుసరించి సమాజమునకు హానిని మాత్రము కల్పించెదరని తెలిసికొనవలయును. సామాజిక జీవనములోని వారందరు భాగస్థులే నని అందరికి యోగ్యమైన, ప్రయోజనకరమైన విధానమును సూచించవలయునని తెలియ జెప్పుటకు బదులుగా విద్వేషసింధంతో, పరుష వాక్యములతో సమాజమునకు హానిని కలిగించు రీతిని భావ ప్రకటన చేయుచున్నారని గ్రహించుకొనవలయును. ఇది మానవ వివేకమునకు ప్రజాభ్యుదయమునకు తోడ్పడు విధానము కాదని గ్రహించని రాజకీయ పక్షములు ఎందుకో ప్రతి వ్యక్తి ప్రశ్నించి సమాధానము చెప్పవలసి యున్నదని కోరవలసిన సమయము మాసన్నమైనదని గమనించవలయును.

ఎన్నికలలో విజయమును సంపాదించుటే ప్రధానముగా భావించి ప్రజలకు విషయములను వివరించక విధానములను సూచించక వ్యక్తిగతమైన విమర్శలతో, విచక్షణా రహితమైన వాదనలతో రాజకీయ పక్షములు ఏర్పడి పనిచేయు విధానమును వివేకరహితమైన విధానములని తెలిసికొనవలయును. ప్రజలను పరిపాలించుట యనునది బాధ్యతతో కూడిన విధాన మేదై యున్నదో గ్రహించని కారణమున అవివేకముతో కూడిన విధానములను ప్రజలకు చెప్పుచున్నారని గ్రహించవలయును. ప్రజలు ఆలోచనాపరులు కారని ప్రజలకు ఏమి చెప్పినను రాజకీయ పక్షములకు ఇబ్బందిలేదని పక్షముల నేర్పరచిన వారే ప్రచారము చేయుట యెంత అనుచితమైనదో ప్రజలు గ్రహించుకొన వలసిన సమయ మాసన్నమైనదని తెలిసికొనవలయును.

భారత దేశము ఎల్లప్పుడు వున్నది. వుండును. భారత దేశములోని ప్రజలు ఎల్లప్పుడు వుండిరి. ఇకపై కూడా వుండెదరు. రాజకీయ పక్షములనునవి ఏర్పరచబడును. అవి రద్దు కూడా అయిపోవును. రాజ్యాంగములు ఏర్పరచబడును. అవి కూడా రద్దు చేయబడి నూతన రాజ్యాంగములు ఏర్పరచబడును. ఈవీనికి శాశ్వతత్వమనునది లేదని గ్రహించుకొనవలయును. మానవుడు మానవత మానవ జీవిన విధానము. నిరంతరము కాలచక్రములో బంధించబడి గమనాగమన విధానము ననుసరించి ప్రయాణించ బడుచున్నదని అవగాహన చేసుకొనవలసినదని గ్రహించుకొనవలయును. మానవుని మాన్యమైన మానవతా వాదిగా తీర్చిదిద్దుటకు గాను సామాన్య మానవుని సామాజికునిగా తీర్చిదిద్ది వ్యవస్థగా రూపొందించుకొని పరిపాలనా వ్యవస్థలను తీర్చిదిద్దుకొని పాలనా యంత్రాంగము సమాజమునకు తోడ్పడవలసిన మానవతా వాదమే మాన్యమైన మానవతా వాదముగా రాజకీయ పక్షములను ఏర్పరచినవారు వివరించి చెప్పగలిగిన నాడే సామాజికులకు [illegible] చేకూర్చబడునని తెలిసికొనవలయును.

భారత దేశములోని రాజకీయ పక్షములన్నియు ప్రజాసామ్య సమ్మతమైన సోషలిజ మును, మత రహితమైన రాజ్యాంగమును ఏర్పరచగలమని అభిప్రాయ ప్రకటనలను మాత్రము చేయుచున్నారని చెప్పవచ్చును. అభిప్రాయ ప్రకటనలను ఆచరణాత్మకముగా రూపొందించుటకు అవగాహన చేసుకొనవలసి యున్నదని రాజకీయ పక్షము గ్రహించవలయును. రాజకీయ పక్షము నేర్పరచిన వారు ప్రజలమేనని ఎప్పటికప్పుడు అవగాహన చేసుకొనవలసి యున్నది. ప్రజలకు అతీతులయిన శక్తివంతులుగా తమను తాము నిర్దేశించుకొని తమ విధానము ననుసరించే భారత జాతీయులందరకు ప్రజాభ్యుదయము సమకూరునని చెప్పుకొనుట యనునది సాహస ముతో కూడినదని గ్రహించవలయును. రాజకీయ పక్షములన్నియు సాహసించి అభిప్రాయ ప్రకటనలను చేయవచ్చును. అభిప్రాయములను ఆచరించుట యనునది మానవుని నడవడికను తీర్చిదిద్దుటలలో అంతర్భాగమైనదని గ్రహించని కారణమున నోటికి వచ్చిన రీతిని మాట్లాడుట ఏది తనకు తోచిన దానిని అభిప్రాయ ప్రకటనగా వ్యక్తీకరించుట రాజకీయ పక్షము ఉచితమైన రీతిని గ్రహించ గలిగినవాడే రాజకీయ పక్షము నేర్పరచిన వారి ప్రజాభ్యుదయ విధానమునకు రూపురేఖలు తీర్చిదిద్దగల శక్తి సామర్థ్యములను పెంపొందించు కొన వచ్చునని తెలిసికొనవలయును. నేటి రాజకీయ పక్షములు ఉన్నత ప్రమాణములను ఉత్తమ విధానములను రూపొందించు కొనగలిగిన శక్తి యుక్తులను సంపాదించగలవి అవునో కాదో వేచి చూడవలయును.

——

# ఎన్నాళ్ళని ఎదురు చూచేను?

—శ్రీ దేవి

ఎన్నాళ్ళని ఎదురు చూచేను
ఎదురు చూచి చూచి
కనుదోయి అల నేను.

ఘాడపు మమతల
వీడని ప్రేమ
నాడెంద మే నలిగెను

॥ఎన్నాళ్ళని॥

గడచిన జ్ఞాపకాల
మధురిమే మనసంతా
వేదనలో నింపగా

॥ఎన్నాళ్ళని॥

చిలిపిగ తగవులు ఆడిన రోజు
మెత్తగ మమతలు నిండిన రోజు
మదిలో మెదిలిపోగా

॥ఎన్నాళ్ళని॥

నీవూ నేనూ ఒక టేనని
నీవే తీయగా పలికిన రోజు
మళ్ళి మళ్ళి మురిపించగా

ఎన్నాళ్ళని ఎదురు చూచేను
ఎదురు చూచి చూచి
కనుదోయి అలసేను,

# దాసు శ్రీరామకవి దేవీ భాగవతము

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

[గత సంచిక తరువాయి]

మహిషాసురుడు తామసమైన పశుయోనియందు జన్మించినవాడు; తపస్సు చేసి బ్రహ్మవలన వరమును పొందినవాడు. అతని ప్రవృత్తి చిత్రమైనది. అతడు పురుషులచే చంపబడకుండునట్లు బ్రహ్మవలన వరము వడసెను. స్త్రీ తనను చంపజాలదని యతని అహంకారము. చంపబడినచో స్త్రీవలననే చావు రావలెనని బ్రహ్మను కోరెను. వరగర్వితుడైన యతడు దేవలోకముల నాక్రమించి బ్రహ్మేశ సురేశ్వరాదులను బాధించెను. విష్ణువతని నెదిర్చి నిలువలేక పోయెను. అనగా మహిషుడు తామసాహంకారి. పురుషరూపమైన బ్రహ్మమును, జ్ఞానమును గర్హించినవాడు. అతడెన్నటికి జ్ఞాని కాలేడు అది యతని పశులక్షణము. జ్ఞానదూరుడైనవాడు మోహావిష్టుడు కావలెను. అతడు తన దేహబలమును నమ్మి తనయందలి శక్తితత్త్వమును గుర్తించినవాడు కాడు. దేహాభిమానము స్వభావతః స్త్రైణము. అందువలన నతడు స్త్రీ శక్తితో పోరు కోరుకొనెను. దేవతలు మహిషుని నెదిరింపలేకపోవుట తమశక్తులను తమయుపాధుల నాశ్రయించి ప్రయోగించుటవలన. దేవతలది తెలిసిన మోహము; మహిషునిది తెలివిడి లేని మోహము. అనగా ఒకటి రాజసము; రెండవది తామసము. తామసాహంకారమును జయించుటకు దేవతలందరు కలసి తమయందలి శక్తి సంతతిని స్త్రీమూర్తిగా సమీకరించినారు. అనగా తమకంటె పరమైన శక్తిని గుర్తించి దానిని శరణు పొంది సగుణత్వము భజింపుమని దానిని ప్రార్థించినారని భావము. రాజసవృత్తిని వీడి సాత్త్వికవృత్తిని భజించిన దేవప్రవృత్తులనుండి పుట్టిన శక్తి దేవి. ఆ దేవి మోహావిష్టమైన తామసికశక్తిని సంహరించినది. తమస్సు రజస్సును నిగ్రహించి సత్త్వమును మేల్కొల్పినది. సత్త్వము తమస్సును రాజసవృత్తి నాశ్రయించి వధించినది. మహిషాసురవధావృత్తాంత తత్త్వమిది. జీవులలో తమఃప్రవృత్తి విజృంభించినచో రాజసమును సైతము వశము చేసికొని జీవితమును దుఃఖభాజనమొనర్చి, యింద్రియవశంవదమైన భౌతికప్రవృత్తి నలవరచును. అందుండి మానవుడుద్ధరింపబడవలెననినచో దేహాభిమానమును శక్త్యుపాసనముల పొందిన సాత్త్వికబలముతో నిర్జింపవలెను. సాత్త్వికశక్తి రాజసవృత్తియందు ఆర్తివలన జాగృతమగును. ఆర్తి భక్తిని పోషించును. భక్తి శక్తిని కల్పించును. అరిషడ్వర్గాదులతో కూడిన మోహము నది పటాపంచలు చేయును. మహిషాసురుని సేనాను లరిషడ్వర్గమునకు ప్రతీకలు. స్త్రీశక్తియైన దేవి సాత్త్వికాహంకారమునకు ప్రతీక. స్వీయశక్తులచే దేవీ స్వరూపము నావిర్భవింప చేసిన దేవతలు భక్తులైన రాజసాహంకారములకు ప్రతీకలు. భక్తివలన పొడమిన శక్తి దేహాభిమానమును ద్రుంచి, మానవులందలి దేవప్రవృత్తిని పెంచి సత్త్వగుణమును సంరక్షించునని సాధకు లీ కథవలన వ్యంగ్యోపదేశమును సాధించుకొనెదరు.

శుంభనిశుంభులవృత్తాంతము రాజసాహంకారము సాత్త్వికాహంకారముచే నణచబడుటను వ్యాఖ్యానించునది. శుంభనిశుంభులు బ్రహ్మవరగర్వులు. వారికి మానవు లన్నను,పశుపక్ష్యాదిగణము లన్నను లెక్కలేదు. వారివలన మృత్యువు లేకుండునట్లు భావించి అమరత్వమును కోరినారు. అమరులు వారిబారి కోర్వజాలక దేవి నుపాసించినారు. దేవి చండికయై అసురులపై విజృంభించినది. ఆమెయందలి త్రిగుణములు చండికా, అంబికా కౌశికీరూపములు తాల్చినవి చండిక రాజసమూర్తి తాల్చిన ఆదిశక్తి. ఆమె రాగాలాపనము చేసి మోహమును సృజించినది. మిగిలిన రెండు మూర్తు లాప్రవృత్తికి పరిచర్యలు చేసినవి. శక్తిరూపమును గాంచి రాక్షసులు మోహావిష్టులైనారు. శక్తి యొక్క ఆకృతిని చూచి రతిభావమును ప్రకటించినారు. మూలశక్తి ప్రత్యక్ష మైనను మోహముచే నుపాధినే సత్య మని భావించినారు. తాము పురుషుల మని గర్వించి అహంకరించినారు. తదహంకారమునకు ఇంద్రియములవలె చండముండాదులు నిలిచి సమర్థించినారు. చండముండాదుల సంహారము ఇంద్రియ మోహ నిరాసనము. శుంభనిశుంభుల సంహారము మోహావిష్టమైన ఆత్మశక్తి యందలి అశక్తిని నిరూపించుట. శక్తి సాత్త్వికాహంకారము. దానిచే నిగ్రహింపబడి, రాజసాహంకారము నిర్మూలనమైన ప్పుడు జీవునికి ఆత్మశక్తి సాక్షాత్కారము కలుగునని ఈకథాతాత్పర్యము. సాధకులు తామసరాజస ప్రవృత్తులచే ప్రేరిత మయ్యెడి ఆసురీవృత్తిని ఆత్మశక్తితో నిగ్రహించి సత్త్వశక్తిని పెంపొందింపుకొనినచో సగుణమైన దేవీశక్తిపై భక్తికుదురు ననియు, పిమ్మట నిర్గుణమైన పరాశక్తి సాధ్యమగు ననియు నీకథాతాత్పర్యము.

ఇక మిగిలిన కథ లన్నియు పురాణలక్షణములను పూర్ణము చేయుటకును, మంత్రతంత్ర క్రియాత్మకమైన శక్త్యుపాసనమును గూర్చి వివరించుటకును, దేవీ మహిమ సమగ్రసుందరంగా నావిష్కరింప జేయుటకును నిబంధింపబడినవి.

దేవీభాగవతము తత్త్వతః ప్రకృతిపురుషాభేదమును దెలుపుటకును, శివకేశవాభేదమును బోధించుటకును పుట్టినది. దానికీరెండుపద్యములు తార్కాణములు

"పరమాత్మయుఁ బరశక్తియు
నరయంగా నొకట యంచు నాత్మఁ దలఁపు మం
తర మేమియు లేదు సుమీ!
యిరువురకును; నిట్టి తత్త్వ మెఱుఁగరు
రాగుల్" 3.153.

"శివుఁడే విష్ణుఁడు విష్ణువే శివుడు చర్చింపంగ
నీయిర్వురన్
దవులంబో దొర భేద మెన్నడును
దత్యంబెన్నఁ బూజ్యుల్కదా
వివిధాచారములందు నిట్లనుచు నేవిద్వాంసుఁ
డూహించు వాఁ
డవిషాదుం డగు; ముక్తి నొందు; నితరుం
డందున్ మహాదుఃఖముల్" 3.129

పరతత్త్వమైన దేవిని స్త్రీమూర్తిగా, మాతృమూర్తిగా భావించుట యీపురాణ స్వభావము.

సదసదాత్మక మైన యీజగము నెల్ల
నోలిఁ బుట్టించి రక్షించి యుక్కడించి
తన త్రిగుణశక్తిఁ గల్పవేళను నొకర్తు
నిలచు లోకైకమాతను నే స్మరింతు" 1.18

అను పౌరాణికుని ప్రణుతిపద్యమే దేవీమాతృభావనాతత్త్వమునకు ధ్వనిబీజము. 'మాతృదేవో భవ' యని దేవీభాగవతమును, 'పితృదేవో భవ' యని శ్రీమద్భాగవతమును పరాశక్తిపరమపురుషతత్త్వములను చెప్పుచున్నవి. తల్లిని తెలిసికొనినచో

తండ్రిని తెలిసికొనినట్లే అని బోధించి తల్లిలోనున్న తండ్రిని చూపు నది దేవీభాగవతము; తల్లిని తెలుసు కొని తండ్రిని తెలుసుకొను మని బోధించి, తల్లి కాధార మైన తండ్రిని చూపునది శ్రీమద్భాగవతము. దేవీభాగవతపఠితచిత్తవృత్తి త్రిగుణములను క్రమముగా నంతశ్శక్తితో సాధించి సాత్త్వికవృత్తిని సందర్శించినట్లనుభవము పొందును; శ్రీమద్భాగవత పఠిత భగవంతుని మహిమలతో ముగ్ధుడై మధుర భక్తిమార్గమున బడి యతనియందు చిత్తమును లయింపజేసికొనును. దేవీతత్త్వము తెలిసినచో మనసువిప్పారినట్లుండును;భాగవతతత్త్వ మరసినచో హృదయము ద్రవించినట్లుండును. జ్ఞాన మానంద స్థితి నొందవలె నన్నచో వికసించిన చిత్తము ద్రవింపవలసినదే. వికసనమును ద్రవస్థితికి తెచ్చు శక్తి భక్తి. దానికై మనము మొదట దేవీభాగవతము చదివి ఆపై శ్రీమద్భాగవతము చదువ వలెను.

తెలుగున పోతనభాగవతము భక్తిముక్తి కల్ప ద్రుమ మై విలసిల్లినది. దేవీభాగవతము తెలుగున 19 వ శతాబ్దారంభమున గాని వెలయలేదు. ములుగు పాపయారాధ్య లనువదించిన దేవీభాగవతమే మొదటి తెలుగుసేత. వీరు ద్వాదశారాధ్యులలో నొక రగు వేమనారాధ్యుల వంశమునకు చెందినవారట. వారి మొదటిపేరు సంగమేశ్వరశాస్త్రి. వారు ఆరాధ్యు లయ్యును అద్వైతభావము కలవారు.వా రనువదించిన దేవీభాగవతము పోతనకవితాపాకమున బడి తెలుగు దేశమున అత్యంతప్రచార మందినది. క్రీ.శ. 19 వ శతాబ్దికి చెందిన త్రిపురాన తమ్మయకవి దేవీభాగవతము ననువదించెనని వారి పుత్రులు. ప్రసిద్ధకవులు నైన వెంకట సూర్యప్రసాదరాయకవి తన నిర్వచన కుమారసంభవావతారికలో పేర్కొనినాడు. కాని. అది నేడు మనకు లభించుట లేదు.

నేడు దేశమున అత్యంతప్రచారమున నున్న దేవీ భాగవతము దాసు శ్రీరామకవి గారిది. నేడిది తెలుగు వారి పూజాపారాయణములకు పాత్రమై అలరారు చున్నది. శ్రీరామకవిగారు సరళము, సతంత్రము నైన కవిత చెప్పగలిగిన దిట్టలు. దేవీభాగవతమును వీరు ఆఱువుగా ఆరునెలలో అనువదించినారట. వీరి యనువాదము మూలాతివిధేయముకాదు: అతి స్వతంత్రమును కాదు. ఎడనెడ వీరు స్వకపోలకల్పనలతో ఉపాఖ్యానములను, పాత్రచిత్రణమును, సన్నివేశ చారుత్వమును, సహజవర్ణనలను రక్తికట్టించిరి. ధారాళమైన వీరి కవితాధార పురాణశైలికి చక్కని యుదాహరణము.

అవధాన కవితాచతురానను లైన తిరుపతి వేంకట కవులుకూడ దేవీభాగవతము ననువదించిరి. శ్రీరామకవి యనువాదము పురాణప్రశస్తికి పాత్రము కాగా వీరి యనువాదము ప్రబంధప్రశక్తికి నిలయమైనది. ఈ జంటకవులు దేవీభాగవతమును భావానువాద ప్రక్రియలో నిర్మించిరి. అయినను అది అనువాద మన్నశంకయే పఠితలకు స్ఫురింపనీయ లేదు. తిరుపతి వేంకటకవులు ఇందు నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తిని, తిక్కనగారి కావ్యకళాశిల్పరహస్యము లను, స్వీయకవితామాధుర్యమును మేళవించి కవితను నిర్మించిరి. ద్వాదశ స్కంధమండిత మైన ఈ పురాణ రచనమునందు తిరుపతివేంకటకవులతో పాటు వారికి సన్నిహితు లైన మరికొందరు కవులుకూడ భాగస్వాములై ధన్యులైరి. నవమస్కంధమున మొదటి అయిదును, చివరి రెండధ్యాయములను తిరుపతిశాస్త్రి గారి పుత్రు లైన వేంకటావధానిగారును, నవమ స్కంధశేషము నిశ్శంకుల కృష్ణమూర్తిశాస్త్రిగారును, ఆకొండి రామమూర్తిగారును, దశమస్కంధమును, వేంకటశాస్త్రిగారి పినతండ్రి కొమరు లైన చిన వేంకటశాస్త్రిగారును రచించిరి. ఇట్లీ నవమదశమ స్కంధములు కాక మిగిలిన గ్రంథమంతయు తిరుపతి

వేంకటకవుల రచనయే. శిష్యులకు తమతోపాటు పీట వేసి కూర్చుండ బెట్టుకొనిన తిరుపతి వేంకటకవులు హాళక్కి భాస్కరుని కన్నను, బమ్మెరపోతరాజు కంటెను ఏమాత్రము తీసిపోరు.

ఆధునికులలో ఈ పురాణము ననువదించిన వారు జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు; గద్యానువాదమును వెలయించినవారు నరిపల్లి విశ్వనాథశాస్త్రి, స్థానాపతి రుక్మిణమ్మగారలు. కవిసామ్రాట్ నోరి నరసింహశాస్త్రిగారు దేవీభాగవతము నందలి మూడుస్కంధములను చంపువుగా ననువదించిరి. ఏలనో పురాణమును పూర్తిగావింప రైరి.

శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు దాసు శ్రీరామకవి దేవీభాగవతమునకు ఉపోద్ఘాతము వ్రాయుచు "ఇక్కవి రచించిన కబ్బములు పెక్కులు అన్నిటిలో నాకెక్కుడు రుచించునది తెలుఁగునాడు. రెండవది ప్రస్తుతగ్రంథము. యావద్విషయములు గాకయున్నను కవితకు సంబంధించిన కొన్నియంశముల నియ్యలఘుఁడు రెండవశ్రీనాథుఁడేమో యని నాకుం దోఁచెడిని. శ్రీనాథుడు "గురుకులక్లిష్టో మురారిః కవిః" అను తెగలోనివాడు. ఈ యనయోః సహజపాండిత్యుడు. పైగా భాగవతము నాంధ్రీకరించిన ధన్యుడు. కావున మన మీ కవివతంసుని శ్రీ పోతరాజునకుఁ బ్రతినిధిగా సమ్మానింప" మని ప్రశంసించినారు. కవితాంశములను బట్టి చూచినచో శ్రీరామకవి రెండవశ్రీనాథుఁ డనియు, సహజకవితాపాండిత్యమువలన దేవీభాగవతము ననువదించుటచే పోతనకు ప్రతినిధి యనియు చెళ్లపిళ్లవారు భావించిరి.

శ్రీనాథుడు ఆంధ్ర సాహిత్యచరిత్రమున కావ్యయుగకర్తగా ప్రశస్తి పొందినవాడు: పోతన భక్తిరసప్రధానమైన మహాపురాణమును నిర్మించిన మహాకవి. శ్రీనాథుడు పురాణఖండానువాదమును గావించినను కావ్యమర్యాదల [illegible] కనకాభిషేకము చేసినాడు. శ్రీనాథపోతనల పురాణరచనామార్గములందు కొట్టవచ్చినట్లు కానబడు భేదమొకటి కలదు భక్తిని రక్తికిని కవితాశక్తికిని జోడించి కవిత లల్లినవాడు శ్రీనాథుడు. ముక్తిని లక్షించిన మధుర భక్తితో కవిత నారాధనావిశేషముగా మలచినవాడు పోతన్న. శ్రీనాథునికృతులలో భక్తి కవితాశక్తిలో మునిగిపోవును, పోతనభాగవతమున కవితాశక్తి భక్తిలో మునిగిపోవును. ఒకరిది రాజసాహంకారప్రవృత్తి. మరియొకరిది సాత్వికాహంకారప్రవృత్తి. దాసు శ్రీరామకవి కవితాంశములయందు శ్రీనాథుకు దగ్గరివాడు; భక్తిప్రవృత్తియందు పోతన్నను లక్ష్యముగా పెట్టుకొనినవాడని చెళ్లపిళ్లవారితీర్పునకు వ్యాఖ్యానము చెప్పుకొనవచ్చును.

లోతుగా పరిశీలించినచో దాసు శ్రీరామకవి శ్రీనాథునికే దగ్గరివాడనిపించును. అట్లనిపించుటకు దేవీభాగవతస్వభావము కొంత కారణము; శ్రీరామకవి కవితాస్వభావము మరికొంతకారణము. దేవీభాగవతము స్త్రీమూర్తియైన శక్తియొక్క ప్రతాపమహిమాదికములను వర్ణించునది యైనను భాగవతము నందువలె మధురభక్తిని నిండించుకొనినది కాదు. భాగవతమున భగవంతుడు పురుషుడు; భక్తుడు నవవిధభక్తి ప్రస్థానముల నాశ్రయించి స్త్రైణమైన చిత్తవృత్తిని భజించెడివాడు. జ్ఞాన, కర్మ, మధుర భక్తులను ప్రకటించెడి భక్తులను అందరియందును పోతన భాగవతము మాధుర్యమును నిండించినది. దేవీభాగవతము స్త్రీశక్తి నారాధించు భక్తిచిత్తములను వర్ణించినది. శక్తి మాతృమూర్తి, సృజనాశక్తి, సంహారమూర్తి. దుష్టశిక్షణక్రియాబహుళమైన గాథలయందామె రౌద్రమూర్తి; శిష్టరక్షణకారిణి యైన ఆమె ఉపాస్యమూర్తి. దేవీభాగవతమున స్త్రీపాత్రలు శక్తిరూపిణులు; పురుషపాత్రలు శక్తిప్రసాదసంపాదనాసక్తులు. వీరిభక్తియందు దీప్తికున్న ప్రాధాన్యము మాధుర్యమునకు

లేదు. సగుణనిర్గుణ యైన శక్తిని కీర్తించు స్తుతుల యందున్నైనను పాత్రలు పారవశ్యము చెంది పరికలను విస్మయత్వమునందు ముంచు ప్రవృత్తి దేవీ భాగవతమున తక్కువ. శక్తి తత్త్వ ప్రతిపాదకములైన స్తుతులు మేధను మేల్కొల్పి తత్త్వము నందించు నట్లుండును గాని భాగవతమునందువలె భక్తిమత్తచిత్తస్థితిని కలిగించి మనస్సును కరిగించుచున్నట్లుండవు ఏతాదృశ దేవీభాగవత స్వభావ లక్షణములను వివేచించినచో శ్రీరామకవి శ్రీనాథున కత్యంత సన్నిహితునివలె భాసించుటలో నాశ్చర్యము లేదు.

ఇక శ్రీరామకవి కవితాస్వభావమును పరిశీలింతము. చెళ్ళపిళ్ళవారి మనస్సునకు మొదట నచ్చినది శ్రీరామకవి 'తెలుగునాడు' తెలుగువారి ప్రకృతి పరిశీలనమును చేసి దానిని చాటూక్తి చమత్కారముతో నావిష్కరించెడి లక్షణ మాకృతి కవితాజీవితము. దానితో శ్రీరామకవి తెలుగువారి యుల్లములను కొల్లగొట్టినాడు. అతని కవితాముద్ర నొకదానిని తెలుగుపద్దెములపై స్థాపించినాడు. నిజమున కది ప్రౌఢకావ్యనిర్మాణదక్షము కాదు. శ్రీరామకవి అట్టి కవితావలయమునుండి వెలువడి సారవత్కవితా సామ్రాజ్యమును దర్శించు ప్రయత్నవిశేషమును సాగించుటకే బహువిధకావ్యరచనా వ్యాసంగమును పెంచుకొనినట్లు కానవచ్చును. అట్టిప్రయత్నములో అంచుల నందుకొనినది దేవీభాగవత రచనము. భూమిక లెన్ని మార్చినను స్వీయాభినయస్వభావమును సంపూర్ణముగా పరిత్యజింపలేని నటునివలె శ్రీరామకవి మహాపురాణరచనయందును తన సహజమైన చాటూక్తి చమత్కారవైలక్షణ్యమును వదలుకొనినవాడుకాదు. దేవీభాగవతమునందు వస్తువెంత శుచియైనను దానియందు కవి యందించిన రుచిమాత్ర మాచాటుచమత్కారచారుత్వమే. తత్త్వగంభీరమైన దేవీభాగవత మాకవితాలక్షణమువలన సరళ సౌందర్యమును సాధించినది. అది దాసు శ్రీరామకవి పురాణరచనలో సాధించిన ప్రత్యేకవైలక్షణము.

పురాణేతిహాసములు సహజముగా నర్థప్రధానములు. వాని ననువదించిన ప్రాచీనకవులు కవిత్రయమార్గము ననుసరించి యథావకాశముగా పురాణరచనయందు కావ్యరచనాశిల్పమును సంతరించుచు వచ్చిరి. మారన మొదలైన కవులామార్గము నావిష్కరించి యుండిరి. ఆ పద్ధతి శ్రీనాథపోతనలలో శిఖరప్రాయముగా భాసించినది. ఆధునిక యుగమున పురాణానువాదము చేసినవారిలో పూర్వకవుల మార్గము ననుసరించినవారు తక్కువ. తిరుపతివేంకటకవు లాపద్ధతి నాశ్రయించినవారు. మిగిలినవారు పురాణార్థములను తెలుగున ప్రసన్నముగా నందించుటకు యత్నించినారు. పురాణములకు సహజమైన అర్థప్రాధాన్యమునే తమ వచనరచనలయందు సంపదించుకొనినారు. కొందరు పురాణములలోని తాత్త్విక శాస్త్రమర్యాదలకు వ్యాఖ్యానములుగా తెలుగుసేతలను నిర్వహించినారు. సరళమైన రచనమునందు చాటూక్తిచమత్కారవిశేషమును సంపదించి ప్రాచీన కావ్యప్రబంధకర్తల పద్యరచనాశిల్పమర్యాదలలోని సరళసుందరపద్ధతుల ననుసరించుచు పురాణరచనను సాగించిన విశిష్టమార్గమును దాసు శ్రీరామకవి దేవీభాగవతమునందు వెలయించిరి. దానివలన పాశ్చాత్యులు భావించెడి శైలీభేదములలో **Neat Style** అనుదానికి దాసు శ్రీరామకవి రచన సన్నిహితముగా నిలచుచున్నది. **Neat Style** లక్షణమిట్లుండును. **Here ornaments are employed but not those of the most elevated or sparking kind; they are appropriate and correct, rather than bold and glowing. Beauty of the composition is saught to be attained rather by a judicious selection and arrangements of words**

than by striking efforts of imagination. The sentences employed are at the moderate length and carfully freed from superfluities." ఈ లక్షణమునకు దేవీ భాగవతశైలి లక్ష్యభూతముగా నుండును.

సీ॥ ద్రవ్యంబులం దెల్ల దిరశక్తి నిత్యంబు
సత్యంబు సత్యంబు సత్య మిదియ
అరసి చూడంగఁ బదార్థంబులందును
బరఁగు నభావంబు భక్కి వినుము
ప్రాగభావంబును బ్రధ్వంసకాభావ
మన నొప్పునట్టి వభావము లగు
శక్త్యభావము లేదు జగదభావమె కాని
జగదభావంబు సెప్పు సరణి వినుము
లలిని మృత్పిండములఁ గపాలంబులందు
నెన్ని చూడ ఘటాభావ మెట్లు గలదొ
యట్టులనె యది యేమన నందు నామ
రూపములు మాత్రము హుళక్కి రూఢిఁ దెలియ
3.118

తత్త్వమును అర్థప్రధాన మైన సరళపద్యరచనతో వెలయించినపద్ధతి యిది భక్తి భావస్ఫోరకముగా నిట్టి తత్త్వమునే స్తుతిరూపమున వెలయించెడిపద్ధతి కీపద్యము దృష్టాంతము.

"నమ్మితినమ్మ సర్వభువనమ్ములయమ్మ
కుమారునమ్మ వ
గలకాలము మ్రొక్కుదు
రమ్మ బమ్మనుం
గుమ్మరి చేసి మజ్జగము కుండలు వానఁగఁ
జెట్టి తీవు మా
యమ్మ భవత్ప్రసాదసమయమ్మె జయమ్మెటు
లెంచిచూచినన్." 3.681

బమ్మెర పోతరాజు పద్యనిర్మాణ మిందు పదిలపరుప బడినది. కాని, యిట్టి రచన దాను శ్రీరామకవి సర్వత్ర ప్రయోగింప లేదు. సమయ మెరిగి కొన్ని చోట్ల సమకూర్చినాడు.

"పాలు మీగడ వెన్న మేలైన పెరుగును
దొంగలించిన కుట్ర దొంగ వీవు
కొలనిలో గోపికల్ జలకంబు లాడగా
కోక లెత్తిన శుద్ధ గొంటె వీవు
సముచితాచారధర్మము నింద్రయాగంబు
వల దన్న పాషండకులుఁడ వీవు
పాలివ్వ వచ్చిన పడతిరొమ్ములు నొక్కి
చంపిన ప్రాణిహింసకుడ వీవు
నీతి యొక్కింత యేనియు నీకు నాటి
కించుదివిటీల వెదకినఁ గానరాదు
మందలోచేష్ట లిచ్చోట మాను మింక
కంసు నెఱుగవె శత్రువిధ్వంసు నినిన." 1-581

పోతన్న శైలికి స్వీయచాటూక్తి మాధుర్య మబ్బించిన పద్య మిది. చాటూక్తిలో హాస్యస్ఫూర్తి పలికించుట శ్రీరామకవి చమత్కారము.

"మదనార్తులము మేము మన్నించు మని పల్క
తనలోనను శివోహ మనుచుఁ బలుకు
నీ గుణంబులు మమ్ము నిలువనీ మని పల్క
నిర్గుణోహ మ్మని నియతిఁ బలుకుఁ
ద్వద్దీర మానహానాన మత్ర మటన్న
విని యద్వితీయోహ మనుచుఁ బలుకు
నీ తీవిమైఁ జూచి యెట్లు తాళెద మన్న
బ్రహ్మోహ మస్మి యన్ పలుకుఁ బలుకు
నెద్దె మనఁ దెద్దె మనినట్టు లివ్విధాన
దారు వోయనభావిని వారుదాను
త్రోవ మార్గంబునను దాను త్రోవఁ దొడగె
వికటముగ వ్యాసమునికుమారకుడు శుకుడు"
1-654

శుక విగ్రహము నిట్లు వర్ణించిన ఈ కవి వ్యాసుని దుఃఖమును వర్ణించిన తీరుగనుడు.

"గడగడ వడంకెఁ గడు తను గ్లాని వొడమె
చూపు మ్రాన్పడె గొం తెండె స్రుక్కె మోము
మాట బొంగురు వోయె నమ్మౌని వర్యుఁ
డావు రని యేడ్చెఁ గన్నీళ్ళు బావి నిండె"
1-547

ఈ పద్యమును చతురుడైన కవిఎవడైన వ్రాయగలడు కానికనీళ్ళు బావి నిండె ననుమాట శ్రీరామకవి యన గలడు. ఆవు రని పాత్ర యేడ్చుచుండ పరిత ఆవంత మందహాసము నిలుపుకొనుట కవకాశము కలిగించు చాటూక్తి చమత్కారమిది. ఇట్టి హాస్యస్ఫూర్తి నందించెడి పట్టులం దీకవి పాత్రరసభావ ప్రవృత్తి యందుకంటె స్వీయ చమత్కార చాటూక్తి యందలి ఆసక్తి నెక్కువగా నెడనెడ ప్రదర్శించుచుండును. అది కొన్నిచోట్ల నౌచిత్యమునకు కాలిముల్లైనను. కొన్నిచోట్ల ప్రతిపాద్యాంశము పరితల హృదయము నకు సూటిగా హత్తుకొనుటకు తోడుపడును.

"పెండ్లి వలదయ్య పెండ్లాము పెద్దజెలగ
యొడలి నెత్తురు మెత్తగా నొత్తి పీల్చు
మగుపవగలనుఁ దగిలి కామమున జిక్కి
యొద్దెలను మానవు లెఱుంగ రెఱుక లేక"
1-54

శుకు డన్న మాట లివి. మనకు వేమన్న చెప్పి నట్లుండును. శుకునిలో వేమన్నను స్ఫురింప చేసెడి చమత్కారము శ్రీరామకవిది. మహిషాసుర ప్రవృత్తిని వర్ణించునెడ నీకవి హాస్యోక్తి రమణీయ విస్ఫూర్తిని వెలార్చినది.

"నూరేండ్ల బవరాన నోటిప్రాచి దొలంగఁ
గామధేనువు పాలు గాచి త్రాగె
కదనరంగమునను గాళ్ళనొప్పులు దీరఁ
గడగి యైరావత గజము నెక్కె
ఆయోధన స్వేద మారంగ నారంగ
నందనారామంబునందుఁ దిరిగె
భయదాహవనినాద భగ్న శ్రుతుల గింగ్రు
బాయ నచ్చరపిండుపాట వినియె
కలన జెరలాడ బొరలాడ గ్రమ్ము దుమ్ము
దోన మందాకినీజలంబుల మునింగి
దున్నయై దురపుచెల్కల దున్ని దున్ని
యెక్కె దేవేంద్రు గద్దియ రక్కసుండు" 5-161

ధూమ్రాక్ష సంహారోన్ముఖ యైన కాళిక పక్కెడి క్రోధోక్తులలో తెలుగు కోపమును ప్రకటింప చేసినాడు శ్రీరామకవి.

"ప్రేలకు పాతమంగలపు పెంకునుబోని మొగంబు తోడ న
చ్చాలిత తాళసన్నిభనితాంతమహోరుయుగంబు తోడ జం
డాలివి నీవు నా యెదుట దంభము సూపెద వుండు ముండ మి
వ్వేళ నిదే తల న్నరికి వేయుదు నంచు మహో గ్రమూర్తియై" 5.587

ఎంత పరాశక్తియైనను తెలుగు కోపము వచ్చినప్పుడు 'పాతమంగలపు పెంకు' ను ఉపమాద్రవ్యముగా గ్రహింపకుండునా? 'తెలుగునాడు' రచించిన కవి కలమునుండి వెలువడిన వెలుగురవ్వ యిది.

శ్రీరామకవిపై శ్రీనాథుని ప్రభావము సీసపద్య రచనయందును, అవతారికా నిర్వహణములయందును కానవగును. కవిసార్వభౌముని ప్రౌఢ సంస్కృత సమాస గుంఫనమును వదలి ఆతని సరళ సీసపద్య నిర్మాణవైఖరి నీయన స్వీయశైలీ విన్యాసముతో వెలార్చినాడు. నిజవంశ వర్ణనావసరము నందు శ్రీరామకవి సీసములు దివ్యలాస్యములు ప్రదర్శించినవి. మచ్చుకకు –

1. "ముక్కంటి రాజన్య మూర్ధాభిషిక్తుగా
వెలయించు వా రారువేలవారు"

శుక విగ్రహము నిట్లు వర్ణించిన ఈ కవి వ్యాసుని దుఃఖమును వర్ణించిన తీరుగనుడు.

"గడగడ వడంకెఁ గడు తను గ్లాని వొడమె
చూపు మాన్పడె గొంతెండె సుక్కె మోము
మాట బొంగురు పోయె నమ్మౌని వర్యుఁ
డావు రని యేడ్చెఁ గన్నీళ్ళు బావి నిండె"
1-547

ఈ పద్యమును చతురుడైన కవిఎవడైన వ్రాయగలడు కానికన్నీళ్ళు బావి నిండె ననుమాట శ్రీరామకవి యన గలడు. ఆవు రని పాత్ర యేడ్చుచుండ పఠిత ఆవంత మందహాసము నిలుపుకొనుట కవకాశము కల్పించు చాటూక్తి చమత్కారమిది. ఇట్టి హాస్యస్ఫూర్తి నందించెడి పట్టులం దీకవి పాత్రరసభావ ప్రవృత్తి యందుకంటె స్వీయ చమత్కార చాటూక్తి యందలి ఆసక్తి నెక్కువగా నెడనెడ ప్రదర్శించుచుండును. అది కొన్నిచోట్ల నౌచిత్యమునకు కాలిములైనను, కొన్నిచోట్ల ప్రతిపాద్యాంశము పఠితల హృదయము నకు సూటిగా హత్తుకొనుటకు తోడుపడును.

"పెండ్లి వలదయ్య పెండ్లాము పెద్దజలగ
యొడలి నెత్తురు మెత్తగా నొత్తి పీల్చి
మగువవగలనుఁ దగిలి కామమున జిక్కి
యొడ్డెలను మానవు లెఱుంగ రెఱుక లేక"
1-54

శుకు డన్న మాట లివి. మనకు వేమన్న చెప్పి నట్లుండును. శుకునిలో వేమన్నను స్ఫురింప చేసెడి చమత్కారము శ్రీరామకవిది. మహిషాసుర ప్రవృత్తిని వర్ణించునెడ నీకవి హాస్యోక్తి రమణీయ విస్ఫూర్తిని వెలార్చినది.

"నూరేండ్ల బవరాన నోటిప్రాచి దొలంగఁ
గామధేనువు పాలు గాచి త్రాగె
కదనరంగమునను గాళ్ళనొప్పులు దీరఁ
గడగి యైరావత గజము నెక్కె
ఆయోధన స్వేద మారంగ నారంగ
నందనారామంబునందుఁ దిరిగె
భయదాహవనినాద భగ్న శ్రుతుల గింగ్రు
బాయ నచ్చరపిందుపాట వినియె
కలన జెరలాడ బొరలాడ గ్రమ్ము దుమ్ము
దోన మందాకినీజలంబుల మునింగి
దున్నయై దురపుచెల్కల దున్ని దున్ని
యెక్కె దేవేంద్రు గద్దియ రక్కసుండు" 5-161

ధూమ్రాక్ష సంహారోన్ముఖ యైన కాళిక పల్కెడి క్రోధోక్తులలో తెలుగు కోపమును ప్రకటింప చేసినాడు శ్రీరామకవి.

"ప్రేలకు పాతమంగలపు పెంకునుబోని మొగంబు తోడ ను
చ్చాలిత తాళసన్నిభనితాంతమహోరుయుగంబు తోడ జం
డాలివి నీవు నా యెదుట దంభము సూపెద వుండు ముండ మి
వ్వేళ నిదే తల న్నరికి వేయుదు నంచు మహోగ్రమూర్తియై'' 5.587

ఎంత పరాశక్తియైనను తెలుగు కోపము వచ్చినప్పుడు 'పాతమంగలపు పెంకు' ను ఉపమాద్రవ్యముగా గ్రహింపకుండునా? 'తెలుగునాడు' రచించిన కవి కలమునుండి వెలువడిన వెలుగురవ్వ యిది.

శ్రీరామకవిపై శ్రీనాథుని ప్రభావము సీసపద్య రచనయందును, అవతారికా నిర్వహణములయందును కాననగును. కవిసార్వభౌముని ప్రౌఢ సంస్కృత సమాస గుంఫనమును వదలి అతని సరళ సీసపద్య నిర్మాణవైఖరి నీయన స్వీయశైలీ విన్యాసముతో వెలార్చినాడు. నిజవంశ వర్ణనావసరము నందు శ్రీరామకవి సీసములు దివ్యలాస్యములు ప్రదర్శించి నవి. మచ్చుకకు –

1. "ముక్కంటి రాజన్య మూర్ధాభిషిక్తుగా
వెలయించు వా రారువేలవారు"

2 "సంతతాచ్యుతభక్తి చింతావిశేషాంత
రంగస్థ యతిరాజు గంగరాజు."

3 "అల్లూరు సీతన వల్లీపురద్వయీ
నాయకుం డారఘునాయకుండు."

4 "తన వ్రాలుతో మాన్యధారుణీ ఖండంబు
లిచ్చినా డది శౌరి మెచ్చినాడు"

5 "అతడు గాక మరెవ్వ డన్యాయవర్తియౌ
తాకూరి జోగన దరిమినాడు."

ఇవియన్నియు నొక యెత్తు శ్రీరామకవి తన తల్లి దండ్రులను కీర్తించిన సీస మొక్కటి మరియొక యెత్తు.

"కన్నయ్య పండింప గామమ్మ వండింప
లేచిన విస్తళ్ళు లెక్క లేదు
కన్నయ్య తెప్పింప గామమ్మ యిప్పింప
గొలచిన ధాన్యంబు విలువ లేదు
కన్నయ్య నిలిపింప గామమ్మ గొలిపింప
వేల్పుగొల్పుల కొక్క వేళ లేదు
కన్నయ్య వ్రాయింప గామమ్మ చేయింప
నుపకారములకు మారొడ్డు లేదు"

శ్రీనాథుని సీసపద్యమే కాదుశీలముకూడ శ్రీరామకవికి కొంత అబ్బినది. ఆ కవి ఈశ్వరార్చన కళాశీలుడు; ఈ కవియు అల్లూరు సోమేశ్వర భక్తి చిత్తుడు. పోతన తన భాగవతమును పలికించినవాడు రామభద్రు డని నిరహంకారచిత్తవృత్తిని ప్రకటించెను; భాగవత రచనల వలన మోక్షసిద్ధి నర్థించెను. శ్రీ నాథు డట్టిప్రవృత్తిని గాని, ఫలితమునుగాని కోరినవాడు కాడు. శ్రీరామకవియు దేవీభాగవతమును పరాశక్తి ప్రసాదించిన శక్తివలన రచించితి ననిగాని, మోక్ష మర్థించి పలికితి నని కాని చెప్పు కొనినట్లు కానరాదు. పురాణారంభ పద్యము నందు శ్రీ కైవల్యపదంబు చేరుటకు నైన చింతకు మారుగా సోమేశ్వరుని దక్షిణామూర్తిత్వము నందలి లీలా విభూతి ప్రదర్శింప బడినది.

"శ్రీ గౌరీ నయనాబ్జ కజ్జలమునన్ జిల్మారు నోష్ఠంబు గం
గాగోత్రస్తనిమోవిపానకమునన్ క్షాళించి తద్ధత్రరే
ఖాగోపార్థము భూతిలిప్తతను దైరెన్నట్టు దాక్షిణ్యవి
ద్యాగంభీరు మదిం దలంచెద సదా యల్లూరి సోమేశ్వరున్."

తనను రాము డని లోకులు పిలుచుటచేత, రాముడు శివభక్తుడు కావున తానును సోమేశ్వరున కీకృతిని సమర్పించుచున్నానని శ్రీరామకవి చెప్పుకొనిననాడు "చెప్పెద ఘనమగు శ్రీ భాగవతము కడగి తెలుగునన్" – అని స్వప్రత్యయముగా పలికినాడు. అధికారి కాత్మప్రత్యయ మలంకారమే. అట్లు పలుకుటలో శ్రీనాథ ప్రవృత్తి ప్రతిబింబించుచున్నది. శ్రీ నాథునివలె శ్రీరామకవియు కవితాప్రియుడు, దేవీభాగవత దుగ్ధాంబోధియం దోలలాడిన దా అభినవ శ్రీ నాథుని కవితాత్మ.

"అమృతానందనిధాన మాశ్రితబుధవ్యాపార సంస్తూయ మా
నము శ్రీదేవ్యుదయాభిరామము కళానాధాను మోదాత్మకం
బు మణిద్వీపసువర్ణవృత్తగణమున్ భూయో మహాభంగుర
మ్యము శ్రీభాగవతాభిధేయ మగు దుగ్ధాంబోధి నోలాడెదన్"

మహాకవి దాసు శ్రీరాములు స్మారకసమితివారు దేవీభాగవతమును పునర్ముద్రించి దేవీనవరాత్ర్యుత్సవములలో 1978 అక్టోబరు 10 వ తేదీన దాని నావిష్కరింప జేసినారు. శ్రీరామకవి సాహిత్యము నంతటిని ప్రకటించి తెలుగువారి కందించెడి మహా యత్నము చేయుచున్న ఆ సమితివారు అభినందింప దగినవారు, శ్రీరామకవిగారి, 'తెలుగునాడు' తేనెల విందు: దేవీభాగవతము అమృతపు విందు.

# తులసీ పూజ

ముదివేడు ప్రభాకరరావు

సహస్రశీర్షాలున్న ఆదిశేషువులా
సహస్ర దళాలు తలలూపుతుండగా
సహస్ర కిరణుని కాంతి ప్రసారంలో
చల్లని తల్లివై మా లోగిలి
వెలసితివమ్మా తులసీ !

ప్రథమ జలంలో అగ్నిగోళం ప్రభవించి
రక్తాశోకంలా జపాకుసుమంలా
ఎఱ్ఱని లోహంలా ధగధగమండగా
మా మీద దయతో, మమ్మేలు కృపతో
అగ్నిగర్భవై, ఆదివనస్పతివై
చిరునవ్వు నవ్వుతూ భువిపై
నెలకొన్నావమ్మా తులసీ !

జలమే రసంగా
రసమే అగ్నిగా
అగ్నియే ప్రాణంగా
ఆకులే తద్రక్షకులుగా
నాడులే వాహికలుగా
దళాలే శిఖిశిఖలుగా
వేళ్ళు దీర్ఘ తమస్సులో తపస్సు చేయగా
తపోమూర్తివై పంచాగ్నుల్లో నిల్చొని
పంచ భూతాల పాపాలు
పటాపంచలు చేయుచుంటివి గదమ్మ
చారుదరస్మిత లోచనచ్ఛవీ ! దేవీ ! తులసీ !

ఓ దేవీ !
నీ గర్భమే అగ్ని !
నీ వదనమే చంద్రుడు !

శాంత మహాసముద్ర ప్రతిబింబిత
అనంతాకాశం నీ కనులు !
సముద్రాకాశాలలోని
మత్స్య నక్షత్రాలే నీ కనుపాపలు !
నీ పాపలమైన మమ్ము
పరమ పాపులని తలచక
దయతో స్తన దుగ్ధము నిచ్చి
సదా సాకుమమ్మ ! లోకమాత! లీలామూర్తి !

వెలలేని
తులలేని
అతులిత సంపదల నిచ్చి
నీ నుండి మము దూరము చేయబోకమ్మా !
జపాకుసుమ సదృశమైన
లాక్షా రాగాంకితమైన
నీ పాదములే చాలమ్మా !
శీత వాతా తప క్లేశుల, ఈ దీనుల
నీ యెడ నపచారమొనర్చిన నీచుల
నీ చల్లని పాదముల స్పృశింపనిమ్మా !

అమ్మా ! ప్రథమ పాదపమా !
అగ్ని శిఖవై మా యింట వెలసి
అగ్ని క్రియలే యెఱుగని మము
నిత్యాగ్నిహోత్రుల జేసి, ~~మాచే~~
~~నా తండ్రి యెడ గల్గు దోషమ్ము బాపి~~
నీ తనయుల రక్షించినావు !
అవ్యాజ కరుణామూర్తివి గదమ్మ నీవు
తులసీ మాతా !

# గోనబుద్ధారెడ్డి కవితా వైభవం - 1

డాక్టర్ ముకురాల రామారెడ్డి

"పని బూని-యరిగండ భైరవు పేర,
ఘను పేర, మీసర గండాంకు పేర,
లలిత సద్గుణ గణాలంకారు పేర,
నలఘు నిశ్చల దయాయతబుద్ధి పేర,
నాతతకృతి పేర, నతిపుణ్యు పేర,
మా తండ్రి విట్ఠలక్ష్మీనాథు పేర;
రాజులు గోష్ఠిని రాగిల్లి పొగడ,
బదము లర్థంబులు, భావముల్, గతులు,
పదశయ్య లర్థిసౌభాగ్యముల్, యతులు,
రసములు గుంభనల్, ప్రాస సంగతులు,
నసమాన రీతుల నన్నియుఁ గలుగ
నాది కవీశ్వరుఁడైన వాల్మీకి
యాదరంబునఁ బుణ్యులందఱు మెచ్చఁ
జెప్పిన తెలుఁగున శ్రీరామచరిత
మొప్పఁజెప్పెదఁ గథాభ్యుదయ మెట్లనిన"

అని కృత్యాదిని ముగిస్తూ రామాయణాన్ని ద్విపద గేయ శైలితో తెలిగించిన గోనబుద్ధారెడ్డి పై రకంగా ప్రసంగించిన కావ్య కళాంశాలను తన రచనలో ఎంత వరకు అమరించాడో చూసి - యువ భారతీయులు అడిగిన మేరకు - యథాశక్తి యథామతి చెప్పుదా మని పూనుకొన్నాను. రంగనాథ రామాయణం ప్రతులు తిరగేస్తున్నాను. పీఠికలు ఆకర్షించాయి. అవి నన్ను ఎక్కడెక్కడికో లాగాయి. గ్రంథ కర్తృత్వం గురించి వ్రాయించిన ఆ వితండవాద రాద్ధాంతాలు నా ప్రధానోద్దేశానికి అడ్డు పడ్డాయి. వీటిని నిర్లక్ష్యంగా విడిచి దాటేసి పోవడం సాధ్యం కావడం లేదు! అతి ముఖ్యమైన విమర్శ భాగాలే, క్లుప్తంగానే చెప్పి వాటి సంగతి ముగిస్తాను. సదరు రాద్ధాంతాల సారాంశం :

## 'రామాయణంలో పిడకల వేట'

అన్న శ్లేష ఉంది. అసందర్భ విమర్శలకూ, అస్త వ్యస్త పరామర్శలకూ సంకేతంగా ఉపయోగిస్తారు పై సామెతను. దీనికి, నేను తెలుసుకొన్నంతవరకు, రెండు రూపాంతరాలు ఉన్నాయి :

రామాయణంలో 'పిడకల వేట' అనటం మరీ అసందర్భం. 'పిటకాల వేట' కావచ్చు అన్నాడు ఒక ఆలోచకుడు - బౌద్ధ రామాయణం ఉంది కదా! దానికి సరిపడవచ్చు ఈ పిటకాల వేట. గ్రంథకర్త పేరులో 'బుద్ధ' అని ఉన్నదే తప్ప ఇది బౌద్ధ రామాయణం కాదు. కాబట్టి సామెతకు ఉన్న రూపాంతర పాఠం గోనబుద్ధుని రచనకు అతకదు.

రామాయణంలో పిడకల వేట కాదు, 'పీడ కల - వేట' అంటే వాల్మీకి (గోనబుద్ధ) రామాయణం మేరకు సరిపడుతుంది అన్నాడు మరో ఆలోచకుడు - దీని విచిత్ర వివరణలాంటిదే వితండవాదుల విమర్శ: రామాయణంలో వేట మొదలు (రాముడు లేడిని కొట్టింది). పీడ కల తరవాత (త్రిజటకు వచ్చింది లేదా భరతునికి వచ్చిందైనా). వేట, పీడ కల ఈ రెండు కథా సందర్భ క్రమాలను వ్యత్యస్తం చేసి అనర్థజ్ఞుడు ఎవడో 'పీడకల-వేట' గా మార్చాడు. హ్రస్వబుద్ధి మరెవడో పీడ కల వేటను 'పిడకల వేట' గా వాడుకలోకి తెచ్చాడు. అదో వాడుక, అర్థం

పర్థం లేని వాడుక. ఇంతకూ ఈ సామెత ఎలా ప్రారంభమైందో, ఎలా మారుతూ వచ్చిందో, ఎలా నిలిచిందో బోధపడదు రంగనాథ రామాయణ కర్త రంగనాథుడు అనే వాడుకను పుట్టించినవారి వ్రాతలు చదివితే వాటి ఉపక్రమం అపక్రమంగా, గతిక్రమం వ్యతిక్రమంగా, సమాప్తి అన్యథా వ్యాప్తిగా తయారై పై సామెతకు సరిపడుతున్నాయి.

"ఈ రామాయణమునకే బుద్ధ భూవిభుడు కర్త, రంగనాథ రామాయణమని వాడుక కలదు" అని సరస్వతీ మహల్ లైబ్రరీ పుస్తకాల పట్టిక తయారు చేసినవారు వ్రాసి పెట్టారు. ఈ వాడుక సక్రమమైందే. విట్ఠలనాథుడు అనే దానికన్న తెలుగు దేశంలో ఆ పేరుకు రంగనాథుడు అనే వాడుకే ఎక్కువ. విట్ఠలనాథుని పేర రచింపబడిన రామాయణం, తెలుగు వాడుక ప్రకారం రంగనాథ రామాయణం అయిందని సూటిగా చెప్పనొల్లక 'రంగనాథుడు' అనే కవి ఒకడు ఉండి దాన్ని రచించినట్లు అపవాడుక ఎందుకు పుట్టించినట్లు ఆ వితండవాదులు? ఆ లైబ్రరీ పట్టికలో రంగనాథకవి రచితమని వ్రాసి పెట్టలేదు గదా!

ఈ అప-వాడుకను పుట్టించి, నమ్మించిన అసందర్భ పిడకల వేట వాదుల పక్షాలు రెండు: (1) కుట్రవాదులు: తెలుగులో సాహిత్యాధికార పీఠం నన్నెచోడునికీ, గోనబుద్ధునికీ, కృష్ణరాయలకూ, వేమన్నకూ దక్కనీయకుండా అల్లిన కుతంత్రాలు, కుట్రలు వీరివి. విట్ఠల పదానికి మహారాష్ట్ర కర్ణాటక ప్రాంతాలలో వాడుక ఎక్కువ. దాని పర్యాయమైన రంగనాథ పదానికి తెలుగుదేశపు వాడుక అత్యధికం అని తెలిసికూడా చేసిన కుట్రల గారడీతో 'రంగనాథుడు' అనే బూటకపు కవిని పుట్టించారు. ఆ గారడీ కవి నిలువ లేదు. బాలాజీకి తెలుగు దేశంలో వెంకటేశ్వర్లు అనే వాడుక అత్యధికంగా ఉన్నట్లే పై వాడుక కూడా.

అలాగే విట్ఠలుని పేర రచింపబడిన రామాయణం రంగనాథ రామాయణం అయిందని మరీమరీ చెప్ప వలసి వచ్చింది. "This Ramayana is vulgarly attributed to Ranganatha" అన్న సి.పి బ్రౌన్ అభిప్రాయాన్ని తుడిచి పెట్టే చారిత్రక సాక్ష్యాధారాలు ఇంతవరకూ ఎవ్వరూ చూపలేదు. తాటాకులపై ఎదో వ్రాసి పూడ్చిపెట్టి పాటవిగా చేసి ఇదిగో ఆధారం అని చూపే కుతంత్ర పరిశోధకులు ఎవరైనా తయారైతే అలా తయారు కావచ్చు రంగనాథకవి చారిత్రక వ్యక్తికాదు. కాని చారిత్రకమైన రంగనాథాలయం ఒకటి, మహబూబునగర్ తూర్పున ఉన్న బూదపూరుకు ఉత్తరాన దాదాపు 2 కి మీ దూరంలో జడ్చర్ల గట్టుపై ఉంది ప్రాచీనమైన ఈ దేవాలయానికి ప్రసిద్ధి ఎక్కువ. ఈ మండలంలో పాడువడ్డ విట్ఠలాలయాలు గూడా ఉన్నాయి. వాటికి ప్రసిద్ధిలేదు. దక్షిణం నుంచి వచ్చిన వైష్ణవోద్యమాన్ని అభిమానిస్తూ బూదపూరు దొరలూ, వారి పాళెగాళ్లూ కట్టించిన ఆలయాలై ఉంటాయి ఇవి. రంగనాథకవిని సృష్టించిన బూటకపు సాహిత్య విమర్శకులు కట్టించినవికావు. రాజులు తమ తండ్రి పేరో, తమ పేరో కలిసి వచ్చేటట్లుగా దేవతా ప్రతిష్ఠలు చేయించి పరోక్షంగా నిత్యపూజలు జరిపించె నిగూఢ విధానం అవలంబించినట్లు చరిత్రజ్ఞులకు తెలిసిందే. పై రంగనాథాలయం బుద్ధభూవిభుడు "తమ తండ్రి విట్ఠల ధరణీశు పేర...అతత కృతిపేర అతి పుణ్యు పేర...భూచక్రమున నతిపూజ్యమై వలయ" కట్టించిందే అనడానికి సందేహంలేదు. ఈ మండలంలో బూదపూరు ఒకటే కాదు. బుద్ధారం, విట్ఠాయపల్లి వంటి గ్రామాలు ప్రాచీనమైనవి ఉన్నాయి. గోన వంశానికి చెందిన రెడ్ల కుటుంబాలు ఈనాటికీ వేనకు వేలుఉన్నాయి. ఈ రామాయణం క్రీ. శ. 1276 నాటి బూదపూరు శాసనంలో పేర్కొనబడిన బుద్ధయ మనుమడు, విట్ఠల భూవరుని కొడుకు, బుద్ధ భూవరుడు, క్రీ. శ. 1324 ప్రాంతంలో రచిం

చించి అని తేల్చడానికి చారిత్రకాధారాలు సరిపడు తున్నా బీ ర కా య చిక్కు వాదాలు చూపారు కొందరు.

౫. వికట చరిత్ర కారు :- చూ. ఎం. రా. పీఠిక, రాయల్ అండ్కో ప్రచురణ, శా. శ. 1879 ఈ రామాయణ కృతికర్తలు కోన వంశీయులు "క్షత్రియులనబడు చున్నారు, కృష్ణా తీ ర వా సు లు" అన్నారు చెలికాని లచ్చారావు. అలా నిర్ణయించ డానికి ప్రమాణాలు చూపలేదు అన్నారు మల్లంపల్లి సోమశేఖర శర్మ. అదంతాసరే "దీనిని గోన బుద్ధా రెడ్డి రచించినట్లు మన దేశములో ప్రసిద్ధముగాఁ జెప్పఁబడుచుండ" అని ప్రారంభించిన శర్మగారు, తమ చెప్పనిండా అనుమానమే నా అభిప్రాయం అన్నట్లు ముగించారు. రామాయణంలో పిడరంవేట అంటే అసలు దాఖలాలు విడిచి అలాంటి అడ్డాదిడ్డి అనుమానాల వెంట బడిపోవటమే. నారాయణభట్టు "తోడయి నిర్వహింపగన్" రచితమైన భారతంలో నన్నయ చేయగలిగింది ఎంత? అని అడిగితే ఋచ్చి తంగా తేల్చి చెప్పగలిగే వారెవరు? అలాంటి గట్టి అనుమానాలు ఉదయించవు శర్మగారి వంటి వారికి. లేనిపోని అనుమానాలె చూపుతారు. ఈ లేనిపోని అనుమానాల సారాంశంలో నారాంశాలుగా చూపినవి రెండు సమస్యలు: (అ) ఉత్తర కాండ కర్తలు, బుద్ధ భూపతి కుమారులు-కాచ భూపతి? పినవిట్ఠ భూపతి తమ తాతపేరు 'విట్ఠ లక్ష్మీనాథుడు' అన డానికి బదులు 'గన్నక్షితీంద్రుఁడు' అని వ్రాసుకొన్నారనీ, అదిలేఖక దో ష ం కాకపోవచ్చు ననీ అన్నారు. (ఆ) ఈ రామాయణ కృతికర్తలు తాము చతుర్థవర్ణం వారమనో, రెడ్డికులం వా ర మ నో ఎక్కడా చెప్పుకోలేదట. అందుకని ఈ కృతి క ర్త లది రెడ్డికులం అని నిశ్చయించడానికి వీలులేదుట. ఈ రెండు సమస్యలు పరిష్కారాన్ని అపేక్షిస్తు న్నాయి, వీటి సంగతి సరిచూస్తేచాలు.

(అ) ఉన్నత కావ్యకర్తలైన ఉత్తరకాండ రచయితలు తాతపేరు తప్పు వ్రాసుకొంటారా?

"గోన వంశార్ణవ కువల ప్రియుఁడు
నా నొప్పు గోనగన్నక్షితీంద్రునకు
గానొప్పు కోటగన్నక్షితీంద్రునకు"
(మరోపాఠం)

"అనతాహిత లోకుఁడగు గోనగన్న
భూనాథ తనయుఁడు బుద్ధ భూవిభుని"

కింది గీట్లుగల చోట్లలో విట్ఠ (ల) పదం ఇముడు తుంది. పై ద్విపదలో 'గోన' పదం పునరావృత్తం కానవసరంలేదు 'నా నొప్పు విట్ఠలనాథ భూపతికి' అని కృతికర్త పాఠం కావచ్చు. దానికే చూపించిన మరో పాఠం స్వీకరిస్తే అందులో 'కోటగన్న' ఏమిటి? ఆ వంశంలో కాటయ ఉన్నాడు. కోటయ పేరు ఎవరికీ లేదు. ఇది 'గా నొప్పు విట్ఠలక్ష్మీశ లేంద్రునకు అని కావచ్చు - కింది ద్వి ప ద లో 'గన్న'పదానికిబదులు'విట్ఠ'పదం ఇముడుతుందిగదా! కూలికి ఎత్తి వ్రాసిన వాని అజ్ఞానమో, కుత్రవాదాలు సృష్టించిన లేఖక దోషమో, దీన్ని ఉన్నత కావ్య కర్తలకు అంటగట్టడం వికటం. ఉన్నత కావ్య కర్తలైన వారు తమ తాతపేరు తప్పు వ్రాసుకొన్నా రని ఆలోచించడమే వికటం. ఇది లేఖక దోషమే కాని ఉత్తర కాండ కర్తల దోషంకాజాలదు.

(ఆ) కృతికర్తలు 'చతుర్థవర్ణము వారమనికాని, తదంతర్గతమైన రెడ్డి కులము వా ర మ ని కాని' చెప్పుకో లేదట. భూపతులమని చెప్పుకొన్నారు. అది సరిపోదా? మళ్లీ రెడ్డి అని ఎందుకు చెప్పుకోవాలి? తూర్పున ఉన్న వర్థమానపురం రెడ్లూ, పడ మట ఉన్న రాయచూరు రెడ్లూ మధ్యన ఉన్న ఈ బూదపూరు గోనరెడ్ల వంశీయులే. అయినప్పుడు రెడ్డి పదం చేర్చుకోనంత మాత్రాన ఈ కృతికర్తలు రెడ్లు కారని చెప్పడం వికటం. పైమూడు వంశాలలో మధ్యన ఉన్నవారి మూల పురుషుడు అంటే రం.

రా. కృతికర్త మూల పురుషుడు. గోనకాటయ మండలేశ్వరుడు. కాబట్టి కాటభూపతి అయినాడు. కాటరెడ్డి భూపతి అననక్కరలేదు సోమశర్మ అన్నా, శాస్త్రి అన్నా ఒకే వర్గానికి చెందిన అర్థం వస్తుంది. అలాగే రెడ్డికి మారుగా, భూపతి అన్నా తెలుగు దేశంలో మండలేశ్వరుడైన రెడ్డికి బాగా చెల్లింది. అయవారం ఎత్తి బతికితే సోమయ్యవారు, ఊళ్లో పురోహిత వృత్తి ఉండి దర్జాగా బతికితే సోమయ్య సోమశర్మ అని పెట్టుకొంటాడు, యజ్ఞం చేస్తే సోమయాజి. అలాగే కాటగట్టి - కృషీవల వృత్తితో - బ్రతికితే కాటమయ్య, కోటగట్టితే కాటమరెడ్డి, కోటలు గెల్చితే కాటమ భూపతి. బుద్ధ భూపతి. అలని పూర్వులు అలా కాట భూపతి సంతతి 'రెడ్డెవడో' రాజెవడో తెల్లవారితే తెలుస్తుంది' అన్నారు శర్మగారికి తెల్లవారినా తెలియ లేదని కాదు తెలిసి చేసిన వికటం

రెడ్డికులం చతుర్థ వర్ణాంతర్గతమా? ఏ శాస్త్రం, ఏ ప్రమాణం ప్రకారం చెప్పారు శర్మగారు? రాజ్యాధినేత కాని రెడ్డి కృషీవలుడు కావచ్చు. కృషీవలులను, అమరకోశం చతుర్థవర్ణంలో చేర్చలేదు. ఆ కోశం చెప్పిన ప్రకారం పూజారులు మాత్రం శూద్రవర్గం లోనే ఉన్నారు: "దేవేన జీవతీతి దేవాజీవః. జీవ ప్రాణధారణే. దేవరచేత బ్రతుకువాడు. దేవాన్ లాతి పూజార్థమితి దేవలః. లా ఆదానే. పూజించు నిమిత్తమై దేవరను స్వీకరించువాడు. ఈ 2 కూలికి దేవరను బూజించువాని పేళ్ళు." రట్టడ్లు, రడ్లు, రెడ్లు చారిత్రక కారణాలవల్ల కృషీవలులు అయినా, కాపులు (సంరక్షకులు) అనిపించుకొన్నా, మళ్లీ క్రీ. శ. 11వ శ. లో 'శ్రీ మాధ్యదాంధ్ర దేశ క్షేమద రరవాలులు' అయినా; మళ్లీ కృషీవల స్థాయికి దిగినా చతుర్థవర్ణం వారు అయినట్టు అమరకోశం చెప్పదు. అంతకు పూర్వమున్న శాస్త్రాలు చెప్పవు. మరి ఏ ప్రమాణం ప్రకారం రెడ్డి కులాన్ని చతుర్థవర్ణంలో చేరమని అన్నారు ఈ శర్మగారు?

చతుర్థ వర్ణం తక్కువ స్థాయిది అనుకొని నేనిలా చర్చ సాగిస్తున్నానని ఎవరైనా భ్రమపడేరు సుమా! వాస్తవానికి దిగితే చతుర్థ వర్ణమే పవిత్రత మైంది. బ్రహ్మదేవుడూ, అగ్ని వంశీయులూ, దేవతలూ చదివరులంతా తిమముఖాలు మోపితే ముక్తినిచ్చే స్థాన పవిత్రత ఈ చతుర్థ వర్ణానిదే. ఇదే సంగతిని శ్రీనాథుడు బాగానే చెప్పాడు "కైటభదైత్యవైరి పదకంజము నందు దయంబునొందె, మున్నీరుకి భూరిధాత్రికిని నెంరయు నచ్చిన తోడ బుట్టువై, హాటక గర్భముఖ్య నిఖిలామరపూర్వ మహా మణి ప్రభాపాటల వర్ణమైన యొర పావన వర్ణము దీప్తి సంపదన్" (బీ పు). ఇది సరే ఈ దృక్పథం వేరు. అసలు చరిత్రకు భిన్నంగా చేసిన తప్పుడు వ్యాఖ్యలను పట్టించి చూపే సందర్భం ఇది. రైతు వృత్తిగానీ రాజువృత్తిగానీ చతుర్థవర్ణంలో చేరదని అమరకోశం చెప్పిన ప్రమాణం వేట కదా! బౌద్ధ సంఘం విచ్ఛిన్నమైన తరవాత బ్రాహ్మణేతర వాదులు చెప్పిన ప్రకారమే చెప్పాడు కదా అమరసింహుడు! అమరసింహానికి అబ్బని బ్రాహ్మణేతర సాంఘిక విజ్ఞానం సోమశేఖర శర్మ గారికి అబ్బిందనీ, రెడ్డికులం చతుర్థ వర్ణాంతర్గత మనీ చెప్పడానికి తగిన ప్రామాణిక చరిత్రాధారాలు ఏమిటి? మళ్లీ ప్రశ్న.

వృత్తులనుబట్టి నిర్ణయించిన కులవర్గాలను చెప్పింది అమరకోశం. గుణకర్మలు ప్రధానంగా కుల వర్ణ విభాగం చేసింది భగవద్గీత. ఈ రెంటినైనా ప్రమాణంగా తీసుకోకుండా వ్రాసినవారి వ్రాతలే ప్రమాణమని లోక, శాస్త్ర పరిజ్ఞానం ఉన్నవారు ఎవ్వరూ ఒప్పుకోరు కాబట్టి ఇంకా కాస్త చెప్పవలసి వస్తున్నది - చాళుక్యుల మొదటి వృత్తి ఏమిటో తెలియదు. వాళ్ళది చతుర్థవర్ణం అన్నాడు బిల్హణుడు!

"క్రమేణ తస్మాదుదియాయ వంశః శౌరేః పదాద్గాంగ ఇవ ప్రవాహః" (విక్ర. చ.). అలా కావచ్చు మరి. అయినా ఇదే బిల్హణుడు అదే చాళుక్యులు క్షత్రియులు అన్నాడు. అతని వర్ణపరిజ్ఞానం అది. ఇక అమరకోశం ప్రకారం చూసినా, భగవద్గీత ప్రకారం చూసినా రెడ్డికులం చతుర్థవర్ణంలో చేరనే లేదు. లభ్యమయ్యే నడుమంత్రపు వ్రాతలు కొన్ని ఇవి :

12వ శ. లో దొరగా ఉన్న వీరపరెడ్డిది 'చతుర్థ వంశం' అన్నది ఓ దానశాసనం (రెడ్డి సంచిక పు. 109). ఈ దానగ్రహీత పూజారి కావచ్చు. శ్రీనాథుడు వీరభద్రారెడ్డినీ అలాగే అన్నాడు. ఈ యిద్దరు పూజారి కులస్థులైనా, కరణజాతులైనా తాము చతుర్థవర్ణులై రెడ్లది చతుర్థవర్ణం అన్నారు. రెడ్డికులం చతుర్థ వర్ణాంతర్గతం అనుకొన్న శర్మగారి వ్రాతలకు పై రెండు ఆధారాలా? అవి చారిత్రక సమ్మతిమైనవా? శాస్త్ర సమ్మతిమైనవా? కనీసం అమరమైనా, భగవద్గీతైనా చదవకుండా 'గాసట బీసటల్ చదివి గాథలు ద్రవ్వేడి' వారి వలెనే వ్రాసిన శర్మగారు చరిత్ర చతురాననులా?

రెడ్డెవడో రాజెవడో ఎర్రనకు బాగా తెలిసింది: ప్రోలయ వేమ భూపాలుణ్ణి ఎర్రన సకల రాజ లాంఛనాలతో వర్ణించాడు. ఫలానా వర్ణం అని చెప్పలేదు. ప్రోలయవేముడు రాజు. ఇక వర్ణ మెందుకు చెప్పడం? అలాగే మాది గోనభూపతుల వంశం అన్నాడు రం. రా. కర్త. ప్రోలయవేముని వంశవృక్షంలో పేరు చివర ఎవరికీ రెడ్డి అని లేదు. అలాగే రం. రా. కర్త చెప్పిన వంశవృక్షంలో కూడా ఎవరికీ రెడ్డి అని లేదు. ప్రోలయవేముడూ, గోనబుద్ధుడూ రెడ్లు అని సమకాలిక చరిత్ర చెప్పింది. గోనబుద్ధుడు రెడ్డి కులస్థుడో? కాడో? అనుకొన్న శర్మగారి చరిత్ర మరోటి. ఇక్కడ అతకనిది తూర్పున వర్ధమానపురంలో ఉన్న గోనవారు రెడ్లు. సరే. పడమట రాయచూరులో ఉన్న గోనవారు రెడ్లు. సరే కానీ మధ్యన, బూదపూరు ప్రాంతంలో, పై రెండు వంశాలకు మూలపురుషులై, వారికంటె పూర్వులై, వారికంటె విస్తృతాధికారంలో ఉన్న గోనవారు, బుద్ధభూపతి వంశీయులు రెడ్లు కారట ఇది శర్మగారి వింత వాదం. విస్తృత రాజ్యాధికారాని కెక్కిన రెడ్లు 'రెడ్డి' పదాన్ని విడిచి పాలన పర్యాయమైన భూపాల-రాయ-రావు ఇత్యాది నామాంతం ధరించారన్నది చారిత్రిక వాస్తవం: "ఇతి శ్రీ వీరనారాయణ, సకల విద్యావిశారద, పెద్దకోమటి వేమ భూపాల విరచితా, శృంగార దీపికాఖ్యా, అమరుక వ్యాఖ్యా సమస్తా" ఇలాంటివెన్నో ఉదాహరణలు. ఈ వేమభూపాలుడు రెడ్డినని చెప్పుకోలేదు అతని పూర్వులలో ఎవరికీ పేరు చివర రెడ్డి అని లేదు. కాబట్టి ఇతడు రెడ్డి కాదు అని శర్మగారు నిరూపించగలిగారా? లేదే! అలాగే పేరు చివర రెడ్డి లేకున్నా గోనబుద్ధుని తండ్రి తాతలంతా రెడ్లే. వృత్తినిబట్టి, గుణకర్మలను బట్టి వాళ్ళు భూపతులు. కుబ్రాహ్మణ తంత్రంతో పుట్టి ద్విజులు అనిపించుకొన్న కృత్రిమ క్షత్రియ వర్గంలో చేరడానికి రెడ్లు ఎన్నడూ ఇష్టపడలేదు.

"గోన వంశనిజశేఖర బుద్ధి (ద్ధ) యాఖ్యపుత్రి" కుప్పాంబ అని బూదపూరులో దొరికిన మూడవ శాసనం (క్రీ. శ. 1276)లో ఉంది. ఈ బుద్ధయ కొడుకు విట్ఠల భూవరుడు. అతనికొడుకు బుద్ధభూపతి, రంగనాథ రామాయణ కృతికర్త ఇతడే. బూదపూరు, వర్ధమానపురం, రాయచూరు, తిరుప్పక్కుడ్షి (కాంచీపురం తాలూకా, చెంగల్పట్టు జిల్లా) ఈ నాలుగు ప్రాంతాలలోనూ లభించిన శాసనాలలో గోనవంశీయుల ప్రసక్తి ఉంది. ఆ శాసన కాలాలు ఆధారంగా రం. రా. కృతికర్త వంశీయుల కాలాలు- శర్మగారు చెప్పినట్లే తరానికి 30 సం॥చొప్పున లెక్కవేసి తేల్చవచ్చు.

1. గోనకాటభూపతి, క్రీ. శ. 1174, రం. రా. కృతికర్తల మూలపురుషుడు.

2. రుద్రనరేంద్రుడు, క్రీ. శ. 1204, వర్ధమానపురం గోన బుద్ధిరెడ్డికి సమకాలికుడు.

3. రుద్రనరేంద్రుని కొడుకు. క్రీ. శ. 1234. ఇతని పేరు తాత పేరే (కాటయ కావచ్చు) తిరుప్పుక్కుజ్హి శాసనంలో గోనకాటయ ఒకడున్నాడు. క్రీ. శ. 1260 ప్రాంతం వాడు. రుద్రనరేంద్రుని కొడుకు. ఈ కాటయ ఒకరా? కాదా? పరిశీలించ వలసి ఉంది. పేరు నిర్ణయంకాని ఈ భూపతి వర్ధమానపురం గోన గన్నారెడ్డికి సమకాలికుడు

4. బుద్ధభూవిభుడు. క్రీ. శ. 1264. బూదపూరు శాసనాలలో చివరిదానిలో పేర్కొన బడిన కుప్పాంబ తండ్రి ఇతడు కుప్పాంబవేయించిన శాసనకాలం క్రీ. శ. 1276

5. విట్ఠల భూవరుడు క్రీ. శ 1294. రాయచూరు గోన గన్నారెడ్డికి 'రాజ్యరక్షామణి'గా ఉన్న వాడు ఇతడే ననవచ్చు. రాయచూరు శాసనంలో శివభక్తుడుగా, రం రా. లో విష్ణుభక్తుడుగా కనిపిస్తున్నాడు. మతకలహాలు సృష్టికాకుండా ఇలా సమహిత వాదులైన వారు అనేకులు.

6. బుద్ధ భూపతి, క్రీ. శ. 1324, రం. రా. కృతికర్త. ఇవి ఈ గ్రంథ కర్తల పూర్వుల వంశ ఇలా కుదురుతున్నా 'కుదురలేదు' అంటే చెప్పే దెలా? పై పరిశీలన ప్రకారం గోనబుద్ధుడు రెడ్డి అనీ, రం. రా. రచనా కాలం-శర్మగారు ఊహించి నట్లు క్రీ.శ. 1360 - 1380 కాకుండా-క్రీ.శ. 1324 ప్రాంతం అనీ తెలుస్తున్నది.

ఇంత చారిత్రకమైన సామగ్రి ఇలా సంగతంగా సరిపడుతున్నా "రంగనాథ రామాయణ కర్తృత్వము ను గురించి విచారింపుడు" అంటూ ఇంకా ప్రశ్నిస్తూ, విశ్వవిద్యాలయ విద్యార్థులను వేధిస్తూనే ఉన్నారు పరీక్షకులు కొందరు. వీళ్ళు కూడా పై పేరాలలో ప్రసక్తికి వచ్చిన పిడకల వేట వాదుల మానస పుత్రులే.

## ఇక అవాల్మీకాల సంగతి

వాల్మీకి రచించిన సంస్కృత రామాయణంలోలేని కథాంశాలు కొన్ని గోనబుద్ధారెడ్డి ద్విపద రామాయణంలో వచ్చిపడ్డాయని ఒకరద్ది. మూలంలో లేని అలాంటి అదనపు కథాంశాలే భాస్కర రామాయణంలో కూడా కనిపించినప్పుడు పరిశీలకులు ఆశ్చర్యపడ్డారు. సంస్కృత మూలాలలో ఎందులోనూ లేని కాలనేమి వృత్తాంతం ఇటాలియన్ (సంస్కృత) ప్రతిలో కనిపిస్తే మరింత ఆశ్చర్య పడ్డారు. సంస్కృత ప్రతులే ఒకదానితో మరొకటి సరిపడని సంగతి విచారిస్తే బాగుండేది. మరెంత ఆశ్చర్యపడేవారో ఈ అమాంబాపతు పరీక్షకులు! సంస్కృత ప్రతులలోనే అన్ని పాఠభేదాలు ఎందు కున్నాయి? వాల్మీకులు ఎందరు? జాకోబ్ పండితుడు ఎత్తిచూపిన వాస్తవాల సంగతేమిటి? సురవరం ప్రతాపరెడ్డి బయట పెట్టిన 'రామాయణ విశేషాలు' ఎలా ఉన్నాయి? అని ప్రశ్నించుకొని ఇంకా కాస్త చూస్తే పరిశోధనలోకూడా అద్భుతరసం ఉందని మరిమరీ ఆశ్చర్యపడేవారు ఈ చౌచౌ పరిశీలకులు

అవాల్మీకాలు అంటే కేవలం తమవద్ద ఉన్న ప్రతితో సరిపడని కథాంశాలు గోనబుద్ధ రామాయణంలోనో, భాస్కర రామాయణంలోనో కనిపించి నంతవరకే పరిమితమా? పురాణాలనూ, కావ్యాలనూ అనువదించిన కవులంతా చేసిన సాధారణ ప్రయత్నాలు ఇలా బయట పడ్డాయి: 1. తమకు లభించిన ప్రతుల ననుసరించి కథాంశాలను కాస్త అటూఇటూ మార్చి అనువదించారు 2 కథాంశాలను పెంచారు, కుంచించారు. 3. మూలంలో ఉన్నవాటిలో కొన్నిటిని పూర్తిగా పరిహరించారు. 4. రచనాంగాలు, అలంకార రచన రసభావ వర్ణనలు వీటిని స్వంతంగా నిర్వహించిన పట్టులలో మూలగ్రంథాలకూ, అనువాదాలకూ సంబంధం ఉన్నట్లే తోచదు. అనువాద కవులుబాగా స్వతంత్రించిన భాగాలుఇవి. ఇలాంటి వన్నీ అమూలకాలే. రామాయణం విషయంలో మన వద్ద ఉన్న ప్రతితో సరిచూస్తే ప్రతి అనువాదకవీ అవాల్మీకాలను చొప్పించినట్లే రుజువవుతుంది. సరి గదా! అవాల్మీకాలు ఇన్ని అని తేల్చడం ఎవరి సాధ్యం? సమర్థుడైన అనువాదకవి మూలకర్త ప్రధాన లక్ష్యం భగ్నంకాకుండా, తన ప్రాంతీయ భాషీయం సుష్ఠుగా అమరివచ్చేటట్లుగా, వీలైనచోట్ల తన కవితా ప్రతిభతో మూలానికి మెరుగులు దిద్దే టట్లుగా జాగ్రత్త పడతాడు. అనువాదానికి అనువు గాని వాటిని వదిలివేయడంకూడా మామూలే. కావ్యాల అనువాదంలో అదేఘనం. అంతవరకే మనమూ పరిమితులమై ఈ రామాయణంలోని కావ్య కళావైభవాన్ని పరిశీలింతాం.



# స్వగతము

**కృష్ణమూర్తి**

శా॥ ఈనాడెంతయు మెప్పు చెందిన దహో యీ నా శరీరమ్ము; "తా
నానాడేమియు నిల్వజాలదు గదా!" నాశమ్ము తథ్యమ్మహో!"
"కానం జాలక పోతినంచును వృథా కార్పణ్యమేలా! సుధీ!
తానుండానుగ నిత్యమున్ మరణముల్ తానో దటల్ కానమే!

చ॥ మరణము నిత్య నూతనము; మారక ముందక నిల్వదేది; యా
దరణము లేవియైనను శివార్పణమే కద! సర్వమున్ చరా
చర వస్తు జాత మది చచ్చుచు పుట్టుచు నిట్లదే పరం
పరగ ప్రవాహి రూపమున పర్వుచునున్నవి యెంచి చూడగా!

చ॥ గతము, భవిష్య మాధ్య తన గణ్యము కాలము; లో ప్రవాహతన్
కతయగు భావి కూడ మరి కాలము వేగము నెన్న నేరమన్
మతి యది పోల్చి చూడమణి మండిత హారము నందు పోల్చు సూ
త్రత; మతి, వాసనా తతియు, తానని కల్గెడు ద్రవ్య మొక్కటే.

మ॥ మతి సంధానము లేక లేవు గద యీ మహేశ్వరి క్రీడలే
గతమున్ భావియు; నిత్య మాద్యతనమే కమ్మో! తగున్ సూత్రమై
స్మృతి; అతమ్మది వాసనాని చయ మౌ; సంఘాత పారార్థ్యతన్
అతివేలంబగు నాయహంకృతియు తానా శాస్వరూపమ్మొకా!

మ॥ జడముల్ కోర్కెలు! వాసనా నిచయమే సారమ్ము లేనట్టిదే
జడమే! కాలము భావి భూతము సంజాతమ్మహో! కావగా
జడమే వీనికి వెల్గునిచ్చెనెనడో! చైతన్య మాతండె సూ!

కం॥ మతి నిశ్చలమై యుండెడి వితమేమని ప్రశ్న పుట్టి వేదన పెంపక
కత మెయ్యది యీ ప్రశ్నకు; వితమేరికి వలసెనన్న వివరమె ఎఱుకే?
వెలుగుదు వాత్మను నేనను
ఎఱుకయె లేదని యెఱుంగ నింత నిజంబే
ఎఱిగిన వానికి కలిగిన
యెఱుకది వానికి పరమ్ము; ఇది లేనిదకా!

తే॥గీ॥ ఆత్మ ద్రష్టవ్య మన్తవ్య మనిన యెడల;
దృశ్యము, మనన సాధ్యము తెలియ మిథ్య
మనసు పోకడ లన్నిటి కనెడి ఎఱుక
ద్రష్టయను వాడు లేనిది; తిరము సుమ్మ !

ఉ॥ ఆతత బుద్ధియై మనిన మన్నది యెక్కడ కానవచ్చున
ద్వైతము ద్వైతమున్ కనగ నేనొక నాణెము; తారతమ్యముల్
పూతలు; భిన్నమౌ ముఖము వాడమి; శీల వినమ్రతా మహ
త్త్వాతిశయమ్ము చొప్ప శరణాగతి రెండిట నొక్క రీతియే ॥

ఉ॥ ఆ శరణాగతమ్మెటులు నయ్యెది మెట్టుల కల్గునంచు తా
నీశ పద్మములన్ శరణ మేర్పడు చొప్పదు చూపునే గురుం
డాశదలిర్ప నాతనిని డాయుదునంచును చింత చెంది యీ
క్లేశము పోవు తీరరయు క్లిష్టత లన్నియు ముందు నిల్వగా ॥

ఉ॥ ఎన్నిక సేయువాడొకడు ఎన్నిక సేయగ నేర్పు కల్గుటన్
మన్నన చెందుగాదె మతిమాన్యత; ఎన్నిక చెందు వస్తువౌ
సన్నము; కావున శరణు సత్యము కాదది యాత్మవంచనే
యన్నది కానవచ్చు శరణాగతి నొందెడి వాడు వాని చూడగా.

ఉ॥ కావున కోరగా బడుట, కాంక్షిత మొందగ జేయు యత్నముల్
భావిత మొందుచుండుటలు మానస మెప్పుడు పేర్చుచుండు నం
చేవిది తమ్ము కామనకు చాలిన కర్తయె గోచరింపరింపడే
యే విధి నెంచి చూచినను; ఈ హాకు లొచ్చగు తత్వలంచిలన్ ॥

చ॥ కరణములో బహిర్ముఖముగా ప్రసరించును గాన తత్ఫలం
బరయగ బాహ్య మౌ విషయ మేగద ! యత్నచయార్ద్రితంబుగా
శరణము పొంద గల్గుటది సంభవ మెట్లగు? నీశ్వరీ కృపా
పరతను తక్క ! ఇంకొకడు భాసిలదన్న విశిష్టబుద్ధితో!

ఉ॥ శ్రీశ సహోదరీ కృప విశిష్ట; మకారణ కార్య మాధ్యమున్;
నాశము లేనిదై వెలుగు నల్లడ నయ్యది ఒక్క రూపమై
ఆశయు, వాసనా తతియు నా వరణమ్ముగ కప్పివేయగా
నైశ కృపన్ మహో మహుల నంకిలి నాత్మ విచార శీలియై!

కం॥ శ్రీచ్ఛాజ్ఞాన క్రియలను; స్వేచ్ఛారూపమున బరగు చిజ్జడ కారణ.
పాచ్ఛాదిత బహునామను; స్వచ్ఛ శ్రీబోధసార సంజ్ఞిత నేకన్॥

కం॥ నుతి యించెద నేననినను; మవునమె
మతి చేష్టగనిది విదితము! మౌనమి తనకున్
గతియని యెడి యెఱుక కలగ
నితరము తెలియమి నణకువ యిది యనబరగున్

కం॥ ఇదియే శరణాగతియని; ఇదె నమ్రత యనియును, నీకై కమ్మున్
ఇదియే నిర్గుణ మయినను ఇది యైశ్వర్య గుణమయము ఇది విశ్రాంతిన్

కం॥ ఇదె తత్వద లక్ష్యార్థము
ఇదియెను మహాప్రళయ సాక్షిణీ జ్ఞానమ్మున్
ఇది కాలా తీతమునా
నిది కర్మల చేత చిక్కదిది భూమమ్మున్

కం॥ ఆత్మైక్య లోక్యకుటుంబిని
మైత్రీ వాసన కలనదె మనకు లభించున్
గాత్రము పలుకు మనసు తా
వ్రత యశోవణను పొంది భవ్యత నందన్

చ॥ ఎవరికి చెప్పగా వలయు నింత యెఱుంగని వారలెవ్వరీ
వివరము లన్నియున్ మనన వేద్యములే గద ।నెంచగా। మదిన్
దవులమి కొక్క కారణము దవ్వులనే చరియింతు నాత్మనై
భవమును; వాసనా తతి యభాసకు మూలము తెల్పి యేర్పడన్॥

చం॥ చెప్పుట, చెప్పగా వినుట చెప్పిన యంతట తెల్వి కల్గుటన్
కప్పులు కన్నులన్ మనసు కప్పది యేర్పడు స్వేచ్ఛ చేతనే
ఎప్పటి కప్పుడే విషయ మేర్పడ చూచుట బోధ కాననీ
ఎప్పటి కైననో మనమ! ఇచ్చట నిల్కడ చెంది యుండుమా!

చం॥ మననము నాకు కల్గె మహిమాన్వితరూప జయైక శీలతా
నవవరతమ్ము సల్పెడు మహోద్భుత లాస్య విలాస భావనా
జనిత మనఃక్రియా ఫలము సంస్కృతి చిత్ర విచిత్ర పద్యముల్
గణముల పేర్చుటయు నిటకాలము సద్వ్యయ మయ్యెనా యెదన్

కం॥ పద్యాలను నే వ్రాయను హృద్యమ్మను భావమైన హీనత బొరయున్
సద్యఃస్ఫురణము లేమిని, వేద్యమ్మగు విషయమేని వేరుగ తోచున్

కం॥ పద్యాలను నే వ్రాయగ హృద్యమ్మను భావ మొప్పహో యో పాధిన్
అద్యమ్మగు చిత్సదను విద్యాసర్గమున బొందు వేదన రీతిన్॥

కం॥ నీ ముచ్చట తీర్చుటలో
నో మిత్రమ నాకు కల్గె మూర్జిత సుఖమున్
నీ మమ్ముల పాటింపని
నా మననము స్నేహదృష్టి నేవని యనవే॥

# పంప-నన్నయలు: వ్యాసావతార వర్ణనము

సాంబయ్య, పరిమి, M.A.

పంచమ వేదమని ప్రసిద్ధి గాంచినదిమహాభారతము అట్టి భారత నిర్మాత వేదవ్యాసుడు. ఈ వేదవ్యాసుని అవతార వృత్తాంతము భారతమునకలదు. ఆ వృత్తాంతమును కన్నడ, తెలుగు పాఠకుల కందించిన మహాకవులు పంప నన్నయలు.

పంప మహాకవి 'ఆదిపురాణ'మును, పంప భారతమని పేరు పొందిన 'విక్రమార్జున విజయ'మును రచించెను. ఈతడు క్రీ. శ. 942 సం॥ ప్రాంతము వాడు. రాష్ట్ర కూట సామంతుడు. తూర్పు చాళుక్య రాజగు అరికేసరిఆస్థానముననుండెను. ఇతడు 'రత్న త్రయ' ప్రథముడు. 'కవితాగుణార్ణవ' బిరుదాంచితుడు. ఈతడు కావించిన కావ్యములలోని 'ఆదిపురాణ'ము జినమత గ్రంథము, రెండవదియగు 'విక్రమార్జున విజయ'ము లౌకిక ప్రబంధము. సంస్కృతభారతములోని ఇతివృత్తము 'విక్రమార్జున విజయ' మనుపేర, అర్జునుని నాయకునిగా జేసి కన్నడీకరింప బడినది. అర్జునునకు అరికేసరికి అభేదము పాటింప బడినది. ఇది ఏక నాయకాశ్రితమై లౌకికమై అర్జున పట్టాభిషేకముతో సమాప్త మగుచున్నది. 'విక్రమార్జున విజయ'ము చతుర్దశాశ్వాసపరిమిత ప్రబంధము.

నన్నయ తెనుగున భారత రచనకు శ్రీకారము చుట్టినవాడని. కవిత్రయ ప్రథముడని రా జ రా జు ఆస్థాన మహా మనీషి అని తెలియని వాడుండడు.

పంప నన్నయల భారత రచనాధ్యేయ మొకటే. అయినను ఇద్దరి పరిశీలనా దృష్టులు వేరు. ఈ భిన్నతయే పంప నన్నయలను వ్యాసహృదయ సౌధమునకు దవ్వుదాపులకు చేర్చినది. లోక ప్రసిద్ధమైన వ్యాసభారతమునగల ఆఖ్యానోపాఖ్యానములు తక్క పాండవకౌరవుల కథమాత్రము విక్రమార్జున విజయమున వెలసినది. పంపావలభా ప్రతిభచే విస్తార్ణ సన్నివేశ కల్ప్యమై అరికేసరి అభిరతి కాలవాలమై విక్రమార్జున విజయము కర్ణాటాంగనకు అంగును అందించినది. కల్పనా తల్పమున చేరిన కథా కన్యక పాఠకులకు పాణిగ్రహీతయై రసానంద డోలల చేర్చినది.

ఇది ఇ ట్లుం డ గ, ఆంధ్ర వధూటీ 'పదాక్షర' రమ్యత, హావభావ 'ప్రసన్న కథా కవితార్థయుక్తి,' వచో 'నానా రుచిరార్థసూక్తి' భారతి భారతీ మంటపమునకు మార్గమును చూపు చుండగా, ఆహ్లాదజనకమైన' ఉజ్జ్వల అస త్తర తారక హారపంక్తు'ల వెలుగులో 'సుమహద్వర్గ చతుష్క' లతాంతమ్ములకు మ్రొనసి వచ్చు మధుపమ్ముల' 'సుగీత సామగాన నినదమ్ము' లెసగ 'వేదార్థామల చ్ఛాయ'లందు 'కదలక వినుచున్న కరుల శీకరాంబు కణముల చల్లని గాడ్పు' లగల ఆంధ్రులు నన్నయ మార్గాను యాయులగుచున్నారు,

కన్నడ 'విక్రమార్జున విజయ'ము నందును ఆంధ్ర మహాభారతము నందును గల శ్రీ వేదవ్యాస మునీంద్రు నవతారవర్ణనమును పరిశీలించుట ప్రస్తుత విషయము.

విక్రమార్జునవిజయమున వ్యాసోత్పత్తి ఒక గద్య పద్యము నందు వివరింప బడినది. అది

వ. "...మత్స్యగంధియుం మత్స్యగంధను మెందు పెసరనిట్టు నడపి యమునానదీ తీరదొళిర్ప కన్నెగమల్లగొర్మె బ్రహ్మర మొమ్మనప్ప వృద్ధ పరాశర మునీంద్ర నుత్తరాపధక్కె పోగుత్తుం బందుతొఱెయ కడియొ ళోడమం నడెయిసువ మత్స్యగంధియం కండెమ్మనీ తొఱెయం పాయి సెంబుదుం సాసిర్వరేఱి దొడల్ల దీయోడం నడెయ దెంబుదుమాను నిబర బిఙ్ప మప్పె మేఱిసెందొడంతె గెయ్వె నెందోడ మేఱిసి నడెయిసువల్లి దివ్యకన్నెయనక్కర్తినోడి-

మ॥ మనదొళ్సోల్తు మునీంద్రనాకె యొడలీ దుర్గంధ
వోపంతెయో
జనగంధిత్వమనిత్తు కాండ పటదం తిర్పన్నెగం
మాడిమం
జనలం పఙ్కఅనీయె కూడు వెఱె యొళ్జ్ఞాన
స్వరూపం మహో
మునిపం పుట్టిదనంతుదివ్యమునిగ శ్లేగెయ్దొడం
తీరదే" 69

వ. అంతు నీలాంబుదశ్యామనుం కనకపింగళ జటా బంధ కళాపనుం దండకపాళ హస్తనుం కృష్ణ మృగత్వక్పరి ధాననుమాగి వ్యాసభట్టారకం పుట్టువుదు మారన నొడగొండు సత్యవతికె పునఃకన్యాభావమం దయెగెయ్దు పరాశరం పోదనిత్తల్-"70

-విక్రమార్జున విజయం, ప్రథమాశ్వాసం.

[...మత్స్యగంధి మత్స్య గంధుడను పేర పెద్ద చేసి యమునా నదీ తీరమున నుండగ బ్రహ్మ యొక్క మనుమడగు వృద్ధ పరాశరమునీంద్రుడు ఉత్తరాపధమునకు పోవుచు అచటకువచ్చి వేయి మందిగల ఓడను నడుపుచున్న మత్స్యగంధిని చూచి తన్ను నది దాటింపుమని అడిగెను. ఆమెయు సమ్మతించి ముని సమీపమునకు పడవను తీసుకొనివచ్చెను.

ఈ సందర్భమున పరాశరుడు ఆ దివ్య కన్యను ప్రేమతో చూచి మనసుపడి, ఆమె శరీరమునకుగల మత్స్య దుర్గంధము పోవునట్లనుగ్రహించి యోజన గంధిత్వమును ప్రసాదించి, మంచును సృష్టించి, దానిని కనపట్టు తెరవలెచేసి, ఆమెతో కలియగ, జ్ఞాన స్వరూపుడైన వ్యాస మహర్షి, నీలమేఘ శ్యాముడై కనక పింగళ జటాబంధకలాపుడై దండ కపాలహస్తుడై కృష్ణ మృగత్వక్పరిధానుడై అవత రించెను. *దివ్యా... ను ఏమిచేసిచను చెల్లునుగదా!* పరాశరుడు సత్యవతికి కన్యాత్వమును దయచేసి కనయునితో వెడలిపోయెను.]

కన్నడాంధ్ర కవులకు మూలము సంస్కృత భారత మగుటచే, సంస్కృత భారతమునగల వ్యాస వృత్తాంతము పరిశీల్యము —

పితుర్నావ ను శుశ్రూషార్థము నీటియందు నడుపు చున్న మత్స్యగంధిని తీర్థయాత్రాచరుడైన పరా శరుడు చూచెను.

"అతీవ రూపసంపన్నాం సిద్ధానామపి కాంక్షితాం।
దృష్ట్వైవ చ సతాన్ ధీమాంశ్చకమేచాదు దర్శనాం।
విద్వాంస్తాం వాసవీం కన్యాం కార్యవాన్ ముని
పుంగవః॥ 1. 57-57

పరాశరుడు ఆమెతో సమాగమమును కోరి నీహారమును సృజించెను. అంతయు తమోభూత మైనది. దానిని చూచి మత్స్యగంధి విస్మితయై సిగ్గుతో నిట్లనెను.

"విద్ధి మాం భగవాన్ కన్యాం సదా పితృ
వశానుగాం।
త్వత్సం యోగాచ్చ దుష్యేత కన్యాభావో
మమానఘ॥ 61
కన్యాత్వే దూషితేచాపి కథం శక్ష్యే ద్విజోత్తమ,
గంతుం గృహం గృహే చాహం ధీమాన్న
స్థాతుముత్సహే॥ 62 1. 57 అధ్యా.

అంతపరాశరుడు ఆమెకు ప్రియమును కూర్చిన నీవు కన్యగానే నుందువు అని వరమునిచ్చి నీకింకేమి వరము కావలెనో కోరుకొమ్మనెను అంతమత్స్య గంధి తనకు గాత్ర సౌగంధమును ప్రసాదింపుమని కోరెను పరాశరుడు ఆ కోర్కెను తీర్చి ఆమెతో కలియగ సద్యోగర్భమున వ్యాసుడు జన్మించెను

ఈ రెండింటిని పరిశీలించి చూచిన 'విక్రమార్జున విజయ'ము నందు ఈ కథలో కొంచెము మార్పు న్నట్లు తెలియుచున్నది. పంపడు, మత్స్యగంధి వేయిమంది గల పడవను నెట్టుకొని వచ్చినట్లు వ్రాసినాడు: ఇది (భండార్కర్ భారత ప్రతి ఆధారముగ) D 3-4 T. అ. ప్రతులలో గలదు.

"అనపత్యస్య దాశస్య సుతా తత్ప్రియ
కామ్యయా । 3
సహస్ర జన సంపూర్ణా నౌర్మయా వాహ్యతే
ద్విజ । 4 APP. I-35

వ్యాసభారతమునగల పరాశరుడు విక్రమార్జున విజయమున 'వృద్ధపరాశరుడు'గ మారెను. దీనికి కారణము ఊహ్యము. ఓడను నెట్టుకొని వచ్చుచున్న మత్స్యగంధిని చూచిన వృద్ధపరాశరునకు ఆమెపై మోహము కల్గినది. ఆమెను ప్రేమతో చూచినాడు. మత్స్యగంధిత్వమును పోగొట్టి యోజన గంధిత్వమును నొసగినాడు. వ్యాసభారతమున లేని 'మంచు తెర'ను సృష్టించి ఆమెను కలసినాడు. వ్యాస భారతమున గల కథకు కొంత మార్పుగలదు. వ్యాస భారతమున పరాశరుడు తన మనోభిప్రాయము నెరిగించుచు — అంతనామె తన పరిస్థితిని పరాశరునకు వివరించినది. నీ కన్యాత్వము దూషితము కాదని యోజన గంధిత్వమును ప్రసాదించి మంచును సృష్టించెను. అంతమత్స్యగంధి విస్మిత అయినది. వ్రీడిత అయినది.

దృష్ట్వా సృష్టం తునీహారం తతస్తం
పరమర్షిణా ।
విస్మితా సాబ్రవీత్ కన్యా వ్రీడితా చ మనస్వినీ॥ 60
(1, 57 అధ్యా)

సంశయములుగల ఆమెను సమాధానపరచి పరాశరుడు కృష్ణ ద్వైపాయుని జన్మకు కారకుడైనాడు.

ఈ సందర్భమున నన్నయ, సంస్కృత భారతమున అవ్యక్తముగానున్న భావమునన్నిటిని ఏకసూత్ర ముక్తాహారముగా గ్రుచ్చి వ్యాసుని అలంకరించినాడు.

"ఇట్లేకలింబ యేక వస్త్రయై యోడ నెక్కి వచ్చు వారి నిరీక్షించుచున్న సత్యవతిని" చూచిన పరాశరుని మనోవైకల్యమును-

సీ॥ చపలాక్షి చూడ్కుల చాడ్పున కెడ మెచ్చుఁ
జిక్కని చనుఁగవఁ జిలఁ గోరు
నన్నువ కౌఁదీగ యందంబు మదినిల్పు
జఘన చక్రంబుపైఁ జలుపు దృష్టి
యభిలాష మేర్పడు నట్లుండఁగా బల్కు
వేడ్కతో మఱుమాట వినఁగఁ దివురు
నధికలజ్జాన్వితయైన యక్కన్యక
పైఁ బడి లజ్జయుఁ బాపఁ దలఁచు.

ఆ॥ నెంత శాంతులయ్యు నెంత జితేంద్రియు
లయ్యుఁ గడు వివిక్తమయిన చోట
సతుల గోష్ఠిఁ జిత్తచలన మొందుదు రెందుఁ
గామ శక్తి నోర్వఁ గలరె జనులు."
ఆది-ప్ర-38 పద్య.

అని వర్ణించినాడు. ఈ పద్యములోని, అర్థాంతరన్యాసము పరిశీలింప దగినది. ఈ సందర్భమున విక్రమార్జున విజయమునందును పరాశరముని చైదమును పంప కవి సమర్థించుట గమనింపదగినది-

"దివ్యముని గళ్ళేగెద్దెయొడం తీఁదే"- (దివ్యమును లేమిచేసినను చెల్లునుగదా!) నన్నయ అర్థాంతర వ్యాసమును పంపకవి సమర్థనను పరిశీలించిన, వివిక్త మైనచోట, సతులగోష్ఠిలోను. ఎంత శాంతులయ్యును. ఎంత జితేంద్రియులైనను చిత్తచలన మొందుదురని. జనులు కాముశక్తి నోర్వజాలరు' అను పల్కులు దివ్యమునులేమి చేసినను చెల్లునుగదా. అను మాటల కన్న అర్థవంతముగ నున్నవని తెలియుచున్నది.

పై పద్యముపై ఒక విమర్శగలదు. శ్రీ మాపతి లక్ష్మీనారాయణరావుగారు 'నన్నయ - కవిత్వము' అను వ్యాసమున (సాహిత్యోపన్యాసములు-పుట 29 పై పద్యము మహామునులపట్ల ఉచితముగాదనియు, కీచకాది పాత్రల మనస్తత్త్వమునకు తగినట్లుగా నున్నదనియు ఇది కొన్ని తాళప్రతులలో ప్రక్షిప్త మనియు, వ్రాసి యున్నారు. కాని సంశోధిత ప్రతిని పరిశీలించినచో ఈ పద్యము క్షిప్తమైనదనియు తెలియుచున్నది.

పై సందర్భమునందు పరాశరునకు కల్గిన మనోవికారమునకు కారణము మత్స్యగంధియే. 'చపలాక్షి చూడ్కులు వాడ్పునకు' అని వివరింపబడినది. ఆమె చూపులలోని భావముల గ్రహించిన వాడగుటచే పరాశరుడు మన్మధశరాబద్ధు డయ్యెనని ఊహింపవచ్చును. ఇది పరాశరుని చిత్తచలనమే కావచ్చును. అది మత్స్యగంధిలో లేదనికాదు. మత్స్యగంధిలోని చిత్తచలనమును నన్నయ-

తరలము॥

తనువు మీన్పొలవల్పు జాలరిదాన నట్లునుగాక యే
వనపు కన్యకఁ గన్య కావ్రత మంతరించిన నెట్లు మ
జ్జనకు నింటికిఁ బోవనేర్తుఁ బ్రసాదబుద్ధి యొనర్ప న
న్మునిగణోత్తమ నాకు దోషవిముక్తి యెట్లగు నట్లుగన్॥

ఆది. ద్వి. 118 ప.

అను తరల వృత్తమునందు నిక్షిప్త పరచినాడు. ఈ పద్యమును మత్స్యగంధి తన అభ్యంతరమునకు సాకులు చెప్పుచున్నట్లున్నది. నిజముగా ఆమె మనసును మన్మధాసక్తమైనట్లు తోచును. అంతేకాదు ఇది తరల వృత్తము. ఈ విశేషవృత్త స్వీకరణము వలన మత్స్యగంధియొక్క చిత్తచలనమును నన్నయ సూచించినాడు. స్త్రీ ప్రకృతియే అంత. పురుషుని చర్యాంతర తన అభిప్రాయమును వాచ్యముచేయదు. ధ్వని మార్గమున వ్యక్తపరచును. అందుచే 'కాంతా సమ్మిత యోపదేశయుజే' అని కావ్యము తీరు ఆలంకారికులచే నిర్ణయింపబడినది.

మత్స్యగంధి చెప్పిన అభ్యంతరముల నన్నిటికి పరాశరుడు సమాధానము చెప్పెను. 'తనువు మీన్పొల' వరిదాన ననగ, యోజన గంధిత్వమును ప్రసాదించెను. 'జాలరిదాన' ననగా ఉపరిచరాఖ్య వీర్యమున పుట్టినదాన వనెను. "కన్యకావ్రత మంతరించిన నెట్లు" అనిన నీ కన్యాత్వము దూషితము కాదోడ కుండుమని సమాధాన పరచెను.

అంత-

తే॥ ఎల్లవారును జూడంగ నిట్టిదయుల
నెట్లగు సమాగ మంబని యింతియన్న
నమ్మునీంద్రుఁడు గావించె నప్పుడఖిల
దృష్టి పథరోధి నీహారతిమిర మంత"

ఆది. ద్వి. 42 ప.

ఈసందర్భమున వ్యాసభారతమున-
ఏవముక్తోభగవాన్నీహారమసృజత్ ప్రభుః।"
(1-57-59)

అని, అంత మత్స్యగంధి విస్మిత వ్రీడిత అయినట్లు కలదు. నన్నయ సత్యవతీ పరాశర సంభాషణా

నంతరమే నీహారము సృష్టింపబడినట్లు భావించినాడు నన్నయ భారతమునపరాశరుడు సృజించినది నీహారము మాత్రమే కాదు. అది 'దృష్టి పథరోధి, నీహార తిమిరము". ఇందున్న 'తిమిరము' వ్యాస భారతమున 'తమస్స'ని కలదు పంపకవి మంచును సృష్టించి దాని తెరవలె చేసినట్లుగా యెంచినాడు నన్నయ తిమిర శబ్దముచే ఒక రుచిరార్థమునుసాధించినాడు. తిమిర మనగ నైఘంటి కార్థము చీకటియే ఇచట ఈ అర్థము పొసగదు. చీకటి విషయము మూలమున లేదు నీహార' తిమిర మనగ నీహార మనెడి తిమిరమనుట కన్న తిమిరమైన నీహార మనుటయే సముచితము. తిమిరమునకు ధాత్వర్థము 'తిమ్యంతే కాముక హృదయాన్యనేనేతివా తిమిరం' (దీనిచేత కాముకహృదయము ఆర్ద్రముగా చేయబడినది). ఇచట తిమిరమునకీ అర్థము చెప్పినచో నీహారతిమిరమనగ-కాముక హృదయమును ఆర్ద్రము చేయు నీహారము. ఇచటనున్న కాముక హృదయులు పరాశర సత్యవతులు. వారిని ఆర్ద్రీభూత మనస్కులుగ జేయునట్టిది ఈ నీహార తిమిరము. అంతేకాదు ఇది వారి సమాగమ కాలమున ఇతరులకు 'దృష్టి పథరోధి' యైనను. వారికి ఉద్దీపనయై వచ్చ శ్రీయుతుడైన కృష్ణ ద్వైపాయన జన్మకు ఆధారభూతమైనది. ఇంత విశేషార్థము వ్యాస భారతమున కనరాదు. పంపకవి కావించిన మంచుతెరకు మించినదీ 'నీహారతిమిర'ము పంప భారతమును చూచిన నన్నయ పంపకవి వర్ణనలకు మెరుగులు దిద్దినట్లనిపించుచున్నది.

వేదవ్యాసావతార వృత్తాంతమునందొక విశేషము స్ఫురించుచున్నది- సత్యవతీ పరాశరులు వేదవ్యాస జన్మకారకులు పరాశరుడు తీర్థ యాత్రాపరుడు. తండ్రి నియోగమున ధర్మార్థముగ యమునానది యందు ఓడనడుపు కాంత సత్యవతి. యమునా ప్రవాహము కాలప్రతీక. అందు ఓడగడుపు కాంత సత్యవతి 'సత్య' ప్రతీక. తీర్థయాత్రా పరుడైన పరాశరుడు 'పరా' శక్తికి ప్రతీక. పరా అనగ శబ్ద (నాద) బ్రహ్మము. (పరాపశ్యంతీ మధ్య మా వైఖరీ లోని 'పరా' నాదబ్రహ్మము) ఈ 'నాద'ము 'సత్య'ముతో కలియుటచే, సత్యప్రతిపాదితములు, స్వర (నాద) ప్రధానములయిన వేదముల విగ్గడింప సామర్థ్యముగల వ్యాసమునీంద్రుడవతరించినాడు.

---

## చందాదారులకు వినతి

"నవభారతి" కి అన్నివిధాలా సహాయ సహకారములు అందిస్తున్నటువంటి పాఠకులకు రచయితలకు, అభిమానులకు కృతజ్ఞతను తెలియచేస్తున్నాము. ఇంతవరకు తమ తమ చందాలను పంపుటకు వీలుగానివారు వెంటనే పంపించవలసినదిగాను, చందాదారులుగా ఉన్నటువంటివారు తమ సభ్యత్వమును పునరుద్ధరించి యథాతథంగా తమ సహాయము సహకారము లిచ్చి అన్నివిధాల తోడ్పడవలసినదిగా విజ్ఞప్తిచేస్తున్నాము.

---

# చక్రపురి రాఘవాచార్యుని నలకథ - ఒక పరిశీలన

రచన : వడ్లమూడి దొరస్వామి నాయుడు, ఎం.ఏ.

శ్రీ వ్యాస విరచితమైన మహాభారతారణ్య పర్వమున పూర్వోత్తర కథాంశముల నలోపాఖ్యానమున్నది. ఈ ఉపాఖ్యానమును గ్రహించి తెలుగు కవులు వన్నెచిన్నెలు కల్పించి ప్రత్యేకమైన నల కథా కావ్యములను రచించినారు. అట్టి తెలుగు నల కథా కావ్యములలో చక్రపురి రాఘవాచార్యుని ద్విపద నలకథా కావ్యము విశిష్టమైనది. ఇది పూర్వోత్తర కథాంశములు గల ౯ ఆశ్వాసముల ద్విపదకావ్యము. ఈ గ్రంథము ఘటికాద్రి నరసింహున కంకిత మీయబడినది. రాఘవాచార్యులకు పూర్వము తెలుగులో నల కథాకావ్యము లున్నను వాటికి విపుల ప్రచారము లభింపలేదు. కాని రాఘవాచార్యుని నల కథ ద్విపద యందు రచింపబడి యుండుటచే కథగా చదువుకొనుటకు, పాటగా పాడుకొనుటకు అవకాశమున్నది. ఈ నల కథ జన సామాన్యమున బహుళవ్యాప్తి చెంది యున్నది. ఇందు పాతివ్రత్యము, పరదారాసక్తి వలన కలుగు అరిష్టములు, వ్యసనాభిలాషవలన కలుగు కీడులు—మున్నగు కథాంశములు పండిత పామర జనాకర్షణీయముగ కరుణరసాత్మకముగ వర్ణింపబడినవి.

చక్రపురి రాఘవాచార్యుని నల కథ ఆంధ్రలోకమున విపుల ప్రచారము నందినది. అందులకే రాఘవాచార్యుడు గ్రంథావతారికలో ఈ నల కథ సభలలో ప్రఖ్యాతి నొంది పండిత పామరులకు సులభముగా అర్థమగునట్లు రచింపబడినదని తెల్పినాడు. తెలుగు నాట పల్లెలలో ఆపత్సమయములందు రాత్రివేళ దీనిని ఆసక్తితో చదువుట నేటికిని కలదు.

రాఘవాచార్యుని నల చరిత్రలో కథారంభము భారతమునం దున్నట్లే యున్నది. నల కథేతివృత్తమును భారతమునుండి గ్రహించినను రాఘవాచార్యుడు వివిధ మార్పులను కల్పించినాడు. నలుని సత్యపరిపాలనాదక్షతను వివరించు సందర్భమున గోవ్యాఘ్ర సంవాదమున్నది. అరణ్యమున సంచరించుచున్న పులి గోవును చూచి "నీవు నా భయమునకు వెరవకున్నావు. ఇది నలుని పరిపాలన కదా, అందువలన నీకు భయము లేదు. ఈ నలచక్రవర్తి చిరకాలము రాజ్యపాలన చేయునా? చూతము. నల చక్రవర్తి పాలనానంతరమైన నిన్ను పట్టి చంపెదను" అని బెదిరించినది. ఇంతలో విష్ణుచక్రము వచ్చి యా వ్యాఘ్ర కంఠమును ఛేదించినది. నలుని పరిపాలనలో బలవంతులు బలహీనులను హింసించుట లేదని గోవ్యాఘ్ర సంవాదము వలన నిరూపితమగుటచే ఈ విషయము నేటికిని జానపదులలో బహుళవ్యాప్తి చెందియున్నది. గోవ్యాఘ్ర సంవాదము భారతము నందు కానరాదు. ఇది రాఘవాచార్యులు కల్పించిన కల్పనలలో ఒకటి.

నల కథా పూర్వభాగమందు హంస దౌత్యము, నల దౌత్యము లున్నవి. నలుడు ఉపవన విహారమునకు మంత్రితో వచ్చి హంసల సమూహమును చూచెను. ఆ హంసలను పట్టుకొనుటకు ప్రయత్నింపగ అవి మ్రానెక్కినవి. నలుని మంత్రి యా హంసల దరిమెను. అవి భూమిపై వ్రాలగ నొక హంసను నలుడు పట్టుకొనెను. నలునిచే పట్టుబడిన హంస నలునకు దమయంతి దమన మహర్షి వలన భీమునకు

జన్మించినదని, రూప గుణాది విషయాదులందు ఎవ్వరు దమయంతిని పోలదని చెప్పినది. అదే విధముగ హంస దమయంతి సమీపమునకు పోయి నలుని రూపగుణాది విషయముల తెల్పినది. హంస వృత్తాంతము రాఘవాచార్యులు కల్పింపక పోయినను ఈ నల కథయందు హంస నల దమయంతుల మధ్య దౌత్యము చేసిన విషయము మాత్రము ప్రశంసింప దగినది. హంస వాక్చాతుర్యమునకు నల దమయంతులు పరస్పరము విరహవేదన ననుభవించిరి.

దమయంతికి చేసిన శైత్యోపచారములను చెలులు భీమరాజునకు తెలిపిరి. ఇగురు పానుపుమీద దమయంతి చేర్చితే నలునిమీద గల విరహవేదనచే చిగురాకులన్నియు కమిలిపోయినవని, చల్లని నీళ్లలో దమయంతి నుంచితే వింతగ చన్నీళ్లు వేన్నీళ్లుగ మారినవని, ముత్యాల సరములా ముదితకు వైవంగ మేలైన ముత్యములు నీలంబులయినవని, పన్నీరు కడవల తెచ్చి పడతి వెన్నున బోయంగ కుతకుత మని యుడికినవనియు దమయంతి నోదార్చుటకు మా తరము కాదని చెప్పిరి. దమయంతి విరహవేదన శృంగారనైషధమునం దున్నను రాఘవాచార్యులు మరికొన్ని విశేషములను కల్పించి జనాకర్షణముగ రచించినారు.

భీమరాజు దమయంతి విరహమును చింతించి ఆడుబిడ్డల కన్న తండ్రి పౌరుషము చెడునని పెద్దలు చెప్పిన మాట నిజమని వాపోయెను. ఈ విషయము నేటికిని కలదు. ఆడపిల్లల కనిన తలిదండ్రులు వరకట్నము లిచ్చుకొనలేక తమ బిడ్డలకే విధముగ వివాహము చేయుదుమని బాధ పడుట, వివాహము చేయనిచో తమ పరువు ప్రతిష్ఠలకు భంగము కలుగునని భావించుట నేటికిని కలదు.

భీమరాజు దమయంతికి స్వయంవరము చాటించెను. దమయంతి స్వయంవర వృత్తాంతమును నారదుడింద్రాదులకు తెలియచేసెను. దమయంతి సౌందర్యముతో దేవతా స్త్రీల సౌందర్యము కూడ సరిరాదని నారదుడు తెల్పగ ఇంద్రాదులు దమయంతీ స్వయంవరమునకు పోవ నిశ్చయించుకొనిరి. నలుడును దమయంతీ స్వయంవరమునకు బయలు దేరగ మార్గమధ్యమునందు ఇంద్రాదులు కనిపించిరి. దేవతల పనుపున నలుడు దమయంతి యంతఃపురము ప్రవేశించి, తాను నలుడని దేవతల కార్యార్థమై వచ్చితినని, వారిని వివాహమాడుమని దమయంతితో చెప్పెను. నలుని తప్ప నన్యుని వరింపనని దమయంతి దృఢమైన అభిప్రాయమును వ్యక్తము చేసినది. ఈ విషయమును నలుడింద్రాదులకు తెలిపెను. వారు నలాకారముతో స్వయంవరమునకు వచ్చిరి.

స్వయంవరాగతులైన రాజులను దమయంతికి వసుదేవుడను విప్రుడు చూపినట్లు నిందు తెలుపబడినది. స్వయంవరాగతుల వృత్తాంతము భారతమునందు కానరాదు. శృంగార నైషధమునందు స్వయంవరాగతులను దమయంతికి సరస్వతీదేవి వివరించినది. రాఘవాచార్యుడు వసుదేవుడను విప్రుడు చూపినట్లు కల్పించినాడు. ఇది రాఘవాచార్యుని మరొక కల్పన. దమయంతి దేవతలను ప్రార్థించి నలుని వివాహమాడినది. నలదమయంతుల వివాహమునందు శోభనములు, ఆశీర్వాదములు చక్కగ నిందు వర్ణింపబడినవి. దేవతలు నలదమయంతులకు దివ్యవరము లిచ్చి స్వర్గమున కేగిరి. మతితోడ గురుభక్తి మానకెల్లపుడు, సతత పతివ్రతాచర్యల వీడవలదని, పతిని శ్రీపతిగాగ భావింపవలయునని, మన వంశమునకు కీర్తి నార్జింపవలయునని తల్లి దమయంతికీ పతి గృహవర్తన విశేషములను హృద్యముగ వివరించినది. ఇదొక సాంప్రదాయకముగ నేటికిని కలదు. ఆడపిల్లల తల్లిదండ్రులు తమ కుమార్తెలకు బుద్ధులు నేర్పి యత్తగారింటికి పంపుట ఆచారముగ నేటికిని కలదు.

ఈ నలకథాకావ్యమున కలియనియే యున్నది కలికి మారుపేరు కనిపింపదు. కలి యింద్రసభ నేగి దమయంతీ స్వయంవరమునకు తాను పోవ నిశ్చయించినట్లును, దుశ్శకునములు కనిపించుచున్నవని వాటి నివ్వారణమునకు తగిన ఆశీస్సులను ప్రసాదించుమని యింద్రుని కోరెను. కాని భారతమునందు దేవతలకు కలి దమయంతీ స్వయంవరానంతరము మార్గమధ్యమున కనిపించినట్లున్నది ఈ నలకథలో ఇంద్రుని సభలో కలి ప్రసంగించుట రాఘవాచార్యుడు కల్పించిన కల్పనయే. దుశ్శకునములు కనిపించినచో తాము తలపెట్టెడు కార్యములకు విఘ్నము వాటిల్లునని జానపదులు విశేషముగ చెప్పుకొనుచుందురు. నలుని శరీరము నందు ప్రవేశించుటకు కలి చిరకాలము నిరీక్షించి నొకనాడు పాదశౌచము నొకించుక తడియక యున్నప్పుడు కలి నలుని ప్రవేశించెను. పాదములు కడుగకుండా అశుభ్రముగా నున్న వ్యక్తిని శనిపట్టునని జానపదులు చెప్పుకొనుచుండుట నేటికిని కలదు.

అరణ్యమున నలదమయంతులు ఏకవస్త్రధారులై దుర్భర కష్టము లనుభవించుచున్నప్పుడు కలి వారికి మాయా బ్రహ్మణ వేషమున కనిపించి, వారి పరస్పర వియోగమునకు నాలుగు త్రోవలు చూపిన విషయము భారతమునందు లేదు. ఇది రాఘవాచార్యుని కల్పనయే. కష్టము లనుభవించుచున్నపుడు నలుడు దమయంతితో చెడి చుట్టముల చెంతకు చేరరాదని చెప్పెను. ఐశ్వర్యవంతుడై నప్పుడున్న గౌరవము ధనహీనుడుగ నున్నప్పుడుండదు. కావున ఐశ్వర్య హీనుడు చెడి చుట్టముల చెంత చేరినచో తప్పక పరాభవము చెందునని జానపదులు విశేషముగ చెప్పుకొనుచుండు విషయము ఇందు తెలుపబడినది.

అరణ్యమున దమయంతి నిద్రింప నలుడు చింతించి చీరను సగము చించుకొని వెడలిపోయెను. ఇది ధీరోదాత్తుని లక్షణ మనవచ్చునా? అని శంకింపవచ్చును. నలుని హృదయము కలి ప్రేరితము. అయ్యది బలవత్తరము కావున నలుడు దోషరహితుడు కర్కోటకు విషదగ్ధుడైన నలుడు అయోధ్యాపురము చేరెను. దమయంతి సార్థవాహులతో చేది పురము చేరినది

నలకథ ఉత్తరభాగమంతయు దమయంతి మీదుగా జరిగినది. ఇది నలకథయనుటకంటె దమయంతికథ యనుట సమంజసముగ నున్నది. నలుడు బాహుక రూపమున వంటవాడై ఋతుపర్ణుని యాశ్రయించెను. నలుడు దమయంతిని గురించి యాలోచింపలేదు కాని దమయంతి మాత్రము నలుని గూర్చియే చింతించినది. చివరకు నలుని యన్వేషించుటకు దమయంతియే ప్రయత్నించినది. వసుదేవుడను విప్రుడు బాహుక రూపమునున్న నలుని చూచి ఆ వార్తను దమయంతికి వివరించెను.

దమయంతి ద్వితీయ స్వయంవరమునకు ఋతుపర్ణుడు నలుని రథాశ్వముల నడుపుట కాహ్వానించెను. మార్గమధ్యమున ఋతుపర్ణుడు నలునకు నక్షహృదయ మను విద్య నేర్పెను. ఆ విద్యా ప్రభావముచే కర్కోటక విషదగ్ధుడైన కలి నలునకు ప్రత్యక్షమై ఎప్పటి రాజ్య విభవము గూర్చి వివరించి ప్రక్కనున్న విభీతక వృక్షము నాశ్రయించెను. అందులకే విభీతక వృక్షమును విసర్జింతురు. (విభీతక మనగ తాండ్ర చెట్టు లేక తాడిచెట్టు అని ఆంధ్ర వాచస్పత్యమున వ్రాయబడినది. ఇది తాడి జాతిలో కొమ్మలు కలది కావచ్చును "అక్షస్తుషః కర్షకః ఫలో భూతావాసః కలిద్రుమః విభీతకః అని అమరం) దమయంతి తన పాతివ్రత్యమునకు అగ్ని ప్రవేశించినది. ఆమె నిష్కలంకమునకు దేవతలు ప్రత్యక్షమయిరి. నలునకు భగవంతుడు కర్తవ్యోపదేశము చేసినట్లు ఈ కథలో మార్పు చేయబడినది,

రాఘవాచార్యుని నలచరిత్రలో ప్రబంధములలో సామాన్యముగ కానవచ్చు వర్ణనలు కథాసందర్భ

మున ననువుగ వర్ణింపబడినవి. కవి కలిపురుషుని క్రోధమును వర్ణించిన విధము పరికింతము.

భుగ భుగ నిగిడి నిప్పుల పొగ లెగయ
జొట జొట చెమటలు సోనలై కురియ
టట టట మని జొమ్ము లడబడుచుండ
..............................
నిర్జరుల్ వణకంగ నిలిచి యిట్లనియె.

అదే విధముగ దమయంతి విరహవేదన వర్ణించు సందర్భమునందును అంత్యానుప్రాసములు. యుక్త పదప్రగ్రస్తము. పురవర్ణన, నాయికానాయకుల వర్ణన, మృగయాది వర్ణనలు ప్రబంధోచితముగ వర్ణింప బడియున్నవి. మృదుమధురమగు తెలుగు పదము లతో దాక్షారామున వెల్లివిరిసిన దీ కావ్యము *

—o—

# నీ - నా బంధం

రచన: మల్లిక

నీ-నా బంధం
అంతరంగాల అనురాగం
అల్లుకొన్న రాగ బంధం

నీ-నా బంధం
పూవులో తావిలా
పరిమళించిన సౌగంధం

నీ-నా బంధం
ఊహ కందని
ఉన్నత ప్రేమబంధం

నీ-నా బంధం
చెదరని హృదయాల
తరగని మమతా బంధం

నీ-నా బంధం
తర తరాల అనుబంధం
మానవ మన గడకే
మాణిక్యమై నిలిచే బంధం

నీ-నా బంధం
తీపి కలల మధుర బంధం
సుఖ దుఃఖాల
సాగర సంగమ బంధం

———

# ఉత్తర హరి వంశము - స్త్రీ పాత్రలు

యం. గోవిందస్వామి నాయుడు,
పరిశోధక విద్యార్థి, తెలుగుశాఖ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి

ప్రాచీనాంధ్రకవి కృతులలో దురవబోధమువలన బడువానిలో నాచనసోమనాథుని ఉత్తర హరివంశము ప్రధానమైనది. ఇది ఆరాశ్వాసముల గ్రంథము. నరకాసుర వధ, శ్రీకృష్ణుడు బ్రాహ్మణ పుత్రుని బ్రతికించుట, పుత్రార్థియై కైలాసగిరిపై తపస్సుచేయుట, పౌండ్రకవాసుదేవ యుద్ధము, ఉషాపరిణయముతో కూడిన బాణాసుర వృత్తాంతము, హంసడిభకోపాఖ్యానములు ఇందలి ప్రధాన ఘట్టములు. సోమన ఆశ్వాసాంత పద్యములలో శ్రీ మదుభయకవి మిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీ మహాభారత కథానంతరంబున" అని తిక్కన నామస్మరణ చేసియుండుటచే తిక్కనకితడు పరోక్షశిష్యుడు. తిక్కన హరిహరనాథునకు తనకృతిని సమర్పించినట్లే ఇతడు తన గ్రంథమును హరిహరనాథున కంకితముచేసి తన భక్తిని చాటుకొనెను.

పాత్రపోషణ, రసపోషణ, విచిత్రపద ప్రయోగము జాతీయములు, సామెతలు వాడుట యందు సోమన దిట్ట. కవుల పాత్రపోషణము సాధారణముగ సన్నివేశములందు, విశేషణములయందు, సంభాషణల యందును కానవచ్చును.

కావ్యమున పాత్రపోషణము రెండు విధములు, కవి యొకానొక పాత్రను గూర్చి తానే వచించుట. ఇది ప్రత్యక్షమార్గము. ఆ పాత్రనుగూర్చి ఇతర పాత్రలచే చెప్పించుట. ఇది పరోక్ష మార్గము. పాత్రల కనుగుణమగు ప్రవర్తనను తదనుగుణము లయిన పలుకులను ప్రయోగించుటలో తిక్కన కోవకు చెందినవాడు నాచన సోమన. ఈతని పాత్ర పోషణ మెఱుగుటకు పూర్వము గ్రంథమున గల పాత్రలను పరికింపవలసి యున్నది. ఆ పాత్రలు జాతిని బట్టి మూడు విధములు. దైవత్వ, రాక్షసత్వ, మానవత్వములు గలవి. లింగభేదము ననుసరించి పురుష పాత్రలు, స్త్రీ పాత్రలు. ఉత్తర హరివంశమున కానవచ్చు ముఖ్యమైన పురుష పాత్రలు - నరకుడు, శ్రీకృష్ణుడు. ఇంద్రుడు, పౌండ్రకుడు. హంసడిభకులు, బాణుడు. అట్లే ముఖ్యమైన స్త్రీ పాత్రలు - ఊర్వశి, సత్యభామ, వసుంధర, రుక్మిణీదేవి, ఉషాకన్య, చిత్రరేఖ.

ఉత్తర హరివంశమున నాటకీయతతో నున్న ఘట్టము ఊర్వశీ నరక సంవాదము నరకుడు నాకమును జయించి సభామండపమున నున్న యున్నత రత్నసింహాసనాసీనుడై ఊర్వశిని తోడి తెమ్మనెను. ఆమె దిట్ట గావున భయకారణముచే "తొడవులూడ్చిన నైనం దొయ్యలి యూపుతో జిన్నబోయిన పట్లు" చెన్ను మీఱిన విధముగా వచ్చెను. బయలు మెఱయ, క్రమము దెలుప, ఆఁకఁగొలుప, అనునవి యింకను ఊర్వశి. రాకకు విశేషణమును గొలుపుచున్నవి. తన్ను బొందిన ఉభయలోక సుఖముల బొందవచ్చునని నరకుడు చెప్పగా "చతురవచో విలాస! గుణసాగర! సాగరమేఖలావనీపతియగు నీకు నింద్రలోక

భ్రాతియె" అని ఊర్వశి సంభాషించెను. ఊర్వశి పొత్తుల తొయ్యలి. నరకుడు రక్కసిరాయడు. వాని యందు వలపులేమిచే, యనేకమార్గములచేతతప్పించు కొనజూచిన యూర్వశి తుదకు మాయనవ్వు నవ్వుచు, "యాగభాగముల కధికారివి కాని నీ మగతనమేటికి? అని నిందించినది. "ఒక నా డూర్వశి మాట పొందూ హించి" మునుల నడచినాడు. ఇచటమాట పొందు యున్నది గాని ఊర్వశిని పొందుమాట లేకుండుట గుర్తింపదగినది. సోమన లంజియ, మిండటీకము మొదలగు పదములు వాడుట విరసములు కావచ్చును. సామీప్య సన్నిహితత్వముల వలన విరసముగా కన్పించుట సహజము. అట్లు చూడగా ఎఱ్ఱన — నరకుడు "అరవిందానన సత్కరింపుము మనోజాన సంక్రీడలన్" అనుటయుకూడ అసభ్యమే యగును. మరియు లంజియ మొదలగునవి తెలుగున వాత్సల్య పూరితములు. ఈ సంవాదము జుగుప్సావహమని, రసముల్లసితముకాదని కొందరి యభిప్రాయము. కాని ఇట్టి పాత్రలను విమర్శించునపుడు సీతారాము లను మనసున నిడుకొనక రంభారావణాదులను దలచు కొనవలయును.

నరకాసుర వధలో శ్రీకృష్ణునకు సహాయ పడిన వ్యక్తి సత్యభామ. నరకునితోపోరి మూర్ఛబోయిన భర్తనుచూచి శార్ఙ్గమందుకొనెను. వాడి బాణములను నరకునిపై కురిపించెను. బెదరించు గర్జనమువంటి శబ్దమునునాటుతూ సంధాన హస్తముతో, భయపడక సత్యభామ యుద్ధము గావించెను. ఆమె చెక్కులపై నున్న చెమటలు తొందరపాటుతో వీరలక్ష్మి సమర క్రమరతికు వ్రాసిన పత్ర భంగములై యొప్పెను. మెఱుపు తీగలనుండి వెలువడుచున్న ఉరుములతో కూడిన పిడుగులవలె ధనుస్సనెడి మేఘమునుండి బాణములనెడి క్రూరమయిన పిడుగులను నరకునిపై విడిచినది. అదిని (నరకుని) జూచుచు, హరిని (శ్రీకృష్ణుని) జూచుచుఁ దరహాసామృత పూరఘులం గురియించు కేళీగతిని యామె సంగ్రామ సీమలో విజ యము గైకొన్నది. సత్య యుద్ధ కౌశలమునకు మెచ్చి కృష్ణుడు ముందుగా రుక్మిణి యడిగిన కంఠా భరణమును గూడ సత్యకే ఇచ్చెను. నరకు డస్త్ర లాఘవమును మెఱయించుచు సత్యపై మర్మభేదము లగు బాణములఁ బఱపినాడు. ఆ బాణములు సత్యావ యవములందచ్చ టచ్చట గ్రుచ్చుకొని సత్య సింగా రించిన కుసుమ భూషణముల కొక కొత్త సింగార మును గూర్చినవియై- "క్రేగంటి చూపున గిఱిగొన్న సన్న గేదంగి ఱేకులకన్న దమ్ములగుచు" ఎనిమిది తెఱగుల సొబగినుమడించెను. "నీవు సమరంబె కోరుదు" అనుచు కృష్ణుడు ధనువు నందించెను. నరకుడు భూదేవి పుత్రుడు. సత్యభామ భూమాత. కుమారుడు తండ్రిపై బాణములను ప్రయోగించెను తండ్రి సొమ్మసిల్లెను. కుమారరక్షణముకంటె భర్త రక్షణము అవసరము. కనుక సత్యభామ యుద్ధము చేయుట సమంజసమగును.

కృష్ణుడు దేవేరులతో నెత్తమాడు సమయమున సత్యభామ మనస్తత్వమును చక్కగా వర్ణించినాడు నాచన సోమన. సత్య సహజముగా ఈర్ష్యా స్వభావు రాలు. కృష్ణుడు తొలుత సత్యాముఖము చూచి 'నెత్త మాడు మ'ని పలికెను. కాని సత్యభామ- "జూదటీవి, సుమాళివి" అని వ్యంగ్యముగా నతని నుడికించినది. అప్పుడా దళను గనుగొనక జాంబవతిని పిలువు మని కృష్ణు డాదేశించెను. సత్య సాసూయంబుగా కృష్ణుని తూలనాడినది.

శ్రీకృష్ణుడు చక్రమును ప్రయోగించి నరకుని సంహరించిన తర్వాత మాగువాఱిన చంద్ర మండ లము వలె వదనారవిందము వన్నె దఱుగునట్లు ఒక కాంత కానవయ్యెను. ఆమె వసుదేవ నందను ముందుట నిలిచి "ఏను వసుంధరన్ యదు కులేశ దయాకర సూకరాకృతిం బూనిన నాడు నీవు నమఁ బొందినఁ బుట్టినవాడు వీడు" అని పలికెను. ఇచ్చిన

వాడు, గైకొన్నవాడు భగవంతుడు దీనికి బాధ పడ నేల అని పుత్రశోకమును వెలిబుచ్చినది. మునుల కోరిక తీర్చుటకు, దేవతలను రక్షించుటకు పుత్రుని జంపితి వని విలపించినది భూమాత. ఇట్లు తల్లి దుఃఖము వసుంధర యెడ వ్యక్తము గావించినాడీ నాచన సోమన.

వేదకాలపు ధర్మపత్నిగా కానవచ్చు రామా తిలకము రుక్మిణీదేవి. ఆమె వినోదైకాంతి గృహములో—

"అఖిల లోకైకనాథ! నీయట్టి రూప
విక్రమౌదార్య శౌర్య వివేక నిలయు
నొక కుమారుని దయచేసి యుర్విలోన
గడుపు చల్లని కాంతలఁ గలుపు నన్ను"

అని తనకొక సుపుత్రు ననుగ్రహింపుమని శ్రీకృష్ణుని కోరినది. "యమునా తరంగ డోలాధిరోహణమున దంబు మీటెడు మరాళంబు వోలె" అనుట పుత్ర సంబంధమగు కోరిక కనువుగా నున్నదని చెప్ప నొప్పును. రుక్మిణి చిత్తవృత్తిని లేనగవు శృంగారంబుగ దిన్నలం బాలం బేదని లజ్జతోప అని వర్ణించుట రమణీయముగ నున్నది. ఇట రుక్మిణియందు భక్తియే గాక స్నేహమును కూడ జోడించుట విశేషము.

బలిచక్రవర్తి కుమారుడయిన బాణుని కుమార్తె ఉష. ఉషాదేవి మనస్సునందు మొదట శృంగార సంబంధమైన భావారంభమునకు ప్రాతిపదికగా పార్వతీ పరమేశ్వరుల గూడి వచ్చిన యప్సరసల నాట్యము, వన, జల, కేళుల వలన ఒక కోరిక జనించినది. "దెందము మీదఁ జెందొవ తేకు దెప్పర మేమియు లేదు చన్నులం జిందదు" అను పద్యమున ఉషకు పదునొకండు నర యవస్థలు కలిగినట్లు వర్ణింపబడినది.

"కడగి వైశాఖ శుక్లపక్షంబునందు
ద్వాదశి దినాంత వేళ సౌధంబు మీద
మదనకేళికిఁ గలలోనఁ గదియు నిన్ను
నెవ్వ డాతండు మగఁడు నీ కిందువదన"

అని పార్వతి త్వరలో నట్టి సుఖము నీకు కలుగు నని చెప్పి యంతర్హితమైనది. నాటినుండి ఉష విరహ బాధకు లోనై య ట్లున్నది. "కలలో కుమారు డొక డేమో చేసెన్" అనుటచే ఉషాదేవి స్వప్న వృత్తాంతము తెలియుచున్నది. అనగా ఉషానిరుద్ధుల సమాగమ వృత్తాంతము చిత్రపట లిఖితమయినది. తన స్వప్న వృత్తాంతమును చెలికత్తెయైన చిత్రరేఖకు చెప్పి పరితపించినది. చిత్రరేఖ బాణుని గొప్పదనమును గూర్చి చెప్పి ఉషాకన్యను ఓదార్చగా ఆమె— "మా తండ్రి కొలువులో మాని నీ తిలకంబ రమ్మను నా పేరు వమ్ముబోయె" అని పలువిధముల దుఃఖించినది. తనకు కాగల భర్త "ఏ దంపతులకుఁబొడమెనొ, యే దేశమునందుఁ గీర్తి కెక్కినవాడో" అని బాధ పడినది. చిత్రరేఖా దర్శితంబయిన చిత్రంబునందు మనో రమణుం గనుంగొని యుషారమణి చివరకు చిత్రరేఖద్వారా ప్రద్యుమ్న కుమారుడయిన అనిరుద్ధుని భర్తగా పొందినది. రమణీయంబయిన తదాకారంబునం దవిలి తదన్వయ నామధేయములను చిత్రరేఖ ద్వారా ఎఱింగినది.

ఉషానిరుద్ధుల వివాహమునకు కారణభూతురాలు చిత్రరేఖ. ఈమె బాణాసురుని మంత్రియైన కుంభాండుని కుమార్తె. ఉషాదేవి తన స్వప్న వృత్తాంతము తెలుపగా "నలిన దళాక్షి నీవు బలినందను కూఁతుర విట్టి నిన్ను మొక్కలమున నొక్కరుండు దన కౌగిట జేర్చునె?" అని బాణుని ప్రశంసించినది. ఉషాకన్యకు చిత్రమున గాంచిన భర్తను ఏడు దినములలో తెత్తునని మాట యిచ్చి యామెను బుజ్జ

గించినది. అనిరుద్ధుని వృత్తాంతమును తెలిపినది. యదువీర నగరమునకు పోయి నారదునితో వచ్చిన సంగతి తెలిపి అనిరుద్ధుని చేపట్టెను.

"తన మనుమనిఁ గొనిపోయిన
మనమునఁ గోపించెనేని మధుసూదనుఁ డే
మని శాప మిచ్చునో నా
కమ తలకున నీకుఁ జెప్పకిట పోవెఱతున్"

అని నారదునితో చెప్పగా నాతడు "నా చేసిన సంవిధానంబున నీవు నిశ్చలంబుగా ననిరుద్ధుంగొని పొమ్ము" అని పలికెను. తరువాత చిత్రరేఖ ఉషాంతఃపురమున కనిరుద్ధుని దెచ్చి— "ఇది నీ కోరిన ఫలమని" చూపినది. ఉష తన మనసున చిత్రరేఖ చేతలన్నియు సత్యంత చిత్రమని సంతసమందినది.

ఇట్లు శ్రీమత్సకల భాషాభూషణుడు, సాహిత్య రస పోషణ సంవిధాన చక్రవర్తి, నవీన గుణ సనాథుడయిన నాచన సోమనాథుడు పాత్ర పోషణమునందే గాక ఔచిత్య, రస, ఉపాఖ్యాన, సంఘటన, సంభాషణాది సంవిధానమునందు పేరెన్నికగన్న కవివరేణ్యుడు. తరువాతి కాలములో దిగ్దంతులుగ బరిగణింపబడిన కవి వృషభులు పలువురు సోమనాథుని కవితా రామణీయకతకు నచ్చి వారి వారి యభిరుచులను బురస్కరించుకొని యనుసరించి రనుటలో సందియము లేదు.

———

# చేమకూర హృదయోత్కర్షము

[ ప్రథమ భాగము ]

## మరీచి - అర్కార్ నందగోపాల్ రెడ్డి

తెలుఁగు ప్రౌఢ ప్రబంధములలో 'విజయవిలాసమొ'-కటి: ఇది చేమకూర వేంకటకవి ప్రణీతము: తంజాపురాధీశుఁడగు రఘునాథభూపాలు [క్రీ.శ.1630] నాస్థాన కవియగు నీతని వంశాదికమును గూర్చి పలు తెఱంగులు వినిపించును. శూద్రకులజుడని కొందఱు భోగినీ పుత్రుఁడని కొందఱందురు. శూద్రుడనిన నర్థమున్నదిగాని, భోగినీ పుత్రుఁడనుట - చేమకూరను అవమానపరచుట యగును.

ప్రభువగు రఘునాథుడు కవినిగూర్చిచెప్పుచు-

తే॥ "క్షత్రధర్మమొక్కరద నీకుఁ గలది మొదలఁ
దమ్ములు సుతుల్ హితులు గూడ మమ్ముఁ
గొలిచి
రి(తి)పుడు కృతియునుజెప్పి మాకిం పొనర్చి
తొకటఁగా దన్నిటనుఁ బ్రయోజకుఁడ వీవు"
- అనెను.

ఈ పద్యముననున్న-" క్షత్రధర్మమొక్కరద నీకుఁ గలది మొదల"లో - "నీకున్" ప్రయోగము - చేమకూరకవి ప్రత్యేక రాజ్యపాలనము జేయకున్నను కవిబ్రహ్మ తిక్కనవలె ప్రభువునకు రాజకార్యములఁ జేదోడుగ నుండియుండునని చెప్పుచున్నది; ఈ కవి వంశస్థులు మంత్రులు, సామంతులు లేదా, దండనాథులుగ నుండియుందురు; "తమ్ములు సుతుల్ హితులుగూడ మమ్ము గొలిచిరి"- ప్రయోగముగూడ తద్దానిని బలపరచుచున్నది; విజయ విలాసమునకు "ముకురం" వ్యాఖ్యాన మొనరించిన "బులుసు వేంకటరమణయ్యగారు" లీ పద్యమును రెండర్థాలతో తప్పించి వైచిరి. "ఒకటఁగా దన్నిటనుఁ బ్రయోజకుఁడవీవు" ప్రయోగమున-"ఒకటన్ - కాదు" -ఇది 'ఒకటన్' అనుటకు - "ఒక్క విషయమున మాత్రమే" యని అర్థము జెప్పుట మిక్కిలి విచారకరము; ఒక్క విషయమునగాక అనేక రంగములలో చేమకూరకు ప్రవేశమున్నది - కాబట్టియే "కృతియును జెప్పి మా కింపొనర్చితి"వని కృతిపతియగు రఘునాథుఁ డనుచున్నాడు.

క॥ "వాసించుఁ గవిత చెప్పిన
.............. .....
..............సామాన్యుడ
వే సూర్యవరప్రసాది విజ్జగమెఱుగన్" -

మొదలగు పద్యముల బరిశీలించినచో నీ కవి 'భోగినీ పుత్రుడై యుండును' అని నిరాధారముగ చెప్పుటకు సిగ్గుపడవలసి యుండును; ప్రభువు -

"...సుధామధురోక్తుల నాదరించి
మంజులపదార్థ భూషణాంబర కరంబ
కరితురంగాది వాహనోత్కరములిచ్చి-

కవినిఅసాధారణముగమన్నన లొనర్చినాడు. "మంజులపదార్థ భూషణాంబరములు" గాక, "కరి తురంగాది వాహనోత్కరములు" భోగినీ పుత్రున కేల యొసం

గెను? పోనిమ్ము, దీర్ఘ ప్రసంగాలేల?!; - "అభినవ భోజరాజ బిరుదాంకుడు శ్రీరఘునాథశౌరిచే గొనియాడబడిన చేమకూర సామాన్యుడుగాడు.

"శ్రీ సూర్యనారాయణ వరప్రసాద లబ్ధప్రసిద్ధ సారస్వత సుధాసారజనిత యశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్య తనయ వినయ ధురీణ సకల కళా ప్రవీణాచ్యుతేంద్ర రఘునాథ భూపాల దత్తహస్త ముక్తా కటక విరాజమాన వేంకటకవిరాజ ప్రణీతంబయిన" విజయ విలాసమున కావ్యరీతులెఱుంగ నేపాటివాడను?!; అయ్యో నే నెఱింగినరీతిని రేఖా మాత్రమున పలుకుచుంటిని.

క॥ "ప్రతి పద్యము నందుఁ జమ
త్కృతి గలుగం జెప్పనేర్తు పెల్లెడ దెస కౌ
కృతి వింటి మపారముగా
క్షితిలో నీ మార్గ మెవరికిన్ రాదుసుమీ"

యని "అంతటి" రఘునాథ భూపాలుడే కవిని పొగడగా — నేనింకను ఏమని పొగడిన లోకమునకు వినిపించగలదు?; ప్రబంధ రత్నములలోఁ చేరెన్నికగన్న నిద్దానిని రచించుచు కవియే —

క॥ "కావున నే నొనరించిన
యీ విజయవిలాసమనెడి కృతిరత్నంబున్
........ ............
................."

అని చెప్పికొని యున్నాడు; ఈ కవితా సౌరభ కలశమునుండి అటనట తొణికిన మధు బిందువు నే విధమున నాస్వాదించితినో చెప్పుటకు మున్నొక చిన్న విన్నపము:- గత తొమ్మిది సంవత్సరాలకు ముందు, గురువులు బోధించుచుండని 'పండిత శేఖరులు - తాపీ ధర్మారావు' గారి "హృదయోల్లాస వ్యాఖ్య" గాంచితిగాని, చదువ పరిస్థితి లేకుండెను. తదుపరి 'ఉభయ భాషాప్రవీణ - సాహిత్య విద్యా ప్రవీణ - బులుసు వేంకటరమణయ్య' గారి 'విజయ విలాసము ముకుర (అర్థము) వ్యాఖ్యాన సహితము' ప్రతిని చదువ నదృష్టము గలిగినది. ఇందు బులుసు వారు పలుపలు విశేషములఁ జర్చించిరి. కాని అనేక పద్యములను రెండు మాటలతో దాటవేసిరి. అంతియే గాక చేమకూర హృదయము నెఱింగియు ఱడవక విడిచిరి. కనుక ననుబోలు పామరుల కింకను సులభ గ్రాహ్యము కాకున్నది. ఎందరో మహానుభావులు వ్యాఖ్యానము లొనరించినను తృప్తి కలుగుటలేదు

ఎప్పుడు తీరునో నా వాంఛ!

"భోగవతి నుండి యెప్పుడు భాగీరథి దరికు వచ్చి భాసిల్లు నలారి హిమ పర్వత సైకతము నందు విహరించు - వైరవేషు వేషధునసిభాంగు నెనరు దవుల నవులనే చూచి - క్రీడగా నెఱిఁగి నది. అటనిని గూర్చి మును కామరూప భోగులవలన వినియున్నది. అప్పటి నుండి రమణము మనమునఁ బెనగొనగ యున్నది" అనుచు —

ఉ॥ "గుట్టసియాడ గబ్బి చను గుబ్బలపైఁ బుల
కాంకురావళుల్
బెట్టువ గట్టఁ గోరలు తేటలు వెట్టగ వేడు
కల్మది
న్నొట్టి కొసంగ నిచ్చెరువు తొంగలి ఱెప్పల
వీగ నొత్తగాఁ
బెట్టిన దండ దీయఁ దివిభీర మృగేక్షణ చూచె
నాతనిన్"

ఇట 'చనుగుట్టలపై' యను వావిళ్లవారి పాఠాంతరమును సమంజసముగా నున్నది; "గుట్టు + అసియాడ" ప్రయోగమున కిచ్చిన బులుసు వారి యర్థము బాగున్నది. కాని — డా॥ ఎమ్. కులశేఖర రావుగారి వంటి పండితులకు "మర్మస్థానము" అను నర్థము సమ్మతముగా నున్నది; "అసియాడ" యనగా "చలింపగా" యని అర్థమును చెప్పుచున్నారు. సరై

నడియే. కానీ సందర్భమునందది వెలితిగా దోచు చున్నది; "ఆనందాతిశయంబునం గానబడు రోమ హర్షణల్పనము నేమి మానిరి రోమాంచంబనగా నిష్పన్నమైన ప్రకాశనవిధుల్" అను "కావ్యాలంకార సంగ్రహము" లక్షణము ననుసరించి చనక్షేమగు అర్జున దర్శనముతో నులూచికి మోహాతిశయము. ఆనందాతిశయమును గల్గి- సూర్యచంద్ర కిరణము లకు కమలము, కలువ విరిసినయట్లు యంగములు విచ్చికొనియుండును.

"మజ్జనంబై పువుఁ జప్పరమ్మున నొయ్యార ముగాఁ గయినేసి దానలీలా పవిత్రుడై చెలంకల న్నగుచుండెడి సవ్యసాచి నింద్రోపలరోచిఁ జూచి" నది యులూచి; "సిగసంపెఁగపూలొనపరివగ కస్తూరి నామ మెఱుపు వలెవాటు సొగసులకు" నాటని నుతిం చినది. నీలవర్ణ కేశములకు చంద్రుని తిరస్కరించు ముఖచందమునకు, ఎఱ్ఱని చిగురుటాకువంటి పద ములగని యులూచి మెచ్చినది; మఱియు —

ఉ॥ తీరిచినట్లులున్నవి గదే కనుబొమ్మ; కన్ను లందమా

చేతులఁ గొల్వగావలయు, జేతులయందము చెప్పగిప్పరా

దూరులు మల్చి వేసినటులున్నవి; బాపురె తొమ్మలోని, సిం

గారము శేషుడే పొగడఁ గావలె నీతని రూపు రేఖలన్"

అనుకొనినది; "తీరిచినట్లులున్నవి" యను ప్రయోగమునకు "సరిదిద్దినట్లున్నవి" యని కొంద రనుచున్నారు. కాని ఈ మాట "సరిచేసినట్లు (CORRECTION)" అని వినిపించుచున్నది. కనుక పై ప్రయోగమునకు— "చక్కగ అమర్చి నట్లు" అను, అర్థమునిచ్చిన బాగుండును; "చెర లన్" పదప్రయోగమునకేగాక అమూల్యమగు నీ పద్యమును బులుకువారు సులభముగా జాలవిడిచిరి; "చేతులన్" ప్రయోగమునకు— "ఇయ్యది భరత నాట్యశాస్త్ర హస్త సాంకేతిక ప్రదర్శనము" - అనగా నిది 'నమస్కార భంగిమలో, లేదా - విచ్చిన పద్మమువలె (జోడించిన చేతులు) నుండి అర్జునుని కన్నులు పద్మమువలె నున్నవి" యను టను స్ఫురింపఁ జేయుచున్నది; 'చేయి (చేతు 'కు బహువచనరూపము "చేతులు"; అనిన- ఆ కన్నుల వన్నెచిన్నెలకు చేతులు జోడించి నమస్కరించవల సినదే;; ఇఁక - "చేతుల యందము చెప్పగిప్ప రాదు-" ఇట- "చెప్పగిప్పరాదు" ప్రయోగము మిక్కిలి లౌక్యము. 'చెప్పగిప్పవద్దు', 'వాడు గీడు అనవద్దు', 'బువ్వ గివ్వ లేదు', 'పుస్తకం గిస్తకం ఇవ్వను' మున్నగు రీతుల- 'ఖచ్చిత భావమును' తెల్పునపుడు ఉపయోగించుచుందుము; కనుక- 'ఆ కిరీటి చేతులయందము ఇంతింతని చెప్పలేము' అను టకు 'చెప్పగిప్పరాదు' ప్రయోగించి చేమకూర మిక్కిలి పరిశీలకుడగుచున్నాడు; ఏ అమరశిల్పియో అర్జునుని ఊరువులను జెక్కియుండునేమో నని పించును; 'బాపురె తొమ్మలోని సింగారమును శేషుడే పొగడఁ గావలయు'నట.- భూభారమును వహించు ఆదిశేషుని జెప్పి- శక్తివంతమును, విశాల వంశమును నైనవియని స్ఫురింప జేయుచున్నాడు కవి;

ఉలూచి— "నన్నితఁ డేలిన నొకటా నచ్చి కము లేక యుండగవచ్చు" ననుకొన్నది. అతని 'నికటామృతధారలు మరుని కటారి మెఱుంగుల కటా క్షంబులకు' పరవశమునొందినది; 'అమృతధారలు' ప్రయోగము 'మైమఱపును', 'మరుని కటారి మెఱుంగులు-' 'తీక్షణ వీక్షణములచే నొందిన ఉద్రేకమును' సూచింపఁబడుచున్నది.

క॥ "అన్నన్న! మొగము వెన్నని

యన్నన్న జయింపఁ గన్ను లన్నన్నలినా

సన్నములు; నడుము మిక్కిలి
సన్నము; మాటలు సుధాప్రసన్నము
లెన్నన్"

ఆ॥ "నువ్వుఁ బువ్వునవ్వు జవ్వని నాసిక
చివురు సవురు జవురు నువిద మోవి
మబ్బునుబ్బు గెబ్బు బిబ్బోకవతివేణి
మెఱపు నొఱపుఁ బఱపుఁ దెఱవ మేను

"న్న"కార (అను నాసిక) ధ్వని వీనుల విందొనర్చు చున్నది. ఆమె ముఖము విష్ణుసతి లక్ష్మీదేవి సోదరు డగు చంద్రుని తిరస్కరించును; 'కన్నులన్-నలినా సన్నములు'- కన్నులు తామర పువ్వులకు దాపైన దన్నమాట; ఈదుపరి పద్యమున 'వకార, బకార, ఱకార' శబ్దములు - ఆలాపించే నోటిని రసగా మార్చుచున్నవి! ఆ జవ్వని నాసిక "నువ్వు బువ్వు నవ్వు-" అనగా 'నవ్వుల పూసొగసు' కాబోలు. (నువ్వు పువ్వు నవ్విన సొగసు నాసికరూపుదాల్చు చున్నది) "చివురు సవురు జవురు నువిదమోవి" - 'చివురు' యన చిగురు, 'సవురు' యన - చక్కనైన, అందమైన, "జవురు"గాక "జవురు"యనిన- "మీఱు, పోగొట్టు" యను దేశ్యార్థముల నిచ్చు చున్నది; కాగా - ఆ. ఉలూచి పెదవి చిగురు టాకుల మృదుత్వము (కోమలత్వము)ను మీఱు చున్నది. "మబ్బునుబ్బుగెబ్బు బిబ్బోకవతివేణి"- ఇట-మబ్బునుబ్బున్ = మేఘములయొక్క గర్వ మును, గెబ్బున్ = గెంటివేయును > అని యనుట కంటె - 'నల్లని మేఘముల గర్వమును విలాసవతి వేణి అపహరించుచున్నద'న వచ్చు. (అంటే, 'మిక్కిలి నల్లనిదై యుండవచ్చున'నుట) ఆమె మేని కాంతి - "మెఱపు నొఱపుఁ బఱపున్"- సౌందర్యముయొక్క తేజమును పోగొట్టున'ట. అనిన 'మహాప్రకాశవంతమగు'నామెదేహకాంతి, ఈ పద్యములలో. దఘటితయమకములగు పదముల పొందిగిక సమ

అను ప్రాసాద్యలంకారములు నింపినాడు చేమకూర వేంకటకవి.

తనను తీసుకు వెళ్ళిన ఉలూచిని జూచినాడు, మోహనాంగి యగు నామె సౌందర్యమునకు మెచ్చి నాడు; కాని - "ఏల తోచ్కొనియిట వెచ్చెనీవెడఁగు గోమలి? భుజగమేడ? మానవాన జగమేడ? ఎంత ఘన సాహసమింతులకు" నని తలంచి-

"కాముకుడఁ గాక వ్రతినై
భూమి ప్రదక్షిణముసేయ " పోయెడివానిని కామించి తెచ్చుట తగునా యని నా దర్జునుఁడు: ఇట నుండు "కాముకుడఁ" శబ్దాంతమునున్న ద్రుత ధ్వని - బిందువును తొలగించిన (కాముకుడ)" "కాముకుడనేగాక" యనియు స్ఫురించుచున్నదని చమత్కరించవచ్చు(ఇది కేవలము చమత్కరించడమే నని పండితులు గుర్తింతురుగాక) "తోడితేఁ దగవా మగువ! వివేకమించుకైనన్ వలదా?" అనిన అర్జు నుని మాటలు వినుచుంటె ఉలూచిమీది తనకి 'మనసు'న్నదని పించును. ఏలన కొంచెయిన కోపిం చక మెత్తటిమాటలతో నడుగుచున్నాడు. "నావుడు మోమునన్ మొలక నవ్వొలయన్వలి గబ్బిగుబ్బ చన్ తీవికెఁగాన-బించుక నటించు కవున్ గనిపింపఁ బక్కె రాజీవ దళాక్షి' - "ఓ నసిశేఖర, యోజన రంజనైక లీలావహరూప! యోనుతగుణా! యిటు లానతీయ" అనునది, అంతియేగాదు-" నినుగీతి సాహితీమోహన ... .... నృపాలా!" యను టతో అర్జునుడు మెత్తబడినాడు.

"నృపాలా"- యనగా > 'ప్రజల కోరికలు నెఱ వేర్చి వారిని పాలించుట రాజుల ధర్మమని సూచింప బడుచున్నది' అని బులుసు వేంకట రమణయ్యగా రలు బహుచక్కగాఁ జెప్పిరి; కాని 'నృపాలా = న్ + ఋ + పాలా' యనుకొనన, "న్" అనునది 'వ్యతిరేకార్థమును, "ఋ"- అనునది 'అసహ్య

రము, లేదా ఏవగింపు' అనుటను చెప్పుచున్నవి యనవచ్చును: "అసహ్యకరముకానిదానను పాలించు వాడా! లేదా అనుభవింపువాడా!" యని యర్థమని చమత్కరించవచ్చును. ఈ ఉలూచి కన్నియ (రాబోవు పద్యమున చూతము) గాన "శుద్ధమైనది". కనుక "ఏవగింపులేనివాటిని పాలించువాడా! శుద్ధమైన నన్నుఁ బాలించుము" అన్నట్లు స్ఫురించును. మఱియు నులూచి - "అతులిత విలాస రేఖాకృతు లన్ వలపించి యిటులఁ ద్రిభువన లేలావతుల నల యించుటేనా వ్రతమనగా, నీకురూపవంచితమదనా!" అనినది. ఈ పద్యమునయున్న "రూపవంచిత మదనా" ప్రయోగమును - రూప = రూపమును (సౌందర్య మును) వంచితము = వంచించుట (తిరస్కరించు టకు) అదనా = అదనా (అదనుకాదని) అని అర్థ ములతో చమత్కరింపదగు అనిన - "ఓ యర్జునా! వ్రతమను నెపమున బలుకుచుందువుగాని కోరివచ్చిన సొగసుగత్తెను అనుభవించక విడచుటకు ఇది అదనా" అను,మర్మగర్భితము దాగియుండును." వ్రత విధానము తెలియనివానగాను, చెలుకువిలుకాని బారికి వెరచి నీ మఱుగుజేరితి, చేపట్టి మనుపుము" అని వేడుకొన్నది యులూచి, మఱియు-

ఉ॥ "నాయమె నీకు మేల్పడిన నాతినలంచుటా?...

. . . . . . . . . . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . . యేలుకో

తీయగఁ బంచదార వెనుతీయగఁ బల్కినన్

ద్వితీయగన్"-

అన్నది.

ఈ పద్యమున - "ఏలుకోతీయగఁ బంచదార వెనుతీయగఁ బల్కినమన్ ద్వితీయగన్" ప్రయో గము నాలోచనలఁ గలిగించుచున్నది. ఇద్దాని భావము-" చక్కెఱ వెనుక పడునట్లు (చక్కెఱకు మించి) మధురముగా మాటలాడి నన్ను రెండవ భార్యగా నేలు కొనుము" యని పండితులందురు.

కవి-"ఏలుకోతీయగ" అని యుండిన చాలు, "పంచదార వెనుతీయగ" అననేల?-'పంచదార'ను →'మధురమైన పదార్థము' అని చెప్పటకు ప్రయో గించి యుండును - అనుకొందుమేని-, పంచాదార కన్న మధురమైన పదార్థములున్నవి గదా!; నాకు- 'పంచదార వెనుతీయగ' అనునది - "పంచాదార వెలి తీయగ"గా, స్ఫురింపఁ జేయుచున్నది; → 'పంచ దార = ద్రౌపది; వెలితీయగ = వెలితిని కలిగించగా (ప్రస్తుతము ద్రౌపది అర్జునునకు వెలితిని కలిగించిన దని భావము) అని చెప్పికొన్నచో నిట భావము సొబగగుచున్నది. పసగల చేమకూర హృదయము నిదియై యుండునని భావించు నన్ను పండిత శేఖ రులు విమర్శించ కుందురు గాక!

ఉలూచి "నృప పుంగవ! యన్నిట జాణ (వు) వూరకేయనవలె నంటి (వి)గా కెఱుఁగవాయొక మాటనె మర్మకర్మముల్" అనినది; అంతటితో నాగక-

"కన్నియఁగాని వేతొకతెఁగాను, మనోహర

రూప! నీకు నే

జన్నియపట్టి యుంటి, నెల జవ్వనమంతయు

నేటిదాక; నా

కన్నులయాన, నా వలపుఁ గస్తురి నామము

తోడు, నమ్ము, కా

దిన్నను నీదుమోవి మధురామృతమానిట

బాససే పెదన్"

అని బ్రతిమలాడినది; "నేను కన్యను, పరసతిని (పరులు అనుభవించిన) గాను, ఓ మనోహర రూప! నా నడలి పోనియవ్వనమంతయు నీ కొఱక యని వ్రతముగా నుంచితిని. నా కన్నుల సాక్షిగా నీపై నున్న నా ప్రేమ పవిత్రమైనది. నమ్ముము. కాదందు వేని నీ యధరాల మధువును గ్రోలి సత్యము చేసె దను" అనుచున్నది;

"కన్నియ" ప్రయోగమున కనేక విజ్ఞులు - "వివాహము కాని దానను" అని - అర్థమును జెప్పిరి. నిఘంటువులును నిద్దానినే చెప్పుచున్నవి. కాని నాకు ఈ యర్థము తృప్తి నివ్వకున్నది; "వివాహము కాని వారందరూ" కన్నియ లని చెప్పదగునా? చేమకూర హృదయమదికాదు; "కన్నియ" యన "కన్నె పొర చెడని" యని యర్థము. - మహాకవి కాళిదాసు శకుంతలను గూర్చి చెప్పునపుడు "అనాఘ్రాతం..." అను శ్లోకమున "అనావిద్ధం రత్నం" అని ప్రయోగించెను అనిన - 'శకుంతల తొలువబడని రత్నమట' (తొలువబడని అనుటను విడమరచి చెప్పనవసరము లేదు). ఆ శకుంతల వలె నిట 'ఉలూచి' యన్న మాట: "తప్పుడు మార్గము నడచిన దాననుకొనేవు అర్జునా!" అని చెప్పి ఒప్పించడం కొఱకే ఈమె "కన్నియ" యనుచున్నది "వేళాకు తెగాను" అను ప్రయోగము కూడ నా మతమును ఏకీభవించుచున్నది.

ఎన్నియో చెప్పినది ఉలూచి. అర్జునుడందులకు సాకులు పలికాడేగాని అయ్యింతిపై గోరిక యున్నదని తరువాత (ప్రబంధమున) పద్యములనుండి గ్రహించవచ్చు: అతడు - "చక్కెర బొమ్మ! నా వ్రతము చందము దెల్పితి నంతె నీ చక్కఁదనంబుఁ గన్న నిముసంబయి - నన్నిలుపోవ శక్యమే" అని నాడు. ఇటనుండు 'చక్కెర బొమ్మ' యన "మధురమైన ఆకారము గలదానా" అనుటయు లెస్స: - 'చక్కెర మిఠాయిని' నమలియో, బాగుగ 'చప్పరించి'యో అనుభవింతుము. ఈ ఒక్క సంబోధనయే - క్రీడికి నామెను గ్రీడింప గోరికయున్నదని తప్పక తెల్పుచున్నది:

ఉలూచి అర్జునునకు 'కపురంపు టాకు మడుపుల్' అందీయ నతడు 'లేనగవుతో' నా బాగ కన్నియ మృదు హస్తములగొని సరసముగా లాగికొనినాడు; అప్పట్టున -

ఉ॥ "శయ్యకుఁ దాఁపుగా ముడుము జాఱెనదంతటఁ
జక్కదిద్ద బోఁ
బయ్యెద జాఱె, నయ్యెదిరిపాటునఁ గ్రక్కున
నీవి జాఱె, రా
జయ్యెడ నవ్విలాసిని యొయారముఁ జూచి కవుంగి
లించె, నా
నెయ్యెడ మేలె చూతురు గ్రహింపరు జాణలు
జాఱుపాటులన్

అనునొక రత్నమున్నది; - అదను కొఱకు వేచియున్న ఉలూచి ఒళ్ళు ఝల్లు మన్నది ఇప్పట్టున - ముచ్చటైన కొప్పు జారినది, జారిన కొప్పును చక్కఁ జేయ యత్నించినది గాని గబ్బిచను గుబ్బలపైనుండి పయ్యెద జాఱినది; 'కన్నియ' గదా! - సుకుమారి - సిగ్గు కలిగి ఉలిక్కి పడినది, బెదరినది. కాగా - పులిన శ్రోణిపై కట్టబడిన చీరముడి జాఱినది.

ఇట - 'ఔన్ అది సరిగానున్నది; (జాణలు = నేర్పరులు) ఎయ్యెడన్ = ఎక్కడనైనను సరే; మేలె చూతురు - మంచినే గ్రహింతురు" అని అర్థములఁ జెప్పుచు - "కొప్పు జాఱుట, పైట జాఱుట, నీవి జాఱుట, జాఱు పాటులు. జాణయగు సర్జునుఁడు వానిని లెక్కింపక జాఱుపాటులేని కుచములయందమునుజూచికౌగలించెననియు. ఆ జాఱుపాటులేయామెనికి నాగకన్యక యెడఁగల యనురాగమును వృద్ధిపఱచెననియు గ్రహింపనగును" అని బులుసు వేంకటరమణయ్య గారలను చున్నారు.

"ఔన్ = అవును గదా: ఎయ్యెడన్ = ఏ చోటైనను (సరి) మేలె = వలపునే (కోరికన్) చూతురు = చూచెదరు (గాని) జారుపాటులనే = (ఏవేవి) జారుచున్నవో (యను విచక్షణగను జ్ఞానమును) గ్రహింపరు = లెక్కచేయరు" - ఏవేవియో జాఱినవి. కడకు, నీవి (కోకముడి) జాఱినది: ఇప్పుడా నగ్న (రవిక యుండును గదా! యని వాదించకుడు) శరీరముఁ గాంచి అర్జునుడు సహనముఁ గోల్పోయి ఉలూచిని కౌగలించెనుగాని - జారుపాటులులేని కుచములయందమును జూచి కాదని తెలియనగునుగదా!

# ఆంధ్రులు - కులవ్యవస్థ - 1

## క్రీ. శే. సురవరము ప్రతాపరెడ్డి

[క్రీ. శే. సురవరము ప్రతాపరెడ్డి రచించి పెట్టిన బృహద్వ్యాసము ఇది. వ్రాత ప్రతిగా నున్నది. మన ప్రాచీన సాంఘిక వ్యవస్థను అవగాహన చేసుకొనుటకు చక్కగా తోడ్పడు ఈ వ్యాసములోని పరిశోధనా దృక్పథము ప్రశస్తమైనది. ఆంధ్రుల సాంఘిక చరిత్రను అనితర సాధ్యముగా రచించిన రెడ్డిగారు ఆంధ్రుల కులవ్యవస్థను గురించి కూడా పరిశోధించి సవిస్తరముగా రచించదలచినట్లు ఈ వ్యాసమువలన తెలియుచున్నది. ఇంతవరకు మూడు ప్రకరణములు లభించినవి. ఇట్లే కొన్ని ప్రకరణములుగా ఈ విషయమై వారు రచించినట్లు తలపవచ్చును. అవి లభ్యము కాలేదు ఈ మూడు ప్రకరణములు గూడా చేజిక్కించుకొనుటకు కొన్ని నెలలు ప్రయాసపడవలసి వచ్చినది వీటిని సంపాదించి ఇచ్చిన వారు డా॥ ముకురాల రామారెడ్డి.

ప్రస్తుతము మొదటి ప్రకరణమును ముద్రించుచున్నాము సాంఘిక పరిశోధనార్థులకు ఇది ఉత్తమమైన సంప్రదింపు సామగ్రిగా ఉపయోగపడు ననుటలో సందేహము లేదు.]

— సంపాదకులు

కాపు పదముకు నిశ్చయమైన అర్థము. ఆంధ్ర దేశమున గోదావరి జిల్లాలో కొద్దిగా, తక్కిన జిల్లాలలోను, ఆంధ్ర సరిహద్దు కర్ణాటక మండలములందు విశేషముగా ఒక తెగవారు తమ పేరుతో రెడ్డి పదమును చివరకు చేర్చుకొందురు. వీరినే సకల జనులు రెడ్డి తెగవారని లేక రెడ్డికులమువారని పరిగణించిన సంగతి అందరికీ విశదమే.

శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు "రెడ్డితెగ పూర్వోత్తర"మను శీర్షిక క్రింద చాలా వరకు ఇట్టి పదమును విమర్శించి రెడ్డిరాణి పత్రికలలో ప్రకటించిరి. అది అటులుండనిండు. మన మిప్పుడు "రెడ్డి" పదమును విమర్శింపక పూర్వము 'కాపు పదము ఆంధ్రమా? లేక కర్ణాటకమా? అని విమర్శింపవలసియున్నది.

రెడ్డితెగవారు కర్ణాటక ప్రదేశమునందున్నప్పటికిని వీరి ప్రధానశాఖలు మాత్రము నాడు భేదముతో ఏర్పడియున్నవి, నాడు భేదాచారము కేవలము ఆంధ్ర దేశముననే కలిగినది. కర్ణాటకములో ఏ తెగవారికిని "నాడు" భేదము కలుగజేయలేదు. ఆంధ్రదేశమున నివసించు బ్రాహ్మలవతురెడ్డి వారు గూడ ఒక నాడుతో మరియొకనాడు వారు భోజనము దప్ప వివాహ సంబంధములు చేయరు. ఆంధ్రదేశమున నివసించు రెడ్లకు కర్ణాటక దేశమున నివసించు రెడ్లకు అంతర్శాఖనామములొకటే. కనుక కర్ణాటక

ప్రదేశమున నుండు రెడ్లు ఆంధ్రదేశమునుండి అచ్చటికి వలసబోయిన వారాయని మన మూహింపవలసి వచ్చుచున్నది. కాబట్టి మనము కర్ణాటక భాషలో ఇట్టి పదమును విమర్శించుటకు యెంత మాత్రము అవకాశములేదు. కాని ఆంధ్ర, కర్ణాటకములకు భాష వలననేమి, రాజ్యాంగమువలననేమి ఒక విధమైన పురాతన సంబంధమున్నదని చరిత్రకారులు చెప్పుచున్నారు. ఇంతవరకు ఏ దేశము పూర్వము, ఎవరి తర్వాతది? ఆంధ్రము బోయి కర్ణాటకమాయెనా? లేక కర్ణాటకము మారి ఆంధ్రమాయెనా? ఇవి స్పష్టము కలేదు. ఇదియొక ప్రత్యేక విషయము. ఇందు చర్చించుట అనవసరము. కాబట్టి మన విషయమునకు దిగుదాము.

రెడ్డి పదమును ప్రస్తుతము కర్ణాటక భాషగా పరిగణించక కేవలము ఆంధ్రమునందే వెదకవలసియున్నందున దేశభాషలో ప్రతిశబ్దమునకు హేతు సంబంధమును బట్టి ధాతువ్యుత్పత్తి సంస్కృతమువలె లేదుగదా? కేవలము దేశీయపదములు వాడుకపై ఆధారపడియున్నవి. కాని సంస్కృత పదములు మారి మన ఆంధ్రభాషయందు విశేషపదములు, తద్భవములు, తత్సమములు, దేశీయ పర్యాయ పదములుగానవచ్చుటయేగాక, ప్రాకృతము తదితర దేశీయ పదములుగూడ కొంతవరకు రూపవైఖరి మారి ఇందులో వాడబడుచున్నవి. గనుక దేశభాషలో నీ పదములను కేవలము వాడటముపై నాధారపడక కొంతవరకు మూలస్థానము వెదకి, నిజార్థమేదని విమర్శించుటకు అవకాశము గలుగజేసినది.

కాపు పదమును విమర్శనకు దెచ్చినపుడు మొదలు మనము ఆంధ్రభాషా నిఘంటువులయందు వెదకవలసియుండును. తరువాత నిఘంటుకారులు సరియైన అర్థము వ్రాసినారా లేదా? అని నిర్ణయించి వారు పొరపాటుబడినయెడల నిజార్థమేదని కనుగొనవలసియున్నది. శబ్ద రత్నాకరము మొదలగు ఆంధ్ర నిఘంటువులయందు రెడ్డిపదమునకు "కాఁపువాని బట్టపునామ"మని వ్రాసియున్నది. ఇందులో యేమి విశేషములేదు గనుక 'కాఁపు' పదమును అట్టి నిఘంటువులయందు చూచుట అత్యవసరము? "కాపు" "కాఁపు" రెండు విధములుపదములు వేరువేరుఅర్థములతో నిఘంటువునందుకానబడుచున్నవి ద్వివిధపదములు ఉచ్చారణమునందు చెవులకు ఒకేమాదిరిగా వినబడినవికాని వ్రాతయందు అర్థసంపత్తిమునుబట్టి అర్థానుస్వారసహిత మొక 'కాఁపు' పదము అర్థానుస్వారరహితముగా మరియొక 'కాపు' పదము వ్రాయబడుచున్నది. పై ద్వివిధ పదములకు నిఘంటువులయందు అర్థములు ఈ ప్రకారముగా వ్రాసియున్నవి.

1. కాఁపు = కాఁపురము, గృహస్థుఁడు, పంట పెట్టువాఁడు, శూద్రుఁడు.

2. కాపు = కాయలుకాచుట, బాధలు తొలగించి రక్షించుట.

మొదటి పదము జాతివాచకము. రెండవ పదమునందు క్రియాసూచకము.

మొదటి జాతివాచక పదమును విమర్శింపక పూర్వము రెండవపద తత్వమును మొదలు విమర్శించుదము.

ఏ భాషయందైనను ప్రతిపదము నానార్థములతో విరాజిల్లు చున్నప్పటికిని అన్ని అర్థములయందు భావైక్యత సంబంధము కొద్దిగనైన ఉండి తీరవలయును లేనిచో నానార్థములు ఒక పదజనితమైనవనికోవవు. కావలెననియో లేక భ్రమ ప్రమాదవశముననో సందర్భములేని యర్థము మరియొక పదమునుండి తీసి ఇట్టి పదమునకు తగిలించినాడని భిన్నభావముగల అర్థమునందు సందేహించవలసి యున్నది. కాబట్టి

అర్థానుస్వారసహితమైన "కాపు" పదమునకు ఆపదలను తొలగించి రక్షించుటకు కాయలు గాచుటకు అనగా ఉత్పత్తికి ఎంతవరకు సంబంధమో చదువరులు ఊహించగలరు. మూలపదమునందు ఏకవచనమునుండిదానిఅర్థమును బహువచనముగ(కాయలు) చూపించుట రెండవ పొరపాటు పూర్వకవులు "కాపు" పదమును కాయలుకాచుటయందు ఉపయోగించలేదు. కోమలమైన చిగురుమొగ్గలను వెలుపలికి రాకడయందు ఉపయోగించినారు. ఎందుకనగా కాయలు లోపలినుండి వెలుపలికిరావు చెట్టునుండి తొలుదొలుత కాతకు పూర్వము వచ్చెడివి చిగురు మొగ్గలు ముకుళితరూపమున బయల్పడును. ఇట్టి సమయముననే, కాపు పదప్రయోగమును పూర్వకవులు జేసిరి చూడుడు.

ఉ॥ పల్లవ పుష్పసంపదలఁ బంచి
వసంతుఁడు కాపురాకకైఁ యెల్ల
వనంబు సంభ్రమములే దఁగఁదా
రొడికంబు మీటనట్లల్లన క్రోలిక్రోలి
మలయానిలుఁ దందుఁబురాణ పత్ర
ముల్ డుల్లఁగజేసె సత్క్రియఁబటు
త్వము రాముఁడు పిచ్చలింపగన్ *

ఈ పద్యము తిక్కన సోమయాజి రచించిన 'విజయసేన' మను గ్రంథము లోనిది. గ్రంథము అముద్రితము కాబట్టి నిఘంటుకారుడు "కాపు" పదమునకు ఉదాహరణముగా ఈ పద్యము లభించనందున చూపలేదు కాబోలు. మన దేశీయులు సామాన్యముగా చెట్టు కాపు గాచినది అనుటవలన దీనిని ఉదాహరణముగా చూపవచ్చునని నేను దలచుచున్నాను.

కవి తిక్కనగూడ నెల్లూరు ప్రాంతమువారు కాబట్టి వారు వారి దేశస్థులవాడుక ప్రకారము కాపుగాచుటకు బదులకాపురాకకై యని నవరించిరేమో!

అసలు ఈ పదమునకు ఉత్పత్తి ఎక్కడిదని వెదకినచో ప్రాకృత, హిందీభవముగా దోచుచున్నది. ప్రాకృత, హిందీపదములను ఆంధ్రమునందు కలిపినప్పుడు వాటి ఉచ్చారణమధ్యాంధ్రమండలము వారివి ప్రమాణములు గాజాలవు ప్రాకృతభాష నుచ్చరించు దేశమునకు సరిహద్దులలోనున్న ఆంధ్ర మండలములే ప్రమాణములు ఉదాహరణముగా మధ్యాంధ్ర దేశమున వాడబడుహిందీభవ పదములు సరిహద్దు ఆంధ్ర దేశమునందు వాడబడు హిందీ భవ పదములు కొన్ని ఇచ్చట జూపుచున్నాను.

| మధ్యాంధ్ర | = | సరిహద్దు ఆంధ్ర |
| --- | --- | --- |
| 1. ↑ కొట్టు, ధాన్యము కొట్టు | = | కోఠా, ధాన్యము కోఠా |
| 2. ↑ మొకాసాదారుఁడు | = | మక్తాదారుఁడు. |
| 3 ↑ ఫిర్కా | = | ఇలాకా |
| 4. ↑ కౌలుకిత్తు | = | కౌలుకబూల్యతు |
| 5. ↑ ముద్దాయి (నేరస్థుడు) | = | ముద్దాయి (నేరము మోపువాడు) |
| 6. ↑ కాపుగాచుట | = | కాయలు గాచుట = |

కోపులువచ్చుట, మొగ్గలు పుట్టుట. చెట్టు అంకురించుట, చిగుర్చుట.

హిందీ, ప్రాకృత సరిహద్దు ఆంధ్రమండలములు మా నైజాము ఇలాకా గాబట్టి ఇచ్చోట పై వాక్యములు హిందీభాషకు సంబంధించినవి సరియైన ఉచ్చా

* ఈ పద్యము శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారిచే రచియింపబడిన ఆంధ్రుల చరిత్ర రెండవ భాగము విజ్ఞాన చంద్రిక గ్రంథమాల 188 పుస్తకము నందు పుట 97 నుండి యెత్తి వ్రాయనైనది.

రణతో పలికెదరు గావున ఇచ్చట కోపు-అంటే తెలిసి కొందురు కాని కాపు అను పదము యిక్కడి వారికి అంతగా బోధపడదు. సాధారణముగా జాతివాచక మనుకొందురు. 'కోపు' అను పదము ఏ తెలుగు నిఘంటువునందైన వ్రాసియున్నదాయని పలు నిఘంటువులను చూచితిని. దేనియందును ఈ పదము వ్రాయలేదుగాని 'శ్రీ లక్ష్మీనారాయణము' అను ఆంధ్రనిఘంటువునందు

కోపులు = నతి (నమస్కారము. కేలు మొగుపు) చూ. ఎరగుడు.

ఎరగుడు = రయిచూపులు, కేలెసలు, కేలు మొగుపు, కోపులు, గిడిగిళ్ళు, గుంజిళ్ళు, గొబ్బిళ్ళు, చాగిలింత, చిన్నిదము, చిన్నిపువ్వులు, చిన్నిపూరేకులు, చెమొడ్పు, జోహారు, తొంగలిపాట్లు, దండము, మొక్కు, పిడికిలింత, మొగుపు, మొడుపు, సలాము ఎరగుడు, కోపులు అను పదములకు నికట సంబంధమున్నది. ఏలనన ఉత్పత్తికి పూర్వము వస్తువు తిరోభావము, అపరిచితము. ఉత్పత్తి అనంతరము. పరిచయము. ప్రకటన. ఇదే పదమునకు పార్సీభాష యందు ఉత్పత్తిని గురించి "పైదాహోనా" అనగా ప్రకటమగుట, కనుపించుట లేక పుట్టుటఅని తాత్పర్యము. చిన్నిపువురేకులు, చెముడ్పు, మొగ్గలు, మొక్కు, దండము మొదలైన పదములుగూడ ఆకృతినిబట్టి ముకుళిత భావమును సూచించుచున్నవి. వీటియందేగాక కోపమును గురించి ఆకృతినిబట్టి సామ్యమున్నదని అన్వయించవచ్చు ఇంతవరకు విమర్శించినందున నిఘంటువునందు కాపు పదమునకు అర్థము చెట్టుకు మొగ్గరాకడ కాదు. కాయలు గాచుట అనలేకాదు. కేవలము భ్రమవలన ఇట్టి అర్థము కల్పింపబడినది. అసలు హిందీ 'కోపు'లు మారి మధ్యాంధ్ర రాష్ట్రమునందు "కాపు" పదము వ్యవహరింపబడుచున్నది. కావున సవరణీయమని నిశ్చయముతోచినది. కొందరు ఇచ్చట కాయుటకు బదులు కాపు రూపాంతరమని నిశ్చయించవచ్చును ఏలయనగా మోయు ⟶ మోపు. ఇదేమాదిరి. కాని అన్నిటియందు ఈ ఉదాహరణము సరియైనదని తోచలేదు. ఉదా॥ చేయు ⟶ చేపుకాదు, చేత. ఇట్లు కొన్ని వికల్పములు.

కాయకు రూపాంతరము కాతగాని కాపుగాదు ఉదా॥ కాత ⟶ కాయు, కోత ⟶ కోయు మొదలైనవి.

అయితే కాయలు గాచుట అను అర్థమునకు "కాపు" పదము ఉండవలసినప్పుడు దాని రెండవ అర్థము ఆపదలు తొలగించి రక్షించుట అని యుండదగినది. కాని మనము అర్థానుస్వార సహితమైన "కాఁపు" పదమునకు సంబంధములేకుండా దీనిని విడదీయుట అసమంజసము. ఎందుకనగా ప్రస్తుతము లోకుల భావమునందు కాఁపువాడు అనగా పైరుబెట్టి పొలములను కాపాడువారు గాబట్టి వీరికి ఆ నామము వచ్చినదని తలచెదరు.

ఇదే మాదిరి భారతీయ జాతులకు యాపత్తు ఏదో యొక క్రియ సంబంధమైన వృత్తితో నామము లేర్పాటులయినవి. కాబట్టి పంట కాఁపులు అనుటతో పంటను కాపాడువారని భావముగదా? ఈ భావమును లోకులు ఏల యనుకొనెదరో ప్రమాణము లేనిది ఒప్పవీలులేదని చదువరులు సంశయింపనక్కరలేదు. ఒక అధునిక కవి. వసంత ఋతువును వర్ణించు పద్యమునందు కాఁపు పదమును కాపాడుటయందే ఉపయోగించినాడు :

సీ॥ చెవులకుఁ జల్లగఁ జెలగి కోయిల కూసె,
సందడి పెండ్లి బాజాలు మ్రోసె
కన్నె వేపయు దొగర్గున్న సమర్తాడె,
చలివేంద్ర దాపున సంతగూడె,

కమ్మ మావిడి తోట కాపుల పని హెచ్చెఁ,
బిల్లగాలులు మురిపించి వచ్చె,
గొడుగులు జోల్లెంద జిడిముడిఁ జల్లార్చెఁ,
దాడిముంజలు కడుదప్పి దీర్చె.

గీ॥ కారడవి వెల్గె, పడవషికారు గల్గె
సందెలింపాయె కౌగిళ్ళు సడలిపోయె
ప్రొద్దులేపారె మాపులు పొట్టివారె
ఆమని మొదలు పెట్టె బల్హాయిపుట్టె *

ఈ పద్యము నందు "కాఁపుల పని హెచ్చె" అనగా మామిడి చెట్టు కాయలు నష్టము గాకుండా కాపాడే కాపుల పని హెచ్చినదని తాత్పర్యము కాబట్టి రక్షణార్థముగల కాఁపు పదస్థానము అర్ధాను స్వార సహిత జాతివాచకమై కాఁపు పదమునందు వర్తించు చున్నవి. ఈ పద్యము కాపుపదమును గురించి జన సామాన్యాభిప్రాయమును రుజువు పరచుచున్నది.

ఈ వాదమువలన అర్ధానుస్వారరహిత "కాపు" పదోత్పత్తి అరసున్న యుక్తమైన "కాఁపు" నుండి కలిగినదనుటకు సందేహమెంత మాత్రమునులేదు? ఇక అర్ధానుస్వార సహితపదమునకు నిఘంటువు నందు వ్రాసిన అర్థబాహుళ్యముపై ఒకదృష్టి వేయ వలసియున్నది:

కాఁపునకు = 1. కాఁపురము, 2. గృహస్థుఁడు, 3. పంటలు పండించువాఁడు, అనగా (పంటస్వామి) 4. శూద్రుఁడు, అని ఉన్న ఈ నాలుగు అర్థములను పక్షాభిమానము విడచి చూచినచో పై మూడు విధముల అర్థములకు కొంతవరకు సంబంధము కలుగఁ జేయవచ్చును కాని శూద్రుడు అను అర్థము జేయుట అసందర్భము, అసమంజసము, శాస్త్రవిరుద్ధము అని నొక్కి చెప్పవచ్చును.

వేపారి బ్రాహ్మలను మహారాష్ట్రదేశము నందు గృహస్థులందురు. వారు శూద్రులేనా? అష్టాదశవర్ణముల వారు గృహస్థులేకదా వారందరు శూద్రులేనా? గృహస్థుఁడు (సంసారి) అనగా స్వతంత్ర జీవనము జేయుచు నలువురిని పోషించువాడుగదా?

శూద్రుని గురించి 'అమరకోశ గురుబాల ప్రబోధమునందుఏమి వ్రాసియున్నదో చూడుడు :

"శోచంతి ఖిద్యంత ఇతి
శూద్రాః శుచశోకే.
క్లేశపడువారు.[1] అవరః
అధమఃవర్ణోయేషాంతే
అవర వర్ణాః. అధమమైన

వర్ణముగలవారు.[2] వృషం ధర్మం లునన్తీతి వృషలాః. లూఞ్ ఛేదనే. ధర్మమునుఁ జెఱచు వారు." అతిథిఅభ్యాగతసత్కారములుఁ జేయు గృహస్థులు ధర్మములను జెరుచువారు, క్లేశపడువారు కాజాలరు.

త్రేతాగ్నులయందు గార్హపత్యమైన అగ్ని మిక్కిలి శ్రేష్ఠమైనది. దీనితోనే దక్షిణాహవనీయాగ్నులు సంస్కరింపబడును. "గృహపతినా ఇతరాగ్నిభ్యాంపూర్వం సంస్కృతోగ్నిః గార్హపత్యః." గృహస్థునిచే ఇతరాగ్నులకంటె పూర్వము సంస్కరింపబడిన అగ్నిగార్హపత్యము.

అయితే మనము ఇచ్చట గృహస్థుడు సంస్కరించిన అగ్నిని శూద్రుడు సంస్కరించిన అగ్నియని ఆంధ్ర నిఘంటువు ప్రకారము అనవచ్చునా?

శూద్రుడు జేయు పనుల ననుసరించి ఆయా పేరు గల శూద్రజాతి భేదములు అమరసింహ నిఘంటువు 'శూద్ర వర్గము' నందున్నవి. చూడుడు. అందులో కృషీవలుని శూద్రుడని యనలేదు కాని "దేవేన జీవతీతి దేవాజీవః. జీవ ప్రాణధారణే. దేవతచేత బ్రతుకువాఁడు. దేవాన్ లాతి

* ఆదిభట్ల నారాయణదాసుగారి 'సావిత్రి చరిత్ర' హరికథ పు. 21.

పూజార్థమితి దేవలః. లా ఆదానే. పూజించు నిమి త్తమై దేవరను స్వీకరించువాఁడు. ఈ 2 కూలకి దేవరను యూజించువాని పేళ్ళు" అని శూద్రవర్గములో నున్నది. కృషీవలుడు తప్ప ఇతర వృత్తుల వారెందరో శూద్రవర్గములో నున్నారు.

"కరణ శబ్దము శూద్రస్త్రీకిని, వైశ్యునకుఁ బుట్టిన వానిపేరు, కరోతి లేఖన కర్మేతి కరణః. ఈ 1. లేఖన కర్మను జేయువానిపేరు" అని యున్నది.

వృత్తుల ననుసరించి శూద్రజాతి భేదములు అమర సింహ నిఘంటువునందున్నవి ఇట్లు కొంత చూపితిని. కొన్ని వృత్తులను నీచములో వేయుట నా యభిప్రా యము కాదు. వాటిని శూద్ర వృత్తిలోఁ జేర్చుట దేశీయ శిల్పమును భగ్నముఁ జేయుట దప్ప మరే మియును కాదు. ఏది యెట్లున్నను మన ఆంధ్ర నిఘంటువునందు 'కాఁపు' పదమునకు వ్రాసిన కృషీ వలుఁడు అమర నిఘంటువునందు యే జాతిలో జేర్చ బడినవాడో అరయవలసియున్నది.

అమర నిఘంటువునందు వైశ్యజాతికి జెందిన వృత్తుల వివరములు ఈవిధముగా దెలిపినారు:

"ఆజీవో జీవికా వార్తావృత్తి ర్వర్తన జీవనే.
స్త్రియాం కృషిః పాశుపాల్యం వాణిజ్యం చేతి
వృత్తయః.

స. వ్యా. టీ. కర్షణం కృషిః. కృషవిలేఖనే. చున్నట. 1. పశూన్ గోమహిష్యాదీన్ పాలయతీతి పశు పా లః తస్య కర్మ పా శు పాల్యం, గోమహిష్యాది పశువులను బా లిం చు వాఁ డు పశుపాలుఁడు. వాని క్రియ పాశుపాల్యము 2. వణిజః కర్మవాణిజ్యం. వణిజానియొక్క పని వాణిజ్యము. 3. ప్రత్యేకముగా వైశ్యులజీవనోపాయములపేళ్లు. ఇంకను "క్షేత్రాజీవః కర్షకశ్చ కృషకశ్చకృషీవలః" ఇట్లున్నది. అమరనిఘంటువునందే వైశ్యులది కృషి, గోపాలాది వృత్తియని వ్రాసియున్నది కాని ఇతర ప్రమాణములు లేవని చదువరులు గ్రహించ వలదు. భగవద్గీతోపనిషత్తు ఉపదేశించిన మార్గము ఇది:

కృషి గౌరక్ష్య వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజం.
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం.
భగవద్గీత అ 18-44

ఈ ప్రమాణములవలన కృషి, గోపాలవృత్తి వైశ్యు లదిగాని శూద్రులదిగాదని తేటతెల్లమగుచున్నది. ఇన్ని ప్రబల ప్రమాణములుండగా ఆంధ్రనిఘంటు కారుఁడు కృషీవలుని శూద్రుడనుట ఎంత హాస్యా స్పదమో చదువరులే యూహించగలరు. ఇట్టి ప్రమా ణములే గాకుండ ప్రస్తుతము కృషీవలులుగానున్న కాపులు, రెడ్లు, యెన్నడును బ్రాహ్మణాది వర్ణముల వద్ద అంటుపనికి లేక ముల్లెలుమోసి జీవించినటుల వినబడరుగదా? సేవజేయుచు, పరుల ఉచ్ఛిష్టమునకు ఆశపడి, స్తుతి పాఠకుఁడై ఒకానొకడు ఉండెనేని అటువంటి గర్భదరిద్రుఁడు వివాహము గాసర మర ణము నొందును. వానితో అట్టి జీవనము అంత మొందగలదు. వానిచర్య జాతిమొత్తముపై చెప్పుట తప్పు. ఇట్టి భిన్నస్వభావములు గలవారు అన్నితెగల యందు గానఁబడుచున్నారు. కృషీవలులు శూద్రులు గారని సంస్కృత ఉద్గ్రంథముల ప్రమాణములేగాక పాశ్చాత్యేతిహాసకారులుగూడ భారతదేశముయొక్క నాగరికతను, అనాగరికతను గురించి చర్చించినప్పుడు వారు భారతచరిత్రయందు వ్రాసిన సిద్ధాంతవాక్యము లివి :

"ఆదిమవాసులైన ఇండియనులకు గృహనిర్మా ణము, నాగరికత మానవులవలె కాపురము చేయు నేర్పు లేకుండెనని, వారు తిను ఆహారము అపక్వ మాంసాదులని, వారుక్రూరులని, అడవులందు మృగ

ప్రాయులవలె విచ్చలవిడిగా సంచరించువారని, జాతి నీతివృత్తి ఏమియెరుగరని, వ్యవసాయము అసలే తెలియదని తెలియుచున్నది. ఇట్టి స్థితియందు వీరుండగా ఆర్యులు ఇతర దేశమునుండి ఇండియాకు వలస వచ్చి ఇక్కడి భూములను ఆక్రమించి తమ విద్య యొక్క నేర్పువలన వ్యవసాయముఁ జేయుచు, అరణ్యవాసులతో జేయించుచు, వారిని తమపశుపాలాది వివిధపనులపై భృత్యులుగా నియమించిరి. తమపై తిరుగబడినవారిని దండించిరి. ఆర్యులకు అనుకూలముగా ఉండుచు, ఆర్యులు నిర్మించిన గ్రామాదులలో గృహములు కట్టి నివసించి వారి సేవఁ జేయుచు జీవనము సలిపినవారు శూద్రులనబడిరి. తక్కినవారు తమ పూర్వ క్రూర అభ్యాసములను మార్చక అరణ్యములందు సంచరించుచు నీతిబాహ్యమైన పనులుచేయువారు రాక్షసులని దస్యులని పిలువబడిరి. వారే ఇప్పుడు మహారణ్యములందు భిల్లులు, కోయలు, చెంచులు, ఎరుకలు, యానాదులుగా చూపబడుచున్నారు. ఆర్యులు ఆరంభ స్థితియందు పల్లెటూళ్లు, గ్రామములు నిర్మించి ఉత్తరోత్తర క్రమేణ నగరములు, నగరరాజములు, నిర్మించి, తాము రాజులై తమ భృత్యులకు క్రమక్రమేణ సైనికాది శిక్షలను ఇచ్చి గొప్ప ఆర్యసర్దార్ల చేతిక్రింద చిన్నచిన్న నాయకత్వములో బంట్లనుగా నియమించిరి. అప్పటి ఈ బంట్లే అమర నిఘంటువునందు క్షత్త్రులని పేరు వహించిరిగాబోలు. వారిలో ఎక్కువ భూములను ఆక్రమించి బహు గ్రామములను నిర్మించి తాము (ఆర్యులు) రాజులని, సర్దార్లని పేరుపొందినవారు "క్షత్రి"యు లనఁబడిరి. ఇందులోనుండి వేదవేదాంగ విశారదులై మహావిద్వాంసులై పండితులై రాజనీతి నిపుణులై, రాజులకు ధర్మాధర్మ బోధకులై వర్థిల్లినవారు "బ్రాహ్మణు" లైరి ఈ పాశ్చాత్యుల ఐతిహాసిక సిద్ధాంతము వలనకూడ ఆంధ్రనిఘంటు కారుఁడు వ్రాసిన "శూద్ర" పదము కృషీవలునకు జెందదని, కృషీవలులు శూద్రులు గారని వారు క్షత్రియ, బ్రాహ్మణజాతులకు మాతృస్థానమని నొక్కి చెప్ప చెప్పవచ్చునుగదా?

విదేశీయుల చరిత్రమును గమనించకున్నను, మన సంస్కృత నిఘంటువులు, భగవద్గీతాది ఉద్గ్రంథముల వాక్యముల ననుసరించి నిర్ణయించినను కృషీవలులు అనగా వైశ్యులని, కాఁపువారు అనగా కాపాడువారని అనితీరవలసినదేగదా!

(చూ. తరువాయి సంచిక)

# నే నొ క....

## గుమ్మనూరు రమేష్‌బాబు

తెలినురుగు గుమ్మపాలు యీ చెలిసోయగాలు
తొలి సంజల ఎరుపులు యీ చెలిమేని మెరుపులు
పలుకు
హంపీ శిలల తళుకు
కులుకు
అజంతాల తొలకరి చినుకు
చిరునగవులో
రామనృపాలుని గుండెలరాణి
ఆ జానకీ తారుణ్య
లావణ్య సౌజన్య సౌభాగ్య శోభిత
ప్రభాతార విందాల
మకరందాల మధుస్రావ్య సౌగంధాలు
నాలో ఎగసిన
రసరమ్య సంద్రపు మౌనగీతి ఆలాపనల
అనుభూతులు !
నెత్తావి ఆ కౌగిలిలో
మురళీలోలుని ఆఖాలగోపాలుని
స్మృతిలో నిండిన
రాధ పిలుపుల సత్యవలపుల రుక్మిణి తలపుల
మీరాచూపుల
నీలోత్పల శృంగార మాలికల
మంగళ తూర్యారావాల ఆరాధనల
తోరణాలు
నే మరులుగొన్న
శత సహస్రోత్సాహిణీ వసంతాల మందస్మిత
రతిమయ యమునాతీరాలు!
ఈ సుదతి సీతకాదు రామలక్ష్మి
నా జీవన సారథి
అంతా రామమయం! హరేరామాహరేరామా!
ఈ పడతి ఎవరోకాదు కృష్ణప్రియ
ఒక అనంత వారధి
అంతా కృష్ణమయం! కృష్ణ కృష్ణ హరే హరే!
ఆ పార్థ సారథ్యంలో
నేనే రామభద్రుని వేణుధరుని యీనాటి
నామమాత్రపు మనిషిని
ఆ రఘు వారధ్యంలో
ఈ చెలువ సాంగత్యంలో
నే నొక అనంతానంత విశ్వస్వరూపాన్ని
సర్వశక్తి సంభూతాన్ని
యీనాటి నిమిత్తమాత్రపు మానవదేహాన్ని

# నవభారతి

## సాహిత్య. సాంస్కృతిక మాసపత్రిక

జనవరి, 1980

సంపాదకుడు:
చదలవాడ పిచ్చయ్య

మూల్యం : రెండు రూపాయలు

నవభారతి కార్యాలయము
3-4-1008/1, బర్కత్‌పుర
హైదరాబాదు - 500 027

# విషయ సూచిక

— : —

నవభారతి
సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

సంపుటి 8] హైదరాబాదు జనవరి, 1979 [సంచిక 3

# ఈనాటి విద్యావేత్తలు తమ కర్తవ్యమును తాము గుర్తించగలరని విశ్వసించవచ్చునా ?

భారతీయులకు విద్య అనునది ఉన్నది. ఈ విద్య అత్యున్నతమైన స్థాయిలో ఉన్న దని గ్రహింపవలయును. దీనిని పరిశీలించి, పరిశోధించి సమగ్రమైన మానవతా వ్యాప్తికి విద్యా విధానమును నిర్ణయించుకొనవలసి యున్నది. ఈ పనిని నిర్వర్తించవలసినది, నిర్వచించ వలసినది భారతీయులేనని గ్రహింపవలయును.

ఈనాడు భారతీయులు పాశ్చాత్య విద్యానుకరణమే ప్రధానముగా నెంచి విద్యను నిర్ణయించుచున్నారని గమనించవలయును. పాశ్చాత్య విద్యా పద్ధతికి, భారతీయ విద్యాపద్ధతికి అంతులేని వ్యత్యాసమనునది యున్నది. ఈ వ్యత్యాసమును పరిశీలనవలననే గ్రహించవచ్చును. పరిశోధన వలన దీనికి సమగ్రమైన రూపమును సంతరించవచ్చును.

స్వతంత్రము వచ్చినది. పరతంత్ర విధానము మనలను వీడక యున్నది. ఇందుకు కారణము భారత దేశములో పాశ్చాత్యులు స్థాపించిన విశ్వవిద్యాలయాలేనని గ్రహించ వలయును. ఈ విశ్వవిద్యాలయములలో భారతీయులు స్వతంత్రమైన ఆలోచనలు చేసి సమగ్ర మైన మానవతా భావమును వ్యాప్తి నొందించుటకు గాక పాశ్చాత్యానుకరణమునకే ప్రాధా న్యము నిచ్చి విద్యాబోధన చేయబడుచున్న కారణమున మనకు విద్యా వ్యవస్థలో ఈ అవ్యవస్థ అనునది ఏర్పరచబడియున్నదని గ్రహించుకొనవలయును. ఈ ఏర్పరచబడిన విద్యావిధానమును సంస్కరించవలయునని స్వాతంత్ర్యానంతరము మన విద్యావేత్తలనబడువారు అనేక ప్రయ త్నములను చేసి యున్నారని గ్రహించవలయును. ఈ చేయబడిన ప్రయత్నములు విద్యా విధాన స్థాయిని తగ్గించుటకే తోడ్పడినదని పలువురు పలువిధముల సూచనలు మాత్రము చేసియున్నారు. ఇందుకు కారణమనునది యున్నది.

మహాత్మా గాంధీ పేరున బేసిక్ విద్యా విధానమనుదానిని కొంత కాలము మన విద్యావిధానములలో పాఠ్యాంశముగా నిర్ణయించి ఆచరించి తిరిగి తదాచరణమనునది ప్రయో

జ, మును సమకూర్చుచున్నదని త్రోసిపుచ్చుట యనునది జరిగినది. మహాత్మాగాంధీ మన స్వాతంత్ర్యోద్యమమునకు నాయకుడుగా గుర్తించబడి ఆ గుర్తించబడిన వ్యక్తి, వ్యక్తి యొక్క విద్యావిధాన నిర్ణయము సహితము సమకూర్చునది కాదని తిరస్కరించుటలోని జాతీయౌన్నత్యమును ప్రశ్నించుకొని సమాధానము చెప్పవలసి యున్నదని గ్రహింప వలయును.

జీవితమును తీర్చిదిద్దుకొనుటకు విద్యా విధాన నిర్ణయము తోడ్పడునని గాంధీజీ కనిన కలలన్నియు వమ్మైపోయినవని మన స్వానుభవముతో మనకు తెలియుచున్నదని మనము గ్రహించవలయును. ఇందుకు ఎవరు కర్తలని నిర్ణయించుకొనవలయును. కర్తవ్యము లేని విద్యావిధానము వలన భారతీయులకు సమకూరు ప్రయోజనమేమైయున్నదో ? మన జాతీయ నాయకులైన పరిపాలకులు ప్రజలకు చెప్పవలసిన సమయమాసన్నమైనదని గ్రహించవలయును.

భారత జాతికి బహు పురాతనమైన మానవ చరిత్ర యనునది ఉన్నదని గ్రహించని పాశ్చాత్యులు మనకు విద్యా విధానములు నిర్ణయించి మనలను బానిసలుగా చిత్రీకరించుటకే తోడ్పడి యుండిరని గ్రహించవలయును. మన జాతీయ విద్యలన్నింటిని ప్రప్రథమంగా తమ ఆంగ్లేయ భాష ద్వారా విద్యా విధానమును నిర్ణయించి తదాచరణమే భారతీయుల స్వప్రయోజనమునకు తోడ్పడునని, దానిని ప్రశంసించిన వారినే ప్రముఖ భారతీయ విద్యా వేత్తలని గౌరవించి ఈ గౌరవించు విధానమునే భారత జాతీయ విద్యా విధానమని నిర్ణయించి చెప్పిన విద్యా విధాన నిర్ణయమును నేటి వరకు మార్పు చేయని మన జాతీయ విద్యా విధానమును గురించి మన జాతీయ నాయకులు మనకు సమాధానము చెప్పవలసి యున్నదని గ్రహించుకొనవలసి యున్నది.

విశ్వవిద్యాలయములపై కోట్లకొలది ధనమును వెచ్చించుచున్నాము. పాశ్చాత్య విద్యాలయములు తయారుచేయు విద్యావేత్తల విధానమును జాతీయ ప్రయోజనమును సమ కూర్చక తాము నేర్చుకొనిన విద్యను వలసలకు పోయి అచట నివశించు వారికి ప్రయోజ నమును సమకూర్చు విధానముగా తయారైనదని మన పరిపాలకులు పదే పదే వల్లించుచు దీనికి ఒక పరిధిని నిర్ణయించి జాతీయ విద్యపై మనము వెచ్చించు ధనము యొక్క ప్రయో జనమును మన జాతీయులకు వినియోగింపబడు రీతిని మన విద్యా విధానమును నిర్ణయించ వలసియున్నదని అందుకు పరిపాలకులు తమ కర్తవ్యమును తాము గుర్తించి మెలగవలసిన సమయమాసన్నమైనదని గ్రహింపవలసి యున్నది.

భారతీయ నాయకులు పాశ్చాత్య విద్యా వ్యామోహితులై జాతీయ భాషల ఔన్నత్యమునకు గాని, జాతీయ భాషల వికాస సంపన్నతకు గాని దోహదము చేయుట లేదనియే చెప్పవలయును. ఇందుకు కారణమనునది యున్నది.

భారత జాతీయ విద్య యంతయు సంస్కృత భాషయందిమిడియున్నదని గ్రహించ వలయును. సంస్కృత భాషలోని విద్యా గ్రంథములన్నింటిని పునఃపరిశీలన చేసి, పునర్ముద్రితము చేసి భారత జాతీయ భాషలన్నింటిలో వాని అనువాదము లన్నింటిని ప్రచురించ వలయును.

ఆంగ్లేయ ఆధారిత సంస్కృత గ్రంథముల ననుసరించి తెలిగించబడుట యనునది వివేకవంతమైన పని కాదని తెలుసుకొనవలయును. ఇప్పటికి 250 సంవత్సరముల పైబడి ఆంగ్లేయ భాషా ప్రచురితములైన సంస్కృత గ్రంథముల ప్రమాణముల నిర్వచనానుసారమే జాతీయ విద్యా విధానమునకు రూపురేఖలు దిద్దే ప్రయత్నము చేయబడినదని గ్రహించ వలయును. ఇది మన జాతీయ విద్యా విధానమునకు వ్యతిరేకమైన విద్యా విధానముగా రూపొందించబడి యున్నదని చెప్పవచ్చును.

ఈనాడు విశ్వ విద్యాలయములలో అశాంతి ప్రబలి విద్యార్థులలో కల్లోలమునకు దారితీయుచున్న అవాంఛనీయ సంఘటనలకు ఇదియే కారణమని గ్రహించవలయును. విద్యావిధాన నిర్ణయ వేత్తలు ఇప్పటికైనను అసంతృప్తికి కారణమైన విద్యావిషయము లలోని అవ్యవస్థను అవగాహన చేసుకొని పునరాలోచన చేసి విద్యావిధానమును జాతీయ మైన దానినిగా రూపొందించి భావి భారత పౌర ప్రయోజనమును కాపాడవలసియున్నదని గ్రహింపవలయును. ఇందుకు విద్యావేత్తలు తమ కర్తవ్యమును తాము గుర్తించగలరని విశ్వసించవచ్చునా ?

❋

# పునరపి మరణం....

టి. గౌరీశంకర్

ఊర్ధ్వలోకాల నుంచి
ఒక అదృశ్య వ్యక్తి
రాసి విసిరేసిన
కాగితాలు ఈ జీవితాలు!

ఊపిరి కాగితాలకు
ఊపిరులూదాడు!
అవి
ఎండలో పిగిలి
వానలో తడిసి
రాతలు కరిగి
చెరిగి తిరిగి
ఆ శక్తి వద్దకే
ఎగిరిపోతాయి!
మళ్ళీ వాటిపై
ఏవో కొత్త రాతలు రాస్తాడు!
భూమి పైకి విసిరేస్తాడు!!

—o—

# నీ కోసం

—శ్రీదేవి

పిల్ల గాలులలో
పిలుపందుకొని
నీ కోసం...నీ కోసమే
ఈ మొగసాల నిలచేను

మబ్బుల దారుల
మల్లెల పూల పల్లకిలో
దాచిన వలపంతా
దోచేందుకు వచ్చావా!

కలలు కన్న రూపం
కన్నెదుట కనిపించగానే
యదలో పొంగిన వలపుతో
బుగ్గలు, సిగ్గుల గులాబులే పూసె

ఈ వసంతశే
మనసే వీణై సమశృతి పలుకగా
మేనే నీలి నెమలై ఆడగా
బ్రతుకే పున్నాయిగా విరిసె
యుగయుగాల నీ బాంధవినై

నీ మోవి పాడే గీతికగ
నీ మని చల్లబరిచే
మంచి గంధంగా మారి
నీ వన్నది వేరుకాక
నేన్నది నీవేనని
నా మనసే కానుక చేసిన వేళ
జీవితమే పులకించిపోయె...



# ఠాకూరు - తోటమాలి

## అనువాదం: శ్రీ లక్ష్మి

(1)

సేవకుడు : ఈ దాసుని కరుణింపుము, దేవీ.

రాణి : కొలువు చాలించాను, నా సేవకులందరు సెలవు తీసికొన్నారు. సమయం మించి పోయాక, నీ రాకకు కారణమేమి ?

సేవ : అందరూ పనులు ముగించాక, నా పని ప్రారంభ మగును. నీ పూదోటకు నన్ను మాలినిగా నియమింపుము.

రాణి : తోటమాలిగా నీవు ఏమి చేస్తావు ?

సేవ : నీ తీరిక వేళలలో నిన్ను సేవించుకుంటాను. నీవు ఉదయాన నడయాడే పచ్చిక పరిశుభ్రంగా వుంచుతాను. అచట గడ్డిపూలు నీకు స్వాగతం పలుకుతాయి. సప్తపర్ణి కొమ్మలలో ఊయలవేసి, నిన్ను ఊపుతాను. నీ మందిరంలోని దీపాన్ని సుగంధ తైలంతో వెలిగిస్తాను, నీపాదపీఠానికి మంచిగంధంతో రంగవల్లులు దిద్దుతాను,

రాణి : నీకు ఏమి కానుక కావాలి?

సేవ : నీ సుకుమారమైన చేతులకు పుష్పమాలికలు తొడుగనిమ్ము. నీ సుందర పాదపద్మాలను కడిగి, పారాణి దిద్దనిమ్ము.

రాణి : నీ ప్రార్థన మన్నించాను. నా పూతోటకు నీవు తోటమాలివి.

(2)

'కవి, సాయంకాల మగుచున్నది. నీ కేశములు పండిపోవుచున్నవి.

నీ ఏకాంత ధ్యానంలో ఆవలి తీరపు పిలుపు విన లేదా ?'

"అవును, సాయంకాల మయినది పొద్దుపోయినా కూడ, ఎవరిదైనా పిలుపు వినవస్తుందేమోనని వేచి ఉన్నాను,

"మూగహృదయాలు, వలపుపాటకై అలమటించి పోతున్నప్పుడు, వారి ప్రేమగీతాలు ఎవరు అల్లుతారు? నేను మత్యుదేవతను ధ్యానిస్తూ కూర్చుంటే, పడమటి వేగుచుక్క అస్తమించింది. ఏటిగట్టున చలిమంటలు ఆరిపోయాయి. గుడ్డి వెన్నెలలో, నక్కలకూతలు, పాడుపడిన గుడిసెలనుండి, భయంకరంగా వినవస్తున్నవి. బాటసారి, చీకటిలో మర్మరధ్వనులు వినేవేళ అతనికి జీవితరహస్యాలు ఎవరు బోధిస్తారు? - నేను బంధాలు వదిలించుకొని, తలుపులు మూసికొనివుంటే,

"నా కేశములు పండిపోవుట తుచ్ఛమయిన విషయం. నేను ఎప్పుడూ యువకుడినే, లేక వృద్ధుడినే"

"కొందరు సహజ సుందరంగా నవ్వుతూవుంటారు, మరికొందరు దుఃఖితులు, వారందరికీ నేను కావాలి. మత్యువును గురించి ఆలోచించను నాకు సమయంలేదు."

(3)

ఉదయాన, సముద్రంలోకి నావలవేశాను. అగాధ జలాలనుంచి ఎన్నో సుందరమయిన, వింత వింత

వస్తువులు వెలికి తీశాను - నవ్వుల వెన్నెలలువలె వెలిగిపోయేవి. కన్నీటిబిందువులవలె మెరసిపోయేవి. పెండ్లికూతురు బుగ్గలవలె సున్నితమైనవి ఇవన్నీ మోసికొని యింటికి వెళ్లే టప్పటికి, నాచెలి, తోటలో కూర్చొని వున్నది, హేలగా పూరేకులు చిదుముతూ, ఒక్క క్షణం సందేహించాను, నేను మోసితెచ్చిన వస్తువులు ఆమె పాదాల దగ్గర వుంచాను. మౌనంగా ఆమె ఒకసారి వాటివైపు చూచి, అన్నది: "ఏమి వింత వస్తువులు ఇవి? వీనివలన ఏమిలాభం?" సిగ్గుతో నేను తల వంచుకున్నాను.

"నేను వీనికొరకు కష్టపడ లేదు, మూల్యం చెల్లించికొనలేదు. ఇవి ఆమెకు తగిన బహుమానం కావు." అని అనుకొన్నాను.

రాత్రంతా, వాటిని ఒక్కొక్కటి, వీథిలోనికి విసరివేశాను.

ఉదయాన, బాటసారులు వచ్చారు; వాటిని ఏరుకుని భద్రంగా దూరదేశాలకు కొనిపోయారు.

(4)

అందరాని చందమామకై అర్రులు చాచాను. ఎదలో నెమ్మదిలేదు.

ఆవలితీరాన స్వామి మురళీగానం వినవస్తున్నది. నాకు రెక్కలు లేవని, ఇక్కడ బంధింపబడి వున్నానని ఎప్పుడూ మరచిపోతూ ఉంటాను. కౌతూహలంతో, అప్రమత్తతో వున్నాను. వింతలోకంలో నేను నూతనుడను. నీ వూపిరి నాలోని తీరని కోరికను రేపుతుంది. నీ వాణి నాదిగా వినిపిస్తుంది. నా అంతరాత్మలో
అన్వేషణకు అందని, స్వామి మురళీనాదం
వినిపిస్తున్నది.
నాకు రెక్కలు గుర్రం లేదని, మార్గం తెలియదని,
ఎప్పుడూ మరచిపోతూ వుంటాను.
నా మదిలో నేను గ్రుమ్మరుతూ వుంటాను.
సాయంకాలపు నీడలలో, వినీలాకాశంలో,
నీ విశ్వరూప దర్శనం అవుతుంది.
ఆవలి తీరాన స్వామి మురళీగానం
వినిపిస్తున్నది.
నేను ఒంటరిగా నివసిస్తున్న ఇంటి
తలుపులు అన్నీ మూసివున్నాయని
ఎప్పుడూ మరచిపోతూ వుంటాను.

(5)

పెంపుడు చిలుక పంజరములో వున్నది,
అడవి చిలుక అడవిలో వున్నది.
కాలవశాన అవి రెండు కలుసుకున్నాయి.
అడవి చిలుక పలికింది: అడవికి పోదాం
పద, చెలీ!
పెంపుడు చిలుక పలికింది; "ఇటురా, ప్రియా
ఇరువురము పంజరములో నివసిద్దాము."
అడవి చిలుక అన్నది: "కటకటాల
మధ్య, రెక్కలు విప్పుకోను తావు ఏది?"
పంజరపు చిలుక నిట్టూరుస్తుంది; "ఆకాశంలో
ఎక్కడ కూర్చోవాలో నాకు తెలియదు."
అడవి చిలుక పలికింది: "చెలీ, వలపు
పాటలు వినిపించు."
పంజరపు చిలుక అంటుంది "నా దగ్గర
కూర్చో. పండితుల పలుకులు నీకు నేర్పుతాను."
అడవి చిలుక నిట్టూర్చింది: "పాటలు నేర్పితే
వచ్చేవి కావు."
పంజరపు చిలుక నిట్టూర్చింది: "నాకు వలపు
పాటలు రావు."
వాటి ప్రేమ లోతైనది. కాని ఎన్నిటికీ అవి
కలసి జీవించలేవు.
పంజరపు కడ్డీలలో నుండి చూచుకుంటాయి.
ఒకరినొకరు తెలుసుకోవాలను తాపత్రయం
నిరర్థకం.

రెక్కలు విప్పి పిలుచుకుంటాయి."
"ప్రియా, నా దగ్గరకు రమ్మ."
అడవి చిలుక నిట్టూర్చింది. "ప్రియా,
రాలేను. పంజరపు బ్రతుకు నాకు మిక్కిలి
భయావహము."
పంజరపు చిలుక నిట్టూర్చింది.
"నా రెక్కలు ఊడిపోయాయి, సఖా!

(6)

అమ్మా! రాకుమారుడు మన యింటి ముందునుండి వెడతాడు. ఈ ఉదయం నా పనులు ఎలా చేయను? జుత్తు ఎలా దిద్దుకోవాలో చెప్పమ్మా. దుస్తులు ఏమి ధరించను?

ఎందుకమ్మా నావైపు ఆశ్చర్యంగా చూస్తావు? నా గవాక్షం వైపు ఒక్కసారి కూడ అతను చూడడని నాకు బాగా తెలుసును. ఒక్క క్షణంలో అతను కనుమరుగయి పోతాడని తెలుసును. దూరాన, అణగి పోతున్న మురళినాదం మాత్రం వినిపిస్తుంది.

కాని రాకుమారుడు మన యింటి ముందునుండి వెడతాడు. నేను చక్కగా అలంకరించుకుంటాను. అమ్మా, రాకుమారుడు మన యింటి ముందునుండి వెళ్ళాడు; ఉదయభానుడు అతని రథమునుండి ప్రకాశించాడు.

నా మేలి ముసుగు తొలగించి, నా రత్నాలహారం మెడనుండి తీసి, అతని మార్గంలోకి విసిరి వేశాను.

ఎందుకమ్మా, నావైపు ఆశ్చర్యంగా చూస్తావు? అతను నా హారాన్ని గ్రహించలేదని నాకు బాగా తెలుసును; నా హారం అతని రథ చక్రాల కింద పడి నలిగిపోయిందని తెలుసును. నా కానుకను ఎవరూ గుర్తించలేదు.

కాని రాకుమారుడు మన యింటి ముందునుండి వెళ్ళాడు,

నా మణిని అతనికి కానుకగా అతని మార్గంలో అర్పణ చేసుకున్నాను.

(7)

నా గదిలోని దీపం ఆరిపోయింది. నేను పక్షులతో పాటు మేలుకొన్నాను.

సువాసనలు వెదజల్లు పూలు తలలో ముడుచుకుని, నా గవాక్షం దగ్గర కూర్చుని వున్నాను. బాటసారి ఉదయ సంధ్యలో పయనం సాగిస్తున్నాడు.

అతని మెడలో ముత్యాల హారం మెరుస్తున్నది. సూర్యకిరణాలు అతని కిరీటంమీద నాట్యం చేస్తున్నాయి. నా యింటి ముందు ఆగి, అతడు ఆతృతగా అడిగాడు; "ఆమె ఎక్కడ వున్నది?" సిగ్గుతో చెప్పలేకపోయాను. "నేనే ఆమె" అని.

సాయం సంధ్యా సమయం. దీపం వెలిగించలేదు. బాటసారి తిరిగి వచ్చాడు. అతని గుర్రాలు నురుగులు కక్కుతున్నాయి. అతని దుస్తులు దుమ్ము కొట్టుకొని వున్నాయి.

నా యింటి ముందు ఆగి, అలసిపోయిన గొంతుతో అడిగాడు. "ఆమె ఎక్కడ వున్నది?" సిగ్గుతో చెప్పలేకపోయాను. "బాటసారీ, నేనే ఆమె" అని.

అది వసంత రాత్రి. నా గదిలో దీపం వెలుగుతున్నది. చల్లని దక్షిణా నిలము వీస్తున్నది. పంజరంలోని చిలుక నిదురిస్తున్నది. లేత పచ్చిక రంగు దుస్తులు ధరించి, నిర్జనమైన బాటవైపు చూస్తూ కూర్చున్నాను.

చీకటి రాత్రి! నేను జపం చేస్తున్నాను.
"బాటసారీ, నేనే ఆమె."

(8)

రాత్రివేళ. నేను ఒంటరిగా. నా ప్రేమ
నికుంజానికి వెళ్ళి

సవ్వడు, పక్షుల కలకలం వినబడదు. గాలి
కదలాడదు, బాట నిశ్శబ్దంగా వుంటుంది.
నా మంజీరాలు సవ్వడి చేస్తాయి నాకు సిగ్గు అని
పిస్తుంది
అతని పదముల సవ్వడికై ముంగిట్లోవేచి
వున్నప్పుడు, చెట్ల ఆకుల గల గలలు విన
బడవు. ఏరు నిశ్చలంగా వుంటుంది
నాగుండె బిగ్గరంగా కొట్టు కుంటుంది
దానిని ఎలా శాంత పరచాలో నాకు తెలియదు
నా స్వామి వచ్చి నా దగ్గర కూర్చున్నప్పుడు
నా శరీరము వణకుతుంది. నాకనులు
మూత పడతాయి. గాలికి దీపం ఆరిపోతుంది
తారకలమీద మబ్బు తెరలు కమ్ముకుంటాయి
నా ఎడదను అలంకరించు రత్నం వెలుగులు
చిమ్ముతుంది. దానిని ఎలా మరుగుపర
చాలో తెలియదు

(9)

నీపని అలా వుండనీ, దేవీ చూడు, అతిథి
వచ్చాడు
వినబడుటలేదా, అతను సున్నితంగా తలుపు
తట్టు తున్నాడు
నీమంజీరాలు సవ్వడి చేయకుండా
నెమ్మదిగా వెళ్ళి అతన్ని కలుసుకో
నీపని అలా వుండనీ, దేవీ, సాయం
సంధ్యా వేళ అతిథి వచ్చాడు
పెనుగాలి హోరు కాదు. దేవీ, భయపడ
వద్దు
వసంతంలోని నిండు పున్నమిరేయి. ముంగిలిలోని
నీడలు వలుచగా వున్నాయి.
నీలివింగి వెన్నెలలు నింపు కున్నది.
మేలి ముసుగు కప్పుకుని, దీపం తీసుకుని
వెళ్ళు.

నిశ్శబ్దంగా ద్వారం పక్కగా నిలుచుండుము,
అతను పలుకరించినప్పుడు, మౌనంగా తల
వంచు కొనుము.

(10)

నీ గాజులు సవ్వడి చేయకుండా, దీపం
పట్టుకుని, అతనిని లోపలికి తీసి
కొనిరా.
నీకు బిడియంగావుంటే, అతనితో
మాటాడవద్దులే.
ఇంకా నీపని కాలేదా? చూడు, అతిథి
వచ్చాడు. గోశాలలో దీపం వెలిగించ
లేదా?
సాయం ఆరాధనకు పూల సజ్జ సిద్ధంగా
లేదా? పాపిట సిందూరం దిద్దుకో
లేదా?
దేవీ, చూడు, అతిథి వచ్చాడు,
నీ పని అలా వుంచి, రా.

(11)

నీ కడవ నింపుకోవాలను కుంటే, నా కొలనుకిరా.
నీ కాళ్లను చుట్టేసుకుని, జలాలు, గుస
గుసలు పోతాయి.
నీలి మబ్బులు. నీ శిరోజాలను తలపిస్తున్నవి.
నీ పదాల సవ్వడులు నాకు బాగా తెలుసును;
నా హృదయాన్ని స్పందిస్తాయి.
నీ కడవ నింపు కోవాలనుకుంటే, నా కొలనుకిరా.
హేలగా, నీ కడవ నీటిమీద తేలియాడాలను
కుంటే, నా కోనేటికిరా.

పచ్చని పచ్చిక మీద గడ్డి పూవులు నాట్యం
చేస్తున్నాయి.

విహాయస పాలను విడిన విహంగాలవలె, నీ ఆలో
చనలు నీ కళ్లను దూసుకుని వస్తాయి. నీ ఒళ్లి

ముసుగు తొలగి పోతుంది. నా కొనేటికి వచ్చి నెమ్మదిగా విశ్రాంతి తీసుకో.

నీ ఆట మాని, జలకాలాడాలను కుంటే, నా కొలనుకిరా.

నీ నీలి కోక గట్టున వుండనీ నీలి జలములు నిన్ను కప్పుతాయి.

తరగలు నిన్ను చుంబించి, నీకు మధుర సంగీతం వినిపిస్తాయి.

నీవు జలకాలాడాలని మనసుపడితే, నాకోనేటికిరా.

మైమరచిపోయి, విలయాన్ని వరించాలను కుంటే, నాకోనేటికి, రా.

ఆ గాధమయిన, నాకోనేటిలో, చల్లని జలాలున్నవి

వానిలోతులలో, రాత్రింబవళ్లు ఏకం అపురూపమయిన రాగాలు వినిపిస్తాయి. విలయాన్ని పొందాలను కుంటే, నాకోనేటికి, రా.

(12)

నిన్ను నేనేమీ అడుగలేదు. తోటలో చెట్టుకింద నిలబడి వున్నాను.

తొలి వెలుగులు అలదు కుంటున్నాయి. పచ్చిక మీద మంచు కప్పివున్నది.

మర్రిచెట్టు కింద నీవు నీసున్నితమయిన చేతులతో పాలు పిండుతున్నావు. నేను మౌనంగా నిలబడి వున్నాను. ఒక్క మాటకూడా నేను పలుకలేదు. తోపులోని పిట్ట, కానరాకుండా, కమ్మగా పాడుతున్నది.

పల్లెబాట మామిడి పూతతో నిండిపోయింది. తుమ్మెదల రొదలు వినిపిస్తున్నవి. శివాలయపు కోనేటి ద్వారం తెరచివున్నది. పూజారి మంత్ర పఠనం చేస్తున్నాడు. పాత్ర ఒడిలో వుంచుకుని, నువ్వు పాలు పితుకు తున్నావు.

నా కాళీ పాత్రతో నేను నిలబడి వున్నాను. నేను నిన్ను సమీపించ లేదు.

గుడి గంటలు ప్రతిధ్వనిస్తున్నవి. ఆల మందల నడలతో బాటలో దుమ్మురేగు తున్నది.

పల్లె పడుచులు, నీళ్ల నింపుతున్న కడవలతో, ఏటి నుంచి తిరిగి వస్తున్నారు. నీ కంకణాలు గల గల మంటున్నాయి. పాల పాత్రలో నురుగులు చిందు తున్నవి. పొద్దెక్కుతున్నది, నేను నిన్ను సమీపించ లేదు.

(13)

నేను మార్గం వెంట పోతూవున్నాను. నాకు గమ్యం తెలియదు. మధ్యాహ్నం గడచి పోయింది. వెదరు పొదలు నాదిస్తున్నవి. చీకట్లు అలము కుంటున్నవి.

కోయిలలు గానం చేసి అలసిపోయినవి. నేను మార్గం వెంట పోతూవున్నాను. నాకు గమ్యం తెలియదు.

ఏటి గట్టున ఆకుటీరం చల్లని చెట్టునీడలో వున్నది.

ఆమె ఎవరో పనిలో వున్నట్లున్నది. గాజులు గలగల మంటున్నాయి.

నేను ఈ కుటీరం దగ్గర ఆగాను. ఎందుకో నాకు తెలియదు.

బాట మలుపులో పచ్చని పొలాలు వున్నాయి. మామిడి తోపులు వున్నాయి.

అవి గడచాక, గుడి, ఆపైన వాణి జ్యాంగణము. నేను ఈ కుటీరం దగ్గర ఆగాను. ఎందుకో నాకు తెలియదు.

ఆనాటి సంగతి-ఆమనిలో సంధ్యాసమయం గాలి చల్లగా వీస్తున్నది. మామిడి పూత రాలుతున్నది.

ఏటి తరగలు, చివరి మెట్టు మీది రాగి కలశాన్ని చుంబిస్తున్నాయి.

వసంతంలోని ఆరోజు గుర్తువస్తున్నది. ఎందుకో తెలియదు.

చీకట్లు అలముకుంటున్నాయి. ఆలమందలు తిరిగి వస్తున్నవి. పచ్చిక బయళ్ల మీద గుడ్డి వెలుగు లీలగా పరచుకున్నది: పల్లెజనులు ఇండ్లకు మరలిపోతున్నారు.

నేను నెమ్మదిగా తిరుగుముఖం పట్టాను. నాకు గమ్యం తెలియదు.

(14)

తనలోని సువాసనలు కనుగొనలేక వనంలో దేవులాడు కస్తూరి మృగమునైనాను. దక్షిణానిలము హాయిని గొలుపు ఆమనినిశి అది.

దారితప్పి తిరుగుతున్నాను. నాకు దొరకని పదార్థం కొరకు దేవులాడుతున్నాను. నేను కోరనిది నాకు దొరికింది.

అంత రంగములోని నా కోరిక రూపము దాల్చి నటనమాడుచున్నది.

దివ్య దర్శనము అలవోకగా కదలిపోవుచున్నది.

స్థిరంగా నిలుపుకోవాలని ప్రయత్నం చేస్తాను. తప్పించుకుని మాయమవుతుంది. నేను దారి తప్పి తిరుగుతున్నాను. నాకు దొరకని పదార్థం కొరకు నేను దేవులాడుతున్నాను. నేను కోరనిది నాకు దొరికింది.

(15)

చేతులు, కన్నులు కలిశాయి. మన హృదయాల ప్రేమ కథ ఇలా మొదలయింది.

వసంతంలోని పున్నమరేయి అది. మల్లెల సువాసనలు గుబాళిస్తున్నవి.

నా మురళి మూలన పడివున్నది. నీ పూలదండ కూర్పడం పూర్తికాలేద

మధురగీతం వలె మన ప్రేమ సహజ సుందరమయినది.

నీ నీలిమేలి ముసుగు నాకన్నులకు పండుగ. నీ మల్లెల దండ నా ఎదను అలరిస్తుంది.

అది ఒకవేళ - ఒకచో అలరించుట, ఒకచో ముకుళించుకుని పోవుట: ఒకచో దర్శన మొసగుట, ఒకచో తొలగిపోవుట; ఒకచో నవ్వుల వెల్లువలు, ఒకచో మౌనము; మరియొకచో నవ్వుల వెల్లువలు, ఒకచో మౌనము; మరియొకచో తీయని బాధ.

మధురగీతం వలె మనప్రేమ సహజసుందరమయినది.

వర్తమానమే సత్యం, అందరాని చందమామకై ఆరాటు పడుటలులేదు. సౌందర్యానికి మచ్చలేదు. తమస్సులో దేవులాడుటలులేదు. మధుర గీతం వలె మనప్రేమ సహజసుందర మయినది.

శూన్యములోనికి మనం పయనించుటలేదు. మనకు లభించినది మహా ప్రసాదం. ఆనందమును కప్పిపుచ్చి బాధలోనికి గమించుట లేదు.

మధురగీతం వలె మనప్రేమ సహజసుందరమయినది.

(16)

వారి తోపులో కోయిల గానం చేస్తుంది. నా మది సంతోషంతో నర్తిస్తుంది.

మేమిరువురము ఒకే పల్లెలో నివసిస్తున్నాము. అది మాకు ఒక ఆనందం. ఆమె పెంపుడు గొర్రెల జంట మా తోటలో, నీడలో నెమరు వేసుకొంటాయి.

అవి మా వరిపొలంలోకి వచ్చినప్పుడు, నా చేతులలోకి తీసుకుంటాను.

మా ఊరి పేరు ఖంజన, మా నదీమతల్లి అంజన. నా పేరు మా ఊళ్ళో అందరికీ తెలుసును, ఆమె పేరు రంజన.

మా ఇరువురి మధ్య ఒకే పొలమున్నది.

మా తోపులోని తేనెటీగలు, వారి తోపులోని మధువును గ్రోలుతాయి.

వారి తోటలోని పూలు మా బజారులోనికి వస్తాయి

మా ఊరి పేరు ఖంజన, మా నదీమతల్లి అంజన.

నా పేరు మా ఊళ్లో అందరకు తెలుసును, ఆమె పేరు రంజన.

వారి ఇంటి ముందున్న బాట మధు మాసంలో మామిడి పూత సువాసనలతో గుబాళిస్తుంది. వారి మొక్కజొన్న పండినప్పుడు, మా వరి కోతకు వస్తుంది.

వారి కుటీరంపైన మిణుకుమనే తారకలు మాకూ వెలుగు నిస్తాయి.

వారి కొలను నింపే వర్షం మా తోటను పరవశింప చేస్తుంది.

మా ఊరి పేరు ఖంజన, మా నదీమతల్లి అంజన.

నా పేరు మా ఊళ్లో అందరికీ తెలుసును, ఆమె పేరు రంజన.

(17)

ఆ ఇరువురు అక్కచెల్లెళ్ళు నీళ్ళకు వెళ్ళేప్పుడు, ఈ ప్రదేశానికి వస్తారు, నవ్వుకుంటారు. చెట్ల గుబురులో ఎవరో వున్నట్లు వారు గమనిస్తారు.

ఈ ప్రదేశానికి వచ్చినప్పుడు, ఆ అక్కచెల్లెళ్ళు ఏవో గుసగుసలు పోతారు.

గుబురు వెనుక వున్న అతని రహస్యం వాళ్ళు పసి గట్టినట్లున్నారు.

ఈ ప్రదేశానికి చేరుకున్నప్పుడు, అప్రయత్నంగా వారి కడవలు తొణికి నీరు ఒలుకుతుంది. గుబురు వెనుక అతని హృదయ స్పందనం వారు వింటారు, నీళ్ళకు వారు పోయినప్పుడు ఆ అక్కచెల్లెళ్ళు ఇరువురు ఒకరి ముఖం ఒకరు చూచుకుని నవ్వుకుంటారు, ఈ స్థలానికి వచ్చినప్పుడు.

వారి అడుగులలోని తొట్రుపాటు, అతని ఎదలో స్పందిస్తుంది, వాళ్లు నీళ్లకు పోయినప్పుడు.

(18)

పూర్ణ కుంభముతో నీవు ఏటి మార్గాన నడచి పోతున్నావు.

గాలికి కదలే మేలి ముసుగులోనుంచి నీవు నన్ను ఎందులకు చూచావు?

నీ చల్లని చూపు నా ఎదను తాకింది; కొలనులో గాలికి రేగిన తరగలు తీరాన్ని తాకినట్లు.

కొండల కావల మిణుకు తారకవోలె నీవు దాగి వున్నావు. నేను బాట వెంట సాగిపోవు తెరువరిని.

మరి, నీవు ఏటి మార్గాన పూర్ణ కుంభముతో నడచి పోతూ, ఒక్క క్షణం నిలచి, నీ మేలి ముసుగులో నుంచి నన్ను ఎందులకు చూచావు?

(19)

ప్రతిరోజూ అతను వస్తాడు, వెళ్ళిపోతాడు. నా తలలోని పూవు ఒకటి అతనికి సమర్పించి రా చెలీ.

అతను అడిగినట్లయితే, దయచేసి నా పేరు చెప్పవద్దు.

అతను వస్తాడు, వెళ్ళిపోతాడు.

చెట్టు నీడలో అతను కూర్చుంటాడు.

ఆకులతో, పూవులతో అతనికి ఆసనం అమర్చుము, చెలీ.

అతని కళ్ళు దిగులుగా వున్నవి. అవి నా ఎదను విచారముతో నింపుతాయి.

అతని మనసులో ఏమి వున్నదో చెప్పడు.

అతను వస్తాడు, వెళ్లిపోతాడు.

# చిత్రభారతము - యమకములు

డి. అన్నపూర్ణ

("చిత్ర భారతము - విమర్శనాత్మక పరిశీలనము" అనునా పరిశోధనాంశమునకు సంబంధించిన వ్యాసమిది. మరియు 1979, అక్టోబరులో ఆంధ్ర విశ్వవిద్యాలయములో జరిగిన ఆంధ్రప్రదేశ్ ప్రాచ్యభాషా ద్వితీయ సదస్సు నందు చదివిన వ్యాసము.)

'శతలేఖిన్యవధాన' బిరుదాంచితుడైన 'చరిగొండ దర్మన్న' కవిచే విరచితమైనది చిత్ర భారతము. ఇది ఎనిమిది ఆశ్వాసములు గల ప్రసిద్ధ ప్రబంధము. క్రీ.శ. 1503-1512 సం॥ల మధ్య ప్రాంతమున ఓరుగంటిని అతి దక్షతతోను, నత్యంత వైభవము గాను పరిపాలించిన 'చితాబుఖాను' ప్రభువునొద్ద మంత్రిగా నున్న ఎమ్మలపల్లి పెద్దయామాత్యునకీ కావ్యము నంకితము గావించెను.

మధుర కవితా మహిమగల మహాకవి చరిగొండ ధర్మన్న. ఈతని కవితా చిత్రతకు 'చిత్రభారతము' పరమావధి ప్రధానముగా కథా పరముగా చిత్రతగల కావ్యమే అయినను ప్రాసంగికముగా రచనా విధానములోను చిత్రత గోచరించును. సదలంకృత శబ్దాలంకార చాతుర్య మొలికించిన కవులలో ధర్మన్న పేర్కొనదగిన వాడు. శబ్దాలంకారములలో నాతనికి యమకమన్న ప్రీతిమెండు.

పరంపరగా రసము నలంకరించునది అలంకారము. శబ్దార్థములు అలంకారమునకు ఆశ్రయములు. ఈ శబ్దార్థములలో అర్థము కంటె ముందు శబ్దమే ప్రతీత విషయము. 'వృత్త్యను ప్రాస, ఛేకాను ప్రాస లాటాను ప్రాస, యమకము, ముక్తపద గ్రస్తము' అనునవి శబ్దాలంకారములుగా ప్రసిద్ధి కెక్కినవి. ఇందు యమకమునకు ప్రముఖ స్థానము గలదు. యమక లక్షణమును పలువురు నిర్వచించిరి.

"ఆవృత్తిం వర్ణసంఘాతగోచరం యమకం విదుః", అని.

"అవ్యపేతో వ్యపేతా ద్యావృత్తిర్వర్ణ సంహతేః

యమకం తచ్చ పాదానామాది మధ్యాన్త గోచరమ్" అని. దండి[1] యమక లక్షణమును, తత్ భేదములను చెప్పెను. వర్ణ సంఘాతము యొక్క ఆవృత్తి యమక మనబడునని యతని అభిప్రాయము. వర్ణ సంఘాత మనగా నతని దృష్టిలో స్వరవ్యంజన సమూహము.

"యమకం పౌనరుక్త్యేతు స్వర వ్యంజన యుగ్మయోః"-అని విద్యానాథుడు[2] యమక లక్షణమును సంగ్రహముగ, జెప్పెను. స్వర సహితములైన వ్యంజనముల యొక్క ఆవృత్తియే యమకమనియు అతని యభిప్రాయము.

---

1. దండి-కావ్యాదర్శము. ప్ర॥ శ్లో. 61
2. విద్యానాథుడు - ప్రతాపరుద్రీయము - P - 249

"సమవర్ణ యుగాధికమై యమరిన నియమంబు యమకమగు" అని భట్టుమూర్తి[3] నిర్వచించెను. సమానమైన వర్ణములయొక్క జంటను గానీ, సమూహమును గానీ యావృత్తి సేయుట యమకము.

"అర్థము ఉన్నయెడల వేఱర్థమున స్వరవ్యంజన సంహతిని ఆక్రమముననే ఆవర్తించుట యమకమన బడును"-అని వేదం వేంకటరాయ శాస్త్రిగారు"[4] చెప్పిరి.

"విభిన్నార్థైక రూపాయా యా వృత్తిర్వర్ణ సంహతేః
అవ్యపేత వ్యపేతాత్మా యమకం తన్నిగద్యతే"-

అని భోజుడు[5] యమక లక్షణమును, తద్భేదావళిని పేర్కొని యున్నాడు.

'సాధారణముగ అర్థ భేదముతో గూడిన శబ్ద పునరుక్తిని యమక మందురు. ఈ అభిప్రాయమునే "Repitition in the same stanza of words or syllable similar in sound but different in meaning a kind of rhyme"-అను ఆంగ్ల వాక్యములో సాప్టే పండితుడు సూచించి యున్నాడు.[6]

యమకమునకు, ఛేకాను ప్రాసమునకును కొలది భేదము గలదు. యమకము నందు గల అక్షరముల సమూహము మరల మరల వచ్చుటలో వ్యవధాన ముండవచ్చును. ఛేకాను ప్రాసమునకట్టి వ్యవధానము పనికి రాదు. స్వర వ్యంజన పౌనరుక్త్య మున్నచోట యమకమగును. కేవల వ్యంజన యుగ్మమున కావృత్తి యున్నచో ఛేకాను ప్రాస మనియు చెప్పుట కెన్న.

యమక భేదములను దండి[7] వివరించెను. అతడు చెప్పిన యమక భేదములను స్థూలముగ పరిశీలించినచో; యమకము 1) అవ్యపేత మిశ్రయమకము 2) అవ్యపేత అమిశ్రయమకము 3) వ్యపేతావ్యపేత మిశ్రయమకము 4) వ్యపేత మిశ్రయమకము 5) సముద్గకము 6) పాదాభ్యాసము 7) మహాయమకము 8) ప్రతిలోమ యమకము అని ఎన్మిది విధములుగ గోచరించును. ఇందు మొదటగా పేర్కొనిన నాల్గు యమకములను పాదభాగ యమకములు గాను, తరువాత చెప్పబడిన వానిలో సముద్గతము, పాదాభ్యాసము, మహాయమకములు 'పాదయమకములు'గాను కావ్యాలంకార సంగ్రహము[8] నందు పేర్కొనబడినవి. ఇందు ఒక్కొక్క దానియందు మరల భేదములు గలవు. వీని వివరణ 'కావ్యాదర్శము'[9] నందు గలదు.

చిత్ర భారతము నందు యమకము గల పద్యములకు, లక్షణము లనదగిన యమక భేదముల వివరణ, లక్ష్య లక్షణములతో వివరించుట:

*1. ప్రథమ ద్వితీయ పాదగత మిశ్ర వ్యపేతాది భాగయమకము :*

ex:- *గ్రామములు వేయు సాల*
*గ్రామములు లక్ష కోటి కన్యాజనమున్*

3. భట్టుమూర్తి-కావ్యాలంకార సంగ్రహము P-547
4. వేదం వేంకటరాయ శాస్త్రిగారు- ఆంధ్ర సాహిత్యదర్పణము, P-277
5. భోజుడు- సరస్వతీ కంఠాభరణము-ద్వి॥ శ్లో॥ 58.
6. V. సాప్టే పండితుడు-Sanskrit English Dictionary : P. 455.
7. దండి-కావ్యాదర్శము.
8. భట్టుమూర్తి - కావ్యాలంకార సంగ్రహము'- వివరణ-'సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు.
9. దండి కావ్యాదర్శము నాంధ్రీకరించిన అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి గ్రంథము.

హేమాద్రు లనంతంబులు
ప్రేమ నొసగు ఫలము దీనిఁబేర్కొనఁగలు
గున్. ప్ర-13.

ఇట గ్రామములు అను పదము చిన్న ఊర్లు అనియు, సాలగ్రామమను పదము విష్ణు చిహ్నమగు శిల అనియు నర్థములో ప్రయోగింపబడినది.

ఈ యమకమింకను ప్ర॥-23, ద్వి-3, 108, 132, 143, తృ-61, పం-152, 165, షష్ఠా-10, 30, 160, 147, 158; సప్ర-113 పద్యములలో గలదు.

*2. ప్రథమ తృతీయ పాదగత మిశ్రవ్యపేతాది భాగయమకము:-*

ex:-క "నగపాలు సాంధ్య రాగము
నిగిడినఁ గెంజాయఁ దనరి నెఱచీకటిచే
నగపాలు నలుపునొందుచు
గగనము గురివెందగింజ కైవడిఁ బొల్చెన్"
షష్ఠా-107.

ఇందు 'నగపాలు' అను పదమును తరువాతి పదముతో అన్వయించి చెప్పగా నగభాగము ఎరుపు అనియు, నగభాగము నలుపనియు అర్థములో ప్రయోగింపబడినది.

ఇంకను యీ యమకము ద్వి - 13, 22, 92, 134, తృ-39, పం-13, షష్ఠా-6, 52, సప్త॥-1, అష్టమా-63-పద్యములలో గలదు.

*3. ప్రథమ, చతుర్థ పాదగత మిశ్ర వ్యపేతాది భాగ యమకము:-*

ex-క. శ్రుతి భూషణ యోగ్యుండీ
పతియని తలపోసి యొక్క భామామణి వి.
శ్రుతరత్న కీలితములగు శ్రుతి భూషణ
యుగళ మిడియె శోభన లీలన్.
చ-11

'శ్రుతి భూషణ' 1) పొగడదగిన 2) చెవి యాభరణము.

ఈ విధమైన యమకము ద్వి - 131, సప్త-35, 91, 107 పద్యములలో గలదు.

*4. ద్వితీయ, తృతీయ పాదగత మిశ్రవ్యపేతాది భాగయమకము :-*

ex :- క. వ్రీడావతి చనుదోయికి
నీడని పోల్పంగ ఫలము లేవి యనందా
నీడ న కలవని పేరాః
ప్రోడ వలుకఁ దోడి చెలులు పొదలిరి
వేడ్కన్. ద్వి-125

ఇందు 'నీడ' అను పద మావృత్తమయినది. చనుదోయికిన్ + ఈడు + అని = చనుదోయికి 'నీడ'ని = అనగా చనుదోయికి సమానమైన అనియు, ఎండతగలని ప్రదేశమనియు అర్థములలో 'నీడ' అను పదము ప్రయోగింపబడినది.

ఇంకను ద్వి - 39, తృ - 60, పం॥ - 201, అష్ట - 127 లలో యీ యమకము గలదు.

*5. ద్వితీయ, చతుర్థ పాదగత మిశ్రవ్యపేతాది భాగయమకము :-*

ex :- క. హల్లక గంధికి మదనుడు
వల్లవరాగంపు ముద్దపై నమృతము దాఁ
జల్లుచు నధరముఁ జేసెనో
వల్లవరాగంబు గాఁగఁ బ్రతిభాస్ఫూర్తిన్.
తృ - 62

పల్లవరాగము = 1) ఎఱ్ఱని చిగురు 2) విటునకు అనురాగము - ఈ యమకము పీఠిక - 79; ద్వి. 27, 103, 135, 138 తృ - 48లలో గలదు.

*6. తృతీయ చతుర్థ పాదగత మిశ్రవ్యపేతాది భాగయమకము :-*

ex :- క. ఎందును బధికులు వొడఁ గని
డెందములోఁగలకఁ బడుచుఁ దిట్టుదురను నీ
కుందేలః వలదు మాన్పెదఁ
గుందేలా? యనుచు నతడు కూలగనే సెన్
తృ - 141

కుందేలః : దుఃఖించు టెందులకు?. కుందేలు.
ఈ యమకము పీఠిక - 4; ప్ర - 17. 26. ద్వి-95 తృ - 80. చ - 129. పం - 105. 132. స ప్త - 64 లలో గలదు.

*7. ప్రథమ, ద్వితీయ, తృతీయ పాదగత మిశ్ర వ్యపేతాది భాగయమకము :-*

ex:- క. *భోగవతీ* దక్షిణ తట
*భోగవతీ* పురమునందు బుధులు
నుతింపన్.
*భోగవతీ* సతితో బహు
భోగ విశేషములఁ బ్రొద్దు పుచ్చుచు
నుండెన్. ప్ర - 32

భోగవతీ = నదిపేరు, పురముపేరు, స్త్రీపేరు,
ఈయమకము ద్వి - 139. పం - 205 పద్యము లలో గలదు.

*8. ద్వితీయ తృతీయ, చతుర్థ పాదగతమిశ్ర వ్యపేతాది భాగయమకము:-*

ex:- ఉ. సిద్ధపుఁగీర్తి సంపదల నీరజ బాంధవ
సూతికంటెనుం
*బెద్దన* సత్కళామహిమ మీనపతాకుని
మామకంటె నుం
*బెద్దన* రూపురేఖల నుపేంద్రుని ముద్దుల
పట్టి కంటె నుం
*బెద్దన* మాదయ ప్రభాని పెద్దన మించు
ధరాతలంబునన్. పీఠిక-71

ఇట పెద్దన అను పదము "అధిక్యత" అను నర్థములో అవృత్తమయినది.

*9. సర్వపాదగత మిశ్ర వ్యపేతాది భాగ యమకము :-*

ex1:- క. మరువము మేను లతాంగీ
మరువము దగ మమ్మ హరుని
మాఱుకొనిన య
మ్మరువమ్ము మానుటకు నై
మరువమ్మిది బ్రహ్మ చేసె మాన
సమలరన్. ద్వి. 124.

"మరువము" - మరువము వంటి - మరచి
పోలేము, మన్మథుని దెబ్బ,
మరువపు లత అను నర్థము
లలో నుపయోగింపబడినది.

ఈ యమకమింకను ద్వి - 41. పం॥ - 111లలో గలదు.

*10. ప్రథమ, ద్వితీయములందును, తృతీయ, చతుర్థము లందును అదియే విజాతీయము :-*

ex1:- క. మృగ తృష్ణల కగ్గలమై
మృగ తృష్ణలు దిక్కు- లందు మించం
దొడగెన్
*మృగరాజులు* నానా విధ
*మృగరాజులు* హరులు కరులు మెలగక
డాగెన్. ద్వి. 8.

మృగ తృష్ణలు - మృగముల దప్పికలు, ఎండ మావులు.

మృగ రాజులు - సింహములు, మృగరాజులు.

ఈయమకము పీఠిక-29; ద్వి-81. 126, 141. 142. 144. 152 చతు - 71. షష్ఠా - 188 లలో గలదు.

*11. ప్రథమ, తృతీయములందును, ద్వితీయ, చతుర్థముల యందును అదియే విజాతీయము ;*

ఉదా -

శా. నీవీ మోక్షము గోరి యోగముల నెంతే
డస్సి దెందంబులో
నీ వెంటం గొనరాని మీది యమృతం బేలా
విచారింప? నా
నీవీ మోక్షము జేసి యోగముల నెంతే
నెమ్మదిం డాయ నీ
వే వెంటన్ జనకుండ గల్గ నమృతం
బిచ్చోట నా మోవిపై తృ. 82.

నీవీ మోక్షము=నీవు + ఈ మోక్షము
నీవీ + మోక్షము = క మడి
విప్పుట.

ఏవెంటం అనుపదము=ఏవెంటం గొనరాని = ఎందులకు నుపయుక్తముకాని, ఎచ్చటకును, అను నర్థములలో వాడబడినది.

ఈ యమకము ద్వి - 35; తృ - 145 లలో గలదు.

**12. ప్రథమ, ద్వితీయ పాదగత మిశ్ర వ్యపేతాంత భాగ యమకము:-**

ex:- మ. చెలియా! యప్రతిమాన గంధములచేఁ
జెన్నొందు నఁ సంపెంగదా
గలుషా కారులటంచు భృంగ వరుల
న్గారించి సంపెంగదా
తలపన్ దీని గుణంబు లెల్లవిని పొంద
వ్రాతముల్ సంతసం
బుల పొందంగని భీతి నొందు ననినన్
భూమిన్ విచిత్రంబుగాన్.
ద్వి - 127.

సంపెంగదా: | సంపెంగ, తాన్
| శం పెంపకదా, అనియు అర్థములలో
ప్రయుక్తమైనది.

**13. ప్రథమ, పాదాంతగత, అమిశ్ర, అవ్యపేత యమకము[1]:-**

exl:- నా సహాయంబు కాకున్న నరుడు నరుడు
షష్ఠా-147.

నరుడు = కిరీటి, మానవుడు.

**14. ప్రథమ, తృతీయ పాదగత పాదాభ్యాస యమకము .-** అనగా ప్రథమ, తృతీయ పాదములు తుల్యములగుట. "కావ్యాలంకార సంగ్రహము లోనిది 'సందంశ' యమకముగా పేర్కొనబడినది.

exl.-మ ఘన రావంబు చెలంగ భృంగి వినుతుల్
గావించి పాడంగ గా
నన మందెవ్వుట నీలకంఠ విలసన్నాట్యంబు
రంజిల్లె, దా
ఘనరావంబు చెలంగ భృంగి వినుతుల్
గావించి పాడంగ గా
నన మందెవ్వుట నీలకంఠ విలసన్నా
ట్యంబు రంజిల్లదే,

—వాద్యముల యొక్క ధ్వని అతిశయించగా భృంగీశ్వరుడు మొ॥ వారు పాడగా కైలాసమునందు నీలకంఠుని విలసన్నాట్యము రంజిల్లెను. మేఘముల ధ్వని అతిశయించగా, తుమ్మెదలు ఝుంకారము చేయుచు పాడగా, అడవి యందంతటను నెమళ్ళ నాట్యము రంజిల్ల కుండునా?

ఈ విధమైన యమకము ద్వి -87 పద్యములో గలదు.

ఇంతియగాక దర్మన రచనలో నింకను కొన్ని యమకభేదములకు లక్ష్యము లనదగిన పద్యములు గలవు. వానిని లక్షణములతో చెప్పవలెనన్న నవి -

1. గీ. "కలసి యుండుట యనియెడి కారణమున
వాని భేదమ్ము లెన్నియో వఱలుచుండు...."
తెలుగు కావ్యాదర్శము 3-144.
దీనిని బట్టి పుణియొక్క భేదము.

(1) ప్రథమ పాదగత అవ్యపేత అమిశ్ర ఆదిమధ్య భాగయమకము (ఉదా. సప్త - 73) - (2) అవ్యపేత మిశ్ర ఆదిభాగ పాద చతుష్టయ గతము (ఉదా:- సప్త - 161): (3) ప్రథమ పాదగత, అవ్యపేత, అమిశ్ర, ఆదిభాగయమకము (ఉదా:-షష్ఠ-140) (4) ప్రథమ పాదగత మిశ్రవ్యపేత మధ్యాంత యమకము (ఉదా:- షష్ఠ-187 ; (5) ప్రథమపాద మిశ్రవ్యపేత మధ్యమధ్య భాగయమకము (ఉదా:- పం॥ - 53): (6) వ్యపేత, మిశ్ర, ఆది మధ్య భాగ పాద చతుష్టయగతము (ఉదా:- ద్వి-21) మొ॥నవి.

లలితములైన పదములతో మధురములైనట్టి యమకముల నుపయోగించినకవి ధర్మన్న.

ఉదా:- *వగడంపు* దియ్యమోవికి
*బగడంబుగ* దాల్చి కెంపు బాగులచే ...
అను తావున్,

'*బొమ్మలఁ* బెట్టినట్టి కను *బొమ్మలు* చూడగ నొప్పె బాపురే అను తావున చక్కని యమకములను ప్రయోగించెను,

ఆయా పాత్రల స్వభావాదికములను చెప్పుట లోను చక్కని యమకములను పొందుపరచెను.

అని రుద్ధుని గుణాతిశయమును చెప్పుచు -

ఉదా:- ... *అని రుద్ధుడు* సంగర మున నని
*రుద్ధుండు* రూపమున గురుమీఱన్.

అక్రూరుని స్వభావమును వర్ణించుచు-

"*క్రూరుడవు* గాని నెపమున; సారస సంభవుడు
నీవు సార్థకముగ న
*క్రూరుండని* పేరొనగెను..." అని యమకము
లను పొందుపరచెను.

పదములను విరిచి అద్భుతముగా నర్థములను వ్యక్తం చేయగల నేర్పు యీ కవిలో చెన్నొందినది.

ఉదా:- తే. *కేళి* సలిపెడు తన మంచి *కేలి* యుం
*గరము*ల కాంతులత తియుం *గరము*ల
విరుల
*నంది యల* మించు పదముల *నంది*
*యలర*
*వంబు* మీఱగ నింద్రు భావంబు దనర
—" మంచి కేలి యుంగరముల
కాంతుల తతియుం,
గరముల విరులను, అందియల మించు
పాదములను,
అంది, అలరవంబు మీఱగ...
అనుపద్యమును విరిచి
చదివిన భావము స్ఫురించును.

మఱియు చతుర్థముని వేటను వర్ణించుచు:
"కలకలము సేయు మనుజుల
*యెలుగులు* విని చెదరునట్టి *యెఱగుల* నేసెన్
బొలమెల్ల, గలికి చూపుల
యెలములచే *నిర్లు* కొలుపు *నిర్లం* ద్రుంచెన్.

యెలుగులు - కంఠధ్వనులు, ఎలుగుగొడ్లు,
ఇర్లు కొలుపు = అంధకారముచేయు
= హరిణములు.

—ఇవ్విధముగా "చరిగొండ ధర్మన్న" కవి విచిత్ర యమకరీతుల నుపయోగించి తన "చిత్ర భారతము"ను చిత్రమైన కావ్యముగా రూపొందించి నాడు. క్రీ. శ. 1600–1630 మధ్య ప్రాంతములో రాజ్యము నేలిన "రఘునాథ రాయలి" ఆస్థాన కవి యైన "చేమకూర వేంకటకవి" యమక రచనలో చిత్రభారతకర్త నటనట ననుసరించినటులు తోచును. ఈ క్రింది పద్యములను పరిశీలించిన విశదమగును

1. "చిత్ర భారతము" నందు:—

క. "*భోగవతీ* దక్షిణ తట
*భోగవతీ* పురమునందుబుధులు నుతింపన్

భోగవతీ సతితో బహు
భోగ విశేషములఁ బ్రొద్దు
పుచ్చుచునుండన్"

—అను తావున భోగ పదము నాల్గు పాదముల యందును నావృత్తమైనది భోగతో కూడుకొని యున్న "భోగవతి" అను పదము నది పేరుగ, పురము పేరుగ, స్త్రీ పేరుగ చెప్పబడినది. తరువాతి భోగ అనుదానికి సౌఖ్యము అని అర్థము గలదు. ఇటువంటి "భోగ" పదముతోఁగల పద్యము "విజయ విలాసము" నందు గలదు.

"ఆ భోగము తద్వస్తుచ
యా భోగము నెందు గన్నయవి గావు సుమీ
నాభోగ పురము సరియౌ
నాభోగవతీ పురంబు సార్థంబయ్యెన్."

—ఇందుగల "ఆ భోగ" శబ్దము సౌఖ్యము, సమూహము, స్వర్గపుంము, "భోగవతీ" యను పేరుగల పట్టణము-అను అర్థములలో ప్రయోగింప బడినది. ఈ రెండింటా "భోగ" పద సామ్యము గమనించదగినది.

2. చిత్ర భారతమునందు:—

ఉ. తీయని వింటనే వెనుక తీయని వీరమునన్
మనోభవా!"

—అని గలదు. "తీయని" పదమునకు మాధుర్యమనియు, "వెనుక తీయని" పదమునకు తగ్గనటువంటి అనియు అర్థములు గలవు. ఇటువంటి రచన విజయ విలాసమునందును గలదు —

ఉ. "తీయగఁ బంచదార వెను తీయగ బల్కి-
ననున్ ద్వితీయగన్"

ఇందును "తీయని" శబ్దమే ఆవృత్తమైనది. "తీయగ" అనగా మాధుర్యమనియు, "వెనుక తీయగ", అనగా వెనుకబడేటంత అనియు అర్థములు గలవు.

మరియొకటి—

ఉ. "తియ్యని వింటివాని వెను తియ్యక దగ్గఱఁ
జాఱ నయ్యసా..."

(విజయ విలాసము)

ఇట "తియ్యని వింటి వానిన్" అనగా చెఱకు విల్లుగల మన్మథుని

"వెనుతియ్యక" అనగా భయపడకుండ అనియు అర్థములు గలవు.

—ఇట వేంకటకవి ధర్మనను అనుసరించెను అని చెప్పుట ప్రధానోద్దేశము కాదు. "యమక చక్రవర్తి"గా పరిగణింపబడిన "చేమకూర కవి"కి పూర్వమునను యమక రచనా ప్రవీణు డొకడు గలడు. ఆతడే "చరిగొండ ధర్మన్న". "చిత్ర భారతము"న నీతడు ప్రదర్శించిన యమక రచనా మధురిమను పురస్కరించుకొని యీతనిని కూడ "యమక చక్రవర్తి" వంటి బిరుదుతోనో, లేక అంతకంటె గొప్ప బిరుదుతోనో సత్కరించిన సమంజసముగ నుండునను అభిప్రాయమును వెలిబుచ్చుటయే యీ వ్యాసోద్దేశము.

•••-•••

# కాల్పనిక కవి వచః కర్పూర కళిక ఏకాంత సేవ

కతెవరపు వేంకట్రామయ్య ఎం. ఏ.,

నవ్యాంధ్ర సాహితీ జగతికి ఉషః కిరణాలు ప్రసరింపజేసిన కవితా భాస్కరులు వేంకట పార్వతీశ్వర కవులు. వీరు జంటకవులు. బాలాంత్రపు వెంకటరావు, ఓలేటి పార్వతీశం. 20 వ శతాబ్ది ప్రథమ దశాబ్దిలోనే కవితా వ్యవసాయం ప్రారంభించిన వీరు నవ్యపోకడులతో యుగ కర్తృత్వ స్థానానికి అర్హులై నిలిచారు. "నవ్యాంధ్ర కవితా సతికి గురజాడ అప్పారావు గారు క్రొత్త తెన్నులు చూపెను. రాయప్రోలు సుబ్బారావు పద శిల్పము నివేదించెను. వేంకట పార్వతీశ్వర కవులు తేట గీతముల మంజరుల కానుకలిచ్చిరి. ... వీరలు నవ్యాంధ్ర సాహిత్యమునకు సూత్రధారులు[1]" అని ఆంధ్ర శేషగిరిరావుగారి అభిప్రాయము. ఇంతకన్నను ఇంకా విస్పష్టముగా శ్రీ ఊటుకూరి వేంకట పార్వతీశ్వర కవుల యుగ కర్తృత్వమును స్థాపించుట గమనార్హము. "The present age in the Telugu literary world may fitly be called the Age of Venkata Parvateswara Kavulu, for to them the Telugu Novel owes its present day perfection, and Telugu Poetry is by them made to run into new phases and ways of thought that it had never reached before"[2]. నవ్యాంధ్ర సాహిత్యంలో వీరికి గల స్థానాన్ని పై మాటలు స్పష్టపరుస్తున్నాయి.

నవలా రచనకు తెలుగులో ప్రచుర ప్రచార ప్రశస్తులను కలిగించినది వేంకట పార్వతీశ్వర కవులే. వంగభాషనుండి వీరు పుంఖాను పుంఖాలుగా నవలలు ఆంధ్రీకరించిరి. మాతృ మందిరం, ప్రమదావనం, వసుమతీ వసంతం ఇత్యాదులు వీరి స్వతంత్ర నవలలు. వీనిలో మాతృమందిరం శిరశ్శేఖరం. కాగా ఏకాంతసేవ, భావ సంకీర్తనం, బృందావనం, కావ్యకుసుమావళి వీరి పద్యకృతులు. వీనిలో "ఏకాంత సేవ" విశిష్టము, విలక్షణమునైన కృతి.

"వంగభాషకు రవీంద్రుని గీతాంజలి యెట్టిదో, మన యాంధ్రమున కీ మహాకవుల-భక్తుల యేకాంత సేవ యట్టిదని నా యభిప్రాయము"[3] అని శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు దీని కిచ్చిన కతపత్రం. నాటి నుండి యిది గీతాంజలి కనువాదమన్న భ్రమ ప్రమాద మేర్పడినది. కానీ యిది గీతాంజలి కనువాదంకాదు. ఆ రీతిలో నడిచిన కృతి. "Gitanjali is a confluence of romanticism mysticism, and humanism. The deep subjective note charecterising romantic poetry sounds through his songs and poems, giving them the necessary emotional

1. తెనుగు కైతల క్రొత్త తెన్నులు పు 81.
2. కావ్యకుసుమావళి. ప్రథమ భాగం, పీఠిక. పు. 1.
3. ఏకాంత సేవ. 1939. పీఠిక. పు. 20.

content with out which religious poetry to make an impact-"[4] - అని C. N శాస్త్రి గారు గీతాంజలి కవితావస్తువును విశదీకరించిరి. వేంకట పార్వతీశ్వర కవులు వంగభాషతో బహుధా పరిచయం గలవారు. గీతాంజలి కావ్యసుధలను తని వార గ్రోలినారు. ఏ తత్ప్రభావముతో నూతన కావ్య రచనకు గడంగినారు. అయితే "రవీంద్రుని గీతాంజలి వాస్తవికత, హేతుసంబద్ధత, సౌందర్య తత్పరత ఉన్న మిస్టిక్ కవిత్వమని చెప్పవలెను ఈ రెండు కావ్యములు (గీతాంజలి - ఏకాంత సేవ) సరళమైన భాషలో, మృదులమైన శబ్దములతో, సామాన్యమైన దేశి ఛందస్సులో, మధుర భావనా మయంగా రచింపబడినవి అంతకు మించి వీనికి పోలిక లేదు."[5] అంటారు డా॥ సి నారాయణరెడ్డి గారు. అంతేకాక నాడు వంగసాహిత్యాన్ని ప్రచలితం చేస్తున్న మధురభక్తి సంప్రదాయం, కాల్పనిక కవితోద్యమం కూడ యీ కవులపై ఇతోధికంగా ప్రభావం చూపినవి. "మానవోద్యమానికి ప్రేరణ అయినట్టుగానే (ఈ) మధురభక్తి సంప్రదాయానికి, కాల్పనిక మాధుర్యానికి కూడ వంగ దేశమే ప్రేరణ అయింది దీనికి తోడు ఆంగ్ల కాల్పనిక కవుల ప్రభావం కూడ కలిసి వచ్చింది. అంతే! నవ్య సాహిత్య గృహాంగణం అంతా వింత వింత పరిమళాలతో నిండిపోయింది. ఆ పరిమళాలను దోసిట నిండుగా తీసికొని వచ్చినవారు వేంకట పార్వతీశ్వర కవులు, రాయప్రోలు సుబ్బారావుగారు"[6] అన్న ఇంద్రగంటి శ్రీకాంత శర్మగారి పలుకు లిట గమనార్హములు. సమష్టిపై ఏకాంతసేవ వస్తుపరంగా - పరోక్షంగా రవీంద్రుని గీతాంజలి, ప్రత్యక్షంగా మధురభక్తి సంప్రదాయం సమ్యక్సమ్మేళన మంది తెలుగున వెలసిన స్వతంత్ర కృతి. ఇది రచనారీతిలో కాల్పనిక కవితా శైలీలాలిత్యాన్ని పుణికి పుచ్చుకొన్నది ఏకాంతసేవ కావ్య వైశిష్ట్యము మధుర భక్త్యాశ్రితము.

"సాతస్మిన్ పరమ ప్రేమ రూపా"[7] - ఈశ్వరుని యెడల పరమపూజ్య భావమే భక్తి యని నారద భక్తి సూత్ర నిర్వచనము ఈ భక్తి నవవిధములు వీనిలో మధురభక్తి ఒకటి ఈ మధురభక్తికి ప్రథమంగా రసస్థాయి కల్పించినవాడు "ఉజ్జ్వల నీలమణి" కర్త వంగదేశీయుడు రూపగోస్వామి. "పృథగేవ భక్తి రసరాట్ సవిస్తరభోచ్యతే మధుర:"[8] అని ప్రతిన చేసి మధురము, ఉజ్జ్వలము అను పేరుతో భక్తిరసమును విస్తరించినాడు. ఈతని ప్రతిపాదనలో యీ భక్తి శ్రీకృష్ణ గోపీ విషయకము. శృంగారరూపము. దీనికి చిత్తద్రవము స్థాయి భావము. ఇతర శృంగార ముపాదేయంలేదు. ఈతని తర్వాత మధుసూధన సరస్వతి తన "హరిభక్తి రసాయన" మను గ్రంథమున ఇట్లు వ్రాక్రుచ్చెను.

"కాంతాది విషయా వాయే రసాద్యాస్తత్ర నేదృశం
రసత్వం పుష్యతే పూర్ణ సుఖా స్పర్శత్వ కారణాత్
పరిపూర్ణరసా క్షుద్ర రసేభ్యో భగవద్రతి:
ఖద్యోతేభ్య ఇవాదిత్య ప్రభేవ బలవత్తరా".

-కాంతాది విషయకములగు మిగిలిన రసములందు భగవద్రతి యందువలె పరిపూర్ణ సుఖము లేక ఆనందము కలుగదు. అందువలన వానియందు రసపుష్టి సుష్ఠుగా లేదు. అవిక్షుద్ర రసములు. భగవద్రతి పూర్ణరసము. ఆదిత్యప్రభ మిణుగురుల కన్న

4. The Two-fold voice. p: 26.
5. ఆధునికాంధ్ర కవిత్వము. పు. 484
6. సాహిత్య పరిచయం, పు. 23.

7. నారదభక్తి సూత్రములు. సూ. 2.
8. కావ్యాలంకార సంగ్రహం - సన్నిధానం వ్యాఖ్య. పు. 307లో ఉదాహృతం.

యెట్లు బలవత్తరమో, అట్లే మిగిలిన రసములకన్న భక్తి శ్రేష్ఠతరము. ఇక ఈ రసమునకు "ఆలంబన విభావము భగవంతుడు. తచ్చరిత్రలు విభావములు. భగవదాకార చిత్తవృత్తియే స్థాయి భావము. అదియే భగవద్రతి. అను భావములు తత్కాలమున బుట్టిన నేత్రాది వికారులు. వ్యభిచారాదులు నిర్వేద శంక హర్షాదులు".[9] దీనినే ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారిట్లు వివరించిరి. " , ప్రేమ మిళితభక్తియే మధురాతి మధురంగా పరిణమించును. ఆ భక్తుడు తాను ప్రేయసిగా భగవంతుని కౌగిలిలో చేరినట్లు, మానసిక సంయోగ సుఖము ననుభవించు ఆ క్షణములో ఆతనికి సాయుజ్యసుఖము కలుగును. జీవన్ముక్తు డగును. అట్టి భక్తుడు చేసెడు చేష్టలు, పలికెడు మాటలు లోకమునకు విపరీతకృత్యములుగ తోచినను; భగవంతునికి మాత్రం మురిపెంపు చెయ్యులే యగును సారాంశ మేమనగా ఒక్కొక్క భక్తుని మనస్తత్వమును బట్టి భక్తితో, ప్రేమకలిసి యుండునని. అది ప్రణయంగా మారి శృంగారంగా పర్యవసించుననియు, ఉత్కాలిగింతమైన ఈ భక్తినే వైష్ణవ సంప్రదాయంలో "మధురభక్తి"యందురు"[10] ఈ భక్తి యైదు విధములు భర్త యని భావింపబడు భగవంతునిపట్ల గురుభావము కలిగిన మధుర శాంతి, సేవ యున్నయెడల మధురదాస్యము, పరస్పర ప్రీతి సంభాషణము మధురసఖ్యము, ఆహారంథనము మధుర వాత్సల్యము, విశుద్ధ దాంపత్యము మధురమధురము.[11] దీనినే వైష్ణవ కవులు పూర్వరాగము (Dawn and love); మిళనము (Union and Ecstasy) సంభోగ మిళనము (Rapt), విరహము (The Pain of God); భావసమ్మిళనము (Spiritual Marriage) అని విభజించిరి.[12]

ఇట్టి మధురభక్తి తత్త్వమును సంపూర్ణముగా జీర్ణించుకొని వెలసిన ప్రథమాంధ్రకృతి ఏకాంతసేవ.

> "ప్రకృతి యది యేమొ రాగసంపన్నమయ్యె
> భావ మది యేమొ యానంద భరితమయ్యెఁ
> జిత్తమది యేమొ ప్రేమ సంసిక్తమయ్యె
> దేహ మది యేమొ సాత్త్వికాధీన మయ్యె
> విభుని శ్రీ పాదములఁ గొల్చువేళ యేమొ?
> రమణు నేకాంత సేవకు సమయ మేమొ?

ప్రభాతసమయమున హృదయకేదారమున కోర్కెలిగురు వెట్టి, భావసహకారమున ప్రేమ పల్లవింప, వరమనోహర పంచమ స్వరము నెత్తి "పాడవేమమ్మ కోకిలా? పాడవేమో?" – అని కోకిలను తొందర పరుస్తున్నది. మధుర భక్తిలో ప్రథమదశయగు 'Dawn & love' ఇచట సూచితము. ఇందు కవులు తమకు స్త్రీత్వము నాపాదించుకొనుచున్నారు. ఆ "భక్తి పారవశ్యంలో తాము ను ఒక స్త్రీగా మారిపోయి, భగవంతునికి సపర్యలు చేయడానికి, ఆనందంతో అలసట తీర్చడానికి పూనుకొని, అతి మధురంగా గానమొనర్చినారు. ఈపవిత్ర భావావేశంలో... తాను స్త్రీ యైనది పురుషుడైనదీ మర్చిపోక తప్పదు. అహంకారానికి ఎంతమాత్రం స్థలంలేదు. హృదయ

---

9. Ibid. P. 308

10. సాహిత్య శిల్ప సమీక్ష. పు. 164-165.

11. భక్తి తత్త్వము – నిర్వికల్పానందస్వామి. పు. 40-41.

12. ఇట Saint Theresa అను పాశ్చాత్య విద్వాంసురాలు 'El castills Interior' అను గ్రంథమున భగవద్భక్తిని 1- Recollection, 2. Quiet. 3- Union. 4. Ecstasy) 5. Rapt 6-Pain of God 7. Spiritual Marriage అని చేసిన విభజన గమనార్హము.

మంతా ప్రేమమయము. లోకమంతా ప్రేమ మయము."[13].

"శ్యామ సుందర మోహన జలదమూర్తి
యెచట కన్నుల బడియెనో యేమొగాని
యప్పుడే వింతగా పురివిప్పుకొనుచు
నెమ్మి నెఱజాణ నృత్యంబు నెఱపుచుండె"

—అని అంతటా ఈ ప్రేమతత్వమును దర్శిం చినది. ఇంకా ఆ ప్రభుదర్శనంలో కలికికులుకుల గొరవంక వింత యొయ్యారములతో చిలుక చెలి తోడ యేమేమొ చెప్పుచున్నదట! సర్వప్రకృతి ఆతని మనోజ్ఞ దర్శనముతో పులకితగాత్ర కాగా ఇక తన సంగతి వేఱుగా చెప్పవలెనా? అందుకే ఆ లోక మోహనుని సుశ్లోకములను గొంతెత్తి పాడమనుచున్నది.

"కనులు తమకించె హృదయంబు కదలబాఱె
మేను పులకించెఁ బ్రాణంబు లీనమయ్యె"

నాయికయందు గలిగిన సాత్త్విక భావోదయము వర్ణితము. నాయకుని కాంచబోవుచున్నానను ఊహతో నాయికకు కలిగిన యనురాగము (లాక్ష ణికానుసారముగా) వర్ణితము.

"నేత్ర వక్త్రప్రసాదశ్చ ప్రియోక్తి: పులకోద్గమ:
అశ్రుస్వేదాదయశ్చాను భావా: హర్షం తమాదిశేత్"-

అని లాక్షణికోక్తి. హృదయేశుని గూర్చిన ఊహతోనే ఆమె పులకిత గాత్రయైనది. కనులు తమ కించినవి. హృదయం కదలబారింది. వచ్చు ఆ ప్రణయ మనోహరుని పూజించుటకు మృదుపత్రము లను, కాంచన సుమములను సేకరించువరకు; ప్రాణవిభు నామ జపంలో మగ్నయై మేనుమరచే దాక-

"మధురముగ మార్దవంబుగా మంజులముగ
మానసానంద కరముగా మంగళముగ"

పాడమని కోకిలను అర్థిస్తున్నది. ఆ ముగ్ధ ప్రణయిని ఆకాంక్ష రమణీయంగా వర్ణితము. మకా రావృత్తితో సుందరలయ యేర్పడింది. "Philosophers have called Rhythm the pulse of the Universe, the Greeks said that its sire was God. At all events poetry in common with other arts, is wholly and absolutely conditioned by Rhythm: This is the breath and law of its being."[4] అన్న T. S. Gmand పలుకు లిట స్మరణార్హములు. విశ్వచైతన్య స్పందనమే ఋతము. భగవంతుడే దానికి ప్రాభవస్థానము. సర్వకళారహస్య మగు "Rhythm" యొక్క ప్రాముఖ్య మిట్టిది. అందుకే కవులు మానసానంద కరముగా, మంజులంగా, మంగళంగా పాడుమను చున్నారు. నిజానికి వీరి కవితాలక్షణ మిదియే. ఏకాంత సేవ మధురము, మార్దవము, మంజులము, మానసానందకరము, మంగళమునైన కృతి.

"కళ్యాణ గీతిలోఁ గల కంఠి చొక్కి-
ప్రణయగానంబులో భ్రమరిక చిక్కి-
నానంద వార్ధి నేనవశనై యుంటెఁ
గరుణింపవే యింకఁ గల్యాణమూర్తి!"

అని విభుని సాంగత్యము నపేక్షించుచున్నది. అన్యమెఱుగని అసహాయ యగుట చేతను ప్రేమ దాపగలేని ప్రేయసి యగుట చేతను ఎంత బేల యైనదో చూడుడు.

13. సాహితి
శివరామకృష్ణ ప్రసాద్. పు. 80.

14. Quoted from "కాదంబరీ రసజ్ఞత - పేరాల భరత శర్మ. p. 45

"ఎదుట నున్నట్టి ప్రాణేశ్వరు నిన్ను
గౌగలింత మటన్న కుతూహలమునఁ
దరిజేర వచ్చుచే తప్పుగాఁ దలఁచి
దీనురాలిని నన్ను దిగనాడి చనుట
ప్రియముగాఁ దోఁచెనే ప్రేమస్వరూప"

అంటూ వియోగవ్యథతో ప్రశ్నిస్తుంది. మధుర భక్తిలో నాయిక దుర్భర విరహం అనుభవింపడం సహజం. ఇదే 'The Pain of God' అను దశ. భాగవతంలోను, గీతగోవిందంలోను మనకు భగవత్పరమైన ఈ "మధుర" విరహ వేదన మనోజ్ఞంగా వర్ణితము. క్షేత్రయ పదాలలోను, హిందీకవి సూరదాసు పదాలలో కూడ ఈరీతి వర్ణనలు కోకొల్లలు.

"విరిదండ మెడలోన వేయుచే గాని
కన్నార నీ మూర్తి గాంచనే లేదు
ప్రణమిల్లి యడుగుల బడుటయే గాని
చేతులారంగ సేవ చేయనే లేదు
నిను గాంచి ముగ్ధనై నిలుచుటే గాని
ప్రేమ దీరంగ బల్కరింపనే లేదు
ఏమేమొ మనసులో నెంచుటే కాని
తిన్నగా నా కోర్కె తెలుపనే లేదు
ఆనంద మందుటే యపచారమనుచు
నవశనై యుండుటే యపరాధ మనుచు
మది నెంచి యీ రీతి మాయలు సేయ
భావ్యమై తోచెనే ప్రాణేశ నీకు"

—నాయిక మనస్థితి మధురంగా, లలిత రమణీయంగా అనుభూతి ప్రధానంగా హృదయానికి హత్తుకొనేటట్లు వర్ణితము. ఇది "రొమాంటిక్" (Romantic) కవితా శిల్పము. "విరిదండ మెడలోన వేయుటేగాని, కన్నార నీ మూర్తి కాంచనే లేదు" అనుటలో కవుల తాదాత్మ్యము స్పష్టముగ నిరూపితము. Poetry is the suggestion by the imagination of noble grounds for the noble imotions" - అన్న Ruskin కవితా నిర్వచనమునకు సమర్థమైన లక్ష్య మిది ఉదాత్తావేశములకు ఊహద్వారా ఉత్తమాలంబనం ఉత్తమంగా కల్పింపబడినది.

"రజనీ ముఖంబున రాగంబు మెఱసెఁ
గలువ పుట్టింటిలోఁ గలకల విరిసె
దివ్య సౌధంబులో దీపాలు వెలిఁగె
గర్భాలయంబులో గంటలు మ్రోఁగెఁ
బ్రాకృతీ మణి పట్టె బంగారు గొడుగు
విశ్వసుందరి వీచె విరిచామరంబు
భవదఖండానంద భవనాంగణమునఁ
బడిగాపు పడియుండె ప్రకృతి గణంబు
ఆకలైన నెఱుంగవైతి వేమయ్య
ఆరగింపఁగ వేళయయ్యె రావయ్య!"

నాయకుఁడైన భగవంతుని ఆహ్వానిస్తున్నది. "ప్రకృతి గణమంతా దర్శనము చేయవలెననే ఉత్కంఠతో వాకిట ముందు పడిఉన్నా, తాను ప్రకృతిలో ఒక అణువును పోలి ఉన్నప్పటికీ వినయంగా ఆనందంతో సర్వేశ్వరుని తన పేద గుడిసెకు భోజనం చేయడానికి రాగోరుతూ తనలో పొంగులు వారుతున్న భక్తిభావాన్ని ప్రదర్శించి"[15] ధన్యయైనది.

"ప్రణయాన దూఁగుచుఁ ప్రణయగీతములఁ
ప్రణయంబు పల్లవింపఁగఁ బాడుకొనుచుఁ
ప్రణయ రూపానంద భాగ్యంబుఁ గాంచి
ప్రణయ శాసనమునఁ ప్రణయ రాజ్యంబు
పాలింత మిఁక రమ్ము: ప్రణయాధి నాథ!

ప్రణయ శబ్ద పౌనః పున్య ప్రయోగంతో నాయిక అనురాగ తీవ్రతను ధ్వనింప జేస్తున్నాడు. అంతే కాదు ఈ రీతి రచనలో మసృణమగు లయ యేర్పడి పాఠక హృదయాలు రసతుందిలము లగుచున్నవి.

15. సాహితీ సాక్షాత్కారము, పు. 81,

"కన్నా నాధునిఁ గాంచక యున్న
క్షణమైన గడపంగ జాలని నేను
శ్రీశ జనావను కొల్వు సేవింపకున్న
నిమిషమైనను నిల్వనేని నేను
......... ... ......
మాణిక్యమయమూర్తి మాయమైపోయె
నిలువ నొల్లదని నే దూలు చుండ।
జోద్యంబుగా నిట్లు చూతువేమమ్మ?
ప్రణయ వనంబు లోపలి పుష్పరథము
తుమ్మెదా। వేవేగ తోలి తేవమ్మ।"

కనుమరుగైన నాధుని అన్వేషించి పట్టి తెచ్చుటకు ప్రణయవనంలోని పుష్పరథాన్ని శీఘ్రంగా తోలుకు రమ్మంటున్నది. ప్రకృతిలోని కోకిలలు, తుమ్మెదలు ఆమె చెలులు వీనినే చెలులుగా చేయుటలో కవి చమత్కారము ప్రదర్శించినాడు. అనంగుని అనుంగు బంట్లు యివి. వీనితో ప్రణయ సందేశము నివేదించుట తేలిక. అది వీనికి కూసువిద్య. అందుకే శృంగార ప్రతీకముగ వీనిని చెలులు చేసినారు. ఇచట నాయిక పూర్వసంఘటనలను స్మృతికి దెచ్చుకొనుచున్నది. నాడు సాక్షాత్కరించిన స్వామిని గాంచి నిలువెల్ల పులకించి అటులే నిలిచిపోయింది. (Union & ecstasy) కళ్యాణ నిలయమౌ కాంతుని మూర్తిని నిలువుటద్దంలో నిలుపుకొన్నది. ప్రేమ గీతాలలో ప్రియుని పేరెత్తి గద్గద స్వరయైనది. ఇంతలో అతడు అదృశ్యుడైనాడు. పీనన్నింటా తాను చేసిన తప్పేమి కలదో? అనతిమ్మని అడుగుటకు పుష్పరథంలో బయలుదేరుచున్నది. ఇంతలో స్వామి తన్ను మఱచు నేమో యన్న యనుమానం.

శృంగార సరసిలో శ్రీమండపమున
గొనుకు పీఠంబుపై గొలువుండెనేమో?
..................... ........ ...
చిత్రమౌ వనములో శృంగారకమున
నిండు వెన్నెల బైట నిదురించెనేమో?
సుశ్లోక మయమైన శ్రుతిమేళగించి
లీలా విహారుని లేపుదుగాని"

అని తుమ్మెదతో బయల్దేరు చున్నది. ఆత్మేశుతో నైక్యమందరి ఒక్కింతసేపుకూడ నిలువలేదు. అందుకే అలా బయలుదేరిన ఆమె వినే విరిబోణితోను; కనుపించిన కనకాంగితోను తమ అమేయాను రాగాన్ని తెలిపి తన నాధుని వారు చూచారేమోనని "వెఱ్ఱియై" ప్రశ్నిస్తున్నది.

"కన్ను గప్పిననాటి కడసారి చూపు
తొలుసారి పువ్వుగాఁ దోఁచె నెవ్వరికో
చేయి దప్పిన నాఁటి చిరునవ్వు మొలక
తొలుకారు మెరుపుగా దోఁచె నెవ్వరికో
శ్రీహీనమైన నా శిశిర వాసరము
ధన్యురాలికి వసంతం బయ్యెనమ్మ
అంధకార వృతంబైన నా రాత్రి
భాగ్యరాసికి బట్టబగ లయ్యెనమ్మ
ఇన్నాళ్ళ పరిచయం బింతగాఁజేసి
లోకేశుఁ డెవరికో లోఁగి నాడమ్మా
విరిబోణి యీ మాట విన్నావటమ్మా
కనకాంగి నానాధు కన్నావటమ్మా।"

నాటకీయ వ్యంగ్యం (Dramatic Irony) ప్రవర్తితమైనదీ మంజరిలో. కవులు నాయిక పలుకులలో తమ అంతర్వేదనని వ్యక్తపరుస్తూ, ఆమెయే తామై ఆ "లోకేశుని" అన్వేషిస్తున్నారీ గీతంలో. అతని హేలకు ప్రకృతితో తాదాత్మ్యము ఘటింప బడినది. "Poetry every where has found in nature some of the most valuable sources of its inspiration and subjects of its inter pretations. It seems with discriptions of nature or with analogies drawn from its workings or its scenes. Some-times with

mystical writers its regards nature as a symbol of Spiritual varieties- 'a living garment of God'' [16]. "ప్రకృతి దర్శనముతో కవికి గలిగిన అనుభూతి స్పందనమే కవిత్వరూపము నొందుననియు, చర్మ చక్షువునకు గోచరించు ప్రకృతి మనోనేత్రమున భగవానుని లీలల గుర్తింపజేయ గలుగుననియు రూఢి యగుచున్నది. ప్రకృతి ప్రత్య క్షములో భగవత్తత్త్వము ప్రతిపాదితము - [17]", అన్న విమర్శక వాక్యములు ఇచటస్మరణార్హములు లోకేశుడు కడసారి చూచిన చూపు తొలిపువ్వుగాను, చిరునవ్వు మొలక తొలకారు మెరుపుతోను తాదాత్మ్యము కూర్పబడింది. అటనిరాశతో శ్రీహీనమైన శిశిరము వసంతంగా తోచింది ఇట్లే అంధకారావృతంబైన రాత్రి భాగ్యరాసికి పట్టపగలైన దగుటలో ఆ లోకే శుని తత్త్వము నిరూపితము.

ఇలా ప్రశ్నిస్తూ పోతున్న ఆమెకు సమయ సూచ కంగా "నకినాలకుంచె" వీధిలో పైనుండి తిరిగిన దట ఫలసూచకంగా "పలుకుల బరిజె యెలమావి గుంపులో ఎదురొచ్చిందట. నియతి సూచకంగా నీలాల మురళి తలిరాకు తోటలో తనంతనే మ్రోగిందట.

"ఉన్నతాసనముపై నుండి నావిభుడు
పేరెత్తి చేయెత్తి పిలుచుచున్నాడు
ప్రేమతో మనవిచ్చి పలుకు చున్నాడు
సెలవిచ్చి పంపరే చెలులార నన్ను"

అంటూ విడ్కోలు తీసికొని విభుని సన్నిధికి చేరు చున్నది. "ప్రాణనాథుడు కృపా పరతంత్రుడగుట: పుణ్యంబు గాదచేః పుష్పబోణులకు" అంటూ భ్రమరమే బాసటగా బదిలమగు పాణిద్వయంతో, నిశ్చలమగు నేత్రయుగంతో, చెదరని చిత్తంతో నాథు నర్చించుటకు పూజాద్రవ్య సమితితో బయలు దేరిన ఆమెకు విభుండు ప్రసన్నుడై ప్రత్యక్షమైనాడు.

"ఏకాంత సేవలో నీ వేళదాక
పద్మాసనంబున్న బదలిక దీఱ,
శ్రీ పుష్ప యోగ సంసిద్ధి చేకూర
దేవకీ బాడినదే పాటయయ్యె"

ఈ విధంగా వారికి "సంయోగసిద్ధి" చేకూరింది, ఆమె ఆనందానికి అంతేలేదు. ఆ జగన్నాయకునితో నిరం తర సంపూర్ణ సాంగత్యాన్ని వాంఛిస్తున్నది తుదకు.

"సర్వలోకేశ యీసాల భంజికను
నీకేళి గృహమందు నిలువగా నిమ్ము
భువన సంత్రాణః యీ పుష్పవల్లికను
నీ పూల తోటలో నిలువగా నిమ్ము
సర్వజీవుల కీవు సముడవు గాన
నీదర్శనము చేయ నేగోరికొంటి
.................. ......
నీ సేవ చేయంగ నేగోరికొంటి
దయతోడ తిలకించి దాస్యంబొసంగి
నన్నేలు కొనుమయ్య నా జీవితేశ!"

ఇది భావసమ్మేళనమను దశకు (Spiritual Marriage) చెందినది. లౌకికానుభూతి ద్వారా అలౌకికాను భూతి రూపుకొట్టే ప్రయత్నమిది. "సర్వజీవులకీవు సముడవు" అనుటలో పై భావం వాచ్యమౌతున్నది. శృంగార రససిద్ధి రూపమగు జీవేశ్వరులయైక్యమిది. ఈ మంజిరిలోనే దయతోడ తిలకించి, దాస్యంబొ సంగి, ఏలుకొనుమయ్య అనుటలో మధురభక్తి అవాంతభేదములగు మధురశాంతి, మధురదాస్యము, మధురమధురము ప్రవర్తితములు. ఇంతగా ఆ సంప్ర

16. Encyclopedia of Religion & Ethics Vol. IX

17. ప్రకృతి ప్రబంధం-చేకూరు చిన్నకృష్ణయ్య. పు. 8,

దాయమును ఊచమట్టుగ అనుసరించిన కృతి ఏకాంత సేవ.

ఇక కవితా పరంగా చూస్తే వేంకట పార్వతీశ్వరుల శైలి అపూర్వము. విశిష్టము. భావకవులలో వీరిదొక వినూత్న మార్గము. రచన సుప్రసన్నము. సంగీత ప్రధానము. "By poetry we mean the art of employing words in such a manner as to produce an illusion on the imagination, the art of doing by the means of words, what the painter does by means of colours'' అంటాడు మెకాలే కవిత్వాన్ని నిర్వచిస్తూ భావనాశక్తిని భ్రాంతులలో నిలిపేవిధంగా శబ్దాలను ప్రయోగించాలి. అంతేకాదు చిత్రకారుడు వర్ణములతో సాధించుదానిని, (వర్ణ యోజనమగు) శబ్దములతో కవి సాధించవలెను. ఇది వేంకటపార్వతీశ్వరుల కవితపట్ల ప్రత్యక్ష సత్యము వీరి కవితలో సర్వత్రా శబ్ద చమత్కారము అర్థానుగతమై, భావానుగతమై సర్వము రసప్రవణ మగుచున్నది. సంస్కృతాంధ్రములో వాగర్థములవలె వల్లభ్యము నొందనవి వీరి రచనలలో మంజరీద్విపద వీరి చేతిలో గేయఫణితిని పుణికి పుచ్చుకొన్నది, అందునా శైలీలాలిత్యంతో శ్రవణ ప్రేయమైనది. చూడుడు :

"మధుర చంద్రికలలో మధురామృతంబు
మధురామృతంబులో మధుర రసంబు
మధుర రసంబులో మధురభావంబు
మధుర భావంబులో మధుర రూపంబు
మధుర రూపంబులో మధురతేజంబు
మధుర మోహనకళా మహితమైయుండ
మధుర స్వరంబులో మధురగీతముల
మధుర గానంబులో మదిమేళగించి"

ఇట్టి ఉదాహరణలు వీరి రచనలలో కోకొల్లలు. భావనాశక్తి, రచనా దీప్తి వేయి ముఖాలుగా విజృంభించిన రచన వీరిది. సుకుమారమైన అనుప్రాస, అందుకు ముక్తపదగ్రస్తంతో, పైరగాలికి వరిచేని వలపు నృత్యంలా మనోజ్ఞమై రసనిష్యంది యగుచున్నది. ఈ శైలీ లాలిత్యమే అనంతర భావకవులకుపాదేయమైనది. "వీరి భక్తి రచనలో కంటిలో నీరు, దోసిట్లో పూలు, హృదయంలో ఆర్తి కనిపిస్తాయి. తెలుగు కవుల నెవరినీ వీరు అనుకరించకపోయినా, నవ్యకవులమీద వీరి ప్రభావం మాత్రం ఉంది"[18] అన్న విమర్శక వాక్యాలు వేంకట పార్వతీశ్వర కవుల కవితా వైశిష్ట్యానికి నికషోపలాలు.

ఆకృతిలో చిన్నదయ్యు, గుణంలో గణనీయమైనది. ఏకాంత సేవ. కాల్పనిక కవి వచః కర్పూర కళిక". నవ్యాంధ్రసాహితీ వియత్తలంలో ధృవతారయిది.

18. సాహిత్య పరిచయం, పు. 26.

# చరిత్రాత్మక వ్యాకరణాలు

డాక్టర్ ఎల్. చక్రధరరావు

వేర్వేరు కాలాల్లో ఒక భాషలో కలిగిన మార్పుల్ని వివరించే శాస్త్రం చరిత్రాత్మక వ్యాకరణం. మార్పు సమాజానికే కాక భాషకు కూడా సహజమే. ఏ భాషకైనా లిఖిత పూర్వక సాహిత్యం ఉన్నప్పుడే ఆ భాషలోని మార్పుల్ని తెలిపే చరిత్రాత్మక వ్యాకరణం వ్రాయడానికి వీలౌతుంది. కంటికి కనిపించే ఆధారాన్ని బట్టి రచించబడే ఈ వ్యాకరణం శాస్త్రీయమైందని వేరే చెప్పక్కర్లేదు. ప్రపంచంలోని చాలా భాషలు లిఖిత పూర్వక సాహిత్యం లేనివే. ద్రావిడ భాషలు ఇరవై ఒకటి ఉండగా వాటిలో తమిళం, కన్నడం, ఆంధ్రం, మళయాళం మాత్రమే చరిత్ర కలవి. భాషా చరిత్ర, శాసనాల వల్ల గ్రంథాల వల్ల మనకు అవగత మౌతుంది. అదృష్టవశాత్తు తెలుగులో ప్రాచీన శాసనాలు క్రీ॥ శ॥ 575 నుంచి, ఆంధ్ర గ్రంథాలు క్రీ॥ శ॥ 1022 నుంచి ఆవిర్భవించి ఆంధ్రభాషా వికాస విలోకనానికి కరదీపికలైనాయి. పధ్నాలుగు వందల సంవత్సరాల మన భాషా పరిణామాన్ని చారిత్రాత్మక వ్యాకరణ శాస్త్ర పద్ధతుల ద్వారా స్థాలీపులాకంగా పరిశీలిద్దాం. ఈ రకమైన పరిశీలన వల్ల భాషా స్వరూప నిరూపణం జరగటమే కాక భాషా వ్యవహర్తల సంస్కృతి ఆచార వ్యవహారాలు కూడా అవగతమౌతాయి.

మన లాక్షణికులు చరిత్రాత్మక వ్యాకరణాల్ని ప్రత్యేకంగా రచించక పోయినా వారి విధి వ్యాకరణా (Prescriptive Grammers)ల్లో సైతం కొన్నిచోట్ల చారిత్రక వ్యాకరణ లక్షణాలు ఉన్నాయి. 'ఏదంత తాచ నామ్నా మన్యతర స్యామి యాస్తానామ్' అని ఆంధ్ర శబ్ద చింతామణిలోను "ఇయకుమాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగానగు" అని బాల వ్యాకరణం (అచ్చిక. సూ 28) లోనూ పేర్కొనటం ఇట్టిదే. కన్నియ, కన్నె, వన్నియ, వన్నె, చిన్నియ చిన్నె అనే రెండు రూపాల పరిణామాన్ని ఈ వ్యాకరణాలు రెండూ సూచించాయి. నన్నయ భారత భాగంలో ఇయాంత రూపాలే కాని ఎదంత రూపాలు లేవు. ఎదంత రూపాలైన కన్నె, వన్నె, చిన్నె పదాలు అర్వాక్కాలికాలని పరిశోధకుల నిర్ణయం. "సంస్కృతీయంబునకు సంధియగునని యధర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిం బూర్వ కావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు" అని చిన్నయసూరి భావించటానికి వికృత వివేకకారుని "కుత్ర చిత్సంస్కృతీయోఽపి ప్రాణోఽప్యత్ర చ్యుతోభవే! త్తనే వచనమే కారణం. "గంగను కాసె" అనే ఆముక్తమాల్యదాకారుని ప్రయోగాన్ని మనసులో పెట్టుకొని వారు ఆ విధంగా భావించారు. ప్రాచీన కవులు సంస్కృతీ యాదంత శబ్ద రూపాలకు సంధి చేయకపోగా శ్రీకృష్ణదేవరాయలు మొదలైన వారు సంధి చేశారు.

ఈ పరిణామాన్ని గుర్తించటం శాస్త్రపరంగా చారిత్రక సత్యాన్ని సమీక్షించటమే అవుతుంది. ఆధునిక కాలంలో ప్రాఙ్నన్నయ నన్నయయుగభాషలను గురించిఆచార్యకోరాడ మహాదేవశాస్త్రిగారు డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ గారు 12, 13, 14 శతాబ్దాల శాసన భాషకు యం. కందప్ప చెట్టిగారు చారిత్రాత్మక వ్యాకరణాల్ని రచించారు. ఈ కృషి కొనసాగి మొత్తం భాషకు సమగ్ర చారిత్రక వ్యాకరణం అనతికాలంలోనే రాగలదని మనం ఆశించవచ్చు.

ప్రాఙ్నన్నయ యుగంలోని భాషలో ఱకారం వర్ణంగా ప్రచురంగా ప్రయుక్తమైంది. 'శాఱితోంటశాకు, చోఱమహారాజులాకు' వంటివి వెయ్యి సంవత్సరాలకు పూర్వం ప్రయోగించబడ్డాయి. కాలక్రమేణ ఈ 'ఱ' కారం రెండచ్చుల మధ్య డకారం గాను కొన్నిచోట్ల వర్ణవ్యత్యయం చెంది పదాది సంయుక్త రేఫగాను ఆంధ్రంలో మార్పు పొందిన విషయం స్పష్టం. 'శాఱి', 'శాడి' గాను; 'చోఱి', 'చోడ' గాను అనంతర కాలంలో మార్పు పొందాయి. ఱకారం వర్ణవ్యత్యయం కారణంగా పదాదికి సంయుక్త వర్ణంగా వచ్చి రేఫగా మారగా క్రుళ్ళు, క్రొత్త, క్రొవ్వు, ప్రేలు, ప్రోలు వంటి శబ్దరూపాలు ఏర్పడ్డాయి. ఈ పదాది సంయుక్త రేఫకూడా క్రీ. శ. పదో శతాబ్దినుండి లోపించటం మొదలు పెట్టినట్లుగా అయ్యా వోళు, గొచ్చి పప్పు, పోలమ, మాని శబ్దాల పరిశీలనవల్ల తెలుస్తోంది. ఈ పదాది సంయుక్త రేఫలోపం నాడు క్వాచిత్కమైనా నేడు అదినర్వే సర్వత్రా గోచరిస్తుంది. కుళ్ళు, కొత్త, పాత, మాను పదాలు ఇందుకు ఉదాహరణలు. రేఫశకటరేఫ భేదం ప్రాచీనాంధ్ర సాహిత్యంలో ఉన్నా ఆధునిక భాషలో ఆ భేదం అదృశ్యం కావటం అవి సవర్ణాలుగా పరిణమించటం భాషా శాస్త్రవేత్తలకు తెలిసిన విషయమే. పద్నాల్గో శతాబ్దం వరకు నాద వర్ణంగా పద మధ్యంలో ఉన్న 'ద' కారం అనంతర కాలంలో 'త' కారంగా మారింది.

బ్రదుకు > బ్రతుకు; వెదకు > వెతకు;
అదుకు > అతుకు; ఉదుకు > ఉతుకు;
చిదుకు > చితుకు; మెదుకు > మెతుకు;

ఇందుకు ఉదాహరణలు. ఈ పదా లన్నింటిలోనూ చివరికి హల్వర్ణం శ్వాసవత్ వర్ణంగా ఉంది. చిదుము, కదలు, వదలు మొదలైన పదాల్లో ఈ మార్పు రాకపోవటానికి ఆ పదాల చివరి హల్లు నాదవత్ వర్ణంగా ఉండటమే కారణం. నేటి ఉచ్చారణలో వినిపించే ఫ (f) అనే ఉచ్చారణ ప్రాచీనకాలం నుంచి పారసి ప్రభావంవల్ల మన భాషలో ఏర్పడింది. ఫ(f)ను గుర్తించటానికి లిపి సంకేతం లేని కారణంగా మన శాసనాల్లోను, సారస్వత గ్రంథాల్లోను ప కారంగాను, ఫ కారంగాను వ్రాయబడింది. శిష్టులైనవారు ఫ (f) వర్ణాన్ని శిష్టేతరులు పకారాన్ని ఉచ్చరించి ఉండేవారని మనం భావించవచ్చు. ఫర్మానా, ఫసలీ, ఫిర్యాదు, ఫౌజుదారు మొదలైన పదాలు శాసన భాషలో కన్పించటమే కాక కవులచేత కూడా ప్రయోగించబడ్డాయి. ఆంగ్లభాషా ప్రభావంవల్ల నేడు తెలుగులో ప్రవేశించిన కాఫీ, టిఫిను, ఫీజు మొదలైన పదాల్ని గమనిస్తే ఈ ఫకారం ఇంగ్లీషు f ప్రభావం వల్ల మాత్రమే కలిగింది అనే భ్రమ చారిత్రక పరిజ్ఞానం లోపిస్తే తప్పక కలుగుతుంది. పారసి ఆంగ్లభాషల వల్ల తెలుగులోకి వచ్చిన ఫకారాన్ని, శాశ్వేకు, కొశ్టేక మొదలైన పదాల్లోని ఏ అనే అచ్చును తెలుగులో నూతనంగా ఏర్పడ్డ వర్ణాలుగా మనం గ్రహించవచ్చు. కాలవ్యాచ్యులైన ఇ,ఈ,ఎ,లు

పరమైనప్పుడు దంత్యమైన సకారం తాలవ్య శకారంగా శాసనాల్లో కొన్ని చోట్ల మారింది. శాసనస్థాలైన చేశిన (< చేసిన), పడశిన (< పడసిన); పందుమేశి (< పందు మేసి); శీతాదేవి (< సీతాదేవి) పదాలు ఇందుకు ఉదాహరణలు.

రెండు పదాల కలయిక ఏర్పడినప్పుడు శాసనాలలో సంధి కలిగి అచ్చు లోపించవచ్చు, లోపించకపోవచ్చు. మధ్యలో యడాగమం రావచ్చు. సంస్కృత శబ్దాల సంధి సందర్భంగా గుణాది సంధులు జరగకుండా పరరూపసంధులు వైకల్పికంగా జరగటం కొన్ని శాసనాలలోని విశేషం. భీమీశ్వర, భీమేశ్వర, నీలీశ్వర, నీలేశ్వర, మల్లీశ్వర, మల్లేశ్వర శబ్దాలు ఇందుకు ఉదాహరణలు. ప్రాచీనాంధ్ర సారస్వతంలో క్త్వార్థేత్తుకు సంధి లేకపోగా అర్వాచీనకాలంలో క్త్వార్థమైన ఇత్తుకు సంధి జరగడం అందరికీ తెలిసిన చారిత్రక సత్యం.

మహదేక వచన ప్రత్యయంగా ప్రాచీన శాసనాల్లో న్రు, ణ్రు, ండుఁడులు ప్రసిద్ధంకాగా అర్వాచీన కాలంలో డు వ్యాప్తిలోకి వచ్చింది. అమహదేకవచన ప్రత్యయంగా ప్రాచీన వాఙ్మయంలో బు, మ్బు, ంబు, మ్ము, ములు వ్యాప్తిలో ఉండగా నేడు అనుస్వార ప్రయోగం ప్రాచుర్యాన్ని పొందింది. ఏ ప్రత్యయాలు చేరకుండా అన్న, గోడ, మేడ వంటి రూపాలు నాటికీ, నేటికీ ఒకే రకంగా ఉన్నాయి.

మన భాషలోని పదజాలాన్ని పరిశీలించి నట్లయితే పదాల చరిత్రతో పాటు మన సాంఘిక సాంస్కృతిక జీవన పద్ధతులు కూడా తెలుస్తాయి. సంస్కృత పదాలు ప్రాకృత పదాలూ ఒకప్పుడు మార్పును పొంది, ఇంకొకప్పుడు మార్పును పొందకా తెలుగులో ప్రవేశించిన విషయం మనకు తెలిసినవిషయమే. క్రీస్తు పూర్వం నుంచీ సంస్కృత ప్రాకృతాల ప్రభావం ఆంధ్ర భాషపై తగినంతగా ఉంది అనేది నిర్వివాదాంశం. సంస్కృతం నుంచి తెలుగు పుట్టిందేమో అనే భ్రమ, ఈ కారణం గానే పండితులకు కలిగింది. కాని శాసన పరిశోధన వల్ల ఆనాటి భాషలో దేశి పదాల వ్యాప్తి అధికంగాను తత్సమ తద్భవాల ప్రయోగం విరళంగానూ ఉన్నట్లు విదితమౌతుంది. వ్యావహారిక భాషా స్వరూప నిరూపణకు శాసనాలు ముఖ్యాధారాలు అని అందరూ అంగీకరించిన విషయమే.

మహమ్మదీయులు మన ఆంధ్ర దేశానికి క్రీ॥శ॥ 1304 సంవత్సర ప్రాంతాన వచ్చినట్లు చరిత్రకారులు వ్రాసి, పదమూడో శతాబ్దంలో వీరి రాక అస్తినాస్తి విచికిత్సా హేతుభూత మని పేర్కొన్నారు. కాని తిక్కన సోమయాజి భారతంలో "త్రాసు" పదాన్ని రెండు సార్లు ఈ విధంగా ప్రయోగించారు.

"త్రాసులం బోని చిత్తంబుల తోడుతఁ
బ్రజ వివాదము లెడఁ బతముడిగి"
(శాంతి.2 375)

"ధనము కలిమియు లేమియుఁ
ద్రాసునందు" (శాంతి 4-33)

ఇంతేకాక క్రీ. శ. 1278వ సంవత్సరానికి చెందినఈపూరుశిలాశాసనంలో "త్రాసునాయము వల్ల" అని ప్రయోగించబడింది. పారసి భాషా పదమైన "తరాజూ" శబ్దంనుంచి వర్ణవ్యత్యయం వల్ల తెలుగులో ఈ "త్రాసు పదం ఏర్పడింది.

ఈ పదం జనంలో విపుల ప్రచారం పొందిన కారణంగానే "కవిబ్రహ్మ" ప్రయోగించటం శాసనంలో చెక్కబడటం జరిగింది. తెలుగువారికి మహమ్మదీయులతోడి సంబంధం మొదట వాణిజ్య సంబంధియై ఉండి వుంటుంది. అపరంజి, కాగితము, గసగసాలు, జంబుకానాలు, మొకమల్లులు, సామ్రాణి, సాలువాలు మొదలైన వాణిజ్య సంబంధమైన పదాలు; అరబ్బీ, కత్తలాని, తరకసము, తురికీ, ఫౌజు మొదలైన యుద్ధ సంబంధి పదాలు; అల్లా, ఈదు, ఖురాను, జబా, నమాజు, పీరు, మసీదు, మొల్లా మొదలైన మత సంబంధి శబ్దాలు; ఇజారు, కుల్లా, కోహాళి, జనపాలు, తాయెతు మొదలైన వస్త్ర సంబంధి శబ్దాలు; ఆసామీ, ఇలాకా, కమ్చీ, కార్బారు, కితాబు, ఖుసి, తమాషా, తైనాతి, దగా, రోజు వగైరా సాధారణ పదాలు మహమ్మదీయుల తోడి సంబంధంవల్ల ఉర్దూ భాషద్వారా తెలుగు భాషలోకి ప్రవేశించాయి. పదహారో శతాబ్దిలో పోర్చుగీసు భాషా ప్రభావం విశేషంగా మనదేశ వాసులపై వుండేది. పోర్చుగీసువారు వివిధ దేశాల్లోని అనాస, గొయ్యా (జామి), గోబి (కాబేజి), పొగాకు వృక్ష సంతతిని మన దేశానికి తీసుకొనివచ్చి ప్రవేశపెట్టారు. అనాస, గొయ్యా, గోబీ, బొప్పాసపదాలు పోర్చుగీసు మాటలే. అల్పి, అల్మారా, కలాయి, కమీజు, కాజా, గమేళా, తాళంచెవి శబ్దంలోని చెవి (పోర్చు షావి) పీపా, బాల్చి, బొత్తాము మొదలైన పదాలు పోర్చుగీసు భాషనుంచి తెలుగులో ప్రవేశించాయి. వంపర పనాస, బత్తాయి పదాలు డచ్చినుంచి వచ్చిన పదాలు కాగా; కుసిని, మధాము పదాలు ఫ్రెంచి భాషనుంచి మనకు సంక్రమించాయి. మూడు వందల సంవత్సరాల ఆంగ్లేయులతోడి సంబంధం వల్ల ఆసుపత్రి (Hospital), బొన్సు, కారు, కాలేజీ, టికెట్టు, పెన్సిల్, బస్, బిస్కట్, రేడియో, రైలు, సిగరెట్టు, సినిమా, సైకిల్, స్కూటర్, స్కూల్ మొదలైన పదాలు మన భాషలో వ్యవహరించబడుతున్నాయి. మరాఠీ భాషనుంచి 'కులకరణి, గంగాళము, గాగరా, చూడే, తపేల, దణి, దేశాయీ, పశేలు, బిడారు పదాలు ప్రాచీనాంధ్ర సారస్వతంలో ప్రవేశించాయి. ఆంధ్రభాష అజగరం వలె ఏ భాషలోని పదాలనైనా గ్రహించి జీర్ణం చేసుకొని సుసంపన్నం కాగలదు.

ఆంధ్రభాషా పదజాలాన్ని చారిత్రక దృష్టితో పరిశీలించి చూస్తే వివిధ పదాలు ఏఏ కాలాల్లో ఏ విధంగా అర్థ విపరిణామాన్ని పొందాయో తెలుస్తుంది. ప్రత్యక్షాది ప్రమాణాల్లో ఒకటిగా అనుమితికి సాధనంగా ఉన్న సంస్కృత అనుమానశబ్దం తెలుగులో సందేహం అనే అర్థంలో తిక్కనగారు 'జననీ వధంబు చేసిన, ననుమానమె నరక మగుట...' (భారతము శాంతి 5-267) అని భారతంలో ప్రయోగించారు.

'ఆ ఋషిపుత్త్రుండు కట్టిన
చీరలు మృదులములు నవ్యశిష్టములు మనో
హరులు నాతని పృథు కటి
భారంబున నొక్క కనక పట్టము వ్రేలున్.'
(భారతము ఆరణ్య. 3-140)

అనే నన్నయ భట్టారకుని పద్యంవల్ల చీర, వస్త్ర సామాన్యంగా నాడు వ్యవహరించబడేదనీ, కేవలం స్త్రీ వస్త్ర పర్యాయంగా తర్వాతి కాలంలో అర్థ సంకోచాన్ని పొందిందనీ స్పష్టమౌతోంది.

'కుల్లా యుంచితిఁ గోకఁ జుట్టితి...'
అన్న శ్రీనాథుని చాటువులోని కోక శబ్దంకూడా ఈ చీర శబ్దం వంటిదే. కంపు పదాన్ని నన్నయ గారు సువాసన అనే అర్థంలో ప్రయోగించారు.
'...కందియును మహాసుగంధ కుసుమ తతులు దొంటి యట్ల తమ కంపు విడువక యుండు...'
(భారతము ఆరణ్య. 2.197) అనే నన్నయ ప్రయోగాన్ని బట్టి నాటి వ్యవహారం తెలుస్తోంది. నేటి అర్థం అందరికీ అవగతమే సంస్కృతంలో ముష్టి పదానికి పిడికిలి అని మాత్రమే అర్థం. తెలుగులో బిచ్చం అనే అర్థం కలిగింది. పైడిమఱ్ఱి వేంకటపతిగారు తమ చంద్రాంగద చరిత్రలో

'మిన్నంత సంపద చెన్నారి యుండియు,
ముష్టికి లోనయ్యె ముదిత నడుము'
(2-42)

అని సొగసుగా ఈ పదాన్ని ప్రయోగించారు.

భాషలో ఉండే పదాలన్నింటికి సమగ్ర చరిత్ర ఉండటం అవసరం. Oxford English Dictionary ఆంగ్ల పదాల చరిత్రను సమగ్రంగా నిరూపించింది. ప్రపంచంలో మరే ఇతర భాషకు ఇంతటి సమగ్రమైన చారిత్రక నిఘంటువు లేదు. "Dictionary of Sanskrit on Historical Principles" అనే పూనే వారి చారిత్రక సంస్కృత నిఘంటువు సంపూర్ణమైన నాడు అది గొప్ప చారిత్రక కోశంగా వెలుగొందుతుంది. ఆంధ్రా యూనివర్సిటీ వారిచే ప్రకటించబడుతున్న "తెలుగు వ్యుత్పత్తికోశం"లో కూడా పదాల అర్థాల్ని కాలానుగుణంగా ఇవ్వడం ద్వారా ఈ వ్యుత్పత్తి నిఘంటువుకుచారిత్రక లక్షణాల్ని కూడా పట్టించడం జరిగింది. ఇటువంటి ప్రయత్నానికి ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన నన్నయ నన్నచోడ తిక్కన శ్రీనాథుల పదప్రయోగ పట్టికలు వివిధ సిద్ధాంత వ్యాసాలు కుందూరి ఈశ్వర దత్తు గారి శాసన శబ్ద కోశంసహాయ పడుతున్నాయి. తెలుగులోని అన్ని గ్రంథాలకు పదప్రయోగ కోశాలు వచ్చినప్పుడు ఈ కృషి పరిపూర్ణంగా సఫలమౌతుంది.

ఇంగ్లీషు, తమిళం, హిందీ మొదలైనభాషల లోని పూర్వ కవులచే రచించబడ్డ గ్రంథాలు నేటి వారికి అర్థం కావు కాని తెలుగులో పూర్వ కవి కృత గ్రంథాలు అర్థమౌతాయి. అర్థం కానంతగా ఆంధ్రభాష తన స్వరూపాల్ని మార్చుకోలేదు. లాక్షణికులు భాషలోని మార్పును నిరోధించారు. అప్పకవి నన్నయ నుడిని దాటి నడవకూడదని కట్టడి చేశాడు.

'ఆదిని శబ్ద శాసన మహాకవి చెప్పిన
భారతంబులో
నేది వచింపఁగాఁ బడియె నెందును
దానినె కాని సూత్ర సం
పాదన లేమిచేఁ దెనుఁగు పల్కు
మఱొక్కటిఁ గూర్చి చెప్పఁగా
రాదని దత్పూర్వాటి కవి రాజుసుఁ
డీనియమంబుఁ జేసినన్.
ఆ మూడు పర్వములలో
నా మాన్యుఁడు నుడువు తెలుఁగు
అరసికొని కృతుల్
తాము రచించిన తిక్కను
భీమని మొదలైన తొంటి తెనుఁగు
కవీంద్రుల్"
(అప్ప కవీయ పీఠిక 46, 47)

దీనిలోని మంచి చెడ్డల్ని చర్చించటం నా ఉద్దేశం కాదు. వాస్తవాన్ని గమనిస్తే నన్నయాదుల మహాభారతం కూడా నేటి వారికి వాక్యంలో క్లిష్టత లేకుండా అర్థమౌతుంది. ఈ నియమం కొంతవరకు పని చేసినా శాసనాల కవుల ప్రయోగాల చారిత్రక పరిశోధన వల్ల కొన్ని ధ్వనులలోను సంధులలోను, పదాల్లోను కలిగిన మార్పుల్ని మనం గమనించవచ్చు.



# నాలోని నీవు

నీటిలో నీవే
నింగిలో నీవే
పూవులో నీవే
తావిలో నీవే
గుడిలో నీవే
అమ్మ ఒడిలో నీవే
వేదాలలో నీవే
యోగుల పాదాలలో నీవే
పండితుల పలుకులో నీవే
పామరుల గృహాలలో నీవే
ధర్మంలో నీవే
దానంలో నీవే
రాశిలో నీవే
రమ్యమైన ప్రకృతిలో నీవే
కరుణలో నీవే
అరుణ భానునిలో నీవే
కలువలో నీవే
కలువ ఱేడులో నీవే
లేమిలో నీవే
లేమల శీలములో నీవే
అనలమందు నీవే
అనిలమందు నీవే
అన్నిటా నీవే

కాని

నీ రూపం కోసం
వెదికానెంతో దూరం
వేచానెంతో కాలం

తుదకు

ప్రేమాంజనాన్ని
కళ్ళకు పెట్టుకొని
కనగలిగాను నిన్ను
విన్నాను నీ అమృతవాక్కు
పొందాను నీ మధుర స్పర్శ.

"పూర్ణ"

# నన్నయ భారతము రాజరాజ నరేంద్రాంకితము కాదా?

## డాక్టర్ కొర్లపాటి శ్రీ రామమూర్తి

నన్నయ భారతము రాజరాజనరేంద్రునికి అంకిత మని ఒక అభిప్రాయము కలదు అంకితము కాదని మఱొక అభిప్రాయము కలదు ఇదొక ఉత్థాపిత సమస్య. అసలు నన్నయ భారతము రాజరాజనరేంద్రునికి అంకితమనెడి అభిప్రాయము పరంపరాగత మైన సంప్రదాయము. అంకితము కాదనెడి అభిప్రాయము ఆధునిక మైన సమన్వయము. అది ప్రథమతః అక్షరబద్ధము చేసినవారు శిష్టా రామకృష్ణశాస్త్రిగారు. తదుపరి అక్షయసిద్ధము చేసినవారు వేదము వేంకట రాయశాస్త్రిగారు. సంప్రదాయములెల్ల సత్యదూర ములు కావు. సమన్వయములెల్ల సమర్థములుకావు. కనుక పరిశీలనావశ్యకత కలదు.

శిష్టా రామకృష్ణశాస్త్రిగారి అభిప్రాయ మిది:

"సంస్కృత కావ్యములను కవి తన రాజునకో గురువునకో యంకితమిచ్చు నాచారము సంస్కృత కవులలో లేదు. ఇది కన్నడ కవులతోఁ బ్రారంభ మైనది. నన్నయగూడ తన భారతమును రాజరాజ నరేంద్రున కంకిత మీయలేదు. భారతశ్రవణ కుతూహలుఁడైన రాజునకు నన్నయ తెలుఁగున వ్రాసి వినిపించెను."

ఇందు సంస్కృత కావ్యములను అంకితమిచ్చు సంప్రదాయము ప్రాచీనకాలమున సంస్కృతకవులలో లేదనుట నిజము. అది కన్నడ కవులతో ఆరంభ మైనదనుట మాత్రము నిర్ధారకముకాదు. కన్నడ కవులకంటె ప్రాచీనకాలమున ప్రాకృతకవులుకలరు. ప్రాకృతకవులలో ప్రథమగణ్యుడు ప్రతిష్ఠానపుర నివాసి గుణాఢ్యుడు. గుణాఢ్యుని పైశాచీప్రాకృత కావ్యము బృహత్కథ శాతవాహనరాజునకు అంకిత మని తదనుసరణమైన కథాసరిత్సాగరకథా పీఠమున కలదు. ఆ విషయమిది :

"తత్కావ్యస్యార్పణస్థానమేకః శ్రీసాతవాహనః
రసికోహి వహేత్కావ్యం పుష్పామోదమివానిలః." 10 శ్లో. 8 త. 1లం.

ఇది గుణాఢ్యుడు రచించిన బృహత్కథను అర్పించుటకు శాతవాహనరాజు ఒక్కడే అర్హుడని గుణాఢ్యుని శిష్యులు గుణదేవనందిదేవులు సూచించిన విషయము. ఇందు కావ్యసమర్పణ విషయము ఇద మిత్థముగ కలదు అర్పణమన్నను, సమర్పణ మన్నను, అంకితమన్నను అర్థమొకటే అంతేకాదు. దగ్ధశేషమైన బృహత్కథను గ్రహింపుడని శాతవాహనరాజును గుణాఢ్యుడు కోరినట్లు, శాతవాహనరాజు గ్రహించునట్లును కథాసరిత్సాగర కథాపీఠమునందు కలదు. ఆ విషయమిది :

"అథోవాచ స తం భూపం గుణాఢ్యః
శాతవాహనమ్
రాజన్ షడ్గ్రన్థ లక్షాణి మయా దగ్ధాని షట్కథాః
లక్షమేక మిదం త్వస్తి కథైకా సైవ గృహ్యతామ్
మచ్ఛిష్యౌ తవ చాత్రైతౌవ్యాఖ్యాతారౌ భవిష్యతః

ఇత్యుక్త్వా స్వపమాయ స్త్రీ ర్దగ్ధ్వా యోగేన తాం తనుమ్
గుణాఢ్యః శాపనిర్ముక్తః ప్రాప దివ్యం నిజం పదమ్
అథ తాం గుణాఢ్యదత్తామాదాయ కథాం బృహత్కథాం నామ్నా
నృపతి ర్గగాన్నిజనగరం నరవాహన దత్తచరిత మయీమ్."
32-35 శ్లో, 8 త, 1 లం.

ఇది గుణదేవనందిదేవులు తెలిపిన విషయము. ఇందు గుణాఢ్యుడు బృహత్కథను శాతవాహనరాజునకు ఇచ్చినట్లును, శాతవాహనరాజు పుచ్చుకొన్నట్లును కలదు. ఇదియెల్ల అంకిత విషయము. కనుక ప్రాకృతకవులు అంకితమిచ్చు సంప్రదాయము ప్రాచీనకాలమున కలదని అవగాహకము. అయినను. సంస్కృత కావ్యములందు అంకితవిషయము లేక పోవుటనుబట్టి, కర్ణాటాంధ్ర కావ్యములందు ఉండుటనుబట్టి అంకితమిచ్చు సంప్రదాయము అర్వాచీన కాలికమనితోచుట సహజము అందువలన సోమదేవ భట్టు కథాసరిత్సాగరమున అంకితవిషయము అర్వాచీన కల్పమని తోచుటకూడ సహజము. కాని, సంస్కృతకావ్యమైనసోమదేవభట్టుకథాసరిత్సాగరము కూడ అంకితముకాదు. కనుక సంస్కృతకావ్యసంప్రదాయము కాని బృహత్కథా కావ్య సమర్పణ విశేషమును కథాసరిత్సాగరమున తన్మూలమైన ప్రాకృత కావ్యమునకు అర్వాచీనకాలమున కల్పించవలసిన ఆవశ్యకములేదు. కాబట్టి బృహత్కథ అంకిత విషయము కథాసరిత్సాగరమున యథామూలకమగుట సహజము. అనగా గుణాఢ్యుని బృహత్కథ శాతవాహనరాజునకు అంకితమని బృహత్కథా పీఠికను కలదని అనుమేయము.

సోమదేవభట్టు కథాసరిత్సాగరమునందుమాత్రమే కాక క్షేమేంద్రుని బృహత్కథామంజరి యందును గుణాఢ్యుని బృహత్కథను గుణాఢ్యుని శిష్యులు శాతవాహనరాజునకు సమర్పించినట్లు కలదు. ఆ శ్లోకమిది :

"రాజాపి తచ్ఛిష్య సమర్పిత శ్రీ రవాప్య పూర్వాభ్యధిక ప్రభావః
కథాం త్రినేత్రానన పద్మసూతిం సౌభాగ్యపూతాం కథయఙ్జహర్ష." 97 శ్లో. 2 లం.

ఇందు గుణాఢ్యుని శిష్యులు సమర్పించిన, శాతవాహనరాజు స్వీకరించిన సంపద బృహత్కథయే. ఇది గుణాఢ్యుని బృహత్కథ శాతవాహనరాజునకు అంకితమనుటకు స్థితి స్థాపకము.

గుణాఢ్యుని బృహత్కథ ప్రాకృతకావ్యము. అది సంస్కృత కావ్యముగ సంతరించుట అయిదారు శతాబ్దులందే అరంభమయినది.[2] బృహత్కథాకావ్య సమర్పణ విషయముప్రాకృతమూలముద్వారా ప్రత్యక్షముగను, సంస్కృతాను వాదములద్వారా పరోక్షముగను పదవశతాబ్దిని కన్నడ కవులమీద, పదకొండవ శతాబ్దిని ఆంధ్రకవులమీద ప్రభావము నెఱపుట అత్యంత సంభవము. కనుక అంకిత విషయము కన్నడ కవులతోగాక, ప్రాకృతకవులతోనే ప్రారంభమైనదని గ్రాహ్యము. అంతేకాదు. అంకిత విషయము ఔత్తరాహ సంప్రదాయముగాక దక్షిణాత్య సంప్రదాయమనికూడ గమనార్హము.

ఇక "నన్నయ తన భారతమును రాజరాజనరేంద్రునికి అంకిత మీయలేదు; భారతశ్రవణకుతూహలుడైన రాజునకు నన్నయ తెలుగున వ్రాసి వినిపించెను" అనుటకూడ అవిచారిత రమణీయము.

వేదము వేంకటరాయశాస్త్రిగారి వివరణమిది:

"నన్నయభట్టు మహాభారతమున అంకితమను మాటను వాడలేదు. సరిగదా తన గ్రంథమును ఆ మహారాజునకు, రాజరాజ నరేంద్రునకు అంకితము

కూడ నీయలేదని పండితులు గ్రహించియేయున్నారు. రాజరాజ నరేంద్రుడు తన పూర్వుల చరిత్రను, భారత కథను, వినిపింపుమని కోరెనేగాని అంకిత మిమ్మని కోరలేదు. అట్లే కవియు వ్రాపి వినిపించి నాడు. 'తనకుల బ్రాహ్మణుడును అనురక్తుడును' నైనవాడు రాజు కోర్కె 'తు' 'చ'లు తప్పక చేయును. అంకితమిచ్చు నాచారము, షష్ఠ్యంతాది రచనయు, ప్రభువంశ వర్ణన చేయు సంప్రదాయము నుండి యుండిన ఇంతటి 'అనురక్తుడు' వదలి యుండునా? కావున నాటి సంప్రదాయమునే యనుసరించి నన్నయ తన ప్రభువంశాదికములఁ గూర్చి వ్రాయక, ప్రభువును శ్రోతగా, ప్రధాన శ్రోతగా, గ్రహించి అట్లే సంబోధించి 'మహాభారత సంహితా రచన బంధురుఁడయ్యే జగద్ధితంబుగాన్.'

నన్నయ భారతమున అంకిత శబ్దము లేని మాట నిజము అంత మాత్రమున అంకితము కాదనుట అతిసాహసము. నన్నయ భారతము నందే కాదు: తిక్కన భారతము నందును అంకితశబ్దములేదు. ఎఱ్ఱన హరివంశమున కూడ అంకిత శబ్దము లేదు. కనుక తిక్కన భారతము హరిహరనాథునికి, ఎఱ్ఱన హరివంశము ప్రోలయవేమారెడ్డికి అంకితము కాదనుట అసంగతము. అంకిత శబ్దేతర విషయములను బట్టి అవి వారికి అంకితములగుట నిర్ధారకము. అట్లు నన్నయ భారతమును రాజరాజ నరేంద్రునికి అంకితమగుట నిర్బాధకము.

నన్నయ భారతమును రాజరాజ నరేంద్రునికి అంకిత మీయలేదని అందఱు పండితులు గ్రహింపలేదు. నన్నయ భారతము రాజరాజ నరేంద్రాంకితమనియే పెక్కుమంది పండితుల సిద్ధాంతము. కాదని కొద్దిమంది పండితుల రాద్ధాంతము.

రాజరాజనరేంద్రుడు అంకితమిమ్మని కోరలేదు. నిజమే. మఱి, "వినిపింపుమని"యును కోరలేదు. నన్నయ భట్టునకు రాజరాజనరేంద్రుడు అనతిచ్చినది "తెనుఁగున రచియింపు" మనియే (17 ప 1 ఆ. ఆ ప) నన్నయ చేసిన పని "మహాభారత సంహితా రచన బంధురుఁ" డగుటయే ([illegible] ప 1ఆ ఆ ప.) రాజరాజనరేంద్రుడు "రచియింపు"మని అనతిచ్చుటకు అతని భారతాభిప్రాయ శ్రవణగాఢాభిలాష, పరమహిత భారత శ్రవణాసక్తి, పాండవోత్తమ చరిత్రాకర్ణన ధీష్టత, భారత కథాశ్రవణ ప్రవణ మనస్వీత, భారత బద్ధస్పృహ (11, 12, 14-17 వచ. ప. 1 ఆ. ఆ. ప) హేతువులే. అందుకు నన్నయ రచించిన భారతమును రాజరాజనరేంద్రునికి మఱెవరైన వినిపించవచ్చును. నన్నయ వినిపించినట్లు నన్నయ భారతమున లేదు. అంతేకాదు. "రాజు కోర్కె 'తు' 'చ'లు తప్పక చేయుతనకుల బ్రాహ్మణుడు అనురక్తుఁడు నైనవాఁడు" మఱి "రచియింపు" మన్న "వినిపించు"ట మాత్రము రాజాజ్ఞోల్లంఘనము కదా! రాజరాజనరేంద్రుడు అంకితమిమ్మని అడుగనంత మాత్రమున నన్నయ భారతము రాజరాజనరేంద్రునికి అంకితము కాదన్న, "వినిపింపు"మని కూడ అడుగనందున, నన్నయ భారతమును రాజరాజనరేంద్రునికి వినిపించలేదని కూడ అనవలయును. అదియు నిదియు విపరీత ధీ విలాసము.

రాజరాజనరేంద్రునివలె ప్రోలయవేమారెడ్డి కూడ అంకిత మిమ్మని అడుగలేదు. అఘట్టమిది:

"సకల భాషా కవిత్వ విశారదుఁడవు<br>
సాధుసమ్మతుఁడవు నిత్యసౌమ్య మతివి<br>
భవ్యుఁడవుగాన నీమీఁదఁ బరగఁబక్ష<br>
మేను గలిగి యుండుదు నెప్పుడెఱ్ఱనార్య. 38.<br>
నా తమ్ముండు ఘనుండు మల్లరథి వీనాథుండు<br>
నిన్నాతత<br>
శ్రీ తోడున్ సముపేతుఁజేసి యెలమింజే పట్టి<br>
మాకిచ్చుటం

చేతోమోదమెలర్ప రామకథ మున్ జెప్పించి
యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింక నేను దనియన్ గావ్యా
మృతాస్వాదనన్. 39

భారతపరాంశమని యిం
పారంగం జెప్పుదురు బుధులు హరివంశము నీ
వారిమ్యుకృతిం దెనుంగుగ
ధీరోత్తమ నిర్వహించి తెలుపుము
మాకున్. 40

అనినం బ్రహర్షిత పులకిత దేహుండనై
యమ్మహాభాగుని
సమగ్ర సంప్రార్థనంబుం గృతార్థితా కవిత
వృత్తంబగు
చిత్తంబునం గైకొని యిట్లంటి. 41
నన్నయభట్ట తిక్కకవినాథులు చూపిన త్రోవ
పావనం
బెన్నం బరాశరాత్మజ మునీంద్రుని వాఙ్మయ
మాది దేవుండౌ
పెన్నుని వృత్తమీవు కడువేడుకతో విను
నాయకుండ వి
ల్లెన్నియొ సంఘటించె మదభీప్సిత సిద్ధికి
రాజపుంగవా. 42

కావునం జెప్పెదం గల్యా
ణావహమహనీయ రచన హరివంశము స
ద్భావమున నవధరింపుము
భూవినుత గుణాభిరామ ప్రోలయవేమా. 43.
అని యమ్మహా నాయకుం గృతినాయకత్వంబున
కభిముఖుంగా
నౌత్సుక్య జనకస్తుతంబుగు ప్రబంధరత్న నిర్మింప
నుపక్రమించితిని. 44-I ఆ.

ఇందు ప్రోలయ వేమారెడ్డి హరివంశమును
"తెనుంగుగ నిర్వహించి తెలుపుము" అని మాత్రమే
అడిగినట్లు కలదు. అంకితమిమ్మని అడిగినట్లు లేదు.
అయినను ప్రోలయ వేమారెడ్డి "సమగ్రసంప్రార్థ
నము"ను గ్రహించిన ఎఱ్ఱన అంకిత మిచ్చెను.
అనగా "తెనుంగున నిర్వహించి తెలుపుము" అనుట
లోని ఆంతర్యము "చదువుము" అని మాత్రమేగాక,
"అంకితమిమ్ము" అని కూడ అవగాహకము.
ప్రోలయ వేమారెడ్డి "తెనుంగున నిర్వహించి తెలు
పుము" అనుట ఎట్టిదో, రాజరాజ నరేంద్రుడు
"తెనుంగున రచియింపు మధికధీయుక్తి మెయిన్"
అనుట కూడ అట్టిదే. అనగా రాజరాజ నరేంద్రుడు
"తెనుంగున రచియింపుము" అనుటలోని ఆంతర్య
మును "వినిపింపుము" అని మాత్రమేకాక "అంకిత
మిమ్ము" అని కూడ అవగాహకము. కనుక ప్రోలయ
వేమారెడ్డి అంకితమిమ్మని వాచ్యముగ అడుగక
పోయినను ఎఱ్ఱన హరివంశమును ప్రోలయ వేమా
రెడ్డికి అంకితమిచ్చినట్లు, రాజరాజ నరేంద్రుడు
అంకితమిమ్మని వాచ్యముగ అడుగకపోయినను
నన్నయ భారతమును రాజరాజనరేంద్రునికి అంకిత
మిచ్చినట్లు ఆంతర్యమును బట్టి అర్థము.

అంకితమిచ్చు ఆచారము ప్రాకృత కర్ణాట
కావ్యములందు నన్నయకు పూర్వమే కలదని
పూర్వోక్తము. అది నన్నయ్యకు అచుంబిత విష
యము. అశ్రుత పూర్వవిశేషము కాదు. కనుక
నన్నయ భారతమును రాజరాజనరేంద్రునికి అంకిత
మిచ్చు ఆచారమును వదలియుండని మాట వాస్త
వము.

షష్ఠ్యంత పద్యములు నన్నయ భారతమున లేవి
మాట నిజము. ఒక్క నన్నయ భారతమునందు
మాత్రమే కాదు; గోదగి త్రిపురారికి అంకితమైన
పాలకుజికి సోమనాథుని అనుభవసారమునందు,
మనుమసిద్ధికి అంకితమైన తిక్కన ఉత్తర రామా
యణమునందు, ప్రోలయ వేమారెడ్డికి అంకితమైన

ఎఱ్ఱన హరివంశమునందు, (సాహిణి మారనకు అంకితమైన భాస్కరుని రామాయణమునందు) హరి హరులకు అంకితమైన కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికయందును షష్ఠ్యంత పద్యములు లేవు. అనగా షష్ఠ్యంత పద్యములు అపరిహార్యములైన అంకిత లాంఛనములు కావని అవగాహకము. అంతే కాదు నన్నయ భారతము తెలుగు ఆది కావ్యము. అంకిత లాంఛనములెల్ల ఆదికావ్యమునందు అన పేక్ష్యము.

నన్నయ భారతమున ప్రభువంశ వర్ణనము అసలు లేకపోలేదు విస్తృతముగ లేదుగాని పరిమితముగ కలదు (3-8 వ పద. 1 ఆ ఆ. వ) అది కాలక్రమమున అభివృద్ధి చెందుట అత్యంత సహజము. ప్రభువంశ వర్ణనము విస్తృతముగ లేదని నన్నయ భారతము రాజరాజనరేంద్రాంకితము కాదనుట, ఫలపుష్ప భరితము కాదని వృక్షమునకు మూలము లేదనుట వంటిదగును.

నన్నయ "ప్రభువును శ్రోతగా, ప్రధానశ్రోతగా, గ్రహించి అట్లే సంబోధించి 'మహాభారత సంహితా రచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్" అనుట కూడ "నాటి సంప్రదాయమునకు అనుగుణము" కాదు. నన్నయభట్టు "నాటి సంప్రదాయము"ను గ్రహించుటకు నన్నయ భారతము వినా మఱొక సమకాలిక సమాచారము లేదు. నన్నయ భారతమునకు రాజరాజనరేంద్రుడు ప్రధాన శ్రోత అయిన మాట యథార్థము. ప్రధానశ్రోత అనగా కృతి భర్తయే. పూర్వోదాహృతమైన ఎఱ్ఱన పద్యమునందు (42) ప్రోలయ "వేమారెడ్డి" వినునాయకుండు" అని కలదు. వినునాయకుడు అనగా ప్రధాన శ్రోత అగు కృతిభర్త అనియే అర్థము. కనుకనే ఎఱ్ఱన హరివంశమున ప్రోలయ వేమారెడ్డి పరముగ సంబోధనాంతములైన ఆశ్వాసాద్యంత పద్యములు పందొమ్మిది ఆశ్వాసములందును కలవు. తిక్కన భారతమున కూడ హరిహరనాథుని పరముగ సంబోధనాంతములైన ఆశ్వాసాద్యంత పద్యములు పదునెనిమిది ఆశ్వాసములందును కలవు. నన్నయ భారతమునందును రాజరాజనరేంద్రుని పరముగ సంబోధనాంతములైన ఆశ్వాసాద్యంత పద్యములు పదునాలుగు ఆశ్వాసములందును కలవు. కనుక హరివంశమునకు ప్రోలయ వేమారెడ్డివలె, తిక్కన భారతమునకు హరిహరనాథుడువలె, నన్నయ భారతమునకు రాజరాజనరేంద్రుడు ప్రధానశ్రోత అగు కృతిభర్త అనగా నన్నయ భారతము రాజరాజనరేంద్రాంకితమని అర్థము.

అయినను, నన్నయ కాలమున "అంకిత మిచ్చు ఆచారము" లేదనుటకు వేంకటరాయశాస్త్రిగారు అందఁజేసిన హేతువు లివి :

1 "మల్లికార్జున పండితుడు ప్రాచీనుడు. క్రీ. శ. 1150-80ల నడిమికి, బసవేశ్వరునికి సమకాలికుఁడు గాన, ఈతని కాలము కుదురుచున్నది. ఇతనిది శివతత్త్వసారము మతగ్రంథము. ఎవరికిని అంకితము గాదు.

మల్లికార్జున పండితుడు బసవేశ్వరుని సమకాలికుడే. ఉభయుల కాలము పంద్రెండవ శతాబ్దియే. మల్లికార్జున పండితుని శివతత్త్వసారము మతగ్రంథమే అది ఎవరికిని అంకితము కానిదే అనిపించును. అందుకు హేతువు "అంకితమిచ్చు ఆచారము" అప్పటికి లేకపోవుటయే కావలసిన ఆవశ్యకము లేదు. అది మతగ్రంథ మగుటయును కావచ్చును. అంతే కాదు. ఉపలబ్ధమైన శివతత్త్వ సారమున ఇష్టదేవతాస్తుతి లేదు. అందుకు హేతువు "ఇష్టదేవతాస్తుతి చేయు ఆచారము" అప్పటికి లేకపోవుట కాదు కదా! నన్నయ భారతమున కలదు. (1. 21. శ్లో. వ. 1 ఆ. ఆ. వ.) ఇంతకు శివతత్త్వ

సారమునకు సమగ్రప్రతి లభింపలేదు గ్రంథాంతము ఉత్పన్నమయినది. అది కూడ అట్లు కావచ్చును. కనుక అసమగ్రమైన, మతగ్రంథమైన శివతత్త్వసారమును బట్టి నన్నయ కాలమున "అంకితమిచ్చు ఆచారము లే"దనుట ప్రామాణికము కాదు ప్రామాదికము.

2. "పాల్కురికి సోమన్న చాల తర్వాతివాఁడు. ప్రతాపరుద్ర చక్రవర్తికి సమకాలికుడు. క్రీ. శ. 1323–48 కి ఇతని కాలము కుదురుచున్నది ఇతని యందొక విశేషము. అంకితమున్నది గాని అంకిత మొకరికి శ్రోతృత్వ మొకరికి. కారణము భక్తియే. బసవపురాణమందు అంకితమే లేదు పండితారాధ్య చరిత్ర బసవేశ్వరున కంకితము దీనికి ఇతని మఱదియైన పాల్కురికి సూరనామాత్యుడే శ్రోత."

పాలకుఱికి సోమనాథుని కాలము ప్రత్యేక మొక ప్రోత్థాపిత సమస్య. ప్రతాపరుద్ర చక్రవర్తికి సమకాలికు డగుట పరమ నిర్ధారకమయినను, సోమనాథుని కాలము పదునాల్గవ శతాబ్ది కావలసిన ఆవశ్యకము లేదు పదమూడవ శతాబ్దియు కావచ్చును. అదటుంచి, పండితారాధ్య చరిత్ర నిస్సందేహముగ బసవేశ్వరునికి అంకితము. "బసవన దండనాయకుని జానొంద మత్కృతి స్వామిఁ గావించి" అని ముందే సోమనాథుని మున్నుడి. (8 ద్వి. 1 ప్ర ) "విను సూరనామాత్య" అని తర్వాత ఆమంత్రణము. (108 ద్వి. 1 ప్ర.) అందుకు "కారణము భక్తి" కాదు. "అంకిత మొకరికి శ్రోతత్వము మఱొకరికి" అను సంప్రదాయమును కాదు. అసలు కారణము పాలకుఱికి సోమనాథుని అనుభవసారమును అరసిన సువిశదము కాఁగలదు.

"త్రిపురారి భక్తి యుక్తుఁడు
త్రిపురారి మహాత్మ్య నామధేయుఁడు సాక్షా
త్త్రిపురారి మూర్తి గోడగి
త్రిపురారి మదీయ కావ్యకృతికి
నాయకుఁ డగుఁగాక " 25 ప.

"శివమస్తు భక్తి నిత్యో
ద్భవమస్తు కుటుంబమునకు సకలార్థ సం
భవ పూర్తిరస్తు విజయో
ద్భవమస్తు నిరంతరము దయఁ గృతిపతికిన్.
242 ప.

ఇందు అనుభవసారము గోడగి త్రిపురారికి అంకితమని ఇదమిత్థముగ కలదు గోడగి త్రిపురారి కృతిపతి అయిన శ్రోత మఱొకడు కాడు కృతిపతి అయిన గోడగి త్రిపురారియే అనుభవసారమునకు ప్రధాన శ్రోత.

"అసమ గుణుడాగ జంగమ
ప్రసాద భక్తిస్థలముల బరిపూర్ణుండై
యెసఁగు లసత్కావ్యము నీ
కసలార నభీష్టదాయి యగుఁ ద్రిపురారీ!"
241 ప.

ఇందు "త్రిపురారీ!" అను సంబోధనము. "నీకు" అను నిర్ధారణము గోడగి త్రిపురారి అనుభవ సారమునకు ప్రధాన శ్రోత అనుటకు నిర్ధారక సాధనములు. అనగా కృతిపతియే ప్రధాన శ్రోత. ప్రధాన శ్రోతయే కృతిపతి అని తాత్పర్యము. అయిన పండితారాధ్య చరిత్ర కృతిపతి ఒకరు, ప్రధానశ్రోత మఱొకరు అగుటకు హేతువేమి? —పండితారాధ్య చరిత్ర కృతిపతి బసవేశ్వరుడు. బసవేశ్వరుడు లింగైక్యము చెందిన పిదపనే పండితారాధ్య చరిత్ర రచనము, అంకితమును. లింగైక్యము చెందిన కృతిపతి ప్రధానశ్రోత అగుట దుర్ఘటము. అందుకు సూరనామాత్యుడు ప్రధానశ్రోత అగుట ఆవశ్యకము. అనుభవసారమున లేకుండ, పండితారాధ్య చరిత్ర లోనే అంకిత మొకరికి, శ్రోతృత్వము మఱొకరికి ఉండుటలోని మర్మమిదియే కాని, అదొక సంప్ర

దాయము కాదు బసవపురాణమున కృతిపతి నిర్దేశము లేదు ప్రధానశ్రోతృ నిర్దేశము కలదు. "అవధాన వంతుండవై నెమ్మి వినుము సవిశేషభక్తిపై సంగనామాత్య" అని పాలకురికి సోమనాథుని ప్రతిపాదనము. (142 ద్వి 1 ఆ) అనగా బసవపురాణమునకు గొబ్బూరి సంగన ప్రధానశ్రోత అని అర్థము. అనుభవసారమునకు ప్రధానశ్రోత అయిన గోడగి త్రిపురారి కృతిపతి అయినట్లు బసవపురాణమునకు ప్రధానశ్రోత అయిన గొబ్బూరి సంగన కృతిపతి అగును. బసవ పురాణము నందలి ఏడు ఆశ్వాసము లందును గొబ్బూరి సంగన పరముగ ఆశ్వాసాద్యంత ద్విపదలు కలవు. అవి ప్రధాన శ్రోతృ సంబోధనములతోపాటు కృతిభర్తృ సంబోధనములును. ప్రధాన శ్రోతలు కృతిభర్తలు అభిన్నులు. కృతిభర్తల అభావమున మాత్రమే ప్రధాన శ్రోతలు భిన్నులు. కనుక నన్నయ భారతమునకు రాజరాజనరేంద్రుడు ప్రధానశ్రోత అనగా ఘట్టకుటీ ప్రభాతన్యాయమున నన్నయ భారతము రాజరాజనరేంద్రాంకిత మనియే ఫలితార్థము

3 "తిక్కన కాలమునకు కావ్యకన్యను తగిన వరున కిచ్చుట యను సంప్రదాయము వచ్చినట్లు కనఁబడుచున్నది. 'కవితా విలాస విస్తర మహనీయుఁడైన' తిక్కనను 'సత్వగుణోత్తరమూర్తి మనుమభూవరుఁడు తగంగ రాఁబిలిచి మామని మన్నన నాదరించుచు'

" ఏ నిన్ను మామయనియెడు
దీనికిఁదగనిమ్ము భారతీ కన్యక, నా
కీనర్హుఁడ నగుదనినను
భూనాయకు పల్కు చిత్తమున కింపగుడున్."

కవి 'మత్కృతీశ్వరుఁడగుచున్న మను మనృపతి సుభగు గావించుటకు సముత్సుకుఁడాయెచు."

ఇందు మనుమసిద్ధి తిక్కనను మామ అనుట, అందుకు తగినట్లు భారతీ కన్యను ఇమ్మనుట తిక్కన తెలిపిన సంగతి. మనుమసిద్ధి తిక్కనను మామ అనుట కృతిస్వీకారమునకు కాదు. కృతిస్వీకారము నకు ముందే మనుమసిద్ధి తిక్కనను మామ అనుట కలదు. అందుకు భారతీకన్యను "తగనిమ్మని" మనుమసిద్ధి అన్నట్లు తిక్కన చమత్కారకల్పనము. మనుమసిద్ధికి తిక్కన మామ కనుక, తిక్కన భారతీ కన్యక తిక్కన సుత అగును. కవితను కన్యక అనుట, కావ్యమును సుత అనుట సంస్కృత వాఙ్మయమునకు సమామ్నాత పూర్వము.

"నైవవ్యాకరణజ్ఞమేతి పితరం న భ్రాతరం
తార్కికం
దూరాత్ సంకుచితైవ గచ్ఛతి యథాచణ్డాల
తశ్ఛాన్దసాత్
మీమాంసా నిపుణం నపుంసక ఇతి జ్ఞాత్వా
నిరస్యాదరా
త్కావ్యాలంకరణజ్ఞమేవ కవితా కన్యా వృణీతే
స్వయమ్." 12 శ్లో.

ఇది బిల్హణ చరిత్రములోని శ్లోకము. ఇందు కవిత కన్య అనియేగాక కవితాకన్యకు స్వయం వరమును కలదు. అది కృతిభర్తృవిషయము కాదు రసజ్ఞ విషయము. కవిత మాత్రము కన్యయే.

"సర్వథా పదమప్యేకం న నిగాద్య మవద్యవత్
విలక్ష్మణాహి కావ్యేన దుస్సుతేనేవ నిన్ద్యతే.
11 శ్లో. 1అ.

ఇది భామహుని కావ్యాలంకారములోని శ్లోకము. ఇందు దోషజుష్టమైన కావ్యము దుష్టసుత అని కలదు అనగా దోష రహితమైన కావ్యము శిష్టసుత అని తాత్పర్యము. కృతి సుత అయిన కృతిపతి అల్లుడగును. కృతి స్వీకారమునకు ముందే మనుమసిద్ధి తిక్కనను మామ అనుటవలె, అంతకుముందే కృతి

పతి వ్యవహారము లేనిచో, మనుమసిద్ధి తిక్కనను "ఏనిన్ను మామయనియెడు దీనికిఁదగనిమ్ము భారతీ కన్యక"ను అని కోరుట సంగతము కాదు. కాఁబట్టి తిక్కన ఉత్తర రామాయణమునకు ముందే కావ్య కన్యను తగిన వరున కిచ్చుట అను సంప్రదాయము కలదని స్పష్టము.

తిక్కన ఉత్తర రామాయణము మనుమసిద్ధికి అంకితము: మఱి కేతన దశకుమారచరిత్రము తిక్కనకు అంకితము. కేతన దశకుమారచరిత్రము తిక్కన ఉత్తర రామాయణమునకు తర్వాత, తిక్కన భారతమునకు పూర్వము వ్రాయఁబడినదనుట పరిపాటి. కేతన దశకుమార చరిత్రమున తిక్కన భారతము గుఱించి ప్రసక్తి లేదు. కనుక తిక్కన భారతము కంటె. కేతన దశకుమార చరిత్రము పూర్వకాలికమని సమన్వయము మఱి కేతన దశకుమార చరిత్రమున తిక్కన ఉత్తర రామాయణము గుఱించియును ప్రసక్తిలేదు. కవిగా తిక్కన గుఱించి కేతన తెలిపిన విషయములివి:

1. మయూరసన్నిభ మహాకవి 4 ప. 1ఆ.
2. అధరీకృత మయూరుండు 88 వచ. 1ఆ
3 అగునఁగొమ్మయ తిక్కఁడు
 జగతి నపూర్వార్థ శబ్ద చారు కవితమై
 నెగడిన "బాణోచ్ఛిష్టం
 జగత్త్రియం" బనిన పలుకు సఫలంబయ్యెన్
 90ప. 1ఆ.
4. కృతులు రచియింప సుకవుల
 కృతులొప్పఁగొనంగ నొరునికిం దీరునె వా
 కృతివిభుఁడు వితరణశ్రీ
 యుతుఁడన్నమసుతుఁడు తిక్కఁడొక్కఁడు
 దక్కన్. 91ప. 1ఆ.
5. [illegible]
 సభఁదెనుఁగున సంస్కృతమునఁ
 జతురుండై తా
 నుభయ కవిమిత్ర నామము
 త్రిభువనముల నెగడ మంత్రి తిక్కఁడు
 దాల్చెన్. 92ప. 1ఆ
6 లలిత నానాకావ్యములు చెప్పు నుభయభాషల
 యందు ననుట ప్రశంస త్రోవ 93 ప 1 ఆ.
7. పద్యాదిత్రివిధ కావ్య పారీణునకున్
 100 ప. 1 ఆ.
8. కవీంద్ర లోకాధారుఁడు 119 ప. 2 ఆ.
9. పోషిత సత్కవీంద్రునకు 128 ప 4 ఆ.
10. ఉభయకవి మిత్రునకున్ 129 ప. 4 ఆ.
11 కావ్యకళాజని భూమికి 134 ప 5 ఆ.
12. నిత్యస్తుత్య విలాస సారకవితా నిర్మాణ
 చాతుర్యః 164 ప 7 ఆ.
13. అనితరగమ్య వాఙ్మయ మహార్ణవ వర్తన
 కర్ణధారః 94 ప 8 ఆ.
14. కవితాధన్యుండు 84 ప. 9 ఆ.
15. కావ్యకర్తిస్తుత్యుఁడు 81 ప. 9 ఆ.

ఇందు మయూరకవితోడి సాదృశ్యము, భట్ట బాణుని తోడి సాపత్యము తిక్కన ఉత్తర రామాయణమునకు స్ఫోరకములు కావు పద్యాదిత్రి విధ కావ్య పారీణుఁడు అనగా పద్య. గద్య. పద్యగద్యోభయ కావ్యపారీణుడని అర్థము ఉత్తర రామాయణము నిర్వచనము కనుక పద్యకావ్య పారీణతఉత్తర రామాయణమునకు సూచిక అగున. భారతము పద్యగద్యోభయము కనుక పద్యగద్యోభయ కావ్య పారీణత భారతమునకు జ్ఞాపిక అనవలయును. అంతే కాదు. తిక్కనకు "అనితర గమ్య వాఙ్మయ మహార్ణవ వర్ణన కర్ణధార !" అను సంబుద్ధి భారత రచన

మునకు శృంగగ్రాహిక అనిపించును. కాని భారత ప్రసక్తి లేని దశకుమార చరిత్రము భారతానంతర కాలికము కాదు. ఉపరి, దశకుమార చరిత్ర రచనా కాలమున మనుమసిద్ధి రాజు (19 ప. 1 ఆ) తిక్కన మంత్రి, (89, 92 ప 1 ఆ.) బహుశః, అంతకుముందు దండనాయకుడు (1 ప. 7 ఆ) అంతకంటె ముందు చమూపతి 1 ప 9 ఆ.) భారత రచనా కాలమున మనుమసిద్ధి రాజుకాదు. తిక్కన మంత్రికాడు. కనుక భారత ప్రసక్తి లేని దశకుమార చరిత్రము భారతానంతర కాలికము కాదనుట నిర్ధారకము. అట్లే ఉత్తర రామాయణ ప్రసక్తి లేని దశకుమార చరిత్రము ను ఉత్తర రామాయణానంతర కాలికము కాదు. అంతేకాదు కేతన దశకుమార చరిత్ర వచనా కాలమున తిక్కన మనస్థితి, ఉత్తర రామాయణ రచనా కాలమునందు వలె ఉజ్జ్వలము కాదు. "అమలోదాత్త మనీష నేను భయకావ్య ప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడన్ గళావిదుఁడ" (13 ప. 1 ఆ) అని ఉత్తర రామాయణమున స్వోత్కర్ష ప్రకటించిన అనంతరము తిక్కన కేతనను, "ఒక్క కావ్యంబు రచియించి నన్నుఁ గృతిపతిం జేయవలయునని సగౌరవంబుగాఁ బ్రార్థించు" ట, కేతన "అతని మనోరథంబు సఫలంబుఁ గావింపం దలంచుట (24 వ చ. 1 ఆ.) సంగతము కాదు. అది కేతన అట్లు వ్రాసెననుటకైన, తనకు అంకితమైన కావ్యమున అట్లుండుట తిక్కన అనుమతించు విషయము కాదు అంతేకాదు దశకుమార చరిత్ర రచనా కాలమున తిక్కన మంత్రి అని పూర్వోక్తము. భారత రచనాకాలము నందువలె, ఉత్తరరామాయణ రచనా కాలము నందును తిక్కన మంత్రి అనుటకు మఱి ఆధారము కానరాదు. ఆశ్వాసాంత గద్యలందును ఉత్తర రామాయణము "తిక్కన నామధేయ ప్రణీత"మని కలదు. తిక్కనామాత్య ప్రణీత మనియైన లేదు. తిక్కన ప్రథమతః మనుమసిద్ధి చమూపతి, తదుపరి మనుమసిద్ధి దండనాయకుడు, ఆ మీద మనుమసిద్ధి మంత్రి, అనంతరము మనుమసిద్ధి ఆస్థానకవి, తదనంతరము హరిహర నాథుని ఆస్థానకవి అయినట్లు అవగాహకము కనుక దశకుమార చరిత్ర తిక్కన ఉత్తర రామాయణము తర్వాతి గ్రంథము కాకపోవుట ఉపోద్బలకము అనగా తిక్కన ఉత్తరరామాయణము కంటె, కేతన దశకుమార చరిత్రము పూర్వ గ్రంథము, ఆచార్య పింగళి లక్ష్మీకాంతం ప్రభృతుల అభిప్రాయము కూడ అంతే[5] ఇంతకు తిక్కన ఉత్తర రామాయణము కంటె పూర్వ గ్రంథమైన కేతన దశకుమార చరిత్రమున "కావ్య కన్యను తగిన వరునికిచ్చుటయను సంప్రదాయము" కలదు.

"మ (దీయ) కావ్యకన్యక కుందగు వరుం
డగుట" 24 వచ 1 ఆ

అని కేతన స్పష్ట ప్రతిపాదనము. అంతేకాదు. "కన్నడ కవులు దమ సల్లక్షణ లక్షితమగు కావ్యములను కొమార్తెలుగా భావించి కృతిపతి కీయఁ దలంచినట్లు తలఁచిరి" అని శిష్టారామకృష్ణ శాస్త్రిగారు అందఁజేసిన సమాచారము.[6] కన్నడకవి నాగవర్మ కర్ణాట భాషాభూషణమును నామతః ఆంధ్ర భాషా భూషణమున అనుసరించిన కేతన, కన్నడ కవుల కావ్యకన్యావరాన్వేషణ సంప్రదాయమును అనుసరించుట సహజము అది దశకుమార చరిత్ర కావ్యకన్యకాయోగ్యవరుడైన తిక్కన ఉత్తర రామాయణమున ఉపలక్షించుట, మనుమసిద్ధిపరముగ చమత్కరించుట అంతకంటె సహజము. కాఁబట్టి కావ్యకన్యావరాన్వేషణ సంప్రదాయము తిక్కన కాలమునకు ముందే కలదని స్పష్టము అది నన్నయ భారతము రాజరాజనరేంద్రాంకిత మగుటకు బాధకముకాదు. అంతేకాదు. నన్నయ కాలమున "అంకితమిచ్చు ఆచారము" లేదనుటకు సాధకముకాదు

ఇంతకు నన్నయ భారతమున అంకిత శబ్దము లేదు. అంకితాభ్యర్థనము లేదు. అంకితలాంఛనము లైన షష్ఠ్యంత పద్యములు లేవు. కనుక నన్నయ భారతము రాజరాజనరేంద్రాంకితము కావచ్చు భ్రాంతి కలుగుట సహజము కాని, నన్నయ భారతమున అంకితచిహ్నములైన ఆశ్వాసాద్యంత పద్యములు కలవు. అంకితములైన ఆంధ్రకావ్యములందలి ఆశ్వాసాద్యంతపద్యములెల్ల అంకిత చిహ్నములే. ఒక్క పండితారాధ్యచరిత్రలోని ప్రకరణాద్యంత పద్యములు మాత్రమే అపవాదము. తన్నిమిత్తము కృతిభర్తృ అభావమే. అది గమనింపక ఆశ్వాసాద్యంత పద్యములు అంకిత చిహ్నములు కావనుట అవిచారమూలకము. అంకిత చిహ్నములైన ఆశ్వాసాద్యంత పద్యములు రాజరాజనరేంద్రుని పరముగా నన్నయ భారతము రాజరాజనరేంద్రాంకితమే కనుకనే, ఎఱ్ఱన అరణ్యపర్వశేషమునందును ఆశ్వాసాద్యంత పద్యములు రాజరాజనరేంద్రుని పరముగ కలవు. ఆశ్వాసాద్యంత పద్యములు కేవలము శ్రోతృవిషయకములైన ఎఱ్ఱన అరణ్యపర్వశేషమునకు రాజరాజనరేంద్రుడు ప్రధానశ్రోత కావలయును. పదునొకండవ శతాబ్ది రాజరాజనరేంద్రుడు, పదునాల్గవశతాబ్ది ఎఱ్ఱనకు ప్రధానశ్రోత అగుట కేవలము అసంభవము. కనుక ఎఱ్ఱన అరణ్యపర్వశేషములోని ఆశ్వాసాద్యంత పద్యములు కృతిభర్తృ విషయకములు అట్లు నన్నయ ఆదిసభారణ్య పర్వభాగములోని ఆశ్వాసాద్యంత పద్యములును కృతిభర్తృ విషయకములు. కనుక నన్నయభారతము రాజరాజనరేంద్రాంకితము.

అవల కావ్యమున అంకితచిహ్నములు [illegible] అర్థమేమి?

(అంకిత లాంఛనములైన ఆశ్వాసాద్యంత పద్యములు, అంకితచిహ్నములైన ఆశ్వాసాద్యంత పద్యములు [illegible] జంగమమల్లయ్య వరమునందుఁగనిన వస్తుకవిత దగిలి వ్రాయించ నెగడించె" నన్న (49 ప 1ఆ.) నన్నెచోడుని కుమారసంభవము [illegible] వాక్యమిది:

"ధ్రువమై జంగమ మల్లికార్జున మునీంద్రుం
డెన్నఁ బేర్కొన్న స
త్కవిరాజోక్త కుమార సంభవ మహాకావ్యం బు
భా భూధరా
ర్ణవ వేదానిల తారకాంశు సదానింతా
దిక్కాలముల్
సవిలాస స్థితినుండు సంతత నానాబ్ధ[illegible]మై
యుండెడున్" 225 ప 12 ఆ.

ఇందు జంగమ మల్లికార్జున దేవునితోపాటు జంగమ మల్లికార్జున శివయోగికి అంకితమైన నన్నెచోడుని కుమారసంభవము, జంగమ మల్లికార్జున మునీంద్రుని పేర్కొన్న కావ్యమని ఇదమిత్థముగ తెలదు. ఇది కావ్యమును అంకితమిచ్చుట అనగా, కావ్యము ఎవనికి అంకితమో, అతనిని కావ్యమున పేర్కొనుట అనుటకు ఒక నిర్ధారక సాధనము)

గోనబుద్ధారెడ్డి రామాయణమునందు అవతారికా భాగమున,

"వనిపూని యరిగండ భైరవుపేర
ఘనుపేర మీసర గండని పేర
లలిత నిర్మల గుణాలంకారు పేర
నలఘు నిశ్చల దయాయతబుద్ధి పేర
నాతత కృతిపేర నతిపుణ్యుపేర
మా తండ్రి విట్ఠలక్ష్మాపాలు పేర
* * *
— శ్రీరామచరిత మొప్పఁ జెప్పెద"

అని కలదు. ఇందలి "మా తండ్రి విట్ఠలక్ష్మాపాలు పేర" అను పంక్తిని పట్టుకొని బుద్ధారెడ్డి రామాయణమును [illegible] రంగనాథరామాయణమని కల్పించుట

జరిగినది. కాని, బుద్ధారెడ్డి రామాయణములోని బాల కాండాంతద్విపద యిట్లున్నది.

"పాలిత వసుధ దయాంబుధీ శరధి
భూరినిధి గోనబుద్ధభూవిభుఁడు
తన తండ్రి విట్ఠల ధరణీశుపేరఁ
గమనీయ ధైర్య కనకాద్రిపేరఁ
బలిగొని సరిగలుప ధైర్యపుపేర
ఘనుపేర మీసర గండనిపేర
నయము నిశ్చల దయామాయత బుద్ధి పేర
లలిఁ సద్గుణ గణాలంకారు పేర
నా చంద్ర తారార్కమై యొప్పు మిగిలి
భూచక్రమున నిత్యపూర్ణమై వెలయ
నసమాన లలిత శబ్దార్థ సంగతుల
రసికమై వెలవొంద రామాయణమునఁ
బరగ నలంకార భావనల్ నిండఁ
గర మొప్పు నీబాల కాండంబుఁ జెప్పె"

అని కలదు. ఇట్లు ఆంధ్ర విశ్వకళా పరిషత్ప్రచురణ ముతో అయోధ్యారణ్య కాండాంత ద్విపదలందు లేదుగాని, కిష్కింధా సుందర కాండాంత ద్విపద లందు కలదని సూచితము యుద్ధ కాండాంత ద్విపద లందు కలదు. రాయలు అండ్కో ప్రచురణమున వావిళ్ల వారి ప్రచురణమున అయోధ్యారణ్య కాం డాంత ద్విపదలందును కలదు. అనగా ప్రతికాండాంత ద్విపదలందును కలదని ఫలితార్థము. ఇట్లు బుద్ధారెడ్డి కాండాంత ద్విపదలు తండ్రిపేర చెప్పుటకు హేతువు అతని తండ్రి విట్ఠలరెడ్డి.

"భూమిఁగవీంద్రులు బుధులును మెచ్చ
రామాయణంబు పురాణ మార్గమున
దప్పక నాపేరఁదగ నంధ్రభాషఁ
జెప్పి ప్రఖ్యాతంబు సేయింపుముర్వి"

అని బుద్ధారెడ్డికి ఆనతిచ్చుటయే. రామాయణమును పురాణమార్గమున తనపేర చెప్పుమనుటలోని అంతరార్థము రామాయణమును పురాణముగ రచింపు మని, ఆ రామాయణ పురాణమునకు తనపేరు పెట్టు మనికాదు. బుద్ధారెడ్డి తన రామాయణమునకు తండ్రి పేరు పెట్టియుండలేదు. బుద్ధారెడ్డి రామాయణము పేరు రామాయణమే. అది కాలక్రమమున బహుశః ఆధునిక యుగమున రంగనాథ రామాయణము అయి నది.[8] పురాణమార్గము అనగా పూర్వమార్గము అని అర్థము. పూర్వమార్గమున రామాయణమును తన పేర చెప్పుమను తండ్రి ఆదేశము రామాయణమును తండ్రిపేర చెప్పుటయే తనయుని ఆచరణము. పేర చెప్పుట అనగా ఏమి?

బుద్ధారెడ్డి తనయులు - కోలిజంటకవులు - కాచ రెడ్డి, విట్ఠలరెడ్డి పూర్తిచేసిన ఉత్తరకాండములోని అవతారికా భాగమున.

"మా తండ్రి బుద్ధక్షమానాథుపేర
నాతత ఘనుపేర నసఘునిపేర
ఘనుఁడు మీసరగండ కాచభూవరుఁడు
వినుతశీలుఁడు పినవిఠలభూపతియు
నని జనుల్ గొనియాడ నర్థితో మేము
వినుత నూతనపద ద్విపదకావ్యమున
ఘనమైన పాఠంబు గాటమౌ శయ్యఁ
బ్రకటంబుగ నాంధ్రభాషఁ జెప్పంగఁ
గైకొన్న యుత్తరకథ యెట్టిదనిన"

అని కలదు. కాండాంత ద్విపదలందు "బుద్ధక్షమా నాథుపేర" అను ద్విపదలులేవు. రామనిర్యాణము తర్వాత,

"రాజన్య విభుఁడైన రాముతేజమున
రాజిల్లుచున్న యీ రామాయణంబు"

అని కలదు. అనంతరము ఫలశ్రుతి, అమీద,

"అని చంద్రచందన హారనీహార
ఘనసార సన్నిభ ఘనకీర్తి ధనులు
భూమతుఁడగు కోనబుద్ధ భూవిభుని

సూను లుదారులు సుగుణభూషణులు
ఘనుఁడు మీసరగండ కాచెభూవిఁడు
వినుత పుణ్యుండగు విట్ఠభూపతియు
రచియించి రుత్తర రామాయణంబు
రుచిరమై నిత్యమై రూఢిఁ బెంపెసఁగ
నా చక్రవాళ శైలావనియందు
నా చంద్ర తారార్క మై యొప్పఁగాత"

అని మాత్రమే కలదు.

మడికి సింగన వాసిష్ఠ రామాయణమున.

" – అని సకలజన సమ్మతంబుగా నుపక్రమించి భాగవత దశమస్కంధంబును దెనుంగున రచియించి యిచ్చి, యప్పుణ్య పురాణంబులకుఁ గృతిపతిగా నే పుణ్యునిఁ బ్రార్థింతునోయని విచారించి......... కందనామాత్యుండు నాకు సతిస్నేహబాంధవుండును.. అర్థి జనపారిజాతంబును గావున నమ్మంత్రి యుగంధరుం గృతిపతింగావించి–" అని కలదు అనగా భాగవత దశమ స్కంధమును కందనామాత్యునికి అంకితమని అవగాహకము. మడికి సింగన భాగవత దశమ స్కంధము కృత్యాది అనుపలబ్ధము మధుర, కల్యాణ. జగదభిరక్ష అను మూడు కాండములు ఉపలబ్ధము. మధుర కాండాంత ద్విపదలందు,

"అని యిట్లు నయనిర్జరామాత్యుపేర
ధనధాన్య మణిమయ దానాఢ్యుపేర
భూభరణక్షమభుజసారుపేర
ఔభళమంత్రి కందామాత్యుపేర"

అవి; కళ్యాణ, జగదభిరక్ష కాండాంత ద్విపదలందు,

"అవి యిట్లు నిత్యధర్మారంభుపేర
జనలోక నవపారిజాతంబుపేరఁ
జతురకళా పూర్ణచంద్రునిపేర
నతులవైభవ నిర్జరాధీశుపేర
శోభిత నవరూఢ సూనాస్త్రుపేర
ఔభళమంత్రి కందామాత్యుపేర"

అని కలదు. అంతేకాదు. అంకితశబ్దము ప్రయుక్తమైన గౌరన నవనాథచరిత్రమునందును ఇట్లు కలదు.

"........శ్రీశైలపతికి
శంకరునకు బాలశశిశేఖరునకు
నంకితం బొనరింపు మనుచు...
అని చతుర్దశభువనాధీశుపేర
వినుత వేదాగమ వేద్యునిపేర
సేవకోత్పల షండ శీతాంశుపేర
భావనాతీత ప్రభావునిపేర
భృంగీశ తాండవ ప్రీతాత్ముపేర
నభిమతార్థ ప్రదాయక దేవుపేర
శుభమూర్తి మల్లికార్జునదేవుపేర
ఘనముక్తికాంత భిక్షావృత్తి హృదయ
వనజప్రభాత దివాకరుపేర
నారవి తారాశశాంకమై వెలయు
గౌరనామాత్యపుంగవ కృతంబగుచు
ననువొంద నీ నవనాథచరిత్ర
మను కావ్యమునఁ బ్రథమాశ్వాసమయ్యె."

ఇట్లు అయిదు ఆశ్వాసాంతములందును కలదు. అంతేకాదు. అంకితము కాని గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమున ఇట్లు లేదు. "మల్లికార్జునదేవుపేర" అను ఆశ్వాసాంత ద్విపదలు కల గౌరన నవనాథ చరిత్రము మల్లికార్జునదేవునికి అంకితము. "కందామాత్యుపేర" అను కాండాంత ద్విపదలుకల మడికి సింగన భాగవత దశమస్కంధము కందనామాత్యునికి అంకితము. అట్లు "పేర" అను కాండాంత ద్విపదలులేని కాచరెడ్డి, విట్ఠలరెడ్డి జంటకవుల ఉత్తర రామాయణము బుద్ధారెడ్డికి, "విట్ఠల ధరణీశుపేర" అను కాండాంతద్విపదలుకల బుద్ధారెడ్డి పూర్వ రామాయణము విట్ఠలరెడ్డికి అంకితము. కనుక పేరు

చెప్పుట అనగా అంకితమిచ్చుట అనియే అర్థము. [బుద్ధారెడ్డి రామాయణమునందలి "పేర చెప్పు"ట, నన్నెచోడుని కుమారసంభవములోని "పేర్కొను"ట ఒకటే. అనగా అంకితమిచ్చుటయే] కాబట్టి అంకిత మిచ్చుట అనగా పేరుచెప్పుట. [పేర్కొనుట] అని స్పష్టము. నవనాథ చరిత్రములోని ఆశ్వాసాంత ద్విపదలు, భాగవత దశమస్కంధములోని కొంతాంతద్విపదలు, రామాయణములోని కాండాంతద్విపదలు [కుమార సంభవములోని ఆశ్వాసాంత పద్యములు.] నన్నయ భారతమునందలి ఆశ్వాసాంత పద్యములు సహోదరములు.[కుమారసంభవములోని,] నన్నయ భారతమునందలి ఆశ్వాసాది పద్యములు అదనము. నన్నయ భారతమునందలి ఆశ్వాసాద్యంత పద్యములు రాజరాజనరేంద్రుని పేర చెప్పినవి. నన్నయ భారతము రాజరాజనరేంద్రుని పేర్కొన్న కావ్యము. కాబట్టి నన్నయ భారతము రాజరాజనరేంద్రాంకిత మని స్పష్టము

సమష్టిపై నన్నయ భారతము రాజరాజనరేంద్రాంకితమని సిద్ధాంతము.

## గ మ ని క

కుండలీకృతభాగములు నన్నెచోడుని కుమార సంభవము ప్రాచీనగ్రంథమను పరిపాటిని వ్రాసినవి. తదుపరి, నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీన గ్రంథముగాక, నవీన గ్రంథమని పరిశోధితము.

— కొర్లపాటి శ్రీరామమూర్తి

---

## సూ చి క లు


1. ఆంధ్రవాఙ్మయ చరిత్ర సర్వస్వము. 1957. పుటలు 249-50.
2. History of classical literature. P. 418.
3. నన్నెచోడుని కవిత్వము. 1959. పుట 20.
4. అదే. పుటలు 20-22.
5. ఆంధ్రసాహిత్యచరిత్ర. పుట 242.
6. ఆం.వా.చ.స. పుట 250.
7. రంగనాథ రామాయణము. ఆంధ్రవిశ్వకళా పరిషత్తు. పీఠిక. పుటలు 2-3.
8. అదే. రాయలు అండ్ కో. పీఠిక. పుటలు 13-14.

# కనులకు మనసుంటే

అదిగో అందము అదిగో అందము
ఎటుఎటు చూచినా
ఎటు కాంచినా
అందము ఆనందము

సుందర నందన వనిలో
సహస్ర కిరణ తేజుడౌ రవిలో
తెలతెల్లని మల్లెల మాలల్లో
లలిత లలితమౌ లతాంగి లాస్య విన్యాసంలో

ఉన్నదిలె అందము
నే కన్నది సత్యము
అదిగో అందము అదిగో అందము
ఎటు చూచినా
ఎటు కాంచినా
అందము ఆనందము

కలికి కరచరణ విన్యాసంలో
మృదుమధురమౌ మందార సింధూర వర్ణంలో
మిలమిల మెరుపుల తారల తళుకుల్లో
అందచందాల జాబిల్లి జలతారు వెన్నెల్లో

ఉన్నదిలే అందము
నేకన్నది సత్యము
అదిగో అందము అదిగో అందము
ఎటు చూచినా
ఎటు కాంచినా
అందము ఆనందము

జలధి తరంగాల పంక్తుల
నవ్యదివ్యనాట్యకేళీ విలాసంలో
వెదురు తోటల మధుర గానంలో
ఈ జగతిలో అణువణువులో

ఉన్నదిలే అందము
ఉన్నదిలే ఆనందము
నేకన్నది సత్యము
అదిగో అందము అదిగో అందము



# ఆంధ్రులు - కులవ్యవస్థ - 2

క్రీ॥ శే॥ సురవరము ప్రతాపరెడ్డి

[క్రీ॥ శే॥ సురవరము ప్రతాపరెడ్డి రచించి పెట్టిన బృహద్వ్యాసము ఇది. వ్రాత ప్రతిగా నున్నది. మన ప్రాచీన సాంఘిక వ్యవస్థను అవగాహన చేసుకొనుటకు చక్కఁగా తోడ్పడు ఈ వ్యాసములోని పరిశోధనా దృక్పథము ప్రశస్తమైనది. ఆంధ్రుల సాంఘిక చరిత్రను అనితర సాధ్యముగా రచించిన రెడ్డిగారు ఆంధ్రుల కులవ్యవస్థను గురించి కూడా పరిశోధించి సవిస్తరముగా రచించదలచినట్లు ఈ వ్యాసమువలన తెలియుచున్నది. ఇంతవరకు మూడు ప్రకరణములు లభించినవి. ఇట్లే కొన్ని ప్రకరణములుగా ఈ విషయమై వారు రచించినట్లు తలపవచ్చును అవి లభ్యము కాలేదు. ఈ మూడు ప్రకరణములు గూడా చేజిక్కించుకొనుటకు కొన్ని నెలలు ప్రయాసపడవలసి వచ్చినవి. వీటిని సంపాదించి ఇచ్చిన వారు డా॥ ముకురాల రామారెడ్డి

ప్రస్తుతము రెండవ ప్రకరణమును ముద్రించుచున్నాము. సాంఘిక పరిశోధనార్థులకు ఇది ఉత్తమమైన సంప్రదింపు సామగ్రిగా ఉపయోగపడు ననుటలో సందేహము లేదు]

—సంపాదకులు

### కాఁపు కర్షక సంబంధము

మొదటి ప్రకరణమునందు కాఁపు పదమునకు కాపాడుటయని, కృషీవలుఁడు వైశ్యుడని నిరూపింపనైనందున పంటలుబెట్టి కాపాడువాఁడు గాబట్టి కాఁపు నామము వచ్చినదాయని చదువరులకు నిశ్చయము గలుగవచ్చును.

కాఁపు అన్నంత మాత్రమున పంటబెట్టువాఁడని తలపరాదు. అయితే దేనిని గాపాడుటవలన ఈ నామము వీరికి వచ్చినది? గీర్వాణభాషయందు ఈ పదమునకు సమానము మరియొకటి పర్యాయపదముగా జాతినామము ఏదైయున్నది? వీరిముఖ్యవృత్తి ఏది? ఈ ప్రశ్నలకు సమాధానము క్రింద వివరించియున్నాను. కాఁపు జాతియందు ప్రధానశాఖలనుఁ జూచినచో దేనిని కాపాడువారో స్పష్టము కాగలదు.

మన ఆంధ్రదేశమునందు బహురాజకము అయిన తరువాత ప్రతిరాజుకు స్వాధీనమైన సీమలు యెదో హేతువునుబట్టి ఆంధ్రదేశ ఉపనామములుగా యేర్పాటైనవి. అవి ఏవన: పాకనాడు, కమ్మనాడు, పంటనాడు, పోకనాడు, రేనాడు, పల్లెనాడు, వేఁగినాడు, మొటాడినాడు, గోననాడు, (గోనసీమ) వెల్నాడు. ఇదే ప్రకారము ఆంధ్రదేశ విభజన ననుసరించి మన కాఁపు తెగలుగూడ ఆ నామములతో వ్యవహరింపబడుచున్నవి.

ఉదా॥ పాకనాటి కాఁపులు, కమ్మనాటి కాఁపులు (కమ్మవారు) పంటకాఁపులు పోకనాటి కాఁపులు, పల్లెనాటి కాఁపులు, వెల్నాటికాఁపులు, గోనకాఁపులు, రేనాటికాఁపులు, మోటాటికాఁపులు. ఇందులో పంటాన్వయులను నాడు లేకుండ అనుచున్నారు. తద్వతే

మొటాటివాండ్లనుగూడ పంటదేశము నెల్లూరుమండల మని ప్రసిద్ధి. అక్కడి కాపులను నాడుతో కలుపక ఆనుట వలన వారిని పంట పై రునుబెట్టి కాపాడువారని అనరాదు. ఇప్పటి ఆరువేలనియోగులు ఆరువేల నాటి నియోగులమని యనుకొనలేదా? గ్రామసంఖ్యను బట్టిగూడ "నాడు" యేర్పడుచుండెడిది. "పాకనాడిరువది యొక్కవేయి" (కుమారసంభవము 1-53)

అనవేమారెడ్డి మొదలైన రాజులు పంటాన్వయులు వారి మొదటి రాజధాని అద్దంకిగదా? ఆ గ్రామము నేటవంకు కందుకూరి తాలూకాలో నెల్లూరు మండలము నందున్నది. తద్వతే మొటాటివారుగూడ మట్టెవాడాన్వయులని ఒక పురాతన పద్యము వలన తెలియుచున్నది.

పద్యము ... ... ... ....

(ఇక్కడ ఉదాహరించవలసిన పద్యాన్ని వ్యాసకర్తపొరపాటున మరచినట్లుంది).

నైజాము ఇలాకా కమ్మముమెట్టుగ్రామమునుండి కృష్ణానదివరకు ఉండుదేశము కమ్మ రాష్ట్రమని లేక కర్మరాష్ట్రమని తెలియుచున్నది. ప్రస్తుత ము నైజాము ఇలాకాలోనుండు ఆంధ్రమండలములు మొటాటినాడని నా యభిప్రాయము. ఎందుచేననగా ఇచ్చోటనే ఈ శాఖవారు విశేషముగా గ్రామాధికారము, జమీందారి, దేశముఖి, మొదలగు అధికారములు గలిగినవారై యున్నారు. పై ప్రధానశాఖలు దేశముపై అధికారము వహించి అట్టిదేశమును తమ పాలనలో యుంచినవారిని ప్రబల నిదర్శన మున్నది.

పంటవాడునందు, పంటవారే విశేషముగా భూస్వాములై గ్రామాధికారులై యున్నారు. కమ్మనాడునందు కమ్మ మహాశయులే విశేషము. ఇట్లే పాకనాడుదేశము పాకనాడుశాఖవారితో నిండియున్నది. ఈ పాకనాడు సీమ నెల్లూరుకు పశ్చిమమై పున యున్న

దని చరిత్రకారులు చూపిన విషయమే. ఇట్టి సీమనే ఆదికవి పుంగవుడైన నన్నెచోడుడు కుమారసంభవ మను ప్రబంధమునందు తన తండ్రి చోడబల్లి ఇరువదియొక్కవేల గ్రామములతోయున్న పాకనాటి సీమను పరిపాలించెనని వ్రాసినాడు.

చం॥ "అరినరపాలమౌళిదళితాంఘ్రి
యుగుండయి పాకనాటియంది
రువదియొక్కవేయిటికధీశుడు
నాజను చోడబల్లికిం జిర
తరకీర్తి కగ్ర మహిషీతిలకం
బనహైహయాన్వయాంబర
శశిరేఖయైన గుణభాసిని
శ్రీసతికిం దనూజుడన్"

(కుమారసంభవము 1-53).

పై సిద్ధాంతము ననుసరించి రెడ్లలో అన్ని ప్రధానశాఖలు ఒకానొక దేశమునకు సంబంధించి యున్నవి కాని వేగినాటియందు రెడ్లులేరు. ఆ సీమ పేరుగల శాఖగూడ రెడ్లలో కనబడదు ఆ దేశపు రెడ్లు తమ జాతి నామమును మార్చి మరియొక పేరు ధరించి యుండవచ్చునని నాయుహ.భావి పరిశోధకులు సత్యమును వెల్లడి చేయగలరు. నాడు పదము లేకుండ కొందరు మన ఆంధ్రదేశమునందు కాపులని చెప్పుకొనెదరు. వారివి మాత్రము నాడు పేరు గలవారి ఉపశాఖలుగాని ప్రధానశాఖలుగావు. మరి కొందరు.ఇతరకులమువారు తాము కాపులమని చెప్పుకొనెదరు. వారు యెంతమాత్రమును వీరితో సంబంధించరు. వీరి స్వభావమువేరు. వారి స్వభావము వేరు. వారికి కులనామము వేరున్నప్పటికి మీరేకులమువారని యడిగినచో వారి నిజకులముల చెప్పక కాపులమని చెప్పుట సంభవించుచున్నది. కాని యే కాపులని యడిగిన యెడల ఈ రహస్యము బయట పడగలదు. కృత్రిమ కాపులు వ్యవసాయముజేయు

కాపులమని యనియెదరు. ఇంతేకాని పాకనాడు, పల్నాడు, పంటనాడు, వగైరా అని యనరు.

మరికొందరు పేర్కొనుం జేయువారము అనక ఏ వస్తువులను కాపాడుదురో ఆ వస్తువు పేరుతో కాపులమని చెప్పెదరు ఉదా॥ గొల్లలు మొదలు కాపులమని చెప్పి తరువాత ఏ కాపులని యడిగినప్పుడు గోవులను కాపాడుటవేల గోపకులము లేక గోవులను కాపాడే గొల్ల కాపులమని చెప్పెదరు. ఇదేప్రకారము తోటలను కాపాడేవారు తోట కాపులమని బలిజె కాపులమని లేక మాలీలమని చెప్పెదరు.

దేశమునకు సంబంధించిన పేరుగల కాపువారు దేశమును గాపాడువారని యనుటకు సందేహమేమియు లేదు. అమరకోశము మొ॥ సంస్కృత నిఘంటువులయందు దేశ సంబంధమైన కాపు పదమునకు బదులు క్షత్రియుడని యున్నది. దీని వ్యాఖ్యనము: క్షతాత్త్రాయతే క్షత్రః, తస్యాపత్యం క్షత్రియః. క్షతాత్ కు అర్థము, నాశనము, ఛిద్రములు, గాయములు. వీటినుండి త్రాయతే = కాపాడువాడు, క్షత్రుడనంబడును. అట్టి క్షత్రియుని మొగబిడ్డడు క్షత్రియుడు (క్షత్రస్య అపత్యంపుమాన్ క్షత్రియః). ఇచ్చట నాశనము, ఛిద్రములు, గాయములు ఎవరికి గలిగినయెడల గాపాడువాడు? దేశమునకు లేక దేశీయులకు అపాయము గలుగకుండ కాపాడుట యని భావము.

నే నిదివరకే పాశ్చాత్య సిద్ధాంత ప్రకారము ఆర్యులు ఇండియాకు ఉత్తరభాగమునుండి వచ్చిన వారని వారు వచ్చిన తరువాతనే భరతఖండమునందు గ్రామములు, పురములు, నగరములు, నగర రాజములు నిర్మింపబడినవని వారికి ముఖ్యవృత్తి కృషి యని చెప్పియుంటిని. అయితే దీనివలన తెలియు సంగతి: ఆర్యులు పూర్వమునుండి దక్షిణాపథము వచ్చుట అలవాటు. ఉత్తరభూమి ఎల్లప్పుడు బిస్తీగా ఉండడము ఆ దేశము జనులతో క్రిక్కిరిసినపుడు కొందరు దక్షిణ అరణ్యభూములకు వచ్చి అందు నివాస మేర్పరచుకొని అచ్చటి అరణ్యవాసులను భృత్యులుగాఁ జేసికొని గ్రామములు నిర్మించుట మొ॥ సంగతులు తెలియవచ్చినవి. కాబట్టి మన ఆంధ్ర దేశమును ప్రవేశించినప్పుడు ఇచ్చటి ఆదిమవాసులైనవారు వారిని కాపులని పిలిచిరి. వారిని కాపులని పిలుచుటకు ఒక హేతువున్నది. వీరు తొలుదొల్త ఆంధ్రభూమికి ఉత్తరభాగమునందున్న కాంపిల్య నగరమునుండి వచ్చినందుకు వారి పూర్వదేశమే జాతి నామమైనది. కనుక ఉచ్చారణయందు బిందు రహితమై ఈ పదము వ్యవహరించునప్పటికిని వ్రాతయందు పూర్ణబిందువునకు బదులు అర్ధానుస్వారము వ్రాయబడుచున్నది.

ఆదిమవాసులు పశువులవలె సృష్టినిర్మిత వస్తువులను అనుభవించుట దప్ప స్వపురుషార్థము వలన గృహములను నిర్మించుట, భూమివలన లాభము బొందుట, పశువులను పాలించి వాటితో పని తీసికొనుట ఎరుగరు. కనుక వారి అనాగరిక భాషయందు కాపు లేక కాపాడు అను పదమే అవసరము లేకుండెను. ఉత్తరభాగమునుండి కాంపుల పేరుతో కొందరు నాగరిక జనులు వచ్చినప్పుడు వారి నేర్పు వలన ఈ భావము గల పదము దేశభాషయందు సృష్టించవలసి వచ్చినది. కాంపులుఁ జేయు పని కాపాడుట కాబట్టి ఈ పదము బిందురహితమై 'కాపు' అను పదము ఆంధ్రభాషయందు ఏర్పడినదని తలచుచున్నాను.

దేశనామము జాతినామ మగునా? అని చదువరులు సంశయించ నక్కరలేదు. కొన్నివందల సంవత్సరముల క్రిందట వచ్చిన బొందిలివారిని పూర్భియాలని మనము జాతినామముగా వాడుచున్నాము. అసలు బొందిలివారు బుందేల్ఖండ్నుండి వచ్చినవారు,

పూర్భియాలు పూర్వదిశనుండి వచ్చినవారు కాబట్టి వారిని పూర్భియాలని పిలిచెదరు. వారుగూడ తాము బొందిలివారమని, పుర్భియాలమని చెప్పుచున్నారు. అసలు వారి దేశమునందు వారి కులనామము యిది గాదు ఇదేమాదిరి పార్సీలను పార్సీదేశమునుండి వచ్చుటవలన వారి కులనామము పార్సీలని వ్యవహరింపబడినది. కాపులు కాంపిల్య నగరమునుండి వచ్చినవారని నేను నూతనముగా సృష్టించినది గాదు. ఇదివరకు శ్రీయుత చిలుకూరు వీరభద్రరావు పంతుల వారు ఆంధ్రుల చరిత్ర మూడవభాగమునందు సహేతుకముగా వ్రాసిరి. సంశయము గలవారు అందులో చూడగలరు.

కీ॥ శే॥ కొమర్రాజు లక్ష్మణరావు పంతులవారు "చాళుక్యులు దాక్షిణాత్యులే" యను శీర్షిక క్రింద వ్రాసిన వ్యాసమునందు "చాళుక్య కదంబ రాష్ట్ర కూటాది రాజ వంశములు దాక్షిణాత్యులవే యని, కల్యాణపుర మేలిన చాళుక్య రాజపుత్రుల వంశమునుండి అన్హిల్ వాడ పట్టణపు రాజవృక్షముపై నంటునాటనైనది. రాజపుత్రస్థానమందలి సోలంకీలు, గుజరాతు సోలంకీల నుండి యుద్భవించినవారని, ఇంక రాజపుత్రస్థానమందు నివసించు చిన్నచిన్న సంస్థానాధిపతులు యావత్తు దాక్షిణాత్యులే యని వీరి కందరికి మొదట వాతాపి (బాదామి) అను పట్టణము రాజధాని యని వీరి మూలము, క్రింద వ్రాయు విధమున, అయిదు శాఖలుగా పరిణమించినదని వ్రాసిరి :

1. మూలము బాదామి రాజధాని. ఈ పట్టణము కర్ణాటక దేశమునం దున్నది. వీరి రాజ్యము క్రీ॥శ॥ 550 మొదలు 750 వరకు.

2. రెండవ వంశము చాళుక్య అనుపేరుతో వెలసినది. వీరి రాజధాని రాజమహేంద్రవరము. ఈ పట్టణము ఆంధ్రదేశ వేంగినాడులో నున్నది. క్రీ॥ శ॥ 610 మొదలు 1100 వరకు రాజ్యమేలిరి. వీరినే తూర్పు చాళుక్యు లనెదరు.

3. మూడవ వంశమువారికి కన్నడదేశమందలి కల్యాణపట్టణము రాజధాని. వీరు రమారమి 980 మొదలు 1200 ల వరకు రాజ్యము చేసిరి. వీరినే పశ్చిమ చాళుక్యు లందురు.

4. నాల్గవ శాఖయు అయిదవ శాఖయు గుజరాతు దేశము నేలిన చాళుక్యులు, నాల్గవ వంశమువారు క్రీ శ. 600 మొదలు 760 వరకు.

5. అయిదవశాఖవారు సోళంకులు అను పేరట "అన్హిల్‌వాడ" పట్టణము రాజధానిగా 940 మొదలు 1143 వరకు దొరతనముం జేసిరి. వీరి వంశీయులే రాజపుత్ర స్థానమునందును, బుందేల్ ఖండ్‌నందును, చిన్నచిన్న సంస్థానములను సంపాదించుకొనిరి. కన్నడదేశమునందుగూడ తరువాతి కాలమునను ఈ చాళుక్యులు చిన్నచిన్న జమీందార్లుగా నున్నట్లు గానంబడుచున్నది. మధ్య హిందుస్థానమునందు "రీవా" యని యొక రాజపుత్ర సంస్థానము కలదు. అచ్చటివారు సోళంకులలోని బఘేళ్ అను శాఖవారు. గుజరాతునుండి వచ్చిన వారే". పై వ్యాసము శ్రీ పంతులవారు అనేక ఆంగ్లఐతిహాసికుల ప్రమాణములతో వ్రాసి దేశీయులకు అపూర్వసంగతులను తెలిపిన వారైరి.

నే నిదివరకు కాపులనువారు "కాంపిల్య" లను దేశమునుండి దక్షిణాపథులై మన ఆంధ్రదేశమునకు వచ్చి ఇక్కడ బస్తీలు నిర్మించి రాజ్యస్థాపనము చేసినవారని వ్రాసినది. పై పంతుల వారి సిద్ధాంతము వలన దక్షిణమునుండి ఉత్తరము బోయి రాజవంశము వారు రాజ్యస్థాపనము జేసినారని తెలిపినందుకు బాధకమని చదువరులకు తెలియగలదు.

నా అభిప్రాయమునకు శ్రీ పంతులవారి వ్యాసము ఎంతమాత్రము బాధకము గాజాలదు. వారు క్రీ.శ. 550 మొదలు 1143 వరకు బాదామి వంశపు చాళుక్యులు ఉత్తర దేశమునకు బ్రాకి అప్పటి రాజధాని నియమించినారని వ్రాసినందుకు ఆశ్చర్య మేమియు లేదు. క్రీ.శ. 500 కంటె పూర్వము ఉత్తరదేశము నుండి వచ్చినవారే, మొదలు కర్ణాటక దేశముననుండు బాదామి పట్టణమును నిర్మించి రాజదానిగా ఏర్పాటుఁ జేసినవారు. తరువాత వారి శాఖలవారే ఆంధ్రమున చోడ, చాళుక్యుల పేరుతో రాజమహేంద్రవరము మొదలైన రాజ్యములు స్థాపించినవారు. మొదట దక్షిణాపథము వచ్చినవారు ఉత్తరదేశము అరాజకము అయిన తరువాత వారు తిరిగి పోవుట కభ్యంతరమేమియులేదు. అథవా ఇక్కడి రాజ్యాధికారము వలన ప్రబలి అక్కడి రాఁజులను ఓడించి ఆక్రమించుటకు వెళ్ళినారనిరను సందేహమేమియులేదు.

శ్రీ పంతులవారు ఇదే వ్యాసమునందు చాళుక్య పద విమర్శనము జేయుచు చాళుక్య పదము తరువాత సంస్కరింపబడినదని మొదలు ఈ పదము సల్కి, చాలుక్య, తరువాత చల్క్య, పిమ్మట చలిక్య రూపమై ఏడవ శతాబ్దమువరకు చలుక్య, తదనంతరము చాళుక్య, దీని రూపాంతరమే చాళుక్య తొమ్మిదవ శతాబ్దమువరకు నిలిచిపోయినదని అనేక శాసనముల వలన సమగ్రముగా సప్రమాణముగా తెలిపిన సంగతి ఎంతమాత్రము సంశయాస్పదము గాదు. వీరి కులమును గురించి పేరును గురించి శ్రీ పంతులవారు సల్కిపదమునకు ఇన్ని మార్పులు యెందుకు గలిగినవని ఆలోచించుచు తుదకు వారు నిశ్చయించి వ్రాసిన అంశములు కొన్ని పరిశీలించదగినవి.

చాళుక్యుల యుత్పత్తిగాథలు దక్షిణమునందు ఒక విధముగా ఉత్తరమునందు మరియొక విధముగాఁ జెప్పుచున్నారు. వీరు రాజ్యము స్థాపించిన తరువాత "సల్కి" పదము సంస్కృతపదము గానందుకు గౌరవము లేనందున పండితులచే ఇష్టము వచ్చినట్లు సంస్కృతపదము వలె మార్పించిరి. ఈ ఉత్పత్తికి తగినట్లు గాథలుగూడా ఎవరికిష్టము వచ్చినట్లు వారు కల్పించిరి వీరి రాజ్యమునందు ఆస్థానపండితులు "రాజానుమతోధర్మః" అను లోకోక్తి ప్రకారము సూర్యవంశపు క్షత్రియులు చంద్రవంశపు క్షత్రియు లనుట కారంభించిరి. కాని అసలు వీరు అనగా చోడ, చాళుక్యులు కాఁపు (శూద్ర) కులజులని రెండు ప్రబల ప్రమాణములిచ్చి వ్రాసినారు. ఆ ప్రమాణములివి :

1. బిల్హణుఁడు విక్రమాంక దేవచరిత్రమునందు
   వారి వంశాభివృద్ధిని గురించి వ్రాయుచు

శ్లో॥ క్రమేణ తస్మాదు దయాయ
వంశః శౌరేః పదా ద్గాంగ
ఇవప్రవాహః.

ఈ శ్లోకమునందు బిల్హణుఁడు స్పష్టముగాఁ దెలియకుండ, ధ్వనిమూలకముగా దోచునట్లు ఈజాతి వారు విష్ణుపాదమునందు పుట్టిన గంగాప్రవాహము వలె (పాదోద్భవులు, గంగ, శూద్రులు) క్రమముగా కథానాయకునివలన వృద్ధిఁజెందుదురని నుడివినాడట. ఇక్కడ గంగను పోల్చుటవలన వీరు శూద్రులని తాత్పర్యము

2. అరవమునందు దివాకరమ్. అను పేరుగల కోశముగలదు. ఇది తొమ్మిది. ఎనిమదవ శతాబ్ది ప్రాంతపుది. దీనియందు "చళిక్యవెందర్" "వేళకులఅరసర్" అనగా చాళుక్యరాఁజులు కాఁపుఁ శూద్ర కులమువారుగా వ్రాసియున్నదని మొదలు నొక్క జాతివారేకాని దేశభేదములనుబట్టి పేళ్లు. మారుట సంభవించినదని వ్రాసిరి.

పై అప్రతిహత ప్రమాణములు హేతువులగుట చేత చాళుక్య, రాష్ట్రకూట, హోయసళ, చోళ, పాండ్య, చేరాదులందరిని పూర్వపండితులు కాఁపు

వారని చెప్పినందున శ్రీయుత పంతులవారు తమ వ్యాసములోనూపి తమ అభిప్రాయము నిచ్చినందుకు, నేను వారితో సర్వదా ఏకీభవించుచున్నాను. కాని శ్రీపంతులువారు పూర్వపండితుల వతుకాపు పదము శూద్రవాచకమని లక్ష్యమునందుంచి వారు ప్రబలి పరాక్రమవంతులైన తరువాత తాము క్షత్రియులమని చెప్పుకొనసాగిరి. వారి ప్రోత్సాహముచేత ఆస్థాన పండితులు వారిని శూద్రజాతివారనక సూర్యవంశమని, ఇక్ష్వాకుల వంశమని చంద్రవంశమని వారి సంతోషార్థము వ్రాసి ఒకానొక సమయమునందు యథార్థము స్పష్టముగా దెలియకుండ ధ్వనిమూలకముగా దోచునట్లు వీరి శూద్రత్వమును దెలిపినారని, ఈ భేదవ్రాతలకు కారకులు రాజులే[1]యని వ్రాసిన దానితో నేనేకీభవించను.

శ్రీ పంతులవారికి పై విధమైన నిశ్చయము నాలుగు కారణములవలన కలిగినది :

1. కాపు కులమువారే రాజులైనందున.

2. కాపు పదము తెలుగు నిఘంటువులయందు శూద్రవాచకమైనందున.

3. ఒక వంశమునే కవులు, పండితులు, ఒకసారి క్షత్రియులని, మరియొకసారి చతుర్థాన్వయులని వ్రాసినందున.

4. 'ఇక్ష్వాకూణా మయం వంశస్యు మిత్రాంతో భవిష్యతి.' కలియుగమునందు క్షత్రియ వంశము నశించినదని ప్రమాణము. పురాణాదులయందున్నందున.

ఈ విషయములు నే నిక్కడ విపులముగా చర్చించదలచుకొనలేదు. ప్రకరణము (?) నందు సక్రమముగా ఈ భేదమునకు కారణలేవని చూప దలచినాను. కాని, సమాజములో బ్రాహ్మణ, కోమటి, గొల్ల, కమ్మరి, కుమ్మరి, సాలె, చాకలి, మంగలి, మాల, మాదిగ ఇట్లు అనేక జాతులున్నను శూద్రజాతిగా పేర్కొనబడినవారిలో ఒక కాపుజాతివారే రమారమి రెండువేల సంవత్సరములనుండి ప్రబలి అవిక్రమ పరాక్రమవంతులై సామంత, స్వతంత్ర, సమ్రాట్ స్థాయి రాజులైనారా? అయితే యెందుకు? అని చదువరులు గమనించదగిన విషయములు.

కాపుల ముఖ్యవృత్తి వ్యవసాయము. ఇది అందరికి తెలిసిన విషయమే. కాని, వ్యవసాయ వృత్తి భేదములు రెండు విధములుగా నున్నదని పండితులు పరిగణించి చూపదలచలేదు.

భూమిపై స్వామిత్వము బొంది అనగా భూస్వామియై తాను వ్యవసాయము స్వయముగా జేయనిది లేక రెండోవారికి కౌలుకిచ్చి చేయించునది. ఇదొక విధమైన వ్యవసాయ జీవనము. ఇక రెండవది : తాము భూమిపై స్వామిత్వము బొందక యితర భూస్వాములవద్ద కౌలుకు తీసుకొని సేద్యము చేయునది. మొదటి విధమైన వ్యవసాయాధార జీవనమునందు మన ఆంధ్రదేశమున యిదివరకు చెప్పిన ప్రధాన కాపు శాఖకు జెందిన రెడ్డి తెగవారిలో అనేకులు భూమిపై స్వామిత్వము బొందియున్నారన్నది నిర్వివాదాంశము గదా?

భూమిపై స్వామిత్వము బొందిన జాతిని గురించి అమరకోశము (క్రీ. శ. ప్రథమ శతాబ్ది), తదితర

---

1. లక్ష్మణరాయ వ్యాసావళి, ప్రథమ సంపుటము, విజ్ఞాన చంద్రిక గ్రంథమాల 31. పు 55 నుండి ఇందు క్లుప్తముగా చూపనైనది. ఆంధ్ర పాఠక లోకము ఈ వ్యాసరాజమును సంపూర్ణముగా చూడదగినది. కీ॥ శే॥ లక్ష్మణరావు పంతులవారు ఈ వ్యాసము వ్రాయుటయందు అనేక శ్రమలకు పాల్గొని దివ్యమైన ప్రమాణములచే వ్రాసినందుకు ఆంధ్రులెన్నియో కృతజ్ఞులు చెప్పవచ్చును.

పూర్వ గ్రంథములు ఏమి వ్రాసియున్నవో తెలుసు కొనవచ్చును గదా!

ప్రతి జాతికిని వృద్ధిక్షీణము లున్నవి గదా? మొదలు కూలిజేసేవారిని గురించి విచారింతము వీరు నిత్యము రెండణాలు సంపాదించినప్పుడు బీదవా రనియు, తర్వాత నిత్యము రూపాయ రెండు రూపా యలు సంపాదించినప్పుడు తమ వృత్తియం దత్యు న్నత దశ బొందుచున్నవారని యనెదరు. వైశ్యు లలో నంగడియందు వెల్లుల్లిపాయ లమ్మువా రతి హీనదశవారు (బీద కోమట్లు) సువర్ణాది లోహము లను, వజ్ర వైడూర్యాది రత్నముల నమ్మువారిని గొప్ప సాహుకార్లని యనెదరు.

రెడ్లలో నొకటి రెండెకరముల నేల గలవారిని బీదకాపులని యందురు వీరే స్వయముగా హల పాణులగుదురు. 50 ఎకరముల నేలగలవారు 4 గురు జీతగాండ్రను బెట్టుకొని యిర్వదిపసులతో వ్యవ సాయము సేయుదురు వీరు కాపులలో గొప్ప. 100 ఎకరముల నేలయుండుట తోడనే యొక గ్రామాధి కారియై యొక లెక్క వ్రాయువాడు (గుమాస్తా) గలిగి, దాసదాసీ బృందములతో నుండి రెడ్డియని పించు కొనును. ఇంక భూవైశాల్య మైన కొలది జమీందారు (దేశముఖు), మండలాధిపతి, రాజు, రారాజు వరకు వృద్ధిబొంది గోవృషభాది జంతువు లకు బదులు క్రమక్రమేణ గజతురగాదిజంతువులేగాక (ఆవిరి యంత్రములు మోటార్లు) మొదలైనవి గలు గును. యోగ్యత కొలది సిరి, సిరి నుండి పదవి; పూర్వమార్గము ననుసరించి మారుట, అన్ని జాతు లందున్నది. ఆశీర్వచన పనసవల్లించినవారు సామాన్య విప్రులుగదా? పరాయతము వరకు వల్లిం చిన వారవధానులు. మహాభాష్యాది వ్యాకరణ శాస్త్ర ములను పఠించినవారు పండితులు. తర్కమీమాం సాది శాస్త్రములయందు తీర్ణులైనవారు శాస్త్రులు. వాఙ్మయము నందు ప్రకృతి తత్త్వమును జూపించు వారు కవులు. నూరులనిపించుకొని నటులే కాపులే రెడ్లు జమీందారులు రాజులు, రారాజుల గుట సహజము ప్రతిజాతి యత్యున్నత దశయందున్నను నీచదశయందున్నను; ఆయాజాతి సహజస్వభావము యాజాతికి జెందిన వారిలో 3 పాళ్ల జనులందు గోచ రించును. శుచి, శీలము, ఉష్ణాంబుస్నానత్వము సాధా రణ విప్రులు మొదలుకొని పండితులైన బ్రాహ్మ ణోత్తముల వరకుండును వైశ్యులలో బీదకోమటి మొదలుకొని గొప్ప సాహుకార్లవరకు యుక్తియొకే తీరుండును, రెడ్డి సంబంధమైన బీదకాపులందు కూడ అతిధి సత్కారాది యౌదార్య సద్గుణము లుండి తీరును. అనేక జాతులకు వేరువేరు నామము లున్నను వ్యవసాయము సేయు వారెందరో తాము కాపులమని చెప్పుకొను చున్నారు. కాని వీరు పిల్లికి బిచ్చము పెట్టరు. భట్టు, బట్టు పదము లొక్కపోలిక యున్నను స్వాభావము నందెంతయంతర మోయంత యేయని దలంచవలయును. కాపువారి నామాంతరము గృహస్థుడు. (గృహపతి) ఇందు చేతనే వీరిని సంసార్లని యనుట గలదు. అయితే యితర జాతుల వారు గృహస్థులుగారా? దారా పుత్రాదులు గల వారందరు గృహపతులే; సంసార్లే; కుటుంబీకులే. కాని వీరికి ప్రత్యేకించి మన యాంధ్ర దేశమున సంసారి (గృహస్థుడు)యని యనుట యెందులకో? రాణి యనగా భార్యయని సామాన్యర్థమిచ్చును. కాని ప్రత్యేకించి రాజు భార్యను రాణియనుట సహజము గదా? తద్వతే యేదోయొక విశేషమునుబట్టి సంసారి

(గృహస్థుడు) వీరి కులనామ మైనది.[1] "సత్త్రీగృహపతి స్సమౌ, సత్రంసదాదానమస్యాస్తీతి"[2] సత్ర మనగా సదాదానము. అది గలిగినవాడు. గృహస్యపతిః గృహపతిః గృహమునకు ప్రభువు సదాదానము సేయువాడు, క్షత్రియ వర్గలో గృహస్థుని జెప్పుటకు క్షత్త్రియులే గృహస్థులని యమరసింహుని అభిప్రాయము. ఎందుకనగా రాజులకు దేశమే గృహము ప్రజలే వీరి పుత్రులు కావున రాజునకు పర్యాయ పదము గృహస్థుడనుట సార్థకముగా నున్నది. ఈ జాతి వారెన్ని సగుణ సంపదలు గలిగియున్నను విద్యా విహీనత వలన కాలక్రమేణ తమ పదవులనుండి తొలఁగుటయే గాక తమ యథార్థకుల నామముల గూడ మఱచిపోయిరి. సంసారియను పదమునకు తొల్లిఁటి యాంధ్రరాజులు విశేషముగా తమ శాసనములయందు "కుటుంబినః" అను పర్యాయ పదముతో వ్రాయించినారు. అమర కోశశిలా శాసనాదియాధారములేగాక నింకకొన్ని యుదాహరణము లిచ్చుచున్నాను - గుజరాత్ ప్రాంతపు చిన్న చిన్న సంస్థానాధి పతులు తాము క్షత్రియుల మని జెప్పుటయేగాక గరాసియోలమని కూడ చెప్పుదురు. గరాసియా పదము గృహస్థ అపభ్రంశము. ఆంధ్రమున గృహస్థునికి గేస్తుయని చెప్పినట్టుగా నున్నది. శ్రీ శుకుడు నిమిరాజ వంశమునుఁ జెప్పుచు "వీరు మైథిలురగు రాజులని జెప్పంబడుదురు. యోగీశ్వర ప్రసాదంబున గృహస్థులై యుండియు, బంధ నిర్ముక్తులై యాత్మజ్ఞానంబు గలిగి నిరంతర బ్రహ్మాను సంధానంబు సేయుచు నుండుదురని" వ్రాసియున్నది. (చూ. భాగవతము, స్కంధము 9, భవిష్యద్రాజేతిహాసము) గృహస్థు (గృహపతి)ని గురించి యమరసింహుడు క్షత్రియ పరముగా జూపెను. ఆంధ్ర శబ్దరత్నాకర నిఘంటుకర్త బ్రాహ్మణ పరముగా జూపుచున్నాడు. ఉచితానుచితముల చర్చ పాఠక మహాశయులకే విడుచుచున్నాను.

1. ఉండి తిన్నను లేక వస్తున్నఁగాని, యాస సేయవు పరుల కష్టార్జితంబు నాఁకలెత్తగ నీ పంచకరుగు నతిథి. తినక ద్రావక పోయిన దినములేదు. (చూ. 'కృషీవలుడు.' గ్రంథకర్త శ్రీయుత దువ్వూరి రామిరెడ్డిగారు).

2. చు. క్షత్రియ వర్గ. అమరకోశము.

# నవభారతి

## సాహిత్య. సాంస్కృతిక మాసపత్రిక

ఫిబ్రవరి, 1980

సంపాదకులు:
చదలవాడ పిచ్చయ్య

మూల్యం : రెండు రూపాయలు

నవభారతి కార్యాలయము
3-4-1008/1, బర్కత్‌పుర
హైదరాబాదు - 500 027

# విషయ సూచిక



నవభారతి
సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

సంపుటి 8] హైదరాబాదు ఫిబ్రవరి, 1980 [సంచిక 4

# నేటికైనను గుర్తించగలరా ?

ఎన్నికలు జరిగినవి. ఎన్నికల ఫలితములు ప్రకటింపబడినవి. ఈ ఫలితములు ఈ విధముగా సమకూరునని తెలియనివారే నేటి విద్యావంతులలో అగ్రగణ్యులుగా లెక్కింపబడు చున్నారు. ఈ దేశంలోని ఆంగ్ల పత్రికలన్నియు ఈ తరగతికి చెందినవే. ఈ దేశములోని ఆంగ్ల విద్యా సంస్థలలోని వ్యక్తులందరూ ఈ తరగతికి చెందినవారే. ఇవి నేటి మన విద్యా విధానములోని అవ్యవస్థకంతటికి కారణమని గ్రహించవలయును.

స్వతంత్రము వచ్చినది. జాతీయ విద్యకు రూపకల్పన యనునది ఏర్పరచబడి యున్నది. మనము ప్రజాస్వామ్య వ్యవస్థను మాత్రము రూపొందించుకొను చున్నామని భావించబడు చున్నది. ఆంగ్లేయ విద్యద్వారా ప్రజాస్వామ్య వ్యవస్థను మనము పదిలపరచుకొన గలమా ? లేమా ? అని ఒక్కరూ చర్చించరు. ఇందుకు కారణ మనునది యున్నది ఆంగ్లేయ విద్యపై కోట్లకొలది ధనమును వెచ్చించు చున్నాము. ఆంగ్ల భాషద్వారా మన పరిపాలనా వ్యవస్థను నడుపుకొనుచున్నాము. మన ప్రజలలో నూటికి 90% మందికి ఆంగ్లేయ విద్యయందు ఆసక్తి లేదు. ఆంగ్ల పద్ధతి పరిపాలనయందు ఆసక్తి అంతకన్నను లేదు. అయినను ఆంగ్ల భాషయే మన పరిపాలనకు ప్రయోజనమును సమకూర్చుచున్నదని ప్రజాస్వామ్య ప్రతినిధులైనవారే బహిరంగ ప్రకటనలు చేయుచున్నారు. ప్రజాస్వామ్య విధానమును పరాయి భాషలో ప్రవచించి జాతీయ భాషయందాసక్తి కలుగకున్నదని వాపోవు ఆంగ్లభాషా దాస్య భావుకులను ఏమన వలయునో ప్రజలకు తెలియకున్నది.

భారత దేశములో పలువిధములైన భాషలను మాట్లాడువారు నివసించు చున్నారని అందరికిని తెలియును. భారతీయులందరిని జాతీయ భావోద్దీపనకు, జాతీయ సమైక్యతకు తోడ్పడునటుల చేయునది జాతీయ భాషయా? లేక పరాయిదేశస్థులు భారతీయులపై రుద్దిన ఆంగ్ల భాషయా ? ఏది జాతీయ జీవనమును సుఖముగా అర్థవివరణచేసి చెప్పుటకు తోడ్పడునో దానిని విడిచి ఆంగ్లవిద్యకే అగ్ర గణ్యతను కల్పించి తమ ఆధిక్యతను తాము కాపాడు కొనుటకై విశ్వప్రయత్నము చేయుచున్నారని గ్రహింపవలసియున్నది.

స్వతంత్రానంతరము కోట్లకొలది ధనమును వెచ్చించుచు నేటివరకు జాతీయ విద్యలకు ప్రాధాన్యమును కల్పించక ఆంగ్ల విద్యకే ప్రాధాన్యతను కల్పించు విధానమును ప్రజాస్వామ్యమని ఎటుల అనవలయునో ప్రతి పౌరుడు ప్రశ్నించుకొని సమాధానమును చెప్పుకొను సమయమాసన్నమైనదని గ్రహించుకొనవలయును.

ప్రజాస్వామ్యములో ప్రతినిధులుగా ఎన్నుకొనబడిన వారే పౌరులని గుర్తించుకొనవలయునా? లేక ప్రతినిధులు కానివారందరు పౌరులేనని గుర్తించుకొన వలయునా? పౌరధర్మమును విధించవలసిన బాధ్యత జాతీయ విద్యకు కల్పించ వలయునా? లేక ఆంగ్ల విద్యావంతులైన వారే అగ్రగణ్యులైన పౌరులుగా గుర్తించుకొన వలయునా? మరి ఏమనుకొనవలయును? ఈ విధమైన ప్రశ్నలన్నింటికి సమాధానము ఎవరు చెప్పగలరు? ఆంగ్ల విద్యయే అధికమైన విద్యగా గుర్తించిన పరిపాలకుల పాలనా సౌష్ఠవమును ప్రజాస్వామ్యమనుకొనవలయునా? ప్రజాస్వామ్య మనగానే ప్రజలు ఏమను కొనవలయును?

ప్రజాభిప్రాయమును ప్రజలభాషలో పౌరధర్మమును గుర్తించి పాలనా విధానమునకు శక్తిసంపన్నతలను సమకూర్చు విధమున జాతీయభాషలలో దేనినో ఒకదానిని మనము నిర్ణయించుకొని దానిని ఆచరించుటకు మనము ప్రయత్నించవలయునా? లేక ఏమి చేయవలయును? ఈ విధమైన ప్రశ్నలకు నేటి ప్రజాస్వామ్య విధానములను గురించి వివరించు వారికి తెలియక ఆంగ్లభాషయే అన్ని సమస్యలను పరిష్కరించ గలదనుకొని జాతీయ సమైక్యతా విరుద్ధమైన ఆంగ్లేయ దాస్యభావ వివేకమును ప్రశ్నించుకొనుచు కాలయాపన చేయుటలోని ప్రజాస్వామ్య విధానములోని ఔచిత్యమును వివరించి చెప్పవలసిన సమయము ఆసన్నమైనదని గ్రహింపవలయును.

మనజాతికి గొప్ప సంస్కృతి యున్నది. విజ్ఞానమనునది యున్నది. సామాజిక జీవన అత్యమనునది యున్నది. సమాజ నియమములను సమాజమునకు ప్రతినిధులైనవారు క్రమ విధానము ననుసరించిన నడవడికను తీర్చిదిద్దు సంప్రదాయమనునది యున్నది. వ్యక్తిగతమైన నడవడికను, సామాజికమైన నడవడికను విస్పష్టముచేసి వ్యక్తి జీవనమును గృహజీవమునకు ప్రధానముచేసి సామాజిక జీవనమును వృత్తులకు ప్రధానముచేసి పరస్పర సహకారముతో ఈ రెంటిని సమన్వయ పరచిన ఉత్తమమైన సామాజిక జీవన విధానమనునది మనకు అనువంశికముగా ఏర్పడి యున్నది. వ్యక్తిజీవన మనునది ప్రత్యేకమైన పరిధులలో నిర్వహించుకొనవలయునని స్పష్టపరచ బడినది. సమాజములోని వ్యక్తికి జీవనమనునది పూజ్యమని స్పష్టీకరించబడి యున్నది. సమాజంలో వృత్తి సంబంధములను నిర్వహించుకొనుచు వ్యక్తిజీవనమునకు కావలసిన సదుపాయములన్నింటిని వినియోగించు కొనవలయునని చెప్పబడి యున్నది. కుటుంబ జీవనమును అనుభవించుటకై ఏర్పడిన ఆచరణకు సంబంధించినదని ఈ కుటుంబ జీవనమునకు సంబంధించిన సదుపాయములను సమకూర్చుటకై సామాజిక సంబంధములనునవి ఏర్పడినవని [illegible] చేసి యున్నదని గ్రహించవలయును. ఈ విధమైన విద్యావివేకములను నేటి ఆంగ్లవిద్య

మనకు సమకూర్చి పెట్టలేకపోయినదని చెప్పుచు దానిని విడువలేక విడువలేక ఈ దేశములోని పార్టీలన్నియు సతమతమై పోవుచు ప్రజాస్వామ్యము ప్రజాస్వామ్యము అని వల్లెవేయుటలోని అంతరార్థము విపులీకరించి చెప్పుమని ప్రతిరాజకీయ పార్టీలోని ప్రతివ్యక్తిని నిలబెట్టి సమాధానము చెప్పవలయునని ప్రశ్నించి అడుగవలసిన సమయమాసన్నమైనదని గ్రహించవలయును.

మన సమాజములో భిన్నభిన్నములైన వృత్తిధర్మములనునవి యున్నవి. ఈ వృత్తులను నిర్వహించుకొను వారికి వివిధమైన వివాహ వ్యవస్థలనునవి యున్నవి. ఈ వివాహ వ్యవస్థలలో ఏది ఉత్తమమైనదని విశదీకరించి చెప్పవలయునో దానికి సంబంధించిన విషయవివరణ యనునది ఆంగ్లవిద్యలో ఎంత వెదకినను కనిపించనిదై యున్నదని గ్రహించవలయును. ప్రజలకు భిన్న భిన్నమైన అభిరుచులు ఉన్నవని ఈ భిన్నభిన్నమైన అభిరుచులు గలవారు భిన్న భిన్నమైన వివాహ వ్యవస్థలు నిర్మించుకొని తమతమ జీవిత విధానములను తమ తమ కుటుంబముల ద్వారా నిర్వర్తించుకొను విధానమునే ప్రజాస్వామ్యబద్ధమైన మానవ విధానమని ఈ మానవ విధాన మునే మాన్యమైన విధానముగా భారతీయులు ఎన్నడో గుర్తించి ఆ గుర్తింపుకు అనుగుణ ముగా ప్రవర్తించినటుల స్పష్టమైన విధానమును పరిణామముద్వారా విస్పష్టముచేసియున్నారని గ్రహించని కారణమున ఆంగ్లేయ విద్యకు, ఆ విద్యా విధానంలోని భావమునకు దాసులై భారతీయులను సైతము దానికి బానిసలుగా చేయు ప్రయత్నము ఏవిధమైన ప్రజాస్వామ్యమని వివరించవలయునో సమాధానము చెప్పలేని ఈ బానిస విద్యాకోవిదులైన ఆంగ్లమానస పుత్రు లను మనమేమని ప్రశ్నించి సమాధానము పొందవలయునో ఆలోచించుకొని నిర్ణయించుకొన వలసిన సమయ మాసన్నమైనదని గ్రహించుకొన వలయును.

1971 ఎన్నికలలో ఇందిరాగాంధికి విజయము సమకూర్చినది సామాన్యప్రజలే. 1977లో ఇందిరాగాంధికి అపజయము సమకూర్చి పెట్టినది సామాన్యప్రజలే. 1980 ఎన్నిక లలో ఇందిరాగాంధికి అత్యంతమైన నెగ్గింపు నిచ్చినది సామాన్యప్రజలే. సామాన్యప్రజల నిర్ణయమే ప్రజాస్వామ్యముగా గుర్తించబడుచున్నదని మన ఎన్నికల ఫలితములే మనకు నిర్ణయము చేసి చెప్పుచున్నవి. ప్రజాభిప్రాయమే ప్రజాస్వామ్యమునకు పునాది అని గ్రహిం చని కారణమున ఆంగ్ల పత్రికా సంపాదకులు, ఆంగ్లమానసపుత్రులు, పార్టీల అధినేతలు సమాధానము చెప్పగలరో లేదో ఆలోచించి నిర్ణయమునకు రావలసిన సమయ మాసన్నమైన దని గ్రహించవలయును.

ఎన్నికలలో గెలుపు ఓటమిలనునవి సహజములని గ్రహించవలయునని, గెలిచిన పార్టీ గొప్పదని ఓడినపార్టీ తక్కువ స్థాయి కలదని అనుకొను విధానము ప్రజాస్వామ్యమైన విధానము కాదని గ్రహించుకొనవలయును. ఈ సామాన్యమైన గ్రహింపులేని ఆంగ్లవిద్యావంతుల విధానము లను పోషించుటకు ప్రజలసొమ్మును కోట్లకొలది వెచ్చించుటలోని ఔచిత్యమును నేటికైనను గుర్తించగలరా ?

# ఆ వా హ న

కె. ఎస్. రమణ

రా ...
రాగ ప్రదీపికా
నయనమోహన జ్వాలికా
అనంతచిత్త చిత్ర అనుభూతిమాలికా
నా జీవన తిమిర కుటీర ప్రత్యూషకాంతిగీతికా
నీ మంజీరాల ఘలంఘలలు
నా తనువులో పులకలు పూయిస్తూ
నీ చిరుహాస రోచిస్సులు
నా మనో కులాయంలోంచి
కిలకిల రావాలతో రెక్కలు చాస్తూ
రా ప్రేమరాశీ
నిశ్శబ్దానికి మాటలు నేర్పుదాం
ప్రణవ వల్లికి ప్రణయ రాగాలనుపల్లవిద్దాం
రా రుతువుల రాణీ
వాసంత వసనాన్ని ధరించి
వెన్నెల పారిజాతాల్ని వెదజల్లుతూ
మన అస్తిత్వం ఆనందంగా
విశ్వానికి అలంకారంగా
రమిద్దాం తారానికుంజాలలో
గమిద్దాం దిగంతాలలోకి
విస్ఫురిత అణుజనిత సౌందర్యమా
చైతన్య తాండవమా
సృష్టి రహస్యమా
తరలిరా
తమో హృదయాల్లో
వుషోదయాల్ని విత్తుదాం
అనురాగ సస్యశ్యామల విశాల
మనోసామ్రాజ్యాలని నిర్మిద్దాం
స్వప్న స్నిగ్ధ సుప్తనయనాలను
మరో ప్రపంచంలోకి తెరిపిద్దాం
రా తేజస్వినీ
చుక్కలూ దిక్కులూ
సూర్యుడూ చంద్రుడూ
నువ్వూ నేనూ
వొక్కటైన చేతనలో
కాలాలూ దూరాలూ
కరిగిపోయిన వాస్తవంలో
మన డెందం ఆనందం అభేదించి
మనరూపం ప్రకృతిస్వరూపం అద్వైతించి
సురత రసాస్వాదనలో
ఆస్వాదకులమై
రసమూర్తులమై
పరిపూర్ణులవుదాం, రా
మనం కలిసేవున్నాం.

# ఠాకూరు - తోటమాలి

## అనువాదం : శ్రీలక్ష్మి

(21)

ఉదయ సంధ్యలో. అతను నా ముంగిట్లోకి ఎందుకు వచ్చెనో ?

నేను వెలుపలకు వచ్చినప్పుడల్లా అతను అగుపిస్తాడు, నన్ను అతను చూస్తాడు. అతనితో మాటాడాలో, మౌనంగా వుండాలో నాకు తెలియదు. అతను నాకుటీరానికి ఎందుకు వచ్చెనో ?

శ్రావణ మేఘాలు దట్టంగా కమ్ముకుంటాయి, శిశిరంలో ఆకాశం నిర్మలంగా వుంటుంది. వసంతంలో మలయ పవనుడు చల్లగా వీస్తాడు.

నిత్యనూతనంగా అతను గీతాలు ఆలపిస్తాడు నా పని అలాగే వదలి చూచాను. నా కన్నులకు మాయ కమ్మింది. అతను నా ముంగిట్లోకి ఎందులకు వచ్చెనో ?

(22)

వడిగా ఆమె నన్ను దాటి పోయినప్పుడు ఆమె చీర కొంగు నన్ను తాకింది.

తెలియని హృదయాకాశము నుండి ఒక తీయని మమత విరిసింది.

గాలికి కొట్టుకుని పోయే పూరేకు వోలె, నా హృదయం స్పందించింది.

ఆమె మూగ ఎదలోని ఊరుపు నా ఎదను తాకింది.

(23)

ఏటి గట్టున కూర్చుని, హేలగా గాజులు శబ్దం చేస్తున్నావు ఎందుకని ?

నీ కలశం నింపుకో ఇంటికి వెళ్ళే సమయం అయింది.

ఏటి నీటిని నీ చేతులతో హేలగా కలచుతూ, బాటవైపు ఎవరి కోసం చూస్తున్నావు ? నీ కడవ నింపుకుని ఇంటికిరా ఉదయం గతించి పోతున్నది. నీళ్ళు ప్రవహించి పోతున్నది.

అంగలు హేలగా తుళ్ళి పడుతున్నాయి. నవ్వులు విసరి పోస్తూ మబ్బులు కమ్ముకుంటున్నాయి. అవి నీ ముఖాన్ని అవలోకించి, హేలగా మందహాసం చేస్తున్నాయి. నీ కడవ నింపుకుని ఇంటికిరా.

(24)

నీ మనస్సులోని మాట నీలోనే వుంచుకోకు, చెలి నాకు చెప్పవూ, రహస్యంగా, నాకు ఒక్కనికే. నీవు ఎంత మృదువుగా నవ్వుతావు. నెమ్మదిగా చెప్పు, నా హృదయం వింటుంది.

చిమ్మ చీకటి రాత్రి, ఇల్లు నిశ్శబ్దంగా వుంది పక్షులు నిద్రిస్తున్నాయి.

నీ కన్నీటి గాథలూ, ఆనంద సమయాలూ, కష్టసుఖాలూ, నాకు చెప్పవూ !

(25)

'ఇటురా, యువకుడా, నీ కన్నులలో ఆ మత్తు ఏలనో చెప్పు.'

"తెలియరాని మధువును నేను గ్రోలితిని."

"సిగ్గు మాలిన పని"

"కొందరు జ్ఞానులు, మరి కొందరు అజ్ఞానులు,

కొందరు అప్రమత్తులు మరి కొందరు ప్రమత్తులు కొన్ని కళ్ళు నవ్వుతాయి, కొన్ని దుఃఖిస్తాయి. మరి నా కళ్ళు మాదకతను నింపుకున్నాయి."

"యువకుడా, చెట్టు నీడలో నిలబడుట ఏలనో చెప్పు"

"నా ఎద బరువుతో నా కాళ్ళు అలసిపోయాయి. అందుకే చెట్టు నీడలో నిలబడి వున్నాను"

"సిగ్గు మాలిన పని"

"కొందరు సాగిపోతారు. మరికొందరు తిరుగుతారు. కొందరు స్వతంత్రులు, మరికొందరు బంధితులు. మరి నా కాళ్ళు ఎద బరువుతో అలసిపోయాయి."

(26)

"నీ ప్రసాదాన్ని భక్తితో స్వీకరిస్తాను. ఇంక ఏమీ కోరను."

"అవును, నాకు తెలుసును, జడదారీ, నువ్వు సర్వస్వమూ కోరుకుంటావు."

"ఒక పుష్పాన్ని ప్రసాదిస్తే, పదిలంగా నా ఎదలో దాచుకుంటాను."

"ముళ్ళు వుంటేనో ?"

"ఓపికగా భరిస్తాను"

"అవును, నాకు తెలుసును, జడదారీ, నువ్వు సర్వస్వమూ కోరుకుంటావు."

నీ కమనీయమైన చూపు చాలును, శ్యామా." నన్ను అమృతుని చేస్తుంది.

"కోర చూపులు అయితేనో ?"

"అవి నా ఎదను గుచ్చుతాయి. భరిస్తాను."

"అవును, నాకు తెలుసును, జడదారీ, నువ్వు సర్వస్వమూ కోరుకుంటావు.

(27)

"ప్రేమను నమ్మకుము చెలీ, దుఃఖాన్ని ప్రసాదించినా కూడా, నీ ఎదను ఎప్పటికీమూసివేయవద్దు."

"లేదు, శ్యామా, నీ పలుకులు నాకు గోచరం కావడం లేదు "

"ఒక కన్నీటి బిందువుతో, ఒక విషాద గీతంతో నీ హృదయాన్ని నివేదించుకో, చెలీ."

లేదు, శ్యామా. నీ పలుకులు నాకు గోచరం కావడం లేదు."

"పద్మం, సూర్యుని సన్నిధిలో వికసిస్తుంది. తన సర్వస్వాన్ని తన స్వామికి అర్పించుకుంటుంది. మంచులో అనంతంగా మొగ్గగానే మిగిలిపోదు."

"లేదు, శ్యామా, నీ పలుకులు నాకు గోచరం కావడం లేదు."

28

కన్నులు విషాదంగా అన్వేషిస్తున్నాయి, దేవీ చందమామ, సంద్రపులోతులు కనుగొనవటుల నీవు నా భావాన్ని తెలుసుకోవాలని అభిలషిస్తున్నావు.

నీ ఎదుట అంతా స్పష్టంగా చూపాను, ఏదీ మరుగుపరచకుండా అందుకే నీవు నన్ను తెలుసుకొనలేదు.

అది ఒక విలువలేని రత్నమయిన, దానిని నూరు శకలాలుగా చేసి, దండగాగుచ్చి, నిన్ను అలంకరించి యుందును.

అది ఒక కోమల, సుందర, పుష్పం అయిన, దానిని నీ నీలికురులలో అలంకరించియుందును. కాని, అది హృదయం, చెలీ, దానికి తీరం ఎక్కడ?

ఈ సామ్రాజ్యపు ఎల్లలు నీకు తెలియవు. అయినప్పటికి నీవు దాని రాణివి. అది ఒక ఆనంద

ముహూర్తమయిన నవ్వులుగా వికసేసేది. ఒక్క క్షణంలో నీకు బోధపడేది.

అది ఒక బాధ అయిన, కన్నీటి వెల్లువలుగా జాలువారేది. అంతరాంతరాలలోని భావం బోధ పడేది.

కాని అది ప్రేమ, ప్రియతమా, దాని సుఖదుఃఖాలకు అంతులేదు. దాని కోరికలకు అంతులేదు. అది నీకు ఎంతో చేరువలో వున్నది. కాని సంపూర్ణంగా ఎన్నటికి తెలుసుకోలేవు.

(29)

ప్రియతమా, పలుకుము. నీ గీతానికి భావం తెలుపుము. అమావాశ్య నిశితారకలు మబ్బు తెరల మాటున దాగున్నాయి. గాలికి ఆకులు గలగలమంటున్నాయి. నా కురులు విరియబోసుకుంటాను. నా నీలి మేలి ముసుగు, రజనివోలె నన్ను ఆవరిస్తుంది. నీ తల నా ఒడిలో వుంచుకుని, ఈ తీయని ఏకాంతంలో నీ ఎదతో గుసగుసలాడతాను. నా కన్నులు మూసుకుని వింటాను. నీ ముఖంపైపు చూడను. నీ కబుర్లుఅయాక, మనం మౌనంగా కూర్చుందాము. చీకటిలో, ఆకులు మర్మరిస్తాయి రాత్రి గడచిపోతుంది. ఉషోదయం అవుతుంది. మనం, ఒకరి కళ్ళలోకి ఒకరు చూచుకుని, మనమార్గాల వెళ్ళిపోతాము. ప్రియతమా, పలుకుము. నీ గీతానికి భావం తెలుపుము.

(30)

నా కలలు వింగిలో తేలిపోవు నీలిమబ్బువు నీవు. నా వలపుతలపులలో నిన్ను నిత్యమూ రూపొందించుకుంటాను.

నీవే నేను, నా కలలలోని శ్యామా. నా ఎదలోని రాగముతో, నీ పాదాలు ఎరుపెక్కాయి. నా గీతాలలోని మూర్తివి నీవు. నా తీయని బాధలో నీ పెదవులు మధురిమలు అందుకున్నాయి.

నీవే నేను, నా కలలోని శ్యామా! నా విరహంలో నీ కన్నులు నైల్యములు నింపుకున్నాయి, నా కన్నుల లోని శ్యామా. నా గాన వాగురులలో నిన్ను పట్టి బంధించును. ప్రియతమా. నీవే నేను, నా కలలోని శ్యామా!

(31)

నా ఎద, శూన్యములోని పిట్ట, నీ కన్నులలో తన ఆకాశాన్ని కనుగొన్నది. శ్యామా. అవి ఉషాబాలకు ఊయల, తారామ తల్లులకు రసరాజ్యం.

నా పాటలు వానిలోతులలో లయించిపోతాయి.

నిశ్చలమయిన ఆ ఆకాశంలో నన్ను విహరించనీ.

ఆ మబ్బులలో పాడనీ ఆ వెలుగులో నర్తించనీ.

(32)

దివ్యప్రేమ

ఇది నిజమా, తెలుపుము ప్రియతమా ఈ కన్నులు మెరిసినప్పుడు, నీ ఎదలోని మబ్బులు కల్లోల పడతాయి.

తొలి ప్రేమ వోలె నా పెదవుల మధురిమలు చిలుకుట నిజమేనా?

మధుమాసపు తీయని జ్ఞాపకాలు నా అణువణువూ నింపుకొనుట నిజమేనా? నా ప్రతిపదము భూమాతను పులకింప చేయుట నిజమేనా?

నన్ను వీక్షించినప్పుడు రజని ఆనంద భాష్పములను రాల్చుట, ఉషాబాల తన వెలుగుతో నన్ను అలరించుట, నిజమేనా?

నీ ప్రేమ, యుగాలుగా, బ్రహ్మాండమంతా పయనించి, నన్ను వరించుట నిజమేనా నీ చిరకాల వాంఛ

నాలో తిరుట, నా పలుకులు, కన్నులు, కురులు, నీకు ముదము కూర్చుట నిజమేనా?

అయితే ఆ ఆనంద రహస్యం, ఈ నా చిన్ని నుదుటిపై వ్రాసివుండుట నిజమేనా? ఇది అంతయు నిజమా తెలుపుము ప్రియతమా.

(33)

ప్రియతమా, నిన్ను నేను ప్రేమిస్తున్నాను. నా ప్రేమను మన్నింపుము.

దారి తప్పిన పిట్టవోలె నేను చిక్కాను. నా ఎద కదిలింది, తెర తొలగింది; నీ దయతో నా ఎదను కప్పుము, ప్రియతమా నా తప్పును మన్నింపుము.

నీవు నన్ను ప్రేమించకపోయిన, ప్రియతమా, నా బాధను మన్నింపుము.

దూరాన వుండి నావైపు సందేహంగా చూడకుము. నేను నా ఏకాంత స్థలానికి పోయి, చీకటిలో వుంటాను.

నా అవమానాన్ని రెండు చేతులతో కప్పుకుంటాను.

నీ ముఖం నానుండి మరలించి, నా బాధను మన్నింపుము ప్రియతమా.

నీవు నన్ను ప్రేమించిన, ప్రియతమా నా ఆనందాన్ని మన్నింపుము.

నా ఎద ఆనందపు వెల్లువ వెంట వెడలిపోయిన, నా బేలతనాన్ని అపహాస్యం చేయకుము. నా ప్రేమ సింహాసనం పైన అధిష్ఠించి, నా ప్రేమలో నిన్ను శాసించినప్పుడు, దేవతవోలె నీకు వరాలు ఇచ్చినప్పుడు, నన్ను మన్నింపుము ప్రియతమా.

(34)

నాకు కనబడకనే వెడలిపోకుమా, ప్రియతమా.

రాత్రంతా చూచాను, నా కనులు నిదర బరువుతో మూతలు పడుతున్నాయి.

నేను నిదురిస్తున్న తరుణంలో నీవు వెడలిపోయెదవేమో, శ్యామా.

నాకు కనబడకనే వెడలిపోకుమా, ప్రియతమా చేతులు చాచి నిన్ను తాకాలని దేవులాడాను. నాలో నేను అనుకుంటాను. "ఇది కలా?" నా ఎదలో నీ కాళ్ళను చుట్టేసి, నా గుండెకు అదుముకొగలిగితే ఎంత బాగుంటుంది. నాకు కనబడకనే వెడలిపోకుమా, ప్రియతమా.

(35)

నిన్ను నేను ఎక్కడ సులభంగా కనుక్కుంటానో అని, నాతో ఆటలాడతావు. నీ కన్నీరు కప్పిపుచ్చడానికి, నీ నవ్వుల వెలుగులలో నా కన్నులు కప్పుతావు. నీ నాటకం నాకు తెలుసునులే, చెప్పాలనుకున్న మాట ఎప్పుడూ చెప్పవు నువ్వు. నిన్ను నేను ఎక్కడ లెక్కపెట్టవో అని, నన్ను తప్పించుకొని తిరుగుతావు.

జన సందోహంలో నిన్ను గమనించనేమో అని, నువ్వు పక్కగా నిలబడతావు. నీ నాటకం నాకు తెలుసునులే, నువ్వు నడయాడాలనుకున్న బాటలో ఎప్పుడూ పయనించవు.

నీవు అందరికంటె ఎక్కువగ కోరుతావు. అందుకే మౌనంగా ఉంటావు.

ఆటకోలుతనంగా, నా కానుకలు స్వీకరింపవు.

నీ నాటకం నాకు తెలుసునులే, నీవు కావాలనుకున్నది ఎప్పుడూ తీసుకోవు.

(36)

ఆతను గుసగుసలు పోయాడు, "ప్రియా, నీ కన్నులు ఎత్తుము, చూడుము"

నేను మందలించాను "వెళ్ళిపో" అని అయినా అతను కదలలేదు

అతను నా ఎదురుగా నిలబడి నా రెండు చేతులూ పట్టుకున్నాడు "నన్ను విడిచిపెట్టు" అన్నాను అయినా అతను పోలేదు.

తన ముఖం నా చెవి దగ్గరగా వుంచాడు. నేను అతని వైపు చూచి అన్నాను. "సిగ్గులేని పని" అని. అయినా అతను కదలలేదు. అతని పెదవులు నా బుగ్గను తాకాయి. నేను వణికి పోయాను. "నీవు చాలా చొరవ తీసుకుంటున్నావు" అన్నాను. అయినా అతనికి సిగ్గులేదు.

అతను నా తలలో పూవు వుంచాడు. నేను అన్నాను. "ప్రయోజనం లేదు" అయినా అతను కదలలేదు.

నా మెడలోని పూల హారం తీసుకుని అతను వెళ్ళిపోయాడు. నేను ఏడుస్తూ నా ఎదను అడిగాను. "అతను ఏల మరలిరాడు?"

(37)

కాంతా, నీ పూలదండ నా మెడలో వేయవా?

కాని నేను కూర్చిన పూలదండ అందరికొరకు; మేఘంవోలె అరుదుగా కనుపించువారికి, తెలియరాని సుదూర లోకాలలో నివసించు వారికి, కవుల గీతాలలో దాగున్న వారికి; నీ హృదయానికి మారుగ నా ఎదను కోరడం చాలా ఆలస్యం అయిపోయింది దేవీ. ఆనాడు నా జీవితం విరి మొగ్గవోలె తన పరిమళాలను తన కడుపులో దాచుకున్నది.

ఇపుడు ఆ సువాసనలు నలుదిశలా వ్యాపించాయి.

ఎవరికి తెలుసును, ఏ అపురూప దర్శనం తిరిగి ఆ పరిమళాలను నాలో చేర్చునో?

నా హృదయం నాదికాదు. ఒకరికి యిచ్చుటకు, అది పలువురిది.

(38)

ప్రియతమా, నీ కవి ఒకప్పుడు గొప్ప పురాణాన్ని భావించాడు. తన మదిలో. అయ్యో, నేను అప్రమత్తుడను కాలేదు నీ పాద మంజీరాలను తాకి ఆ భావన భగ్నమయింది.

ఆ సంగీతం ఖండ ఖండాలుగా నీ పాదాల దగ్గర పడివున్నది

నా భావాలు, సుఖదుఃఖాల అలలలో అణగారిపోయాయి.

ప్రియతమా. నా యీ ఓటమిని నీవు సరిచేయాలి.

నా మరణానంతరం నా కీర్తి శేషింపకపోయినా నన్ను జీవన్ముక్తునిగ చేయుము.

అప్పుడు నా ఓటమి నాకు దుఃఖాన్ని కలిగింపదు.

(39)

పూలమాల అల్లాలని పొద్దున్నంతా ప్రయత్నం చేశాను. పూలు నిలవడంలేదు. జారిపడిపోతున్నాయి.

నీ కంటి కొసలలో నుంచి దొంగగా చూస్తూ కూర్చున్నావు. నువ్వు అక్కడ. ఆ కొంటెకన్నులను అడుగుము కన్నా, తప్పు ఎవరిదో మరి.

నేను పాట పాడాలని అనుకున్నాను. కాని ప్రయోజనం లేదు.

కానరాని చిరునవ్వు నీ అధరాలపైన నాట్యం చేస్తుంది; ఆ కొంటె నవ్వును అడుగుము కన్నా, తప్పు ఎవరిదో మరి.

చిరు నవ్వులు చిందే నీ అధరాలను ప్రమాణం చేసి చెప్పమను-కమలాన్ని ప్రవేశించిన మధుపము

పోలె నా గొంతు మూగవోయిందని. సాయంకాలం అయింది పూవులు ముకుళించుకునే సమయం.

లాంతరు గుడ్డి వెలుగులో మౌనంగా నీ పక్కన కూర్చోడానికి అనుమతి ఇమ్ము ప్రభూ.

(40)

నేను సెలవు తీసుకొనుటకు నీ దగ్గరకు వచ్చినప్పుడు నీ కన్నులలో అవిశ్వాసం తొణికిసలాడుతుంది నేను ఎన్నో మారులు ఇలాగే చేశాను. అందుకే త్వరలో తిరిగి వస్తానని నువ్వు అనుకుంటావు నిజం చెప్పాలంటే, నాకూ మనసులో అదే అనుమానం వున్నది.

ఎందుకంటే, వసంతం మళ్ళీ మళ్ళీ వస్తుంది. నిండు చందమామ సెలవు తీసుకుంటాడు మళ్ళీ దర్శనం ఇవ్వడానికే. ప్రతి ఏడూ పూవులు వస్తూంటాయి.

అలాగే నేనూ తిరిగి రావడానికే వెడుతున్నానేమో.

కాని కాసేపు ఆ భ్రమ అలాగే వుండనిమ్ము వెంటనే దానిని నిర్దాక్షిణ్యంగా సాగనంపకుము.

శాశ్వతంగా సెలవు తీసుకుంటున్నాను అనినేను చెప్పినప్పుడు, అది నిజమని నమ్ముము, ఒక క్షణం విచారింపుము.

తరువాత,నేను మళ్ళీ తిరిగి వచ్చినప్పుడు సంబరపడుము.

(41)

నా మనసులోని మాట నీకు చెప్పాలనుకుంటాను; కాని నువ్వు నవ్వుతావని భయపడి, చెప్పను.అందుకే నాలో నేను నవ్వుకుని, నా రహస్యాన్ని అణచుకుంటాను.

నా బాధను తేలికగా అనుభవిస్తాను, నువ్వు అలా చేయుదువేమోనని భయపడి నీకు నిజం చెప్పాలనుకుంటాను. కాని నువ్వు నమ్మవని భయపడి చెప్పను.

అందుకే నేను చెప్పాలనుకున్న విషయానికి విరుద్ధంగా అసత్యమే చెబుతాను. నాబాధను అసంభవమని భావిస్తాను. నువ్వు అలా చేయుదువేమోనని భయపడి ఎంతో విలువైన మాట నీకు చెప్పాలనుకుంటాను. కాని నువ్వు లెక్క చెయ్యవని భయపడి, చెప్పను.

అందుకే నిన్ను దూషిస్తాను, నా గొప్పలు చెప్పుకుంటాను.

నిన్ను బాధిస్తాను, లేకుంటే నీకు బాధ అంటే అర్థం కాదని.

నీ దగ్గర కూర్చోవాలనుకుంటాను. కాని నా మనసులోని రహస్యం బయట పడుతుందని భయపడతాను.

అందుకే ఏవేవో కబుర్లు చెప్పి, నా రహస్యం కప్పివేస్తాను.

నా బాధను తోసివేస్తాను. లేకున్న నీవు అలా చేయుదువేమోనని భయపడి, నీ దగ్గరనుండి వెళ్ళిపోవాలనుకుంటాను. కాని నా పిరికితనం నీకు తెలిసిపోతుందని భయపడతాను. అందుకే బింకంగా నీ ఎదుటికి వచ్చి నిలబడతాను. తూపుల వంటి నీ చూపులు తీరని నా బాధను రేపుతాయి.

(42)

ఓ ఉన్మాదీ, మధువును గ్రోలిన వాడా, నీ తలుపులు బాహాటంగా తెరచుకుని, బహిరంగంగా నీ మూర్ఖతను ప్రకటించిన;

వివేక రహితంగా. నీ సంచీ ఒక్క రాత్రిలో కాళీ చేసిన;

వింత దారులలో పయనిస్తూ, పనికిమాలిన వస్తువులతో క్రీడించిన;

మంచి చెడులను లెక్క చేయకున్న, ఏటికెదురేగుతూ, చుక్కాని విరుగ గొట్టిన, నిన్ను నేను అనుసరించి వచ్చెదను సఖా. మాదకతలో మునిగి పోతాను.

నా సమయమంతా పండితుల సాంగత్యంలో నిష్ప్రయోజనంగా గడిచిపోయింది.

విరివిగా చదివిన చదువులలో నా తల పండిపోయింది.

విరివిగా చూచి చూచి నా చూపు మందగించింది.

ఏండ్లకొలది గుట్టలు గుట్టలుగా పనికిమాలిన వస్తువులు చేర్చిపెట్టాను?

వాటిని ధ్వంసముచేసి, వాటి మీద నాట్యము చేయుము; పిమ్మట అవల పారవేయుము, మాదకతలో మునిగిపోవుటయే గొప్ప వివేకమని నాకు తెలుసును.

మోసాలు అంతరించిపోయి, నేను దారుణంగా దారి తప్పిపోనీ.

భావతరంగాలు వెల్లువగా వచ్చి నా తామసాన్ని తుడిచి వెయ్యనీ.

విశ్వంలోని జనులు, ప్రయోజకులు, పనిమంతులు తెలివిపరులు.

కొందరు నాయకులు, కొందరు వారి అనుయాయులు.

వారందరూ సంతోషంగా వృద్ధిపొందనీ, నేను తెలివిలేక అలమటించి పోనీ, పడివుండనీ మాదకతలో మునిగిపోవుటే కర్మలకు స్వస్తిచెప్పు మార్గమని నాకు తెలుసును.

ఇప్పుడే నా సుఖాలను వదులుకుంటాను. నా పాండితీగర్వము. పాపపుణ్యములు వదులుకుంటాను.

పూర్వ స్మృతులు, కన్నీళ్ళు మానుకుంటాను. కెంపులు ఈనే అమృతంలో హాయిగా మునిగి తేలుతాను.

గౌరవం మాట మరచిపోతాను. పనికిమాలిన వాడుగా మనుటకు పవిత్రమయిన ప్రతిజ్ఞ తీసుకుంటాను. మాదకతలో మునిగిపోతాను.

(43)

స్నేహితులారా, మీరు ఎన్నయినా చెప్పండి, నేను ఎప్పటికీ సన్యాసిని కాలేను. ఆమె కూడా నాతో పాటు దీక్ష తీసుకొనకుంటే నేను ఎప్పటికీ సన్యాసిని కాలేను. నేను ధృఢంగా నిశ్చయించుకున్నాను.

తోడు, నీడ లేకుండా, నేను ఎప్పటికీ సన్యాసిని కానని.

ఇల్లూ వాకిలీ విడిచిపెట్టి, వనవాసానికి వెళ్ళను. సరదాగా నవ్వుతూ పలకరించే చెలి పక్కనలేకుండా నేను ఎప్పటికీ సన్యాసిని కాను.

(44)

గురూ, ఈ పాపుల జంటను క్షమింపుము. ఈ రోజు వడగాలులు విపరీతంగా వీస్తున్నాయి. దుమ్మునూ ఎండుటాకులనూ రేపుతూ.

వాటితో పాటు నీ సూక్తులు కూడ కొట్టుకుని పోయాయి.

జీవితము వ్యర్థమయినదని అనకుము. తండ్రీ మేము మృత్యుదేవతతో ఒడంబడిక చేసుకున్నాము. కొన్ని గంటల సేపు మాత్రమే మేమిరువురము అమరులుగా చేయబడినాము.

రాజు సైన్యము వచ్చి మామీద పడిన, విచా

రంగా తలలు ఆడించి, "అన్నలారా, మీరు మమ్ము లను మా మానాన పోనిండు" అని చెబుతాము. స్నేహితులు మా చుట్టూ చేరినప్పుడు, వినయంగా వారికి నమస్కరించి చెబుతాము. "ఈ విస్తారమయిన అదృష్టం మాకు ఇబ్బందిగా వున్నది, మేము నివసించు అనంతాకాశంలో చోటు లేదు. ఎందుకనగా వసంతంలో పూలు విరియ బూస్తాయి. తుమ్మెదలు గుంపులు గుంపులుగా ఆకర్షింపబడతాయి.

మేమిరువురమే నివసించు మా స్వర్గం మిక్కిలి చిన్నది" అని.

(45)

సెలవు తీసుకోపిలసిన అతిధులను శీఘ్రముగా సాగనంపుము, వారి ఛాయలనుకూడ తుడిచివేయుము.

చిరునవ్వుతో, నీకు అందుబాటులో సహజంగా దొరకిని దానితో, తృప్తిపడుము.

ఈ నాడు, అచిరకాలములో నశించిపోవు నీలి నీడల పండుగ.

నీటి తరగలపై నటనమాడు వెలుగులవలె నీ నవ్వులు క్షణికములు.

పత్రము కొసనవుండు మంచు బిందువువలె నీజీవితము కాలపు అంచున నటనమాడును.

నీ వీణియ తంతులు సమయోచిత గానమును మీటును.

(46)

నీవు ఆజ్ఞాపించిన, నా గానం ఆపివేస్తాను. నీ గుండెలు కొట్టుకొనిన, నా చూపులను నీ ముఖము నుండి తప్పిస్తాను.

నీ వడలు తొట్రిలిన, నేను ప్రక్కకు తప్పుకుని, వేరు మార్గాన్ని అనుసరిస్తాను.

నీ మాలా రచనలో పొరపాటులు దొరలిన నీ ఏకాంత పుష్పవనమును విడచి పోయెదను.

ఏరు కలగిపోయిన, నీతీరంలో నా నావను నడపను చెలి.

(47)

నీ తీయని వలపునుండి నన్ను ముక్తునుచేయుము. ప్రియతమా!

నీ ముద్దుల దొంతరలతు స్వస్తిచెప్పుము. ఈ సువాసనలు నా ఎదను మత్తిల జేసినవి

కివాటములు తెరచి. ఉదయ కాంతిని ఆహ్వానింపుము.

నీ వలపు దొంతరలలో, మై మరచిపోయాను.

నీ ప్రేమవాగురులనుండి నన్ను ముక్తునుచేయుము. నా ముక్తహృదయమును నీకు సమర్పించుకొనెదను, స్వామీ.

(48)

ఆమెను నా చేతులలోకి తీసుకుని, హృదయానికి హత్తుకుంటాను.

ఆమె అందాన్ని నా చేతులలో నింపుకోవాలని, ఆమె చిరునవ్వును ముద్దుమురిపెముతో కొల్లగొనాలని, ఆమె నల్లని చూపులను నా కనులతో తాగాలని, ఉవ్విళ్లూరుతాను.

కాని, ఎలా, ఆకాశమునుండి నీలిమను ఎవరు పొందగలరు?

ఆ సౌందర్యాన్ని పొందాలనుకుంటాను. కాని ఆమె నన్ను తప్పించుకుపోతుంది, దేహాన్ని మాత్రం నా చేతులలో పెట్టి.

విసిగిపోయి, అలసిపోయి నేను మరలి వస్తాను. ఆత్మ మాత్రమే పొందగల పూవును దేహము ఎట్లు చేరగలదు?

# చూడు నేస్తం!

గుమ్మనూరు రమేష్‌బాబు

వేద వేదాంతాలపై
హైరానాపెట్టే ఎన్ని సిద్ధాంతాలని!
అష్టాదశ పురాణాలపై
ప్రాణాలు తీసే ఎన్ని వ్యాఖ్యానాలని!
ఉపనిషత్తులపై మాత్రం తక్కువా! ఎన్నని!
ఉత్కృష్ట ప్రబంధాలపై బాబోయ్! ఎన్నెన్నని!
రామాయణ గంగలో మూడు మునకలేస్తే
సవాలితు భావసుడులు!
భారతసముద్రంలో ఒక్కసారి దూకితేస్తే
శతకోటి ప్రేరణాల అలజడులు!
అలవికానన్ని విమర్శలు!
అమాంతం కౌగలించుకోనేంతటి పరమార్శలు!
కాని,
చూడు నేస్తం!
పిడికెడు గుండెలో చెలరేగే
ప్రేమసమీరానికి
కాసింత ఎదలో తొణికిసలాడే
ప్రణయ మాధుర్యానికి
ఎక్కడున్నాయే తాత్పర్యాలు!
ఏవన్నా చెబుతాయా వాటి పూర్వాపరాలు!
పిచ్చిపిల్లా!
అది ప్రేమే!
అది భగవదనుగ్రహం!
అనురాగాల అతి తియ్యని అగ్రహారం!
నీవూ నేనూ చేయగలిగిందంటూ ఉంటే ...
అది ఆ సర్వాంతర్యామికే సమర్పించి ...
మేమూ అంతటివాళ్ళమేనని నిరూపించుకోవడం!

# జాషువా ఎలిజీలు

డా॥ జి. వి. ఎస్. ఆచార్య, ఎం.ఏ., పిహెచ్. డి.
తెలుగు శాఖ - మహారాజ కళాశాల, విజయనగరం

పాశ్చాత్యుల ఆత్మాశ్రయ కవిత్వంలో 'Elegy' (స్మృతి గీతం) ప్రధానమైనది. ఎలిజీకి తెలుగులో శోకగీతమనీ, శోక కావ్యమనీ పర్యాయపదాలు వాడబడ్డాయి.

'The Elegy is a lyric expressive of melancholy or grief, in particular, when commemorative of dead friend'[1]. ఈ నిర్వచనంలో మిత్ర స్మృతి అని ప్రత్యేకంగా పేర్కొనబడ్డప్పటికీ, ఆప్తులైన వారు ఎవరైనా వారి మరణాన్ని గూర్చి స్మృతి రూపకంగా గేయమో, కావ్యమో వ్రాస్తే అది ఎలిజీయే అవుతుంది. తెలుగులో మొట్టమొదటి స్మృతి కావ్యం శ్రీనాథుని "కాశికా విశ్వేశుగలసె వీరారెడ్డి..." అనే పద్యంతో ప్రారంభమై ఉండవచ్చునని కొందరి అభిప్రాయం. కానీ ఈ చాటువులో ఆ యా ప్రభువులకు తన యెడ గలిగిన ఆర్ద్రత, వారి యెడ తనకు గల ఆత్మీయతల కంటె, శ్రీనాథుని రజో గుణమే ఎక్కువగా భాసించింది. కానీ అల్లసాని పెద్దన, కృష్ణరాయల నిర్యాణానంతరం పలికిన "ఎదురైనచోఁ దన మదకరీంద్రము నిల్పి, కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె..." అనే చాటువు అసలైన - సిసలైన స్మృతి కావ్య ప్రక్రియకు చెందిన పద్యం. ఇంతకు మించి మన ప్రాచీన సాహిత్యంలో ఇష్టుల మరణం పట్ల వ్రాసిన స్మృతి కావ్యాలు కనిపించవు. నవ్య కవిత్వంలో ఈ ప్రక్రియ ఆంగ్ల సాహిత్య సాహచర్యం వల్లనే మూడు పూవులారు కాయలుగా వర్ధిల్లినది.

స్మృతి ప్రక్రియలో "ఆత్మ స్మృతి", "దేశ నాయక స్మృతి" అనే రెండు భాగాలున్నాయి. ఈ రెండు భాగాలకు చెందిన కావ్యాలను జాషువా గారు విస్తృత పరిధిలో రచించారు. అసలు జాషువా గారు ఈ స్మృతి ప్రక్రియను సమర్థంగా నిర్వహించటం చేతనే ఆధునికాంధ్ర కవితా లోకంలో మరపురాని మహోన్నత స్థానాన్ని సంపాదించుకున్నారని నా అభిప్రాయం. స్మృతి ప్రక్రియను వారు నిర్వహించటంలోని తీరుతెన్నులను సమగ్రంగా చర్చించటమే ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశం.

## 1. ఆప్త స్మృతి

మాతాపితరులు, సోదరీ సోదరులు, మిత్రులు మొదలైన వారి స్మృతి కోసం వెలువడిన కావ్యాలను, గీతాలను ఈ శ్రేణిలోకి చేర్చవచ్చు. ప్రత్యక్షమైన వస్తువుతో గాని, వ్యక్తితోగాని తమకున్న సంబంధాన్ని పురస్కరించుకొని స్మృతి కవిత్వాన్ని చెప్పటం ఈ కోవకు చెందుతుంది. వీనిలో "మాతృస్మృతి" కోసం వెలువడిన రచనలే ఎక్కువగా ఉన్నాయి. వాయని

1. 'Encyclopedia Americana', Vol. 17.

సుబ్బారావుగారి 'మాతృగీతాలు' ఈ ధోరణిలో రచింపబడిన కావ్యాలలో శిఖరాయమానమైనవి,

నవయుగ కవిచక్రవర్తులైన జాషువాగారు మాతృస్మృతి, పితృస్మృతి, సతీస్మృతి, మిత్రస్మృతి-అనే స్మృతి గీతాలను రచించారు. తమ గ్రంథాలను అంకితమిచ్చి కొన్ని స్మృతి గీతాలను వెలువరించారు. వారి వారి ఆప్తులకు తమ కావ్యాలను అంకితం గావించి తమ ఋణాన్ని తీర్చుకొన ప్రయత్నించారని భావించవచ్చు. తమకు అత్యంత ప్రేమపాత్రమైన, సన్నిహితమైన 'జాకి' అనే కుక్కపై గూడ తమ ఆవేదనను వ్యక్తం చేస్తూ స్మృతి గీతాలను రచించారు. ఇది కవిగారికి గల 'భూతదయ'కు నిదర్శనం.

1. మాతృస్మృతి: తమ తల్లి పడుకున్న పెట్టెను "పున్నెము మూట"గా సంభావించుకొన్నారు. ఖండకావ్యం మూడవ భాగంలో 'కన్నతల్లి' అనే ఖండికలో—

'పుణ్యముల తల్లి నీ పాల పుష్టికతన
కవనబాలిక నా జిహ్వ నవతరించె'

అని చెప్తుతూ, తమను తమ్ముడు వెంటాడగా వేయి జన్మలైనా ఆమె కడుపుననే పుట్టగలనని కవిగారు-

'నిరుడీ నాటికిగల్గు నీ మహిత సాన్ని
ధ్యంబు నేడక్కటా!
మరుగై, నీవు పరుండు మంచమొక చే
మాకిందు ప్రత్యక్షమై
పురికొల్పున్ బరితాప వహ్నినయంబున్
గర్భ దేశంబునన్;
తిరిపెంబెత్తిన జూపువారెవరు? ధాత్రిన్
నీ శుభాకారమున్

అని వాపోయారు. జాషువ గారి తల్లి లింగమాంబ. ఆమెపై వీరికి అపరిమితమైన ప్రేమాభిమానాలున్నాయి. ఆమె మరణం ఆయనకు ఆవేదన కలిగించినప్పటికీ వెంటనే పద్యాలు వ్రాయలేకపోయారట ఆ తరవాత ఒక సంవత్సరానికి, ఒకనాడు ఏదో ఆలోచిస్తూ పడుకున్న కవిగారికి, ఆ గదిలో మూలనున్న వారి తల్లిగారు ఉపయోగించిన మంచం కనిపించింది. దాంతో ఆయన ఆలోచనలు కన్నతల్లి మీదకు మరలాయి. అప్పుడు కన్నీరు కారుస్తూ పద్యాల్ని వ్రాశారు. మాతృమూర్తికి కన్నీటితోనే కవితాంజలుల్ని సమర్పించారు. "తిరిపెంబెత్తిన జూపు వారెవరు? ధాత్రిన్ నీ శుభాకారమున్" అన్న వారి ఆవేదన హృదయాన్ని చీల్చుకుని వెలువడింది. మాతృమూర్తి ఆకారాన్ని ఇకమీదట చూడగల్గే భాగ్యం లేదుగదా అని విలపించారు.

"కొడుకుల సుఖంబునకు మేనుకొల్లబెట్టు"

జీర్ణమూర్తికి నెత్తురు చిలుకరింపు" అను సమర్పించి మాతృఋణాన్ని తీర్చుకొన ప్రయత్నించిన జాషువా గారు 'తమ తల్లి నిత్య విశ్రాంతి నానంద నిలయమందు దిగులులేక దిరుగుచున్నది గాబోలు' అని ఊహించుకొన్నారు.

'సర్వ సంసార బాధా విషజ్వరమున
కౌషధంబైన మరణంబు సఖినుతింతు

అన్న భావ వ్యక్తీకరణం కవిగారి గంభీర వ్యక్తిత్వాన్ని వెల్లడి చేస్తున్నది. మృత్యు దేవతకు భయపడక, ఆమె మేలే చేస్తుంది అని సంతోషించటం మహోన్నత వ్యక్తిత్వానికి నిదర్శనం.

కన్నతల్లి ఋణాన్ని తీర్చుకొన భావించి, తమ 'ముంతాజమహలు' కావ్యాన్ని ఆమెకు అంకితం చేశారు. ఆ అంకితంలో -

"నీవు బ్రతికియుండ నీ వాంఛితార్థముల్
దీర్చుశక్తి లేక దిగులువడితి
వేయి పగలకన్న వెలగల్గు కృతిభూష
నంపుచుంటి స్వీకరింపుమమ్మ!"

అని హృదయపూర్వకంగా తమ కావ్యాన్ని సమర్పించారు. బ్రతికి ఉన్నప్పుడు ఆమె కోరికల్ని తీర్చే శక్తి తమకు లేకపోయిందని ఎంతో బాధను వ్యక్తం చేశారు ఆమె మరణానంతరం తమ కావ్య సంపదచే ఆమెని తృప్తి పరచటానికి యత్నించారు. ఒక పేదకవిగా తమ ఆవేదనాపూర్వకమైన అనుభూతిని పద్యాల్లో పలికించారు.

ఖండకావ్యం రెండవ భాగంలో 'మాతృప్రేమ' అనే ఖండికలో-

,తల్లిగర్భానఁబొడము వాత్సల్యజలధి
పుట్టుమొదలుగ నా మీదఁ బొరలుచుండు
మానవాకారమునఁజెప్ప లేనుగాని
దాని పరిమితిఁ గొలుచుకొన్నాను నేను.

అని మాతృవాత్సల్యానికి మహదానందం పొందారు.

"చలువ కన్నీటి నాదు మస్తకము నంటి
వృద్ధ జనయిత్రి యభిషేకమిచ్చుచుండు
వడకుఁదన మేలు తన కరాబ్జముల నీడ
బ్రతికెదను గాక నూరేండ్ల వరకు నేను"

అని తమ మాతృమూర్తి చల్లని ఆశీస్సులను కోరుకొన్నారు,

**2. పితృస్మృతి:** జాషువాగారు తమ 'నేతాజీ' కావ్యాన్ని, పరమపదించిన తమ తండ్రి గారికి అంకితం చేశారు. వీరగాథాకర్ణన కుతూహల స్వాంతులైన వారి ఆత్మకి కావ్యం శాంతిని సమకూర్చగలదనే ఉద్దేశంతో కవిగారు వారికి 'నేతాజీ' కావ్యాన్ని సమర్పించి కొంతకు కొంతపితృఋణాన్ని తీర్చుకోగలిగిన వారైనారు.

గుఱ్ఱం వారి వంశంలో గొప్ప కాపరియై జన్మించిన వీరయ్యగారు, జాషువాగారి తండ్రి.

"తానమునంది క్రైస్తవ మతంబున జేరి
కులంబుగోత్రమున్
మానిన వెఱ్ఱిగొల్లఁడవమాయక మూర్తివి
గాని తండ్రి! యి
ట్లేనుగు నెక్కు పుత్రుని, కవీశుని
పుట్టువు గుట్టెఱుంగు వి
జ్ఞానివి నీవు నీదు చరణంబులకుం
గఃతానమస్కృతుల్"

అని తమ తండ్రిగారు క్రైస్తవ మతాన్ని స్వీకరించినట్లు తెలిపారు. తమ తండ్రిగారి గొప్పతనాన్ని, వీరగాథాకుతూహలాన్ని కొనియాడుతూ-

"ముద్దుల్ సెప్పుచు వీరగొల్లల యశంబుల్
బహు పాండిత్యముల్
ముద్దుల్ గారు విలక్షణంబయిన యేద్బ్యం
బాణితో బాడి, మా
పెద్దల్ వీరని పొంగిపోయెదు
భవద్వీరోత్సుకత్వంబు కా
ప్రొద్దుల్ నిండిన కైతయై వలచెబాబూ!
నన్ను బాల్యంబునన్".

అని తమకు కవిత్వం అబ్బటానికి గల కారణాన్ని వివరించారు. తమ తండ్రి నిరంతరం శయ్యా

లోనే, పక్షవాత రోగంతో పడుకుని. కొడుకుల చేత, మనుమల చేత సేవలు చేయించుకొని మరణించినట్లు తెలిపారు. జాషువాగారి సన్మానాన్ని ఆయన కళ్ళారాచూసి ఆనందించారట. "పుత్రోత్సాహము తండ్రికి......" అనే సుమతీశతక కారుని సూక్తి వీరయ్య-జాషువా గార్ల పట్ల అన్వయించింది. జాషువాగారు తమ తండ్రిగారి ఆస్తిక్యాన్ని, అంకురిత దీక్షని కొనియాడుతూ—

"జగము క్రుంకినగాని నీ జపతపంబు
మానని యనంత భక్తి సంభరితమతివి
భాగముండకపోదు కైవల్యధరణి
వల్లపులరాయ! ముక్తి రంభావిధేయ"

అని వారికి కైవల్యం తప్పక సిద్ధిస్తుందని విశ్వసించారు.

'నేతాజీ' కావ్యాన్ని తమ తండ్రి గారికి అంకితమిచ్చి జాషువాగారు ఎంతో ఔచిత్యాన్ని పాటించారు. పితృతిథులలో పలనాటి వీరచరిత్రను గానం చేయించటం పరిపాటి. పలనాటి కవి అయిన జాషువాగారు తమ తండ్రికి ఈ వీరగాథను వినిపించటం సమంజసమే.

**3. సతీస్మృతి:** 'కొత్తలోకము' అనే కావ్యాన్ని పరలోకగత, మధుర హృదయ అయిన తమ అర్ధాంగి 'మరియా'కు అంకితమిచ్చారు. తమ భార్యపై తమకుగల ప్రేమాభిమానాలను వెల్లడిస్తూ రస హృదయంతో కొన్ని పద్యాలను రచించారు.

"నీవటు కాటిదిక్కు పయనించిన నాటి
మరుక్షణాన, న
న్నావయ సంధిబంధనము లన్నియు వీడె,
కవిత్వ భారతీ
దేవత మూగవోయె, సురతీమణి నాదు
కళా స్రవంతియున్
నీ వెనుకన్ శ్మశాన ధరణిన్ నిదురించినదో!
సతీమణీ!"

అని ఆవేదనతో కవిగారు వ్యక్తీకరించిన భావ తీవ్రత గమనించవదగినది. భార్యావియోగం చేత శరీరావయవాలే గాక, మానసిక సంబంధమైన కవిత్వభారతీ దేవత కూడా మూగపోయిందని, తమ కళా స్రవంతి కూడా ఆమె వెనుకనే శ్మశాన భూమిలో నిద్రించినదని వాపోయారు. ఈ ఆర్ద్రమైన భావ పరంపర పాఠకులను రసార్ద్రతలో ముంచెత్తేదిగా ఉన్నదని చెప్పవచ్చు. ఆమెను కొనియాడుతూ తమమాతకుమారుగా మూర్తీభవించిన తమ జాతక పుణ్యరేఖగాను. ప్రశస్తశుభైకవరప్రదాత్రిగాను భావించారు. భార్యను "భోజ్యేషుమాతా" అనటం ఆర్యోక్తి. దానికి అనుగుణంగా కవిగారు—

"నాతనుయష్టి ప్రత్యణువునన్ గల పుష్టికి
కారణంబు నీ
చేతి సుధాశనంబ కద? చిక్కనె చక్కన
రాదు గాని, నా
మాతకు మారుగా, ననుగుమానిసి రూపము
దాల్చినట్టి నా
జాతకపుణ్యరేఖవో! ప్రశస్తశుభైకవర
ప్రదాత్రివో!"

అని నిర్మల హృదయంతో పవిత్రమైనభావాన్ని వ్యక్తీకరించారు తమ భార్యను ఒక విశిష్ట దృక్పథంతో ప్రశంసించారు.

**4. సోదరస్మృతి:** ఖండకావ్య ఏడవ భాగంలో 'కన్నీటి నీరాజనము' అనే ఖండికలో సోదరుని మరణానికై విలపిస్తూ కొన్ని పద్యాలను రచించారు జాషువా గారి సోదరుడు 'ఇస్రాయేల్' బి.ఎ.ఎల్.టి. వరకు చదివాడు. ఆయనకు

అమెరికాకు ఆహ్వానం కూడా వచ్చింది. కానీ వెళ్ళక ముందే మరణించాడు. (తల్లిదండ్రుల మరణానంతరమే ఈతని మరణం సంభవించింది)

"నా కనులముందు బుట్టిన
నీకా మనుముందు మృతి అనింద్య చరిత్రా
ఆకొన్న మృత్యువునకు
న్నికాయమె రుచ్యమయ్యెనే? సోదరుడా!"

అని తమ్ముని మరణానికి దుఃఖించారు. తమ తమ్ముడు మంచి దేహదార్ఢ్యత కలవాడని, పక్షవాత రోగం అతన్ని దుర్మరణం పాలు చేసిందని వ్యథ చెందారు.

"అన్నా! యను తమ్ముడు నా
కున్నాడని మురిసితిని సహోదర! యిక న
న్నన్నాయన రెవ్వరు నే
నన్నాయని పిల్వకల్గ దగ్రజుడేనిన్"

అని తమను ఇక అన్నా! అని నోరారగ పిల్చే వారు లేరని దుఃఖించారు. కనీసం తాము పిలవటానికైనా తమకు అన్న లేడని విచిత్ర ధోరణిలో విలపించారు. తమ సోదరుని పై తమకుగల అత్యంత ఆత్మీయతకు పై పద్యం నిదర్శనం.

"ఒంటిగాడనైతి నొక కాలు నొక బాహు
ఊడినట్టు, శక్తులూడినట్టు"

అని ఒక్కగా నొక్క తమ్ముడు మరణించగా ఒంటరితనాన్ని భరించలేక, తమ దేహంలో సగ భాగం శక్తి విహీనమైనట్లు భావించుకున్నారు. తమ తమ్మునికీ తమకుగల అవినాభావ సంబంధ మెటువంటిదో, పై పద్యంలో తెలియచేసారు. తోడబుట్టిన వానిపై కొండంత ప్రేమను, దిగులును పొదిగి స్మృతి ఖండికను రచించిన జాషువాగారి హృదయౌన్నత్యం ఆదర్శప్రాయమైనది.

**5. మిత్రస్మృతి:** జాషువాగారు తమ మనసు నలరించిన స్నేహితులను తమ కావ్యాలలో శాశ్వతం చేసారు "తిమోతి" అనే ఆప్త మిత్రుడు గతించగా, ఖండకావ్యం మూడవ భాగంలో 'చెలికాడు' అనే ఖండికను రచించారు.

"చినతనమున నిరావురమును
వినుకొండపురాన గలసి విహరించిన నీ
కనకమయ మధుర రూపము
కనుల మెలగు మసక మసకగా నవనవగా"

అని అతణ్ణి స్మరిస్తూ, తామిద్దరూ చిన్ననాటి స్నేహితులనునే విషయాన్ని తెలిపారు. లోకంలో సహజంగా చిన్ననాటి స్నేహానికున్న విలువ చాలా పెద్దది.

"కవినై వచ్చితి నీ సమాధి కడకున్,
గన్పట్టదయ్యెం గదా?
భవదీయావృత రూపధేయము,
పరబ్రహ్మమ్మునందైక్యమై
తివో! సృష్టిం జితియించి పోయితివో? నీ
దేహంబదే పుష్పమై
యవతారించినదో! తిమోతి! చెలికాడా!
మందభాగ్యోదయా!"

అని ఆవేదనాపూరితంగా, సంవాదాత్మక మైన శైలిలో కన్నీటి కవితను వెల్లువలా పారించారు. జాషువాగారి చాలా పద్యాలు ఎంతో సొగసుగా ఉంటాయి అందుకు కారణం సంవాదాత్మక శైలిలో రచించటమే.

తమను పోషించిన వారిని గురించి తమ ఖండకావ్యం ఏడవ భాగంలో "బాష్పాంజలి" ఖండికలో—

"ఒక నక్షత్రము రాలిపోయెననె
గుంటూర్కంట నీరూర, ని
న్నొక సామాన్యునిగాదలంచి, ఆటుకాదో!
ఆంజనేయ ప్రభూ !
ఒక నక్షత్రము క్రొత్తమెరిచి
విద్యుత్కాంతులన్నిక్కి మిం
టికి లేచెన్ మృతికాదనుచు చాటెన్
దాతృలేఖర్షభా !"

అని ఏకా ఆంజనేయులగారి మృతిపట్ల సంతాపాన్ని వెలిబుచ్చారు. వీరి స్మృతి గీతాలలో అత్యంతమైన ఆత్మీయత, ఆర్ద్రత, స్నేహప్రియత్వం మొదలైన లక్షణాలు చక్కని సుకుమారశైలిలో కనిపిస్తాయి. ఆంజనేయులు గారి కవిపోషణను, సాహిత్యాభిమానాన్ని తలచుకొని, అటువంటి వారు లోకంలో ఇక లేరుగదా! అని ఆయనకుగల సహృదయ సౌశీల్యాలను కొనియాడారు.

"అవతారించితివో యనాథకవి లోకాలం
బనార్థంబు, మా
నవ మాన్యా! కృతులంది సత్కవుల
కన్నంబిచ్చి గల్పించు భూ
ధవులీకాలమునందు గల్గుదురె విద్యాభోజ!
నీ పోకతో
దివిజశ్రేణికవుల్ సుఖింతురు మదాంధ్రిన్
మందభాగ్యుల్ కవుల్."

ఆంజనేయులు గారి మరణంవలన ఆంధ్రకవులు మందభాగ్యులని కవిగారి భావన ఆంజనేయులు గారిని విద్యాభోజునిగా సంభావించటం ఉదాత్తంగా ఉంది.

ఖండకావ్యం ఏడవ భాగంలోనే 'అస్తస్మృతి' ఖండికలో 'సుబ్బారాయుడు' అనే మిత్రుని మరణాన్నిగూర్చి రెండు పద్యాలు వ్రాసారు. మానవ హృదయ సంఘర్షణనుండి ఒక్కుమ్మడిగా ఆవిర్భవించిన 'ఎలిజీ' జాషువాగారి చేతిలో అత్యున్నతంగా మలచబడినదనటానికి ఈ రెండు పద్యాలు సాక్ష్యంగా నిలబడతాయి. అందులో ఒక పద్యం ఉదాహరిస్తాను.

"కలమాడుట లేదక్షరం,
నిలుచుటలేదే విధాన, నీ స్మృతి పద్యం
బులగూర్తు సుబ్బరాయా!
పలుకుల నీమృత్యువార్త బలిగొనిపోయెన్

ఈ పద్యంలోని విషాదగ్రస్తమైన భావం కవిగారి హృదయాన్ని ముక్కలు చేసుకుని ఉద్భవించింది. మనసులు ఊసులాడుకునే భాషలో పద్యాన్ని తీర్చిదిద్దటం జాషువాగారి ప్రత్యేకత.

శ్రీ మృత్యుంజయుడు జాషువాగారికి చిన్నతనంనుండి మిత్రుడు. ఆయన గుండెజబ్బుతో మరణించగా, జాషువాగారికి కలిగిన మూగబాధనుండి ఈ క్రింది పద్యం వెలువడింది.

"ఏడీ నా నిజమిత్రసత్తముడు శ్రీ
మృత్యుంజయాఖ్యుండు నా
తోడం బుట్టని యన్నదమ్ముడు,
మదా పుందున్నతోద్యోగి, నా
నాడున్నాకృతులాలకించి మది నానందించు
వాడక్కటా
యేడీ నేడు చరిత్రలో కలసినాడె
దుఃఖకావ్యంబుగన్,

మృత్యుంజయుడు మరణ వేదన సమయంలోకూడా జాషువాగారి పద్యాలను చదివించుకొని ఆనందించినాడట. దీనివలన ఆయనకు జాషువాగారిపై, వారికవిత్వంపై ఎంతటి మక్కువ, ఆదరం కలవో స్పష్టమవుతున్నది.

జాషువాగారి మరొక ముఖ్యమైన మిత్రుడు వేంకటప్పయ్య. ఆయన సంగీతంలో దిట్ట. ఆయన మరణానికి బాధపడుతూ—

"నా నిజమిత్రసత్తముడు నా సహపాఠుల
లోన మేటి సా
ఖానికులుండు మంచి సరదాగల వాడదిగాక
చక్కగా
గానము చేయువాడతడు కాలముచేసి
యనంతకాల గ
ర్భాన గతించి పోయినవి పాతికకుంబయి
చిల్కు వర్షముల్"

అని స్మృతి పద్యాన్ని విషాదపూరితంగా రచించారు.

జాషువాగారు బాల్యంలో ఉండగా, ఒక విధవరాలు వారింటి కెదురుగా ఉన్న శ్మశాన వాటికలోని ఒక సమాధి దగ్గరకువచ్చి పూజలు చేస్తూవుండేదట ఆమె భారతీయస్త్రీ. ఆమెను గుంటూరు జిల్లాకు 'కలెక్టరు'గా, క్రొత్తగా వచ్చిన ఒక ఆంగ్లేయుడు వివాహామాడినాడట. అక్కడ అడవులలో ఉన్న పెద్దపులిని చంప టానికి వేటకు వెళ్లిన ఆ దొర, అడవిలో ఒక దుస్సంఘటన వలన మరణించినాడట. ఆ యువతి జీవితాంతం వైధవ్యాన్ని స్వీకరించి, ప్రతియేడు ఆ దొర వర్ధంతినాడు సమాధిని అలంకరించి, పూజలుచేస్తూ చివరకు పండు ముసలి అయి మరణించినదట. జాషువాగారు 'శ్మశాన వాటిక' పై 'ఆ యువతి కన్నీటిజల్లు ప్రభావం వుంది' అని చెప్పేవారట. ఆ ఇల్లాలి దీనగాథే—

"ఇచ్చోటనే సతీ ఇల్లాలి వల్లె పూ
సల పేరు గంగలో గలసిపోయె"

అన్న వేదనగా పద్యరూపాన్ని పొందింది.

వినుకొండకు 'మిషనరీ'గా వచ్చిన ఒక దొర కొడుకు జాషువా గారికి చిన్నతనపు స్నేహితుడు. అతడొకరోజు హఠాత్తుగా మరణించాడు. ఆ కుర్రవాని సమాధికూడా ఆ శ్మశానంలో వున్నది. అందుకే—

"ఆలోకించిన గుండియల్గరగు వాయాపిల్ల
గోరీలలో
నే లేబుగ్గల సౌరు రూపటిపోయెనో!
యే ముద్దు నిద్రించెనో
యే లీలావతి గర్భగోళమున వహ్నిజ్వాల
జీవించునో
యీ లోకంబున వృద్ధి గాదగిన యే యే
విద్యలల్లాడునో."

అని కవిగారి హృదయంనుండి శోకపూరితంగా వెలువడింది.

వారి ఊరిలోని ఒక బూబమ్మను గురించి ఈ విధంగా వ్రాసారు.

"అనువారంబును చేలలో బెసవ గాయల్
దొంగిలింపంగ, జ
ట్టును గూపెట్టిచరించు నన్నలిగి తిట్టుల్
దీవెనల్ బెట్టు వ
ల్లని బూబమ్మ సజీవయే యిపుడు? లీలా
స్వప్న రేఖాకృతిన్
గనుపట్టున్ ముసలమ్మ రూపమెదజీర్ణంబైన
వస్త్రాళితో."

జాషువాగారి చిన్నతనపు కొంటెతనములలో ఇది ఒకటి. తమను తిట్టిన బూబమ్మను పై తుంటరి పోక స్మరించుకోవటం జాషువాగారి సహృద యాన్ని వెల్లడిస్తున్నది.

ఒక వీధి కుక్క ఒక ముద్ద అన్నం జాషువాగారి చేతితో పెట్టగా తిని, ఇంటిగుమ్మం

వద్దనే పడుకొనేదట. కవిగారు కనిపించినంతనే కళ్లతో పలకరిస్తూ, తోకను వూపి ఆనందాన్ని వ్యక్తం చేసేదట. ఊరి పిల్లలు, పెద్దలు కలిసి, ఒకనాడు దానికి పిచ్చి పట్టిందని చెప్పి కవిగారు చూస్తూ వుండగానే దానిని కొట్టి చంపారట. దాని పేరు 'జాకి'. అందుకే ఖండకావ్యం రెండవ భాగంలో దాని పేర స్మృతి పద్యాలను రచించారు.

"పెట్టుంబోతలు సన్నగిల్లెననుచున్
విశ్వాస హీనాత్ములై
చుట్టాలుంజనినారు, నీ కడుపుఁజిచ్చున్
దీర్పు మృష్టాన్నమున్
బెట్టన్ జాలని నా యెడన్గలుగు నీ
ప్రేమానుబంధం బహో !
పట్టుస్వీడదు: నీ కృతజ్ఞతకు నా
స్వాంతంబు నీరయ్యెడిన్."

అని కుక్కలో వున్న విశిష్టగుణానికి తమ ఆనందాన్ని వ్యక్తం చేసారు. మనుషులలో ఆ గుణం లోపించినందుకు బాధ చెందారు. మనుషులకన్నా కుక్కలే నయం అని నిశ్చయించుకున్నారు అందుకే 'విశ్వాసము నీ కులమునకు నిసర్గభూషణమమ్మా!' అని నీచ జంతువులో కూడా ఉదాత్తతను గ్రహించ గలిగారు.

"నోరులేదుగాని చేరి నీ వొనరించు
పనులలోన వింత భాష గలదు
నీవు నేను దప్ప నితరు లెఱుంగరు
కనులతోడ నవ్వగలవు నీవు"

అని ఆ కుక్కతో తమకుగల 'ఆత్మీయత'ను రసానుభూతి గావించుకొన్నారు.

జాషువాగారు చిన్నతనంలో 'జాకీ' అనే మరోకుక్కను పెంచినారట. అది చేసే ఎన్నో పనులను చెపుతూ వారు అమితానందాన్ని పొందేవారట. ఒకసారి కవిగారి ఇంటిప్రక్కన (మద్రాసులో) ఉన్న ఆఫీసరుగారి ఇంటిలో దొంగలు పడితే, జాకీ తన అరుపులతో అందరినీ లేపి, పారిపోయే దొంగలను ఊరి పొలిమేరదాకా తరిమి వచ్చినదట. దొంగలు విసిరిన రాళ్ళు తగిలి గాయాలతో తిరిగివచ్చిన జాకీ, గాయాలు పూర్తిగా మానకముందే ఒక పాముతో పోట్లాడి మరణించినదట. ఆ జాకీని జాషువాగారే స్వయంగా సమాధిచేసి వచ్చారట. తరువాత నలభై యేళ్ళకు "నా కథ" లో ఆ జాకీని స్మరిస్తూ —

"దీను లనామకుల్ గుడుపదిండి యెఱుంగక
యేయుగాననో
మేనులువాసి రాపులుగు మేని త్యజింప
విశీర్ణకళ్యా సం
తానము లై రహింప నెడదన్ గదలించెడు
వల్లకాటికి
కాను దిశన్ మదీయమగు జాకికి మున్ను
సమాధి జేసితిన్."

అని దుఃఖించారు.

జాషువాగారికి నోరులేని జంతువులపై అభిమానం ఎక్కువ. వాటి మూగభాషకు, చేష్టలకు కవిగారు ముగ్ధులయేవారు. వాటి వియోగం సంభవించినప్పుడు, తమ విషాదాన్ని కవితల మూలంగా వెలిబుచ్చేవారు. వారి కవి అత్యంత ఆప్తులు. ఈ మూగజీవులతో తమకున్న అనుబంధాన్ని, అనురాగాన్ని పురస్కరించుకునే, తాము రచించిన "క్రీస్తు చరిత్ర" కావ్యంపై వచ్చే 'రాయల్టీ'ని నోరులేని మూగ జీవులకు, పేదపిల్లల చదువులకు వినియోగించా లని తమ 'వీలునామా' లో వ్రాసారు.

గోపీచంద్, కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారి కుమారుడు. ఆంధ్రదేశంలో వవ్యమానవ వాదాన్ని వ్యాపింపచేసిన వారిలో గోపీచంద్ ప్రథమగణ్యుడు. నూతనదృష్టితో, కథాసృష్టిచేసి, సుమారు మూడువందల కథలు వ్రాసాడు కొన్నికథలలో సంఘటనకు ప్రాధాన్యమూ, కొన్నికథలలో మన స్తత్వ వాతావరణానికి ప్రాధాన్యమూ చోటుచేసుకున్నాయి. వీరి కథలలో "హేతువాదము, సమతాధర్మము, సత్యాన్వేషణము" అనే మూడు సుగుణాలు ముచ్చటగా ముడివడివున్నాయి. కథక చక్రవర్తిగా విశేష విఖ్యాతి గడించుకొన్న గోపీచంద్ మరణం పలువురి హృదయాలను కలచి వేసింది. కవి లేఖినులనుండి కన్నీటివెల్లువలు ప్రవహించాయి విశ్వనాథ, జాషువా, బైరాగి నాయని, సి. నారాయణరెడ్డి, వడ్లమూడి గోపాలకృష్ణయ్య, రజనీకాంతరావు మున్నగు కవులెందరో తమ కన్నీటి కవితలను కావ్యలోకంలో ప్రచురించారు జాషువాగారు 'శ్రద్ధాంజలి' [2] అనే ఖండికలో కథక చక్రవర్తి అయిన గోపీచంద్ మరణం తెలుగువారికి విలాపహేతువని చెప్తుతూ —

"కథలెల్లన్ సుధలై మనోహరములై
గంగా ప్రవాహంబులై
ప్రథితఖ్యాతి గడింప వాఙ్మయ సముద్రం
బుబ్బి మిన్నంట, దు
ర్విధి, చూపోపక కొంచుపోయె, మహి
తాంధ్రపుత్ర ముక్తామణిన్
మధురస్వాంతుని, గోపిచందును, మరంద
స్వాదు వాచావిదున్."

అని ప్రసాదగీతిక లాలపించారు.

ప్రత్యక్ష సంబంధం అంతగా లేకపోయినప్పటికీ, తమకు సమకాలికు డవటంచేతనూ, సాహితీలోకానికి సుపరిచితు డవటంచేతనూ తమకు ఆప్తునిగానే భావించి కవిగారు గోపీచంద్ మరణానికి దుఃఖిస్తూ స్మృతిపద్యాలను రచించారు.

పాశ్చాత్య భాషా సాహచర్యంవలన మన దేశ సాహిత్యంలో వర్ధిల్లి నస్మృతికావ్యప్రక్రియను జాషువాగారు చేపట్టి తమ ప్రతిభను వెల్లడించారు. ఆధునిక భావాలకు సంప్రదాయాలను గూడా జోడించి, లలిత పదాల పొందికతో, నిరుపమ రసాత్మకంగా, మధుర కవిత్వాన్ని రచించి, తమ నవయుగకవి చక్రవర్తిత్వాన్ని సార్థకం చేసుకున్నారు. తమకు అత్యంత ఆప్తులైన వారిని తమ రచనలలో చిరంజీవులను చేశారు. లక్షసత్కవి హృదయాన్ని చూరగొని వారి రచనలలోని శాశ్వతమైన, మహోన్నతమైన స్థానాన్ని పొందగలిగిన వారందరూ ధన్యజీవులు.

నవయుగ కవిచక్రవర్తి అయిన జాషువాగారు, కథక చక్రవర్తి అయిన గోపీచంద్‌ను తమ 'ఆప్తస్మృతి' లో చిరంజీవిని చేయటం ప్రత్యేకంగా పేర్కొనదగిన విశేషం.

(సశేషం)

---

2. "గోపీచంద్ స్మారక సంచిక" 15-12-1963.

# అయ్యవారు

టి. మంగమ్మ

కంటిలో వత్తివేసుకొని, వంటిలో ప్రాణమువంత శ్రద్ధతో
వంటగ, దాటవోసియును నిండుగ బాలుర మానసంబులన్,
శుంఠల నందఱన్, సుగుణ సింధువు జేసెడి నొజ్జపైన, పా
షండుల కేలకల్గు, కడు సంకృత భక్తియు నేటి భారతిన్.

లంచము పట్టనెంచినను, వంచన చేసెడు పోష్టుగాదుగా!
కంచము, మంచమున్ కఱవు గొంతును చించెడి నయ్యవారికిన్
అంచనసేయ నుండునది వండగ నెప్పుడు, పెద్దఅమ్మయే!
వంచన సేయలేని, బడిపంతులు, భాగ్యము నెట్లుపొందునో?

సూటిగ పాఠముల్, వడిగ సెప్పుటదప్ప, ప్రమోదమందుచున్
ప్లేటుల మార్చలేడు, నయవంచక శ్రేష్ఠుల భంగి నెంతయున్
ధాటిగ దప్పుసేతలను, దండిగ సేయగలేమి, కొంతకన్
ఘాటుగచేతగాని పసమయ్యది, తథ్యము, అయ్యవారికిన్.

లేదు రిటైరుమెంటు బిజినెస్సుకు, లేదులె రాజకీయమున్,
లేదుగ బొత్తిగాను, బడి పెత్తనదారుల వార్ధకంబునన్,
వాదుగలేదులే పరిధి, పాలక కోటికి ప్రాయమందునన్
కాదుగ, నయ్యవారికి, విరామము నియ్యక, నెంతమేలకున్.

పీదగు శక్తిచే మలచి, పీటుగ కట్టవె, జాతి సౌధమున్?
ఆదరసాదరంబిడుచు, నర్భక మానస పీఠులందునన్,
లేదుగనయ్య పీకు, మఱి లోగిలి కట్టెడి నల్పభాగ్యమున్
ప్రాదుగ గోరి కట్టుకొను భాగ్యము నబ్బిన చాలునంతమున్.

చేయగలేవు, సైడు బిజినెస్సులు, డబ్బులు ప్రోగుసేయగా,
పాయగలేవు, నీదు కృషిధర్మము, ప్రాణములందుమేలకున్,
కాయముమీద లేదు, మఱికొల్లగ రాగము చిత్తమందునన్
శాయుదువయ్య! నెప్పుడును, కుఱ్ఱల ప్రీతితో బోధ పల్కుచున్.

రమ్మని నయ్యవారిని, విరామపువేళలో, ప్రీతి సేయుచున్
ఇమ్ముగ సత్కరింతురుగ, ఈ గురుదేవుని, పుష్పమాలచే,
గుమ్మనవచ్చు సౌరభము కీర్తిపుంజమునై వెలుంగగా
కమ్మగ కాపురంబువిక, సక్కగ సేయగ, పెద్దఅమ్మతో;

# దాసకాఠియా

చాగంటి తులసి
ఉపద్రష్ట అనూరాధ

ఒఢ్రుల దాసకాఠియా మన బుర్రకథకి దగ్గరిది. ఇది గంజాం జిల్లా సొత్తు. బరంపురానికి దగ్గరగా నౌరడిహా, ఖండ్రా అనే గ్రామాలు ఉన్నాయి. ఈ రెండు గ్రామాలూ దాసకాఠియా కళానిలయాలు. ఇక్కడ వంశపారంపర్యంగా దాసకాఠియాని అభ్యసించి విశేష ప్రావీణ్యత గడించిన కళాకారుల కుటుంబాలు ఉన్నాయి. ఒఢ్రదేశపు యితరప్రాంతాల్లో ఈ కళ అంత ఎక్కువగా లేదు. గంజాంజిల్లా కళాకారులే ఉత్తర ఒఢ్రదేశంలోనూ, పశ్చిమ ఒఢ్రదేశంలోనూ తమ కార్యక్రమాలు యిస్తూ ఉంటారు. ఒఢ్ర ప్రాంతపు ఆకాశవాణి కేంద్రాలనుండి దాసకాఠియా చెప్పే శ్రీ వైద్యనాథశర్మ, శ్రీ భీమసేన శతపతి గంజాం జిల్లా వారే. వీరిద్దరూ ఈ కళలో నిష్ణాతులు. పూర్వం దాసకాఠియాని గురుముఖంగా మౌఖికంగా అభ్యసించేవారు. కాని ఇప్పుడు దాసకాఠియా పాటలు ప్రచురించబడ్డాయి. శ్రీ వైద్యనాథ శర్మ, దాసకాఠియా రికార్డులు కూడా వెలువడ్డాయి.

కొయ్యచెక్కని ఒరియాలో కాఠి అంటారు. కాఠొ అంటే కట్టెలు. కాఠిని వాయిస్తూ పాడే వాడు కాఠియా. దాసొ అంటే సేవకుడు అని అర్థం. 'దాసకాఠియా'లో 'దాస' శబ్దానికి కాఠి వాయించి జీవనాన్ని గడిపేవాడని అర్థం వస్తుంది.

దాసకాఠియా చెప్పే కథని కూడా దాసకాఠియా అనే అంటారు. హరిదాసు చెప్పేది హరి కథ. కాని దాసకాఠియా చెప్పేది దాసకాఠియావే అంటే కథ చెప్పే గాయకుడికి పాటకి రెండింటికీ దాసకాఠియా అనే పదాన్నే వాడతారు.

దాసకాఠిని రామకాఠి, రామతాళి అని కూడా అందం కద్దు. రామరావణ యుద్ధంలో రాక్షస వీరులు అనేక రకాల వాయిద్యాలు వాయిస్తూ యుద్ధభూమిలో తమ శౌర్య పరాక్రమాలని ప్రదర్శిస్తూ వుంటే రాముడి వానరసైన్యం కొయ్యముక్కలని వాయిస్తూ రామజపం చేస్తూ పోరాడిందట. అందుచేత రామభక్తులు (రామదాసులు) వాయించిన ఆ చెక్కలని రామకాఠి అని, రామతాళి అని అనే వారుట. రామరావణ యుద్ధం ముగిసాక రామాయణగాథని పాడేటప్పుడు రామతాళిని వాయిస్తూ పాడేవారట. తరవాత తరవాత ఒక్క రామకథనే కాక భారతగాథల్ని భాగవతాది పురాణ గాథలని పాడ్డానికి రామతాళిని, దాసకాఠిని వాడడం మొదలయింది. పాటలూ, పాటల విషయ వస్తువు మారినా కాఠిని వాయిస్తూ పాడే విధానం తరతరాలుగా ఒఢ్రులకి సంక్రమించి ఈ నాటికీ ఆ విధానం ఎక్కువ ప్రచారంలో నిలిచి ఉంది.

దాసకాఠియాలో గాయకుడు (గాయొకొ,

గాహోకొ) కథని పాడుతూ చెప్తాడు. అతనికి తోడు ఒకవంత పాటగాడు ఉంటాడు. వంత పాడేవాణ్ణి ఒరియాలో పాళియా అంటారు. మనం తెలుగులో, "తందాన తాన అని బుర్ర ఊపుతున్నాడు" అని వెక్కిరింతగా అన్నట్లే ఒరియాలో 'వాడో పాళియాభాయి' అని వెక్కిరిస్తారు!

దాసకాఠియా గాయకుడు, వంతపాటగాడు యిద్దరూ చిరతలు వాయిస్తూ పాడతారు. అయితే గాయకుడి చిరతలు వంతపాటగాడి చిరతలు వేరుగావుంటాయి. గాయకుడి చిరతలు హరిదాసుల చిరతల లాంటివే కాని హరిదాసుల చిరతలకి రెండువేపులా ఇత్తడిబిళ్ళలు, పట్టుకునే హేండిల్సు ఉన్నట్టు దాసకాఠియా గాయకుడి చిరతలకి ఉండవు. వీటికి ఒకవేపే మువ్వలు ఉంటాయి. హేండిల్సు ఉండవు. తొమ్మిది అంగుళాల పొడుగు ఉంటాయి.

పాళియా లేదా వంతపాటగాడి చిరతలు బల్లపరుపుగా ఉన్న కొయ్యచెక్కలే. వీటికి మువ్వలు ఉండవు చిరతల చివరి భాగం రెండవ దానికన్నా కాస్త వెడల్పుగా ఉంటుంది. ఎడంచేతి బొటకన వేలికి చూపుడి వేలుకి మధ్య ఒక చిరత, చూపుడి వేలుకి మధ్య వేలుకి మధ్య ఇంకొక చిరత ఉంటాయి. బొటకన వేలు తిన్నగా పెట్టి మిగతా నాలుగు వేళ్ళని ముడిచి వేళ్ళసందుల్లో ఉన్న రెండు చిరతలని గట్టిగా నొక్కి పట్టుకుంటాడు. కుడిచేతి బొటకన వేలితోనూ, చూపుడు వేలితోనూ చెక్కలని దగ్గరగా నొక్కుతూ వాయిస్తాడు. ఎడంచేతి బొటకన వేలితో మొదటి చిరతమీద గట్టిగా నొక్కుతూ కుడిచేతి వేళ్ళని వదులు చెయ్యడంతో చిరతలు దూరం అవుతాయి.

గాయకుడు రెండుచేతుల్లో రెండు చిరతలు ఉంటాయి. అన్ని తాళాలతో లయబద్ధంగా అడుగులువేస్తూ అనేక భంగిమల్లో నిల్చుని పాడతాడు.

దాసకాఠియా గాయకుల వస్త్రధారణ వేరు వేరుగా ఉంటుంది. కొందరు పట్టు పంచె కట్టుకుని నడుంకి వోణీ బిగించి కడ్తారు. కాళ్ళకి గజ్జెలు, చేతులకి కంకణాలు, చెవులకి కుండలాలు పెట్టుకుంటారు. నుదుట సింధూరపు బొట్టుగాని, నామంగాని పెట్టుకుంటారు. కొందరు "పాలా" గాయకుల్లా వస్త్రధారణ చేస్తారు. బిగుతుగా ఉండే పైజామా మీద పొడుగుచేతుల లాల్చీ వేసుకుంటారు. తలపాగా చుట్టుకుంటారు. తలపాగా కుచ్చు పొడుగ్గా వీపు మీద వేళ్లాడుతూ ఉంటుంది. పాగాలో పక్షుల ఈకలు అలంకరించుకుంటారు. కనుబొమల మధ్య నామం తీర్చిదిద్దుకుంటారు. సభికులు మెచ్చి తమకి బహూకరించిన మెడల్సు పెట్టుకుంటారు. గాయకుడూ, వంత పాటగాడూ యిద్దరూ గజ్జెలు కట్టుకుంటారు. దాసకాఠియా కార్యక్రమం రాత్రివేళలోనే ఉంటుంది. కాబట్టి కొందరు ముఖాలకి రంగు పూసుకుని మేకప్ అవుతారు. దీపాల వెలుగులో తళతళలాడే సిల్కువస్త్రాలు, జరీబట్టలు కట్టుకుంటారు.

దాసకాఠియా కార్యక్రమానికి స్టేజి లేకపోయినా ఇబ్బంది రాదు. శ్రోతలు, గాయకులు చుట్టూ కూర్చుంటారు. గాయకుడు, వంత పాటగాడు ఇద్దరూ నాలుగు పక్కలా గుండ్రంగా తిరుగుతూ అందరు శ్రోతల్ని ఉద్దేశించి కథ చెప్తారు. కొంతసేపు ఉత్తర దిశగా నిల్చుని, కొంతసేపు దక్షిణ దిశగా నిల్చుని దిక్కులు మారుస్తూ ఉంటారు. బుర్ర కథలో గాయకుడు, వంత పాటగాళ్ళు శ్రోతల

కళింగమంగా ఒక దగ్గరనే నిల్చుని ముందుకూ వెనక్కూ అడుగులు వేస్తూ చెప్పే దాసకాఠియాలో గాయకుడు, పక్క పాటగాడు చుట్టూరా తిరుగుతూ కథ చెప్తారు. ప్రేక్షకులకు వారి పృష్ఠభాగం కనిపిస్తుంది.

దాసకాఠియా పాటలు పురాణో, హోరాణో అని రెండు రకాలు. పురాణోలో హోరి అర్జునో యుద్ధా (కిరాతార్జునీయం) నారోదా బెయొయింటి (నారదమయూరి) లాఖో బిందా (అర్జునుడు మత్స్య యంత్రాన్ని ఛేదించడం) మైరాబోణో బోధా (మైరావణ సంహారం) కోర్ణోదాని (దానకర్ణుడు) అభిమన్యో బోధా (అభిమన్యువధ) వంటి పౌరాణిక గాథలు పాడతారు.

హోరాణో అంటే అసాధారణ గాథలు. ఒరియాలో రుక్మిణి హోరాణో, సుభద్రా హోరాణో, శోభా బొతి హోరాణో, మొదానొబొతి హోరాణో, నళిందీహోరాణో సూర్యోకాంతి హోరాణో చాంద్రకోళా హోరాణో కామొకోళా హోరాణో మొదలైన పౌరాణిక గాథలు, జానపద గాథలు చారిత్రక గాథలు ఉన్నాయి. దాసకాఠియా పాటల కథావస్తువు అవతార పురుషుల జీవితమో, పౌరాణిక వీరుల జీవితమో అవుతుంది. ధనికవర్గపు వారి జీవితాల్ని కూడా కథావస్తువుగా తీసుకొని పాడతారు. సామాన్యుల జీవితాలని, కష్టసుఖాలని కథావస్తువుగా తీసుకున్నా, హేళనా, వ్యంగ్యం కోసమే తీసుకుంటారు.

బుర్రకథలో 'తందాన తాన' తానతందాన వంతతో పాటు అనేకరకాల వంతలున్నట్లే దాసకాఠియాలోనూ చాలా రకాల వంతలు పాడతారు. రామొ జొయొ, రామొ నొబీనొ, సుందొరొ ఘనొశ్యామొ, రామొ గోబిందొ రామొ గోబిందొ రామొ రామొ, జొయొ జొయొ రామొ, రామొ హోరి, రామొ హోరి – మొదలైన వంతలు తాళాన్ని బట్టి సందర్భాన్ని బట్టి ఔచిత్యంతో పాడతారు.

గాయకుడే ముఖ్యుడు కాబట్టి అతనికి విశ్రాంతి ఇవ్వడం పాళియా వంతు. బుర్రకథ వంత పాటగాళ్ళ లాగే దాసకాఠియాలో పాళియా కూడా గాయకుణ్ణి ప్రశ్నలు అడుగుతూ కథా గమనానికి తోడ్పడతాడు. పిట్ట కథలు చెప్తూ అవకతవక ప్రశ్నలు వేస్తూ, తెలివి తక్కువ సమాధానాలు చెప్తూ శ్రోతల్ని నవ్విస్తాడు. ప్రచారంలో ఉన్న సినిమా పాటల వరసలని హాస్యంతో కూడిన పాటలు పాడి నవ్విస్తాడు. దాసకాఠియా వరసలో పాడే హాస్యంతో కూడిన పాట 'ఒబిలా'

ఆహా రామొ గోబిందొ రామొ
నొబీనొ సుందొరొ శ్యామొ
ఆరొతొ భొంజునొ రామొ
అవు సాహాణొ మాఛొరొ
ఢింకి కుటు ధిబొ ధానొ

ఈ 'ఒబిలా' లో మొదటి పంక్తుల్లో రామ నామ సంకీర్తన చేస్తూ ఆఖరి పంక్తులకి వచ్చే సరికి చేపల గురించి ధాన్యం దంచే ఢింకి గురించి చెప్తాడు. రెండింటికి పొత్తు కుదరదేమో నవ్వు రాక తప్పదు.

అడ్డదిడ్డమైన ప్రశ్నలు వెయ్యడమే కాకుండా గాయకుడు చెప్పే మాటలకి, పాడే పాటలకి విపరీత వ్యాఖ్యానం చేస్తూ వ్యంగ్యంగా మాట్లాడతాడు. తన మాటలతో పిల్లల దగ్గర నుండి పెద్దల వరకూ ఆకట్టుకుంటాడు, అయితే

దాసకాఠియాలోని ఈ హాస్యం మొరటుభాషలో ద్వంద్వార్థ ప్రయోగాలతో అశ్లీలతతో కూడా ఉంటూ ఉంటుంది. వంత పాటగాడు చతురోక్తులతో, సున్నితంగా హాస్యాన్ని అందించే ప్రతిభావంతుడు కానప్పుడు చవకబారు హాస్యంతో, స్థాయి తక్కువగా మాట్లాడతాడు. శ్రోతలు అటువంటివంతపాటగాళ్ళకి ప్రోత్సాహమిచ్చినప్పుడు హాస్యం అశ్లీలతతో దిగజారే స్థితి కలుగుతుంది.

బుర్రకథలో ఇద్దరు వంత వాళ్ళు తమ సంభాషణ ద్వారా, వాదోపవాదాల ద్వారా కథని ముందుకు సాగించడంలో ఎక్కువగా సహాయపడతారు. గాయకునికి విశ్రాంతి నిస్తారు. కథని సాగించటంలో బుర్రకథ వంత వాళ్ళకున్నంత ప్రాముఖ్యత దాసకాఠియాలో పాళియాకి లేదు.

దాసకాఠియా హరికథలాగ గద్య పద్యాత్మకంగా ఉంటుంది. గాయకుడు పాటలను, శ్లోకాలను శ్రావ్యంగా పాడి వాటి అర్థాన్ని వివరించి చెప్తాడు. వచనంలో చెప్పాక తిరిగి పాట ఎత్తుకుంటాడు. హరికథలో త్యాగరాజు మొదలైన వాగ్గేయకారుల కృతులను కీర్తనలు పాడినట్టే దాసకాఠియాలో ప్రాచీన ఒరియా కవుల ఛాందో, చౌపదీను పాడతారు. సంగీతజ్ఞుల కృతులను పాడతారు.

రాగాలాపన, స్వరం, తాళం, తానం, గమకం అనే లక్షణాలతో ఉన్న పాటలని "కోశ్శ్వనా గీతా" అంటారు. ఈ కోశ్శ్వనా గీతా హిందుస్థానీ సంగీతంలో ఖయాల్ లాంటివి. చౌపదీ అంటే నాలుగు చరణాలున్న [illegible] గీతాలు. ఒక్కొక్క సారి రెండు, మూడు [illegible] అంతకన్నా అధికంగా చరణాలున్నా చౌపదీ అనే ప్రతిపాదించడం కూడా ఉన్నది. చౌపదీలో స్థాయి అంతరో, సంచారి, ఆభోగో సామాన్య భాగాలు, ఒడిసీ సంగీతంలో పాడే ప్రతి పాట. చౌపది నాలుగో భాగంలో కవిముద్ర ఉంటుంది. అందుకే దీనికి భణతి లేదా భణితా అన్న పేరు ఉంది, మన కీర్తనలలో త్యాగరాజు, గురుగుహ, మొదలైన ముద్రల వల్ల ఆ యా వాగ్గేయకారులని తెలుసుకోవడానికి వీలు ఉన్నది.

ఒడిసీ సంగీతంలో ఛాందోకి ప్రత్యేకమైన స్థానం ఉంది. సంస్కృత కవులు వ్రాసిన ఛందస్సులలో రాసిన పాటలే ఛాందో. ఛాందోలో పల్లవి, అనుపల్లవి, చరణం అన్న విభాగం ఉండదు, అంచేత పల్లవి అందుకుని పాడటం ఉండదు. ఒకే వరసలో చరణాలన్నీ ఒకదాని తరవాత ఒకటి పాడతారు. భావానుగుణంగా రాగాలు ఉంటాయి. చింతా-దేశాఖ, చింతా భైరవ్ రోసాకుల్యా లాంటి రాగాలు వాడతారు. చింతా - దేశాఖ దుఃఖాన్ని విచారాన్ని వ్యక్తం చెయ్యడానికి వీలైన రాగం. ఛాందో పాటలు చాలా వరకు సంకీర్ణ, మిశ్ర రాగాల్లో వ్రాయబడ్డాయి.

దాసకాఠియా పాటల రాగాలు ఒడిసీ సంగీతానికి చెందిన రాగాలు. కర్నాటక సంగీతపు మేళకర్తలు ఒడిసీలో కొన్ని ఉన్నా వాటి పేర్లు వేరు. మేచకళ్యాణి = కోల్యాణో ధీర శంకరాభరణం = నాటో, హరికాంభోజి = శ్రీరాగో, మాయామాళవ గౌళ = గౌడీ, కామవర్ధిని = బోరాడీ, గమనశ్రమ = పొంచామొ, ఖరహరప్రియ = ధోనాశ్రీ. నటభైరవి = కోర్ణాటో, భైరవి = భైరోబి, పంతువరాళి = సోకొబారాడీ. మేళకర్తని ఒడిషీలో మెళో అంటారు. తాళంకూడా దాసకాఠియా పాటలకి ఒడిసీ సంగీతపు తాళమే. [illegible]

మంఠో, ఝుంపకో, త్రిపుట, అడ్డ, రూపకో, ఏకతాళో – ఒడిసీ సంగీత తాళాల్లో దాసకాఠియా పాటలు పాడతారు.

'బొందొనా' తో దాసకాఠియా ఆరంభిస్తారు. ఏ విఘ్నం లేకుండా కార్యక్రమం కొనసాగాలనీ, జనరంజకంగా దాసకాఠియా ఉండాలనీ, బాగా పాడేటట్టు దీవించమని సరస్వతిని స్తుతిస్తూ మొదలు పెడతారు. "బొందొనా" అంటే వందనం అని అర్థం. అందుకే యిందులో దేవతల స్తుతి ఉంటుంది.

'జొయొ బ్రహ్మ నొందిని, జొయొ బీణాపాణి మొయూరొ బాహిని' అని సరస్వతిని స్తుతించి 'జాణాణొ' జగన్నాథుని ఉద్దేశించి పాడతారు. అవతార పురుషులు భక్తుల్ని ఎలా రక్షించిందీ చెప్తూ జగన్నాథుడికి తమ కష్టాలు విన్నవించి అతని దయకోసం దీనంగా వేడుకుంటారు.

హొరి లొతూ యోజొనొరె గొజాడాకొ
దెలా తుం భొంకు
హొరి చొక్రొ పేసి నొక్రొ నాశి ఉద్ధారిలొ
తహొంకు.

గజేంద్రుడు లక్ష యోజనాల దూరం నుండి మొరపెట్టుకుంటే చక్రాన్ని వేసి మొసలిని చంపి రక్షించావు.

హొరి దూరె థాయి డాకొ దెల్లె దెయిథావు
కొర్ణొకు
హొరి నికొటొరె నొ శుణిలొ మొకొర్మొ
బెళొకు.

ఎంతో దూరం నుంచి పిలిచినా చెవి ఒగ్గి వినే దేవుడివి నా కర్మకొద్దీ దగ్గర నుండి పిలిచినా నువ్వు నా పిలుపు వినటం లేదు.

హొరి భాసిగొల్లి భొభొ జొళె, నా
బొదియొ కుళొకు

భవసాగరంలో కొట్టుకుపోతున్నాను. నా పడవను ఒడ్డుకు చేర్చు భగవాన్- అని అనాథుల నాథుడు, నీలగిరి నాథుడు, నీలశైల నివాసి, అయిన జగన్నాథుణ్ణి ప్రార్థిస్తారు.

బొందొనా, జొణాణొ పాడిన తర్వాత తమకు తెలిసిన పురాణొ, హొరాణొ అన్నిటి పేర్లు చెప్పి శ్రోతలు ఏది కోరుకుంటే దానిని పాడతానని చెప్తాడు. శ్రోతలు కోరినదాన్ని కథగా చెప్తాడు.

పాటపాడే విధానం బుర్రకథలో పాటకి కొద్దిగా దగ్గరగానే ఉంటుంది. ఒక పంక్తిలో మొదటి భాగం గాయకుడు పాడేక పాళియా ఆతనితో గొంతు కలిపి ఆ పంక్తినంతటినీ పాడతాడు. ఒక్కొక్కసారి పంక్తిలో మొదటి భాగం గాయకుడు పాడితే చివరి భాగాన్ని పాళియా ఒక్కడే పాడతాడు. "రాజ్యొరొ రాజా" అని గాయకుడు పాడితే 'బొరొణొ' అని పాళియా అందుకుని పాడతాడు. "జొళొ తొరొంగొ" అని రెండవ పంక్తిని గాయకుడు పాడితే "ఓటి మొంత్రినామొ" అని వంత వాడు అందుకుంటాడు

ప్రాచీన ఒరియాకవుల పాటలను సంస్కృత శ్లోకాలను పాడి అర్థాన్ని విడమరచి చెపుతాడు.

గనీశ వక్త్రః నగజా ర్త హోరి కుమార తాత
శశిఖండమౌళి
లంకేశ సంపూజిత పాదపద్మ పయాదవాది
పరమేశ్వరోవః

ఇందులో త్రిమూర్తులని కవి స్తుతించాడు. మొదటి అక్షరాన్ని వదిలి ప్రతిపదాన్ని వదిలితే

విష్ణుస్తోత్రం, మొదటి రెండు అక్షరాలని వదిలి చదివితే బ్రహ్మాస్తోత్రం, మొత్తంగా చదివితే శివస్తోత్రం ఉన్న శ్లోకాల్లాంటి శ్లోకాలు చదివి అర్థాన్ని భావాన్ని విశదీకరించి చెప్తాడు. ఇలా చెప్పడం వల్ల సామాన్యులకు కూడా ప్రాచీన ఒరియా కవిత్వం, సంస్కృత కవిత్వం గురించి జ్ఞానం లభిస్తుంది.

దాసకాళియాలో ఏ కథ పాడి చెప్పినా పాట మధ్యలో సాహిత్య చర్చ చేస్తాడు. సమ కాలీన సాంఘిక, రాజకీయ, ఆర్థిక, నైతిక పరిస్థితుల గురించి చొప్పించడానికి అవకాశం ఉంది. ఏ విషయాన్ని తీసుకున్నా, హాస్య వ్యంగ్యాలతో, శ్రోతల మనస్సుకు హత్తుకునే విధంగా చెప్పడానికి వీలు ఉంది. బుర్రకథ కూడా ఇటువంటి కళా సాధనమే. అందుకే స్వాతంత్ర్య పోరాటపు రోజుల్లో దేశంలో దేశభక్తిని పెంపొందించే విధంగా, రాజకీయ చైతన్యం కలిగించే విధంగా ఎన్నో బుర్రకథలు పాడబడ్డాయి. ఒరిస్సాలో దాసకాళియాని ఆ విధంగా ఆ రోజుల్లో ఉపయోగించుకోలేదు. ఆ రోజుల్లో దా స కా ళి యా కి రాజ కీయాలతో ఏం సంబంధం కలిపించడు. ప్రస్తుతం దాసకాళియా ప్రచార సాధనంగా-వన మహో త్సవం, వరకట్న నిషేధం, వయోజన విద్య మొదలైన విషయాల్ని తెలియచెయ్యడానికి ఉత్కళ ప్రజలలో చైతన్యం కలిగించడానికి ఉపయోగబడుతోంది. కటక్, సంబల్‌పూర్, జయపూర్ ఆకాశవాణి కేంద్రాల నుండి దాసకాళియా ప్రసారం చెయ్యబడుతోంది. నిరక్షరాస్యులైన ప్రజలకి, పల్లెటూరి వారికి, అడవి వాసులకి, వెనకబడ్డ వారికి జ్ఞానం ప్రసా దించే ప్రచార సాధనంగా దాసకాళియాని వినియోగిస్తున్నారు. దాసకాళియా సాధా రణంగా పురుషులే చెప్తారు. బాలికా పాఠ శాలల్లో మహిళా కళాశాలల్లో విద్యార్థినులు కూడా దాసకాళియా పాడి కార్యక్రమం యిచ్చినా ఒరిస్సాలో దాసకాళియాని వృత్తిగా స్వీకరించిన మహిళలు లేరు. తెలుగు దేశంలో హరికథలు చెప్పే భాగవతారిణులు, బుర్ర కథలు చెప్పే మహిళలు ఉన్నారు. కానీ, ఒరిస్సాలో మహిళా గాయకులు, వంతవాళ్ళు-దాసకాళియా చెప్పేవారు లేరు.

# స మా జ మ్

ఆర్. రఘురాం

ఈ ఆధునిక సమాజంలో
ఈ పురోగమన దేశంలో
ఎన్నో సమస్యలు నిండిన ఈ అంధకార రంగంలో
ఇటు తిండి కొరత, అటు బట్ట కొరత
మరొకవైపు గృహోద్యోగ ఆదాయ కొరతలు
ఇవన్నీ, ఇవన్నీ మానవుని శృంగదీయు వేళలలో
ఉద్భవించాయెన్నో యెన్నెన్నో ఆశాకిరణాలు
కానీ, కాని అవన్నీ నిరాశా కిరణాలలా
అంధకారపు యమకూపంలో చొచ్చుకుపోతున్నాయ్
ఎందరో ఎందరెందరో మహానుభావులు
తలపెట్టారెన్నో ఎన్నెన్నో ప్రగతి కార్యక్రమాల్
కానీ కానీ
అవన్నీ పైవారికి మాత్రమే దోహదం చేస్తాయ్
పేదవాడి జీవితాన్ని దుర్భరం చేస్తాయ్
ఒక వైపతి ధనవంతుడు
మరొక వైపతి బీదవాడు
యిటువంటి అసమానపు క్రుళ్లుడు సమాజాన్ని
యిటువంటి అసహన, దుర్భర సమాజాన్ని
పునరుద్ధరిద్దామ్, బాగుపరుస్తామ్
రండో రారండో ఓ భారత పౌరులారా!

# భారతములో నలకథా ప్రాశస్త్యము

వి. దొరస్వామినాయుడు
Research Scholar in Telugu
S. V. U. College, Tirupati

శ్లో॥ "కర్కోటకస్య నాగస్య దమయంత్యా
నలస్యచ।
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలి
నాశనమ్॥"

భారతములో వ్యాసుడు నలకథకుగల ప్రాశస్త్యమును ఈ విధముగ ప్రశంసించినాడు. నలకథను వినువారు, సభలందు చదివెడివారు, కలిదోష నిర్ముక్తులగుదురని, నిఖిల పుణ్యఫల భాగులగుదురని, బహుపుత్ర పౌత్రాయురారోగ్య ధనయుక్తులగుదురనికామాదివిషయములకుదుష్ట విషయాదులకుదూరులగుదురనిధర్మాత్ములగుదురని బృహదశ్వుడు ధర్మజునకు ఈ నలకథా ప్రాశస్త్యమును వివరించినాడు. భారతములో నలకథ వచ్చిన సందర్భము, దాని ప్రాశస్త్యమును పరిశీలించుటయే ఈ వ్యాసముయొక్క ముఖ్య ఉద్దేశ్యము.

నలుడెవరు? నలుడు షట్చక్రవర్తులలో నొకడు.

శ్లో॥ "హరిశ్చంద్ర నలోరాజా పురుకుత్సః
పురూరవః
సగరః కార్తవీర్యశ్చ షడైతే చక్రవర్తినః"

నవద్వీప విశిష్టమైన మహాభూమి నంతటి పరిపాలించిన చక్రవర్తులార్వురిలో 'నలు'డొకడు. ప్రభావ బలదర్పాదులలో పై యార్వురును గొప్పవారేయైనను మొదటి యిర్వురి మహత్త్వము మహత్తరమైనది. హరిశ్చంద్రుని వలెనే నలుడును కష్టపరంపరల ననుభవించినాడు. పురాణములందు నలుడను పేరు కలిగిన వ్యక్తులు చాల మంది యున్నారు. ఉదాహరణకు రామాయణములో విశ్వకర్మ పుత్రుడు నలుడను వానరుడొకడు కలడు. ఇతడు సుగ్రీవుని సేనలో నుండువాడు. సముద్రమునకు వారధి కట్టుట కితడే ప్రారంభించెను. సముద్రము దాటి రామునితో కలిసి రావణునితో యుద్ధము చేసినాడు రఘు వంశములో కుశుని పౌత్రుడైన నిషధుని కుమారుడు నలు డొకడు గలడు. మార్కండేయ పురాణములో ధూమాక్షుని కుమారుడు నలుడొకడుగలడు. శివ పురాణమునందు నల దయమంతుల పూర్వ జన్మ వృత్తాంతమున్నది. భారతములో నలుడు నిషధదేశపు రాకుమారుడు. వివిధ పురాణాలలో నలుడను పేరు గలిగిన వ్యక్తులున్నప్పటికి వారికి ప్రాధాన్యము లేదు. ఆయా పురాణములందు వారు నామ మాత్రావశిష్టులై యున్నారు. భారతములో నున్న నలునకే ప్రాధాన్యమున్నది. భారత నల కథయే వివిధ భాషలయందు కూడ వ్యాప్తి చెందియున్నది.

నలకథ ఎప్పుడు జరిగినది? నల దమయంతు లెవరు? అని ప్రశ్నించుకొన్నప్పుడు నలకథ ద్వాపర యుగాంతమునందు గాని, భారత కథకు సన్నిహిత కాలమునకు ముందు గాని జరిగియుండవచ్చునని స్పష్టముగ చెప్పవచ్చును. నల దమయంతులు పూర్వ జన్మమున ఆహుకు లను భిల్ల దంపతులు శివుడు వారి తపస్సునకు మెచ్చి రానున్న జన్మమున వారు నల దమ

యంతులై జని౦తురనియు, తాను వారికి సంయోగమును ఘటింపుచుని వరమిచ్చెను. ఆహుక భిల్లగాపతులె నల దమయంతులుగా, శివుడు కలహంసగ జన్మించిరని, నల దమయంతుల సంగమము కూర్చిందూత హంసయని శివపురాణము నందు తెలుపబడినది.

The Satarudrasamhita of the Siva-purana maintains that Nala and Damayanti were forests in their previous birth. Billa was born as the son of Virasena in the city of Naishadha. He was the great king Nala. Ahuka was born as the daughter of king Bhima in the city of Vidarbha. She became famous as Damayanti. Siva in the form of Yatinatha was born as a swan and managed the marriage of Damayanti with Nala. The Narration of the story of the incarnation of Yatinatha hamsa is held as auspicious according to the Purana —N.P. UNNI

భారతములో పాండవ కౌరవులకథ ప్రధాన మైనది కాని భారతమునందు మధ్యమధ్య చిన్న కథలు ఉపాఖ్యానములుగ నున్నవి. అట్టి కథ లలో నల కథ యొకటి భారత కథతో నలకథ సంవదించినట్లు మరొక కథ సంవదించుట లేదనియే చెప్పవచ్చును. నల, ధర్మజులు ఇరువు రును చంద్రవంశపు రాజులు. ఇరువురు జూద మున రాజ్యము గోల్పోయిరి. కష్ట కాలము నందు అరణ్య, అజ్ఞాత వాసములు గడిపిరి. చివరకు రాజ్యప్రాప్తు లైరి. భారత కథ నల కథలకు సన్నిహిత పోలికలున్నవి. కావున భారతములో ఈ నలకథ ప్రముఖస్థానము పొం దినది.

భారతారణ్య పర్వమునందు నలోపాఖ్యాన మున్నది ఈ ఉపాఖ్యానము న దు పూర్వోత్తర కథాంశములున్నవి ఈ నలకథను బృహదశ్వ మహర్షి ధర్మజునకు వివరించెను. మునులు త్రికాలవేదులు. బృహదశ్వుడును త్రికాలవేది. నల చరిత్రము న పాండవులు వినిన అనుభవము అరణ్య, అజ్ఞాతవాసములందు సహాయ పడునని బృహదశ్వుడెంచి యుండను. నలుడు దైవ బలము కలవాడు. దైవబలము కలిగిన వారికి తాత్కాలికముగ కష్టము కలిగినను తుదకు శుభము చేకూరును. ధర్మరాజు అరణ్య, అజ్ఞాత వాసములు తన భార్య, సోదరులతో కలిసి గడి పెను కాని నల చక్రవర్తి భార్యావియోగుడై అజ్ఞాతవాస మనుభవించెను. కష్టములనుభవించి, లబ్ధరాజ్యుడైన నలుని కథ వలన కష్టములను భవించుచున్న ధర్మరాజునకు రాజ్యప్రాప్తి కలుగునని ఆశ జనించినది.

భారత-నల కథలకు సమానమైన పోలిక లున్నవి. స్వయంవరము వలన కలి నలునకు శత్రువైనట్లు, ధర్మజుని మయసభాసౌందర్యము జూచినది మొదలు సహజ శత్రువైన దుర్యో ధనునకు ధర్మజునిపై ఈర్ష్య కలిగినది. కలి ద్వాపరుని సహాయ మపేక్షించి అతములు నలునకు ప్రతికూలముగ చేసినట్లు దుర్యోధనుడు శకుని సహాయముతో ధర్మజుని మోసగించి అరణ్యముల పాలు చేసెను. జూదము దోషమని తెలిసియు ఎందులకు ధర్మజుడు జూద మంగీక రించెనని శంకింపవచ్చును. ఆహూతుడైన క్షత్రియుడు రావనరాదు. అందులకై జూదము నంగీకరించియుండును. ఈర్ష్యాళువులు ఎప్పు డును తామే నశింతురు. కీడు చేయదలచిన కలి నశించినట్లు దుర్యోధనుడును నశించునని తెల్పుటకై బృహదశ్వుడు కలి వృత్తాంతము విపులముగ చెప్పెను.

చెను. దమయంతి నలునితప్ప నన్యుని వివాహమాడనని చెప్పినది. సాధారణముగ స్త్రీలు తాము వలచిన యువకుని తప్ప వేరొకరిని వివాహమాడుట కంగీకరించరు. తాము వలచిన యువకుడు వారి హృదయమునందు చోటు చేసికొని యుండును. ఆ అందముకలిగిన వ్యక్తులనుకూడ స్త్రీలు నిరాకరించుటకు ఇదియే కారణము. దమయంతి కృతనిశ్చయమును నలుడు దేవతలకు వినిపించెను. దేవతలును దమయంతి స్వయంవరము చూచుటకు వచ్చిరిగాని యామెను వివాహమాడుటకు మాత్రముకాదు. దమయంతి పాతివ్రత్యమును పరిశీలించుటకు దేవతలు నలాకారముతో స్వయంవరమున ప్రత్యక్షమయిరి. దమయంతి దేవతలను ప్రార్థించి నలుని వివాహమాడినది.

దమయంతి నలుని వివాహమాడిన విషయమును కలి దేవతల వలన తెలిసికొని కోపోపవిష్టుడయ్యెను. దమయంతి తనను వరింపలేదనెడి కోపముతో నల దమయంతులకు పరస్పర వియోగము, రాజ్యభ్రంశము కలిగించుటకు ప్రయత్నించెను. సామాన్యముగ ఈ లోకమునందు అసూయాపరులు ఇతరుల కలిమిని చూచి ఓర్చుకొనలేక వారికి కష్టములు కలిగించుచుందురు. ఒకనాడు నలుడు జలోపస్పర్శనాంతరము పాదశౌచము చేయుట మరచినాడు. ఆ సమయమందు కలి నలుని శరీరమునందు ప్రవేశించెను. ఇదొక సాంప్రదాయకముగ నేటికిని గలదు. పాదములు కడుగకుండా అశుభ్రముగానున్న వ్యక్తిని కలి పట్టునని ఈనాటికి జానపదులు చెప్పుకొనుచుందురు. కలి ప్రభావితులై నల దమయంతులు పరస్పరము వియోగము చెందిరి. నలుడు బాహుక రూపమున ఋతుపర్ణు నాశ్రయించెను. దమయంతి చేదిపురము చేరి సైరంధ్రి వృత్తితో కాలము గడుపుచుండెను. నల వియోగముతో దమయంతి దుర్భర కష్టము ననుభవించుచున్నను ఆమె నలుని గూర్చియే చింతించినది. ఇది దమయంతి పతివ్రతా లక్షణమునకు నిదర్శనము.

దమయంతిని సుదేవుడను విప్రుడు కనుగొనెను. దమయంతి ద్వితీయ స్వయంవరమునకు వచ్చు ఋతుపర్ణుని నుండి నలుడు అశ్వహృదయమను విద్య నేర్చుకొనెను. ఆ విద్య ప్రభావముచే నలుడు కలి విముక్తుడగును. అనంతరము నలుడు, ఋతుపర్ణుడు విదర్భ చేరుకొనిరి. నలుడు రథము నడుపుటలోను, రుచికరమైన వంట చేయుటయందు నేర్పరి. నలుని రథఘోష వలన, కేశిని ద్వారా నలుని వంటకములు తెప్పించి వాటి రుచివలన దమయంతి బాహుకుని నలునిగా గుర్తించినది. అందులకే జానపదులు రుచికరపదార్థము గురించి చెప్పునపుడెల్ల 'నలభీమపాక' మనుచుందురు. నలుడు ఋతుపర్ణుని యింట రుచికరమైన వంట చేయుచుండెనని, భీముడు వలల నామముతో విరటుని కొలువున వంటవాడై వివిధ పాకముల చేయుచుండెనని పురాణ ప్రసిద్ధి. నలుడు దమయంతి పాతివ్రత్యమును గురించి శంకించును. వాయుదేవుడు ప్రత్యక్షమై నలునకు దమయంతి పతివ్రతాను గుణమును చెప్పెను. నలుడు కర్కోటకుని దలచి నాగవస్త్రముచే నిజరూపము నందెను. నలుడు తనదాయాదియైన పుష్కరుని జూదమునుండు ఓడించి రాజ్యము గ్రహించెను.

భారతములో నున్న నలకథయందు కొన్ని ఆచారములు, సాంప్రదాయకములైన సన్నివేశములు కలవు. భారతములోని నలోపాఖ్యానము యొక్క ప్రాశస్త్యమును గుర్తించి తెలుగుకవులు ప్రత్యేకమైన నలకథా కావ్యములు కూడ రచించిరారు. ఈ నాటికిని నలకథ శ్రవణము వలన కలిదోషము తొలగునని జానపదులకు విశ్వాసమున్నది.

# కీర్తి మణిహారం

శ్రీమతి కమలా రాఘవన్

( 11–2–80 న ఘంటసాల 6 వర్ధంతి సందర్భముగా )

సీ. గాన కౌశల ధీర కమనీయ గుణసార ఘనకీర్తి మణిహార ఘంటసాల
సాధువర్తన శీల గీతాపఠన లోల గంభీర వాగ్జాల ఘంటసాల
మధుర మంజుల గాత్ర మహిత సచ్చారిత్ర నాట్యకళాచిత్ర ఘంటసాల
సాధు మనోహృద్య సకల దేశారాధ్య గాన కళావేద్య ఘంటసాల
తే. నీదు గీతము లిలగల్గినంత వరకు
నీవు యున్నట్లె భావింతు మవని యందు
మధుర గాయక నిన్నెము మరువ గలమె
ఘనత వెంకటేశ్వర నామ ఘంటసాల.

సీ. ఒక్కొక్క పాటలో నొప్పింతు వెన్నెన్నొ మధుర భావసంపు మహితవృత్తి
ఒక్కొక్క పదములో నొల్కింతు వెన్నెన్నొ మకరంద బిందులు మంజులముగ
ఒక్కొక్క మాటలో పల్కింతు వెన్నెన్నొ గంభీర భావాలు కాంక్షమేరయ
ఒక్కొక్క గీతిలో చొక్కింతు వెన్నెన్నొ ప్రణయానుభూతుల ప్రాభవమున
తే. ఒక్క పద్యము పాడగా సొక్కు భువియు
ఒక్క వాక్యము పలుకంగ మక్కువలరు
ఒక్క ఆలాపనము జూపు స్వర్గసీమ
వెంకటేశ్వర నిన్నెన్న నాకు దరమె.

సీ. ఏ యింద్రు సభలోన దివ్యాంగనల నాట్యకళ దిద్దుచుంటివో కళనిధాన
ఏ కిన్నరుల పాటకిడవందు బాణీలు గూర్చుచునుంటివో లలిత హృదయ
ఏ కింపురుష వీణలకు తంత్రికల సవరించుచు నుంటివో విజయశీల
ఏ సిద్ధ సాధ్యుల కెలమి గీతార్థ సిద్ధిని గూర్చుచుంటివో ఘనవిచార
గీ. స్వర్గవాసులు నీ గానకళను జూచి
కూర్మినేర్పగ గొంపోయి రేమి నిన్ను
దూరమును జేసె మాకు నిన్ దుష్టవిధియు
మేటి గుణజాల శ్రీకర ఘంటసాల.

సీ. గీతా ఘనరసాల కిసలయమ్ముల నాను పుంస్కోకిలము నీవు పుణ్యచరిత
భక్తిగీతావళీ పుష్కరిణుల యాడు రాజహంసము నీవు రమ్యగాత్ర
శృంగార గీతికారామముల చరించు చంచరీకము నీవు చతుర భావ
రణరంగ పద్యాల కానలో గర్జించు విజయ సింహము నీవు వీరవర్య
తే. చిత్రభూమిని నటకుల పాత్రలెరిగి
వారి గాత్రము నీ వౌచు వాసి బలికి
జీవ రాగము లొలికించి చిత్రములకు
ఘనతగూర్చిన మణిమాల ఘంటసాల.

శా. నీ సంగీత సుధారసంబు చెవులన్ నింపారగా సోకినన్
ఆసల్ మోసులు వేయగా ప్రియమతిన్నా బాల గోపాలమున్
నీవంబున్ మదిబాయనొల్లని తమిన్ వేలారుచున్ విన్నదే
వాసిన్ వింటరు నిన్ను మెచ్చితిర మొప్పన్ ఘంటసాలా ధరన్.

యీ దిఙ్నాగుని కాదూషణములకు సమాధాన మును చెప్పి కాళిదాస కవిత్వమును ప్రచార మునకు తెచ్చెననియు యీ శ్లోకమునందు సూచించెను. ఈ దిఙ్నాగుడు క్రీ. పూ. 1వ శతాబ్ది లేక క్రీ. శ. 1 వ శతాబ్దిలో ఉన్నట్లు బౌద్ధ కావ్యముల వలన తెలియుచున్నది.

మాళవికాగ్నిమిత్రము నందలి భరత వాక్యము ననుసరించి మాళవికాగ్ని కర్త కాళిదాసు అగ్నిమిత్రుని సమకాలికుడని వేమ భూపాలుడు యీ గ్రంథ వ్యాఖ్యానమున సూచించెను. మఱియును క్రీ. పూ. 1 వ శతాబ్దిలో నున్న మహా భాష్యకారుడు అగ్ని మిత్ర, పుష్యమిత్రులను నామధేయములను యుదహరించియున్నాడు

కావున కాళిదాసు క్రీ. పూ. 1 వ శతాబ్దికి గాని, లేక క్రీ. శ. 1 వ శతాబ్దికి కాని చెందిన వాడై యుండవచ్చును.

కాళిదాస మహాకవి సర్వశాస్త్రపారంగతుడు. వైదిక మతానుయాయి యని యాతని ప్రతి గ్రంథమునందును స్పష్టముగ తెలియుచున్నది. కాళిదాసు వంటి మహాకవి వేరొకరులేరని

"పురాకవీనాం గణనా ప్రసఙ్గే
కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా
అద్యాపి తత్తుల్య కవేరభావాత్
అనామికా సార్థవతీ బభూవ"

యని యొక కవి 'అనామికా' శబ్దార్థమును చమత్కరించి యున్నాడు.

### శిల్పశాస్త్ర పాండిత్యము

రఘువంశ ద్వితీయ సర్గ ప్రారంభమున "అథ ప్రజానామధిపః ప్రభాతే జాయా ప్రతి గ్రాహిత గన్ధ మాల్యాం" యను శ్లోకము నందలి "జాయా" శబ్దమును ప్రయోగించు టలో ఎంతయో విశేషార్థమిముడియున్నది.

"పతిర్జాయామ్ ప్రవిశతి గర్భో భూత్వా
సమాతరం
తస్యాం పునర్నవో భూత్వా దశమే మాసి
జాయతే
తజ్జాయా జాయా భవతి యదస్యాం జాయతే
పునః"

యను వేద వాక్యార్థమును,

"పతి ర్భార్యామ్ సంప్రవిశ్య గర్భో భూత్వే
హ జాయాతే
జాయా యాః తద్ధిజాయాత్వం యదస్యాం
జాయతే పునః"—

యను మనుస్మృతి శ్లోకార్థమును సూచించెను. 'జాయా' శబ్ద ప్రయోగము వలన సుదక్షిణా దేవికి పుత్రజనన యోగ్యతను సూచించెను.

"తస్యాః ఖురన్యాస పవిత్ర పాంసుమ్ .." యను శ్లోకమున 'శ్రుతే రివార్థం స్మృతి రన్వ గచ్ఛత్' యని నందినీ మార్గము ననుసరించిన సుదక్షిణాదేవిని వర్ణించుచు యుపమానముగ చెప్పెను. ఇందు స్మృతి, శ్రుతి మార్గమున ననుసరించినచే ప్రమాణమగుననియు, శ్రుతి విరుద్ధమైన మన్వాది స్మృతి యప్రామాణమనియు పూర్వ మీమాంసా శాస్త్రమున చాల విపులముగ చర్చించబడియున్నది. గోవు శ్రుతి యనియు, సుదక్షిణాదేవి స్మృతి యనియు సూచింపబడి నది. సుదక్షిణాదేవి స్మృతి వలె పవిత్రురా లనియు సూచితమైనది.

"తాం దేవతా పిత్రతిథి క్రియార్థా మన్వ
గ్వ్యయా మధ్యమ లోకపాలః
బభౌచ సాతేన సతాం మతేన శ్రద్ధేవ
సాక్షా ద్విధినోప పన్నాః
(రఘు. ద్వి)

యను శ్లోకము నందు యజ్ఞ సామగ్రితో కూడిన శ్రద్ధ (ఆస్తిక్యబుద్ధి) వలె, యా దిలీపునితో కూడిన యా ధేనువు ప్రకాశించెనని యుపమ

మానోపమేయ భావ మత్యధిక సమంజసముగ నున్నది. అనుష్ఠానము లేని ఆస్తిక్యబుద్ధి వ్యర్థ మని పరోక్షముగ సూచించుచు తన ధర్మశాస్త్ర పాండిత్యమును తెలిపినాడు.

"వామేతరస్తస్య కరః ప్రహర్తుః..." యను రఘువంశ శ్లోకమున "చిత్రార్పితారంభ ఇవావతస్థే"— యని సింహ వధార్థము బాణము తీయుటకై అమ్ములపొదిపై నుంచిన చేయి స్తంభించిపోగా, దిలీపుడు చిత్రలిఖితారంభుడుగ నుండెనని యాతనిని చిత్రీకరించి చూపెను. ఇట్లే కుమారసంభవమునందలి తృతీయ సర్గనందు స్థాణువనమున వసంత విజృంభణ సమయమున ప్రకృతి యంతయు స్తంభించిపోవుటను 'నిష్కంప వృక్షం, నిభృత ద్విరేఫం...' యను శ్లోకము నందు 'చిత్రార్పితారంభ మివావతస్థే' యని చిత్రీకరించెను. అభిజ్ఞాన శాకుంతలము నందును 'చిత్తే నివేశ్య', "యద్యత్ సాధూన చిత్రేస్యాత్..." యను శ్లోకములందు తన చిత్రకళా పాండిత్యమును నిరూపించుకొనెను.

అథ నయన సముత్థం జ్యోతిరత్రేరివ ద్యౌః
సురసరి దివ తేజో వహ్ని నిష్ఠ్యూత మైశం
నరపతికుల భూత్యై గర్భమాధత్త రాజ్ఞీ
గురుభి రభినివిష్టం లోకపాలానుభావైః"—

యిత్యాది శ్లోకములు కాళిదాస మహాకవి యొక్క పురాణేతిహాస పాండిత్యమును మను ధర్మశాస్త్ర పాండిత్యమును నిరూపించుచున్నది. అత్రి నేత్రమునుండి చంద్రుడుదయించెనను విషయము వ్యాసుని హరివంశమున "నేత్రాభ్యాం పరిసుస్రావ దశధా ద్యోతయన్ దిశః తమ్ గర్భమ్ దశధా హృష్టాః దిశో దేవ్యో దధుస్తదా" —యని వర్ణింపబడియున్నది.

గంగానది అగ్నియని తెజస్సగు స్కందుని వలె నుద్భవించెనని గర్భమును ధరించెనని వర్ణించినాడు. "గురుభి రభినివిష్టం లోకపాలానుభావైః" —యని 'అష్టానామ్ లోకపాలానామ్ వపుర్ధారయతే నృపః' యను మనుస్మృతి శ్లోకార్థమును సంగ్రహించెను. మఱియును 'గర్భమాధత్త రాజ్ఞీ' యనునది

"యదేయం పృథివీ మహీ తిష్టన్తి గర్భ
మాదధే

ఏవం గర్భ మాదధత్స్వదశమే మాసి సూతవ" -యను వేద వాక్యార్థము ననుసరించి యున్నది.

"ప్రయోజనాపేక్షితయా ప్రభూణామ్
ప్రాయశ్చలం గౌరవ మాశ్రితేషు"
(కుమార. సం.)

యను శ్లోకమునందు కాళిదాసు యొక్క రాజనీతి శాస్త్ర పాండిత్యము స్పష్టమగుచున్నది. అనగా రాజులు ఫలతంత్రులే కాని గుణతంత్రులు కారు. ఇది రాజనీతి సారము.

"శ్రుతం మయా మత్ప్రణిధిః సవర్గః"— (కు. సం.) యను నీ శ్లోకపాదమున "రాజనశ్చార చక్షుషః' -యను రాజనీతిని తెలిపినాడు.

"బీజాంకురః ప్రాగుదయా దివాంభః"- యను పద్యపాదమున వ్యవసాయ శాస్త్ర విశేషాంశములు తెలుపుచున్నాడు.

"పర్యంక బంధస్థిర పూర్వకాయం...", "భుజంగ మోన్నద్ధజటాకలాపం..." 'అవృష్టి సంరంభ మివాంబు వాహం..."- (కు. సం.) మున్నగు శ్లోకములలో పరమేశ్వరుని సమాధి నిష్ఠను వర్ణించుచు తన యోగశాస్త్ర పాండిత్యమును సూచించెను.

కుమార సంభవమందలి "శిరసా ప్రణిపత్య యాచితా..." మున్నగు శ్లోకములందు కాళిదాసు యొక్క కామశాస్త్ర పాండిత్యము తెలియుచున్నది.

"ఇతి చాపి విధాయ దీయతాం సలిల స్యాంజలి ", "పరలోక విధే చ మాధవ!..." (కు. సం.) యను శ్లోకములలో దహనసంస్కారము, పిండోదక ప్రదానము, జలతర్పణము మున్నగునవి వర్ణింపబడినవి. దీనివలన కాళిదాసునకు కర్మకాండపైగల భక్తి, ప్రామాణ్యము. శ్రద్ధ తెలియుచున్నది.

"గ్రీష్మే పంచాగ్ని మధ్యస్థః వర్షాసు
స్థండిలేశయః"

అగ్ని స్సవితా, సపితై వాగ్నిః" యను వేద వాక్యముల ననుసరించి పార్వతీదేవి తపస్సు వర్ణించబడినది.

"స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః
పయోధ రోత్సేధ నిపాత చూర్ణితాః
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోద బిన్దవః"—

(కు.సం.)యను శ్లోకము కాళిదాస కవిత్వ రత్నమాలలో నాయకమణి వంటిది. ఈ శ్లోకము ధ్వనిని, యనేక యోగ శాస్త్రాంశములను, సాముద్రిక శాస్త్రమును ధ్వనింప చేయుచున్నదని కవిత్వ తత్వజ్ఞుల అభిప్రాయము.

కుమారసంభవమందలి

"దృష్టి ప్రపాతం పరిహృత్య తస్య
కామః పురః శుక్రమివ ప్రయాణే"—

యను శ్లోకమందలి "పురః శుక్రమివ" యను పదము ద్వారా తన శకున శాస్త్ర పాండిత్యమును మచ్చునకు చూపించినాడు.

## ప్రకృతి వర్ణన

"అవాకిరన్ బాలలతాః ప్రసూనై రాచార
లాజై రివ పౌరకన్యాః"
(రఘు.)

-యను శ్లోకమునందువాయు ప్రేరితముతైన వన లతల నుండి పుష్పములు రాలుచున్నవను టను కవి ప్రకృతోపయోగిగా ఆచారలాజలను పౌరకన్యలు చల్లినట్లుగ కవి వర్ణించినాడు.

"సః కీచకై ర్మారుత పూర్ణరంధ్రైః" (రఘు) యను శ్లోకమునందు మారుత పూర్ణ రంధ్రములను, కీచక రంధ్రములను ధ్వనులతో కూడిన వనదేవతా గానమును దిలీపుని కీర్తి గాయకులగు వంది మాగధుల స్తోత్రముగా వర్ణించి ఆకీచక ధ్వనినికూడ ప్రకృతోపయోగిగా చమత్కరించెను.

"శ్రేణీబన్ధా ద్వితన్వద్భిర స్తమ్భాం తోరణ
స్రజం
సారసైః కల నిర్హ్రాదైః క్వచి దున్నమితా
ననౌ, — (రఘు. ప్ర)

యను శ్లోకమునందు సారస పక్షులు బారులు తీర్చి పోవుటను దిలీప మహారాజు వశిష్ఠాశ్రమమునకు పోవు మార్గమునందు ఆకాశమున స్తంభములు లేకయే కట్టబడిన తోరణముల వలె నున్నవనియు వాని అవ్యక్త మధురధ్వని స్వాగత వచనముల వలె నున్నవనియు కాళిదాసు ప్రకృతిని చమత్కరించి ప్రకృతోపయోగిగా చేసెను.

"స పల్వలోత్తీర్ణ వరాహయూథాని ..."
(రఘు)

యిత్యాది శ్లోకములోని వరాహములు, నెమళ్ళు, జింకలన్నియు కాల, నీల, ధూమ్ర, శ్యామ వర్ణములు గలవి. శ్యామలమైన యడవి యందున్నవి. సంధ్యారాగము సన్నగిల్లుచు అడవియందు జిలుగు చీకట్లలముచున్నవి. అట్టి దృశ్యమును చూచుచు దిలీపుడు ఆశ్రమాభిముఖుడై గోవు ననుసరించుచుండెను. ఇది చక్కని సంధ్యాకాల పరిణామ వర్ణనము.

"అన్యేద్యురాత్మానుచర్యభావం
గంగా ప్రపాతాంత నిరూఢ ఘాసం..."
(రఘు.)—

యను శ్లోకమునందలి గంగా ప్రపాతము, దాని చేరువ లేత పచ్చిక, ఆ చెంత గౌరీ గురువైన హిమవంతుని గహ్వరము - యిట్టి సుందరమైన ప్రదేశమును కవి చిత్రీకరించి చూపెను. అట్టి సుందరదృష్టి కనుకనే నియమవ్రతనిష్ఠుడైన దిలీపు డాదృశ్యముపై తన దృష్టిని మరల్చెను. తుదకు గోవుపై నున్న సింహమును వర్ణించు నపుడు గైరికాది ధాతుమయమైన పర్వతోర్ధ్వభూమిపై వికసించిన లోధ్ర వృక్షము వలె నున్నదని ప్రకృతి సౌందర్యరూపముగనే వర్ణించెను. అద్రి శోభా ప్రహితేక్షణుడైన దిలీపుని హృదయమందు కల్గిన సంస్కారము వలన నందినిపై నున్న సింహము ఆ ప్రకృతిదృశ్యము వలెనే కన్పట్టినది. ఇది ప్రకృతిలో నన్న ఆకర్షణ శక్తి.

కుమార సంభవమందలి వసంత విజృంభణ సమయమునందు కల్గిన పరిణామ వర్ణన-యనగా దక్షిణానిలము వీచుట, దోహద క్రియ లేకనే అశోకము, కర్ణికారములు వికసించుట, ఫలాశ పుష్పముల ప్రకాశనము, తిలక వృక్షము పుష్పించుట వసంతలక్ష్మి యలంకరణము మున్నగునది ప్రకృతి శోభావర్ణనమే. మృగములు, పుంస్కోకిలలు, కింపురుషాంగనలు, తాపసులు మున్నగు స్థావర జంగమాత్మకమైన ప్రకృతియంతయు శృంగార రసముతో నిండి పోయినట్లు కాళిదాసు వర్ణించినాడు.

అభిజ్ఞాన శాకుంతలము నందలి చతుర్థాంకమున శకుంతల ప్రయాణ సమయము నందలి కోకిలల ధ్వనులను శకుంతలాగమనమును వన దేవత లామోదించినట్లుగా

"అనుమతగమనా శకున్తలా తరుభిరియం
వనవాస బంధుభిః
పరభృత విరుతం కలం యథా ప్రతి వచనీ
కృతమే భిరీదృశమ్"

యను శ్లోకమున సరసముగ వర్ణించెను మరియు శకుంతలకు వనదేవతలు వృక్షముల రూపమున పట్టుచీరలు, ఆభరణములు, పారాణి యొసగినట్లుగా వర్ణించినాడు.

వసంత పుష్పాభరణములను ధరించి పరమేశ్వరుని శుశ్రూషకై వచ్చుచున్న పార్వతీదేవిని

"ఆవర్జితా కించిదివ స్తనాభ్యాం
వాసో వసానా తరుణార్కరాగమ్
పర్యాప్త పుష్పస్తబకావనమ్రా
సంచారిణీ పల్లవినీ లతేవ" (కు.సం.) యని

ప్రకృతిలోని భాగమైన లతతో పోల్చి వర్ణించెను. దీని ద్వారా ప్రకృతిసుందరులైన వాని కన్నను సహజములైన చాల అందముగ నుండునని చూపించినాడు. ఈ అభిప్రాయమునే శాకుంతలమునందు శకుంతలా రూప సౌందర్యము అంతఃపుర స్త్రీల సౌందర్యము కంటె మించినదని "దూరీకృతాః ఖలుగుణైః ఉద్యాన లతాః వనలతాభిః"- యను వర్ణనలో సూచించెను.

కుమార సంభవమందు తపో వేషధారిణి యగు పార్వతీ వర్ణన గావించుచు పార్వతీదేవి ముఖము అలంకృతి శిరోరుహముల చేత వలె జటల చేత ప్రకాశించినది యను విషయమునకు దృష్టాంతముగ తామరపువ్వు విబుధల చేతనే కాదు నాచుచేత కూడ ప్రకాశించునని ప్రకృతితో పోల్చి చెప్పినాడు

## పాత్ర చిత్రణ

కాళిదాసునకు స్త్రీ జాతిపై గల అమిత గౌరవాభిమానము లాతడు కావించిన స్త్రీల పాత్ర చిత్రణ ద్వారా కన్పట్టుచున్నవి.

"వసిష్ఠధేనో రనుయాయినం తం
ఆవర్తమానం వనితా వనాన్తాత్"
-(రఘు)

యను శ్లోకమున "వనితా జనితాత్యర్థాను

రాగ యాంచ యోషితి" యని యమర కోశమున వివరించినట్లు వనితా శబ్దమును కాళిదాసు ఉపయోగించుచు స్త్రీ సహజమగు ప్రత్యనురాగముతో ఉపవసించిన నేత్రములతో వన్నట్లుగ రెప్పపాటు లేని కన్నులతో దిలీపుని పానము చేసినదట. "సుదక్షిణ" యను నామధేయమునందే దాక్షిణ్యవతి యనియు, యజ్ఞమునకు దక్షిణ వలెనను ఉపమానముచే దాక్షిణ్యవతి యగు భార్యగల మానవుడే పరిపూర్ణుడనియు వర్ణించుచు హిందూ ధర్మశాస్త్రమునందు, మత విషయమునందు, తుదకు వ్రతాచరణకును స్త్రీకి గల అగ్రస్థానమును నిరూపించెను.

సుదక్షిణాదేవి భర్తతోపాటు ఆశ్రమ ధర్మము ననుసరించుచు సంతానము కొరకై తాపస ధర్మము నాశ్రయించినది. పార్వతీదేవియు పరమేశ్వరుడు భర్తగావలెనని తాపస ధర్మము నాశ్రయించి దేవతలకు సేనానాయకుడగు కుమారుని కూడ పొందినది. వీరి తపోనిష్ఠానములో కొంచెము భేదమున్నది. అర్థశరీర మిచ్చునంతటి యనురాగము కలిగినట్టియు, మృత్యు విజేత యైనట్టియు భర్త కావలెనను స్త్రీ సహజమైన కోరికతోనే పార్వతీదేవి తీవ్ర తపమొనర్చినది.

రఘువంశమందలి తృతీయ సర్గలో సుదక్షిణాదేవి గర్భవతియైన పిమ్మట ఆమెకు దౌహృదముగా మృద్భక్షణము నొనర్చినట్లు చెప్పబడినది. ఈ మృద్భక్షణమును కవి పుట్టబోవు కుమారుడు దిగంత విశ్రాంతరథుడై భూమినంతయు పరిపాలించు ననుటకు సూచకముగ ఆమె యితర రసవత్తరమైన పదార్థములను వదలి మృద్భక్షణమున ఇచ్చను పొందెనని చమత్కరించెను.

ఈ విధముగా గర్భిణీస్త్రీల మనస్తత్వమును, తత్త్వజ్ఞమును తెలియజేసెను. ఇదే విధముగ పార్వతీదేవియు తన మనోరథమగు తపోనిష్ఠను తండ్రికి స్వయముగ తెల్పుటకు సిగ్గుపడి సఖీ ముఖమున యెరింగించినది ఇచట "మనోరథజ్ఞం పితరం" - యను ప్రయోగము అభిప్రాయ గర్భితమైనది. మనోరథము తెలిసిన వాడు కనుకనే పార్వతీదేవి తెల్పుటకు ప్రయత్నించినది. ఈ విషయమునే కవి 'మనస్వినీ' యను విశేషణముచే సూచించెను. 'మనస్విని' కావుననే 'పితారక్షతి కౌమారే' అను ధర్మశాస్త్రానుసారముగ జనకుని యనుమతిని కోరినది.

కాళిదాసు శాకుంతలములో ఎంతటి పతివ్రతయైనను పుట్టింట నుండినచో లోకులు పరిపరి విధముల శంకింతురు యని "సతీమపి జ్ఞాతి కులైక సంశ్రయామ్" - యని వాడెను. "అన్యథా భర్తృమతీమ్ విశఙ్కతే" - యని లోక స్వభావమును కూడ తెలియజేసెను. దుష్యంత తిరస్కృతయై దుఃఖితయగు శకుంతలను జూచి శారజ్ఞుడు "ఇత్థం ఆత్మ సుతమ్ చాపలమ్, అప్రతిహతమ్ ఆత్మానమ్ దహతి" -యనినాడు. అనగా పెద్దల యనుమతి లేకయే ఆలోచింపక చేసినట్టి పని యీ విధముగ ఆత్మను దహించునని భావము. ఇచట 'చాపలమ్' యను పదము సందర్భోచితముగ వాడబడినది. కాళిదాసు తన స్త్రీ పాత్రల ద్వారా లోకమునకే నీతిని తెలియజేయుచున్నాడు.

కాళిదాస మహాకవి దృష్టిలో స్త్రీ యొక ఉత్తమ రత్నము. ఈ విషయమును తన ప్రతి కావ్యమునందును సూచించెను. బ్రహ్మచారి పార్వతీదేవి భర్త కొరకే తపస్సు చేయుట తగదని చెప్పుచు "న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్", "ప్రసారయేతి పన్నగ రత్న సూచయే" యని వివరించెను. రత్నము ప్రతి

గ్రహీతను వెదకుచు పోదు. రత్నమునే ప్రతి గ్రహీత వెదకుచు వచ్చును. ఇది లోకధర్మము. కావున రత్నము వంటి పార్వతి కొరకే వెదకుచు పతి రావలెను కాని, యామె భర్త కొరకు తపస్సు చేయరాదని చెప్పినాడు. మహా మహిమాన్వితలగు స్త్రీలు పాము పడగ నున్న రత్నమువంటి వారు. వారి విషయమున దుర్బుద్ధి ప్రవర్తించువారు రత్నమునకై ఆస పడి సర్పము వద్దకు పోయిన వారు దాని కాటునకు గురియైనట్లే యామె దృష్టికి గురియై భస్మమగుదురని చెప్పుచు, దీని ద్వారా పురుషులకు హితోపదేశము కావించినాడు. ఈ విధముగనే అభిజ్ఞాన శాకుంతలమునందు శకుంతల కణ్వ మహర్షి కుమార్తెయని తలంచినంత వరకు ఆమె నగ్నితో పోల్చెను. ఈ విషయమునే "అశఙ్కసే యదగ్నిమ్, తదిదమ్ స్పర్శక్షమం రత్నమ్", "స్త్రీ రత్న సృష్టి రపరా ప్రతిభాతి సామే", "అనాఘ్రాతమ్ రత్నమ్" -యనియు శకుంతలను వర్ణించెను.

కుమార సంభవమున తపస్సు చేయుచున్న పార్వతిని చూచుటకై మహా తపస్సంపన్నులు, వృద్ధులగు, మహర్షులు వచ్చిరను విషయమును సమర్థించుచు "నధర్మ బుద్ధేషువయస్సమీక్ష్యతే" యని గుణములే కాని, వయస్సు స్త్రీ పురుషాది భేదములు ప్రధానము కావని చెప్పినాడు. ఈ విషయమునే భవభూతి మహాకవి, అరుంధతీదేవి సీతాదేవి పాతివ్రత్యాది గుణములను కొని యాడిన సందర్భమున "గుణాః పూజాస్థానమ్ గుణిషు నచ లిఙ్గమ్ నచ వయః" -యని వివరించెను.

దిలీపుని ప్రధానముగా ధర్మవీరత్వముతో కూడిన దయావీరుడుగా కాళిదాస మహాకవి సృష్టించెను. అందువలననే "నివర్త్య రాజా దయితాం దయాలుః" -యని చెప్పి దయాళుత్వమును మొట్టమొదటనే సూచించెను. "స్వవీర్య గుప్తాహి మనోః ప్రసూతిః" -యని యుద్ధ వీరత్వమును కూడ యాతనిలో సూచించెను మఱియును పాశభృత్సముడని, మరుత్స ఖాభుడనియు దిలీపుని గాంభీర్యాన్ని గుణములను వివరించుచు

"మహౌజాస్తతోఽతి గంభీరః కృపావాన వికత్థనః" - యను నాయక లక్షణములను దిలీపునియందు నిరూపించినాడు.

తాను సార్వభౌముడయ్యును నందినీధేనువు పైనను, గురువు పైనను అమిత భక్తిగల వాడని "భక్త్యోప పన్నేషు హి తద్విధానామ్", యని, "గురోర్భవాన్ దర్శిత శిష్యభక్తిః" యనియు తెల్పెను.

"సేయం స్వ దేహార్పణ నిష్క్రయేణ" తన దేహము నర్పించి గోవును రక్షించుట న్యాయ మని శరీరార్పణముచే ప్రాణిరక్షణము చేయుట దయాళుత్వమునకు పరాకాష్ట. ఈ విధముగా దిలీపుని ఉత్తమునిగా చిత్రించినాడు కాళిదాస మహాకవి.

అట్లే అభిజ్ఞాన శాకుంతలము నందు దుష్యంతుని పాత్రను కూడ సృష్టించినాడు. మహా భారతమునందు అసత్య భాషియైనట్టి దుష్యంతుని సత్యభాషిగా మార్చినాడు. దుష్యంతుని పాత్రను యుత్తమరీతిలో తీర్చిదిద్దుట కొఱకే దూర్వాస ముని శాపమును రూపొందించినాడు. కాళిదాస శాకుంతలము వలననే దుష్యంతుడు సర్వోత్తముడుగ మానవాళి యందు ప్రసిద్ధికెక్కినాడు.

(సశేషం)

# కవితా స్రవంతి

గాలి రోసి నాయుడు

ఒకనాడు
ఇనకరములు మృదువుగా స్పృశించిన వేళ
నవనాడులు పులకరించె
నవరాగము పలుకరించె
వింత తేజము నన్నావహించె
అపుడే
నీ సన్నిధిని
సకల సౌభాగ్య పెన్నిధిని
కనుగొన్నది
అవునన్నది
ఆ నాడు పరిమళించిన చెలిమి
దినదినాభివృద్ధిగ పరిణమించిన ఈ నాటి కలిమి
తిమిరావరణ సమీకృతమై
సమరమైతోచె బ్రతు కొకనాడు
మానస గవాక్షముల పరికించగనే
కరుణా వీక్షణముల లాలించె నీనాడు
నవ్వివోయెడు వారి ననుకరించగ లేను
త్రవ్వివోసెడు కథల నాలకించగ రాను
సుషుప్త్యనంతర చైతన్యద్యోతకమైన
మేఘ కూటమ్ముల గాంచినంతనె
తవద్దర్శనానుభవ భావమ్ములూగ
కేకివలె నృత్యమ్మొనర్చె నాడుమది
ఈ యనుభూతిని కాదందునా?
ఇది మూర్ఖభావాల ఛాయా చిత్రమందునా?
ఉపవన నికుంజ వేదిపై
నిలుచుండి తిలకించగ
నీదైన నిట్టూర్పులో పరిభవిల్లి
నను దాకిన సమీరము

అనురాగ వల్లరుల కురిపించె
ఆనంద సాగరమున నను ముంచె
శ్రమ జనిత భావ మిది యందునా?
స్వప్న జనితమీ సొగసందునా?
ప్రభాత పూజ సేసి
పూర్వ దిక్కును పరికించగనే
మధు మోహాలహారి సదృశ హాసము
స్నిగ్ధ శీతల కృపారస ధారల
దృగంచమ్ముల ద్రవించి స్రవించు
ప్రేమ వాహినుల
ననుసించి, వెతనొంచి
విస్మయానంద వార్ధిని ముంచిన ఆ వైనం
వెకిలి చేష్టల పరాకాష్ట మిదియందునా?
పలాయన వాద సాహాస మిది యందునా?
ఆ నాటి సాయంతనాన
ఉద్యానవన విహారవేళ
మంద మారుతము గంధ మలదుకొని
నాసికా పుటముల దాకి మెల్లన సాగ
సకల చరాచరమ్ము లంతయు
చేతనా గీతమ్ము లాలపింప
లేత కొమ్మలు ఆహ్లాదమ్ముగా
నాట్యమాడుచు వింజామరలు వీవ
వెతలు మాయమై, సుఖము చేరువై
కతలు పన్నుచు గుండె గుభిల్లు మనంగ
కాలగమనమున కొక అందమై
విరులు ఝరులై కురియ
పచ్చ పచ్చగా చెట్టు చెట్టుకొక
ఆచ్ఛాదనము నిల్పి
హాసిత వికసిత లాస్యముల
సతత సురుచిర భాసుర కుసుమ సరాల నలంకరించి
ఋతురాజ మాసన్నమైన వేళ
నీడు విశ్వరూప మెదుట దోచె
జన్మ సాఫల్య మీనాడనిపించె
మరు భూమి సోయగ మంతయు

## కవితా స్రవంతి

గగన విహంగమై
విమల తరంగమై
చకిత మృదంగమై
విహంగమై, తరంగమై, మృదంగమై గోచరించె
భవదాస్య విలోకనా ప్తిచేన్
నాదు హృదబ్జ మపుడే వికసించగ
తత్ప్రకటనోత్సాహ పథము నన్వేషించగ
కవితాకన్య తానై ననువరించె
సకల లావణ్యముల స్రోతై మురిపించె
శోక మొక శ్లోకమై వెలువడె ఆది కవికి
ఆనంద మొక హేతువై కవిత సాక్షాత్కరించె నాదు మదికి
సుధాపూరిత సౌందర్యలహరి
వ్యథా రహిత ఆనందలహరి
ఏ మందును? కమనీయంబగు నీదు సిరి
కలవందును నీ దయాళీలకు సరి
ఇక — ప్రతిదినము జరుగు నీ జయంతి
ఆ యనుపమ భాగ్యమునకే ఈ కవితాస్రవంతి

---

# చందాదారులకు వినతి

"నవభారతి"కి అన్ని విధాలా సహాయ సహకారములు అందిస్తున్నటువంటి పాఠకులకు, రచయితలకు, అభిమానులకు కృతజ్ఞతను తెలియచేస్తున్నాము. ఇంతవరకు తమ తమ చందాలను పంపుటకు వీలుగాని వారు వెంటనే పంపించవలసినదిగాను, చందాదారులుగా ఉన్నటువంటి వారు తమ సభ్యత్వమును పునరుద్ధరించి యధాతథంగా తమ సహాయము సహకారము లిచ్చి అన్ని విధాల తోడ్పడవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము.

— మేనేజరు

---

# తాళ్ళపాకవారి కృతులు

రచన : సూరి

ఆంధ్ర సారస్వత చరిత్రలో తాళ్ళపాక వారిపేరు అజరామరమైనది. ద్విపదకు, పదరచనకు అపూర్వ సాహిత్య గౌరవమును కల్గించినవారు తాళ్ళపాక కవులు. భావార్జన, శైలి,భావ వైవిధ్యము, శిల్పము పుంజీభవించిన రచనలు వీరివి. భక్తి, శృంగార రసములతో నిండిన ఇక్షు ఖండములు వీరి రచనలు.

ఆశు, మధుర, చిత్ర విస్తరములనెడి చతుర్విధ కవితలలో మధుర కవితా శాఖకు చెందినది ద్విపద రచన. దేశీయమగు మధుర కవితా శాఖకు చెందిన ఈ ద్విపద ఛందస్సే కొలది కొలది భేదములతో, తరువాత మంజరి, గీతము, సీసము మొదలగు అనేక దేశ ఛందోరచన భేదములకు ప్రాతిపదిక కల్పించినది. ఈ ద్విపద రచన మొదట 12, 13 శతాబ్దముల మధ్య వీరశైవ కవులకు దక్కినది. ఈ ద్విపద ప్రక్రియకు వన్నెలు దిద్దిన, దానికై కావ్యత్వసిద్ధి కల్పించిన విఖ్యాతి 15, 16 శతాబ్దములోని వైష్ణవ కవులకు మిగిలినది. ద్రావిడ కర్ణాటకములందును, ఈ తీరు సాహితీ ప్రక్రియలందే మత సాహిత్యము, ప్రజాబాహుళ్యమున వ్యాప్తి గాంచినది. దీనికి వర్ణ వ్యవస్థలేని భక్తి ప్రధానమగు వీరశైవ మతమును తెచ్చుటకై సాహిత్యమును సాధనముగ ద్విపదను చేపట్టినవాడు పాల్కురికి సోమనాథుడు. తరువాత రంగనాథుడు, గౌరన, పేర్కొనదగినవారు. మూడవ దశలో తాళ్ళపాకవారి రచనలలో ప్రక్రియ పరిపూర్ణ వికాసము నొంది రచన యందును. భావనయందును గూడ పుష్టి నందుకొన్నది. వీరికి ద్రావిడ వేదము లను విశేష ప్రచారము గావించిన శైవుల ద్విపదలు మార్గదర్శకములగుటవలన వీరి ద్విపద రచనలు, వైష్ణవమత సాహిత్య ప్రవాహమునకు విశిష్టముగా నుపకరించినవి.

తాళ్ళపాకవారి వంశమున ప్రఖ్యాతులగు కవు లందరు ద్విపదలు వ్రాసినవారే. వాఙ్మయ రచనా దృష్టితో పరిశీలిస్తే మూలపురుషుడు అన్నమాచార్యు లనవచ్చు. అన్నమాచార్యుని పితామహాదులు నారాయణసూరి, నారాయణుడు, విఠలుడు. నారాయణుని కుమారుడు అన్నమయ్య. తాతయ్యకు చదువు సంధ్యలు లేకపోగా చింతలమ్మ శక్తివలన అన్ని విద్యలు గ్రహించెనట. అన్నమయ్య తండ్రి నారాయణుని ఆతత సకల విద్యాధురంధరుడు. కాని వారు రచనలు కావించినట్లు తెలియుట లేదు.

## అన్నమయ్య

అన్నమాచార్యునకు కావ్యరచనమీద దృష్టి కల్గినది. పద్యములు, పాటలు అనర్గళముగా ఆశుధారగా వస్తూండేది. ఆ పిన్న వయసునందు "ఆడిన మాటలెల్లా అమృతకావ్యముగా, పాడిన పాటలెల్లా పరమ గానముగా" వెలసినవి. ఆయన రామాయణమును ద్విపద కావ్యముగా వ్రాసెను. వెంకటాద్రి మహాత్మ్యమును రచించెను. ఈ రెండును లభించలేదు. ఇతడు 12 శతకములను రచించెను. ఇతని మొదటి కృతి అయిన అలివేలుమంగమ్మమీద శతకము, 'వెంకటేశ్వర' మకుటముతో రచించెను. ఇతడు సకల భాషలలో నానా ప్రబంధములు రచించినాడన్న మాటలో నిజమేమాత్ర ముండిన మనకు లేనట్లే తెలుస్తుంది.

వెంకటేశ్వరుని వరించి విరహమనుభవించిన ఒకానొక బాల తుదకు అతనిదయకు పాత్రయై సుఖించిన సన్నివేశము వస్తువుగా మంజరీ ద్విపదలో అతడు రచించిన ముద్దైన లఘుకావ్యము నేడు మనకు దొరికినది. "శృంగారమంజరి". దీనిలో అలతి అలతి తెలుగుపదాలను బిగువుగా అందముగా తీర్చిదిద్దిన అన్నమయ్య నేర్పును విదితము చేస్తుంది.

"కోనేటి దరినున్న కొదమ సంపెంగ తరువులు
ఏరులై ఏ పొద్దు సీతల బ్రాలు ..............

అని చెప్పుటలో అన్నమయ్య ప్రతిభ ఎంత అసాధారణ పదకవిత్వములో నెలకొని యున్నది. అదొక సారస్వత క్షీరసముద్రము. కావ్య మూల ధర్మమైన భావార్జనలో, శైలిలో భావవైవిధ్యములో, రాశిలో అన్నమాచార్యునకు మించిన రచన ఆంధ్ర వాఙ్మయములో ఇంకొకటిలేదు. శ్రీ వెంకటేశ్వర వచనములలో అపూర్వమైన ఎన్నోపదములు, పలుకుబడులు, సామెతలు కలవు. భక్తి శృంగారములలో స్వతంత్రమైన సన్నివేశములు - భావములు కలిగి స్వచ్ఛందమైన గ్రామ్య, గ్రాంథిక సమ్మేళనము రసికులను, సహృదయులను తాండవ మాడించెడు రచనలు.

## తాళ్ళపాక తిమ్మక్క

ఈమె నృసింహుని తల్లి. చిన్నన్న ద్విపదరచనలను బట్టి అన్నమాచార్యుడు అక్కలమ్మ తిమ్మక్కలను ఒకేసారి వివాహమాడినట్లు తెలియుచున్నది. తిమ్మక్క మంజరీ ద్విపదలో సుభద్ర కళ్యాణమును రచించెను అందుచే ఈమె తొలి తెలుగు కవయిత్రి. శబ్దములోను అర్థములోను భావములోను గంభీరమైన చిక్కదనము కలిగిన ఆ మహిళామణి రసిక హృదయము ఆ కావ్యములో ప్రతిఫలించినది. దేశీయతా ముద్రగల కావ్యమిది. అర్జునుని సన్యాసిగా చూచుచూ సుభద్ర తన్ను తానే అలంకరించుకొనే సందర్భములో "ఉమ్మెత్త పువ్వువలె నుతికెనమడత ఒకనాతి నఖములగొని తెచ్చి యిచ్చినదపు" అని తెనిగించెను. ఈ కావ్యములో కృష్ణుని చెల్లెలి ప్రేమ ద్రౌపది చూపిన ఉదారవాత్సల్యం సుభద్ర హృదయము. తిమ్మక్క అనాదృశ్యముగా తెనుగు జాతీయములతో నుడికారములతో తెనిగించినది.

## తాళ్ళపాక నృసింహకవి

తిమ్మక్క కుమారుడు తాళ్ళపాక నృసింహకవి "అరయ దిమ్మక్కకు నాత్మసంభవుండు, పాట చెప్పటంలో వీడు జోడులేడని సభ జొచ్చి వాదించిరి. తాళ్ళపాక చిన్నన్న నితనిని గొప్ప కవిగా సంగీత విద్వాంసునిగా పేర్కొనెను. కవికర్ణ రసాయన కర్త నృసింహపండితుడేనని పలువురి వాదన. ఇతని కవిత్వమునుగూర్చి తెనాలిరామకృష్ణుడు "మిన్నంది మొరపె నరసింగన్న కవిత్వము పద్యగద్యశ్రేణిన్" అని శ్లాఘించినాడు. ద్విపదలో ర చిం ప బ డి న వెంకటేశ్వర సుప్రభాత స్తవము, వెంకటేశ్వరునిపై రచించిన "మేలుకో శృంగార రాయ", నేటి మదన గోపాల మేలుకో" అన్న మకుటముతో రచించెను. ఇయ్యది ఏ చరణములకాచరణము విడివడి విస్తృతమైన భావములు వెదజల్లునట్లు రచించెను.

## పెద తిరుమలాచార్యులు

అన్నమాచార్యుని రెండవ భార్యయగు అక్కమాంబ కుమారుడు పెద తిరుమలాచార్యుడు తండ్రి గారి సంకీర్తనలన్నీ రాగిరేకులలో చెక్కించి భద్ర పరచినాడు. సంకీర్తన భాండాగార వ్యవస్థను రూపొందించి తెలుగుసాహిత్య ప్రపంచమునకు ఎన లేని సేవచేసెను హరివంశమునుద్విపదలో రచించెను. ఆంధ్రవేదాంతమునురచించెను. ఈరెండుఅలభ్యములు. ఇతడు గొప్ప పండితుడై వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య, కవితార్కిక కేసరి, శరణాగత ప్రజపంజరి

ఉదాత్తాది నిషదములను కలవాడు. చక్రవాళమంజరి అను ద్విపద కావ్యమును రచించెను.

## శతకములు

అన్నమాచార్యుడు 12 శతకములను రచించెను. అవి విశిష్టాద్వైత ప్రతిపాదితములుకాగా, పెద్ద కుమారుడైన పెద తిరుమలాచార్యుడు నీతి, సీస శతకమును శృంగార ముక్తపద శతకములను, శృంగార దండకమును, వేంకటేశ్వర ఉదాహరణమును, సుదర్శన రగడను రచించెను. ఇతని సీస శతకము నుండి రెండు పంక్తులు చూచెదము.

"ఏనుగు లావెంత యల మావటీడెంత
తిమిరంబు బలమెంత, దీపమెంత" .........

..............................................

..............................................

అని రచించెను. జన సామాన్యముగ శివభక్తి ప్రచారము చేసేందుకు కన్నడ దేశములో వీర శైవులు వచనములు అనే శిథిల కథలను ఎక్కువగా వ్యాప్తికి తెచ్చిరి. 12 వ శతాబ్దము పూర్వము ఆ సారస్వతములో ఈ వచన రచన యున్నట్లు తెలియుచున్నది. పెద తిరుమలయ్య తాను రచించిన వచనములకు తానే స్వయముగా రాగతాళములు నిర్దేశించినాడు. ఇతడు వెంకటేశ్వరునికి చేసిన కైంకర్యములు దానములు అనేకములు. ఆ దేవత యందు అవిచ్ఛిన్న భక్తితో అసాధారణ తపస్సిద్ధి సంపాదించిన ధన్యుడు.

## చిన తిరుమలాచార్యుడు

అన్నమయ్య చిన్నకుమారుడు చిన్న తిరుమలాచార్యుడు. చారుతర అష్టభాషా చక్రవర్తినని చెప్పుకొనెను. శృంగార ఆధ్యాత్మిక సంకీర్తనలు యితని రచనలు. "గరిమ నా వయస్సున తాటికి చంపిన కౌసల్యరామ" అనుటబట్టి 16 సంవత్సరముల వయసు నుండే రచన సాగించెనని చెప్పవచ్చును. అష్టభాషా దండకమును లఘుకృతిని రచించెను. తాత రచించిన సంస్కృత సంకీర్తన లక్షణగ్రంధమును తెనిగించినాడు. అష్టభాషలలో రచన సాగించినాడు. సంస్కృత, ప్రాకృత భాషలలో పండితుడు.

## అన్నమయ్య

పెద తిరుమలాచార్యుని రెండవ కుమారుడు అన్నమయ్య. ఇతడు అన్ని విద్యలయందును "నరయ మున్నింట నన్నమాచార్యునికి బోలు నన్నమార్యుడు" అని ప్రసిద్ధి కెక్కెను. ఇతడు సంకీర్తనలు పాడగా వెంకటేశ్వరుడు ఆలకించి నాట్యమాడేవాడట.

## చిన్నన్న

పెద తిరుమలయ్య నాల్గవ కుమారుడు తిరువెంగళనాధుడు. కాని చిన్నన్న యని వ్యవహారిక నామము. అలిమేలు మంగమ్మను ఎక్కువగా ఉపాసించినవాడు. తండ్రి తాతలవలెనే గొప్ప వాగ్గేయకారుడు. ద్విపద కవితను లాక్షణిక బద్ధముగా రచించెను. అర్వాచీన కవులచే "చిన్నన్న ద్విపద కెరగును" అని కీర్తి గడించెను.

## రచనలు

1 అష్టమహిషీ కళ్యాణము 2. ఉషాపరిణయము 2. పరమయోగి విలాసము 4. అన్నమాచార్యుని జీవిత చరిత్రము. అష్టమహిషి కళ్యాణములో "హరికథామృత మాకర్ణాంతముల పరిపూర్ణమగుచు"- అనెను. పోతనలోని భావావేశము, పలుకుబడి, మధుర మంజరీ శైలి విన్యాసము, శృంగార రస పోషణతోను కలదు. అనుప్రాస సహితమైన రచన యితనిది. దేశీ లక్షణములు యితని రచనలో కన్పించును. ఆహార విహార విద్యాదులందు ఆటపాట వర్ణనములందు ఈ లక్షణములు కన్పించును. తను

ఊరైన తాళ్ళపాక నావరించిన కీర్తిమినాడును యితడు "అనయమున వినయమున సొంపార క్రొవ్విరుల ........................ పట్టుగొమ్మె తాళ్ళపాక". ఇట్టివాడు "కవిశరఃకంపయోగ్య ప్రతి ద్విపదనవ" బిరుదాంకితుడనుటలో ఆశ్చర్యములేదు. ఇతని తమ్ముడు కోనేటి వెంగళనాధుడు గొప్ప యోగసిద్ధి కలవాడు. ఇతడు సారస్వత రచనలు చేసినట్లు తెలియును.

## తిరువేంగళనాధుడు

ఇతనికి చిన తిరువేంగళనాధుడని పేరు. గొప్ప సంస్కృతాంధ్ర పండితుడు. కావ్యప్రకాశవాఖ్యవ్రాసిన వాడు. గురుబాల ప్రబోధికకు లఘుటీకను తెలుగులో రచించెను. ఇయ్యది తెలుగువారి సంస్కృత జ్ఞానానికి కల్పవృక్షమైనది.

పదకవితకు ద్విపదకవితకు తాళ్ళపాక కవులు ఉన్నత స్థాయిని యిచ్చిరి. అహోబిల మఠస్థాపక యతీంద్రుల ఆశ్రమములో వైష్ణవ దీక్షను గ్రహించి శ్రీరామానుజ సిద్ధాంత సారస్వతమును ఆంధ్రదేశమున వ్యాప్తికి తెచ్చిన సాహితీపురుషులు ఈ విధముగా అన్నమాచార్యుని తాతదగ్గరనుండి ఉన్నన్ని వరకు యున్న తాళ్ళపాక వంశస్థుల రచనలు వైష్ణవ మత వ్యాప్తికి, అపూర్వ సారస్వత సేవకు మార్గదర్శకులైనవి.



# నా కవితా సుధ....

చిటిప్రోలు వేంకటరత్నం

నా కవితాసుధ లోకోద్ధరణా
శ్రీకరము నవళా కళరము

అల వాల్మీకుల వ్యాస మునీంద్రుల
మదిలో విరిసిన మంగళ తేజము
నా యెదలో నవనాట్యము లాడగ
కంఠము నుండి కదలినది

మలయ సమీరపు చలువలు మీరగ
విలయ జ్వాలల వేడిమి తోడుగ
జగతికి గుండెలు జలదరింపగా
లేఖిని నుండి లేచినది

దీనజనావళి తీరని బాధలు
త్యాగనిధానుల ధన్యుల గాథలు
భావనలో జవజీవము లూడగ
వాహిని వోలె పాటినది

పౌరాతన్యము పారము నారసి
నవకవనమ్ముల నాణెము నేటిచి
క్షీరములో మధుపూరము చేరిన
తీయదనాలు తేలినది

రూకల మ్రోతకు లొంగదు క్రుంగదు
అధికారానికి అదరదు బెదరదు
కాసులు కా వధికారమ్మా! నా
కవితయె వెల్గు భువి యంత

నా కవితాసుధ లోకోద్ధరణా
శ్రీకరము నవళా కళరము

# ఆంధ్రులు - కులవ్యవస్థ - 3

కీ. శే. సురవరము ప్రతాపరెడ్డి

(కీ. శే. సురవరము ప్రతాపరెడ్డి రచించి పెట్టిన బృహద్వ్యాసము ఇది. వ్రాత ప్రతిగా నున్నది. మన ప్రాచీన సాంఘిక వ్యవస్థను అవగాహన చేసుకొనుటకు చక్కగా తోడ్పడు ఈవ్యాసములోని పరిశోధనా దృక్పథము ప్రశస్తమైనది. ఆంధ్రుల సాంఘిక చరిత్రను అనితర సాధ్యముగా రచించిన రెడ్డిగారు ఆంధ్రుల కులవ్యవస్థను గురించికూడా పరిశోధించి సవిస్తరముగా రచించదలచినట్లు ఈ వ్యాసమువలన తెలియుచున్నది. ఇంత వరకు మూడు ప్రకరణములు లభించినవి. ఇట్లే కొన్ని ప్రకరణములుగా ఈ విషయమై వారు రచించినట్లు తలపవచ్చును. అవి లభ్యము కాలేదు. ఈ మూడు ప్రకరణములు గూడా చేజిక్కించుకొనుటకు కొన్ని నెలలు ప్రయాస పడవలసి వచ్చినది. వీటిని సంపాదించి ఇచ్చిన వారు డా॥ ముకురాల రామారెడ్డి.

ప్రస్తుతము మూడవ ప్రకరణమును ముద్రించుచున్నాము. సాంఘిక పరిశోధనార్థులకు ఇది ఉత్తమమైన సంప్రదింపు సామాగ్రిగా ఉపయోగపడుననుటలో సందేహములేదు.

—సంపాదకులు

పూర్వ ప్రకరణములందు "కాఁపు"అనగా కాపాడుట యని వ్రాసి యుంటిని. కాపాడుట పంటల పశువు లనేగాదు. కాఁపుల ప్రధాన శాఖలు దేశమునకు సంబంధించి యున్నందున వీరు దేశమునుఁ గాపాడు వారని దలంచవలయును. కాఁపు, క్షత్రియ పర్యాయ పదమనియు. సంసారి, గృహస్థునికి పర్యాయ పద మనియు వ్రాసియుంటిని. ఈ ప్రకరణమునందు వీరి బట్టపునామమైన "రెడ్డి" పదతత్త్వమును విమర్శించ దలచినాము:

ఆంధ్ర నిఘంటువులందు "రెడ్డి" యను పదమునకు కాఁపు వారి బట్టపు పేరని యొకమలక వేసి శూద్రుని బిరుదని చూపిరి. శూద్రుడు గృహస్థుడనుట యెంత పూర్వశాస్త్రసమ్మతమో వారికి "రెడ్డి" పట్టపు నామమని యనుట యంతే హాస్యాస్పదము శూద్రుడస్వతంత్రుడనియు మూఢుడనియు మహాశయులకు విదితమే? ఏ విద్య నెరుంగని వాఁడు పట్టపునామము ధరించియుండునని జెప్పుట యెంత సమంజసము?

రెడ్డి యనుట తోడనే యావజ్జనులకుఁ గ్రామాధికారి యని స్ఫురించును. కావున నిఘంటు కారుడు రెడ్డి పదమునకుఁ గ్రామాధికారి బట్టపునామమని వ్రాసినచో యోగ్యముగా నుండునుగదా! రెడ్డి నామము జాతి వాచకముకాగా గ్రామాధికారియే జాతి వాడైనను ఈ బిరుదును బూనవచ్చునని జెప్పుట కొంత సమంజసమే. రెడ్డి జాతి గ్రామాధికారము వహించుట స్వజాతి ధర్మము. ఇతరులా పదవిపై వచ్చినను తన జాతి నామమును మరి యొకటి జెప్పుట

సహజము. ఇదియునుగాక కొన్ని ప్రాంతములందు మా గ్రామము రెడ్డిగారు సాహెబుగారని నుడువుటా చారమైనది - నేనిటుల వ్రాయుటచే చదువరులకు సంశయము గలుగవచ్చును. కాని హిందూ జాతి యందు రాజులు క్షత్రియులని యావజ్జనులకు విశదమే? అయితే ఇతర జాతువారీ పదవిని గ్రహించి నప్పుడు వారిని కూడ రాజనుట సహజము. మరియు క్షత్రియులు రాజ్యమేలకున్నను వారిని క్షత్రియ జాతి వారని జెప్పుటాచారమే. ఇదే మాదిరి వైదిక బ్రాహ్మణులు ఉపదేశము (బోధ) సేయక వంటపని లేక బేరము, కొలువుసేయుట మొదలగు పనులు జేసినను వీరినిగురువులనియు ఆచార్యులనియు పిలుచుచున్నారు. మరియు నియోగి బ్రాహ్మణులను సచివ, ఆమాత్య, మంత్రి, లేక పంతులు అనుటలేదా?

వైశ్యుడు బేరము జేసినను చేయకపోయినను శ్రేష్ఠి (సెట్టి) లేక మహాజనుడని నుడువుచున్నారు. వీరలనీలాగున బిలుచుటయు నితురులా పని జేసినను పిలువకపోవుటెందు చేత? ఇతర జాతుల వారికది సనాతనవృత్తి గానందున వారు తాత్కాలిక పదవికి సంబంధించిన నామము వహించినను,కులవిమర్శనము నందు యదార్థ నామము జెప్పక తప్పదు. ఇతర జాతి వారు గ్రామాధికారులైనను రెడ్డి జాతివారా పదవిపై లేక యున్నను సనాతన సంస్కారమునుబట్టి కుల వృత్తి ననుసరించి రెడ్డియను బట్టపు నామము కలిగి నది, అనగా రెడ్డిగారనుటయందు గ్రామాధికారము గల జాతివారని నా యభిప్రాయము.

గ్రామాధికారిని రెడ్డిగారనుటయేగాక పటేలు అని కూడ పిలుచుచున్నారు. ఈ పదమన్యదేశీయమే. కాని మహమ్మదీయ చక్రవర్తుల కాలమునుండి భరతఖండ మంతట వ్యవహరింపబడుచున్నది. పటేలు[1]=గ్రామముయొక్క సర్దార్ లేక చౌదరియని ఉర్దూ నిఘంటువు లందున్నది. చౌదరి = గ్రామము యొక్క పెత్తన గాడైన కాపు అని యాంధ్ర నిఘంటువులందున్నది. పటేలుకు క్షత్రియత్వ మెటుల జెల్లునని మీ కను మానముగలుగవచ్చును."స్థాయుకోఽధికృతోగ్రామే" (అమరకోశము, క్షత్రియవర్గ) = ఒక గ్రామమున కధికారియైనవాడు. స్థాయుకుడు. ఎక్కువ భూములు సంపాదించి మిక్కిలి డబ్బు గడంచి పెక్కుగ్రామములపై నధికారము జూపు వారిని దేశాయి, దేశముఖి, జమాన్‌దారు అని పిలుచుచున్నారు. పైరెండు పదముల యర్థము స్పష్టమే? ఇక 'జమాన్‌దారు'కు ఉర్దూ నిఘంటువులందు పర్యాయ పదములు కిసాన్, జాట్, అని వ్రాయబడియున్నది. కిసాన్, కృషిక శబ్దము యొక్క తద్భవము. "జాట్" అను పదమున కర్థము ప్రసిద్ధికెక్కిన వ్యవసాయకులని వ్రాయబడియున్నది. వ్యవసాయకులే కాఁపులు. "కాఁపు" పదము శూద్రునికి జెల్లునని యాంధ్ర నిఘంటువుల త్రోవనుద్రొక్కుకుడు. అది పొరబాటు. మన కావ్యము లందొక పృథివీపతి గుణగణములు వర్ణించుచు తక్కిన రాజులందరతనికి "అరిగాఁపు" లైరి యని జెప్పబడియున్నది. అరి - కప్పము, కాఁపులు - రక్షకులు, అనగా చక్రవర్తికి కప్పము గట్టు సామంత రాజులని యర్థము. "అరిగాఁపు" కప్పముఁ గట్టువాఁడు అని యాంధ్ర నిఘంటువులందున్నది. ఏ విధముగ విచారించిచూచినను "కాఁపు" పదమునకు రక్షకుడనియు ఈ రక్షకత్వము క్షత్రియులే వహింతురనియు, క్షత్రియ పర్యాయపదము రాట్, దీని తద్భవము తేడు, దీనికి వికృతిరెడ్డి వీని పర్యాయపదములు దొర, భూపతి (జమీన్‌దారు) దేశాయి, దేశముఖ్, ప్రభువు (పటేలు), చౌదరి (పెద్దకాఁపు), మొదలగునవి వాడుకలో నున్నవి - ఈ వ్యవహార నామములే గాక పాలు నీరు ఏర్పాటు

---

1. ఉత్తర హిందూస్థానమంతట గ్రామాధికారిని పటేలని యందురు. దక్షిణహిందూస్థానములో కూడ ప్రస్తుత నిజాం రాష్ట్రాది దేశములలో నీ పదము వాడుచున్నారు.

జేసిన పక్షిని హంసయని గుర్తించినటుల వీరి గుణ కర్మ స్వభావములం గూడవీరి క్షత్రియత్వమును స్థిర పరచుచున్నవి. "శూద్రో బ్రాహ్మణ తామేతి, బ్రాహ్మణ శ్చైతి శూద్రతాం. క్షత్రియాజ్జాత మేవంతు విద్యా ద్వైశ్యాత్తథైవచ"[1] శూద్రకుల మందు బుట్టినను బ్రాహ్మణ క్షత్రియ వైశ్యగుణకర్మస్వభావములు గలవారు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులేయగుదురు. అటులనే బ్రాహ్మణక్షత్రియ వైశ్యజాతులందుబుట్టిన వారు శూద్రగుణ కర్మస్వభావములుగలవారు శూద్రులే యగుదురు ఇటులనే ఆయా జాతుల గుణ కర్మస్వభావములను బట్టి గ్రహింపవలయునని మహా భారతఅరణ్యపర్వములో నహుషప్రశ్నలందు మరియు శుక్రనీతి యందు. ఇంకననేక గ్రంథములలో సప్రమాణముగా సహేతుకముగా వ్రాయఁ బడియున్నది. కావున కాపుల, రెడ్ల గుణకర్మ స్వభావములనుబట్టి కూడ వారు క్షత్రియులని జెప్పవచ్చును. అవి యేవన: "ప్రజానాంరక్షణందాన,నిత్యాధ్యయనమేవచ, విషయేష్వ ప్రసక్తిశ్చ క్షత్రియశ్య సమాసతః."[2] ప్రజాపోషణము ఇతరుల మేలును గూర్చి దానము, వేదశాస్త్రములంజదువుట. జితేంద్రియత్వము గలిగి యుండుట, క్షత్రియధర్మములు. మరియు "శౌర్యం తేజోధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం, దాన మీశ్వరభావశ్చక్షాత్రం కర్మస్వభావజం"[3] శౌర్యము దాన శీలముఁ బ్రసాదమునాత్మజయంబుఁ దేజమున్. ధైర్యము దేవభక్తియును ధర్మము నర్థముగామమున్ బుధా; చార్య ముకుంద సేవలను సత్కృతియున్ బరితోషణంబు స్వవీర్యము రక్షణంబుఁ బృథివీవర శేఖరరాజ చిహ్నముల్.[4]

---

1. మనుస్మృతి 10-65
2. ,, 1-89
3. భగవద్గీత 18-43
4. భాగవతము స్కంధము 7

సమాప్తం

# నవభారతి

## సాహిత్య. సాంస్కృతిక మాసపత్రిక

మార్చి, 1980

సంపాదకులు:
చదలవాడ పిచ్చయ్య

మూల్యం : రెండు రూపాయలు

నవభారతి కార్యాలయము
3-4-1008/1, బర్కత్‌పుర
హైదరాబాదు - 500 027

# విషయ సూచిక



# విజాతీయ విద్య కావలయునా ?

# స్వజాతీయ విద్య కావలయునా ?

విద్య యనునది మానవ వివేకమునకు తోడ్పడవలయును. విద్య యనునది వ్యవహార వినియోగమునకు ఉపయోగపడవలయును. మానవుడు సమాజమున జీవించును. మానవుడు సమాజమున నియమముల ననుసరించి నడచుకొనవలయును. మానవుడు కుటుంబము నేర్పరచుకొని జీవించవలయును. మానవ జీవన విధానమునకు మానవ సమాజ సంబంధ బాంధవ్యముల నియమ విధానమునకు అంతులేని వ్యత్యాసమనునది యున్నది. ఈ వ్యత్యాసమును అవగాహన చేసుకొనని వారు విద్యావిధాన నిర్ణయములను చేయుచున్నారని చెప్పవలయును. విద్యావిధాన నిర్ణయములన్నియు ఆంగ్లేయులు మనపై బలవంతముగా రుద్దిపోయినారు! ఈనాడు మనము చదువుకొనుచున్న విద్యా విధానమంతయు దీని ననుసరించి తయారు చేయబడినదని గ్రహించుకొనవలయును. ఈ విద్యావిధానములో మన జాతీయ జీవనమునకు సంబంధించిన విషయమును అనల్పమైన దానినిగా చిత్రించుట యనునది జరిగినది. స్వాతంత్ర్యానంతరం ఈ విద్యా విధానమును సంస్కరించవలెనను ప్రయత్నము మాత్రము చేయబడినది. ఈ ప్రయత్న ఫలితము సమకూర లేదనియే చెప్పవలయును. మన విద్యలన్నింటికి పాశ్చాత్య రచయితలనే ప్రామాణికులుగా స్వీకరించి వారి గ్రంథములనే పాఠ్యగ్రంథములుగా నిర్ణయించి విద్యాలయములలో విద్యను బోధించుట యనునది జరుపబడుచున్నది. ఈ బోధనా విధానములోని ఉచితానుచితములను చర్చించుకొని నిర్ణయించుకొనవలసిన సమయ మాసన్నమైనదని గ్రహింపవలయును.

సామాన్యమైన విద్యా విధానము మాత్రమే కాక ఉన్నత విద్యా విధానమునకును ప్రామాణికమైన గ్రంథములు పాశ్చాత్య రచయితలవేనని గ్రహించుకొనవలయును. ఈ పాశ్చాత్య రచయితల గ్రంథములలోని విషయములను నేటి భారతీయ రచయితలు అనుకరించి తమ గ్రంథములుగా వానిని వెలువరించుచున్న విషయము వాస్తవమైనా ఈ విధానము విద్యా ప్రయోజనమును సాధించు విధానమునకు తోడ్పడదని తెలుసుకొనవలయును.

రాజనీతి శాస్త్రము, అర్థ శాస్త్రము, సాంఘిక శాస్త్రము, రసాయనిక శాస్త్రము, భౌతిక శాస్త్రము, భూత త్త్వ శాస్త్రము, ఖగోళ శాస్త్రము, భౌగోళిక శాస్త్రము, సాహిత్య కళాశాస్త్రములు సైతము పాశ్చాత్యుల అనుకరణ విధానము ననుసరించియే రచింపబడుచున్నవని గ్రహించుకొనవలయును.

బహు కాలముగా పాశ్చాత్య అనుకరణ విధానము ననుసరించి మనము మన స్వధర్మమును, స్వజాతీయాభిమానమును మరచిపోయినామని గ్రహించ కొనవలసి యున్నది. స్వతంత్ర పరిపాలనా వ్యవస్థను ఏర్పరచుకొనినామని మనకు మనము సంతృప్తి చెంది ప్రతి విషయమను పరిశీలించుటలోను, పరిశీలించిన విషయమును ఆచరించుట లోను, పాశ్చాత్యానుకరణమే మనకు ప్రధానమై యున్నదని స్పష్టముగా కనిపించుచున్నది.

భారతీయమైన విద్యను తూర్పు దేశీయ విద్యగా మనము అభ్యసించి మన అవివేక మును మనము వ్యక్తము చేసుకొనుచు స్వతంత్ర భారతమని పరిపాలనా విధానమని స్వజా తీయాభిమానమును పెంపొందించుకొనవలయునని అప్పుడప్పుడు సభలలో మాత్రము చెప్పు కొనుచున్నామని గ్రహించుకొనవలయును.

స్వజాతీయాభిమానము సభలకు పరిమితమై పత్రికా ప్రకటనలకు బంధించబడి రేడియో వార్తాప్రసారముల ద్వారా ప్రచారము చేసినంత మాత్రమున విద్యకు ప్రయోజన మనునది యున్నదని అనుకొనవలయునా? ఇది నేటి జాతీయ స్వాతంత్ర్య భావ ప్రచారమును దోహదమిచ్చు విధానమని అనుకొన వలయునా? ఈ విధమైన విధానముల ననుసరించి ఈ అనుస రించునని చెప్పబడు విద్యా విధానమునే భారత జాతీయ విద్యా విధానముగా మన మనుకొన వలయునా? మనము ఏమనుకొనవలయును? ఇందుకు సమాధానము కావలయును.

పాశ్చాత్యుల చరిత్రకు భారతీయుల చరిత్రకు వ్యత్యాస మనునది యున్నది. పాశ్చాత్య రాజకీయ శాస్త్రములకు భారతీయమైన రాజకీయశాస్త్రములకువ్యత్యాసమనునదియున్నది. ఒక టేమిటి పాశ్చాత్య విద్యలకు భారతీయ విద్యలకు అంతులేని వ్యత్యాసమనునదియున్నది. వారి విద్యలకు ప్రచారము ప్రధానము.భారతీయ విద్యలకు విషయ వివేచనావగాహన ప్రధానము.ఉదా॥ సంపూర్ణ సూర్యగ్రహణం ఏర్పడినది ఇది సహజమైనది. ఈ గ్రహణము ఏర్పడుచున్నది, విడిపోవు చున్నది. ఇదిఅనంతకాలముగా జరుగుచున్న సహజమైన ప్రాకృతిక పరిణామములోని ఒక సంఘ టన మాత్రమని గ్రహించుకొనవలయును. దీనిని సామాన్యులు పట్టించుకొనరు. విద్యావంతుల మని చెప్పుకొను వారు దీనికి ప్రత్యేకమైన ప్రతిపత్తిని కల్పించి విపరీత ప్రచారమును చేయబడి సామాజికులను భయభ్రాంతులను చేయుటలోని రేడియోవారి జాతీయ విధానములో గాని, పాత్రికేయుల విజ్ఞాన ప్రచార విధానములో గాని శాస్త్రజ్ఞుల గ్రహణ సౌందర్యవర్ణన ప్రచారములో గానీ మానవోపయోగమైన విషయ ప్రాధాన్యత ఏ విధము ననుసరించి సమ ర్థించబడుచున్నదో అనూహ్యమని చెప్పవలయును. శాస్త్ర విషయములు అనూహ్యమైనవి కావు. శాస్త్రజ్ఞులు గ్రహించుకొని పరిశీలించవచ్చును. తాను పరిశీలించిన విషయమును పరిశోధించి, విషయ వివేచన చేసి, ఇది ఇదియని, స్పష్టీకరించవచ్చును. ఈ పద్ధతి గ్రహణ ప్రచార విషయ మున అనుసరించబడినది కాదని సామాన్యుడు నిర్ణయించలేడనియే చెప్పవచ్చును. గ్రహణము పేరుతో పత్రికలు, రేడియోలు, వార్తాప్రసారము చేసి ప్రజలను భయ కంపితులను చేయుట

లోని అంతర్యమును విద్యావంతులమని అనుకొనువారు చెప్పవలసియున్నదని గ్రహించ వలయును.

సామాన్యమైన విషయములకు, అసామాన్యమైన విషయములకు పొత్తును కల్పించుటకు, విద్యావంతులు చేయుచున్న ప్రయత్నమంతయు అవివేకమునకు తోడ్పడునే గాని, వివేకమునకు ఏ మాత్రము తోడ్పడదని గ్రహించుకొనవలయును.

విద్య యనగానే అక్షర పరిజ్ఞానము, వాక్య పరిజ్ఞానము యని అనుకొనువారిని ఏమనుకొనవలయును? అక్షర రూపమనునది మానవ నిర్మితమైనది. భావము మానవ నిర్మితము కాదు. మానవ నిర్మితము కాని మానవానుభవమును మానవుడు, మానవ నిర్మితమైన భాష ద్వారావ్యక్తము చేయు విధానము ననుసరించుచున్నాడని చెప్పవచ్చును.

భావమును చెప్పుకొనుటకై, భావమును వివరించుకొనుటకై మానవుడు భాషా రూపమును కల్పించుకొన్నాడని గ్రహించని పాశ్చాత్యులు వ్యాపార ప్రయోజనకై భాషను వాడుకొనుచున్నారని ఆవాడుకొను విధానమునే శాస్త్రీయమైన విధావమని చెప్పుకొను చున్నారని చెప్పవచ్చును. ఈ చెప్పబడు పాశ్చాత్య విద్యావ్యామోహమనునది మాననీయమైన మానవతా వ్యాప్తికి దోహదము చేయని విద్యా విధానముగా గుర్తించి జాతీయ విద్యపై అభిమానమును పెంపొందించుకొని మన విద్యా విధానములలోని ఔచిత్యమును గ్రహించి మానవ సామాజిక ప్రయోజనమునకై దానిని వినియోగించుకొనవలసిన సమయమాసన్నమైనదని గ్రహించి స్వజాతీయ విద్యను జాతీయ విద్యగా రూపొందించుకొని మానవ ప్రయోజనమును సాధించుకొనవలసిన బాధ్యత విద్యావేత్తలపై నున్నదని గ్రహించుకొనవలయును.



కవిత :

# అభినవ ఆశీవిష క్రతువు

డాక్టర్ ఆచార్య భావన్

అదిగో అదిగో!
భీషణ నాగాల మారణహోమం
జరుగుతున్నది.
ఋత్విక్కుల వేద ఘోష
దిక్కుల్లో మార్మ్రోగుతున్నది
ఆజ్యం - హవిష్యాన్నం
భక్షిస్తున్న అగ్ని దేవుడు
గగనోద్ధూత "ఘనాపాటి"
అవుతున్నాడు.
విషం కక్కుతూ
ఆశీ విషాలన్నీ
పావక వక్త్రోన్ముఖమౌతున్నాయి.
ప్రగతి నిరోధక శక్తులే
భీషణనాగాలు
పురోగమన వాంఛిత
ప్రజాసందోహం
ఉదంక ప్రేరిత జనమేజయ
ప్రతీకార సన్నిభం !!

# ఠాకూరు - తోటమాలి

అనువాదం : శ్రీలక్ష్మి

(50)

ప్రియతమా, నిన్ను కలుసుకోవాలని నా ఎదద రాత్రింబవళ్లు దేవులాడుతుంది.

సర్వాన్నీ కబళించే మృత్యువులాంటి కలయిక ఇది.

తుఫానుకిమల్లే నన్ను తుడిచి పెట్టుము; నా సర్వస్వాన్ని తీసికొనుము; నా నిదురను, కలలను కొల్లగొనుము. నా ప్రపంచాన్ని నాకు లేకుండా చేయుము.

సర్వనాశనములో, ఆత్మీయతలో, మనము అందముగా ఐక్యమొందెదము.

నా భ్రమ కాకున్న. నీలో కాక ఐక్యతకు తావు ఎక్కడ, ప్రభూ!

(51)

ఇక చరమ గీతాలాపనచేసి మనం సెలవు తీసుకుందాము.

ఈ రాత్రిని మరచిపోమ్మ.

నేను ఎవరిని పొందాలనుకుంటున్నాను! కలలు ఎన్నటికీ పండవు.

నా కరములు వెర్రిగా గాలిని కౌగిలించుకుంటాయి; ఇది ఎంత బాధ, చెలీ.

(52)

దీపం ఎందులకు ఆరిపోయింది?

గాలికి ఆరిపోకుండా, నా కొంగు అడ్డుపెట్టాను; అందుకే దీపం ఆరిపోయింది.

పూవు ఎందులకు వాడిపోయింది?

ప్రేమగా నా హృదయానికి హత్తుకున్నాను; అందుకే పూవు వాడిపోయింది.

ఏరు ఎందులకు ఎండిపోయింది?

నా ప్రయోజనం కొరకు, దానికి అడ్డుగా ఆనకట్ట కట్టాను; అందుకే ఏరు ఎండిపోయింది.

వీణియ తీగె ఎందులకు తెగిపోయింది?

దాని శక్తికి మించిన శ్రుతిని పలికించాలని ప్రయత్నించాము; అందుకే వీణియ తీగె తెగిపోయింది.

(53)

నీ చూపులతో నన్ను అవమానించెద వేల? నేను యాచించుటకు రాలేదు కొంచెంసేపు నీ తోట మలుపులో చెట్టునీడన నిలబడ్డాను.

నీ తోటలో ఒక్క గులాబీకూడ నేను సేకరించలేదు, ఒక్క పండుకూడ కోయలేదు

చెట్టు నీడన, నెమ్మదిగా సేద తీర్చుకున్నాను బాటసారికి మల్లే.

నేను అలసిపోయాను, వాన కురిసింది మబ్బులు గుంపులుగా కమ్ముకున్నవి. నీవు నన్ను చూచి ఏమనుకున్నావో, నీవు ఎవరి కొరకు వేచివున్నావో నాకు తెలియదు మరి.

మెరపు తీగెలు నీ కన్నులకు మిరుమిట్లు గొలిపాయి.

చీకట్లో వున్న నన్ను నీవు చూచావని నాకు ఎలా తెలుస్తుంది?

పగలు గతించిపోయింది, వాన ఆగిపోయింది.

నీ తోట మలుపులో, చెట్టునీడను, ఈ పచ్చికను, వదలి వెడుతున్నాను. చీకటి పడింది. నీ వాకిలి వేసుకో నేను వెడుతున్నాను.

(౫౪)

ఇంత పొద్దుపోయింది. సంత ముగిసింది. ఇప్పుడు బుట్ట తీసుకుని ఎక్కడికి వెడుతున్నావు?

సరుకులు మోసుకుని అందరూ ఇళ్ళకు వచ్చారు. చెట్ల సందులోనుంచి చందమామ తొంగిచూస్తున్నాడు.

పడవ సరంగును కేకవేసే పిలుపులు విన వస్తున్నవి.

భూమాతను నిద్రాదేవి ఆవరించింది. పక్షుల గూళ్లు నిశ్శబ్దంగా ఉన్నవి. వెదురు పొదలు విన దించుటలేదు. పంటభూములనుండి మరలివచ్చిన కర్షకులు ముంగిళ్ళలో విశ్రాంతి తీసుకుంటున్నారు.

సంత ముగిసింది. ఇప్పుడు బుట్ట తీసుకుని ఎక్కడికి వెడుతున్నావు?

(౫౫)

మధ్యాహ్నం నీవు వెళ్ళావు.

సూర్య భగవానుడు నడినెత్తిన ఉన్నాడు.

నా పనులు ముగించుకుని, ముంగిట్లో ఒంటరిగా కూర్చుని ఉన్నాను, నీవు వెళ్ళినప్పుడు.

పంట పొలాలనుంచి సువాసనలు వస్తున్నవి.

నీడలో పావురాళ్ళు కువకువ మంటున్నాయి. తుమ్మెద ఒకటి నా కుటీరములో రొద చేస్తున్నది.

పల్లె నిదురిస్తున్నది. బాట నిర్జనంగా ఉన్నది.

ఒక్కమారుగ ఎండుటాకుల గలగలలు విన వస్తున్నవి. మడల నమసిపోతున్నవి. నీలి గగనంలో చెలి నామాక్షరాలు రచించాను. కురులు దిద్దుకోవడం మరచిపోయాను. దక్షిణానిలము నా బుగ్గలమీద ఆడుకుంటున్నది.

నీడలు నిండిన తీరంలో నదీమతల్లి నెమ్మదిగా పారుతున్నది.

ఆకాశంలో తెల్లని మేఘాలు కమ్ముకున్నాయి.

మధ్యాహ్నం నీవు వెళ్ళావు. బాటలో దుమ్ము వేడిగా ఉంది. నేను ముంగిట్లో ఒంటరిగా కూర్చుని ఉన్నాను. నీవు వెళ్ళినప్పుడు.

(౫౬)

నిత్యకర్మలలో మునిగితేలే వారిలో నేనూ ఒకతెను.

చల్లని మా నిత్యజీవితంనుంచి, ప్రత్యేకించి నన్ను ఎందులకు బయటకు తెచ్చావు?

అవ్యక్తప్రేమ పవిత్రమయినది. హృదయాంతరాలంలోని మణులవలె ప్రకాశించును. పగటికాంతిలో వెలాతెలా పోవును.

నా హృదయ కవాటము పగులకొట్టి నా గుప్త అనురాగాన్ని వెలికి తీశావు.

మిగిలిన వనితలు మామూలుగా ఉన్నారు. ఎవరూ వారి హృదయాంతరాలంలోకి తొంగిచూడలేదు, వారి రహస్యం వారికి తెలియదు. హాయిగా నవ్వుకుంటారు, దుఃఖిస్తారు, కబుర్లు చెప్పుకుంటారు, పనులు చేసుకుంటారు, నిత్యమూ మందిరానికి వెడతారు. దీపాలు వెలిగిస్తారు, ఏటినుండి నీళ్ళు తెస్తారు.

ఆశ్రయం లేని నా ప్రేమ అవమానం నుండి రక్షింపబడుతుందని ఆశించాను. నువ్వు నీ మోమైనా చూపలేదు. అనుమ మరి, యథేచ్ఛగా నీవు పయనిస్తావు.

నాకు మరలిపోవుటకు స్వేచ్ఛ లేదు. విశ్వం నన్ను ప్రతి క్షణమూ పరికిస్తుంది.

(57)

ప్రకృతీ, నీ పుష్పాన్ని నేను సంతరించాను! నా హృదయానికి హత్తుకున్నాను, ముల్లు గుచ్చుకున్నది.

పగలు గతించిపోయింది, చీకట్లు ముసురు కున్నాయి, పూవు వాడిపోయింది, కాని బాధ మిగిలింది.

ప్రకృతీ, నవకోమల పరిమళ పుష్పాలు విరియ బూస్తాయి!

కాని, నా పుష్పసంచయ సమయం మించి పోయింది. కాళరాత్రి, నా గులాబీ లేదు, బాధ మాత్రం మిగిలింది.

(58)

ఒకనాటి ఉదయం, పూదోటలో, ఒక అంధ బాలిక, తామరాకులో చుట్టిన పూలమాలను నాకు కానుకగా ఇచ్చింది.

హారం నేను మెడలో ధరించాను, నా కన్నులు చెమ్మగిల్లాయి.

ఆ బాలికను ముద్దుపెట్టుకుని అన్నాను. 'పువ్వు లకు మల్లే నువ్వుకూడ గుడ్డిదానివి. నీకు తెలియదు, నీ కానుక ఎంత సుందరమయినదో.'

(59)

వనితా, నీవు భగవంతుని సృష్టిమాత్రమే కాదు. మానవుని సృష్టికూడ; చిరకాలంనుంచి వారు వారి హృదయానుసారంగం నిన్ను అందంగా తీర్చి దిద్దు తున్నారు.

కవులు నిన్ను కమనీయంగా కొనియాడు చున్నారు; శిల్పులు నీ రూపానికి అమరత్వం సంత రించి పెట్టారు.

నిన్ను అలంకరించుటకు, రత్నాకరుడు మణులను ఇస్తాడు. భూమాత సువర్ణాన్ని ఇస్తుంది. పూదోటలు పూలను ఇస్తాయి.

మానవుని హృదయంలోని కోరిక నీ అందాన్ని ఇనుమడింప చేసింది.

నీవు ఒక సగము నారి. మిగిలిన సగము కల.

(60)

ఓ సుందర మూర్తీ, శిలావిగ్రహమా, నిశ్శ బ్దంగా ఒంటరిగా, నిలబడివున్నావు, జీవన సందో హంలో కాలుడు, ముగ్ధుడై. నీ పాదాల దగ్గర కూర్చొని, గొణుగుతున్నాడు! "ప్రియతమా, ప్రాణే శ్వరీ పలుకవా!"

కాని నీ పలుకు, శిలలో అణగారిపోయింది, సౌందర్య రాశీ!

(61)

హృదయమా, ఊరడిల్లుము. మన వీడ్కోలు సహజసుందరముగా జరుగనిమ్ము.

అది మృత్యువుగా కాక, సంపూర్ణముగ వుండ నిమ్ము.

ప్రేమ జ్ఞాపకాలుగ, బాధగీతాలుగ, జాలువార నిమ్ము.

నీ చరమ స్పర్శ, సుగంధ కోమల పుష్పమువలె కోమలముగ వుండనిమ్ము.

మృత్యుదేవతా, సుందరమూర్తీ, ఒక్కక్షణం నిశ్చలంగా నిలబడి, నీ చరమ సందేశమును విని పింపుము.

నీకు నమస్కరించి, నా జ్యోతిలో నీ మార్గమును వెలిగించెదను, దేవీ.

(62)

బాటసారీ, వెళ్ళక తప్పదా?

రాత్రి నిశ్చలంగా వున్నది, అడవిలో చీకటి ఆక్రమించుకున్నది.

మన యింట దీపాలు వెలుగుచున్నవి.

పూవులు వికసించాయి. మేము ఇంకా మేలుకొని వున్నాము.

నీ వీడ్కోలు సమయం ఆసన్నమయినదా? వెళ్ళ వద్దని నిన్ను అడ్డగించలేదు. నీ కవాటాలు తెరచే వున్నాయి. నీ గుఱ్ఱము సిద్ధంగా వున్నది.

మా గీతాలు నీ కాళ్ళకు బంధాలు వేస్తాయేమో.

మా కన్నులు నిన్ను పోవద్దని అర్థిస్తాయేమో.

నిన్ను ఆపడం మాకు చేతకాదు.

నీ కన్నులలో ఆరని వెలుగు వున్నది.

నీ రక్తంలో విశ్రాంతి ఎరుగని వేడివున్నది.

తెలియరాని పిలుపు నిన్ను ఆకర్షించింది.

ఆకాశంలోని తారకల మంత్రం, రజని పిలుపు, నిన్ను ఆవహించాయి.

నీకు ప్రశాంతత కావాలనుకుంటే, తెరువరీ దీపాలు ఆర్పివేసి. వీణావాదనం ఆపుచేస్తాము.

చీకటిలో ఆకుల మర్మరధ్వనులలో నిశ్చలంగా కూర్చుంటాము. చందమామ తన చల్లని కిరణాలతో నిన్ను ఆదరిస్తాడు. రజని గర్భాన ఏ శక్తి నిన్ను ఆవహించింది. తెరువరీ?

(64)

పగలంతా నిప్పులు చెరిగే దుమ్ము బాటలో గడచి పోయింది.

ఇప్పుడు, చల్లని సాయంకాలం. సత్రం తలుపులు తట్టాను. అది శిధిలమయిపోయి, నిర్జనంగావున్నది.

అశ్వత్థ వృక్షపువేరులు గోడలను పెకలించుకుని వచ్చాయి.

ఆ రోజుల్లో బాటసారులు ఇక్కడ సేదతీర్చుకునే వారు.

అంగణంలో చాపలు పరచుకుని పండుకొని, కులాసాగా కబుర్లు చెప్పుకొనేవారు. పక్షుల కలకలంతో మేలుకొని, ఎవరిదారిన వారు వెళ్లేవారు. బాట పక్కన పూవులు వారిని ప్రేమతో పలుకరించేవి కాని నేను వచ్చినప్పుడు దీపంలేదు. ఎండిపోయిన కుంటవొడలో మిణుగురులు ఎగురుతున్నాయి.

దారంతా గడ్డి అల్లుకుని పోయింది.

నన్ను అతిధిగా ఆదరించుటకు ఎవ్వరూ లేరు.

నేను అలసిపోయాను, రాత్రిగడచేది ఎలాగోమరి.

(65)

మళ్ళీ నీ పిలుపేనా?

సాయంకాల మయింది. మమతా బంధమువలె, అలసట నన్ను ఆవరించింది.

పగలంతా నీ కొలువులోనే గడచిపోయింది రాత్రయినా నన్ను సుఖంగా వుండనివ్వవా? ఎక్కడో, అన్నిటికీ అంతం వున్నది. చీకట్లో, వంటరిగా, ప్రశాంతంగా వుంటుంది. నీ పిలుపు నా ప్రశాంతతను దోచుకుంటున్నది. నీ వాకిట జోలపాటకు కావులేదా? నీ కోట బురుజుపైన నక్షత్రజాలలు ఆకాశంపైకి ఎగ బ్రాకవా?

నీ తోటలోని పూల జాలలు, వాడి, నేలమీద వర్షింపవా?

నీవు నన్ను పిలుస్తూనే వుంటావా?

అయితే, వేచివున్న ఆ కన్నుఁడు దుఃఖించనీ వంటరి కుటీరంలో దీపం వెలుగుతూ వుండనీ పడవ, అలసిపోయిన శ్రామికులను ఇండ్లకు తీసుకొని పోనిమ్ము

నా పిలుపు వదలిపెట్టి, నీ పిలుపును అనుసరిస్తాను

(66)

పరుసువేది అన్వేషణలో పిచ్చివానివలె తిరుగుతున్నాడు; దుమ్ము కొట్టుకొనిపోయిన జడలు, బక్కచిక్కిన దేహం, బిగించిన పెదవులు మిణుగురుల వంటి ఎర్రని కన్నులు.

అతని ఎదురుగ సంద్రము ఘోషిస్తున్నది, తెలియదు

నెత్తి బాదుకున్నాడు తనకు తెలియకుండా ఈ విజయం ఎక్కడ పొందినట్లు?

గులకరాళ్ళు ఏరడం, దండకు తాకించడం మార్పు జరిగిందో లేదో గమనించకుండానే విసిరి వేయడం, అతనికి అలవాటయిపోయింది పరసువేదిని కనుగొనడం. పోగొట్టుకోవడం జరిగిపోయింది.

సూర్యుడు పడమటి దిక్కున క్రుంకుతున్నాడు. ఆకాశం బంగారు ఛాయ నింపుతున్నది. పిచ్చివాడు. పోగొట్టుకొన్న తన నిధికొఱకు, తిరిగి అన్వేషణ ప్రారంభించాడు. శరీరం దరిగిపోయింది, పెల్లగింపబడిన చెట్టువలె బలంలేదు.

(67)

నెమ్మదిగా సాయంకాల మగుచున్నది ప్రకృతి నిశ్శబ్దంగా వున్నది;

నీ సహచరులు విశ్రాంతి తీసికొనుచున్నారు నీవు అలసిపోయావు;

భయంకరమయిన చీకట్లు ముసురుకున్నాయి నీలాల రంగి మేలి ముసుగు కప్పుకున్నది అయినా. హంసా, నా హంసా, నా మాట వినుము నీ రెక్కలను ముడుచుకోవద్దు.

సంద్రము కాళియునివలె ఘోషిస్తున్నది. అది మల్లియల నర్తనము కాదు, మెరుస్తున్న నురుగు.

వెలుగులు చిమ్మే పచ్చని తీరం ఎక్కడ? నీ గూడు ఎక్కడ?

హంసా, నా హంసా. నా మాట వినుము. నీ రెక్కలను ముడుచుకోవద్దు.

వంటరిగా రాత్రి గడపాలి నువ్వు ఉషాబాల కొండల మాటున నిద్రిస్తున్నది నక్షత్ర బాలలు ఊపిరి బిగబట్టి నిముషములు లెక్కించుచున్నవి.

దీర్ఘ నిశలో చందమామ ఈదుతున్నాడు హంసా, నా హంసా, నా మాట వినుము నీ రెక్కలను ముడుచుకోవద్దు.

నీకు ఆశలేదు, భయంలేదు మాటలేదు, పలుకు లేదు; ఇల్లులేదు. విశ్రాంతి తీసికొనుటకు తల్పము లేదు. నీ రెక్కలు. దారీతెన్నులేని అనంతాకాశము ఉన్నవి.

హంసా, నా హంసా, నా మాట వినుము నీ రెక్కలను ముడుచుకోవద్దు.

(68)

సోదరుడా, ఎవ్వరూ ఎల్లకాలము జీవించి ఉండరు, ఏదీ శాశ్వతము కాదు. ఇది గుర్తుంచుకొని ఆనందంగా కాలం గడుపుము మన జీవితము ఒకే ఒక భారము కాదు. మన మార్గము ఒకే ఒక సుదీర్ఘ ప్రయాణం కాదు.

ఒకే కవి ఒకే గీతాన్ని గానం చెయ్యడు పూవు వాడి నశించిపోతుంది, కాని దానిని ధరించినవాడు విచారిస్తూ కూర్చోడు సోదరుడా, ఇది గుర్తుంచుకొని ఆనందంగా కాలం గడుపుము.

సుందరమైన పరిపూర్ణత సిద్ధించుటకు విరామము అవసరము

జీవితము మరణముతో బంగరుఛాయలు అందుకొంటుంది

ప్రేమ దుఃఖంలోనే పునీతమవుతుంది. సోదరుడా, ఇది గుర్తుంచుకొని ఆనందంగా కాలం గడుపుము.

గాలికి ఎగిరిపోక మునుపే, మనము పూజ చేస్తాము.

కిరణ మొందగనే మమతలు చూరగొంటాము ఆశతో జీవిస్తాము. కాలుడు పిలువక మునుపే సోదరుడా, ఇది గుర్తుంచుకొని ఆనందముగా కాలం గడుపుము.

ఒక వస్తువును గ్రహించి, నాశనంచేసి, మట్టిపాలు చేయుటకు మనకు సమయం చాలదు. కాలం అతివేగంగా గడచిపోతుంది. కలల నీడలలో

మన జీవితకాలం చాల తక్కువ. ప్రేమకు కొలది సమయమే వున్నది.

నిత్య కర్మలకయితే ఎంతో సమయం వున్నది. సోదరుడా, ఇది గుర్తుంచుకొని, ఆనందంగా కాలం గడుపుము

సౌందర్యము మనకు మధురమైనది. ఏలనన, మన జీవన గానంలో ఆమె నర్తిస్తుంది. జ్ఞానము మనకు విలువైనది ఏలనన, పరిపూర్ణ జ్ఞాన సముపార్జనకు సమయం చాలదు శాశ్వత స్వర్గములో అంతయు ముగింపబడి లయమైపోయింది.

కాని భూమిమీద మాయాపుష్పములు మరణములో నిరంతరము గుబాళించును.

సోదరుడా, ఇది గుర్తించుకొని, ఆనందంగా కాలం గడుపుము.

(69)

నేను బంగరు లేడికై అన్వేషిస్తున్నాను మీరు నవ్వెదరేమో, స్నేహితులారా, కాని నన్ను మురిపించు విభ్రమమును నేను అనుసరించెదను

నేను కొండలూ గుట్టలూ తిరిగాను. తెలియరాని ప్రదేశాలు తిరిగాను. బంగరు లేడి కొరకు మీరు సంతలో మీరు వాడిన వస్తువులు తీసుకొని,

ఇండ్లకు మరలిపోయారు; కాని నాకు ఇంటికి మరలిపోను బుద్ధిపుట్టదు.

నా సర్వమూ వదలి పెట్టాను.

నేను కొండలూ గుట్టలూ తిరిగాను, తెలియరాని ప్రదేశాలు తిరిగాను. బంగరు లేడి కొరకు

(70)

నా బాల్యంలో వీధి కాలువలో కాగితం పడవతో ఆడుకున్న ఆ రోజు నాకు జ్ఞాపకమున్నది

శ్రావణ మాసంలోని ఆ రోజు వర్షం కురుస్తున్నది; నేను ఒంటరిగా హాయిగా ఆడుకుంటున్నాను. ఇంతలో ఈదురు గాలులు వీచాయి, కుండపోతగా వర్షం కురిసింది.

వాన నీరు కాలువను నింపేసింది, నా కాగితం పడవ మునిగిపోయింది.

నా సంతోషాన్ని పాడుచెయ్యడానికే తుఫాను వచ్చిందనిపించింది.

ఈ రోజు శ్రావణ మేఘాలు ఆకాశాన్ని దట్టంగా, కమ్ముకున్నాయి నేను నా జీవితంలో అపజయం పొందిన సన్నివేశాలు నా కళ్ళముందర లీలగా తిరుగుతున్నాయి.

నా దురదృష్టానికి చింతిస్తున్నాను. అకస్మికంగా, ఆ నాడు కాలువలో మునిగిపోయిన కాగితం పడవ గుర్తువచ్చింది.

(71)

ఇంకా సాయంకాలం కాలేదు, నది ఒడ్డున తిరునాళ ఇంకా ముగిసిపోలేదు.

నా సమయం ఆసన్నమయిందనీ, నాసిరి తొలగిపోయిందనీ నేను భీతి చెందాను.

కాని, సఖుడా, నాకు ఇంకా కొంత మిగిలి వున్నది; నా దురదృష్టం నన్ను పూర్తిగా మోసగింపలేదు. క్రయ విక్రయములు ముగిసినవి. నేను యింటికి వెళ్ళుటకు సమయమయినది.

అయితే, ద్వారపాలకుడా, నీ దక్షిణ చెల్లించవలెనా? భయమువలదు, నాకు ఇంకా కొంత మిగిలి వున్నది; నా దురదృష్టం నన్ను పూర్తిగా మోసగింపలేదు.

గాలి వాన వచ్చేట్లు వున్నది. చీకటి పడకుండా ఏరు దాటాలని ఆతురపడుతున్నాను.

నావికుడా. నీ దక్షిణ చెల్లించవలెనా?

అవును, తమ్ముడూ, నాకు ఇంకా కొంత మిగిలి వున్నది; నా దురదృష్టం నన్ను పూర్తిగా మోసగింపలేదు.

బాట పక్కన చెట్టుకింద బిచ్చగాడు కూర్చుని వున్నాడు. పాపం, ఆశగా నా వంక చూస్తున్నాడు అవును, తమ్ముడూ, నాకు ఇంకా కొంత మిగిలి వున్నది. దురదృష్టం నన్నుపూర్తిగా మోసగింపలేదు.

చీకట్లు ముసురుకున్నాయి. బాట నిర్జనంగా వున్నది. మిణుగురులు ఎగురుతున్నవి. నెమ్మదిగా అడుగులో అడుగువేసుకుంటూ నన్ను వెన్నంటి వస్తున్న నీవు ఎవరు?

నాకు తెలుసునులే, నన్ను దోచుకోవాలని ఆశిస్తున్నావు. నీవు. నిన్ను నిరాశపరచనులే!

నాకు ఇంకా కొంత మిగిలివున్నది. దురదృష్టం నన్ను పూర్తిగా మోసగింపలేదు.

అర్థరాత్రి ఇల్లు చేరుకున్నాను వట్టిచేతులతో నీవు వాకిలి వేచివున్నావు, మౌనంగా.

(72)

కష్టపడి దేవమందిరం కట్టాను. దానికి కిటికీలు తలుపులు లేవు. దాని కుడ్యాలు రాతితో దిట్టంగా కట్టబడ్డాయి.

ప్రపంచానికి వెలిగా, మైమరచిపోయాను. తదేక ధ్యానంతో నేను ప్రతిష్ఠించిన దైవప్రతిమను చూస్తూ వుండిపోయాను.

గర్భగుడిలో ఎల్లప్పుడూ చీకటిగా వుంటుంది; జ్యోతులు వెలుగుతూంటాయి.

నిరంతరంగా వెలిగే అగరువత్తుల సువాసన నా ఎదను దట్టంగా ఆవరించింది.

నిద్రాహారాలు మాని, కుడ్యాలమీద బొమ్మలు చెక్కాను. రెక్కల గుర్రాలు, మానవాననముల పూవులు, పాములవలె మెలికలు తిరిగిన అంగములు గల వనితలు.

పక్షుల కిలకిలా రావములు, ఆకుల గలగలలు పల్లె సంరంభము, లోపలికి దూరుటకు దారిలేదు. నా మంత్రోచ్చారణమాత్రం అనవరతము, చీకటి గర్భగుడిలో ప్రతిధ్వనిస్తుంది.

చలించని దీపశిఖవోలె నా మనసు నిశ్చలంగా వున్నది, నా యింద్రియములు మైమరచి పోయాయి. కాలగమనం ఆగిపోయినట్లున్నది; ఇంతలో మందిరం మీద పిడుగుపడింది, నాగుండె ఘల్లు మన్నది. దీపం వెలాతెలాపోయింది; కుడ్యములమీది చిత్రాలు కలలో వలె విచిత్రంగా కనుపించాయి వెలుగులో.

గర్భగుడిలోని దేవతా ప్రతిమవైపు చూశాను.

దరహాసవదనంతో సజీవంగా కనుపించింది నేను బంధించిన రజని. రెక్కలువాచి, ఎగిరిపోయింది.

(73)

మాతా, ధరిత్రీ, అనంత సంపద నీ సొత్తుకాదమ్మా ఏ బిడ్డలను పోషించుటకు నీవు శ్రమపడతావు కాని తగినంత ఆహారంలేదు.

నీవు మాకు ప్రసాదించిన సంతోషం ఎప్పుడూ అసంపూర్ణమే.

నీ బిడ్డలకు నీవు కానుకగా ఇచ్చు బొమ్మలు దృఢంగాలేవు.

మా ఆశలు నీవు తృప్తిపరచలేవు. కాని అంత మాత్రాన నిన్ను నేను వదలుకోలేను తల్లీ.

బాధాపూరితమైన నీ చిరునవ్వు నా కన్నులకు హాయిగా వున్నది.

అవ్యాజమైన నీ మధురప్రేమ నా ఎదదకు ప్రియమైనది.

నీవు మాకు చైతన్యాన్ని ఇచ్చావు. కాని అమృతత్వాన్ని ప్రసాదించలేదు. అందుకే నీవువేయికళ్ళతో మమ్మల్ని కనిపెట్టుకొని వుంటావు. యుగాలుగా నీవు నీ స్వర్గాన్ని సృష్టిస్తున్నావు అయినా ఇంకా పూర్తి కాలేదు, సూచనప్రాయంగానే ఉండిపోయింది.

నీ సుందరమయిన సృష్టి పై చిత్రిని, కన్నీటి పొగమంచు ఆవరించింది.

నీ మూగహృదయాన్ని నా సంగీతంతో నింపుతాను, నా ప్రేమను నీ ప్రేమలో లయింపచేస్తాను. నిన్ను నా సేవలలో ఆరాధించుకుంటాను.

నీ మట్టి నాకు ప్రియమైనది. నీ ముఖసరోజమును నేను కనుల పండువుగా తిలకించాను తల్లీ.

(74)

విశ్వమందిరంలో, గడ్డిపరక, సూర్యకిరణం తారకలు, అన్నీ సమానమే.

అందుకే విశ్వసంగీతంలో నా గీతాలకు స్థానమున్నది. కాని ధనగర్వాంధుడా, భాస్కరుని బంగరువెలుగులు, చంద్రుని వెండి వెలుగులు. నీ ధనాన్ని ధిక్కరిస్తాయి.

అనంతాకాశపుదీవెనలు నీవుపొందలేవు. మృత్యువు ఆసన్నమయినప్పుడు, నీవు నాశనమై పోతావు.

(75)

అర్ధరాత్రి, బైరాగి కావాలనుకున్న అతను, తలపోశాడు;

'నాయిల్లు వదలి, భగవంతుని అన్వేషించుటకు ఇది మంచి సమయం. అయ్యో, ఈ మాయలో నన్ను ఇన్నాళ్లూ పడవేసినది ఎవరో? భగవంతుడు నెమ్మదిగా పలికాడు, 'నేను', అని; కాని అతనికి వినబడలేదు. అతని భార్య, కుమారుడు, ప్రశాంతంగా నిద్రిస్తున్నారు.

అతను అన్నాడు. 'ఇన్నాళ్లూ నన్ను మూర్ఖతలో పడవేసిన నీవు ఎవరు?'

అంతరాత్మ పలికింది. 'దైవమే', కాని అతనికి వినిపించలేదు.

కలలో. బాలుడు కలవరపడి, తల్లికి దగ్గరగా జరిగి పడుకున్నాడు.

భగవంతుడు ఆజ్ఞాపించాడు. 'మూర్ఖుడా ! ఆగు. ఇల్లువదలి పోవద్దు' అయినా అతను వినిపించుకోలేదు.

భగవంతుడు నిట్టూర్చాడు. 'నా సేవకుడు నన్ను నిరాదరణ చేసి. నన్ను వెదకుతూ తిరుగుతున్నాడు' అని.

# స్త్రీల పాటలలో మాతృమమత

శ్రీమతి శిష్ట్లా లక్ష్మీనరసమ్మ

స్త్రీ గృహిణి కావున స్త్రీల పాటలయందు గృహ జీవిత వాతావరణమునకే అధిక ప్రాధాన్యమున్నది. గృహజీవితము సందలి మధుర ఘట్టములలో మును ముందు పేర్కొనదగినది సంతానప్రాప్తి తత్సంబంధములగు వేడుకలు. స్త్రీల పాటలయందీ విధమగు పాటలు పెక్కు లున్నవి. వీనియందు తల్లికి తన సంతానమునందు గల మమతానురాగములు, ఆశలు, ఆశయములు వ్యక్తము అగుచుండును.

మాతాపితరులు ప్రత్యక్ష దైవములు. అయినను ఇరువురి యందును మాతృమూర్తికే ప్రముఖ స్థానమున్నది. మాతృదేవోభవ, పితృదేవోభవ అని మనముందుగ తల్లినే పేర్కొందురు. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ' అని పెద్దల అభిప్రాయము అట్టి మాతృమూర్తి ప్రేమ విశ్వవిశాలమైనది. ఆమె ప్రేమస్వరూపము నిత్యజీవితమునకు సంబంధించిన ప్రతి స్వల్పఘట్టమునను మనకు ద్యోతకమగుచుండును.

స్త్రీ మాతృమూర్తి. బిడ్డల పెంపకమునందు తల్లిదండ్రుల కిరువురకును సమానమగు బాధ్యత గలదు. కాని కొంతవయస్సు వచ్చు వరకును వారి పెంపకము విషయమున తల్లి బాధ్యత గురుతరమైనది. విజ్ఞానవతియగు స్త్రీయైనచో తన బిడ్డలను క్రమశిక్షణలో పెంచి భావిపౌరులుగ చక్కగ తీర్చిదిద్దును. ఈ గురుతర బాధ్యత నామె ఆనందముతో స్వీకరించి సక్రమముగ నిర్వహించును. "స్త్రీ జీవితము గులాబి తోట వంటిది. అతిసున్నితము అమితానందకరము. సంఘాభివృద్ధికి మూలకారణము స్త్రీ. దేశసౌభాగ్యమునకు పునాది మాతృమూర్తి. విజ్ఞానముతో గూడిన మాతృత్వము బంగారమునకు తావి అబ్బినట్లుండును. పసిపిల్లల భవిష్యత్తునకు మాతృక మాతయే. ఆమె పోయు ఉగ్గుపాలలోనే ధైర్యము వెల్లివిరియుచున్నది. ఆమె నేర్పు ఆటపాటలలోనే వారి విజ్ఞాన కుసుమము వికసించును. "విజ్ఞానవతియగు స్త్రీ నూర్గురు ఉపాధ్యాయుల కంటె గొప్పది" అనినాడొక అనుభవశాలి" అని శ్రీమతి కనకంగారు పేర్కొనినారు.[1] బాలుడు పొందే బి.ఏ. డిగ్రీతో సమానమైనది బాలిక పొందే డిగ్రీ అని రాజగోపాలాచారి పేర్కొనినారు.

> "మాతృత్వంలోనే ఉంది ఆడజన్మ సార్థకం
> అమ్మా అని పిలిపించుకొనుటె స్త్రీ మూర్తికి
> గౌరవం"

నారీమణికి అందునను భారత స్త్రీకి మాతృత్వమనునది ఎనలేని సంపద. మాతృత్వము నందినపుడె తన జీవితము సఫలత గాంచునని స్త్రీ తలంచును. మాతృహృదయమనే లత చిగురించి మొగ్గ తొడిగిన ఫలితమే ప్రేమమధువును కురియిస్తుంది. సర్వజీవులకు అహ్లాదము కలుగును. ప్రసవవేదనబడు తల్లికి యీ ప్రేమే ఆరని జ్యోతి. బిడ్డపై మమత అనునది లేనిచో ఈ సృష్టిసాగుట కవకాశము లేదు"[2]. కావు

---

1. గృహలక్ష్మి - స్త్రీ మాతృమూర్తి అను వ్యాసము, 1949.
2. గృహలక్ష్మి - జూలై, 1949 - మాతృహృదయము - అన్నే నాగమణిదేవి

ననే స్త్రీ కష్టనష్టముల నెన్నిటినైనను సహించి సంతానమును పొందును.

"మాతృహృదయమును గూర్చి తెలియవలయు నన్న గోమాతను గూర్చి తెలిసికొనుట ముఖ్యము. సాధుమూర్తి గోమాత – గంగిగోవు – పరమశాంత మూర్తి. తడియారని తన బిడ్డను నాకికొను సమయ మున కన్నకూతురుగా తన్ను సాకిన కాపును సయి తం అంచి దూరంగా పారదోలుతుంది. దూకి పొడు స్తుంది. ఆ సమయమున ఆ తల్లి హృదయములోని మమతను ఏమని వర్ణింపగలము.[1] మాతృహృద యము నందలి మమతను గూర్చి యిదమిత్థముగా నిర్వచింపలేము. అది అనుభవైకవేద్యమే.

ప్రజావాఙ్మయమునకు చలం వ్రాసిన ప్రస్తావనలో మాతృ హృదయమును గూర్చి యీ విధముగా పేర్కొనినారు. "తనవాళ్లైవరెటుబోయినా, తాను దరిద్రురాలైనా, తనను గౌరవించేవారు, పలుకరించే వారెవరూ లేని ఏకాకియైనా, అందరికీ తాను లోకు వైనా తన పిల్ల తన స్వంతం. తనపై పే చేతులు జాస్తుంది. తనని తప్ప ఎవరినీ అమ్మా అని పిలు వదు. తనే దిక్కు. తన లోపాలు పిల్లకి కనబడవు. తనని అసహ్యించుకోదు. తన పిల్లకి అందం–దైవం. అదీ ఆ తల్లి తృప్తి.

తల్లీపిల్లల ప్రేమ ఈ సృష్టిప్రోద్బలానికి చాలా సన్నిహితమైనది. ఎంత సృష్టించినా ఈశ్వర హృద యానికి ఎట్లా తృప్తి లేదో అట్లానే ఈ ప్రేమతో ఎంతకీ తనివితీరడమనేది లేదు.[2]

మాతృత్వమును పొందని స్త్రీలకు సంఘమునను, స్త్రీలోకమునను గౌరవములేదు. ఆమె నందరును నిరాదరించుచుదురు. ఆమె జీవిత మంతయు అడవి గాచిన వెన్నెలవలె గడచిపోవును. సంతానములేని స్త్రీని గొడ్రాలని ఈసడించెదరు. ఆమెను–

'కొత్త చింతవందు గోనెల్ల చీకు
గొడ్రాలివస్త్రీల పెత్తల్లచీకు'
'కొడుకులం తనవివాళ్ళకడుపేమి కడుపు'

అనుచు హేళన చేయుదురు.

'ఒడ్డేల పొడవేల వళ్ళంత సొమ్మేల
చంక బిడ్డాలేని చక్కదనమేల'

అనుచు ఆమె చక్కదనమును, ఐశ్వర్యమును నిరసించుదురు.

సంతానా కాంక్షతో స్త్రీలు పలుబాధల నొందెదరు. నోములు, వ్రతములు, తీర్థయాత్రలు చేయుదురు. సింహాద్రి అప్పన్న గుడిముందు ప్రాణాచారము పట్టిన సంతానము కలుగునని కొందరి నమ్మకము.

సింహాద్రి అప్పన్న గుళ్ళముందార
పట్టారు గొడ్రాళ్ళు ప్రాణాచారాలు
కొడుకుల్ల యియ్యమని కోరిపట్టారు
సంతులియ్యమని చాల పట్టారు
బిడ్డలనియ్యమని పట్టుపట్టారు
సింహాద్రి అప్పన్నకు లంచాలుయేమి
గుడితిరుగుపస్త్రీలు గుమ్మడిపండ్లు
దాగళ్ళ వడపప్పు దండిబెల్లాలు

ఈ విధముగా ప్రాణాచారముపట్టి సింహాద్రి అప్పన్నకు లంచమిచ్చియైనను సంతానమును పొందవలెనని వారి యాశ.

బిడ్డలులేనివారు గొడ్డుమోతువారు
చేపేదంతర్వేది గంగస్నానాలు
గంగస్నానముచేసి గట్టుపైకెక్కి
యెదురున్న సూర్యున కేమనిమ్రొక్కి
సూరన్న నీవంటి శుభకరునిమ్ము
చంద్రన్న నీవంటి యింద్రునియిమ్ము

అనుచు సూర్యచంద్రులవంటి బిడ్డలు కావలెనని మ్రొక్కుకొనుచుందురు.

---

1. –పైడి–మాతృహృదయము అను వ్యాసము
2. ప్రజావాఙ్మయము – చింతా దీక్షితులు–దీనికి చలం వ్రాసిన ప్రస్తావన

వారి ఆశ ఫలించి కోరిక దీరి సంతానమును గన్న తల్లి సంతోషమునకు మేరలేదు. ఆమె సంతోష పారవశ్యముతో తన బిడ్డను రామునిగనో కృష్ణుని గనో భావించి లాలించును.

లాలనుచు పాదరమ్మా ఈ బిడ్డ లక్ష్మి
విలాసుడమ్మా
పాదమున చక్రమమ్మా ఈ బిడ్డ వేదాంత
వేద్యుడమ్మా
వేణునాదంబుతోను ఈ బిడ్డవేదములు
పాడునమ్మా

అని సంతోషముతో నుప్పొంగుచు తన బిడ్డను శ్రీకృష్ణునిగ భావించి జోలలు పాడును. తన బిడ్డ ఆడుబిడ్డయైనచో ఆమెను లక్ష్మిదేవిగానే భావించి ఆనందించును.

లాలి ననుగన్న తల్లి
మేలుకై కల్గితివి కల్పవల్లి
లాలనగ కనకవల్లి
అందు శ్రీలక్ష్మివలె నుల్లసిల్లి

అనుచు సాక్షాత్తు శ్రీమహాలక్ష్మియే తన కుమార్తెగా అవతరించినదని తలచి మురియును.

'ఇంట్లోకి పాపరావడమంటే ఇంకో లోకంనుంచి తమని ఆశలవీ పెట్టడానికీ, ఉద్ధరించడానికీ దిగి వచ్చిన సౌందర్యరేఖగా చూసుకుంటారు. తన పాప ఒంటిరంగు, చిరునవ్వు, చూపు అన్నీ యింటికి వెలుగు. అతను దీపం, అతన్ని చూసి సంతోష పడనివారు అసంభవం. ఆమె కంటికి తాను గొల్చే దైవమే తనకోసం రూపం పొంది తనచేతుల్లో వాలాడని భావిస్తుంది.'[1]

తల్లిగా స్త్రీకి చక్కని బాధ్యత గలదని నిరూపించునవీ పాటలు. స్త్రీ తన బిడ్డలను గోముగా లాలించుచు ఉయ్యాలలో నుంచి ఊపుచూ తన మనోభావములను, కోరికలను, ఆశలను కళ్ళు తెరువని ఆ పసికందునకు వివరించుచు మురిసి పోవును. ఈ పాటలలో సాధారణముగ తల్లికి మగ పిల్లలపైగల మోజు వివరింపబడియుండును. 'కొడుకుల కననివాళ్ళ కడుపేమి కడుపు' అని నిశ్చయించు కొనును.

మొగవాడు పుట్టాడు మొగ్గ పుట్టాడు
ధనము పెట్టెలకెల్ల దాత కలిగాడు

అని మగపిల్లవాడు కలిగిన తల్లిదండ్రులేగాక బంధువర్గ మంతయును సంతసించును. ఆడపిల్ల పుట్టినటులైన –

ఆడపిల్ల పుట్టింటి అబల పుట్టింది
దణ్ణేల కోరికలకు దైత పుట్టింది

అని ఈసడించుకుందురు. సంతానమునందీ స్త్రీ పురుష వ్యత్యాసము మనదేశము నందలి ఆర్థిక సాంఘిక వ్యవస్థలవలన కలిగియుండవచ్చును అది యునుగాక వంశము నభివృద్ధిగావించువాడు పురుషుడే. మగబిడ్డడైనచో తమను వార్ధక్యమునందు కాపాడుననియు, ఆడుబిడ్డయైన ఆమె కాశక్తిలేదు గావుననే తల్లిదండ్రులు మగసంతానమునే అభిలషింతురు. తల్లిదండ్రులకు తమ బిడ్డ లందరును సమానమే. వారి ప్రేమాభిమానము లందరియెడ నొకేవిధముగా నుండును. తల్లిదండ్రులకు తమకు దూరముగానున్న సంతానముయెడ కొంచెం మభిమానము ఎక్కువగ నుండుట సహజము. ఆడపిల్ల తల్లివద్ద పనిపాటల నభ్యసించుచు సతతము తల్లియొద్దనే యుండుటచే తల్లికి కుమారునిపైనను అదే విధముగ తండ్రికి కుమార్తెపైనను మక్కువ అధికముగ నుండును. అన్నదమ్ములతో వియ్యమంద వలెనను కోరిక కూడ దీనికి తోడగుచున్నది. ఈ

1. ప్రజావాఙ్మయమునకు చలం వ్రాసిన ప్రస్తావన.

మమకారవాత్సల్యములే ఈ పాటల యందు ద్యోతక మగుచుండును.

ఈ కారణముల వలన కొడుకులను గన్నతల్లిని అందరును గౌరవించుచు, ఆమె అదృష్టమును వివిధ రీతుల కొనియాడుదురు.

'కాకరచెట్టుకు పూత అందంబు
తల్లిబెట్టిన సొమ్ము బిడ్డకందంబు
కాకరచెట్టుకు కాయలందంమ్మ
మా అమ్మ తల్లికి కొడుకు లందంబు'
'కొడుకుల కననట్టి కడుపేమి కడుపు
కులముద్ధరించని కొడుకేమి కొడుకు
పిడికెడు విత్తనాలు మడికెల్ల చాలు
ఒక్కడే కొడుకైన వంశాన చాలు'
'లాభమ్మ లాభమ్మ ఏమి లాభమ్ము
కొడుకుల గంటేను కోటి లాభమ్ము'
కృష్ణమ్మవంటి కొడుకొకడు పుడితే
కష్టాలు కడతేరు కన్నతల్లులకు'

అని కుమారుడు పుట్టి కృష్ణునివలె కన్నతల్లుల కష్టములను కడతేర్చవలయునను కోరికతో స్త్రీ మగ సంతానమునే వాంఛించును. అన్నతో వియ్యమంద వలయునను కోరికతో గూడ స్త్రీలు మగసంతానమును అభిలషింతురు.

తింటేను తియదోసపండ్లే తినాలి
కంటేను కొడుకుల్ల కాన్పేకనాలి
అందితే అన్నతో వియ్యమందాలి
అడితే వదినతో జగడమాడాలి

అనునవి స్త్రీకి గల కోర్కెలు.

పసిపిల్లలకు తెల్లవారుజామున ఉగ్గుపాలు పోయుదురు. ఉగ్గుపాలు పోయుచు తల్లి తనబిడ్డ తినిన ఆహారమంతయు జీర్ణమౌకావలయునని కోరుకొనును.

జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం
[illegible]

ఏనుగు తిన్న వెలక్కాయ అరిగి
భీముడు తిన్న పిండివంట అరిగి
గణపతి తిన్న ఖజ్జా అరిగి
అబ్బాయి తాగినపాలు అమృతము అరిగి
పందల్లేపాకి
కుందల్లే కూర్చుండి
నందల్లే నడిచి
గుఱ్ఱమంత పరుగు
ఏనుగంత సత్తువు ఉండేటట్లు
పాకుమీ ఈ బిడ్డను సంజీవిరాయ

అని తల్లి తన బిడ్డకు ఉగ్గుపాలను పోయుచు ఏను గంత బలము కలుగునటుల చేయమని ప్రార్థించును.

తల్లి తన కుమారుని తన కంటి వెలుగుగా భావించి మురిసిపోవును.

ఇంతంత దీపమ్మ ఇల్లెల్ల వెలుగూ
ఈశ్వరుడి చందమామ జగతెల్లవెలుగూ
గోరంతదీపమ్మ కొండల్ల వెలుగు
గోపాలకృష్ణమ్మ గోవులకు వెలుగు
మాడంతదీపమ్మ మేడల్ల వెలుగు
మా చిన్ని అబ్బాయి మాకళ్ళ వెలుగు

(అమ్మాయి)

కృష్ణునకు, ఈశ్వరుని తలపై వెలుగు జాబిల్లికిని ఆ తల్లిదృష్టిలో తన కుమారు దేమాత్రమును తక్కువకాదు. అవి యన్నియును జగతికి వెలుగైనచో తన కుమారుడు తన కంటి వెలుగు అని తల్లి కుమారుని తలచుకుని మురియును.

అమ్మన్న ముద్దును ఏమన్నారు-అచ్చనావుల పాలన్నారు
అప్పుడు కాచిన నెయ్యన్నారు-దోరగ వేగిన గారన్నారు
పాకము వచ్చిన అరికన్నారు-పటికవంటవారిని పాడన్నారు

తల్లి తనపిల్లల ముద్దునందలి తీయదనమును తనకు తెలిసిన వివిధములగు మధురపదార్థముల యందలి మాధుర్యమునకు సమానమగునదని నిర్ణయించుకొనును. కాని ఆ ముద్దునందలి తీయదనము అనుభవైకవేద్యమేగాని మాటలలో వివరింపనలవి గాదు. "పిల్లలముద్దును పాటలోనున్న వస్తువులతో పోల్చుట అవి సరియైన వస్తువులని కాదు. అన్నిపేర్లు గూడ పసిపిల్లల ముద్దుతో తులనందుకొనలేవు. కేవలమవి భాషాదౌర్బల్యమును సూచించుటకే పెరిగిపోయినవి. ఈ భాషాదౌర్బల్యము మనకే గాదు ముద్దును మాటలో పెట్టజూచిన ప్రతి భాషకా దౌర్బల్యము గలదు. హృదయానుభూతికి భాష సంపూర్ణముగా ఆకారమీయజాలదు కదా?"[1]

తల్లికి బిడ్డల ఏడుపు భరింపరానిది. అందులకే ఆమె –

ఏడవకు ఏడవకు వెర్రి అబ్బాయి
ఏడిస్తే నీ కండ్లు నీలాలు కారు
నీలాలు కారితే నేజూడలేను
పాలైన కారవే బంగారు కండ్ల

అని దీనముగా ప్రార్థించును. పసిపాపలకు తల్లి ప్రేమను తెలిపికొనుటకు ప్రధాన సాధనము ఏడుపు అనియు, వారు ఏడ్చినపుడు తల్లి తన ప్రేమనంతను మాటలు, పాటలు, చేతల మూలమున చూపుననియు చలం గారు ప్రజావాఙ్మయమునకు వ్రాసిన ప్రస్తావనలో పేర్కొనినారు. బిడ్డల ఏడుపు వినినంతనె మాతృహృదయము తల్లడిల్లును వారి నే విధముగనైనను ఊరడించుటకు ఆ మాత యత్నించును.

ప్రతి తల్లికిని తన సంతానము అందముగానే కనబడును. కాకిపిల్ల కాకికి ముద్దను సామెతగా తల్లి తన బిడ్డలెంత అందవికారులైనను వారు మన్మధుల వలె మన్నారని తలచి మురియుచుండును.

పాపాయి కన్నులూ కలువరేకుల్లు–పాపాయి
జొంపాలు పట్టుకుచ్చుల్లు
పాపాయి దంతాలు మంచిముత్యాలు–పాపాయి
చేతుల్లు పొట్లకాయల్లు

పాపాయి పలుకులూ తేనెపలుకుల్లు–పాపాయి
చిన్నెలూ కృష్ణవన్నెల్లు

అనుచు ఉప్పొంగిపోవును. ప్రకృతిలోనున్న అందమైన వస్తువులన్నియును తన బిడ్డ అవయవములుగా తీర్చిదిద్దబడినవని యామె భావన. పాపాయి పలుకులు తేనెచిలుకులనుట యథార్థము. చిట్టిపాప ముద్దుపలుకును తొలిసారి వినిన ఆ మాతృ హృదయము ఆనందముతో ఉప్పొంగిపోవును. ఆ ఆనందమును తానొక్కతియే భరియింపలేక పదుగురికిని పంచ జూచును. పలుకనేర్చిన పాపాయి అందరికినీ ముద్దుల మూట గట్టును.

చిట్టినా అబ్బాయి చిఱుమొగము చూచి
సిగ్గు పడి చంద్రుడు పొడవజాలాడు

తమ కంటి వెలుగైన అబ్బాయి చిఱుమొగమునందలి కాంతిని జూచి చంద్రుడు సిగ్గుపడి ఉదయించుట మానినాడట తమ కుమారుడు చంద్రునివలె అందమైనవాడనియు, వెన్నెలవలె ఆహ్లాదమును కలిగించుననియు ఆ తల్లి భావన.

తల్లి తన బిడ్డను దేవత లందరును రక్షింపవలయునని ప్రార్థించును.

హాయి హాయీ ఆపదలుగాయీ
చిన్నవాళ్ళను గాయి శ్రీరంగశాయి
"శ్రీ వేంకటేశ

అని తన యిష్టదైవమును వేడుకొనును. ఇచట శ్రీ రంగశాయి అనుటకుబదులుగ ఇష్టదైవములను చేర్చుట కూడ అలవాటునందున్నది. తన బిడ్డకు అంగరక్ష, ఆదిరక్ష, దివ్యరక్ష, దీవరక్ష, చిన్ని నా అబ్బాయికి శ్రీ రామరక్ష అనుచు దేవుని ప్రార్థించును.

చిన్నాయి గంటల్లు మూగిమూగల్లు(మువ్వలు)
పన్నగాశయనుడే శేషశయనుడు
పండిళ్ళ నాడుకొని పాలుతాగి పండు[1]

---

1. జానపదగేయసాహిత్యము – డా॥ బి. రామరాజు, పు 503

తాను నమ్మి కొల్చిన దైవమే తనకొలకు బిడ్డగా రూపముధరించి తన గర్భము నందవతరించినాడని తల్లి మురియును.

పదుగురియందు తన కుమారునకు ప్రత్యేకత కావలయునని తల్లి కోరుకొనుచుండును. ఆ విధమగు ప్రత్యేకత కలిగిన ఈ క్రింది పాట యందు అతిశయోక్తి ద్యోతకమగుచున్నది.

> వీథి నెందరు ఉన్న విసరదే గాలి
> రచ్చ నెందరు ఉన్న కురవదే వాన
> నా చిన్న అబ్బాయి వీథి నిలుచుంటే
> మొగలిపువ్వుల గాలి ముత్యాలవాన

తన కుమారుడనిన తనకు మాత్రమే గాక ప్రకృతి కంతకును అభిమానము ప్రేమ అనియే తల్లి భావన. వీథి నెందరు ఉన్న విసరని గాలి, వాన తన చిన్ని కుమారుడు వీథి నిలుచుంటే మొగలిపువ్వుల గాలి ముత్యాలవానగా మారి తన కుమారు నలరించుచున్న వని భావించిన మాతృహృదయము ఆనందించును.

అబ్బాయి అల్లరిని తనవలెనే అందరును సహింపవలెననియు, ముచ్చటపడవలయుననియు ఆ తల్లి కోరిక.

> ఆడంగ ముద్దమ్మ పాడంగ ముద్దూ
> అల్లరీ అబ్బాయి అందరికి ముద్దూ

అనుచు తన కుమారుని అల్లరి నామె సమర్థించును.

"పసిబిడ్డలను నిలువబెట్టుకొని చక్కిలిగింతలు పెట్టుచుండ వారి నవ్వుల మాధుర్యమును గ్రోలుచు ఆ మందస్మిత వదనారవిందము నుండి చిన్నచిన్నగ తొంగిచూచు పలువరుసను గాంచి తల్లులీవిధముగ సహజకవిత్వము తేటపడ పల్కుదురు.

> చింతాకు చిగురాకు ఏడవున్నాది ?
> చింతమ్మ కోటలో కాడవున్నాది
> అబ్బుబ్బు ! దానిలో బూచి వున్నాది
> బూచికి నాచేత మందు వున్నాది
> మందూకు నానోట మంత్రమున్నాది
> మంత్రాన్కి మామిడి పండు వున్నాది
> పండ్లన్ని అమ్మాయి నోటిలో నిండివున్నాయి

అని "సారి గిలిగిల, చక్కిల గిలగిల" అని తిరిగి నవ్వింతురు.[1]

ఆటపాటలతో కుమారు డీవిధముగ పెరిగి చదువు కొను వయసు నందు చదువును నిర్లక్ష్యము చేసిన ఆ తల్లి -

> చదువంటె అబ్బాయి మొండికేశాడు
> బద్దెపలుపా రావె బుద్ధిచెప్పాలి

అని నెమ్మదిగ బెదరించును. అయినను విననటులైన యిరుగుపొరుగువారిని చూపి వారిని మెచ్చుకొని తన కుమారుని తక్కువజేయును.

> చదువుకోనాయనా చదువుకోతండ్రీ
> చదువుకుంటే నీకు సౌఖ్యమబ్బేను

అని నచ్చజెప్పుచు వానిని కర్తవ్యోన్ముఖుని జేయుటకు యత్నించి సఫలీకృతురాలగును.

తల్లి యెల్లవేళలా తన బిడ్డలు లక్ష్మీ సంపన్నులు కావలయునని కోరుకొనును. ఈ భావము నామె వాచ్యముచేయక లక్ష్మీ దేవినే ఆజ్ఞాపించుచుండును.

> తూర్పు వీథిలోనున్న పెదబాబును పొందు
> పడమటి వీథిలోనున్న చినబాబునుపొందు
> ఉత్తరపు వీథిలోనున్న బుచిబాబును పొందు
> దక్షిణపు వీథిలోనున్న బుల్లిబాబును పొందు

అనుచు తన బిడ్డ లెల్లపుడు ఆయురారోగ్యైశ్వర్యములను కలిగియుండవలయునని వాంఛించునది మాతృ

---

1. తెలంగాణా పల్లెపాటలు లోనిది - సేకరణ డా॥ బి. రామరాజు
1. సేకరణ - వివరణ-యం.వి. పాపన్నగుప్త

హృదయము. ఈ కార్యసాధన కొరకు అనుదినము దేవతలను ప్రార్థించును. ఈ విధముగ తల్లి తన కుమారుని లాలించి, మురిపించి తాను మురియు విధము అద్వితీయము.

కుమారునిపై విపరీతమగు ప్రేమానురాగములు గల తల్లి తన కుమార్తెను చిన్నచూపు చూడదు. కుమారుడు వంశోద్ధారకుడని వానియెడ కొంచెం మభిమానమును అధికముగనే చూపును. కుమార్తె యుక్త వయసు వచ్చిన పిదపనైనను పరాయి యింటికి పోవలసినదే. ఆమె అచట ప్రవర్తింపవలసిన విధమును, పనిపాటలు, మున్నగునవన్నియును నేర్పి అత్తవారింటిలో ఆమె మాట పడకుండునటుల తీర్చి దిద్దవలసిన బాధ్యత తల్లికున్నది. కావుననే ఆమె కుమార్తెను కుమారుని చూచినంత గారముగా చూడ లేకపోవును. తల్లికి యిరువురియందును ఆత్మీయత ఒకేవిధముగ నుండును. కాని ఈ కారణములచే అనురాగ వ్యక్తీకరణమునందు వ్యత్యాసము గోచరించుచున్నది.

తల్లి తన కుమార్తె అందచందములను గూర్చి పదుగురి ఎదుట ముచ్చటింపవలసినపు డామె కుమార్తె నీవిధముగ వర్ణించును.

> చిక్కుడూ పువ్వెరుపు చిలుక ముక్కెరుపు
> చిగురెరుపు చింతల్ల దొరవండెరుపు
> రక్కెసపండెరుపు రాగిచెంబెరుపు
> తా ఎరుపు అమ్మాయి తనవారిలోన

అని అమ్మాయిని గూర్చి సహజసుందరముగ వర్ణించినది. అమ్మాయి రంగుతో ఉపమించిన వస్తువులన్నియును సహజసుందరము. ప్రతిదినమును ఆమె కంటికి కనుపించునవే. అట్టి స్వభావసిద్ధమగు వస్తువులతో తన కుమార్తె రంగును పోల్చి చూచి మురిసిపోయినది.

తల్లి తన కుమార్తెకు చీరలు, నగలు కావలయునని ఆరాటపడును.

> చిన్నినా అమ్మన్న చీరకేడిస్తే
> నెయ్యవోయి సాలివాడ నేత్రంపుపట్టు
> వెయ్యవోయి కంసాలి వెండిజల్తారు

అనుచు అందరికినీ పనులు 'పురమాయించును'. గాజుల 'సందా' కూడ యిటువంటిదే.

> చిన్నారి పొన్నారి గాజుల్లసెట్టి
> తేరు మా అమ్మాయికి తేనెగాజుల్లు
> పాడుతూ తొడిగిస్తు పచ్చగాజుల్లు
> నవ్వుతూ తొడిగిస్తు నల్లగాజుల్లు
> ఏరేరి తొడిగిస్తు ఎర్రగాజుల్లు

అనుచు ముచ్చటపడును. స్త్రీలకు చీరలు, నగలు, గాజులు, పువ్వులు అనిన ప్రీతి మెండు. ఈ వస్తువులన్నియును ఐదవతనమునకు చిహ్నములు కావుననే స్త్రీలకు వీనిపై మమకార మధికముగ నుండును.

'ఏమీ తెలియని పసికూన ఉయ్యాలలో పాల కేడ్చినా అదుగోనమ్మా వారు నీకు బుట్టెడు నగలు తెస్తున్నారు. ఇదుగోనమ్మా వీరు నీకు పెట్టెడు చీరలు తెస్తున్నారు అని సముదాయిస్తుంది. అట్లా తెచ్చేవారిలో తన పుట్టినింటి 'తరపు' వారే ఎక్కువ. వాళ్లు పిల్లను మెచ్చి ముత్యాలు గుప్పించిన నత్తు, చిలుకలు వేయించిన చీర, రత్నాలు తాపించిన రవికలు పంపుతారు. వాళ్ళ ఆశ అంతా ఆ పిల్లమీదే. తల్లి ఊహకూడ ఎప్పుడూ తమ్ముణ్ణి తన అల్లుణ్ణి చేసుకోవాలని ఉంటుంది.'[1]

> ఆటమాణిక్యమే పాటమాణిక్యం
> నట్టింట అమ్మాయి రత్నమాణిక్యం

---

1. పదవాఙ్మయంలో స్త్రీ అను వ్యాసము-డా॥ నాయని కృష్ణకుమారి – సారస్వత వ్యాసములు, రెండవ సంపుటము.

అనుచు అమ్మాయి ఆటపాటలను చూచుకుని మురిసిపోవును.

తల్లి తన బిడ్డకు గోరుముద్దలను తినిపించుటకై చంద్రుని సహాయము నర్థించును. ఆకాశమునందలి చందమామను చూపుచు మారాముచేయుచున్న తన బిడ్డకు గోరుముద్దలను తినిపించును.

చందమామరావె జాబిల్లి రావె
కొండెక్కిరావె కోటివేలు తేవె
బండిమీద రావె బంతిపూలు తేవె
తేరుమీదరావె తేనెపట్టుతేవె
అన్నింటిని తెచ్చి మా అమ్మాయి కివ్వవే

ఈ పాట పాడుచు తల్లి బిడ్డనోటికి ముద్దనందించిన ఆబిడ్డ చందమామను చూచుచు వెన్నెలలోని చల్లదనము ననుభవించుచు మారుమాటాడక ఆ ముద్దను తినును. ఆ విధముగ తల్లి బిడ్డకు అన్నమును తినిపించుచు గగనతలమున నున్న అందరాని చందమామను గూడ తన బిడ్డకొఱకు భూమిపైకి దింపి వానికి సేవలు చేయుమని కోరుచున్నది. అటువంటిది మాతృహృదయము.

స్త్రీకి సహజముగ పుట్టినింటిపై మమతానురాగములు అధికముగ నుండును. అత్తింటిపై అభిమానమున్నను పుట్టినింటిపై ఆమెకుగల మమకార మెన లేనిది. అందులకే ఆమె పుట్టినింటితో సంబంధబాంధవ్యములను పెంచుకొనుటకే యత్నించును. అట్టివానిలో ముఖ్యమైనది అన్నదమ్ములతో వియ్యమందుట.

మాయలేళ్ళు గలవు ఆ లంకలోన
మాకు తమ్ములు గలరు వియ్యమంద

అని తలచుకొని ముచ్చటపడును. తన బిడ్డలకు తన పుట్టినింటివారు రావలయునని స్త్రీ కోరుకొనును.

స్త్రీ తన అన్నదమ్ముల కీర్తిని గూర్చి ఈ విధముగ వర్ణించును.

అబ్బాయి మామలు యెటువంటివారు
నిలువుబొట్లులవారు నియ్యోగివారు
అంచుపంచెలవారు పాగాలవారు
చెవిచెవికి చేరెడేసి పోగుల్లవారు
పెసరకాయలవంటి పెదిమెల్లవారు
కందికాయలవంటి కనుబొమలవారు
మిరపకాయలవంటి మీసాలవారు
వారు మా అబ్బాయి మేనమామల్లు

అనియును.

అందరీ మామల్లు మేనమామల్లు
అమ్మాయి మామల్లు చందమామల్లు

అనుచు అన్నదమ్ముల అందచందములను వర్ణించుచు ముచ్చట పడును.

అన్నదమ్ములు తన కుమారునకు లొంగియుండవలెననియు, ఆతనిని మంచిచేసికొనుటకై వివిధములగు కానుకల నీయవలయుననియు ఆమె వాంఛించును.

లాలి లాలి లాలి లాలమ్మ లాలీ
అబ్బాయి మామల్లు ఎటువంటివారు?
అంచుపంచెలవారు అంగీలవారు
నిలువుబొట్లులవారు నియ్యోగివారు
ఎక్కంగ తెచ్చేరు ఎర్రగుర్రాలు
పట్టంగతెచ్చేరు పట్టుగొడుగుల్లు
పులిగోరు పతకాలు పూసలాపేర్లు
శేరు శేరు పట్నాలు ఐదుంగరాలు
అబ్బాయి మామల్లు తెచ్చియిచ్చేరు

ఈ విధములగు కానుకల నర్పించి అల్లుని తమ వశము చేసికొనవలయునని ఆమె కోరిక.

మేనమామగారు మెప్పించినారు
ముత్యాలు గుప్పించి నత్త్రంపినారు
చిలుకల్ని వేయించి చీరంపినారు
రత్నాలు వేయించి రవికంపినారు

అనుచు కుమార్తె అందచందములకు మెచ్చి ఆమెకు వివిధములగు వస్తువులను సమర్పించినారని తల్లి మురియును. తల్లి తన అన్నదమ్ములను గూర్చి మెచ్చుకొనుచు ఈ విధముగ పాటలుపాడి మురిసి పోవును.

అదేవిధముగ కూతురు మామగారిని గూర్చి పాడు నపుడు వారిని ఎగతాళి చేయుచు హాస్యమును కలుగ జేయును.

అమ్మాయి మామలు యెటువంటివారు
చేపల గంపావద్ద చెయిజాచువారు
గుడ్డిగుర్రాన్నెక్కి గోజారువారు
పందిపిల్లానెక్కి పరుగెత్తువారు
చింపిరితలవారు చీడపేలవారు

అనుచు వారిని వర్ణించి ఎగతాళిజేయును. ఈ విధ ముగ స్త్రీకి పుట్టినింటిపై గల ప్రేమాభిమానములు తన అన్నదమ్ములు తన బిడ్డలను చూచువిధమును తలపోయుచు మురిసిపోవుట ఈ పాటలయందు కానవగు అంశము.

స్త్రీల పాటల యందు మాతృహృదయమును తెలియజేయు మరియొక ఘట్టము అప్పగింతలు. తల్లి తన బిడ్డల ముద్దు మురిపెములను జూచి ఆనందించును. వారు కోరుకొను వస్తువులనిచ్చి వారి నతిగారాబముతో పెంచును. ఎంత అనురాగముతో పెంచినను ఆడపిల్లను మరియొక యింటికి పంపుట తప్పదు. ఈ సమయమునందామె దుఃఖము వర్ణనా తీతము. తన హృదయమున నందలి ఆవేదనను అణచుకొనుచు తన కుమార్తెను అప్పగించుచు వారికి కొన్ని సూచనలను చేయును. అటులనే తన కుమార్తె అత్తవారింటియందేవిధముగ ప్రవర్తింప వలయునో వివరించును.

అమ్మారో మీ యత్తావారింటి కనిపి
నమ్మాతి యెట్లుండు నిమ్మళంబుగను

అనుచు తల్లి ఆవేదన నందును. ఆమెను అత్తవారింటి కనుపుచు—

ముత్యాల భాసికం అల్లాడగాను
ముదితరో మాసీత తిరిగిచూడావే
పచ్చలభాషికం అల్లాడగాను
పడతిరో మాసీత తిరిగి చూడావే
నీలాల భాషికం అల్లాడగాను
నెలతరో మాసీత తిరిగిచూడావే।

ఆమె కనుచూపుమేర దాటిపోవు వరకును తిరిగి చూడుమని ప్రార్థించుచు దుఃఖించును. అప్పగింతల పాటల యందు మాతృహృదయము స్పష్టముగ గోచరించును. స్త్రీలపాటల యందు పురుష సంతాన మునకీయబడిన ఆధిక్యత స్త్రీ సంతానమునకు లేదు. కాని తల్లిహృదయమున బిడ్డలయందు భేదములు లేవనియు, తల్లికి కుమారుడు, కుమార్తెయు గూడ సమానులే యనియు ఆమె యిరువురిని రెండుకండ్లుగ భావించి పెంచి పెద్దచేయుననియు ఈ పాటలమబట్టి తెలియుచున్నది. లేనిచో ఆడుబిడ్డను అత్తవారింటికి పంపునపుడు అంతగా మనస్తాపము నొంది ఆవేదన పడుటకు అవకాశములేదు. ఇరువురినీ సమానముగ పెంచుటచేతనే ఆమెకీ ఆవేదన కలిగినది. కావుననే—

గగనంబులోపలా చంద్రుంతు వెలుగూ
చంద్రుని పక్కలో చుక్కల్లు వెలుగు
అందరి ఇంటిలో దీపాలు వెలుగు
మాచిన్ని అమ్మాయి మాయింటు వెలుగు

అనుచు కుమార్తెకు గూడ సమాన ప్రాతినిధ్యమును కల్పించినది.

మాతృహృదయమును గూర్చి ఒక్క ఉదా హరణ—

ఫణిహార్లు దెచ్చినా పలుకులూ వినగానె
పణతికీపాలు గురిసె

సారంగధర చరిత్రమున సారంగధరుడు జీవించియే

యున్నాడని తెలిసిన రత్నాంగి మాతృహృదయమును గూర్చి 'పణతికీ పాలుగురిసె' అను ఒక్క మాటలో మాతృహృదయమునందలి మమతను మధురముగ చిత్రించినాడు.

అట్టి మాతృమూర్తిలేని పిల్లల పరిస్థితి క్రింది విధముగ చిత్రింపబడినది –

తల్లాడు తల్లాడు ఏమి తల్లాడు
తల్లిలేని బిడ్డలకు గుండె తల్లాడు

తల్లిహృదయము శమదమాది నిలయము తన బిడ్డలయెడ నా హృదయము నవనీతసమము. తల్లి బిడ్డల ఆటపాటలతో ముద్దుమురిపములతో పులకరించును. తన ఆరాధ్యదైవమే తనకొఱకు బిడ్డగా అవతరించెనని ఆ మాతృమూర్తి భావన. తల్లి తన బిడ్డల నతిగారవముగ లాలించుచు వారి ముద్దుముచ్చటలను తీర్చుచు మురియుచుండును. తల్లికి తన సంతానము నందపారమగు ప్రేమయే లేనిచో ఈ సృష్టిక్రమము ఆగిపోవును.

సాధారణముగ తల్లి తన బిడ్డలను దండించుట కిచ్చగింపదు. వారి నడవడి సక్రమముగ లేనిచో వారిని మంచిమాటలచే నచ్చజెప్పి సన్మార్గానువర్తులుగ జేయుటకు యత్నించును. అయినను వారు విననిచో బెదరించును. మంకుపట్టు పట్టిన బిడ్డను తప్పనిసరిగ దండింపవలసి వచ్చినపుడా మాతృహృదయము ఆవేదనకు లోనగును. కోపోద్రిక్తతచే ఆమె వారిని దండించినను పశ్చాత్తాపము నొందును. మాతృహృదయమునందలి మమతను మాటలలో వర్ణించుట అసాధ్యమైనది. హృదయము నందలి భావము మాటల కందదు ఈ మాతృమమత వర్ణనాతీతము, అనుభవైకవేద్యము.



# చందాదారులకు వినతి

"నవభారతి"కి అన్ని విధాలా సహాయ సహకారములు అందిస్తున్నటువంటి పాఠకులకు, రచయితలకు, అభిమానులకు కృతజ్ఞతను తెలియచేస్తున్నాము. ఇంతవరకు తమ తమ చందాలను పంపుటకు వీలుగాని వారు వెంటనే పంపించవలసినదిగాను, చందాదారులుగా ఉన్నటువంటి వారు తమ సభ్యత్వమును పునరుద్ధరించి యథాతథంగా తమ సహాయము సహకారము లిచ్చి అన్ని విధాల తోడ్పడవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము.

— మేనేజరు

# స్వేచ్ఛా గీతి*

ముదివేడు ప్రభాకరరావు

## 1

నాలోనెన్ని దుర్భావనలిట్టె యేపుపెరిగి
దట్టమైప్రాకి తృటిలోన దుబ్బుకట్టి
దుర్భర విషాద వహ్నికి ప్రజ్జ్వలించి
తక్షణము దగ్ధమై జని వృథాత్వమ్ము చాటు।

కాలిపోయిన దర్పమోళ్ళ ప్రక్కలబడి
పాము పిల్లల నాల్కలవోలె మెఱసియాడి
మోసులెత్తినవి సన్నని చివుళ్ళు, అందొక
దాని కొన నిల్చినట్టి హిమబిందువు
మత్తనూ రహస్యమ్మేదియో స్ఫురింపజేయు

ఒక చల్లని గాలిపొర తనుయష్టిని స్పృశింప
ఒక ప్రశాంత మధురిమావేశమ్ము
మంద్ర మద్రమ్ముగా మదిలోన మాధురిల్లి
తేటనీటిలో తళుకొత్తు చేపలవలె
నాకనుదోయి మోద్దును సకలమ్ము మఱచి

## 2

గుండె దిటవులేని పేదమనసువాడు
ఒక చక్కని గీత గీయ జాలు నెట్లు?
పలుపోకలు పోవు పోకిరి మనసు నాది
ఒక భావము—

అది దుఃఖమో, సుఖమో నిక్కము చెప్పలేను
ఎడద లోతుల బట్టి పాలార్చు చున్న
నన్నది విడుచునట్లుగా లేదు
మత్తనూ పతనమ్ము వఱకు।

అదెట్టి బలవత్తర భావమో యెఱుగలేను
కొన్ని కొకిబికి కురూప భావముల్ మోహరించి
పృథుల కరాళహస్తమ్ముల పెనగివైచి
జగత్తులో మరికేదియు లేనట్లు
అదియె తథ్యమైనట్లుగా తోపింపజేసి

ఒక్క తృటిలోన మాయలో ముంచివైచు.
ఒక చూపు, ఒక విసరు
ఒక పలుకు, ఒక కులుకు
నాలో నెన్నెన్ని తరంగాలు రేపి
హృదిని గగ్గోలు పఱచునో చెప్పలేను
మోము మరల్తునే గాని త్రిప్పలేను మనసు
ఎదను చిక్కబట్టి చక్కగా
నొక నిర్దిష్ట మార్గమున పయనించలేను
బద్ధసామజము రీతి బ్రతుకు చక్రమ్ములో
బరువైన గుండెతో బ్రతుకుచున్నాను.

* ఈ గీతంలో గణాలూ, యతులూ, ప్రాసలూ వెదకనవసరంలేదు. ఒకానొక విలక్షణమైన మానసిక స్థితినుండి విసర్గంగా జాలు వారిన స్వేచ్ఛాగీత మిది.

# కాళిదాస కవితా వైశిష్ట్యము

కొనకనేని బసవేశ్వరి

( గత సంచిక తరువాయి )

**సంభాషణా చాతుర్యము :**

కాళిదాసు పాత్రల సంభాషణ తర్క, మీమాంసాది శాస్త్ర పండితుల సంభాషణల వలె అతి రమ్యముగ హేతుబద్ధముగ నుండును. రఘువంశమునందు బాహు ప్రతిష్టంభముచే విస్మితుడగు దిలీప మహారాజునకు విస్మయమును కల్గించుచు సింహము మనుష్య భాషణతో "ఓ మహారాజా! నీవు ప్రయోగించిన అస్త్రము వ్యర్థమగును. కావున నీవు శ్రమ పడవలదు" యని పలికి, దానినే సమర్థించుచు "న పాదపోన్మూలన శక్తి రంహః శిలోచ్చయే మూర్ఛతి మారుతస్య" యని హేతువును చూపెను. "త్రిలోకాధిపత్యమును, నీ సుందర శరీరమును కాపాడుకొనుము, ప్రజా రక్షణ కొఱకైనను నీవు బ్రతికియుండుట ముఖ్యమ"ను సింహపు పల్కులను ఒక గోవును రక్షింపలేనివాడు 'క్షత్ర' శబ్ద వాచ్యుడు కానెట్లగుదునని ఖండించెను. మఱియు సంబంధము అభాషణ పూర్వమని పెద్దలు చెప్పుదురు. అట్టి సంబంధము మనకిప్పుడు కల్గినది. కావున సంబంధియగు నా మైత్రిని నీవు కాదనుట తగదని ప్రబల హేతువును చూపించి సింహము మారు మాటాడకుండునట్లు చేసెను. ఈ సింహ దిలీపుల సంవాదము చక్కని వ్యాయవాదుల వాదనవలె నున్నది.

"సంబంధ మాభాషణపూర్వమ్" యను విషయమును బ్రహ్మచారి, పార్వతీదేవి యొక్క సంభాషణ విషయములో కూడ కవి సందర్భ ఉచితముగ వివరించెను.

"యతస్సతాం సన్నత గాత్రి సఙ్గతం మనీషిభిస్సాప్తపదీన ముచ్యతే" - యని బ్రహ్మచారి పల్కెను. ఇందలి 'సాప్తపదీనమ్' యను పదము 'సఖాసప్త పదాభవ' యను వివాహకాలపు వేదమంత్రమును స్ఫురింపజేయుచున్నది. ఈ పదప్రయోగముచే తమ ఇరువురకును వివాహమైనట్లేనని అందువలననే "సమాం పరం సంప్రతిపత్తు మర్హసి" -యని బ్రహ్మచారి పల్కినాడు.

బ్రహ్మచారి పార్వతీదేవిని చూచి 'ప్రచక్రమే వక్తు మనుజ్ఝిత క్రమః' యని సంభాషణనెట్లు ప్రారంభించిన నుచితముగ నుండునో తెలుపుచున్నాడు. పార్వతీదేవి తపస్సును గూర్చి ప్రశ్నించుచు 'శరీరమును రక్షించుచు తపస్సు చేయుచున్నావా!' యని యడిగి దానిని సమర్థించుచు 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్' యని పల్కెను. శరీరమును కృశింపజేయుచు తపస్సు చేయుట అసురకృత్యమని భగవద్గీతలో వర్ణింపబడియున్నది. తుదకు బ్రహ్మచారి తన తపస్సులో అర్ధభాగమిచ్చెదనని, కాని ముందు ఆ వరుని తెలుసుకొనగోరుచున్నానని పల్కెను. 'అర్ధభాగేన' యను పదము వలన అర్ధాంగిగా స్వీకరించుననునది సూచనగా కన్పట్టుచున్నది. బ్రహ్మచారి పలుకులను సహేతుకముగా రసవత్తరముగ పోషించుటకై 'ద్విజాతి భావాదుపపన్న చాపలః అయం జనః ప్రష్టుమనాః...' - యని చమత్కరించినాడు కాళిదాసు మహాకవి. శృంగార నాయికల కుండదగిన మన్మథావస్థ

అను బ్రహ్మచారితో పార్వతీ సఖి చెప్పు నెప మున కవి వర్ణించినాడు.

'కన్యావరయతే రూపం మాతావిత్తం
పితాశ్రుతమ్
బాన్ధవాః కులమిచ్ఛన్తి మృష్టాన్న
మితరే జనాః'

-యని పెద్దలు చెప్పిన వానిలో యే యొక్క టియు యీశ్వరునకు లేదనుచు

"దపుర్విరూపాక్ష మలక్ష్య జన్మతా
దిగమ్బర త్వేన నివేదితం వసు
వరేషు యద్బాల మృగాక్షి మృగ్యతే
తదస్తి కిం వ్యస్తమపి త్రిలోచనే' -యని

అందుచే ఈ యనుచితమైన కోరికను మాను మని బ్రహ్మచారి చెప్పెను.

బ్రహ్మచారి పార్వతీచిత్త స్థైర్యమును పరీ క్షించుటకై పరమేశ్వరుని దూషించునపుడు పార్వతీదేవి పరమేశ్వరుని తత్త్వమును వివరించి నది. కాళిదాస మహాకవి పార్వతీ ముఖమున దీనిని ప్రజలకు నుపదేశించినాడు. ఈ సమ యముననే మహా పురుషులను దూషించిన వానితో పాటు దూషణను విన్నవారును పాప మును పొందుదురను సత్యమును పార్వతీ ముఖ మున తెలియజేసినాడు.

శాకుంతలమునందు దుష్యంతుడు 'స్త్రీనామ్ అశిక్షిత పటుత్వం' - అని పల్కుచు స్త్రీజాతి నాక్షేపించినపుడు శకుంతల సరోషయై "అనార్య! ఆత్మనః హృదయాను మానేన సర్వం పశ్యసి । ఇదానీమ్ అన్యః ధర్మకంచుక ప్రవే శినః తృణచ్ఛన్న కూపోపమస్య తవానుకృతిం పత్స్యతి'-యని పల్కినది. కాళిదాస కవి చక్కని సంభాషణను పాత్రలమధ్య నిర్వహించినాడు.

రసపోషణ:-

రఘువంశమందలి దిలీపునియందు దయా వీరత్వమును చూపెట్టినాడు కాళిదాస కవి. కాళిదాస కవి తన కావ్యములందు, రూపకము లందు నవరసములను చక్కగ పోషించెను.

"ధనుర్భృతోఽ ప్యస్య దయార్ద్రభావ
మాఖ్యాత మంతః కరణైర్విశంకైః"—

యనునది దిలీపుని దయావీరత్వము నకు నిదర్శన ముగా చెప్పవచ్చును.

కుమార సంభవమునందు తృతీయ సర్గలో పార్వతీ సౌందర్య వర్ణనము, వసంత విజృం భణము శృంగార రసపోషణకు నిదర్శనము. రతీ విలాపము కరుణరసమంగముగా గల విప్రలంభ శృంగార రసపోషణకు నిదర్శనము. శివుని సమాధి నిష్టను వర్ణించునపుడు, పార్వతీ తపస్థితిని వర్ణించునపుడు శాంత రసపోషణ పరిపూర్ణ స్థితి నొందినది.

శకుంతలను అదృశ్యశక్తి దుష్యంతుని సభా భవన ప్రాంతము నుండి తీసుకొని వెళ్ళుట అద్భుతరసమున కుదాహరణగ చెప్పవచ్చును.

శకుంతలా దుష్యంతుల సందర్శన సమయ మున శృంగార రస స్థాయీ భావమైన రతిని అంకురింపజేసి, క్రమముగా పరిపుష్టి నొందించి, షష్ఠాంకమునందు విప్రలంభ శృంగారముగా పోషించి సప్తమాంకమున శకుంతలా దుష్యం తుల సమాగమమున రతిని సఫల మొనర్చెను.

విక్రమోర్వశీయమున ఊర్వశి, పురూరవుల ప్రథమ సమాగమమును రసవత్తరముగ కల్పించి, మరల ఉద్యానవన సమాగమమునందు శృంగార రసమును పోషించెను.

మేఘదూత మంతయు విప్రలంభ శృంగార

మునకు నిదర్శనమే. అలకాపురీ మార్గ వర్ణన నెపమున త్రోవలో నున్న మహానగరములను వర్ణించుటను చూడగా చిన్న భూగోళ శాస్త్రముగా కన్పట్టుచున్నది.

**మనస్తత్వ పరిశీలన :**

దిలీప మహారాజు నందినీ ధేనువుయొక్క మనస్తత్వ మెఱిగిన వాడగుటచేతనే గోజాతికి ప్రీతికరమైన ఋచ్యతృణ కబళదానము, కండూయనము, దంశ నివారణము చేయుచు స్వచ్ఛంద గమనమునకు ఆటంకము కల్గింపక శుశ్రూషానక్తు డయ్యెను.

ధేనువు దిలీపుని మనస్తత్వమును తెలుసుకొనుటకే గుహలో ప్రవేశించి సింహమును సృష్టించి పరీక్షించినది. శక్తియుండియు గోవును రక్షించలేకపోవుటచే దిలీపు డనుభవించిన బాధను వర్ణించుచు "భోగీవ మంత్రౌషధ రుద్ధ వీర్యః" యని చూపుటలో అతని మనస్తత్వ చిత్రీకరణ కన్పట్టుచున్నది. కల్యాణ పరంపరలకు స్థానమైన శరీరమును కాపాడుకొనుమను ఉపదేశము ప్రతిధ్వనించుచుండగా, దిలీపుని మనసులో కల్గిన భావద్వయ సంఘర్షణ చక్కని మనస్తత్వ చిత్రీకరణ.

మన్మథుడు స్తోత్రప్రియుడు, గౌరవప్రియుడని తెలుసుకొని తనప్రక్కన పీఠమిచ్చినాడు యింద్రుడు. పినాకపాణినికూడ ధర్మచ్యుతిని చేయగలవాడవగా నిజమేనని యాతవిని యనేక విధములుగా స్తోత్రము చేసెను. మఱియు ఐరావతాస్ఫాలన కర్కశమైన చేతితో స్పర్శతో ఉత్సాహము కల్గించెను. వసంత విజృంభణమువలన ద్వంద్వములన్నీ శృంగారరసములో మునిగినవి. ఆ సమయమున వాని కిష్టమైన పనులు చేసినట్లు వర్ణించుచు జంతువుల, పక్షుల మనస్తత్వమును కూడ తెలియజేసెను,

రతి విలాపమునందు స్త్రీ మనస్తత్వమును చాలవరకు చిత్రించినాడు. భర్త మరణించినపుడు భార్య పడువేదన, బంధువులను చూచినపుడు వేదన యెక్కువగు ననుటకు నిదర్శనముగా వసంతుని జూచి దుఃఖ మధికమగుట మున్నగునవి యాసమయము నందలి స్త్రీల మనస్తత్వమును నిరూపించుచున్నవి.

కుమార సంభవము నందే బ్రహ్మచారి తన నిజ రూపమును పార్వతికి కన్పింపజేసినపుడు పార్వతి వెనుకకు, ముందుకు పోలేక మనసులో కల్గిన భావ సంఘర్షణను చక్కగా చూపించినాడు కవి. ఈ సమయమున ఆమెలోని భావాలను వివరించుటకు "మార్గాచలవ్యతికరాకులితేవ సిన్ధుః" యను ఉపమానమును సూచించినాడు. ఈ ఉపమానమువలన పార్వతి హృదయములోని భావములను ఊహించుకొనుమని భావకునికే వదలివేసెను.

విక్రమోర్వశీయమున ప్రథమాంకములో రాక్షసు డపహరించుకొని పోయిన సఖి సమేతయైన ఊర్వశిని రక్షించి విక్రముడు తన రథముపై తీసికొనివచ్చు సమయమున ఊర్వశి మూర్ఛనుండి తెప్పరిల్లి "మహేంద్ర సదృశ ప్రభావుడగు యీ రాజర్షిచే రక్షింపబడితివి" యని సఖి చెప్పగా రాజును చూచి "ఉపకృతమ్ ఖలుదానవైః"—యని తనలో అనుకొనినది. ఆమెకు ప్రథమ దర్శనమునందే ప్రేమ యంకురించినది. అందువలననే రాక్షసులు తనకు మేలు చేసిరని భావించినది.

మేఘ సందేశమున యక్షుడు తన ప్రియురాలికి తన సందేశమును తెల్పుమని చెప్పుచు "భర్తుర్మిత్రం ప్రియమిత...అంబువాహం" యను శ్లోకమున "అవిధవ!" అని సంబోధన చేయుమనినాడు. అనగా నీవు సుమంగళివి యని

యర్థము. మొదటనే అట్లు సంబోధించినచో ఆమెకు భర్త జీవించియున్నాడని తెలియును. ఆ పదమునం దట్టి యర్థము కలదు. కాళిదాసు తన యన్ని రచనలయందును ప్రతి పాత్ర యొక్క మనస్తత్వ చిత్రీకరణను చక్కగా కావించినాడు.

**అలౌకికాద్భుత విషయములు:—**

కాళిదాసకవితనరచనలయందుఅలౌకికాద్భుత విషయములను కూడ ప్రవేశపెట్టినాడు. దివ్య శక్తులపైన, శకునములపైన సిద్ధవచనములపైన కూడ విశ్వాసము కలదు. కుమార సంభవము నందలి ప్రథమ సర్గలో నారదమహర్షి ఒక నాడు హిమవంతుని ఆతిథ్యమును స్వీకరించి ప్రక్కనున్న పార్వతిని చూచి ఈమె పరమేశ్వ రుని అర్ధాంగి కాగలదని పల్కెను. నారదుని వచనము నందలి విశ్వాసము వలననే హిమవంతు డును వరాన్వేషణ ప్రయత్నము జరుపలేదు. నారద వచన విశ్వాసము వలననే యువతి యగు పుత్రికను పరమేశ్వరుని శుశ్రూషకై యనుమ తించెను. తుదకు తీవ్ర తపశ్చర్యకు కూడ తన యనుమతిని తెలిపెను.

మన్మథుడు భూతపతియొక్క తపోవనమున ప్రవేశించునపుడు ద్వారముకడ నున్న నందీ శ్వరుని శుక్రునివలె నున్నాడని పోల్చుచు "పురశ్శుక్రమివ"—యని చెప్పుటచే కాళిదాసు నకు శకునములపై గల నమ్మకము తెలియు చున్నది.

శాకుంతలమున చతుర్థాంకములో దుర్వా సుడు శకుంతలను శపించిన సందర్భమున అన సూయ చేతినుండి పుష్పభాజనము జారి క్రింద పడినది. దానిని అనసూయ అపశకునముగ తలపడినది.

కణ్వుడు సోమ తీర్థము నుండి ఆశ్రమ మునకు వచ్చి అగ్ని గృహమునకు పోయినపుడు అశరీరవాణి "శకుంతల లోక కళ్యాణము కొరకు గర్భవతి యైనద"ని పల్కినది. పంచ మాంకమునందు "అనిమిత్తం సూచయిత్వా! అహో కిం వామేతరం నయనం విస్ఫురతి" యని అమంగళమును శంకించినది.

కుమార సంభవములో రతీ విలాపము తర్వాత ఆకాశవాణి పల్కుట దివ్యశక్తికి చెంది నదే.

**ఉపమా కాళిదాసస్య :-**

కాళిదాసు పేరు చెప్పగనే ఉపమాలంకారము జ్ఞప్తికివచ్చును. ఆ ఉపమాలంకారము దాదాపు 23 అలంకారములకు మూలమని అప్పయ్య దీక్షితులు

"ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్ర
భూమికా భేదాన్।
రంజయతి కావ్యరంగే నృత్యన్తీ తద్విదాయ
చేతః"—

ఉపమాలంకారమనెడి నటి విచిత్ర వేషములను ధరించి కావ్యరంగస్థలమున నాట్యము చేయుచు సహృదయుల హృదయముల కానందము కల్గి నట్లుగా,ఒకేనటి విచిత్ర వేషములు ధరించి రంగ స్థలమునవాట్యము చేయుచుసహృదయుల హృద యమును రంజింప చేయుచున్నదనిఉపమాలంకార చమత్కృతిని వివరించెను. అట్టి ఉపమాలంకార పోషణమున అగ్రగణి కాళిదాస మహాకవి యని 'ఉపమా కాళిదాసస్య' యను నానుడి తెలుపు చున్నది. ఈ అలంకార పోషణమునందు నేర్పు

చాల అవుసరము. ఉపమానోపమేయముల నుచితములై నవిగ నెన్నుకొనవలెను.

ఇట్టి ఔచిత్యమును కాళిదాసు తన రచన లందు చక్కగ పోషించెను. సుదక్షిణాదేవి నందినీ మార్గము ననుసరించుటకు "శ్రుతే రివార్థం స్మృతి రన్వగచ్ఛత్"- యని పోల్చెను. ఇచట సుదక్షిణాదేవి స్మృతి, గోవు శ్రుతి. సుదక్షిణా, దిలీపుల మధ్య నున్న నందినీధేనువు "దినక్షపామధ్యగతేవసంధ్యా" యని వర్ణింప బడుట సంధ్యాకాల సమయోచితముగ నున్నది. నందినీధేనువు యొక్క శృంగాంతరము అర్థ సిద్ధికి ద్వారము వలెనున్నదని "శృంగాంతరం ద్వార మివార్థ సిద్ధేః" యని వర్ణించెను. ఇది భవిష్యత్ ఫలసిద్ధి సూచకము

"ఉపానయత్ పిండమివామిషస్య"- యని దిలీపుని శరీరమును ఆమిష పిండముతో పోల్చుట "పిండేష్వనాస్థా ఖలు భౌతికేషు" యను దిలీపుని వచనమునకు తగియున్నది. సుదక్షిణాదేవి గర్భధారణను వర్ణించుచు ,

"అధనయన సముత్థం జ్యోతి రత్రేరివద్యౌః
సురసరిదివతేజోవహ్ని నిష్ఠ్యూతమైశం
నరపతి కుల భూత్యైగర్భ మాధత్త రాజ్ఞీ
గురుభి రభినివిష్టం లోకపాలానుభావైః"

అను ఉపమాన ద్వయము. రఘు మహారాజు చంద్రుని వలె ప్రజారంజకుడును, తపనుడు వలె శత్రుభయంకరుడయ్యెనని వర్ణించెను.

కుమార సంభవమునందు మన్మథుడు ఇంద్రునాజ్ఞను భగవన్నిర్మాల్యమును వలె తల దాల్చెనని తెల్పుచు "తథేతి శేషామివ భర్తు రాజ్ఞాం" యను వర్ణన ఆ ప్రయాణ కాలమున శుభ సూచకముగ నున్నది.

"చిత్రార్పితారమ్భ మివావతస్థే" యని నందీశ్వరుని శాసనము వలన స్తంభించి పోయిన ప్రకృతినంతయు వర్ణించుట ఆ వసంత విజృంభణ కాలమునకు తగియున్నది.

"స్పష్టి ప్రపాతం పరిహృత్య తస్య
కామః పురశ్శుక్రమివ ప్రయాణే"

యను దాని నందలి ఉపమాలంకారము ప్రయాణ కాలమున చుక్కెదురు వలె నున్న నందీశ్వరుని గూర్చి చెప్పుచున్నది.

ఇట్టి ఉపమాలంకారములు ఎన్నియో కాళిదాస మహాకవి రచనల యందు కన్పట్టు చుండును.

కాళిదాస మహాకవి కావ్యములను గూర్చి లోకమునకు తెలియుటకు ముఖ్య కారకులు మల్లినాథ సూరి. కాళిదాస మహాకవి కవిత్వ మును గూర్చి రచించుట యన మహా సము ద్రము నుండి రత్నములను వెలికి తీయుటకై చేయు వృథాప్రయాసయే. కాని యట్టి కార్య మునకై వను మూలమైనట్టి మల్లినాథసూరికిని యిట్టి మహా కావ్యములను రచించిన కాళిదాస మహాకవికిని సర్వలోకము యొక్కసారియైనను నమోవాకములర్పించుకొనక తప్పదు.

(సమాప్తం)

# శివరంజని

శ్రీనాథ్

ఆ॥వె॥ దైవమనఁగ నెవఁడుః దయ్యంబనఁగ నేదిః
ఎట్టులుండు ననుచు, నెల్లవారి
తోడ వాదులాడి, దూషణంబులు సల్పి
దోషినైతి పాప, రాశినైతి.

ఆ॥వె॥ చెప్పువారు లేక, చెప్పిన వినఁబోక
పెడచెవులనుఁబెట్టి, చెడినవాఁడ
రాగమునకిల; శివరంజనీ రాగమే
వరముకాఁగ నిపుడు వగచువాఁడ.

ఆ॥వె॥ వీడు విగ్రహముల నేల విసిరి, విఱ్ఱ
వీఁగినాఁడ; చాల వాగినాఁడ;
నిన్నుఁజూచినంతనే పరిహసమ్ము
సలిపి, సలిపి కాలు జారినాఁడ.

ఆ॥వె॥ సాగినంతవఱకు స్వప్రయోజకత్వ
మనుచు నిన్ను తూల నాడినాఁడ;
కాల మెదురు తిరుగ గతిలేక మతిచెడి
నీవె దిక్కటంచు నిలిచినాఁడ.

ఆ॥వె॥ ఏను తలఁపకున్నఁ గాని కార్యంబులు
సానుకూలముగను జరిగెడివి; వి
చిత్రమేమొః నేడు చేయి పెట్టిన యంత
జరుగఁదగినవియును జరగకున్నె.

ఆ॥వె॥ కార్యహాని, శ్రమయు, కాలహరణమును,
వ్యయమె కాని యింత నయములేదు;
దిక్కులేక నీవె దిక్కని నెఱనమ్మి
చేరినాఁడ భయము కోరినాడ.

ఆ॥వె॥ దేవుఁడనగ వేఱు దెసల నుండఁగబోఁడు
మనములోనె వాఁడు మసలుచుండు;
దైవమైనఁగాక దయ్యమైనను మన
నమ్మకంబె యనుఁచు నమ్మినాఁడ.

ఆ॥వె॥ నాదు బాధయు శ్రమ వేదనలు తొలంగి
నీ స్మరణముచే పునీతుఁడైతి;
చిత్తజారినైతి శివరంజనీ ప్రభా
వమ్ముఁజేసి నే సుఖమ్మునుంటి.

# జాషువా ఎలిజీలు

డా॥ జి. వి. ఎన్. ఆచార్య, ఎం. ఏ, పిహెచ్. డి.
తెలుగుశాఖ - మహారాజ కళాశాల, విజయనగరం

(గత సంచిక తరువాయి)

## II దేశ నాయకస్మృతి

వీర పూజ దౌశాన్యత్వానికి, జాతి మహత్వానికి అత్యావశ్యకమైన పవిత్రానుష్ఠానం. అందువల్లే "A Nation lives by memories of its heroes" అనే ఆంగ్ల సూక్తిలో ఎంతో సత్యం ఉంది. దేశ దాస్య విమోచనానికై, ప్రజల శ్రేయోమార్గానికై శ్రమపడేవారందరూ వీరులే. రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక కళా రంగాలలో జాతీయ వికాసానికీ, నవ భావాల పరివ్యాప్తికీ దోహదం చేసి, జాతి జీవితంపై తమ ప్రభావ ముద్రని గాఢంగా వేసిన వారందరూ జాతి నిర్మాతలే. మహాపురుషుల చరిత్రలు మనకు మార్గదర్శకాలు.

"మన గుణములం దిద్దుకొనం
గను నద్దముఁ బోలియుండు ఘనులచరిత్రల్
కనివిని యా చరితమ్ముల
ననుసరణము సేయువాని కగుఁదత్సుఖముల్"[1]

("Lives of great men all remind us we can make our lives sublime")

భరత మాత ఆది నుంచి మహాపురుషులను ప్రసవిస్తూనే వుంది. ప్రపంచ నాగరికతకు మెరుగులు దిద్దిన ఎందరినో మత ప్రవక్తలను, మహాకవులను, సార్వభౌములను, యోధాగ్రణులను, దేశ నాయకులను ఆమె ప్రపంచానికి సమర్పించింది

దేశనాయకస్మృత్యర్థం ప్రత్యేకంగా సుదీర్ఘమైన ఖండ కావ్యాలు వ్రాసిన వారిలో జాషువా గారికి అగ్రస్థానం వుంది. వారి చిన్న చిన్న ఖండికలూ ప్రసిద్ధి పొంది, ప్రచారంలో వున్నాయి.

### ఖండకావ్యాలు

### 1. బాపూజీ

"ఎవడీ యర్ధ దిగంబరేశ్వరుడు మా యింగ్లం
 డ్రువేశింప వం
చవమానంబుగ చర్చిలాడగ బకింగ్ హాం
 సౌధమున్ ద్రొక్కి- హైం
దవ జాతీయత లీను మేల్పులక నాట్యంబాడ,
 శ్రీ జార్జి భూ
ధవునింటన్ ఫలహారముల్ నలుపు కాతన్
 గాంధి నర్చించెదన్."

అనే స్తుతితో కావ్యాన్ని ప్రారంభించారు. 'అర్ధ దిగంబరేశ్వరుడు' అనే సంభావనలో ఎంతో విశిష్టత వుంది. 'హైందవ జాతీయతలీను మేల్పు

1. వేటాజీ బోసుబాబు : లేఖలు - ఉపన్యాసములు" - శ్రీ అకురాతిచలమయ్య.

లక అనటంలో ఎంతో విలక్షణత వుంది. ఈ రెండు ప్రయోగాల్లోనూ బాపూజీ పవిత్ర మూర్తిని చిత్రించిన జాషువా గారు ప్రశంసార్హులు.

'ముగ్గిన పండు', 'తమా ప్రవాసి' అయిన మహాత్ముడు తుపాకి గుండ్లకు బలి అయిపోయిన విషయాన్ని తలచుకొని 'ఇదియే పోవడమా ! జగజ్జనక ! రానే రావుగా!' అని ఆక్రోశించారు 'భారత జ్యోతి గప్పున నారి పోయినద'ని. 'జగమొక్కుమ్మడి ఒమ్మొగుద్దుకొని మూర్ఛన్ దేలి తబ్బిబ్బు చెందినద'ని 'ఖదరు రాటాల ఝుంకార రవళి' తో పాటు 'గండుపేదల నోటి కబళ రాశి' కూడ ఆగి పోయినట్లే అని కరుణ రసాత్మకంగా కవితా వెల్లువను పారించారు. గాంధీ జీవితంలోని ప్రధాన ఘట్టాల్ని స్మరించారు.

భారత స్వేచ్ఛకై వ్యయించక మహాత్ముడు దాచుకొన్న రక్త కణం ఒక్కటి కూడా లేదని బాపూజీ యొక్క నిస్వార్థ సేవాతత్పరతను కొనియాడారు. బాపూజీ కలికాలానికి ఏసు క్రీస్తు అని దిగ్దేశాలు వక్కాణించాయని స్తుతించారు. బాపూజీ నిరాడంబర జీవితాన్ని తెలుపుతూ-

"గోచిపాతగట్టుకొని జాతి మానంబు
నిలిపినట్టి ఖదరు నేతగాడు
విశ్వపామరస్య విజ్ఞాన సంధాత
కామిత ప్రదాత ! గాంధితాత !"

అని ప్రశంసించారు. మన జాతి గౌరవాన్ని నిలిపిన గాంధీ తాతను 'కామిత ప్రదాత' అని గౌరవించటం సమంజసంగా ఉంది. ఆహ్వారాది కాల సత్యాగ్రహాలు వెంటరాగా గాంధీజీ ఫలకతో, నవ్వు మొలకతో శాంతి భండవాన్ని సాగించాడని, ఆయన శాంత స్వరూపాన్ని వర్ణించారు. పిల్లలను వెంటబెట్టుకొని భిక్షకు బోవు కాటుంబి వోలె చల్లని తాత, విశ్వ పరిచారకుడు, అర్ధదిగంబరేశ్వరుడు. అబ్ధియాత్రకు ప్రయాణం కాగా, అబ్ధిరాజు సైతం శాంత గంభీర భంగ హస్తాలు సాచి అంజలి ఘటించాడని-ఉప్పు సత్యాగ్రహాన్ని జరిపించిన బాపూజీని నుతించారు.

"అలిగి కూర్చుండు చిన్న బిడ్డల విధాన
నుపవసింతువు భువనముల్ బూతలూగ
విశ్వముల కెల్ల గారాలబిడ్డ వకట !
చంపుకొన్నది భారతక్ష్మాతలంబు".

"ప్రతి రక్తకణము భరత
క్షితికై వెచ్చించి స్వేచ్ఛ జేకూర్చిన యా
శత వృద్ధునాహరించెన్
ధృతిహీన మతస్వరూప, మృత్యువు
కినుకన్"

అని గాంధీజీ బలవన్మరణాన్ని తలచుకొని దుఃఖించారు గాంధి రక్తధార క్ష్మాతలంపై చిందగా, ఒక్క బాపూజీ ప్రభవమందడు పైగా, బాపూజీకి బదులు పదివేల గోడిసేలు ప్రబలినారు. 'ఏమి పాపమో!' అని గాంధీకి సరిఅయిన వారసులు లేరని విచారించారు.

"శ్వేతరాజుల చేతుల జిక్కుపడ్డ
వసుధ సాధించి యిచ్చిన ముసలివాని
పచ్చినెత్తుటి ఋణమెట్లు బాపగలవో!
నిక్కిసామ్రాజ్యహారి నెట్టు లెక్కగలవో!"

అని భారత పౌరుణ్ణి హెచ్చరించారు. ప్రపంచ చరిత్రలో ఎటువంటి వాడూ, ఏయుగాన గడించని అమరకీర్తిని గడించి, అనుగుబిడ్డలైన భారతీయులకు అంకితం చేసిన బాపూజీకి ప్రతిఫలంగా బలవన్మరణం సంభవించటం శోచనీయ

మైన విషయం అని జాషువాగారు పరితపించారు. బాపూజీ మరణవార్త భారతగర్భ కుహరిలో కత్తులాడుంచిందని విషాదపూరితంగా కవితను వినిపించారు. ఎంతో మంది కవులచేత భక్తిభావ బంధురాలైన, కరుణ రసాత్మక కావ్యాలను రచింపచేసిన బాపూజీ మరణవార్త అత్యంత దేశభక్తులైన జాషువా కవీంద్రుని మానసాన్ని కూడా కరిగించి, కరుణరస పరిపూర్ణమైన కావ్య నీరాజనాన్ని సమర్పింప చేసింది.

"పూర్వ పశ్చిమ గోళాలు మోకరించి
యే మహోన్నశక్తి కాగి నమస్కృతులుసలిపె
నట్టి బాపూజి మన మధ్యబుట్టు కతన
నభ్యతాస్ఫూర్తి భరత వర్షమున కమరె"

అని, గాంధీవల్లనే భారత దేశానికి నభ్యతాస్ఫూర్తి కలిగిందని మనస్ఫూర్తిగా అభినందించారు.

ఈ కావ్యం జాషువాగారి దేశనాయక స్మృతి సాహిత్య హారంలో మణిపూస వంటిది.

మహాత్ముని భక్తులలో ప్రథమగణ్యులై, అసహాయోద్యమ క్లిష్టకాలాన నకుటుంబంగా, ఆ మహామునిని అనుగమించిన సింహపురి రెడ్డి కులాలంకారులయిన శ్రీ తిక్కవరపు రామిరెడ్డి గారికి ఈ కావ్యాన్ని అంకితమిచ్చి ఎంతో ఔచిత్యాన్ని పాటించారు. ఈకృతి స్వీకృతికి రెడ్డిగారు ఎంతైనా అర్హులని, గాంధీ మహాత్ముని ఆత్మ శాంతిస్తుందని కవిగారి విశ్వాసం.

## 2. నేతాజీ

దేశ భక్తులలో, దేశసేవకులలో, స్వార్థ త్యాగులలో, సంగ్రామ వీరులలో, సాహ[illegible]గ గణ్యులలో, మహారథ శ్రేష్ఠులలో అగ్ర తాంబూల గౌరవానికి అత్యంతార్హుడుగా, అఖిలభారత భూమిలో ఆబాలగోపాలముగా ఎంచబడుతున్న మహనీయుడు శ్రీ సుభాస్ చంద్రబోసు.

నేతాజీ నిస్వార్థ దృష్టి, దేశభక్తి, క్రమ శిక్షణ, ఆత్మశుద్ధి మొదలైన అత్యుత్తమ గుణాలు భారతావనికి ప్రపంచంలో ఒక విశిష్ట స్థానాన్ని సమకూర్చి పెట్టాయి.

జాషువాగారు తమ 'నేతాజీ' కావ్యంలో బోసు యొక్క దేశసేవాతత్పరతను, ధైర్య సాహసాలను ప్రశంసించారు. నేడు మనం చూరలాడుతున్న స్వేచ్ఛా స్వర్ణరాజ్యానికి సుభాసుబాబు రత్నస్తంభమై నిలిచినాడని కొనియాడారు.

"పెండిలి మాని భరత
ఖండమునకు సేవసల్పి, కారాగృహముల్
గండములు గడిచి, జాతికి
గుండెయగుచు మెలగె నగర
గుండెలలోనన్"

అని నేతాజీయొక్క స్వార్థ త్యాగాన్ని, దేశ సేవాదీక్షని మెచ్చుకొన్నారు. నేతాజీని 'జాతికి గుండె'గా సంభావించి, అభ్యర్చన చేసారు. ఆయన చేసిన ఈ త్యాగానికి దేశం అతనికి ఋణపడినదని అభివ్యక్తీకరించారు.

"భగవంతుని ఎదుట, సుభాష్ చంద్రబోసు అను నేను ౩౮ కోట్ల ప్రజానీకమును, బంధ విముక్తము చేయుటకు నా కంఠములో కొన ఊపిరి ఉన్నంతవరకు స్వతంత్ర సంగ్రామము నలిపెదనని ప్రమాణం చేయుచున్నాను. ఎల్ల కాలము భారత ప్రజానీకపు ప్రధాన సేవకుడుగా నుండి ౩౮ కోట్ల భారత సోదరసోదరీ మణుల యోగక్షేమము దృష్టిలో ఉంచుకొను

టను ముఖ్యవిధిగా భావించు చున్నాను. స్వతంత్రము నిలబెట్టుటకు ఆఖరి రక్త బిందువును సైతము ధారపోయుటకు సిద్ధముగా నున్నాను-" నేతాజీ. ఈ భీషణ ప్రతిజ్ఞలో నేతాజీ యొక్క దేశభక్తి, నిస్వార్థమైన మహనీయ వ్యక్తిత్వం ప్రతిఫలిస్తున్నాయి. అందుకే కవిగారు "గగన మగ్ని వర్షములు కురియు కాలాన, మన కాతడాతపత్రమై నిలిచి ఆదరించినాడ"ని అతని అండను మేరునగముగా భావించారు స్వాతంత్రసిద్ధికై తన చివరి రక్త బిందువును కూడా ధారపోయటానికి సిద్ధపడిన త్యాగమూర్తి నేతాజీ. బోసుబాబు యొక్క ధైర్యసాహసాలను, నేర్పరితనాన్ని వర్ణిస్తూ జాషువాగారు-

గడ్డము పెంచి పచ్చితురకంబలె వేషము
మార్చి కావలా
గడ్డు జవాను తండముల కన్నులు దాటి,
యనుంగు వంగపు
గ్గడ్డ నతిక్రమించె నొడికంబుగ కొండొక
నాటి రాత్రి, మా
దొడ్డ సుబాసు తోడ దులదూగునె తచ్ఛి
వరాట్సహస్రముల్"

అని బోసుయొక్క అసమాన చాకచక్యాలను కొనియాడారు. బోసు అంతర్ధానమైనాడని పుకారు చెలరేగింది. దేశభక్తులు లోలోన సంతోషించారు. గాంధి మోముపై బోసి నవ్వు ప్రభవించింది. బోసుబాబు కాబూలు ప్రయాణంలో అనువుగా వుండటానికై పఠాను వేషం ధరించి. మూగవాడిలా నటించాడు. కాలగతి చేత వంగవీరుడైన నేతాజీ 'భాషణములు' రాని వానిగా వుండవలసి వచ్చిందని విచారించారు.

"ఖండ పంచకమును గడగడ లాడించిన
నుగ్రజర్మనీయు లొడలు మరచి
ప్రస్తవరింప బోసుబాబు బెర్లిను పీట
నాటినాడు కీర్తి వాటికలను"

బెర్లిన్‌లోని జపాను రాయబారి, ప్రపంచ విఖ్యాత రాజనీతి విశారదుడైన (బెర్లిన్, రోమ్, టోకియో త్రైరాజ్య సంధికర్త) జనరల్ ఓషిమా ఒక సమావేశంలో నేతాజీని గురించి ఇలా ప్రకటించాడు. "నేను నా జీవితములో అనేకమంది ఆసియా, యూరోపియన్. అమెరికన్ రాజనీతిజ్ఞులను కలుసుకున్నాను. కాని సుభాష్‌తో పోల్చదగిన వ్యక్తిని ఇంకనూ కలుసుకోనవలసియున్నది."

నేతాజీ గొప్ప రచయిత. శ్రోతలను వుర్రూతలూగించగల వుపన్యాసధురీణుడు. తన దేశీయుల హృదయ తంత్రులను నిపుణతతో మీటగలిగిన వైణిక శిరోమణి. సుభాష్ చంద్ర బోసు 'నేతాజీ'గా ప్రపంచం ఎదుట నిలిచి విప్లవ ఘంటారావాన్ని ప్రమోగించాడు. పాతాళపు లోతులలోనికి పాతుకొనిపోయిన సామ్రాజ్యవాదపు అంతిమ క్రియలకు ప్రతిజ్ఞ పూనాడు.

"బాబు వచ్చునంచు పదివేల కనులతో
నెదురు చూచుచున్నది హిందూ ధరణి
స్వేచ్ఛనందుకున్న చేతులతో నేడు
బయలు కవుగిలించి వగచుచుండె"

అని సుభాష్ చంద్రబోసు యొక్క అజ్ఞాత పలాయనమునకు కవిగారు చింతించారు. "అతడభినయించినది మహోత్తమ పాత్ర, నేడతడు యవనికాభ్యంతరమున నున్నాడు. బోసు శాశ్వతుడు" అనే ఆశయంతోనే కవిగారు నేతాజీకి కావ్య నమస్కారం చేసారు.

"శ్రీ సుభాసుబోసు సింగంబు క్రమ్మర
వచ్చి దర్శనంబు నిచ్చుగాక"

అని బోసుబాబు యొక్క పునర్దర్శనాన్ని మన స్ఫూర్తిగా కాంక్షించారు. వీరభరత నందనులకు నేతాజీ మధురసాన్నిధ్యసుఖం ప్రాప్తించాలని ఆశించారు.

"ఒక జాతి రక్తమిచ్చిన
నొకజాతికి సానుభూతి యుండని ధరలో
నొక బోసు డొక్క నెహురూ
యొక గాంధీ మరణ మెవని యుల్లము
గలచున్"

అని కవిగారు నిట్టూర్చారు. మాతృభక్తుడు, గంభీరుడు, వీరమార్తాండుడు అయిన నేతాజీని కవిగారు తమ కావ్యంలో శాశ్వత మొనరించారు.

## ఖండికలు

### 1. "రత్నచ్యుతి" ఖం. కా. 1 వ భా.

'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య మరణానికి విలపిస్తూ వ్రాసినది - ఈ స్మృతి ఖండిక.

మహోద్దేశాలతో, సంఘాభిమానంతో, దేశాభిమానంతో, సర్వతంత్ర స్వతంత్రంగా వ్యవహరించి, వాదించి, పరిశ్రమించి వెలుగొందిన ప్రతిభావంతుడు గోపాలకృష్ణయ్య విద్యార్థి దశలోనే గోపాల కృష్ణునకు ఆనాటి శ్రీ అరవిందఘోషు, లోకమాన్య బాలగంగాధరతిలక్ గారలు ఆరాధ్య వీరులైనారు. రాజకీయ వాతావరణాన్ననుసరించి గాంధీ మహాత్ముడు బ్రిటిషు ప్రభుత్వంపై అసహాయోద్యమాన్ని ఆరంభించగా గోపాలకృష్ణుడు కూడా అందొక వీరభటుడై యావద్భారత స్వరాజోద్యమంలో తన "చీరాల-పేరాల" సమస్యను ఒక అంశంగా జేసి ప్రభుత్వంతో పోరాడాడు. బార్డోలీ ఉద్యమంకంటె చీరాల-పేరాల ఉద్యమం మిన్న అయినదని పెద్దలే సంభావించారు. రాజకీయ రంగంలో గోపాలకృష్ణయ్య ఉత్కృష్టశుద్ధితో, జృహదాశయాలతో వర్తించాడు. చీరాల—పేరాల సమరంలో వీరనాయకుడై విరాజిల్లిన విధానానికి ముదితులై గుంటూరు జిల్లా - పొన్నూరులో సమావేశమయిన జిల్లా ఆంధ్ర మహాసభవారు గోపాలకృష్ణయ్యకు 1921 లో 'ఆంధ్రరత్న' బిరుదు ప్రదానం చేశారు. ఇటువంటి మహోత్కృష్ట గుణసంపన్నుడైన 'ఆంధ్రరత్న' మరణానికి పలువురు తమ ప్రగాఢ సంతాపాన్ని వెలిబుచ్చారు. జాషువా కవిగారు "రతనము జారిపోయినదిరా! సుకుమార కుమారులార! మీయతనము లింక సాధ్యపడ"వని 'ఆంధ్రరత్న' లేని లోటును సూచించారు.

గోపాలకృష్ణయ్య క్షయ వ్యాధికి గురి అయి, సుమారు నాలుగేళ్ళు నలిగి 1928 వ సంవత్సరంలో మరణించాడు. దీనికి కవిగారు బాధపడుతూ—

"శతకోటి మన్మథ స్వర్ణ సౌందర్యంబు
పీడరోగమున కర్పించినావు"

అని కన్నీటి కవితను వెలయించినారు. ముప్పై యెనిమిదేళ్ళ ప్రాయంలోనే ఆయనను బలి తీసుకున్న భయంకర వ్యాధిని తలచుకొంటూ, కరుణరసాత్మకంగా స్మృతి పద్యాలను రచించి, కవిగారు 'ఆంధ్రరత్న'పై తమకుగల ఆదరాభిమానాలను వెల్లడించారు. గోపాలకృష్ణయ్య పండితుడు, కవి, గాయకుడు, విమర్శకుడు, రాజకీయవేత్త, మహావక్త, మతప్రవక్త. అన్నిటికన్న మిన్నగా శ్రీరామభక్తుడు. ఇంకా ముఖ్యంగా ఎన్నదగింది - అతని హాస్య చతురత.

"పలుకు పలుకున హాస్య సంపదలు గురియు
సహజ వైదుష్యమునకు నిచ్చలును పొంగు
వాంధ్రసోదర లోక మల్లాడనపుడ
స్వర్గమెక్కి తివేల? గోపాల నీవు!"

అని జాషువాగారు అతని హాస్య సంపదను, సహజ వైదుష్యాన్ని ప్రశంసించారు. పెదవి గదలించి ఆయన నవ్వించనట్టి భారతీయుడు గాని, తెల్లవాడుగాని లేడట. కేవలం ఆయనొక జలధి. ఆయన రాజకీయ జీవితాన్ని స్మరిస్తూ-

మహిత స్వరాజ్యోద్యమము పోరికెడు రెక్క-
పడమ ద్రిప్పని వీరమండనుండు
గాంధి భక్తుని జిహ్వఁగదలించి, వెలలేని
రత్నంబుఁగొన్న సార్థక పురుషుడు
వాసికెక్కిన నేర్పు మూసలో గుండె ఊ
ల్గగఁగింపఁజాలు ఖండవక్త
పరుల వంచించు టక్కరి భక్తులకు నల్గి
కొరడాలు సృష్టించు గుణవిభుండు
దినము గడుచుట కింట బత్తెంబు లేక
నిత్యసంతర్పణములు నెఱపు భక్తుఁ
డాంధ్ర వైభవధ్వజ మూడియవనిఁగూలెఁ
గూలిపోయెనె! మారత్న గోపకుండు"

అని పాఠకులను రసార్ద్ర చిత్తులనుగావించారు. అమరలోకంలో ఇంద్రసభకు రత్నదీపం లేని లోటు తీర్చటం కోసం మన 'ఆంధ్రరత్నము' యశఃకాయాన్ని దాల్చినాడని బహుధా కీర్తించారు.

## 2." సార్వభౌమ నిర్యాణము''

ఖం. కా. 2వభా.

ఇది జార్జిరాజును గురించి వ్రాసిన స్మృతి ఖండిక.

'ఇనునకుఁ జావులేని జగమేలు మహోన్నత కీర్తిశాలి, న
ల్లని మన భారతావని విలాసిని మెచ్చిన శ్వేత భర్త, వం
దనము లొనర్చుచున్ శతశతఘ్నుల
మ్రోయఁ జరించు జార్జి రా
డ్డినమణి క్రుంకెనే; చరమదిక్సతి చీఁకటి
చీరఁగట్టగన్"

అని జార్జిరాజు మరణానికి తమ విచారాన్ని వ్యక్తం చేసారు. 'చరమదిక్సతి చీఁకటి చీర గట్టగన్' అనటంలో పాశ్చాత్యదేశం విషాదంలో మునిగిపోయిందనే భావం స్ఫురిస్తున్నది. ఒక్క పాశ్చాత్యదేశమే కాకుండా విశ్వ ప్రపంచపు మోము ఆయన మరణవార్తకు విషాద రేఖా కబలితమైనదని చెప్పారు.

"కోహినూరు వజ్రదీపం
బహర్నిశల వెలుగు నీ గృహంబున లేదా?
మహనీయ సౌఖ్యమెందుల
కిహము విడిచి స్వర్గపురికి నేగితివి ప్రభూ!"

అని గతించిన జార్జి రాజును దుఃఖావేశంతో ప్రశ్నించారు. మూడుమూర్తులా జార్జిరాజు ప్రతిబింబమైన 'వేల్సు' యువరాజు మకుటాన్ని దాల్చటానికి సిద్ధంగా వున్నాడు. అందుకై అమరులతో కూడి యువరాజును ఆశీర్వదించవలసింది అని కోరారు.

'మరణాంతాని వైరాణి' అన్నట్లు శత్రువు గతించినపుడు కూడా దుఃఖాన్ని వెలిబుచ్చ గలగటంలో గొప్పతనం వుంది. బ్రిటీషు వారికి మనకు రాజకీయ వైమనస్యాలు ఎన్ని వున్నప్పటికీ, వారి పద్ధతులు కొన్ని నచ్చటం చేత మన కవులు అయిన గురజాడ, వీరేశలింగము, తిరుపతి వేంకటకవులు మొదలైనవారు ఆ నాయకులను గూడా ప్రశంసిస్తూ రచనలు చేసారు. అటువంటి వారిని జాషువా గారు

అనుసరించారు. కాని "నల్లని మన భారతావని విలాసిని మెచ్చిన శ్వేతభర్త' అని జాషువా గారనటం, స్వాతంత్ర్య సమరంలో ప్రాణా లొడ్డి పోరిన భారత వీరజాతికి అపచారమే అవు తుంది.

3. సుభాసుబోసు ఖం. కా. 6వ భా.

ఈ ఖండికలో జాషువాగారు ముఖ్యంగా నేతాజీ యొక్క శౌర్య పరాక్రమములను స్మరించారు.

బందీవై, సహోదరజవానుల కనుల్ బంధించి, యే రీతిగా
హిందూమాతను వాసి, వాలితి జపాన్ పృథ్విన్ మహావీర? భా
సుండుల్ సీమ దొరల్ తలంకిరి జగన్మాన్య ప్రతాపారణి!
యెందున్నావు? గతింపలేదు గద తండ్రీ! బోసు వీరాగ్రణీ!

అని నేతాజీ యొక్క ఉనికిని శంకించారు. కాబూలు బాబువలె తయారయి, బైరాగి ముఠాలలో కలిసి యెన్ని కష్టములు పడినావో నీ ప్రస్థానిక వ్యూహములు బ్రహ్మకైనను ఎరుగరానివి. అని బోసుబాబు యొక్క శక్తి యుక్తులను స్మరించారు.

"అదిగో నీవు తయారుచేసిన యగణ్యంబైన సైన్యంబు మా
కొదవెన్ ధైర్యము, వీడిపోయినవి యక్కున్ బంధముల్ నేటి కె
వ్వది కోల్పై తగు నీ సహోదరులకున్ శౌర్యంబు సృష్టించు నీ
కిదిగో, మానిజరక్త పూజన వేదీ! బోసు వీరాగ్రణీ!"

అని బోసుబాబు యొక్క శౌర్య పరాక్రమా లను కొనియాడుతూ, భారత వీరులందరి పక్షాన రక్త పూజను సలిపారు

"పరమపదింపలేదు మన బాబు సుభాసను మాట దిగ్గిదం
తరముల మ్రోయుచున్నద యథార్థము కాదుగదా..."

అని నేతాజీ మరణించలేదేమో అన్న సంశ యాన్ని వెలిబుచ్చుతూ, భారత ప్రజల పూజను స్వీకరించటానికి ఉదయించవలసిందిగా బోసు బాబును కోరారు.

('నేతాజీ' అనే ఖండకావ్యంలో పై విష యాలు లేకపోవటం చేత "సుభాసుబోసు" అన్న ఖండికను కూడా పరామర్శించటం జరిగింది.)

4. "శ్రద్ధాంజలి" ఖం. కా. 5వ భా.

సర్దార్ వల్లభాయి పటేలు స్మృతి కొరకై జాషువాగారు ఘటించిన శ్రద్ధాంజలియే ఈ ఖండిక.

పటేలు పట్టుదలకు మారుపేరు. మేరు నగ ధీరుడు. ఉక్కు మనుష్యుడన్న నుడికి ఉజ్జ్వల భూషణమైనవాడు, నిర్భీక విమర్శకుడు. కాంగ్రెసు అధ్యక్షునిగ, సమైక్య భారత నిర్మా తగా తన ప్రతిభను వెల్లడించి, "రెండవ బాపూజీ" అని చరిత్ర ప్రసిద్ధికెక్కిన చరితా ర్థుడు, మహాపురుషుడు. జాషువాగారు పటేలు మంత్రిని కొనియాడుతూ-

"రెండవ బాపూజీ యన జరిత్రకు నెక్కినవాడు, జాతికిన్
గుండె, స్వతంత్ర భారతికి గూర్చెడు వాడు, పటేలు మంత్రి మా

ర్తాండుడు గ్రుంకినంత భుజదర్ప
సమన్వితకున్ సవిత్రికిన్
గుండెలు జారె, మూడు పదికోట్ల
కనుంగవ చెమ్మగిల్లగన్"

అని పటేలు మరణానికి యావద్భారతమూ విషాదాశ్రువులు కురిపించినవని వాపోయారు. పటేలు బార్డోలీ యుద్ధవీరుడు "సర్దారు" బిరుదాంకితుడై నవభారతంలో నవశక్తులను నాటిన మహోజ్జ్వల దేశనాయకుడు. పటేలు మరణంవల్ల సంభవించిన అనిష్టాన్ని సూచిస్తూ-

"కొండవంటి తనువు, కొండంత భుజశక్తి
గలిగియుండి, భరతఖండలక్ష్మి
వల్లభాయి మంత్రి పరమపదింపగా
గుండె లేనిదయ్యె గుండె గలిగి"

అని భారత దేశానికి పట్టిన దుర్యోగానికి విలపించారు.

5. "ఆరని కన్నీరు" ఖం. కా. 7 వ భా.

స్వతంత్ర భారత ప్రథమ ప్రధానియైన నెహ్రూ హఠాన్మరణానికి విలపిస్తూ జాషువా గారు సమర్పించిన స్మృత్యంజలి ఈ ఖండిక.

"కులం పవిత్రం, జననీకృతార్థా వసుంధరా పుణ్యవతీచ తేన" అని ఎన్నదగిన మహనీయుడు జవహర్ లాల్ నెహ్రూ. తనకు హిమగిరి శృంగాలు, గంగాతరంగిణి అత్యంత ప్రేమాస్పదాలైనవని ఆయన నుడివాడు. ఆయన వ్యక్తిత్వంలో కూడా మనకు హిమాచల శృంగాల ఔన్నత్యమూ, గంగానది నైర్మల్య, గాంభీర్యాలూ కనిపిస్తాయి. భారతదేశ చరిత్రలో స్వాతంత్ర్య సిద్ధికి ముందు జాతీయోద్యమంలోనూ, తరువాత నవభారత నిర్మాణ కార్యక్రమంలోనూ ఆయన ప్రముఖ పాత్ర వహించి, భారత ప్రజానీక హృదయంలో పూజ్యస్థానాన్ని గడించుకొన్నాడు. క్రమంగా ఆయన కార్యక్షేత్రం మనదేశపు సీమలను దాటి, ఇతర ప్రాంతాలకు విస్తరించి, వర్తమాన ప్రపంచ రాజకీయాలలో - ఆయన జీవితమునకూ, ఔదార్యమునకూ ప్రతీకగా ప్రసిద్ధికెక్కినాడు. అందుచేత 1964 మే 27 వ తేదీన ఆయన హఠాన్మరణము మానవ జాతి నంతటినీ శోకతప్తం చేసింది.

నవయుగ కవి చక్రవర్తి జాషువాగారు 'ఆరని కన్నీరు'అనే ఖండికలో జవహరు మరణానికి విచారిస్తూ, ఆయన వుత్తమ గుణగణాల్ని స్మరించారు.

"యావల్లోకము బొమ్మ గ్రుద్దుకొని
హాహాకారముల్ సేయ, దుః
ఖావేశంబున రుద్ధకంఠమయి, బ్రహ్మాం
డంబు స్తంభింప, స్వ
ర్గావాసంబున కేగెనే సచివలోకాదిత్యుడా
జవహరుం
డా విశ్వాజిత శాంతి కర్షకుడమర్త్యా
స్వాగతా కాంక్షియై"

జవహరు మరణ వార్తవిని దుఃఖావేశంతో బ్రహ్మాండమంతా స్తంభించిందని కరుణరస ప్రపూర్ణంగా వర్ణించారు. జవహరును శాంతి కర్షకుడని ప్రశంసించారు. అనలజ్వాల విధాన జవహరుని మరణ వార్త ఆసేతుశీతాచలము వ్యాపించగా, ఖండాంతరాలన్నీ చలించాయనీ, ఆయన కీర్తి ప్రవాహం నోకని తావు లేదనీ, భారతజ్ఞాచక్రాన్ని మందభాగ్యను గావించి, ఛాయాచిత్రాలను మాత్రం మిగిల్చి ప్రస్థానించిన అమరుడనీ పరిపరివిధాల కీర్తించారు. "బాపూజీ వారసత్వమునకు బంగారు

నీరు వోసిన శాంతి వీరవీరుడు" అని జవహరుని శాంతిదూతగా కొనియాడారు.

"చలువ ఖద్దరు దాల్చి భూతల వధూటి
ఫక్కుమని నవ్వునవ్విన పగిదిదోచు
జవహరుడు కన్నుమూసిన క్షణమునందు
హైందవము దిక్కులేనిదై అంగలార్చె"

అని ఎతో భావతీవ్రతతో కన్నీటి కవితను వెలయించిన జాషువాగారు 'స్మృతిప్రక్రియ'లో ఒక విలక్షణమైన స్థానాన్ని సంపాదించుకొన్న సమర్థులని చెప్పవచ్చు.

### 6. "ఆంధ్రకేసరి"

'విజయవాణి'[4] వారపత్రిక నుండి

(ఈ ఖండిక జాషువాగారి ఖండకావ్యాల్లో లేదు.)

భారత స్వాతంత్ర్య సమరంలో పాల్గొని, గొప్ప ధైర్య సాహసాలను ప్రదర్శించి, అఖండ విజయాన్ని సాధించి, యావద్భారత ప్రజల మన్ననలను పొందిన దక్షిణ భారత నాయకులలో "ఆంధ్రకేసరి" బిరుదాంకితుడైన టంగుటూరి ప్రకాశం పంతులుగారు అగ్రగణ్యుడు. ఆయన ఆంధ్రత్వం మూర్తీభవించిన వ్యక్తి. పలువురి చేత ఆంధ్రకేసరి "ఆంధ్రకేసరి" అని కీర్తించబడిన మహనీయుడు. "ప్రకాశమే ఆంధ్ర-ఆంధ్రయే ప్రకాశము" అని విఖ్యాతిగాంచిన మహాపురుషుడు; సింహ గంభీరుడు; రాజకీయగల దయార్ద్ర హృదయుడు. ప్రకాశము ప్రజల మనిషి. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రావతరణమునకు మూల పురుషుడు.

ఆంధ్రకేసరి మరణంతో ఆంధ్రచరిత్రలో మహత్తరమైన అధ్యాయం సమాప్తమైంది. నిస్వార్థభక్తుడయిన ఆంధ్రకేసరి పేరు చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగినది. జాషువాగారు ఆంధ్రకేసరికి తమ జోహార్లనుసమర్పిస్తూ వ్రాసిన ఈ ఖండిక ప్రశంసార్హమైనది.

ఎనుబదెనిమిదేండ్లు తెలుగు గడ్డలమీద
ఉడుకు రక్తముడికి యుజ్జ్వలింప
గర్జసల్పి నేడు కన్నులు మూసెనే
టంగుటూరి ముసలి సింగమకట!"

అని ప్రకాశంగారి ధైర్య పరాక్రమాలను స్మరిస్తూ ఆయన మరణానికి దుఃఖించారు. బ్రిటిషువారి నిరంకుశ దండనీతిని ఎదిరించిన మహావీరుడు టంగుటూరి సమ్రాట్టనియు, తెలుగు భూమికి ఆయన పెట్టిన శౌర్యభిక్ష ఎన్ని యుగాలకైనా మరణించదనీ కొనియాడారు. ఇంకా ఆంధ్రకేసరి గుణగణాలను ఈ విధంగా స్మరించారు—

"తను రక్తంబున పౌరుషంబును మహాంధ్రత్వంబు మూర్తీభవిం
చిన సత్యాగ్రహి, శాంతివీరుడు, ప్రజాశ్రేయస్సుఖార్థంబుగా
తన సర్వస్వము ధారవోసిన యనంత త్యాగి ఆంధ్రోర్వి చిం
దిన కన్నీటిని కాన్కగా గొని సమాధిం జొచ్చి నిద్రించెనే."

అని దేశ నాయకులలో అగ్రస్థానాన్ని సంపాదించి పెట్టిన అనేక గుణాలను ఆంధ్రకేసరి వ్యక్తిత్వంలో స్ఫురింపచేసారు.

"హరి హర బ్రహ్మ లెదురైన శిరమువంచి
ఐదు పది సేయనట్టి యాత్మాభిమాన

---

4. 'విజయవాణి': వారపత్రిక 28-8-1972 సంపుటి: 50, సంచి: 6

మాంధ్ర తేజస్సు జారనీయక చరింపు
మమర గజ వాహనముల వృద్ధాంధ్ర
సింహా!"

ఆంధ్ర తేజస్సు జారనీయక అమర గజ వాహనాలపై వృద్ధాంధ్ర సింహమైన ప్రకాశం పంతులుగారు వీరవిహారం చెయ్యాలని జాషువా గారి ఆకాంక్ష. ఆ కాంక్షకు తగినట్లుగా అక్షరాకృతిని దిద్దటం వారి కవితా ప్రతిభకు నిదర్శనం.

"ఆంధ్ర నాయకులలో ఎవరిని తలచుకున్నా ఒళ్ళు పులకరిస్తుంది. రాగద్వేషాల కళ్ళద్దాలతో చూచే అనుచర ప్రతికూల వర్గాల దృష్టితోగాక నిష్పాక్షికమైన దృష్టితో పరిశీలిస్తే ఒక్కొక్క నాయకునిలో ఒక విశిష్టత, ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వం మనకు కనిపిస్తుంది."[5] అని శ్రీ నారాయణరావుగారు అన్న మాటలోని యధార్థం—జాషువాగారి దేశనాయక స్మృతి సాహిత్యాన్ని పరిశీలించినవారికి బోధపడుతుంది.

జాషువాగారు నిష్పాక్షికంగా దేశనాయక స్మృతి రచనలు చేసి మనకు మహా నాయకుల లోని వైశిష్ట్యాన్ని, ప్రత్యేకమైన వ్యక్తిత్వాన్ని గోచరింపచేసి, తమ దేశభక్తిని చాటుకొనటమే గాకుండా "బాపూజీ; నేతాజీ" వంటి అత్యుత్తమ దేశ నాయకులను తమ కావ్యాలలో చిరంజీవులను చేసి, నవ్యాంధ్ర సాహితీ లోకంలో తాము అఖండ కీర్తిని ఆర్జించుకొన్నారు.

ఆప్త స్మృతిలోను, దేశ నాయక స్మృతి లోను జాషువాగారు వెలిబుచ్చిన 'ఆర్ద్రత' అసామాన్యము. వైయక్తికమైన కష్టాన్ని నలుగురికీ పంచిపెట్టటం ఆప్తస్మృతిలోను; లోకానికి కలిగిన కష్టాన్ని తాము కూడా పంచుకోవటం దేశనాయక స్మృతిలోను వెల్లడించ బడింది. ఈ ప్రక్రియలో జాషువాగారి ఆత్మీయభావం అత్యున్నతస్థాయిలో ప్రకటించ బడింది. కరుణరస పోషణలో సిద్ధహస్తులైన జాషువాగారు "ఎలిజీ" ప్రక్రియను చేపట్టి సమర్థంగా నిర్వహించి, తమ నవ్యతా ప్రీతిని వెల్లడించి, నవకవితాప్రియుల సరస హృదయాలను రసార్ద్రం చేసారు. జాషువాగారి ఆప్తులతోపాటు దేశనాయకులు వారి కావ్యాలలో అజరామరమైన శాశ్వత స్థానాన్ని పొంది చరితార్థులైనారు. జాషువాగారు 'స్మృతి ప్రక్రియ'ను ప్రతిభతో నిర్వహించటం చేత నవ్యాంధ్ర సాహితీ లోకంలో ధ్రువతారగా కీర్తనీయులైనారు.

"కవియు మరణించె; నొక తార గగన
మెక్కె-
సుకవి జీవించె ప్రజల నాలుకలయందు."[6]

---

5. "ఆంధ్రజ్యోతి"-దిన పత్రిక ; 16-10-1972 శ్రీ కోదాటి నారాయణరావు.

6. "కాంత్త లోకం"—కావ్యం. జి. జాషువా.

(స మా ప్తం)

# నా దేవి

భారతి

నా దేవి కరుణించెనో
నా లోన మధురిమల కురిపించెనే
పూదోటలో నా రాణి
గులాబి చెక్కిళల
సోయగమే నను మురిపించెనే ॥నా దేవి...॥

సిగ్గు దొంతరలలో
నా యింతి చేమంతి
సంపంగి మొగ్గైన
మగువ నగు మోము నన్నలరించెనో ॥నా దేవి...॥

వీణ మీటిన నా సంగీతరాణి
సరిగమలు నాలోని
రాగ పల్లవి నవరించెనే
అనురాగ వల్లరి నను బంధించెనే ॥నాదేవి...॥

నా తరుణి
అరమోడ్పు కన్నులు
తీయని కలల దోనెలై
మధువు నిండిన అధరాలు
అరవిరిసిన అందాలై
నా డెందాన నిండెనే ॥నా దేవి...॥

నా పాటకు పరవశించిన
నా నెచ్చెలి పాదమంజీర
రవళులు ఆనంద కేళీ
రసమయములై
నను డోల లూగించెనే ॥నా దేవి ॥

నా కాంత కమల నయనాలు
కాంతి లీను దీపాలై
స్వర్గ సోపానాల దారులై
తరతరాల బంధమై
అంతరంగాన నిండెనే ॥నా దేవి॥

# "అనంతపురం జిల్లా గ్రామ నామాలు - అన్యభాషా ప్రభావం"

యం. గోవిందస్వామి నాయుడు

పరిశోధక విద్యార్థి, తెలుగు శాఖ,

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి

గ్రామ నామాలు ప్రధానంగా జీవద్భాషా సామగ్రి. అవి భాషా రూపాలు. (Linguistic forms). జీవద్భాష నిరంతరం పరిణమించడం సహజం. ఈ పరిణామాన్ని గుర్తించడానికి నేడనేక పరిశోధనలు జరుగుతున్నాయి. అందు గ్రామ నామ పరిశోధన లేక స్థలనామ పరిశోధన యొకటి. తెలుగు భాషా పరిణామ చరిత్రను నిరూపించడానికి, సజాతీయ భాషలతో సంబంధాన్ని నిరూపించడానికి భాషా ప్రధానమైన తెలుగు గ్రామ నామాలెంతో ఉపయోగిస్తాయి. గ్రామ నామాల సమగ్ర శాస్త్రీయ భాషా పరిశీలనను వర్ణనాత్మక, చారిత్రక, తులనాత్మక పద్ధతులను పరిశీలించ వలసి వుంటుంది.

తెలుగు గ్రామ నామాలను సక్రమంగా, చక్కగా పరిశీలించిన కాలం ఇంకా రానప్పటికి స్థూలంగా పరిశీలనా ప్రాధాన్యాన్ని గుర్తించిన వాఙ్మయకారులు, భాషా శాస్త్రవేత్తలకు తెలుగులో కొరతలేదు. క్రీ. శ. ప్రథమ శతాబ్దినుంచి 14 వ శతాబ్ది వరకు తెలుగు భాషాకృతిని, స్వరూపాన్ని పరిశీలించడానికి, ద్రావిడ భాషా ప్రత్యేకధ్వనులను చర్చించడానికి, తెలుగు గ్రామ నామాల్లోని పదాలు కాలాంతరాలలో లోనైన ధ్వని పరిణామాలు పరిశీలించడానికి, క్రమ పరిణామాన్ని మాత్రీకరించడానికి, అన్యభాషా ప్రభావాన్ని గుర్తించడానికి డా. చిలుకూరి నారాయణరావు, కోరాడ రామకృష్ణయ్య, డా. గంటి జోగి సోమయాజి, డా. దివాకర్ల వేంకటావధాని, కోరాడ మహాదేవ శాస్త్రి, డా. బూదరాజు రాధాకృష్ణలాంటి భాషా వాఙ్మయ పరిశీలకులు ఈ గ్రామ నామాలను పరిశీలించారు. దీనిని బట్టియే తెలుగు గ్రామ పరిశీలనా ప్రాధాన్యాన్ని గుర్తింపవచ్చును.

గ్రామనామ పరిశోధన లేక స్థలనామ పరిశోధన సంజ్ఞానామశాస్త్రం (Onomastics) అనే భాషా విజ్ఞాన విభాగానికి చెందిన ఒక భాగం పలురకాలైన సంజ్ఞా వాచకాల శాస్త్రీయపరిశీలనకు నామవిజ్ఞానం అనిపేరు. ఈ నామ విజ్ఞానంలో ప్రధాన భాగాలు రెండు. (1) మనుష్యనామ విజ్ఞానం. (Anthr p nomy: Gk. Anthrop -man. Onoma - name), (2) స్థలనామ విజ్ఞానం (Top onymy : Gk : Topos - place. Onoma- ame) భౌగోళిక రోదసి సంబంధ స్థలనామాల స్వరూప తత్వాలను పరిశీలించే విజ్ఞానశాఖ. ఈ రెండు శాఖలకు సంబంధించిన పరిశీలన కేవలం భాషాశాస్త్రజ్ఞులకేకాక ఇతర సామాజిక శాస్త్రజ్ఞులకూ, సామాన్యులకూ కూడా ఆసక్తికరమైన విషయం.

రాయలసీమ అని పిలువబడే ప్రాంతంలో మొద

టిది అనంతపుర మండలం. దీనికి కారణం విజయ నగర రాజులీ మండలాన్ని పరిపాలించడం. ఈ విజయనగర చరిత్రయే అనంతపుర మండలం చరిత్రమనికూడ చెప్పడానికి వీలుంది. విజయనగర రాజుల్లో మొదటివాడు బుక్కరాజు. ఇతని మంత్రి అనంతరసు. అనంతపుర నామ మీ మంత్రి పేరును బట్టియే వచ్చింది. అనంతరసు అనంతసాగరమను చెరువును నిర్మించినట్లు, అది రానురాను అనంత పురంగా మారి ఈ మండలానికి నామకరణమైనట్లు చారిత్రకాధారాలనుబట్టి తెలుస్తుంది.

సాధారణంగా ఏ ప్రాంతంలోనైనా, ఏ కాలమందైనా సరిహద్దు ప్రాంతాల భాషాప్రభావం అంతో ఇంతో ఉండడం సహజం. అనగా ఆయా ప్రాంతాలు అన్యభాషా ప్రభావానికి లోనై ఉంటాయి. ఉదాహరణకు చిత్తూరుజిల్లా గ్రామనామాలమీద తమిళభాషా ప్రభావం, తమిళనాడు గ్రామాలపై తెలుగుభాషా ప్రభావం ఉండడం మనమెరిగిన విషయం. అనంతపురంజిల్లా గ్రామనామాలమీద కన్నడభాషా ప్రభావం కన్పిస్తుంది. అనంతపురానికి ఉత్తర, దక్షిణ, పడమర దిక్కులందు కర్ణాటక రాష్ట్రం, తూర్పున చిత్తూరు, కడప జిల్లాలు సరిహద్దులు. మూడువైపుల కన్నడరాష్ట్రం ఉండడంచేత కన్నడభాషా ప్రభావం ఎక్కువగా అనంతపురం గ్రామాలమీద కన్పిస్తుంది.

అనంతపురం జిల్లాలో మొత్తం పదునొకండు తాలూకాలున్నాయి మడకశిర, హిందూపురం, ఉరవకొండ, కల్యాణదుర్గం, రాయదుర్గం తాలూకాల్లో విశేషంగా కన్నడభాషా ప్రభావం ఉంది. ఉదాహరణకు మడకశిర అనే పదంలో శిర అనేది కన్నడ పదం. శిర అనగా తీపు (Sweet) అని అర్థం. తీపి పదార్థం ఎక్కువగా లభించే చోటుగానో, లేక తయారుచేయు స్థలంగానో ఉండియుండును. కర్ణాటక రాష్ట్రంలో 'శిర' అనే ఇంకొక ప్రాంతం ఉండుటచే దానినుండి వేర్వేరుగా గుర్తించడానికి 'మడక' అనే పదాన్ని ముందు చేర్చి మడకశిర అని ప్రయోగించారు. 'శిర' అనే పదానికి 'భాగము' అనే అర్థాన్ని డా॥ చిలుకూరి నారాయణరావు ప్రతిపాదించారు. ఇంకా ఈ తాలూకాలో గల గౌడనహళ్ళి, రంగనహళ్ళి ఇత్యాది గ్రామనామాలను పరిశీలిస్తే గౌడన్న, రంగన్న అనేవి వ్యక్తినామాలు. రంగన్న >రంగన తెలుగు పదమే అయినా గౌడన్న > గౌడన అనేది కన్నడం. ద్వితీయావయవంగా కన్పించే 'హళ్ళి' అనేది తెలుగులో పల్లికి సమానార్థకం. అంటే మూల ద్రావిడంలోని ప > హ గా మారడం కన్నడ భాషయందు ఉందని భాషా శాస్త్రవేత్తలు తెల్పియున్నారు.

ఉదా॥ కొడిగెనహళ్ళి, గౌరవనహళ్ళి } (హిందూపురం తాలూకా)

కురుబరహళ్ళి, బ్యాద్రహళ్ళి } (కల్యాణదుర్గం తాలూకా)

గడేహోతూరు, చిన్నహోతూరు } (ఉరవకొండ తాలూకా)

హొన్నూరు, మీనహళ్ళి } (రాయదుర్గం తాలూకా)

ఇట్లే మడకశిర తాలూకాలోని హళ్ళి కెర, కరి కెర గ్రామ నామాల్లో ద్వితీయావయవంగా కన్పించే కెర అనేది తెలుగులో చెరువు అనే పదానికి సమానార్థకం. కెర అనేది తాలవ్యీకరణ ప్రభావం చేత తెలుగులో చెరువుగా మారినది. కన్నడంలో కెర అనియే యుండడం గమనించదగిన విషయం. హిందూ పురం తాలూకాలోని సంతేబిదనూరు, శిరేకోళం, మైదుగోళం, కల్యాణదుర్గంలోని సంతే కొండాపురం, బెళుగుప్ప, బూదిగుమ్మ, శిర్పి, కుందుర్పి, ఉరవకొండ తాలూకాలోని హావళిగి, బూదగవి, హంపన హాళు, రాయదుర్గం తాలూకాలోని ఫేళోడు, ఉడెగోళం, బొల్లన?

గుడ్డం, హోసగుడ్డం ఇత్యాది గ్రామాలు సయితం కన్నడ భాషా ప్రభావాన్ని వ్యక్తం చేస్తున్నాయి.

డా. చిలుకూరి నారాయణరావుగారు తన ఆంధ్ర భాషా చరిత్రలో "అనంతపురం జిల్లాలోని గ్రామనామ ధేయములను గురించిన మీ మాంస"లో కన్నడభాషా ప్రభావమేగాక అన్య భాషా ప్రభావాన్ని కూడ వివరించారు. అగ్రహారం, ఇంద్రావతి, సంగమేశ్వరం, కష్ణాపురం, గరుడాపురం, గోవిందపురం మొదలైనవి సంస్కృత పదాలచే ఏర్పడినవి. తబ్జూల, జూలు కుంట, జూలకాల్వ ఇత్యాదిగ్రామనామాల్లో కన్పించే జూల అనేది హిందీ పదం. దీనికి జత అని యర్థం. అక్కాజంపల్లి, అప్పాజీపేట, లోకోజీపల్లి, కుర్మాజీపేట అనే గ్రామనామాలు మరాటీ ప్రభావం చేత ఏర్పడ్డాయి. అమీన్‌పల్లి, అల్లాపల్లి, ఖైరేవు, ఖాదరుపేట ఇత్యాది గ్రామనామాలు ఉరుదూ భాషా ప్రభావాన్ని వ్యక్తం చేస్తాయి.

ఈ విధంగా అనంతపురం జిల్లాలోని గ్రామనామాలపై కన్నడ, సంస్కృత, మరాటీ, హిందీ, ఉర్దూ భాషల ప్రభావం ఉందని వ్యక్తమవుతుంది.

---


Statement about ownership and other particulars about

# Nava Bharati

A Literary & Cultural Telugu Monthly

FORM VI (See Rule 8)

The Registration of News-Papers (Central) Rules 1956

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | Barkatpura, 3-4-2008/1 Hyderabad-509 027 |
| 2 | Periodicity of its Publication | Monthly |
| 3. | Printers Name<br>Nationality<br>Address | Sri P. Purnanandam<br>Indian<br>Saifabad, Hyderabad |
| 4. | Publisher's Name<br>Nationality<br>Address | -Do- |
| 5. | Editor's Name<br>Nationality<br>Address | Sri Chadalavada Pitchayya<br>Indian<br>Barkatpura, Hyderabad |
| 6 | Names and addresses of individuals who own the news-paper and partners or share-holders holding more than 1%total of the Capital. | -Do |

| Names: | Address: |
|---|---|
| Sri Chadalavada Pitchayya | Hyderabad |

I, P. Purnanandam, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Dated 1-3-1980

P. PURNANANDAM
Signature of Publisher.

# సమకాలిక కవిత్వం

మాముసూరు నరసింహారావు

పదిమంది పండితులు మెచ్చే కావ్యం ఒకటి వ్రాయాలంటే లాక్షణిక జ్ఞాన సహితమైన సంస్కృతాంధ్రభాషా పాండిత్యమూ, వేదపురాణ జ్యోతిష తర్క మీమాంసాది దర్శన పరిజ్ఞానమూ అవసరమయ్యేవి ప్రాచీన కవులకి. ఇవాళ నలుగురు చదువుకున్నవాళ్ళు బాగుందనుకొనేలాగ వ్రాయాలంటే చరిత్ర, ఆర్థిక రాజకీయశాస్త్రాల ఆకళింపు, ఆధునిక తత్త్వ మనస్తత్వ శాస్త్ర సిద్ధాంతాల ప్రమేయ ప్రభావాలను గురించి కవికి తెలిసి ఉండటం అవసరం. అందుకనే కవితాగుణాన్ని బట్టి ప్రాచీనధోరణి గలయే కొందరు కవుల్ని నేటి పఠితృలోకం ఆదరిస్తున్నా నేడు ప్రధానంగా ఆధునికులకే పరపతి ఉన్నది. సాహిత్య ప్రయోజనాన్ని గురించి కూడా రెండాలోచన ల్లేవు. సమాజశ్రేయస్సే సాహిత్య పరమార్థం అని రూఢి అయిపోయింది. "ఆరిపోయే దీపాన్ని రగిల్చి, పరుగెత్తే సామాన్యుణ్ని నిలేసేదే కవిత్వం" అనీ, "కోకిల కూజితాలతూ, వెన్నెల విహారాలతూ, కన్నె గాలి కౌగిళ్ళతూ యిది కాలం కాద"నీ, కవిత్వం సామాన్యుని యోగక్షేమాలకు పూచీపడి 'సామాన్యుని ముఖానికి నవ్వును అతికించే" యత్నం చెయ్యాలనీ కవులు అభిప్రాయాలు వెలిబుచ్చినారు. ఛాందసుల ఆధిపత్యంనుంచి తప్పించి సాహిత్యాన్ని ప్రజాసముదాయానికి సన్నిహితపరచి జీవితయాదార్థ్యాన్ని ఉన్నదున్నట్లుగా చూపే శక్తివంతమైన సాధనంగా చెయ్యాలని అభ్యుదయ రచయితల సంఘం లక్ష్యపడ్డది. సామాజిక విప్లవానికి పురోగామిగా సాహిత్యవిప్లవం సాగవలె నన్నాడు శ్రీశ్రీ. పీడిత ప్రజాకోటికి 'మైక్' కావలె కవిత్వం అన్నాడు దాశరథి. అయినా వీరి కవిత్వాలలో వైయక్తిక చైతన్యం, సమిష్టి చైతన్యం రెండు చోటు చేసుకొన్నవి. కొందరు కవాతులు చేసే కవిత్వం అన్నా. కొందరాపేర అవాకులూ చెవాకులూ విసరుతున్నా, కొందరు ఫిడేళ్ళపైనా వాయులీనాలపైనా రాగాలు వాయించినా తెలుగు కవితా పఠితృలోకం విన్నది. ఆధునిక కవిత్వం 'చారువేదనారోగం' మానిన తరువాత, కొంతకాలం ఘూకం కేకలు భేకం బాకాలు వినిపించిన తరువాత, వారిని 'సైడ్ కర్టెన్' లోకి పంపించి నేడు రంగాన్నాక్రమించుకొని ఉన్న కవితను అంతర చైతన్యమే ప్రధానమైనదీ, బాహిరమైన లోకవృత్తాన్ని వెల్లడించేదీ అని రెండుగా విపులీకరించాడు సుప్రసన్న.

ఆధునికులు దర్శన వర్ణన శక్తులలో వెనుకటి వారికేమీ తీసిపోరు. లాక్షణికు లేం చెప్పినారో ఎరుగనివారు సైతం తమతమ స్వభావ సంస్కారాన్ని బట్టి ప్రసాదమయ గుణయుతంగానూ, వక్రోక్తి యుక్తంగానూ, వస్త్వలంకార రస రూపకమైన ధ్వనుల్లోనూ, అన్నింటినీ కాకున్నా నేటి సాహిత్యంలో ప్రామాణికాలుగా స్థిరపడిన కొన్ని బాణీలైనా సహజాతగుణైక పరిజ్ఞానంచేత పాటిస్తూ రచిస్తున్నారు. దండి చెప్పిన సామాజిక జీవన చిత్రణమే గాక తద్వారా సాంఘిక ప్రయోజనాల్ని సిద్ధింపజేయవలె నన్నది నేటి సాహిత్యలక్ష్యం. 'సారస్వతం' అన్న పదానికి ప్రయోగ ప్రాచుర్యం తగ్గి సాహిత్యం అన్న పదం విరివిగా ఉపయుక్తం

కావడాన్ని గమనిస్తే రసాత్మక సౌందర్య దృక్పథము కన్నా సాంఘిక హితవు దృష్టి సర్వేసర్వత్ర అంగీకృతం అయినదని స్ఫురిస్తుంది అయితే ఆధునికులు తమ సామాజిక ప్రయోజన దృక్పథానికే అంటిపెట్టుకున్నారని నిర్ధారించ లేమనుకోండి. అప్పుడప్పుడు దాన్నుంచి దూరంగా వాహ్యాళికి వెళ్ళారు. అందమైన మధురస నిష్యందమైన నవనవమైన సిరిసిరి శతకానికీ, పత్రికలలో కార్టూన్ల మాదిరి ప్రాసక్రీడల హాస్యానికీ, ఏవో విట్లు వేసి, ఏవేవో పీట్లు చేసేసిన చమక్కుల లిమరిక్కులకూ యేవిటని చెప్పగలం ప్రయోజనం? అంటే సామాజిక ప్రయోజనావాదులు కూడా అడపా దడపా విచిత్ర సౌందర్యాల్ని ఆవిష్కరిస్తున్నారన్న మాట. ఇటువంటి అప్పుడప్పుడు కలిగే అపవాదాలు అవతల పెడితే నేడు వైయక్తిక చైతన్య ప్రాతిపదికములైన రీతి కావ్యాలు, భావకావ్యాలు పోయి సమిష్టిచైతన్యం మూలమైన వస్తు ప్రధాన కవిత బహుథా విస్తరించి ఉన్నట్లు కన్పిస్తుంది. ఆధునిక కాలంలో కథా, నవల, నాటక - టకాది ప్రక్రియలు ప్రచారం పొందడంతో కవిత కథ నాశ్రయించడం మానింది (మళ్ళీ యిక్కడా సుందరమైన అపవాదాలు - సి. నారాయణ రెడ్డి చారిత్రక కథాకావ్యాలు). వచన సాహిత్యమైన కథ, నవల, దృశ్యసాహిత్యమైన నాటకాల పఠితలకంటె కవితాపాఠి ఘనాపాఠీ గనుక కవిత్వం వ్రాసే వారి స్థాయికూడా తదితర సాహిత్య ప్రక్రియాకారుల స్థాయికంటె యెక్కువగానే ఉంటూన్నది. అందువలన పఠితల మనస్సునీ, బుద్ధినీ, అహంతనూ ప్రభావితం చేయగలుగుతున్నాడు.

కవితలో కథ ప్రాధాన్యత తొలగిపోయిన కారణం చేత నేటి కవిత తదితర వస్తుప్రధానమైంది. సమస్యలు నేడు అనంతంగా ఉండటంతో వస్తువూ అనంతమైంది. వస్తువు అనంత శ్రేణిలోనిది గనుక ఎట్టి దాన్నయినా యిముడ్చడానికి వీలుగా ఇరుకు మాత్ర సీసాలవంటి ఛందోమార్గాల్ని వదలి విస్తృత పరిధిగల వచనకవితను చేపట్టినారు కవులు. దేశ కాల ప్రభుతలను బట్టి భాషలోనూ దానినిబట్టి సాహిత్యంలోనూ పరిణామక్రమానుగతమైన మార్పులు వచ్చినవి. అన్నింటికంటే ముఖ్యమైన విషయం నేటి సమాజానికి సామాన్యుడే ప్రధాని. ఆ సామాన్యుణ్ని దృష్టిలో పెట్టుకొని, అతని సమస్యల్ని యెత్తుకొని, అతనికి పరిజ్ఞానం చైతన్యం కలిగించి సాంఘిక విద్యా ప్రయోజనాన్ని సాధించవలె కవిత.

అభ్యుదయ కవిత్వానికి మేలుబంతి వ్రాసిన శ్రీశ్రీ ఆధునిక కవితకు కుక్కపిల్లా, సబ్బుబిళ్ళా, అగ్గిపుల్లలతోసహా యేదీ అనర్హం కాదన్నాడుగానీ యీ మూడింటిలో ఒక్క దానిపైనా మహాప్రస్థానంలో 'కవి చెప్పలే'దాయన. అయితే చరిత్ర, విప్లవం, వర్గకలహం, అంతర్జాతీయ రాజకీయాల్ని కవితావస్తువులుగా స్వీకరించి తాత్కాలిక సాహిత్యానికి ఒరవడి పెట్టినాడు. ధ్వని ప్రాధాన్యతగల 'శైశవగీతి' 'బాటసారి' మొదలైన భావుకతామయ గీతాలు కొన్ని ఉన్నా మహాప్రస్థానం ముఖ్యంగా మార్క్సిజం నిండినదన్న ప్రథ వచ్చింది. అది అలాగుంచి తాను స్పృశించిన సమకాలిక వస్తువులను సామాన్యుని అవగాహన పరిధిలోకి ఎంతవరకు తేగల్గినాడు శ్రీశ్రీ అన్నది విచారణీయం. 'దేశ చరిత్రలు' కవితా - ఓ కవితా' 'మానవుడా'ఌలో శ్రీశ్రీ తీర్చిదిద్దిన వస్తువు మేధావుల నాకర్షించిందేగాని సామాన్య మానవుణ్ని "ఎడ్యుకేట్" చెయ్యడమటుంచి కొరుకుడు పడకుండానే ఉండిపోయింది. చాలమంది శ్రీ శ్రీ చేత ప్రభావితులైనామనుకొన్నవారు ఆయన శబ్ద విన్యాసంచేత, లయచేసిన కవాతుచేతా ముగ్ధులైనవారే. భిక్షువర్షీయసి, బాటసారి, విద్యార్థి, ఉద్యోగి, సంసారి (సంధ్యా సమస్యలు) సవ్యకవితా వస్తువులే. కాని మహాప్రస్థానంలోని కవితా ఖండాలన్నీ పీనివలె పఠితకు సద్యఃస్ఫూర్తిగా

సాక్షాత్కరించవు. "అవతలిగట్టు" లోని ధ్వని వైశృంఖలతా "ఆః"లోని ఆత్మాశ్రయతా, ప్రతీకత రణగొణ ధ్వని వినా గోచరించని "గంటలు" లేత గుండె చదువరిని తబ్బిబ్బు పెడతవి. పతితృలోకానికి మందులాగానో టానిక్కులాగానో తయారు చేస్తే కొన్నింటిని తన తీరని దాహాన్ని తీర్చుకోవడం కోసం వ్రాశాడు శ్రీశ్రీ. అందుకే లోలోపల "కళకళకొంకే" అనేకోవలోనివాడే శ్రీశ్రీ అన్నాడు ఆరుద్ర.

శ్రీశ్రీ తో కొంత ఒకరకమైన "సాదృశ్యత" గల కవి గజ్జల మల్లారెడ్డి - అచ్చమైన ప్రజాకవి అనిపిస్తాడు. వాస్తవిక తత్కాలీనత యీయనలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈయన కవితలో స్ఫురించేది సమిష్టిచైతన్యమే. ప్రబోధం చేస్తాడు, విమర్శచేస్తాడు, తాత్త్వికత ఉన్నది. నిష్పాక్షికత కనిపిస్తుంది. దేశీయత ఉన్నది. అంతర్జాతీయ వస్తువునీ స్పృశించేరు. హెచ్చరించాల్సిన వాళ్ళని హెచ్చరించేడు. తిట్టవలసినవాళ్ళని తిట్టేడు. చరిత్ర గతినుంచి మానవుని ఔత్కృష్ట్యాన్ని, పురుషకారిత్వాన్నీ, సామాన్యునికి అవగాహన అయ్యేలాగున వ్రాశాడు. తిమ్మతిమ్మ కోరికల సాఫల్యానికి వేంకటేశ్వరునితో కామ్యభక్తులుచేసే బేరాల్ని, సామాజిక ప్రయోజనంలేని కవిత్వంవ్రాసే కవుల్ని అధిక్షేపించేరు "మహాప్రసాదం" లో రాజకీయనేతల పదవీ వ్యామోహాల్ని, మేధావుల మౌఢ్యాన్నీ వ్యాపారుల అక్రమాల్ని సరసంగా నిరసించేరు. ముకురాల వ్రాసిన "నవ్వే కత్తులు" రసవంతమైన అధిక్షేప కావ్యం దీనికీ సామాజిక చైతన్యమే ఉద్దీపన. కవి ముఖతః భక్తుడు స్వామికి ఒక దరఖాస్తు పెట్టుకున్నాడు. కొండ దిగి వచ్చి ఒకసారిచూచిపోవయ్యా బావా అని బంధుత్వం గలుపుకొని ఆహ్వానిస్తాడు. నేటి సమాజంలోని కుళ్లును చమత్కృతి నిండిన రీతిలో చక్కని జాతీయాలు. మధ్యేమధ్యే తెలంగాణంలో సుపరిచితాలయిన ఉరుదూ మాండలికాలను ప్రయోగించి చిత్రీకరించినా, వస్తువులో ధ్వని, కవితలో రసమూ సమనిష్పత్తిలో ఉండినప్పటికీ సామాన్యుడి కెవరైనా చదివి అర్థం చెబితేమాత్రమే ప్రయోజనం సిద్ధించేలాగుంటుంది.

ప్రజానీకంతో "నువ్వేనేను" అన్నాడు ఆరుద్ర. అన్నాడుగానీ అది ప్రజాకవిత్వం కాదని ఆయనే అన్నాడు. నిజానికి 'త్వమేవాహం'లో వస్తువుగానీ ప్రతీకలుగానీ సామాన్యునికి సంబంధించినవే, శిల్పం మాత్రం ఆరుద్ర విలక్షణమైన ప్రతిభావ్యుత్పత్తుల ఫలితంగా మేధావికి మాత్రమే అందేదయింది. ఇలియట్ వేస్ట్‌లాండ్‌లోని కొన్ని ప్రతీకల్ని తానేవిప్పి చెప్పినట్లు ఆరుద్రకూడా టీకలో చెప్పాల్సివచ్చింది. అంతా విప్పిచెప్పితే సామాన్యునికది లహాలమధువే. అయితే 'త్వమే వాహం' వ్రాసిన తరువాత ఆరుద్ర మథనపడి మథనపడి సామాన్యునికోసం 'కూనలమ్మ పదాలు' వ్రాసి ఎమెండ్స్ చేశాడా అనిపిస్తుంది. వస్తు రీత్యానేగాక శిల్పరీత్యా కూడా త్వమే వాహమ్ తత్కాలీన సాహిత్యమే సమాజసమస్యా పరిష్కారానికి వాడిన వైథాగోరస్ సిద్ధాంతం. సమాజ పుష్పాన్ని వర్ణించే క్రొత్తబాటనీ కొత్త బాటలే.

మేధావిని నవ్యధోరణి ఉన్నా, సాంప్రదాయిక రీతి కూడా గల దాశరథి కూడా తత్కాలీన సాహిత్యాన్ని సృజించేడు. ఆధునిక సమాజంలోని మిట్ట పల్లాల్ని నిరసించేడు. చరిత్ర స్వభావాన్ని ప్రయోజనాన్ని, పరిణామ స్వభావాన్ని అస్పష్టతలేకుండా పరిశీలించి సామాన్యుని ముందు పెట్టాడు. 'నరకం'లో ఆంగ్లకావ్య ప్రభావం గోచరించినా సమకాలీన ప్రయోజనం కోసమే యీ వస్తువును చేపట్టాడు కవి. శాటాన్ ధిక్కార ధోరణిలో నేటి మానవునిక్కావలసిన ఆశావాదాన్ని ఆవిష్కరించేడు. నా తెలంగాణ కోటిరత్నాలవీణ అన్న యీ కవే మూడు కోటుల నొక్కటే ముడి బిగించవలెనని మహాంధ్రోద్వరణ

నాంది గీతం పాడినాడు. దాశరథి దృష్టిలో కాలమూ కవిత్వమూ రెండూ ఆశాపడణములై ప్రజాకవిత్వాన్ని పుణికి పుచ్చుకొన్నవి.

వస్తుపరంగానూ, ధ్వనిలోనూ సమకాలిక సమస్యల్ని తీసుకొని తత్కాలీన కవిత్వం చెప్పిన మరో కవి కాళోజి 1932 నుంచి మూడు దశాబ్దాల తెలుగు చరిత్రకు యీయన కవిత్వం అద్దం పట్టినట్లుంటుందని రామానుజరావుగారన్నారు. హింస పాపమని ఎంచే దేశంలో నాడు చెలరేగిన హిట్లరత్వాన్నీ, పగటి దోపిడులను ఆపలేని ప్రభుత్వాన్నీ, పండించే వాణ్ని పస్తుబెట్టే పాడు రాజ్యాన్ని ఎంత రాజకీయ చైతన్యంతో ప్రశ్నించాడో అంత వైజ్ఞానిక చైతన్యంతోనూ ప్రజల చాదస్తాల్ని ప్రలోభాల్ని తెగడినాడు. కాళోజి కవితకు ఇంకొక ప్రయోజనం కూడా అమరింది నేడు. "నాటి నిజాం ప్రభుత్వ మెంతనయమో" అన్న వారినీ "నేటి ప్రజాప్రభుత్వంతో మనం గన్న కలలు పండేయి" అన్న వారినీ-యిరువురినీ నిద్ర లేపి నిజాన్ని చూపుతుంది కాళోజీకవిత. లింకన్ యిచ్చిన దానికంటే సమగ్రమైన నిర్వచనం ప్రజాస్వామ్యానికి యిచ్చి సామాన్యుణ్ని ఎడ్యుకేట్ చేశాడు కాళోజి. శిబి, దధీచి, కర్ణుల వితరణని పాడినట్లు అంధుడైన ఏటూరు నాగారం కోయదొర జాతీయ రక్షణ నిధికిచ్చిన విరాళాన్ని, బిచ్చమెత్తుకొనే లచ్చిమి విరాళాన్ని కావ్యగతంగా చెప్పి సమాజం తరపున వారి ఋణాన్ని తీర్చుకొన్నాడు కాళోజి. ఫోటో మాత్రంగా, టోపీయే ప్రతీకగా, గ్రంథ గతంగా గాంధీ ఉండిపోయిన సత్యాన్ని చెప్పినాడు ఏ పార్టీ వాడోకాదు ఏ పాటి వాడో చూడు-పెట్టుకున్న టోపీకాదు పెట్టినటోపీచూడు అని హెచ్చరించేడు ఓటరును.

సామాన్యుణ్ని సిద్ధాంతపరంగా ప్రబోధించే మరొకకావ్యం-ముదిగొండ శివప్రసాద్ "మహాసర్గ". సమకాలిక విషయాల్ని స్పృశిస్తూ కవితాఖండాల్ని సృజించేడు కవి. పేదల బాధామయ గాథలకై అధర్మాన్ని అంత మొందించడానికీ, జాతిలో ఏకతా, కోల్పోయిన శక్తి పునరుజ్జీవింప జేయడానికీకవిత్వం వ్రాస్తున్నానన్నాడు. అయితే మహాసర్గ ఒకే ఒక ఆదర్శం కోసం విరచింపబడ్డది. భౌతిక వాదాన్ని ఖండించి ధార్మిక దృష్టిని దేశంలో పెంపొందింప జేయటం. సాంఘిక విలువలు ఎంత హేయమైనస్థితికి దిగజారిపోయినాయి - శత్రువులు దాడి చేస్తూంటే కర్తవ్యం మరచిన ప్రజల్నూ-నేతృత్వ శక్తి లేని నాయకుల్నూ - ఐహిక దుఃఖమూ ఆధ్యాత్మిక దారిద్ర్యమూ ఎత్తిచూపి-అర్థవంతమూ ప్రభావవంతమైన కవితలో జడసమాజాన్ని మేల్కొల్పడానికి నిరాశ్రయపారతత్వాన్ని తెగడి కర్మయోగ ప్రాశస్త్యాన్ని చాటడానికి త్యాగశీలతా దేశ ధర్మ దీక్షారక్షణా కాంక్షలను పెంపొందింప జేయడానికి సమాజాన్ని చైతన్యవంతం చేయడానికీ తన కవితను వాడినాడు.

కొన్ని తత్కాలీన వస్తుప్రధానమైన కవితా సంకలనాలు వస్తున్నవి 'తనదైన అనుభూతి తనది' అన్న సత్యాన్ని గుర్తించినట్లే యీ కవితాసంకలనాల్ని ప్రచురించడం. సమర కవిత వస్తువుగా గల 'తుపాకి రవ్వలు' 'రణభేరి' 'సమరవిజయ', 'మానవుడే' వస్తువుగా గల "మానవుడే మా సందేశం", "రాత్రి," మొదలైనవి. చీనా సామ్రాజ్యవాదాన్ని గురించి వివరిస్తూకృత్తివాసతీర్థులు శాస్త్రాలు, పరిశోధనలు సమరాగ్ని సమిధలైనవనీ, చితాభస్మ రాసులపైన శీర్షమెత్తడమే చీనా కోరిక అనీ, నెత్తినమొత్తడానికే కుత్తుకనుత్తరించే తలపుతోనే సుత్తికొడవలి లాంఛనాలుగా పెట్టుకొన్నది చైనా అని ఆరుద్రా మనస్సుకు హత్తుకుపోయే భావన చేశారు. జాతికులభేదాలంతరించి కార్మికులూ కర్షకులూ ఒకటై మేల్కాంచిన జాతిలో ఏకత్వం ఆవిష్కృతం అయింది. ఒనామాటోపిక్ పదాలతో బింబాల్ని నిర్మించి నీవప్పూ నా పొట్టూకలిపి తిందాం అనీ, మహాశబ్దంలో ధ్వనించే జంగుబిల్లిని స్ఫురిస్తూ

జాతీయాల్లో సమరకవిత నిలచింది. బోగందాని పాటనీ. గోతులున్న బాటనీ చౌఎన్‌లై మాటనీ. మొసళ్ళున్న సరస్సునీ, సినీతార వయస్సునీ మావ్ సేటుంగ్ మనస్సునీ నమ్మొద్దనీ ప్రతిసోల్జరూ ఒక శతఘ్ని అనీ ప్రతిపౌరుడూ ఒక దవాగ్ని అనీ మరణం ఒకేసారి అనీ ఉద్ఘాటించాడు కవి. 'తుపాకి రవ్వలు' ఇండోపాక్ సంఘర్షణ కాలంలో జనించింది. అట్లాగే సమరవిజయ బంగ్లాదేశ్ విముక్తి సందర్భాన ప్రచురితమైంది. ఇవన్నీ కాక పోయినా వీటిలో కొన్నయినా సామాన్యుని కదలిస్తాయి. నిద్రవదలిస్తాయి.

రెండోది అంతర్ముఖీన కవిత. మేధావిక కవిత. ఆంగ్లంలో జాన్‌డాన్ దీనికి ఒరవడి పెట్టాడంటారు. నిస్సందేహంగా యిదీ ప్రతీచీప్రభావ జనితమే. సమకాలిక సమాజంలో దిగజారిన విలువలూ, వసుధైకకుటుంబి మానవుడు అన్న తత్త్వమూ అతీంద్రియ మనస్తత్వ శాస్త్రప్రభావమూ, ఉపనిషత్తుల, సార్త్రే, బెర్గ్సన్‌ల తాత్త్వికచింతన అంతర్ముఖీన కవితలో కలగలసి కవితారూపంలో సాక్షాత్కరించినవి. వస్తువులలో సమకాలీనత ఉన్నా కవితలలో వ్యక్తమైన అంతశ్చైతన్య ప్రాధాన్యం, సౌందర్యోపాసనా దృష్టి, మౌలిక జిజ్ఞాసల కారణంగా సర్వకాలీనమైంది కవిత. ఇట్టి కవితాఖండికలకు ప్రతీకలనూ బింబాలనూ సూచించే వివరణం యివ్వడం బాగుంటుంది. "తన కవిత్వానికి తాను అర్థం చెప్పకొనే దౌర్భాగ్యం రారాదు." అనుకునేవారు-ఆత్మాశ్రయ కవిత్వం, మేధావిక ప్రదర్శనచేసే ఎల్యూజన్స్ లేకుండా, వేదోపనిషత్తులనుంచి ప్రతీకలనూ బింబాలనూ గ్రహించకుండా తనలోని కవితాస్ఫూర్తి నుంచి మాత్రమే, తాను సృజించిన అర్థవంతమైన బహిశ్చైతన్యం చూపే ప్రతీకలతో మాత్రమే వ్రాయడం మంచిది. అంతర్ముఖీన కవిత్వం గల పుస్తకాల్ని స్టడీ చేసుకోవాలిగాని చదువుకో వీల్లేదు. ఇవి సద్యః పరనిర్వృతి కల్గించేవికావు. అయితే యీ సంప్రదాయం ఏర్పడటం ముందు తరాలకి కొంత మంచిచేస్తుంది. భౌతిక వాదం నిండిన యీ ప్రపంచంలో సౌందర్యానుభూతినీ జిజ్ఞాసనూ, మేధావికతనూ, ఉదాత్తగుణాలనూ, మౌలికమైన మానవతనూ భావితరాల వాళ్ళకోసం వీళ్ళు భద్రపరుస్తున్నారన్పిస్తుంది.

ఇవన్నీ అట్లాఉంచి అసలు పరిత పరిస్థితియేమిటో కూడా తెలియాలి. ప్రస్తుత విద్యావిధానం, యువతరం ధోరణి, వాళ్ళలో ఉన్న క్రమశిక్షణస్థాయీ వ్యాపిస్తున్న స్వార్థ, అహంకార కేంద్రక ప్రవృత్తులను చూస్తుంటే దిగ్భ్రమ కలుగుతోంది. నేతలు వీళ్ళనెక్కడికి తీసుకుపోతున్నారు? అసలు వాళ్ళెక్కడికి పోతున్నారు? ముందుముందు ఏర్పడే సమాజానికి నేడు పడుతూన్న పునాదులేవి? ఈ పునాదిని పటిష్ఠం ఎవరు ఎట్లాచెయ్యాలి? అట్లా చేసేవారున్నారా? ఉంటే వారిని చెయ్యనిస్తున్నదా నేటివ్యవస్థ? లేకపోతే యేంటిగతి? అంటూ పుంఖాను పుంఖంగా పుట్టుకు వస్తున్నవి ప్రశ్నలు. వీటికి జవాబులెవరూ చెప్పరు. మరికాలం వీట్ని ఎలాతీరుస్తుందో చూడాలి. అంత అనూహ్యమైన భవిష్యత్తు కవితకు ఉండబోయే స్థానంకూడా అంతే. కాని నేడు కన్పిస్తున్న ధోరణుల బట్టిచూస్తే ఏమంత ఆశాజనకంగా కన్పించదు. అయితే కవయః క్రాంతిదర్శనః అంటారు గనుక కవులు ఆశావాదంతో సమకాలికమైన చెడుగును తొలగించి వివేక విజ్ఞాన బీజాల్ని వేసి- వాంగ్‌లుంగ్ (ది గుడ్ ఎర్త్) మొక్క-మొక్కకి వేళ్ళని చెమ్మ మట్టితో తడిపి బ్రతికించినట్లు-అంకురింపజేసి వర్ధిల్ల జేయాలి. ఆశాతరుణం కాలం అని దాశరథితో ఏకీభవించి వేచిచూడాలి. *

# తెలుగులో చిత్రకవిత

గాదె ధర్మేశ్వరరావు M.A.

చిత్రమనగా చోద్యము, అద్భుతమనే అర్థములు మనకు స్ఫురించును. కావున వినుటకు చోద్యముగా నుండు లేదా అద్భుతముగా నుండునట్లు అక్షరముల కూర్పుచేత కవిత్వము అల్లబడినచో చిత్ర కవిత్వమందుము. చిత్ర మనగా పద చమత్కారమనే అర్థమును బట్టి అక్షర పాద పద చమత్కారములచే నొప్పారు కవిత్వమును కూడ చిత్ర కవిత్వమందుము. ఇట్లు పద పాదములకు సంబంధించిన చిత్రముతో కూడినది చిత్ర కవిత్వము.

చిత్రమనగా చిత్తరువు అని కూడ అర్థము కలదు. చిత్తరువులతో కవిత అల్లుట కూడ చిత్ర కవిత యనుట చెల్లును. అక్షరములను నియమిత స్థలముల నిబంధించి బొమ్మల చిత్రించుటనే చిత్రముతో కూడిన చిత్ర కవిత్వ విభాగమును బంధ కవిత్వమనుట పొసగును.

ఒక రకపు పద్యములో నదేరకపు పద్యము లేదా పద్యములను గాని లేదా మరి యితర రకపు పద్యమును లేదా పద్యములను గాని నిమిడ్చిన కవిత్వము కూడ చిత్రముగా నుండును కదా. ఈ రకము ఛందస్సంబంధి. పద్యములో పద్యముల గర్భస్థ మొనరించి చెప్పుటను చిత్రముతో కూడిన చిత్ర కవిత్వ విభాగమును గర్భకవిత్వమన చెల్లును.

రెండు మూడు అర్థములు లేదా అంతకంటె నెక్కుడు స్ఫురింపజేయు పద్యములల్లుట కూడ చిత్రముగా నుండును. పద చమత్కారముల నిందు గననగును ఇది అర్థచిత్ర ప్రధానమైన చిత్ర కవితకు సంబంధించినది.

కాబట్టి ఏదో ఒక చిత్ర ప్రధానమైయుండు కవిత చిత్ర కవిత యని మనకు తెలియు చున్నది.

చిత్ర కవిత ప్రతి భాషలోను కొద్దోగొప్పో ఉండును. ఏదో ఒక రూపంలో కన్పడును. కన్నడ కవిరాజ మార్గమందును, తమిళమున దండి అలంకార శాస్త్రమందును చిత్ర కవితను గూర్చి ముచ్చటించుట జరిగినది. ప్రాచీన కాలము నుండియు చిత్ర కవిత సంస్కృత ములో కలదు. రసపోషకములు కావని భావించి సంస్కృతాలంకారికులు చిత్ర కవితను అధమ కవితగా భావించిరి శబ్దాలంకారముల క్రిందనే ఇది చెప్పబడినది. వాల్మీకి కాళిదాసాది కవులు శబ్దాలంకారములలో దీనిని చవి చూపించిరి. ఆనందవర్ధనుని దేవీ శతకము చిత్ర మయము. కావ్యానుశాసనమునందు "చిత్ర సాదృశ్యాత్ ఆశ్చర్య హి తుత్వా ద్వా చిత్రం" అని చిత్ర నిర్వచనము కలదు.

1. స్వర చిత్రము, 2 వ్యంజన చిత్రము, దీని క్రింద ఏకాక్షరి ప్రదర్శితమైనది. 3. గతి నియమ చిత్రము. దీని క్రింద పద్యములో పాదము నెటు చదివినను లక్షణము చెడదు. 4. ఆకార నియమ చిత్రములో ఖడ్గము మొదలు

లగు వాని ఆకారములలో వర్ణముల కూర్చుట. ఇది బంధ కవిత్వసంబంధము. 5 చ్యుతచిత్రము 6. గూఢ చిత్రము అనగా అర్థమును గూఢ పరచుట. 7. ప్రశ్నోత్తర చిత్రము ఇందు ప్రశ్నలోనే సమాధాన మిమిడి యుండును.

పాశ్చాత్య భాషలలో కూడ చిత్ర కవిత కలదు. మన భాషలోను, పాశ్చాత్య భాషలోను గల చిత్ర కవితా రీతులను గొన్నింటిని పోల్చి శ్రీ జి యన్. రెడ్డిగారు ఒక వ్యాసంలో చెప్పిరి. అందులో కొన్ని :

1. ఏకాచ్చు పద్యాలు. పద్యములో ఒక అచ్చును మాత్రమే ఉపయోగింతురు.

A. E లేదా ఇతర అచ్చులలో ఒక దానిని గ్రహించి పద్యమును వ్రాయుదురు. 2. ప్రశ్నోత్తరము 3. పద పద్య భ్రమకాలు. "Madam I am Adam ఎటు చదివిన ఒకటే. 4. అర్థ చిత్రములో శ్లేష రచన కలదు. 5. ముక్తపదగ్రస్తము. (chain verse) మొదలగునవి పాశ్చాత్య భాషలో చూడవచ్చు.

తెలుగులో చిత్ర కవితా స్వరూపము.

లక్షణ గ్రంథము లన్నింటిని పట్టి చూడ కొందరు లాక్షణికులు చిత్ర బంధ గర్భాదులు శబ్దాలంకారములనే భావించి ఆ శీర్షిక క్రిందనే వానిని వివరించిరి. కొందరు చిత్రమునకు కవిత్వ స్థానమిచ్చి ఆ చిత్ర కవిత్వములో భాగములు బంధ గర్భాదులనిరి. కాని అప్ప కవీయ కర్త చతుర్థాశ్వాసమున చిత్ర, బంధ, గర్భ కవిత్వములని వేరిడి ఉదాహరణ సహితము పేర్కొనెను. కావున ఇతను బంధ గర్భములకు కూడ చిత్ర కవితతో సమానముగ కవిత్వ స్థాన మొసంగెను.

పై వివరణమును బట్టి చిత్ర కవిత్వము పరిణతి నొంది చిత్ర, గర్భ, బంధ కవితలనెడి మూడు భాగములై నదని చెప్పవచ్చు. ఈ మూడును శబ్ద ప్రధానములు. నాల్గవది అర్థ చిత్ర ప్రధానము. అయిదవది ఇతర ఏదైన చిత్ర ప్రధానమైనది.

చిత్ర కవిత : రకములు : 1. ఏకపాది, 2. ద్విపాది, 3. సర్వ లఘువు. 4. ఏకాక్షరి, 5. ద్వ్యక్షరి 6. త్ర్యక్షరి 7. ఇచ్ఛావాక్య సంఘట్టనము, 8 అనులోమ విలోమ కందము 9. పాద భ్రమకము, 10. ప్రశ్నోత్తరము, 11. నిరోష్ఠ్యము, 12 తలకట్లు, 13 గుడులు 14. కొమ్ములు, 15. అచల జిహ్వము, 16. ఓష్ఠ్యము, 17. అంతస్థాలు, ఊష్మాలతో పద్యములు, 18 సరిగమపదనిసలు. 19. సర్వప్రాస యతి, 20. ఏక ప్రాసము, 21. అచ్చతెలుగు, 22. పద్యములలో పేరు 23. ఏకద్వి త్రిచతుః పంచషట్సప్తాష్టాక్షర క్రమపాద నియమ సీసము మొదలగునవి.

గర్భ కవిత – అందలి భేదములు

1. చతుర్విధ కందము, 2. కందములో 108 కందములు, 3. ద్విపద గర్భ కందము, 4. కంద గీత గర్భిత చంపకమాల, 5 కంద ద్వయ గీత గర్భ చంపకమాల, 6. స్రగ్విణీ గర్భిత భుజంగ ప్రయాతము, 7. భుజంగ ప్రయాత గర్భ స్రగ్విణి, 8 ద్వికంద క్రౌంచ పద వృత్తము, 9. కంద ద్వయ గర్భ భాస్కర విలసితము, 10. కంద గర్భిత మణిగణనికరము, 11. కంద మణిగణ నికరము, 12. కంద గీత గర్భిత ఉత్పలమాల, 13. మత్తేభకంద సీసము, 14. స్రగ్విణీ భుజంగ ప్రయాత ద్రుత విలంబిత వృత్త సీసము. 15. సీసములో 36 పద్యములు మొదలగునవి.

బంధ కవిత – రకములు

1. నాగబంధము 2. గోమూత్రికా బంధము

3. షోడశదళ పద్మ బంధు 4. చక్ర బంధము 5. ఛురికా బంధము 6 మాలికా బంధము 7. ఛత్ర బంధము 8 కుండలి బంధము.

బంధములో గర్భము : 1. షోడశదళ చక్ర బంధ ద్వయ గర్భ మాలికా బంధము 2. పుష్ప మాలికా బంధయుక్త కందమదన విలసిత శ్లోక గర్భిత స్రగ్ధరా వృత్తము 3. పుష్పమాలికా బంధ గోమూత్రికా బంధ గుచ్ఛ బంధ హల బంధ ఛత్ర బంధ పంచక నిరోష్ఠ్య కందము 4. ఒక పద్యంలో 6 బంధములు. 5.11 బంధాలలో ఒక పద్యం మొదలగువవి.

అర్థ చిత్రము : ద్వ్యర్థి, త్ర్యర్థి పద్యములు - వానితో నిర్మింపబడిన కావ్యములు.

చిత్ర కవిత స్వరూపమునననుసరించి, దాని వాడకమును బట్టి తెలుగు సాహిత్యంలో ముఖ్యంగా మూడు దశలు మనకు గోచరించును.

మొదటి దశ : ఈ దశలో చిత్ర కవిత అలంకారముగా అనగా శబ్ద లేదా అర్థాలంకారముగా వాడబడినది. లాక్షణికులట్లే భావించి నిర్వచనము లుదాహరణ పూర్వకముగ చేసిరి. అట్లే కవులు కూడ ఇది ఒక కవితగా భావించక ఒక అలంకారముగ వారి గ్రంథములలో వాడిరి.

అనుప్రాస వలె గన్పడి వేరు వేరు మాటలు వినుట కింపైన వానిని అర్థవంతముగా కూర్చబడిన పద్యములో చిత్రము కలదు దీనినే ఇచ్ఛా వాక్య సంఘట్టమని చిత్రకవితా భేదముగా తర్వాత పేర్కొనిరి.

ముద్దుపళని రాధికా సాంత్వనములో నున్న పద్య మీ క్రింద దీనికుల కుదాహరణము.

"శేట లుగా జిగి ముత్యము
చేట లుగా బంచదార పేట లుగా బూం
దోటలుగా చిలుకల
మాటలుగా గంసవైరి మాటలు దనరున్."

శ్రీనాథుడు, పోతనలు ఏకపాది, ద్విపాది, సర్వ లఘువులు అనెడి చిత్ర కవితా భేదములను అలంకారములుగ భావించి వాడియున్నారు. అట్లే యితర కవులును పై వాని ఛాయలను తమ కవితలో ప్రయోగించిరి.

దక్షవాటీ మహాస్థానంబులో లేని అని భీమేశ్వర పురాణములో "ఎన్నడు చూతువో ఇంకొక్క మాఱేను" అని కాశీ ఖండములోను ఏకపాదిని శ్రీనాథుడు వాడెను.

రాజనందన రాజ రాజాత్మజులు సాటి
తలరు నల్లయవేమ ధరణిపతికి" అంటూ

ఇట్లా ఈ పాదముతోనే మిగిలిన మూడు పాదములు పూరించేసెను.

ఇంకను ఈ ఏకపాది ఛాయలను పింగళి సూరన, ప్రభావతీ ప్రద్యుమ్నములోను, పోతరాజు లక్ష్మీనరసింహ కవి మాఘ పురాణంలోను తిర్పతి వెంకట కవుల కృతిలో చూడవచ్చును.

"కాశి కేతెంచు మఱి ప్రయాగమున కేగు
మునుగు మణికర్ణికా తీర్థమునను మరియు"

పద్యములో ఇట్లే రెండు పాదములు గలిగి ద్విపాదియగును. ఇది శ్రీనాథుడి కాశీ ఖండములోనిది. అబ్బయా మాత్యుడు అనిరుద్ధ చరిత్రములోను ఇట్లే ఒక పద్యము వ్రాసెను.

పోతన భాగవతములో 8.54, 146, 211, 212, 10-1561. పద్యములలోను మరియు ఈ క్రింది పద్యము 10-186 లో—సర్వ లఘువులు గలవు. అన్ని అక్షరములు లఘువులే.

"జడగతులును బలువిఱుదులు
విడికెడు నడుములును వలుద విగి చనుగవలున్
వెడద నయనములు సిరిదడ
బడు మొగములు భ్రమర చికుర భరములు నమరన్."

ఇట్లే భైరవుడు శ్రీరంగ మహాత్మ్యములోను లయహారి వృత్తము, ఒక పద్యము వ్రాసెను. మిన్నికంటి గురునాథ శర్మగారు 'శివగీత'లో ఒక కందమును వెలయించిరి.

రెండవదశ:- ఈ దశలో కవులు సందర్భానుసారము ఒకటిరెండు చిత్రకవిత గల పద్యములను సృజించిరి. 12 వ శతాబ్దమునుండి మొదలై 16 వ శతాబ్దికి విస్తరించినది. నన్నెచోడుడు నాగబంధ, మురజ బంధములలో నాగాభరణుని స్తుతించి, చక్రబంధమున చక్రిశక్రాద్య మరచక్రమును పొగిడెను. చతుర్విధ జ్ఞానోపదేశము కొఱకు చతుర్విధ కందము, పరమేశ్వరుని నిరంతరము తలచువారి శరీరము నందతడు గర్భస్థుడై యుండునని తెలుపుటకు (12-218లో) కందగర్భ చంపకమాలను రచించెను. నాచన సోమన ఉత్తర హరివంశమున మునులు గంగను జూచుసందర్భమున (1-106) నిరోష్ఠ్యమును వ్రాసెను. పారిజాతాపహరణమున తిమ్మన అనులోమకందము (5-9) పాదభ్రమకము (5-93) ద్వ్యక్షరి కందము (5-98)ను కృష్ణుని స్తుతించు సందర్భమున రచించెను. అందులోనే అతడు ద్వికంద క్రౌంచపదవృత్తమును, భుజంగ ప్రయాత గర్భస్రగ్విణిని అనుగర్భ కవితను, ఇంకను గోమూత్రికా బంధము, నాగబంధము, ఛురికా బంధము (5-94-96) చక్రబంధము (5-97) అను కృష్ణుని స్తుతించు సందర్భమునవే రచించెను. అనగా ఇట్లు చిత్రవిచిత్రగతుల చిత్రకవితా రీతులలో స్తుతించెనని భావము గోచరింపజేసెను. పింగళి సూరన కళాపూర్ణోదయమున ద్వ్యక్షరి కందమిట్లున్నది. పద్యములో అక్షరములు రెండే రెండు. వానితో పద్యము పూర్తియగును.

నా నెమ్మనమును మాని
మానని మౌనమున మనము మన్ననమనో
మానిని! నీ మనమున నను
మానము మానమును మాని మనుమను నెమ్మిన్

నంది ఘంటల జంట నిరోష్ఠ్యము, ద్వ్యక్షరికందమును, ఏకాక్షరి కందమును వరాహ పురాణంలో వెలయించిరి వారి ఏకాక్షరి

నా నన నుని న నూనన
నౌనుని నున నున్న నెన్న నీ నీ న నిను
న్నా నౌన నోన్ని నానౌ
నేనే నను నన్ను నాన నేనను నన్నన్

పిల్లలమఱ్ఱి పినవీరన జైమినీ భారతములో అశ్వమేధపర్వము అష్టమాశ్వాసము 221 పద్యం పాదభ్రమకము. అది యిట్లున్నది.

నీరవరక్షైర వరనీ
సారసభర సౌధయూధ సౌరభనరసా
వారణ రథ్య రణరవా

నేటికాలములో కూడ చిత్రకవితను సందర్భాన్నిబట్టి ఒకటి, రెండు పద్యములలో చెప్పినవారున్నారు పలురీతులను ప్రదర్శించిన వారు కలరు. వారిలో ప్రసిద్ధులు శ్రీమిన్నికంటి గురునాథశర్మ, మాఘపురాణకర్త పోతరాజు లక్ష్మీనృసింహ కవి. ప ఫ బ భ మ వ అనునవి ఓష్ఠ్యములు. ఇవి రాకుండ పద్యము వ్రాసినచో నది నిరోష్ఠ్యమగును. మాఘపురాణములోని నిరోష్ఠ్యము.

నారాయణ! నారాయణ!
నారాయణ! నలిననయన! నాగేట్శయనా!
నారాయణ! నారాయణ!
నారాయణ! దీనశరణ! నతజనతరణా!

దీనియందే ఈ కవి మత్తేభకంద గర్భిత సీసమును రచించెను. ఇది కూడా దేవుని స్తుతించు సందర్భము లోనిది. దశమాశ్వాసమున

స్రగ్విణీ గర్భిత భుజంగ ప్రయాతము, కంద గీత గర్భిత చంపకమాలను వ్రాసియుండెను. నాగచక్రబంధములను చిత్రించియుండెను.

శ్రీమిన్నికంటి వారు ప్రదర్శించిన రీతులు: వారి శివగీత, గౌరీ కల్యాణము మొదలగు గ్రంథములలో ప్రతి ఆశ్వాసము మొదటి పద్యము చిత్రకవితగా వెలయించెను. శివగీత-(5-1) లో సర్వలఘువు, (9-1) లో ద్వ్యక్షరి, శివగీత (7-1)లో (6-1) ల్లో తలకట్టును వ్రాసెను. శివగీత (10-1) ఓష్ఠ్యము ఇటులున్నది.

భాపా భావ భవా భా
వా పాము భవమ్ము మాపవా మాప్రాపై
వాపోవు మమ్ము బ్రోవవె
భూపా భవ్య విభవా ప్రభూభవ! భీమా!

శివగీత (11-1) అంతస్థాలు, ఊష్మాలతో పద్యము రచించెను. సరిగమలతో పద్యము శివ గీత (12-1) ఇటులున్నది.

మాపని సరిగాఁగాఁగని
మాపాపగ గరిమ నస మాపఁగఁదగదా
నీ పాదదరి గనిగదా
మాపా సామా గమ పదమాని నదాదా!

వారి హరిహర దత్తస్తుతిలోని 'నరసింహ స్తుతి' అను శతకములోని అన్ని పద్యములకు 'త'కారప్రాసను పాటించి ఏకప్రాసను వాడిన వాడాయెను.

ఈయన కందద్వయ గీతగర్భ చంపకమాల, ద్విపదగర్భకందమును (శివగీత 13-1) మరియు షోడశదళ పద్మబంధము (భాగవతము 12-13) షోడశదళ చక్రబంధ ద్వయ గర్భ మాలికా బంధము (గౌరీ కల్యాణము 3-61,62).

ఈ రెండవ దశలోనే కవులు అక్కడక్కడ ఒకటి రెండు పద్యములు శ్లేషాలంకారము కలిగినవి రచించిరి. ఇది అర్థ చిత్రమునకు నాంది.

మూడవ దశ : ఈ దశలో చిత్ర కవితా భేదములలో నొకరీతిని గ్రహించి కావ్యమున దానిని పాటించి పూర్తి చేసిన మేటి కవులు కలరు. ఇది విరివిగ చిత్ర కవిత విస్తరిల్లిన కాలమనవచ్చు. అచ్చము నిరోష్ఠ్య పద్యములతో కావ్యములు వ్రాసిన వారు ఉన్నారు. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము, సింగరాచార్యుల దశరథ రాజనందన చరిత్ర,మృత్యుంజయుని నిరోష్ఠ్య నల చరిత్ర, మచ్చ వెంకట కవి శుద్ధాంధ్ర నిరోష్ఠ్య కుశ చరిత్ర, వీరేశలింగము గారి నిరోష్ఠ్య నిర్వచన నైషధము పేర్కొనదగినవి. గణపవరపు వెంకట కవి ప్రబంధ వేంకటేశ్వర విజయ విలాసంలో గర్భ కవితలో చిత్ర కవితను చూపించెను. ఒక్క సీసములో 36 రకముల పద్యములను పొదిగిన ఆసీస మిట్లున్నది :

సారాగ్ర్యసారస సమనేత్ర యుగళ నా
రద రుచి కాంతిన రఘు న పనిత
సారాగ ధీర విశద వీన తురగ భై
రవభవ శైత్ర భ రశుభ కరణ
సారా తిహార వినర చారణ హారి సా
ర సహిత చంద్రనర జ జయనుత
వారాశి నార దవర పూ జత పద గౌ
రవ కటి ఖడ్గ గరళ గళ నఖ

తే॥గీ॥ హరినగ నిలయ గిరిధర యసురదళన
మణిమ యమ కుటసురమణిమధు విశరణ
కరివరద కువర రుచిర తర వసన న
రహరి లసిత దర నిగమ విహరణహరి.

దామెరల అంకన్న ఉషాపరిణయంలో ఒక పద్యంలో 6 బంధములను కల్పించాడు. పద్యంలో 108 పద్యాలతోపాటు 11 బంధాలలో అదే పద్యాన్ని యిమిడ్చాడు. చింతపల్లి

ఛాయాపతి రాఘవాభ్యుదయంలో 6 రకాలకు చెందిన బంధములను గల్గిన 11 బంధపద్యములను వ్రాసెను.

ఇటీవలి కవి, నేత్రావధానియైన శ్రీ శే గాదె పాప రాజకవి శ్రీదర్శ జానకిరామ విచిత్ర నక్షత్ర కందగర్భాష్టోత్తర శతకమును తదుపరి చతుర్ముఖ రామాయణమును చతుర్విధ కంద పద్యములలోనే కావ్యము మొత్తమును నడిపి తన ప్రతిభను వెల్లడించినాడు.

సాంప్రదాయ బద్ధమై, నిర్వచనమై, చతుర్విధ కందపద్యమయమైన ఉద్గ్రంథమును రచించి ధన్యుడై నేటికాలమున చిత్రకవితా భాగమైన గర్భకవితను వెల్లడించి మనకు మార్గదర్శకుడైనాడు. రామాయణ మందలి ఒక పద్యము -

[1]భోగాను రాగ లీనత
రాగన్[2] లాలించి తత్పురము సువిధాలన్
[3]వేగ సిరిసంపదలు తుల
దూగన్[4] పాలించు దశరథుండవలీలన్

ఇందులో నాలుగు కందములు గలవు.

మొదటిది పై పద్యము. 'గ' ప్రాసతో అల్లే 3వ పద్యం 'గ' ప్రాసతో 2, 4 పద్యములు 'ల' ప్రాసతో.

రెండవ పద్యము:

లాలించి తత్పురము సువి
ధాలన్ వేగసిరి సంపదలు తులదూగన్
పాలించు దశరథుండవ
లీలన్ భోగానురాగ లీనత రాగన్

మూడవ పద్యము 3 అంకె ఉన్నచోట నుండి మొదలు. నాల్గవది నాలుగు అంకె ఉన్న చోటు నుండి మొదలు వరుసగా చదువుకోవలెను.

అర్థచిత్రమును చూపించి కావ్యము మొత్తము నడిపిన వారున్నారు. పింగళి సూరన 'రాఘవ పాండవీయము' ద్వ్యర్థిని, రామరాజభూషణుని హరిశ్చంద్ర నలోపాఖ్యానము- ద్వ్యర్థిని, ఎలకూచి బాలసరస్వతి 'యాదవ రాఘవ పాండవీయము'-అనుత్ర్యర్థి కావ్యమును అర్థచిత్ర ప్రధాన కావ్యములుగా పరిగణింపవచ్చు.

ఇతర చిత్రములు:- తిరుపతి వెంకట కవులు పద్యములలో అచ్చతెలుగునే వాడుట (ఒకటి రెండు పద్యములు) చిత్రము. మిన్నికంటి వారు తన పేరును పద్యములో వచ్చునట్లు వ్రాయుట మరియొక చిత్రము. పద్యము మొత్తముపై ప్రాసయతిని పాటించుట ఇంకొక చిత్రము. దీనిని ఎఱ్ఱన అరణ్య-(6-369) మరియు (7-350) పద్యములలో చిత్రించెను. ఇటువంటివి తెలిసో తెలియకో కొందరు కావ్యముల నిబంధించిరి. కొంతమంది కవులు కావాలని పనిగట్టుకొని యిటువంటి చిత్రకవితారీతులు, వాని భేద రూపములను తమ కావ్యముల చిత్రించిరి.

ఇట్లు సాహిత్య సాగరమును మథించుచున్న కొలది చిత్రకవితకు సంబంధించిన చిత్రవిచిత్ర రత్నములు బయల్పడుచునే యుండును.

# నవభారతి

సాహిత్య. సాంస్కృతిక మాసపత్రిక

ఏప్రిల్, 1980

సంపాదకుడు:
చదలవాడ పిచ్చయ్య

మూల్యం : రెండు రూపాయలు

నవభారతి కార్యాలయము
3-4-1008/1, బర్కత్‌పుర
హైదరాబాదు - 500 027

# విషయ సూచిక



# నవభారతి

సాహిత్య సాంస్కృతిక మాస పత్రిక

సంపుటి 8] హైదరాబాదు * మే, 1960 [సంచిక 7


## జాతీయాదాయము - పరిష్కారమార్గము

స్వతంత్ర భారత దేశములో మానవ జీవన విధానమునకు స్థాయిని పెంచవలయునని చెప్పబడుచున్నది. మానవ జీవన విధానమునకు స్థాయిని పెంచుటకు గాను ఆర్థిక విధానమును పెంపొందించ వలయునని చెప్పబడుచున్నది. మానవ జీవన విధానము ఆర్థిక జీవన విధానమునకు జతపరచబడి ఆర్థిక వనరులు పెంచబడినపుడే ఉన్నత విధానము సంతృప్తికరముగా కొనసాగించబడునని తెలియ జేయబడుచున్నది. జీవన స్థాయిని పెంపొందించుకొనుటకు బుద్ధి బలమును పెంపొందించుకొన వలయునా ? లేక ఆర్థిక సంపత్తిని పెంపొందించుటకు ప్రయత్నించవలయునా ? ఏది ప్రాధాన్యము వహించవలయును ఇందుకు సమాధానము ఎవరు చెప్పవలయును ?

భారత జాతీయాదాయములో హెచ్చు భాగము ఎవరి కొరకు వినియోగింపబడుచున్నది. చెప్పబడుచున్నదా ? ఆదాయ వ్యయముల పట్టికను తయారు చేసి దేశ సంపత్తి ఎప్పటికప్పుడు పెరుగుచున్నదని చెప్పబడుచున్నది. సంపత్తుకు పరిశ్రమలకు సంబంధము కల్పించబడి యున్నది. మానవ పరిశ్రమలు స్థాపించబడినవి. పరిశ్రమలలో ఉత్పత్తి పెంచబడినది; ఈ పెంచబడిన ఉత్పత్తిని మానవ ప్రయోజనమునకు వినియోగించబడుచున్నవని చెప్పవలయును గదా ! ఇందుకు సమాధానము చెప్పబడుట లేదనియే గ్రహించవలసి యున్నది మార్కెట్ల ప్రయోజనమే ఉత్పత్తి పెంపకమునకు దోహదము చేయుచున్నదని యనుకొనవలయునా ? లేక మానవ వ్యాపారమే మానవ జీవన విధానమునకు అధిక్యత కల్పించబడుచున్నదని యనుకొనవలయునా ? ఇది మన నేటి భారత జాతీయ సమస్య యని అందరు గుర్తించుకొని ఇందుకు తగిన పరిష్కారము సూచించవలసియున్నది.

ప్రథమముగా వ్యక్తి నేర్పరితనమును పెంపొందించుకొనుటకుగాను ఏ యే ప్రయత్నములు జరుపబడుచున్నది పాలకులు పాలితులకు చెప్పవలసి యున్నది. పాలకులు పాలితులకు పత్రికల ద్వారా వార్తలను సమకూర్చి ఈ వార్తలే మానవ జీవన సమస్యలను పరిష్కరించగలవని యనుకొనవలయునా ? పాలితులు ఏమనుకొనవలయును ? పాలితులకు పాలకులకు ఏ సంబంధ బాంధవ్యములు కలగియుండవలయును ? ఈ సంబంధ బాంధవ్యములను ఎవరు ఎవరికి తెలియజెప్పవలసియున్నవి ? స్వతంత్రము వచ్చిన ప్రయోజనము ఏ విధమున పాలకులు పాలితులకు తెలియజేయబడుచున్నది వివరించి చెప్పవలసిన బాధ్యత ఎవరిదై యున్నది ఎవరు చెప్పవలయును ? పాలితులు పాలకులకు చెప్పవలయునా ? ఇది నేటి జాతీయ జీవన స్థాయిని పెంచుకొనుటకు ఎవరు ఎవరికి సమాధానము చెప్పవలయును ?

నేటి జాతీయ జీవనమును గురించి గానీ, జీవన విధానమును గురించి గానీ ఏ విధానము ననుసరించి ఏ తీరున ఎవరు ఎవరికి చెప్పుచున్నది ఎటుల తెలుసుకొనవలయునో దురూహ్యముగా ఉన్నది. పాలకులు పాలితులై అనేక విధముల పన్నులను పెంపొందించుచు ఈ పన్నుల వలన రాబడిన జాతీయాదాయమును ఏ క్రమముననుసరించి ఖర్చు చేయబడుచున్నది స్పష్టమైన తీరులలో పాలకులు పాలితులకు ఏ విధానము ననుసరించి తెలియజేయుచున్నది నేటి వరకు తెలియకున్నది.

తలసరి ఆదాయము పెంచబడినదని ఆర్థిక శాస్త్రవేత్తలకు వారిచేత చెప్పించబడుచున్నది. ఈ చెప్పించబడిన దానిలోని మార్గమును విప్పి చెప్పక అర్థశాస్త్ర ప్రయోజనమనునది తలసరి ఆదాయము పెంపొందించుటయేనని చెప్పబడుచున్నది. ఆర్థిక శాస్త్రవేత్తలనబడువారు ఎవరిచేత సృష్టించబడిరి ? ఈ ఆర్థిక శాస్త్రవేత్తలు జాతీయాదాయమును ఏ విధానము ననుసరించి లెక్కకట్టి తలసరి ఆదాయము పెంపొందింపజేయుచున్నారని అనుకొనవలయును ? జాతీయాదాయ ప్రయోజనా ప్రయోజనములను ఎటుల అవగాహన చేసుకొని ఏ విధానము ననుసరించి తలసరి ఆదాయ ప్రయోజనము పాలితుల కందరికి చెందుతున్నదని నిర్ణయించుకొనవలయును ?

పాలకుల సంఖ్య తక్కువ. పాలితుల సంఖ్య ఎక్కువ. ఈ ఎక్కువ భాగానికి చెందిన మానవులకు ఈ తక్కువ భాగానికి చెందిన మానవులు ప్రతినిధులమని చెప్పుకొనుచు హెచ్చుమంది మానవులకు తమ కర్తవ్యమును నిర్వహించి ప్రజా జీవన స్థాయిని పెంపొందించే ప్రయత్నమును కొనసాగించు చున్నామని చెప్పుకొనుచున్న విధానములోని అవ్యవస్థాకల్పితమైన ఆపత్తును ఎవరు ఎవరికి ఎటుల వివరించిన యెడల ఈ సమస్యను మనము పరిష్కరించు కొనగలమనుకొనవలయును.

పాశ్చాత్యానుకరణ స్వతంత్ర భారత దేశములో నానాటికి హెచ్చుపెరిగిపోవుచున్నది. ఇందుకు కారణము ప్రాంతీయ పరిపాలనా విధానమును, జాతీయ పరిపాలనా విధానమును సమన్వయించుటకు గాను ఏదియో ఒక దానిని జాతీయ భాషగా చేసుకొనవలసి యున్నది. ఎప్పటి వరకు జాతీయ భాష ఏర్పడదో అప్పటి వరకు ప్రాంతీయ విభేదములతో ఎక్కడికక్కడ ప్రతిఘటన ఏర్పడి భారతీయులందరు భారత జాతీయ ప్రయోజనమునకై సమష్టి కృషి చేయవలసి యున్నదో ఆ కృషికి భంగము కలిగించుటకు నేడు ఆంగ్లేయ భాష తోడ్పడుచున్నదని ప్రతి భారతీయుడు అవగాహన చేసుకొనవలసి యున్నది. జాతీయ ప్రయోజనమును ప్రధానముగా నెంచుకొను ప్రతి ఒక్కరు భిన్న భిన్న ప్రాంతములు కలిగి భిన్న భిన్న భాషలు కలిగిన కోటానుకోట్ల ప్రజలకు జాతీయ సమైక్యతా ప్రయోజనమును సమకూర్చుకొనుటకు గాను భారతీయ పరిపాలనకు జాతీయ భాషను సమకూర్చుకొనవలసి యున్నదని గ్రహించిన నాడే జాతీయాదాయము పెంపొందించుకొనుటకు, తలసరి ఆదాయము సమకూర్చుకొనుటకు భారతీయులందరు సమైక్యమైన కృషి చేయవలసి యున్నదని గ్రహించగలరని యనుకొనవలయును. ఇది జాతీయ అభివృద్ధికి తోడ్పడు విధానమని గ్రహించినచో జాతీయ భాషను భారతీయులందరు ఏదో ఒక భాషను వ్యవహరించి తదాచరణకు పూనుకొనవలసియున్నదని గ్రహించవలయును.

# ఆశ నిరాశలు

గుమ్మనూరు రమేష్‌బాబు

నిట్టూర్పుల లోగిళ్లోంచి
ఊపిరి పోసుకొచ్చావు నీవు—
నిరాశా తీతువువి.
గుండె నిబ్బరపు వెన్నెట్లోంచి
పొంగి పొరలి వచ్చాను నేను—
ఆశా చకోరికని.
బ్రతకడం చేతకాని నీకు భవిష్యత్తెక్కడ?
బాధా భయం లేని నా నమ్మకకు భంగ పాటెక్కడ?
నిస్పృహ, నిస్త్రాణము నీ కున్న అంటు జాడ్యాలు...
లక్ష్యశుద్ధి, దీక్షాశక్తి నాలోని ఆణిముత్యాలు...
నిర్భాగ్య నిశీధ నిద్రాణ మంటే నీవే!
నియమబద్ధ నిర్దిష్ట ప్రాతిపదిక నంటే నేనే!
పైగా నీ వాసం...
నిబిడాంధ కార పాతాళ కుహ్వరం!
మరి నా ఆసనం...
విశ్వాభ్యుదయ సుభిక్ష ధర్మ క్షేత్రం!
నీ గాత్రం...
వ్యథాకులిత సంక్షోభరాగం!
సదా దుఃఖమయం!
మరి నా నేత్రం...
సుచిర సుహృద్దీవ చైతన్య సోయగం!
అజరామర సుందర తారామయం!
అందుకే...
ఓ నిరాశా! నీ కిక సెలవు
ఈ ఆశకే యిక యీ నెలవు
నీ కిక వీడుకోలు!
రమ్మంటూ నాకు వేడుకోలు!

# పూఁ మా లి క

మిన్నమరెడ్డి శ్రీదేవి

నది మధ్యలో ఓడమీద ప్రయాణం చేస్తున్నాను. నది మధ్యలో ఓడ. నది చుట్టూరా ఆల్ప్స్ పర్వతాలు. ఆ పర్వతాలపై అందమయిన మంచు తొలి భాస్కరుని కిరణాలతో నదిలోని అలలన్నీ మెరిసిపోతూవుంటె - ఆ ప్రకృతి రామణీయతను గాంచిన నా మనసు—ఆ ప్రభాత వేళ—ప్రభుని సృష్టిలోని విలాసము దర్శించి - ఆ సెలయేటి గలగలల్లో మధుర సంగీతాలు విని పులకించిన నా హృదయం పొందిన దివ్యానుభూతి ఈ "పూఁమాలిక".

ప్రభూ !
ప్రభూ !!
ఈ అలల కడలిలో - నవరాగ భావాల
మదిమైమరచి - యదపులకించి
కనువిందైన అందాలలో - రస పథాల
దివ్య లోకాల కేగె నా డెందమె
గిరిరాజు ప్రియమార కౌగలించగ — హిమకన్య
వలపు కౌగిళ్ళ — సిగ్గుల — కరిగి సొగసుల వాగై నిండె
ఆ వయ్యారాల సొగసులన్ని — నిలించె అద్దిన
రంగుల మేళవింపులో-అలరింపులో రూపొందించిన చిత్రరేఖయేగా!
సడిగాలి సవ్వడిలో — మధుగీతమే రవళించె
కడలి అలల కదలికలో—స్వరరాగజితులు మేళవించె
పరవశించిన ఎద, యద — లోపలి సొదలన్ని
నవరాగ మాలికలై — సుధలు చిందించగ.
విశ్వమోహన గాయకుడైన — నీ మృదు మధుర
గళమందు నిలిచి — గానమై
కమ్మగా గాన మాలింప బడి
విశ్వ ప్రకృతీ రమణి ధన్యమయ్యె !!
ప్రభూ !!!
నీ సామగాన మాలకించి
ఆ సౌందర్య లహరి తేలి
ఆ భావములో — ఆ రాగసులో — ఆ గానములో
మైమరచిన నాదు జన్మ!
నీ శుభ చరణాల ప్రభసించె దీప కళికగా
నీ ఫాలస్థలిపై మెరిసే కస్తూరి తిలకముగా
నీ గళ సీమ నలరించిన పూఁమాలికగా
నీలో — నిండిపోవు శుభ వేళెపుడో — ఆ శుభ వేళెపుడో !!!

# భారతము - భారతీయ విజ్ఞాన సర్వస్వము

వి. దొరస్వామినాయుడు

పరిశోధక విద్యార్థి, తెలుగుశాఖ

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి

ప్రాచీన భారతీయుల విజ్ఞానమును. నాగరికతను వివరించు సద్గ్రంథములలో వ్యాస ప్రణీతమైన మహాభారతము ముఖ్యమైనది. భారతమున మానవుని భౌతిక మానసికాధ్యాత్మిక జీవితము ప్రతిబింబింపబడియున్నది. ధర్మాధర్మముల, న్యాయాన్యాయముల, పుణ్యాపాపముల మధ్యగల సంఘర్షణే భారత యుద్ధము. అందలి పాత్రలు మానవుని నైతిక జీవితమున కాదర్శము లగుచున్నవి. భారతము విజ్ఞాన శాస్త్రము. విజ్ఞానమనగా విశిష్టమైన జ్ఞానము. ఈ జ్ఞానము అనుభవ సిద్ధమగుట విజ్ఞానము. ఆత్మానాత్మవివేకానుభవమే విజ్ఞానము. భారతమునందున్న విషయములు లౌకిక జీవితమునకు సంబంధించినవే. లౌకికులగు మానవ జీవిత విశేషములను వివరించుటచే భారతము మానవ విజ్ఞాన కోశమగుచున్నది. "భారతము సర్వ విషయ కోశము. మానవ ప్రకృతి వివిధ భిన్నత్వమును వర్ణించిన గ్రంథములో దీనికి మించినది ప్రపంచ వాఙ్మయమున ఇంకొకటి లేదు. నేటికిగాని, రేపటికిగాని సరిపోవునట్లు ఇందు ఏదో ఒక రూపములో వర్ణింపబడని వ్యక్తి జగత్తున లేదు-ఉండబోదు" అని మరుపూరి కోదండరామిరెడ్డిగారు నిర్వచించిరి. ఇతివృత్తము లౌకికమును, దన్మూలమున ప్రతిపాదితమగు విషయ మాధ్యాత్మికము నగుటచే భారతము లోకకల్యాణ సిద్ధి కుత్కృష్ట సాధనమగుచున్నది.

"కమనీయ ధర్మార్థ కామ మోక్షములకు
నత్యంత సాధనంబైన దాని"

అని తిక్కన భారతమునందు తెలిపెను. దీనిని బట్టి పురుషార్థములకు మూలము భారతమని చెప్పినట్లయినది. డాంటే రచించిన 'డివైన్ కామిడీ' ఇటలీ దేశస్థులకును, హోమరు రచించిన 'ఇలియడ్' గ్రీకులకును, షేక్సుపియర్ నాటకములు, మిల్టన్ 'పారడైస్ లాస్ట్' అను గ్రంథ మాంగ్లేయులకును, నెట్లు జాతీయ జీవిత సర్వస్వములో అట్లే భారత మాంధ్రులకు జాతీయ జీవిత సర్వస్వమగుచున్నది. విజ్ఞాన దాయకమైనలక్షణములు ఏవిధముగా భారతమునందు ప్రతిబింబింపబడియున్నవో ఈ వ్యాసమున తెలిసికొందము. భారతములోని విజ్ఞానదాయకమగు విషయములన్నియు ఈ వ్యాసమునందు పొందుపరచుటకు వీలులేదు. ఆ కారణముచేత కొన్ని విజ్ఞాన లక్షణములు మాత్రము ఇందు తెలుపబడినవి.

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మ విదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవి వృషభులు మహా కావ్యమనియు

లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికులు ఇతిహాసమనియు
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్ఛ
యంబని మహిఁ గొనియాడుచుండ

వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసు
డాది ముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు-ఆది 1 ఆ-31.

వ్యాసుడు వ్రాసిన భారతమును నన్నయ ఈ విధముగ ప్రశంసించినాడు. ధర్మశాస్త్రముగను, వేదాంతముగను, నీతిశాస్త్రముగను, మహాకావ్యముగను, సర్వలక్ష్య సంగ్రహముగను, ఇతిహాసముగను, బహుపురాణ సముచ్ఛయముగను లోకమున కొనియాడబడుచున్నదని నన్నయగారు వ్రాసిరి. భారతము ధర్మశాస్త్రముగాని, వేదాంతముగాని, నీతిశాస్త్రముగాని, లక్షణ గ్రంథము గానికాదు. ఆయా లక్షణములు మాత్రము సందర్భానుగుణముగ నిక్షిప్తమైయున్నవి. భారతము కావ్యముగాని, పురాణముగాని, ఇతిహాసముగాని కావలయును. పురాణేతిహాస కావ్యలక్షణములు భారతమునందు సంపూర్ణముగ నున్నవి.

## భారతము – ధర్మశాస్త్రము

భారతమును ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రమనుచున్నారు. ధర్మము సార్వకాలికమైనది. ధర్మము దేశ సంఘ కాలానుగుణములను బట్టి మారునది కాదు. భారత కథ జరిగిననాటి ధర్మమునకును, ఈనాటి ధర్మమునకు భేదములేదు. పుణ్యకర్మకు ధర్మమని, పాపకర్మకు అధర్మమని పేరు. లోకులకు సుఖదుఃఖములు వారి వారి ధర్మాధర్మములను బట్టియే ప్రాప్తించుచున్నవి. సుఖదుఃఖములలో గోచరించు తారతమ్యము చేతనే ఏర్పడుచున్నది అర్థకామములైనను వారివారి ధర్మమును బట్టియే ప్రాప్తించును.

"ధర్మాదర్థశ్చ కామశ్చ స కిమర్థం న సేవ్యతే" అను మహాభారతములోని వేదవ్యాస వచనము ఉద్ఘోషించుచున్నది.

"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా"

అని సమస్త జగత్తునకు ఆధారమై యున్నది ధర్మము. ఏది ధర్మమో యేది అధర్మమో తెలుపునట్టివి వేదశాస్త్రములు.

పురాణ న్యాయ మీమాంసా
ధర్మశాస్త్రాంగ మిశ్రితాః
వేదాః స్థానాని విద్యానాం
ధర్మస్యచ చతుర్దశః

లోకమున ధర్మముచెప్పువానిని సత్యముచెప్పుచున్నాడనుట ప్రసిద్ధమై యున్నది. ఇట్టిధర్మము భగవంతునిచే నిర్దిష్టము. ధర్మసంస్థాపనార్థమై భగవంతుడు ప్రతియుగము నందావిర్భవించుచుండును.

శ్లో॥ యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్

ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే అని భగవంతుడుద్ఘోషించెను.

ప్రధానముగా భారత యుద్ధము ధర్మాధర్మముల, సత్యాసత్యముల మధ్య జరిగినది. ధర్మపరులు పాండవులు. అధర్మపరులు కౌరవులు. కథానాయకుడు శ్రీకృష్ణుడు. అధర్మపరుడైన దుర్యోధనుడు శకుని సహాయముతో జూదమున ధర్మజుని ఓడించి, ఏకవస్త్రధారియైన ద్రౌపదిని కౌరవ సభకీడ్పించి, వస్త్రముల

లాగించెను. తత్పర్యవసానముగా జరిగినది భారతకథ. పతివ్రతా శిరోమణియైన ద్రౌపదిని అవమానము చేయుట అధర్మము. దుర్యోధనుడు కపటద్యూతమున ధర్మజుని మోసగించుటయేకాక, అరణ్యాజ్ఞాత వాసములు గడిపిన తరువాత కూడ పాండవుల భాగమియ్యకుండుట అధర్మము. రాయబారియై వచ్చిన కృష్ణుని బంధించుటకు ప్రయత్నించుట అధర్మము. తమ పత్నిని యవమానించుచుండ, అగ్రజుని ఆజ్ఞకు బద్ధులై యుండుట పాండవుల ధర్మనిరతికి నిదర్శనము. భారతమునందు ప్రతి సన్నివేశమునందు ధర్మనిరతి కన్పించును. భారతమునందున్న పాత్రలన్నిటిలోను ధర్మాధర్మముల నిర్ణయించుటకు శ్రీకృష్ణుడవతరించినాడు. శ్రీకృష్ణుడు అర్జునకుపదేశించిన విషయమంతయు ధర్మప్రబోధకమైనది. పాండవులు కౌరవుల నోడించి రాజ్యము పాలించిరి. అనగ ధర్మము గెలిచినదని అర్థము. ఇదొక లోకానుభవము. మానవులు ధర్మనిరతులై ఉండవలెనని, అధర్మపరులుగా నుండరాదని బోధించినది భారతము.

"వినుమనేక విధంబుల విస్తరిల్లు
ధర్మముల యందొకండును దలప నిష్ఫ
లంబులే దాత్మ మోక్షావలంబియైన
ధర్మ ముత్తమమండ్రు తత్త్వజ్ఞులధిప"

అని సర్వోత్తమంబగు ధర్మస్వరూపము భారతమున వివరింపబడినది. భీష్మోపదేశము తోడి శాంతి, అనుశాసనిక పర్వములయందు కొనసాగింపబడిన విషయము ధర్మప్రతిపాదితమగుచున్నది. ఈవిధముగ ధర్మతత్త్వ స్వరూపమును తెలియజేయుటచే భారతము ధర్మశాస్త్రమగుచున్నది.

## భారతము - వేదాంతగ్రంథము

భారతమును ఆధ్యాత్మ విదులు వేదాంతమనిరి. భారతము పంచమ వేదముగా పరిగణింపబడుచున్నది. వేదములునాలుగు. అవిఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము. ఒక త్రాసునందు ఒక ప్రక్క నాలుగు వేదముల సారము, మరొకవైపు భారతములోని వేదాంత సారముంచినచో భారతమున్న ప్రక్కనే బరువు అధికముగా నుండును. అనగ నాలుగు వేదములలో లేని వేదాంతము భారతమునందున్నదని తెలియుచున్నది. వేదము ధర్మాధర్మములను తత్సాధనములను నిశ్శ్రేయసమును బోధించునది. వేదవాఙ్మయమందలి ప్రతి భాగమును ఆర్యుల జీవితమందలి యొక్కొక్క భాగమునకు వ్యాఖ్యా రూపక వివరణమువలె నొప్పుచున్నది. వేదములు ఆర్యుల యాధ్యాత్మిక సంపదకు ప్రమాణములై వారి ఔన్నత్యమును చాటుచున్నవి. ప్రాచీన వేదవాఙ్మయమునందు సురాసుర సంఘర్షణము నితివృత్తముగ గల్గిన కథలుదాహృతములై యున్నవి. భారతము నందు కురుపాండవుల కథ ప్రధానమైనది. పాండవులు దేవతల అంశమునందుద్భవించిరి. కావున పాండవులకు దైవత్వము సిద్ధించినది. కౌరవులు అసూయాపరులు. ఇతరుల కలిమిని జూచి ఓర్చుకొను స్వభావము లేనివారు. కావున కౌరవులు అసురులు. ఈ సురాసుర సంఘర్షణ నితివృత్తముగానున్నది గావున భారతమునకు వేదతుల్యత్వము లభించినది. లోకమున పుణ్యపాపములకు జరుగు నిరంతర సంఘర్షణ యిట్లు కథారూపమున ప్రతిపాదితమైనది. పరమేశ్వరుని సర్వశక్తిత్వ సర్వజ్ఞత్వములును, సంచిత కర్మపరిపాక ప్రాబల్యమును భారతేతివృత్త సాహాయ్యమున ప్రత్యక్షీకరింపబడినది. వేదశాఖలకు చెందిన వైదిక వాఙ్మయ సర్వస్వము భారతమున ప్రతిపాదితమై యున్నది. శాంతి, అను శాసనిక పర్వగతమగు నాధ్యా

త్మిక తత్త్వ ప్రకృతి రహస్యాదులన్నియు ధర్మజుని కర్మయోగి నొనర్చుట కుపకరించినవి. కృష్ణుడు అర్జునునకుపదేశించిన హితమంతయు వేదాంతమునకు సంబంధించినదే. మానవుని ఆత్మ జీవాత్మ, పరమాత్మల కలయికతో కూడు కొనియున్నది. ఏ పనియైనా చేయదలచినచో ఆ పని చేయదగినదా? చేయరానిదా? అను సంఘర్షణ ఏర్పడును. ఈ సంఘర్షణ జీవాత్మ పరమాత్మల సంఘర్షణే. సత్పురుషులందు పరమాత్మ తత్త్వమధికముగా నుండును. దుర్జనుల యందు జీవాత్మ స్వరూపమధికమగుట వలన వారు లౌకిక వాంఛలకు లోనై ఉందురు. ఇది వేదాంత తత్త్వ విషయమునకు సంబంధించినది. జీవాత్మ ఉత్కృష్ట స్థాయికి పొందినపుడు పరమాత్మ స్థితినందగలదు. ఈ విషయము భారతము నందు ప్రతిపాత్రయందును కన్పించును. జీవాత్మ పరమాత్మైక్యమును బోధించు నద్వైతము భారతమున ప్రతిపాదితమైనది. భారతీయుల జీవితమున నాటికిని నేటికిని గూడ ప్రాధాన్యము వహించియున్నది మతమే. వేదాంత గ్రంథములు ధర్మార్థ కామమోక్షములను ప్రయోజనములుగ పోషించుచు, నాముష్మికమును జీవిత ధ్యేయముగ బోధించుచున్నవి. లౌకికమగు భారతేతి వృత్తమునాధారముగఁగొని పరబ్రహ్మస్వరూపమును, విధి ప్రభావమును, లోకులకు వ్యక్తపరచి, సత్య ధర్మములను సంఘమున ప్రతిష్ఠించుటయే కవిత్రయము వారి యుదాత్తాశయము. ఉపనిషత్సారమంతయు భారతమునందు ప్రతిపాదితమగుట వలన వేదాంత గ్రంథమగుచున్నది. భారతమునకు వేద గౌరవమును గూర్చుచున్న పర్వములు శాంతి, అనుశాసనిక, అశ్వమేధపర్వములు, ఈ విషయములనుబట్టి భారతము పంచమ వేదముగా పరిగణింపబడుచున్నది.

## భారతము - నీతిశాస్త్రము

భారతమును నీతి విచక్షణులు నీతిశాస్త్రమని కొనియాడిరి. నీతి అనునది ఒక జాతికి, ఒక సంఘమునకు కట్టుబడి యుండునది కాదు అది దేశకాల సంఘ పరిస్థితులను బట్టి మారుచుండును. ఒకజాతికి నీతిగా పరిగణింపబడు విషయము మరొక జాతికి అవినీతిగా నున్నది. ఉదాహరణమునకు మహమ్మదీయులకు పినతండ్రి లేక పెద్ద తండ్రి కుమార్తెను వివాహమాడుట ఆచారము. ఇది మహమ్మదీయులకు నీతి. వరుసకు చెల్లెలు కావలసివచ్చుటచే హిందువులు వివాహమాడరు. కావున ఇది హిందూ జాతికి అవినీతి. భారతము నాటికి సంఘమున నీతిగా నున్న విషయములను తెలిసికొందము. 'దేవర న్యాయము' అను నీతి యుండెడిది. భార్యకు బిడ్డలు లేనపుడు భర్త తన వంశము వారిని తీసికొనివచ్చి భార్యతో కలుపును. తద్ద్వారా వారి వంశోద్ధారణ జరుగును, దీనిని దేవర న్యాయము అందురు. ఇది హిందూ సాంప్రదాయకముగా అవినీతి. భారతమున ద్రౌపది పాండవు లయిదుగురికి భార్యయగుట నీతి. నేటి సమాజములో బహు భర్తృత్వము అవినీతి. అయితే కొన్ని జాతులలో ఇప్పటికి బహు భర్తృత్వము గల జాతులున్నవి. భారత కథ ఇండో ఆర్యులలో బహు భర్తృత్వము సదాచారమై యుండిన కాలమునకు సన్నిహితమై యుండును. పాండురాజు 'ఒక ఆలుకు ఒక మగడు' అనునది తన కాలమునకు కొత్త అని, పాత దినములలో స్త్రీలు విచ్చలవిడిగా ఉండేవారని కుంతితో అంటాడు (ఆది-128 అధ్యా. ద్రావిడ ప్రతి-సంస్కృతం) కాబట్టి, ద్రౌపది ఐదుగురిని పెండ్లాడుట సామాన్య విషయము. పాండవులు పుట్టి పెరిగినది శతశృంగము. ఈ ప్రదేశమున బహుభర్తృత్వ

మున్నది. కొన్ని జాతులలో ఈ కుల కట్టు బాటు ఇప్పటికీ ఉన్నది.

సామాన్యముగ ఉపాఖ్యానములన్నియు నీతి బోధకములై ఉండును. భారతమునందున్న నలోపాఖ్యానము, హంసకాకీయోపాఖ్యానము వంటి ఉపకథలు నీతిని బోధించుచున్నవి. శల్యుడు కర్ణునకు హంసకాకీయోపాఖ్యానమును వివరించెను. ఈ ఉపకథయందు కోమటి యింటియందు ఎంగిలి తిండి తిని బలిసిన కాకి, హంసతో పందెము వేయును. ఆ పందెము సముద్రముమీద పరుగిడుట. చివరకు కాకి నడి సముద్రములో మునుగును. హంస తన రెక్కలతో కాకిని గట్టుకు చేర్చెను. నీవు దుర్యోధనుని ఎంగిలి తిండి తిని కాకి వలె మదించినావడవు. అర్జునుడు హంసతో పోల్చదగినవాడు. అతనితో నీవు యుద్ధము చేయలేవని నీతి ఈ ఉపాఖ్యానమునందు తెలుపబడినది. ఇట్లే భారత ఉపకథలందు నీతి వివరింపబడి యున్నది. ఉద్యోగపర్వములో ప్రధానముగ మూడు రాయబారములు జరిగినవి. 1. ద్రుపద పురోహితుని రాయబారము 2. సంజయుని రాయబారము 3. కృష్ణ రాయబారము. ఈ రాయబారములందు ప్రధానముగ నీతి, అవినీతి మధ్య సంఘర్షణ ఏర్పడినది. ద్రౌపదిని చీరలు పీకించినపుడు చూచుచుండిన ధృతరాష్ట్రుడు తన నూర్వురు తనయులు కోల్పోయినపుడు దుఃఖించినాడు. తండ్రి బ్రతికియుండగ తనయులు మరణించినచో అది తండ్రి చేసికొన్న ప్రారబ్ధ ఫలము. అధర్మము జరుగుచుండగ చూచుచు ఊరకుండరాదు. ప్రతిఘటించుటకు ప్రయత్నించవలయునని నీతిని బోధించినది భారతము. ఇట్లు ప్రతి సన్నివేశములో నీతి యుండుటబట్టి భారతము నీతిశాస్త్ర మగుచున్నది.

## భారతము - మహాకావ్యము

భారతమును కవి వృషభులు మహా కావ్యముగ ప్రశంసించినారు. భారతీయాలంకారికులు ఆనంద, సందేశములు కావ్య ప్రయోజనముగా పేర్కొనిరి. తిక్కన భారతమున "ఆంధ్రావళి మోదముఁ బొరయునట్లు" గా తన కృతి యున్నదని పేర్కొనెను. అనగ ఆనందదాయక మని తిక్కన భావన. ఔచిత్య పోషకమై, అనౌచిత్య పరిహారమై, హితోపదేశజనకమైన కావ్యమును ఉత్తమ కావ్యముగా పేర్కొనవచ్చును. భారతము ప్రాచీన విజ్ఞానమునంతయు సులభగ్రాహ్యమగు విధమున బోధించుచున్నది. ఇతివృత్తము లౌకిక మగుటచే సంస్కృత వాఙ్మయమున భారత మహాకావ్యమున కొక విశిష్ట స్థానమున్నది. సత్యాసత్యములకు, ధర్మాధర్మములకును, దైవరాక్షస భావములకును జరుగు సంఘర్షణమీ యితివృత్తమున పోషితమై యున్నది. కావ్యమునకు విశిష్టత నాపాదించు గుణములలో సమగ్రేతి వృత్తపోషణ మొకటి. మౌసలపర్వ మిట్టి ఉత్కృష్ట కావ్య లక్షణములతో నొప్పు నుదాత్త రచన. ఇందలి ఇతివృత్తము యాదవుల దురాగతము వారి వంశ వాశనము. వస్తువుదాత్తమును, ప్రఖ్యాతముగ నున్నది. కథానాయకుడు శ్రీకృష్ణుడు. విరాట పర్వములో ద్రౌపది కీచకునితో నర్తనశాల సంకేత స్థలముగా నిర్ణయించును. ఆ సంకేత స్థలమునకు కీచకుడు విచక్షణజ్ఞాన రహితుడై వివిధాభరణములతో నిస్సందేహముగా వచ్చెను. కాని కార్యాలోచనుడైన భీముడు పురాపరములు జాగ్రతతో పరిశీలించి తర్వాత లోనికి ప్రవేశించినాడు. కార్యలోచనపరుని, విచక్షణ జ్ఞానము లేని విభిన్న వ్యక్తుల మనస్తత్వము ఈ కావ్యమునకు ఔచిత్యము నాపాదించుచున్నది. ఉద్యోగపర్వములో రాయబార సన్ని

వేళమున నాటకీయ లక్షణములు పాటింపబడి నవి. ద్రుపద పురోహితుని రాయబారము ఫలితముగా ధృతరాష్ట్రునిలో కలత పుట్టినది. సంజయుని పిలిచి పాండవులకు అర్ధభాగమియ్య కుండునట్లు, వారికి యుద్ధమను తలంపురాకుండు నట్లు రాయబారము చేయవలయునని కోరెను. సంజయుడు ఉపప్లావ్యవనమునకు వచ్చి ధర్మజు నితో అస్తోక పుణ్యాఢనుడు మీ తండ్రి మీ క్షేమము తెలిసికొనుటకై నన్ను పంపినాడని చెప్పెను అందులకు ధర్మజుడు

'ఆరాజు మాదెసం గల
కారుణ్యము కతమున సుఖంబున నిట్లు
వ్వారము' అని 'ఎత్తుకు పై ఎత్తేసే మెత్తని పులి'గా మాట్లాడినాడు. అందులకు సంజయుడు పాండవుల సైన్య పరాక్రమముల పొగడుతూ, సురులకైన సాధ్యముకాదని వర్ణించెను. అటు తర్వాత కౌరవుల సైన్యమును పొగడుతూ 'స్థాణునకైన జయింపగ వీలు కాదని' వర్ణించెను. పాండవులను జయించుట దేవతల వలన, కౌరవులను జయించుట ఈశ్వరుని వలన సాధ్యము కాదనుటలో ఒక అంతర్యమున్నది. దేవతలనుట ఏమిటి ? సాక్షాత్తు ఈశ్వరుడే ఎదురువచ్చి పోరాడిన పరాజయము పొందువారుకారు కౌరవులని తాత్పర్యము. కౌరవులపరాక్రమముపాండవులపరాక్రమముకంటె మిన్నయని సంజయుని యభిప్రాయము. ఈ అభిప్రాయము గుర్తించి ధర్మరాజు తన తమ్ముల పరాక్రమమును వివరించి భయ పెట్టును. ఇట్లు సంజయ రాయబారము నందున్న వ్యంగ్య సంభాషణా రీతి కావ్యమున కౌచిత్యము నాపాదించుచున్నది.

బీభత్సవమైన యుద్ధరంగమును అద్భుత శృంగారంగముగా వర్ణించడము తిక్కన కావించిన కావ్యశిల్పములలో నొకటి. కౌరవుల సైన్యము పగలు యుద్ధముచేసి రాత్రి ఏనుగులపై నిద్రించు సన్నివేశము

తరుణుల కుచములపై రతి
పరవశులై మొఱగు పతుల పగిది సమరసం
భరిత శ్రమమున నిద్రిం
చిరి కరికుంభములఁజెంది చెన్నుగ జోదుల్
—ద్రోణ-5-278

భీష్ముని నిష్క్రమణచే కౌరవుల దైన్యస్థితి వర్ణన పరికింపుడు.

చం॥ పతిరహితాత్మయైన సతిభంగియు గోపక
హీనమైన గో
ప్రతతి విధంబు సస్యవిదుర స్థితియైన ధరిత్రి
చాడ్పును
ద్గత హరిశూన్యమైన వసుధాధర కందర
భూమిచందమున్
మతి మనసేనదోఁచె బుధమాన్యుఁడు
భీష్ముఁడు లేక యుండుటన్.

శల్యపర్వములో యుద్ధవర్ణన గమనింపుడు.

సీ॥ నెత్తుటఁదోగియు నిగిడిపోరెడువీరు
లలరిన వడమోదుగుల విధంబు
గ్రక్కునఁ దెగిపడి కదలెడు తాలుదం
డములు మహోభుజంగముల భంగి
యవని రక్తార్క్తంబులై యున్న యట్టి జల్
దలలు గెందామర కొలని పగిది
దళముగా వెలిదప్ప నొఱగిన గజములు
గులిశ భగ్నాచల కులమునట్లు
దునిసి తొఱఁగిన జోదుల తొడలు సామ
జముల కరములు నొండొంటి చందములుగ
నుం గొనగ వింతలగుట సంగరాంగ
ణంబు రమణీయమును భీషణంబునయ్యె.
—శల్య. 1-129

ఉపమానములతో కూడిన ఈ యుద్ధ వర్ణనలు కావ్యమున కౌచిత్యము నాపాదించుచున్నవి. తిక్కన వివిధాలంకారములతో భీకర యుద్ధ

సన్ని వేశములను రమణీయముగ చిత్రించినాడు.

స్త్రీ పర్వమంతయు నిట్టి హృదయ విదారక శోక భూయిష్టములైన వర్ణనలతో నిండి యున్నది. కృష్ణుడు -

"సారపు ధర్మమున్ విమలసత్యము పాపము చేత బొంకుచే
భారముఁ బొందలేక చెడిపారినదైన యవస్థ దక్షతె
వ్వారు లుపేక్ష సేసిరది వారల చేటగుఁగాని ధర్మ ని
స్తారకమయ్యు సత్యశుభదాయక మయ్యును దైవముండెడున్."

అను మాటలలో ప్రత్యక్ష పాపవర్తకులేకాక, పాపమును ప్రతిఘటింపలేక యుపేక్ష వహించిన దక్షులుకూడ పాపఫల మనుభవింపక తప్పదని వివరించియున్నాడు. కావుననే గాంధారి ప్రభృతు లెల్లరును దుర్యోధన కృతఫలము ననుభవింపవలసి వచ్చినదని హితమును బోధించుటచే భారతము మహాకావ్యముగా పరిగణింపబడినది.

## భారతము - లక్షణగ్రంథము

భారతమును లాక్షణికులు లక్షణ గ్రంథముగ కొనియాడిరి. సాహిత్య సౌందర్య దర్శనము అను అలంకార శాస్త్రమునందు భయానక దృశ్యమును వివరించు సందర్భమున భారత పద్యమును గమనించవచ్చును.

కం॥ దంతిఘటా సంతానము
కుంతీసుతు నారసములఁ గూలిన తటి న
త్యంత నిబిడాభ్రముల దివి
యెంతయు సొంపారు భంగిని నెలసెలు వొందెన్.
(భార. విరా.)

వ్యంగము అగూఢము అనగా గూఢముగా నుండక స్ఫుటము వాచ్యమానమగునది అగూఢము

కం॥ నీ పలుగుల పడుటకు దుః
ఖావేశము పొందనా నిరర్థకమగు ని
య్యేవపుఁ బుట్టువు పుట్టిన
నావగ నెవ్వరికి నెక్కుఁనళిన దశాక్షీ.
(భార. వి. 3-54)

కీచక వధానంతరము బృహన్నల ద్రౌపదితో పలికిన పలుకులివి. ఈ 'యేవపు బుట్టువు' అను చోట అర్థాంతర సంక్రమిత వాచ్యరూపమైన వ్యంగ్యము అగూఢముగా నున్నది. ఇట్లే పద ద్యోతక ధ్వనికి ఉద్యోగ పర్వములో ద్రౌపది కృష్ణునితో చెప్పిన పద్యము వీర రస ద్యోతకమైనది.

ఉ॥ అంతలుచేసి పోనడిచి - నేచునె యన్న దమ్ములన్.
(భార. ఉద్యో 3-101)

అప్పకవి విశేష వళికి ఉదాహరణముగా తీసికొన్న లక్ష్యము భారతములోనిదే. తిక్కన శాంతిపర్వమున 'జ్ఞ'కారము 'క' తో యతి మైత్రి కూర్చెను. సాధారణముగ నిట్టి యతి మైత్రిగల గ్రంథములు కన్పించుట లేదని అప్పకవి ఈ వళిని విశేషవళిగా పేర్కొనెను.

శాంతిపర్వము.

కం॥ జ్ఞానము కేవల కృపన
జ్ఞానికి నుపదేశ విధి ప్రకాశము సేయం
గానది సకల ధరిత్రీ
దానంబున కంటె నధికతర ఫలదమగున్
(శాంతి 4-255)

తిక్కన ప్రయోగించిన కారణముచేత ప్రౌఢ కవులు కొందరాతని ప్రయోగము ననుసరించి జ్ఞకారముతో క, ఖ, గ, ఘ లకు యతి మైత్రి పాటించిరి. అప్పకవి తన లక్షణ గ్రంథమున దాదాపు భారతము నందలి పద్యములనే లక్ష్యములుగ గ్రహించెను. ఈ లక్షణ గ్రంథము లందేగాక లక్షణ సార సంగ్రహము, కవి జనా

శ్రయము, కావ్యాలంకార చూడామణి, ఛందో దర్పణము అందును భారతము నందలి పద్యములు లక్ష్యములుగా ఉదహరింపబడినవి.

స్త్రీ పర్వమునందు మరణించిన మగవారలను గూర్చి స్త్రీలు విలపించు సన్నివేశమున తిక్కన విశేష వృత్తములను ప్రయోగించెను. ఈ వృత్తములను మరొక తెలుగు కవి తమ కావ్యములం దుపయోగింప లేదనియే చెప్పవచ్చును. ఉదాహరణకు విదురుడు ధృతరాష్ట్రునకు దుఃఖోపశమనము చేయు సందర్భమున ఇంద్ర వజ్రవృత్తము, కృపాచార్యుడు గాంధారి నూరార్చిన సందర్భమున మణిమాలా వృత్తము, స్వాగత వృత్తము, వనమయూర వృత్తము, నర్కుట వృత్తము, బంధుర వృత్తము లున్నవి. ఇవియే గాక ఉపేంద్ర వజ్రావృత్తము, స్రగ్విణీ వృత్తము, జలధర వృత్తము, ప్రహరణ కలితవృత్తము, శిఖరిణీ వృత్తము, మంగళ మహాశ్రీ వృత్తము వంటి విశేష వృత్తములు స్త్రీ పర్వమునందున్నవి.

ఈ విధముగ భావగర్భితమైన వివిధాలంకారములు, విశేషవళి, ప్రాసములు, వివిధ విశేష వృత్తము లుండుట బట్టి భారతమును లాక్షణికులు సర్వలక్షణ సంగ్రహమనుచున్నారు.

## భారతము — ఇతిహాసము

భారతమును ఐతిహాసికులు ఇతిహాసముగా పేర్కొనిరి. "గురుపరంపరోపదిష్టమైన ప్రాచీన చరిత్రమును వర్ణించు గ్రంథ మితిహాసము." "ఇతిహ, ఐతిహ్యము" అని చెప్పబడును. ఆ ఉపదేశము ననుసరించి చెప్పిన కథయే ఇతిహాసము. పురాణాదులలోని కథ లన్నిటికి మంత్ర బ్రాహ్మణాదులలో బీజరూపముగా నున్న యితిహాసములే మూలము.

ఒక కాలమున, ఒక వంశమునకో, ఒక జాతికో సంబంధించిన చారిత్రకాంశము గలది యితిహాసము. ఇతిహాసము కథా ప్రధానము. ఇతిహాసము పురాణములవలె ధర్మప్రసంగములు, శాస్త్ర మీమాంసలు, సృష్టి రహస్యములు, నీతి బోధలు కూడ వెల్లివిరియుచుండును. ఇవి విజ్ఞాన దాయకములు. "ధర్మ తత్త్వజ్ఞులు ధర్మ శాస్త్రంబని...పరగుచుండఁ జేసె భారతంబు—" అను పద్యమును బట్టి నన్నయ భారత మితిహాసమని చెప్పినట్లయినది. తిక్కనగారును భారతము మహనీయేతిహాసమనియు, వినుతేతిహాసమనియు, ఇతిహాస రత్నమనియు, నిర్మలేతిహాసమనియు పేర్కొనిరి. ఎర్రన్నయు 'ఇమ్మహితేతిహాస' మని వ్రాసెను. భారతము వ్రాసిన ముగ్గురును దానిని ఇతిహాసముగా పేర్కొనిరి. భారత మితిహాసమనుట కవిత్రయము వారికిష్టము. ఇతిహాసమున ప్రధాన కథ చారిత్రక సత్యమైనదిగా నుండవలెను. మరియు కొంత శాస్త్రము ప్రవర్తించవలయును. ఆ కథకు దేవాసుర సంబంధ ముండవలయును. భారతము నందలి కథ కురు పాండవులది. వారు యుద్ధము చేసికొనిరి. శాంతి, అనుశాసనిక పర్వముల యందును మరియు నక్కడక్కడ శాస్త్రము భారతమున ప్రవర్తించినది. భారతమున ప్రధాన పాత్ర నిర్వహించిన ధర్మరాజాదులు, దేవతల యంశమున జన్మించినవారు. దుర్యోధనాదులు కలి యంశమున పుట్టినారు. దైవశక్తి మూర్తీభవించిన శ్రీకృష్ణుడు భారతముతో నెడతెగని సంబంధము కలిగియున్నాడు. భారత యుద్ధమున నొకరిద్దరు రాక్షసులు పాల్గొనిరి. ఆ యుద్ధమును దేవతలు సందర్శించినట్లు చెప్పబడియున్నది. కావున యితిహాస లక్షణమైన దేవాసుర సంబంధము భారతేతిహాసమునకున్నది. భీష్ముడు ధర్మరాజున కుపదేశించిన విషయమంతయు సంవాద రూపమున పరంపరగా వచ్చుచున్నట్లే చెప్పబడినది. ప్రధాన కథా పురుషులైన వారి

పరలోకానుభవము స్వర్గారోహణ పర్వమున వర్ణింపబడినది.

పూర్వుల చరిత్ర తెలుపునది ఇతిహాసము. వేదవ్యాసు డర్జునునకు శ్రీకృష్ణుని జన్మరహస్యము బోధించినాడు. నరనారాయణులను పురాణమునులు లోక కళ్యాణార్థమై పార్థ, పార్థసారథులుగ జన్మించి, తత్ప్రయోజనమగు ధర్మ సంస్థాపన గావించిరని భారతమువలన తెలియుచున్నది.

"నరుడు నారాయణుండు ననంగ బఱగు
నిత్య పురుషులు నీవును నేను జుమ్ము
భువన హితమాచరింపగాఁ బూనివేడ్క
వచ్చి యిమ్మహిఁ బుట్టిన వార మనఘ"

ఈ విషయమునే శ్రీకృష్ణుడును నర్జునునకు హరిహరా భేదమును తెల్పునవ యమున బోధించినాడు.

ప్రధానేతి వృత్తము ప్రధాన పురుషుని బట్టియే యుండును. అతడే నాయకుడు. భారతమున నాయకుడు ధర్మరాజు. ధర్మరాజు బుద్ధి ధర్మార్థ కామమోక్షములయందు శాసింపబడుట ప్రత్యక్షముగా భారతమున నున్నందున భారతము శాస్త్రేతిహాసమగుచున్నది. ఈ విధముగా నితిహాస శబ్దమునకు చెప్పబడిన అర్థము లన్నియు భారతముతో నన్వయించుచున్నందున భారత మితిహాసము.

## భారతము - పురాణము

భారతము మహాపురాణముగ ప్రసిద్ధి చెందినది. సాధారణముగ లోకమున భారత, భాగవతములను పురాణములుగా పేర్కొనుట కలదు. "సర్గశ్చ ప్రతిసర్గశ్చవంశో మన్వంతరాణిచ, వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణా"-అని పురాణ లక్షణము. వ్యాసుడు జయేతిహాసమును రచించి తన శిష్యులగు వైశంపాయన, సుమంత, పైల, జైమినులకును, పుత్రుడగు శుకునకును బోధించి వారిచే దానిని లోకమున ప్రచారము గావించెను. పురాణ సమయమున దేశకాల వ్యవస్థల ననుసరించి పౌరాణికులు నూతన విషయములను చేర్చుటయు వచ్చుటచ్చట కన్పడుచున్నది. భారత పఠనవేళ జనమేజయుడనేక విషయముల గూర్చి వైశంపాయని ప్రశ్నించుటయు, నతడందులకు దగిన సదుత్తరముల నిచ్చుటయు భారతమున కాననగును. అట్లే సౌతి శౌనకాది మునులకు భారతమును గూర్చి వివరించినాడు. ప్రఖ్యాత పౌరాణికుడు సౌతిచాలవరకు భారత గ్రంథ విస్తృతికి కారకుడైనాడు. పురాణములన్నియు ఉపాఖ్యానముల కూర్పు. అట్లేభారతమునందు వివిధోపాఖ్యానములున్నవి. అవి కొన్ని నీతి బోధకములు. మరికొన్ని ధర్మతత్వ ప్రతిపాదకములు. ఒక్కొక్క ఉపాఖ్యానము ఒక్కొక్క విశిష్ట ప్రయోజనమును ప్రతిపాదించుచుండును. ఉదాహరణమునకు భారతము నందున్నశకుంతలోపాఖ్యానము, రామోపాఖ్యానముహంసకాకీయోపాఖ్యానము వంటివి. ఇటువంటి ఉపాఖ్యానములు విరివిగా నుండుటబట్టి భారతము మహాపురాణముగా పరిగణింపబడుచున్నది. జానపదులలో భారత పురాణమునకున్న వ్యాప్తి మరొక పురాణమునకు లేదనియే చెప్పవచ్చును. భారతమునందలి పాత్రల ఇతివృత్తము నేటి మానవాళికి సన్నిహిత సంబంధముండుట వలన జానపదులు భారత పురాణమును శ్రద్ధతో చదువుచుందురు. నాటికి నేటికి భారతదేశమున భారత పురాణమును హరికథగాను, బుర్రకథగాను చెప్పించుట ఆచారముగా నున్నది. భారత పురాణమున కౌరవ

పాండవుల కథ ప్రధానమైనది. కాని, యాదవ, పాంచాల, మాత్స్యవంశములన్నియు నిందు ప్రాధాన్యము వహించినవి. శంతనుని చరిత్రతో నారంభమై పాండవుల స్వర్గ ప్రాప్తితో సమాప్తి చెందుచున్నది. భారతమున పురాణ పురుషుడగు కృష్ణుని యవతార విశేషముండుట వలన మహాపురాణముగ పరిగణింపబడుచున్నది.

భారతము సార్వకాలికమైన ధర్మమును ప్రబోధించుటచే ధర్మశాస్త్రముగను, ఆధ్యాత్మిక తత్త్వమును, శ్రీకృష్ణపరమాత్ముని అవతార విశేషములను వివరించుటచే వేదాంత గ్రంథముగను, లోకసమ్మతమైన ధర్మనీతి, రాజనీతి, కుటిలనీతి మొదలగు నీతి విశేషము లుండుటచే నీతిశాస్త్రముగను, లోకకల్యాణార్థ గుణములగు ఆనంద, సందేశములందించుటచే మహాకావ్యముగను, వివిధాలంకారములు, విశేష వృత్తములు, వళులుండుటచే లక్షణ గ్రంథముగను, ఇతివృత్తము కురుపాండవుల కథ ఒకజాతికి సంబంధించినదై చారిత్రకాంశము గలిగి మానవ జీవితమును సంపూర్ణముగా తెల్పుటచే ఇతిహాసముగను, ప్రధాన కథతోపాటు వివిధ ఉపకథలుండుటయే గాక, భక్తి ప్రబోధమైన పురాణ విషయములుండుట బట్టి మహాపురాణముగ పరిగణింపబడుచున్నది. ఇన్ని లక్షణములున్న భారతము మానవ నిత్య నైతిక జీవితమునకు ఆదర్శప్రాయముగా నున్నదనుటలో సందేహము లేదు.

### ఉపయుక్త గ్రంథములు

1. తిక్కన రచన—లక్ష్మీనారాయణ, భూపతి
2. తిక్కన కావ్యశిల్పము — వేంకట రామకోటి శాస్త్రి, కేతవరపు
3. అప్పకవీయ భావ ప్రకాశిక (తృతీయా శ్వాసము)—దొరస్వామి శర్మ, రావూరి
4. సాహిత్య సౌందర్య దర్శనము —గణపతి శాస్త్రి, చెర్ల
5. సాహిత్య శిల్ప సమీక్ష —లక్ష్మీకాంతం, పింగళి

(సమాప్తం)

# త్యాగమూర్తి

కవిభూషణ : మూలా పేరన్నశాస్త్రి

శా॥ వందేమాతర మంచు శాంతిసమర వ్యాపార రంగమ్ములో
నం దోడ్తోడనె గాంధియానతిపయిన్ సర్వస్వమున్ వీడి లో
సందేహమ్ములు మాని ఖైదునకు హర్ష స్ఫూర్తితో నేఁగవే
చిందుల్ ద్రొక్కెడు దేశభక్తిరతితో శ్రీపొట్టిశ్రీరాములా!

మ॥ జయనాదంబులతో, విశుద్ధమతితో, స్వాతంత్ర్యసంపాదనో
దయవాంఛారతితో, మహాత్మునడి చందంబూని స్వేచ్ఛాప్తికై
పయనంబైతివి ధీరమానసుఁడవై పాశ్చాత్యదుస్తంత్ర సం
చయసంహారక కార్యకల్పనకళా సామర్థ్యమేపారఁగన్ !

మ॥ జగతీకంటకులైన గొంటులకు హృచ్ఛల్యంబు సత్యాగ్రహా
ఖ్యగరిష్ఠ ప్రకటాయుధంబుఁ గొనిరాగా గాంధి మున్ముందు ధీ
రగజేంద్రమ్ములరీతి జవహ్వరుఁడు సర్దారుండు, రాజేంద్ర బా
బు గుణాఢ్యుండు ప్రకాశమున్ మఱియు నీవున్ నిల్చిపోరాడరే!

మ॥ మతిమంతుం డయినట్టిగాంధి నెదిరింపన్ లేక పాశ్చాత్య భూ
పతి స్వాతంత్ర్యమొసంగి "సౌఖ్యముగ మీర్పాలింపుఁడీ భారత
క్షితి" నంచున్ వచియించి లండనునకున్ జేరన్ బ్రథమండుగాఁ
జతురత్వంబున నయ్యెజవహ్వరుఁడు దేశక్షేమ సంధాయియై !

తే॥గీ॥ భాషలనుబట్టి రాష్ట్రాల పంచుకొనుట
పలువఁదగునంచుఁ బెద్దలు చాటిచెప్ప
నాంధ్రరాష్ట్రంబునొసఁగ జవహ్వరుప్రధాని
నడిగినారలు భక్తితో నాంధ్రజనులు

తే॥గీ॥ పరులమాటలు విననట్టి పండితుండు
సకలసద్గుణనిధియైన జహ్వరుండు
రాజగోపాలునుడిఁబట్టి రాష్ట్రమిడక
తెలుఁగువారల ప్రార్థన తొలఁగఁద్రోసె

శా॥ రాజాజీ నుడిఁబట్టినేహ్రూ తెలుఁగున్ రాష్ట్రంబుగాఁజేయకే
దోజాగున్ బచరింప రాష్ట్రమును దోడ్తోఁబొందఁ బ్రాయోపవే
శౌజస్ఫూర్తిని నేఁ బదేఁడు దినముల్ సన్నిష్ఠతోసల్పి సత్
తేజంబొప్పఁగఁ బుణ్యలోకమునకు దీప్తిన్ జనెన్ ధీరుడై.

శా॥ హాహాకారము లుప్పతిల్లెమ దిశాకాంత ప్రదేశంబులం
దూహాతీతములైన వేదనలచే నుత్పాతముల్ పుట్టఁగా
దేహస్మారకవృత్తిలేక తెలుఁగుల్ తీంద్రింప నెహ్రూజి తా
సాహార్ద్రంబునవాంధ్రరాష్ట్రమొసఁగెన్ శత్రుల్ తగన్ గుందఁగన్.

మ॥ కనగాముస్నదధీచిమౌనియు, శిబి
క్ష్మానాధ జీమూతవా
హను లాత్మార్పణమున్ బరోపకృతిఁ జే
యన్ జేసినారంచు వీఁ
కను విస్మారము రాష్ట్ర సిద్ధికయి త్యా
గం బూని జీవమ్ముఁ బా
సిన నిమ్మన్ గనినాము నిర్మల యశ
స్వీ ! పొట్టి శ్రీరాములూ !

తే॥గీ॥ అవనియెందాఁక యుండునో అంతదాఁక
నలరు నీ కీర్తిచంద్రిక అతిశయించి
యమలగుణధామ ! పొట్టివంశాబ్ధిసోమ !
త్యాగమూర్తి ! శ్రీరామవిఖ్యాత చరిత.

# "సంస్కృతాంధ్ర సాహిత్యములలో సత్యభామ"

కుమారి దశిగి అన్నపూర్ణ ఎం. ఏ.

శ్రీకృష్ణుడు లీలా మానుష విగ్రహుడు. దక్షిణ నాయకుడు. ఈతని లీలల కాకరమై యొప్పునట్టి మనోహర గాథలలో 'పారిజాతాపహరణ' వృత్తాంత మొకటి. ఇది అత్యంత రమణీయమైనది. ఇందలి ఇతివృత్తము సర్వ సాధారణమగు కుటుంబ గాథ యగుట, నాయికా నాయకులు లోక సాధారణ వ్యక్తులై ప్రవర్తించుట, శ్రీకృష్ణుడు సాధారణ మానవుని వలె భార్యావిధేయుడై తదనుగుణముగ వర్తించుట అను విశేషములచే నలరారిన అద్భుత గాథయే యీ 'పారిజాతాపహరణ' వృత్తాంతము.

సాధారణముగా 'పారిజాతాపహరణము' అను పేరును వినినంతనే తెలుగు సాహిత్యముతో పరిచయ మున్న ప్రతి పాఠకునికిని నంది తిమ్మన విరచిత 'పారిజాతాపహరణ' ప్రబంధమే స్మృతికి వచ్చును. 'సత్యభామ' పేరు నుచ్చరించినంతనే తిమ్మన చిత్రించిన .. ..........

"చక్కని దాన నంచు నెల జవ్వని నంచు జగంబు లోనఁబే
రెక్కిన దాననంచుఁ బతియెంతయు నాకనురక్తుఁ 'డంచుఁ దా'
నిక్కుచు విఱ్ఱవీగుచు గణింపదు కాంతల సత్య ..... 1-16

-అని అహంభావినిగను; "మానరహితమైన బ్రతుకు మానినికేలా ?"- అను అభిమానవతి గను మన కన్నుల ముందు సాక్షాత్కరించునుగాని వేరు విధముగ గోచరించదు. కాని దీనికి విరుద్ధముగ ఎవరును ఎన్నడును యూహించని విధముగ. అత్యంత అమాయకురాలిగ, పసిపిల్ల మనస్తత్వముతో సత్య పాత్రను మన మనః ఫలకములపై శాశ్వతముగ నిలుచున్నట్లుగ చిత్రించిన కవి 'చరిగొండ ధర్మనామాత్యుడు'. ఈతడు సత్యభామ పాత్రను ఏ విధముగా చిత్రించెనో పరిశీలించుటకు పూర్వము, ఏ యే గ్రంథములందు ఈ పారిజాతాపహరణ వృత్తాంతము పేర్కొనుట సంభవించినదో అందు సత్య పాత్ర ఏ విధముగ చిత్రించబడినదో అను విషయములను గమనించవలసియున్నది.

పరిశీలించి చూడగా విష్ణుగాథా సంబంధి పురాణములలో ప్రధానముగా [1] విష్ణు పురాణము, [2] బ్రహ్మ పురాణము, [3] పద్మ పురాణోత్తర ఖండము, [4] భాగవత పురాణము, [5] బ్రహ్మవైవర్త పురాణము అను నైదు పురాణముల యందును, మహాభారత ఖిలపర్వమైన

---

1. పంచమాంశ 30 మరియు 31 వ అధ్యాయమున 100 శ్లోకములలో గలదు.
2. 45, 95 అధ్యాయములలో 94+25: 119 శ్లోకములలో గలదు.
3. 54 వ అధ్యాయమునందు 83 to113=30 శ్లోకములలో గలదు.
4. దశమ స్కందమునందు 59 వ అధ్యాయమునందు 4 శ్లోకములలోగలదు.
5, ద్వితీయ భాగము 113 అధ్యాయమున 44 to 46 వరకు గల శ్లోకములలో గలదు.

[6]'హరివంశము'నందునుపారిజాతాపహరణ వృత్తాంత ప్రస్తావన గలదు. వానిలో విష్ణు, బ్రహ్మ, పద్మ పురాణములు, హరి వంశము విపులముగను, భాగవత, బ్రహ్మవైవర్త పురాణము లతి సంక్షేపము, గను యీ పారిజాతాపహరణ వృత్తాంతమును అభివర్ణించినవి. మరియు వీనిలో బ్రహ్మ, భాగవత పురాణములందలి పారిజాతాపహరణ వృత్తాంతము "విష్ణు పురాణ" గాధకు సన్నిహితముగను, బ్రహ్మవైవర్త పురాణము నందలి కథ 'హరివంశము"నకు సన్నిహితముగను కానవచ్చుచున్నది.

బ్రహ్మ, భాగవత పురాణములలో భాగవత పురాణము ఈ పారిజాతాపహరణ వృత్తాంతమును నాలుగు శ్లోకములలో అతి సూక్ష్మముగ వర్ణించినది. [7] ఆంధ్ర భాగవత కర్తయగు పోతనయు ఈ ఘట్టమును ప్రపంచీకరింపక యథాతథముగ ఆంధ్రీకరించెను. ఇక బ్రహ్మ, విష్ణు పురాణము లీ కథ నొకే తీరున తీర్చినవి. బ్రహ్మవైవర్త పురాణము ప్రధాన విషయమును చెప్పుటలో హరి వంశము నాధారముగా జేసికొనినది.

కావున విష్ణు పురాణము, హరి వంశము, పద్మ పురాణములో సత్యపాత్ర ఏ విధముగ మలచబడినదీ గమనించవలెను. ఆ వెనుక, తిమ్మన, ధర్మనలు వారి వారి కావ్యములందు ఆ పాత్రను సహృదయ రంజక మగునట్లుగ నే విధముగ తీర్చి దిద్దిరో నిశితముగా పరిశీలించవచ్చును.

విష్ణు పురాణము: నరకాసుర వధానంతరము శ్రీకృష్ణుడు సత్యా సహితుడై అతిదికి కుండలముల నిచ్చుటకై దేవలోకమున కేగెను దేవరాజగు ఇంద్రుడు అత్యంతాదరముతో శ్రీకృష్ణుని పూజించినాడు. కాని కల్ప ప్రసూనములతో నలంకృతయైన శచీదేవి మాత్రము 'సత్యభామ మానవ స్త్రీ' యను తలంపుతో నామె కొక్కటి యేనియు పారిజాత కుసుమము నొసంగి గౌరవింపలేదు[8] ఈ అవమానమును సత్య గుర్తించినది. పిమ్మట సత్యాకృష్ణులిరువురు నందన వనమును తిలకించు సమయమున అట గల పారిజాత వృక్షమును చూచిన సత్య ప్రసన్న వదనయై శ్రీకృష్ణునితో "ఓ యదుశ్రేష్ఠా! మీ రెప్పుడును సత్య నాకెంతటి ప్రియమైనదో అంత జాంబవతి గాని రుక్మిణి గాని కాదు" అని పలికెడి వారు. ఆ మాటలు నిజములే అయినచో ఇప్పుడీ పారిజాత వృక్షమును నా గృహాలంకారముగా చేయుడు. ఈ పారిజాత పుష్పములను ధరించి సవతులలో శోభిత నయ్యెద"నని పల్కినది.

—ఇట సత్యభామ గడుసరిదిగను, సమయస్ఫూర్తి గలదిగను చిత్రింపబడినది. జాంబవతీ, రుక్మిణిల కంటె తానధికురాలిగ నుండవలెననెడి ఆమె కోరిక స్పష్టమగుటచే నిట ఆమె సపత్నీ మాత్సర్యము వ్యక్తమగుచున్నది ఆమె శ్రీకృష్ణునితో జరిపిన సంభాషణను బట్టి చూడ, నాతనిని తన విధేయునిగ మలచుచున్న 'జాణ' అనియు అభివ్యక్త మగుచున్నది. పారిజాత వృక్షమును తన గృహాలంకారముగా చేయుమని అడుగుటలో ఇంతకు పూర్వము శచీదేవి చేసిన అవమానమును మనసు నందుంచు కొనినది. పారిజాత కుసుమములకు బదులుగ వృక్షమునే తీసికొని వెళ్ళినచో తనకు పారిజాతములు లభించుటయేగాక శచీదేవికి ఆ కుసుమము లింక లభ్యము గావనియు నెంచుటవలన నామె ప్రతీకార వాంఛ వెల్లడి యగుచున్నది.

6. హరివంశమునందుగల విష్ణు పర్వమున 65 వ అధ్యాయము నుండి 76 వ అధ్యాయము వరకు అనగా మొత్తము 12 అధ్యాయములందు గలదు.

7. ఆంధ్రీకృత భాగవతము దశమ స్కంధము, ఉత్తర భాగము – 214 to 218.

8. విష్ణు పురాణము – అంశ – అధ్యాయము 30; శ్లోకము 29.

శచీదేవి చేతలలో సత్య నవమానించిన విషయము విష్ణు పురాణము ననుసరించియే యున్న బ్రహ్మ పురాణము నందును నిట్లే వర్ణింపబడినది. కాని ఈ విషయమును ఆంధ్రీకృత విష్ణు పురాణము నందు సూరనయు, భాగవత పురాణము నందు పోతనయు పేర్కొన లేదు.

శ్రీకృష్ణుడు పారిజాత వృక్షమును పెకలించు చుండగా వనపాలకు లడ్డుపడి, 'ఆ వృక్షము దేవేంద్రుని పత్నియైన శచీదేవి సంపద. గాన మీరపహరింప దగదని పెక్కు విధములుగ' పల్కిరి. అంత సత్య మిక్కిలి కోపముతో 'ఈ పారిజాతమునకు శచి యెవతె? శక్రుడెవరు?' అని వారితో నిరసనగా మాట్లాడినది.

-ఇట సత్యవర్తనలో అహంభావము సుస్పష్టమగు చున్నది. మరియు నామె వనపాలకులతో శచీదేవితో చెప్పుమని ఈ విధముగా పల్కినది. "నీవు నీ భర్తకు ప్రియురాలివేని నా భర్త గావించు పారిజాతావహరణము నుండి నిరోధింపుము" అనుటలో నామె గర్వాతిశయము వెల్లడి యగుచున్నది. ఇట శ్రీకృష్ణుడు సత్యభామా విధేయుడే యనుట స్పష్టము. కావుననే ఆమె కోరిక ననుసరించి పారిజాత వృక్షమును అపహరించెను. మరి శక్రుడు శచీ విధేయుడగునా, కాదా? యని సత్య ప్రశ్న.

యుద్ధము నందు పరాజితుడై పలాయనము సాగించు శక్రునితో సత్యభామ "లోకేశ్వరా, శచీ భర్తలైన మీకీ పలాయన ముచితము కాదు. తన యింటికి వెళ్ళిన శచీదేవి మన్ననమై నన్నాదరింప లేదు...కావున నేను నా భర్త గౌరవ ప్రకటనార్థము యుద్ధమును కల్పించినాను. ఇతరుల సొత్తైన యీ పారిజాత వృక్షమును గ్రహించి వెడలవలసిన అవసరము నాకు లేదు—" అని పల్కినది.

—ఇట సత్యభామ శచీదేవి తన కవమానమును జేసిన విషయమును, అవసరమగు నంతవరకు చెప్ప లేదు. ఆమె పారిజాత వృక్షమును కోరుకున్నది కేవలము శచీదేవి గర్వ భంగమునకే. శచీదేవి తన సౌందర్య విషయమై దేవేంద్రుని బాహుబల దర్ప విషయమై గర్విష్ఠియైయున్నది. ఈ రెండు విషయములలో సత్యభామ శచీదేవి కేమాత్రమును తీసిపోవునది కాదు ఈ విషయము శచీదేవికిని తెలియును. తెలిసియు తన్నవమానము చేసినది. కావున సత్యభామ ప్రతీకారము నీ విధముగా తీర్చుకున్నది. సత్యకు పట్టయునది ఇంతవరకు మాత్రమే. అందులకే పరాజితుడై పలాయనము సాగించు దేవేంద్రుని పిలిచి పారిజాత వృక్షమును తీసికొని వెళ్ళుమని పల్కినది 'ఇతరుల సొత్తైన పారిజాత వృక్షమును గ్రహించవలసిన అవసరము లేదు —' అనుటలో నామె సంస్కారము వెల్లడియగుచున్నది.

[1] *ఆంధ్రీకృత విష్ణు పురాణము :*

16 వ శతాబ్ది ప్రారంభమునకు చెందిన వెన్నెలకంటి సూరన 'విష్ణు పురాణము' నాంధ్రీకరించెను. సూరన యీ ఆంధ్రీకరణ విధానములో అవసరమగు తావుల పెంచియు, అనవసరమగు తావుల కుదించియు రచించెను. శచీదేవి సత్య నవమానమును చేసిన విషయమును ఈతడు పేర్కొన లేదు.

సత్యాకృష్ణులు అదితికి కుండలముల నొసగి ద్వారకకు పోవుచుండ, అటగల పారిజాత వృక్షమును చూచిన సత్యభామ శ్రీకృష్ణునితో, "మీరు దేవేంద్రుని కంటె నున్నతులు. మీ పత్నినైన నేను శచీదేవి కంటె నధికురాలిగా నుండవలెను గాన ఈ పారిజాత వృక్షమును నా ఉద్యానవనమునందు నిలిపి నచో రుక్మిణి, జాంబవత్యాది సవతులలో కూడ శోభించెదను —" అని పల్కినది. అంత కృష్ణుడు వృక్షమును పెకలించి గరుడునిపై నిడుకొను ప్రయత్న

1. విష్ణుపురాణము-అష్టమా శ్వాసము. 105-145 — 40 గద్య పద్యాలలో గలదు.

ములో నుండెను. అంతలో దేవపాలకులు వచ్చి, ఈ విధముగా చేయుట తగదని పలుకగా వారితో సత్యభామ పరుషోక్తులు పల్కిన విధము విష్ణుపురాణము నందువలెనే యున్నది. ఇందు దేవేంద్రుడోడిపోయినపుడు సత్యభామ ఏమియును మాట్లాడదు. ఇట వేరొక విధముగా కథ మలచబడినది. యుద్ధమునందు తుదకు శ్రీకృష్ణుడు సుదర్శన చక్రమును గ్రహించగా సర్వ భూతములును తల్లడిల్లును. అంత ఇంద్రాణి శౌరి చెంతకు వచ్చి, ఆతనిని సంస్తుతించి భర్తృభిక్ష పెట్టుమని వేడుకొనుట, పిదప కృష్ణుడు దేవేంద్రునితో "ఈ పారిజాత వృక్షమును ఇచ్చినచో నీ సంపదలు తరిగిపోవునా?" అనియు 'అయినను దానిని సత్యభామ కోరిక మేరకు గ్రహించి వెడలుచున్నాననియు' చెప్పును.

సత్యభామ పారిజాత వృక్షమును ఉచితానుచితములు లేకుండ కోరుట అనౌచిత్యముగ నున్నది. పారిజాతమునకై ఇంద్రాణిని, దేవేంద్రుని తనకు లోబడునట్లు చేసినది. శచీదేవి కన్నను తానే అధికురాలిననియు, తన భర్తయే సకలలోక గ్రామణియనియు చెప్పుటలో నామె నహంభావమే వ్యక్తమగుచున్నది. మరియు "సవతు లెల్లరు నా తోడ సవతుగారు" అనుటలో నామె సపత్నీ మాత్సర్యము వెల్లడియగుచున్నది.

సూరన మూలమును యథాతథముగ నాంధ్రీకరింపక ఈ విధముగా నేల రచించెనో తెలియకున్నది. ఇందలి సత్య చపలమతిగా, సంస్కారరహితయైన తరుణిగ గోచరించును.

*పాత్ర పోషణము :*

ఇందలి పారిజాతాపహరణ వృత్తాంతమును పరిశీలించినచో సత్యభామ సౌందర్యవతిగ, అభిమానవతిగ, సపత్నీ మాత్సర్యము గలదిగ గోచరించును. తరువాత జరిగెడు పుణ్యక వ్రతమును బట్టి చూడ, నిరహంభావినిగ, సాత్త్విక భక్తురాలిగ, శ్రీకృష్ణుని యందు మిక్కిలి అనురాగము గల స్త్రీగ తెలియును. కాని పారిజాతాపహరణ వృత్తాంతము మేరకు అనగా పారిజాత వృక్షము భూలోకమునకు వచ్చునంతవరకు మాత్రమే 'పారిజాతాపహరణ' నామము సార్థక్యము. కావున నంతవరకు మాత్రమే నిట పరిశీలింపబడును. దానినిబట్టి చూచినచో సత్య అహంభావినిగ గోచరించినదనియే చెప్పవలెను.

ఇందు వ్రతోద్యాపనోత్సవము చేసికొను రుక్మిణి గృహమునకు నారదుడు పారిజాత పుష్పములతో వచ్చి, శ్రీకృష్ణున కిచ్చి దానిని కనుసన్నలతో రుక్మిణి కిప్పించినట్లున్నది. మరియు నాతడు రుక్మిణిని స్తుతించి, మానవతులైన సపత్నుల కించపరచుచు పల్కెను

నారదు డాడిన మాటలను విని సఖీజనులు వేర్వేరుగా తమ తమ దేవేరుల కెరింగించినారు. విషయమును తెలిసికొన్న రాణు లందరు రుక్మిణీదేవి సౌభాగ్య గరిమకు సంతసించిరి. ఏ విధముగను ఆ భాగ్యము తమకు దక్కలేదు గనుక, దక్కిన వారిని చూచి సంతోషించిన అది దక్కినంత ఫలమనుకొనిరి. కాని రూప యౌవనాది సంపదలందు రుక్మిణి కేమాత్రమును తీసిపోని సత్యభామకు మాత్రము ఈ విషయమును వినిన వెంటనే అభిమానము పొంగినది.

ఆమె కోపమునకుగల కారణములు: (1) శ్రీకృష్ణుడు పారిజాత పుష్పమును తన కీయనందుకు, (2) నారదుడు తన సవతియైన రుక్మిణీదేవి గృహమునందు తన్ను తూలనాడినందులకు, ( ) నారదుడు తన్ను తూలనాడు సమయమున శ్రీకృష్ణు డాతని మాటల కడ్డు చెప్పనందులకు, (4) ఈ విధముగా పారిజాతమును శ్రీకృష్ణుడు రుక్మిణికి నొసంగెను కనుక, మును ముందు పూర్వమువలె తాను 'కృష్ణుడు సత్యభామా విధేయుడే' అని సాహసించి చెప్పుకొనలేని విషమ పరిస్థితి ఏర్పడినందులకు, (5) ఈ కారణ

ముగా అత్తగారి ముందు. తోడి సవతుల యెదుట చులకనగా గుర్తింపబడుదు ననెడి యూహచేతను, (6) శ్రీకృష్ణునకు నిజముగా తనయందు ప్రేమ యుండి యుండకపోవచ్చు ననెడి అనుమానము చేతను-సత్యభామకు అభిమానము దెబ్బతినినది. ఇవి యన్నియు తలంచుకొనిన కొలదియు ఆమె కోప మతిశయించినది.

అభిమానవతియైన స్త్రీ కిది నిజముగా గాఢమైన దెబ్బయే. ఈ విధమైన దెబ్బకు తట్టుకొనలేక, వైరాగ్య మనస్వినియై, తుదకు బేలయై, ఊహ లన్నియు నిజమగు పరిస్థితి రాకపూర్వమే నిష్క్రమించవలెనని నిర్ణయించుకొని, తపస్సునకై తన కనుజ్ఞనిమ్మని శ్రీకృష్ణుని వేడినది. [1]

ఇట సత్య పాత్రను పరిశీలించినచో నొక విధ మగు సానుభూతి యుదయించును. శ్రీకృష్ణునకు అష్టమహిషులు గాక పదునారువేలమంది గోపికలున్నా రనియు, అందు తా నొకతె ననియు సత్యకు తెలియును. తానేవిధముగ శ్రీకృష్ణుని యభిమానించు చుండెనో అందరు అదేవిధముగ ఆరాధింతురనియును తెలియును. కాని సత్యభామ తాను రాచపుత్రిననియు, సౌందర్యవతిననియు, శ్రీకృష్ణునకు గల సతులందరి లోను అతనికి తనమీదనే అధిక ప్రేమ గలదనియు తలపోయు వ్యక్తి. ఇంతియగాక దానికి తగిన విధముగనే శ్రీకృష్ణుడును తానందరు సతులకు పతియే యయినను నాతడు సత్యాపతిగనే ప్రసిద్ధుడయ్యెను. తన్మూలముగ సత్యకు గర్వాతిశయము పెంపొందినది. అందువలన అమూల్య వస్తు వేది యయినను శ్రీకృష్ణుడు తనకే ఈయవలెనని భావించెడిది. కాని ఇప్పుడు దానికి విరుద్ధముగ పారిజాతమును రుక్మిణి కొసంగుటతో ఈర్ష్యాకులై సహింపలేక పోయినది. ఈ విషయమై పౌర్వాపౌర్యముల నేమాత్రము ఆలో

చించినను ఆమె బాధపడ నవసరము లేకుండెడిది. ఏ విధముగా నన అతడా సమయమున రుక్మిణీదేవి గృహమునం దుండుటచే శ్రీకృష్ణుడు ఆ పుష్పమును సత్యభామకే యీయవలెనని సంకల్పించుకొనినను, అది సభ్యత కాదని యెంచి రుక్మిణి కిచ్చియుండ వచ్చునని. ఈ విషయమునకే అయినచో సత్యభామయు తోడి సవతులవలె సంతోషించెడిది. కానీ తరువాత జరిగిన విషయమును గురించియే ఆమె కోప మతిశయించినది.

సాధారణ స్త్రీకి అయినను తమను పరుల యిండ్లలో తూలనాడినను, ఆ సమయమున తమను ప్రాణాధికముగా ప్రేమించెడివారు అటనే యుండి, ఆ విషయమై ఏమియు మాట్లాడక యుండ, ఆ సంగతి తమకి తెలియగా, సర్వసాధారణముగా కోపము వచ్చును. ఇక సత్యవంటి మానవతి సంగతి వేరుగ చెప్పనేల?

దుఃఖించుచున్న సత్యభామ కడకు శ్రీకృష్ణుఁ డేతెంచి, అన్ని విధముల నోదార్చుచు బుజ్జగించగా, చివరికి ఆమె అతనితో శ్రీకృష్ణు డొనరించిన కార్యము లన్నింటిని చెప్పగా [2] నాత డామెతో, "దేవీ! ఒక్క పారిజాత పుష్పమును గురించి దుఃఖించు టెందులకు? నీకు పారిజాత వృక్షమునే తెచ్చి యిచ్చెదను" అని చెప్పెను. అంత నామె తానా క్షణము వరకు పడిన బాధనంతటినీ విస్మరించి, తన సౌభాగ్య గరిమకు నెంతయు నుబ్బొంగినది

ఇట సత్యవర్తనలో చిన్నపిల్లల తీరు స్పష్టమగు చున్నది. ప్రియవస్తు సంపాదనకై అగడము లెన్నియో చేసి, అవి యన్నియు తప్పులని తెలిసియు తన ప్రయత్నమును విడనాడక ఆ వస్తువునకై ఆరాటపడి విజయమును సాధించిన సాధ్వీ లలామ సత్యభామ.

---

1. హరి, వ. వ. అ. 66. 25-55.

2. హరి వ. వ. అ. 67. 1-27.

సంస్కృత హరివంశమును ఎఱ్ఱాప్రెగడయు, నాచన సోమనయును ఆంధ్రీకరించిరి. సోమన శృంగార రసాభిలాషి. కాని శృంగార రసాత్మకమైన పారిజాతాపహరణ గాథ నాతడాంధ్రీకరింపలేదు.

[1] *ఎఱ్ఱన ఆంధ్రీకరించిన హరివంశము* నందీ వృత్తాంతము, పోతన భాగవతమునందలి పారిజాతాపహరణ వృత్తాంతము వలె సంగ్రహముగ గలదు. అతి రసవంతమై పాఠకులకు హృదయాహ్లాదమును కల్గించు నీ కథను ఆతడు మూలానుసారముగ నేల ఆంధ్రీకరించలేదో తెలియకున్నది.

ఇందు నరకాసుర వధానంతరము శ్రీకృష్ణసత్యలు దేవలోకమున కరిగి కుండలములను అదితి కిచ్చి, పిమ్మట దేవలోకమున గల నందనోద్యాన వనమును ఆలోకించుచుండ నట పారిజాత వృక్షమును చూచి సత్య ఆతనితో, ఆ వృక్షమును కావలయునని అడుగుట, శ్రీకృష్ణుడు ఇంద్రాది దేవతలతో పోరాడియు ఆమె కోరికను నెరవేర్చుట గలదు.

ఇట సత్య పాత్ర చిత్రణలోను, తన్మూలముగ కృష్ణ పాత్రకును అనౌచిత్యము సంభవించినది. ఎఱ్ఱన - సంస్కృత హరివంశములో వలెనే గాని లేక విష్ణుపురాణములో వలె గానీ సత్య పాత్రను చిత్రించినచో, ఆత డాంధ్రీకరించిన భాగము స్వల్పమే అయినను మనోహరముగ నుండెడిది. అట్లు కాని పక్షమున సోమనవలె ఆ వృత్తాంతమును వదిలివైచినను బాగుండెడిది.

*బ్రహ్మ వైవర్త పురాణము :*

ఇందీ వృత్తాంతము నాలుగు శ్లోకములలో ప్రస్తావించబడినది. ప్రధానముగా శ్రీకృష్ణుడు పారిజాతాపహరణము గావించి శక్రుని గర్వము నణచుట, సత్యభామా మనోవాంఛితమగు 'పుణ్యక వ్రతము' నామెచే చేయించుట అను విషయములు మాత్రము చెప్పబడినవి. పుణ్యక వ్రత ప్రస్తావన ఇందుండుటచే నీ పురాణము 'హరివంశము' ననుసరించెనని భావించుట జరిగినది.

*నంది తిమ్మన - పారిజాతాపహరణ ప్రబంధము :*

సంస్కృత హరివంశములో పండ్రెండు అధ్యాయములలో విపులముగ నున్న పారిజాతాపహరణ గాథను గ్రహించి, కావ్యోచితమైన చిరు మార్పులు చేసి, తిమ్మన తన కృతిని ఒక స్వతంత్రమగు లలిత మధుర ప్రబంధముగ తీర్చిదిద్దెను అటుల చేసిన మార్పులలో కథానాయిక యగు సత్యభామ యొక్క మానక్రోధములను వర్ణించుట స్వతంత్రమైన శ్రేష్ఠతరమైన మార్పు.

ఇందు నారదుడు దేవలోకము నుండి పారిజాతమును తెచ్చి, శ్రీకృష్ణునకిచ్చి, కమసన్నల ద్వారా రుక్మిణి కిప్పించినట్లున్నది. కలహాసనుడీ సూచనము ద్వారా కలహ బీజమును నాటెను. దివ్య సౌరభములను వెదజల్లు పారిజాత కుసుమమును సత్యభామా విధేయుడు రుక్మిణి కిచ్చెనన్న పరితాపముతో సత్యభామ ఈర్ష్యా కషాయితయై కోపసదనము చేరినది. అపరాధమును మన్నింపుమని పదములపై వ్రాలిన అఖిలలోక వంద్యుడగు శ్రీకృష్ణుని శిరమును వామ పాదముతో తొలగద్రోచినది. పిదప శ్రీకృష్ణుడామె నోదార్చుచు పారిజాత వృక్షమునే తెచ్చి యిత్తునని వాగ్దానము చేయగా మురిసి గతమును మరచినది.

పారిజాతాపహరణమునకు మూలకారణము సత్య స్వభావము. ఈర్ష్య, మాన క్రోధములు, పట్టుదల, సవతుల యెడ అసహనము, "చక్కని దాననంచు నెల జవ్వని నంచు జగంబులోన, వేరెక్కిన దాననంచు బతియెంతయు నాకనురక్తుడంచు...కొంతల గణింపదు" ఇట్టి లక్షణములు గల సత్య - స్వాధీన

1. హరివంశము - ఉత్తర భాగము చతుర్థాశ్వాసము 213 to 226=14 గద్య పద్యాలలో గలదు.

పతిక. అహంకారిణి. భర్తను గాఢముగ ప్రేమించిన స్త్రీ. ఈ ప్రేమను పరులు పంచుకొనుట యనునది సహింపలేనిది. ప్రాణనాథునకు తనపై నుండు ప్రేమ తరగిపోవు చున్నదను భయము చేతనే యింతటి సంక్షోభమునకు గురియైనది. రుక్మిణి యెడగల ఈర్ష్యచే పారిజాతము కావలయునని పట్టుబట్టినదే గాని నిజమున కామెకు ఆ పుష్పము నందంతగ వాంఛ యుండియుండక పోవచ్చును. ఆ ఈర్ష్య చేతనే తాను రుక్మిణి కన్న నధికురాలినిగ నిరూపించుకొనుటకై భర్తతో దేవ లోకముపై దండెత్తి పారిజాత వృక్షమునే సంపాదించినది.

సత్యభామ సౌందర్యవతి. అంతకు మించి అభిమానవతి. అందులకే అందరికన్న నెక్కుడుగా శ్రీకృష్ణుని మనస్సును చూరగొన్నది. శ్రీకృష్ణుడు తనకే కావలెనని కోరుకున్నది. అతడిని, అతడిచ్చు బహుమతులు అన్నియు తన స్వంతము కావలయునని ఆశించినది. చెలికత్తె చెప్పిన మాటలను విని ఆశ ఫలించక పోవుట వలన "....ప్రేటువడ్డ యురగాంగనయుం బలె, నేయి వోయ భగ్గున దరికొన్న భీషణ హుతాశనకీల యనంగ లేచి..." గద్గద కంఠముతో, "ఏమేమీ కలహాశనుండచటికై యేతెంచి యిట్లాడెనా, యా మాట లెవ్వియొగ్గి తా వినియెనా, యా గోపికావల్లభుండేమేమాడెను రుక్మిణీ సతియు"... అనుచు క్రోధావేశ పరవశయై పల్కినది.

సర్వ సాధారణముగా కోపమును పొందిన వారు మర్యాదను కూడ విస్మరించి, ఎదుటివారెంతటి ఉన్నతులైనను, పూజ్యులైనను లెక్కచేయక చులకనగా మాట్లాడుదురు. సత్యయు నిట్ల నంతే చేసినది. శ్రీకృష్ణుడు గోపికా వల్లభుడనియు, నారదుని కలహాశనుడనియు మాట్లాడినది. మరియు రుక్మిణీ సతియు ఏమి మాట్లాడెను ? మోమాటము లేక నిజము నెరిగించమన్నది. నాథుడు, శ్రీకృష్ణుడు ఏమి వచించినను నామెకు లెక్కగాదు. రుక్మిణీదేవి ఏమి యన్నదో కావలయును. ఇది స్త్రీ సహజమైన స్వభావము. "మొగుడు కొట్టినందులకు కాదుగాని తోడికోడలు నవ్వినందుకు ఏడ్చిన" దను లోకోక్తి ఇట సత్య సుందరముగ నొప్పినది. సత్య అభిమానవతిగదా! ఈ విషయము ఆమె మాటల వలననే వ్యక్తమగుచున్నది. శ్రీ కృష్ణుడు రుక్మిణికి పారిజాతము నిచ్చెనని చెలి ముఖమున విని...

"హా చెవుల న్వినంబడియు బ్రాణము దాల్చెద
యేన నింతగా
నోచితి నింక నెట్టివి కనుంగొన నెమ్మెయి నున్న
దాననో." 1.91

-అని రోదించినది. ఇట నామె అభిమానము దెబ్బతిన్నదని స్పష్టమగుచున్నది. ఇక ప్రాణములతో నుండుట అనవసరమని భావించినది. ముమ్ముందు ఇంకేమి సంఘటనలు వినవలసి యుండునో కదా యని చింతించినది. ఇవ్విధమైన ఈమె చింతన సమంజసముగ నున్నది. ఎందువలననగా "కలలోనైన నవ్వులకైన నా మాట జవదాట వెఱచునో చంద్ర వదన; యే పదార్థంబు నా యెదుటఁబెట్టక మున్న యెవ్వారి కొసగఁడు" అని శ్రీకృష్ణుని విషయికముగా మిక్కలి నమ్మకము కలిగి యుండెడిది. ఇప్పుడీ విధమున ఆ నమ్మకమునకు భంగము వాటిల్లగా నామెకు కల్గిన అవమానము, కోపము చెప్పలేనిదని భావించవలెను.

రసజ్ఞ రాజశేఖరుడయిన శ్రీకృష్ణుడు సత్య పాద తాడనమును తనకొక మన్ననగనే గ్రహించినాడు. ప్రియసఖిని ప్రియమార ఓదార్చ సాగెను. కాని ఖండితయగు సత్య శ్రీకృష్ణుని తూలనాడుట మానినది కాదు. ఈ సందర్భమున ఎన్ని అనునయ వాక్యములను పల్కినను నామె లెక్కించునదిగా లేదు. ఆ రసికుని ఓదార్పును పట్టించుకొనకుండ

"మానంబె తొడవు సతులకు. మానమె ప్రాణాది కంబు మాన మఖిల సమ్మానములకు మూలంబగు మాన రహితమైన బ్రతుకు మానిని కేలా?" అని విలపించినదీ మానిని. మాన రహితమైన బ్రతుకు బ్రతుకుట వ్యర్థమని, ప్రాణత్యాగమే మేలనుటలో సత్య ఎంతటి అభిమానవతియో స్పష్టమగుచున్నది. ఈమె యింతటిదని యెఱింగిన వాడగుట చేతనే శ్రీకృష్ణుడు "అరదము నెక్కి కేతన పటాంచల మైన తాల్మితో సత్యభామ సముదంచిత కాంచన సౌధవీధికి వచ్చినాడు. పిమ్మట పారిజాత వృక్షమునే తెచ్చియిచ్చెదనననిన గాని శాంతించినది కాదు అంతటి అభిమానవతీ సత్యామానిని.

సత్యభామ గర్వాతిశయము ఉట్టిపడ ప్రవర్తించు ఘట్టములును లేకపోలేదు. శ్రీకృష్ణుడు సత్యభామా సహితుడై వైజయంతమున కేగినపుడు అటగల పారిజాత వృక్షమును సత్యాదేవి కోరిక మేరకు పెక లించు చుండగా నవటి వనపాలకు లడ్డుపడి అట్లు చేయుట తగదని పలుకగా, వారలకు సమాధానముగ శ్రీకృష్ణుడు పలుకబోవ నాతని వారించుచు సత్య భామ తానే గర్వాతిశయము మీఱగ వారలతో నిట్లని నది... "వినుడు సురేశ్వరు వనపాలకులు వార్థిఁబొడ మిన యీ దివ్య భూరుహమున కింద్రాణి యెవ్వతె యింద్రుడు నెవ్వడు ...." దీనం బట్టి చూడ ఆమె అహంభావిని యనియు వ్యక్తమగుచున్నది.

*పద్మ పురాణము :*

విష్ణు పురాణము నందు శచీదేవి పరోక్షముగ సత్య నవమానము చేసినట్లు గలదు. అందు సూచ్య ప్రాయముగా నున్న ఈ విషయము 'పద్మ పురాణము' నందు మరి కొంచెము విపులీకరించబడినది.

ఇందు శచీదేవి అహ్వానముపై సత్యభామ వారిం టికి వచ్చినది. ఆ సమయమున శక్ర ప్రేరేపితు లైన దేవ కింకరులు పారిజాత సుమములను తీసి కొనివచ్చి శచీదేవి కిచ్చిరి. అప్పుడు శచీదేవి, 'మానవ స్త్రీ యైన సత్య పారిజాత పుష్పములను ధరింప ననర్హురాలని యెంచి' ఆమె కందొక్కటి యైన నీయక ఆమెను కించ పరచుచు తానే అన్నిం టిని ధరించినది.

ఇట సత్యభామ శచీదేవి వలన ప్రత్యక్షముగా నవమానము నొందినది ఆ అవమానము వలన కల్గిన కోప భావముతో శ్రీకృష్ణుని నుద్దేశించి, "ఓ యదు శ్రేష్ఠా ! శచీదేవికి పారిజాత పుష్పముల వలని గర్వ మధికముగా నున్నది. అందొక్కటి యైన నాకీయక తానే అన్నింటిని ధరించిన"దని ఆరోపించుటలో, సూచ్య ప్రాయముగా ఇకపై ఆ పుష్పములు శచీదేవి ధరించుటకు వీలుగాని విధముగా ఆ వృక్షమునే హరింపవలెననెడి విషయము ధ్వనించు చున్నది. ఈ ధ్వని గర్భిత విషయమును శ్రీకృష్ణుడు గ్రహించిన వాడగుటచే వెంటనే పారిజాత వృక్షమును గరుడునిపై పెట్టినాడు.

'పారిజాత వృక్షము'ను కావలయు ననెడి తన అభి ప్రాయమును సూచ్యప్రాయముగ సూచించి, తన కోరికను నెరవేర్చుకున్న సత్యను 'నెఱజాణ' యనియే చెప్పవలెను.

*చిత్రభారతము :* ధర్మన, పద్మపురాణము నాధా రముగా గైకొని. తన కావ్యమునందు వృత్తాంత ప్రాముఖ్యత మేరకు దాని నభివర్ణించెను. [1] 'ధర్మన-చిత్రభారతము' నందు సత్యభామ మానవతిగ, అమా యకురాలిగ చిత్రింపబడినది.

శచీదేవి పారిజాత పుష్పములలో నొక్కటి యైనను సత్యభామ కీయక, తానే అన్నింటిని ధరించి నది. మరియు అవి దేవతా సంబంధములు గావున మానవ స్త్రీల కీయరాదని కించపరచుచు పల్కెను. సత్యభామకు శచీదేవి ప్రవర్తనవలన, మాటలవలన

1. చిత్రభారతము. 5వ ఆశ్వాసములో 18 గద్య పద్యాలలో గలదు. 84-101.

రోషము హెచ్చినది. ఇట సత్యకే గాదు సామాన్య స్త్రీకి అయినను రోషము వచ్చి తీరును. అందును అభిమానమునే ప్రాణముగా గల్గిన సత్య సంగతి యడుగ నేల? సంస్కారవతియైన సత్యభామ, శీఘ్రమే తన గృహమునకేతెంచి, 'ఈ నను కోపము స్మరించి వహించి పులోమజ వేడి మాటకై గాసిలెనది.'

సత్య ఈ విధముగా దుఃఖించు సమయమున శ్రీకృష్ణు డరుదెంచి, ఆమెను లాలించి, బుజ్జగించి దుఃఖ కారణమును అడుగగా, ఆమె ఆ అవమానము మరల అప్పుడే జరిగినట్లు తలంచి, 'ముంగొంగు ముత్యముల గంద కోమలి నూతన స్వరముల గ్రోలుచు కోయిల పిల్లయో' యనునట్లుగ రోదించి నది. పిమ్మట హరితో, 'ఇంద్రుదేవి మానవ కాంత నని పారిజాత కుసుమము నీయలేదని' చెప్పినది. ఇట సత్య వర్తనలో అమాయకత్వము గోచర మగుచున్నది.

తమ ఎదుటనే ఇతరులెవరైన నేదైన వస్తువును గ్రహించినపుడు చిన్నపిల్లలు అలిగి ఇంటికి వచ్చి దుఃఖింతురు. ఆ సమయమున మొదటగా వారికి కావల్సినది తల్లి ఓదార్పు ఆ పిదప వారి కీయకుండ అవతలివారు గ్రహించిన వస్తువు ఇట సత్య ప్రవర్తనలో నీ విధమైన పిల్లల తీరు కన్పించు చున్నది. దుఃఖించుచున్న సత్యను శ్రీకృష్ణుడు అనునయించి కారణము నడిగిన పిమ్మటనే చెప్పినది గాని తనంతటగా తాను చెప్పలేదు శ్రీకృష్ణుడు కారణ మడుగగనే దుఃఖ ముప్పొంగి రోదించి ఆ పిదపనే చెప్పినది. అదియును 'కోయిల పిల్లవలె' నేడ్చినదని కవి చెప్పుటలోను నిట 'చిన్న పిల్లవలె' అను విషయము స్పష్టమయినది. "ఇంద్రుదేవి పారిజాత మహీజ పుష్పముల నీయదయ్యె, మానవకాంత వీవనుచు నన్ను నేవగింపుచు నందానే వహించెను" అని ఆరోపించు టెంతయు ముద్దుగ నున్నది మరియు ఆరోపణ చేయుటలోని సొగసు చిన్నలకు కట్టినటుగా వర్ణింపబడినది. పిల్లలీ విధముగ ఆరోపించినపుడు వెంటనే వారిని దగ్గరకి తీసికొని ఓదార్చుట సామాన్య విషయము శ్రీకృష్ణుడును ఆ విధముగనే చేసెను. ఆమెను ప్రేమతో కౌగిలిలోనికి తీసికొని, కన్నీటిని తుడిచి, చిక్కువడ్డ కురులను కొప్పున దోపి, గొలుసులను చక్కగా సరిజేసి, జారిన పైటను చనుదోయిపై వేసి, ఆమె మోమును చేతితో ఎత్తి... అనునయించెను. పిదప శ్రీకృష్ణుం డామెతో 'మానవ సతివని నిన్నవమానము చేసి శచీదేవి నీకు పారిజాత కుసుమముల నీయలేదుగా' పారిజాత వృక్షమునే గొనివచ్చి నీ యుద్యాన వనమున పెట్టెదనని' పల్కెను. సత్యకి కావల్సినది ఆ పారిజాత కుసుమము మాత్రమే కాని ఆమె అతని ముద్దుల సతీమణి కదా! కారణ రహితముగా తన భార్య సోదరుని యింత అవమానింపబడుట, భార్య యందనురక్తి గల ఏ మగడునూ హర్షించడు. హర్షించలేదు అందుకే సత్యాపతి పారిజాత పుష్పములే కాదు, ఆ వృక్షమునే తెచ్చియిచ్చెదనని చెప్పెను.

ఇందు సత్యభామ పాత్ర సర్వులు అందరికినీ ఒక విధమగు సానుభూతి యుదయించును. పారిజాత వృక్షము ఆమెకి లభించినపుడు మనకి ఆమె వర్తన వల్ల సముచిత భావము కల్గును. ఇట సత్యాకృష్ణుల దాంపత్య మధురిమను దర్పణ మనోహరముగ వర్ణించెను. ఈ ఓదార్పు మూలము గోలేదు. ఇట నీతడు విషయమును పెంచి సత్యాపాత్ర ఔన్నత్యమును మనోహరముగ తీర్చిదిద్దెను.

ఇందు సత్యభామ శ్రీకృష్ణుని ప్రియ భార్యామణిగ చిత్రించబడినది. ఆ విషయము, "ఆ హరి ప్రియ యవట నిక్కక..." అని యనుటలోను, "ఆ రమణీ శిరోమణి ప్రియంబున..." అని యనుటలోను "తన కాంతామణి సత్యభామకు వినోద క్రీడకై దేవలోక నివాసంబగు పారిజాతమును సురౌఘంబెల్లగా

పున్నచో గొల్ల కృష్ణుడవుడెంచె" ననుటలోను నిడి స్పష్టమగుచున్నది.

ముద్దు ముద్దుగా పలుకుచు అమాయకముగ ప్రవర్తించుటలోని సొగసును ధర్మనయే తొలిసారిగ సత్య పాత్ర చిత్రణ ద్వారా పరిచయము చేసి నంది తిమ్మనకు మార్గదర్శకుడయ్యెనని భావింపవచ్చును.

ఈ రీతిగా పురాణముల యందు ప్రబంధముల యందు చిత్రింపబడిన సత్య పాత్రను పరిశీలించినచో ఆమె సౌందర్యవతి, అభిమానవతి యనుట స్పష్టము. విష్ణు, బ్రహ్మ పురాణములందు, హరి వంశము నందు, తిమ్మన ప్రబంధమందు ఆమె అహంభావిని, సపత్ని మాత్సర్యము గలదిగ చిత్రించబడినది. భాగవత, బ్రహ్మ వైవర్త పురాణములందు ఉత్తర హరి వంశమునందు సత్యభామ సంస్కారవతిగా వర్తనము వెల్లడియగుచున్నది. పద్మ పురాణమునందు 'నెఱజాణ' గా వర్ణింపబడిన సత్య 'చిత్ర భారతము' నందు 'ముగ్ధమోహనాంగి'గ సాక్షాత్కరించుచున్నది.

నంది తిమ్మన సత్యభామ "చక్కని దాననంచు నెల జవ్వని నంచు, జగంబులోన చేరెక్కిన దాననంచు, అతియెంతయునా సవతున్ సహించు, దానిక్కుచు విఱ్ఱవీగుచు..." ఆంధ్ర పాఠకలోకమునం దెట్లు స్థిరపడెనో, అట్లే ధర్మన - సత్యభామ, "ఇందుదేవి పారిజాత మహీజ పుష్పముల నీకు దయ్యు, మానవ కాంత నీవనుచు నన్ను నేవగింపుచు దానే వహించెను" అమాయక ముగా, అతి సహజముగా ఆరోపించుచు ఆంధ్ర పాఠక హృదయమునందు చిరంజీవియై నిలిచి యుండును. ఇట్టి సత్యభామను చిత్రించి ఆంధ్ర పాఠకుల కందించిన కీర్తి ధర్మనకే దక్కినదని చెప్పుటలో నతిశయోక్తి లేదు.

- ఈ వ్యాసము, నాట్టుర త్రోవెన్ను మయ వాసిరి గారి దర్శకత్వంలో నేను చేయుచున్న పరిశోధనమునకు సంబంధించినది. నా పరిశోధనాంశము 'చిత్ర భారతము - విమర్శనాత్మక పరిశీలనము.' ఆమెకు నా కృతజ్ఞతలు.



# మన బాలురకు పాఠశాలలు శ్రేయోజీవితము

డి. పూర్ణచంద్రరావు

ప్రతి ఒక జీవియు ప్రశాంతమగు జీవితము నభిలషించును. ప్రతి ఒక వ్యక్తియు తమ బాలుడు శ్రేయస్కరమయిన ఒడుదుడుకులు లేని జీవితమును కలిగియుండవలయుననియే అభిలషించును. ఈ విధమయిన ఉజ్జ్వల జీవితము తమ బాలురు బాల్యదశయందున్న తరుణముననే నిష్పన్నము గవలయునని వాంఛింతురు తల్లిదండ్రు లనేకమంది తమ బాలురు పెద్దవారయిన పిదప శీలము, సత్ప్రవర్తనను విడనాడి ఉన్మత్తుడయినవాడగుచు తిరుగాడుటకు తాము సహితము బాధ్యులమనియు వగచుచుండుట సహితము జరుగుచున్నది. ఈ పరిస్థితులలో పాఠశాలల పాత్ర సహితము ప్రశ్నించవలసి యున్నది. కారణము తమ బాలురు బాల్యజీవితముయొక్క అధిక భాగము పాఠశాలయందు గడుపుచుండుట యని గుర్తించవలయును కనుక బాలురు ఒడుదుడుకులు లేని ప్రశాంతమయిన శ్రేయోజీవితమును అలవరచుకొని గడపుటయందు పాఠశాలలు ముఖ్యమగు పాత్రను నిర్వహించవలయును బాలురు యువకులయిన పిదప శీలయుతమయిన ప్రశాంతమగు జీవితమును గడుపజాలకుండుటయందు కొంతవనుక ఈ పాఠశాలలు బాధ్యత వహించవలసి యున్నదిగా గుర్తించవలయును. కనుక పాఠశాలలు బాలురకు నిర్మలమయిన పరిసరమును, పరిస్థితులను కల్పించవలయును.

అద్యతన కాలమున మన పాఠశాలలు రెండు విధములయిన కార్యక్రమమును అమలుపరచవలయును. (i) బాలురు బాల్యదశయందు ఒడుదుడుకులు లేని సుఖప్రదమగు జీవితమును గడుపుట, (ii) ఆ బాలుడు యువకుడయిన పిదప తన శక్తిసామర్థ్యముల కనుగుణముగా అవకాశములను కల్పించుకొను విధముగను పరిస్థితులను మలచుకొనగలుగును" అని అవగాహన చెందు విధముగను తయారు చేయబడవలయును. యువకుడయిన పిదప తన జీవితమును ఒడుదుడుకులు లేని విధముగ గడుపగలుగుట యనునది ప్రకర్షవంతమయిన బాల్యదశయందు ఆధారపడియున్నదని గుర్తించవలయును పాఠశాలలు కేవలము బాలురను గురించి మాత్రము గాక తమ ఉపాధ్యాయులు సహితము సుసంపన్నమయిన జీవితమును అనుభవించవలయును" అని గుర్తించవలయును. కారణము దైనందిన జీవితములో అధిక భాగము బాలురు ఉపాధ్యాయులు ఒక గదియందు ప్రక్కప్రక్కన కలసికట్టుగా గడుపుట అనివార్యమయి యున్నది. ఉపాధ్యాయులు బాలురు ఎవరికి వారు ప్రత్యేకముగా సంపన్నమయిన జీవితమును గడుపుట యనునది వివాదగ్రస్తమయిన విషయము. కారణము వారిరువురును కలసికట్టుగా ఒకరినొకరు అవగాహన చేసికొనుచు సంపన్నమయిన జీవితమును అలవరచుకొనుటయందు వైఫల్యము చెందుటయని గుర్తించవలయును.

శ్రేయోజీవితము ఏ విధమయినది? శ్రేయోజీవితమనునది బాలురకు, అటు ఉపాధ్యాయులకు ఏకరూపమున ప్రధానమయిన అంశమని గుర్తించవలయును శ్రేయోజీవితమును పరిపాటించుటయందు, బాలురయొక్కయు, అటు ఉపాధ్యాయులయొక్క గాని వయస్సు సహితము గణనీయమయిన అంశమేమాత్రము గాజాలదు. శ్రేయోజీవితము నలవరచు

కొని పరిపోషణ చేసికొనుటకు అపేక్షితమయిన గుణగణములను కలిగియుండుట ఆవశ్యకమయియున్నది. చిన్న పెద్ద అను తారతమ్యతను వదలి ప్రతి ఒకరును తమయెడ ఇతరులు ప్రదర్శించు దృక్పథముల యెడ అతి సున్నితముగా వ్యవహరింతురు. ఈ నిధమైన సున్నిత భావముల పరిధి అభివ్యక్తమవుచున్న ఆసక్తి లేక శ్రద్ధ వ్యక్తిగత విషయముగను ఆతని పరిసరముల మీదను ఆధారపడి ఉండును. కొందరు వ్యక్తులు ఇతరుల సాహచర్యము లేకుండగనే వ్యవహరించుచుందురు. ఈ విధమయిన వ్యక్తులు సహితము సంపూర్ణముగా మానవ సంబంధములు లేకుండగ ఉండరని భావించజాలము. ఒక బుద్ధ భగవానుడు మాత్రము ఇతరుల సంబంధ వ్యవహారములను వదలి వ్యవహరించ కలిగియుండును. ఏవ్యక్తి నయినను ఒంటరివానిగా చేయుటయన్న ఆ వ్యక్తిని ఉష్ట్రపక్షివంటి వానిగా చేయుట యని భావించవలయును. తన సహచరులు నిరాకరించినయెడల ఏ బాలుడును లేక వ్యక్తియును తన పవిత్రతను కాపాడుకొనజాలడు. యువకులు, బాలురు ఇతరుల యొక్క దృష్టి, అవధానముల వలన ఆకర్షితులు కావలయునన్నవారు, వారు వారివారి ప్రత్యేక విధానములను కలిగియుండవలయును. ప్రతికూలమయిన లేక తటస్థమయిన వాతావరణమున కన్నను తమను అనుమతించుచున్న అనుకూలమయిన పరిసరముల యందు బాలురు ఆసక్తితో ఆయా కార్యములను ఆచరించగలుగుదు మని విశ్వసింతురు. ఏ సన్నివేశములయందు ఆయా బాలురు చేయు ప్రయత్నములు ఆసక్తిని కల్గించునో లేక ఇతరులనుండి సహకృతి లభించునో ఆ సన్నివేశములకు భిన్నమయిన వాటి యందు సంతృప్తి కలుగజాలదు. ఈ సూత్రము ఉపాధ్యాయుల వృత్తిధర్మములయందు వారి స్వీయ ధర్మములయందు ఉపకరించుచున్నది.

బాలురు తమ చుట్టునున్న ఇతరులు తమయెడ చూపించు దృక్పథములయందు ఎంతయో సున్నితముగా ఉందురు. పసికందులు, చిన్నపిల్లలు తమను ఎత్తుకొనుట, ముద్దాడుట, లాలించుట మొదలయిన శారీరకమయిన చేష్టలయందు సున్నితమయిన అంగీకారమును చూపించెదరు. ప్రేమపూర్వకమయిన, ఆరోగ్యవంతమయిన పరిసరములయందు ఈ బాలురు అనుకూలమయిన భావమును ప్రదర్శింతురు, అభివృద్ధి చెందుదురు. ఎదిగిన బాలురు యువకులవలెనే అనుకూలమయిన లేక ఉమకు ఆమోదమును కలిగించు వాతావరణమును ఆపేక్షించుదురు. ఎదిగిన పిదప ఈ బాలురు మానవమాత్రులుగా శారీరకముగా లభించు చేష్టలవలన కలుగు ఆప్యాయతలను అపేక్షింప కున్నను మమత, ప్రేమ భావముల నపేక్షించుదురు. ఈ ఎదిగిన బాలురు తమ చుట్టునున్న తోటి మానవ సమాజమునందు ప్రధానమయిన వ్యక్తులుగను లేక నాయకులుగను కావలయునని భావింతురు, అవసరమును కలిగియుందురు. ఈ బాలురు తమతమ బాహ్య ప్రవర్తనలయందు పెద్దలందించు అంగీకార, ప్రేమ భావములను, కేంద్రీకరింపచేయు అవసరమునంతయు కలిగియుందురు కొందరు తల్లి, తండ్రులు, ఉపాధ్యాయులు ఈ బాలురపేక్షించు వారి అనుమతి, మమకార భావములను, తమ స్వార్థ ప్రయోజనములకు అనుగుణముగా ఉపయోగించుటకు యత్నింతురు.

నేను, నా వారు అను భావన తన చుట్టునున్న పరిసరములయందు విశ్వాసము కలిగియుండుట అను భావన, ఈ రెండు అంశములు ఇతరులచే పరిగణింపబడుచున్నవై — "భద్రత" అని మనోవైజ్ఞానికులు నిర్వచింతురు మానవమాత్రుని భద్రతకు సంబంధించిన అవసరమును, బలహీనత అని గానీ లేక సహజమయిన అశక్తత అని గానీ వివరింపబడజాలదు. వివరింపబడిన ఈ బాలుని అవసరము తగు విధముగా నెరవేర్చబడకున్న యెడల ఆ బాలుని శారీరకమయిన అభివృద్ధి కుంఠితమగుట మరియు అతని పురోభివృద్ధి పెడత్రోవన నడిపింపబడిన దగుట సంభవించుచున్నది. కనుక ఆ బాలుని శక్తి

హీనునిగా చేయాపనేయుట సహితము కలుగుచున్నది- ఈ అవసరమను లక్షణము మానవునికి సంబంధించిన వయస్సును పరిగణన చేయని మానవునియందలి సహజ లక్షణమని గుర్తించవలయును ఈ 'అవసరమను' మానవలక్షణము బాల్యమునుండియు జీవితావధి అంతయు సహజశీలమై ఉండును మానవమాత్రుడైన జీవితన వివిధ అభివృద్ధి దశలను, అనుభవములను ఎదుర్కొనవలసి ఉండుటవలన ఈ మానవుని సహజ లక్షణమగు 'అవసరమును' సంతృప్తిపరచగల సన్నివేశములు మాత్రము మార్పు చెందుచుండును కాని సహజలక్షణమగు ఈ అవసరము మాత్రము నిరంతరము అనుస్యూతము అగుచునే ఉండును. భద్రత, ఆత్మగౌరవము ఈ రెంటికి సంబంధించిన మానవ లక్షణమగు అవసరము బాలురయొక్క ఉద్వేగ విషయకమయిన అభివృద్ధిని నియమనము చేయగల బాలురతో సహకార సంబంధములను నెలపుచున్న తల్లిదండ్రులకు, ఉపాధ్యాయులకు, తదితర వ్యక్తులకు కొన్ని సమస్యలను కల్పించును. బాలురు తమంత తాముగా ఆరోగ్యవంతముగ యుండునటుల అవకాశములను కల్పించు పరిసరము ఆ బాలురు ఒడిదుడుకులు లేకుండగా పెరుగుదలను కల్పించు సన్నివేశమనియే నిర్వచింపవలెను. ఈ కారణములవలన భద్రతగల జీవితమనగా శ్రేయోవంతమగు జీవితమనియే చెప్పవలెను

వయస్సును పరిగణించక వయస్సుతో నిమిత్తము లేనటువంటి మానవుల యందున్న మరియొక సహజ లక్షణము- "ప్రేరణ" లేక కుతూహలము ఈ ప్రేరణ యను సహజ లక్షణము ఆయా వస్తువులను, విషయములను అవగాహన చేసుకొనవలయునని బాలుని ప్రేరితుని చేయును. వాస్తవికమయిన అభ్యాసము కొరకు ఈ ప్రేరణ ఎంతయు అవశ్యకమయియున్నది ఈ సహజ లక్షణమగు ప్రేరణ శాస్త్రీయమయిన పరిశోధనల కెంతయు అవశ్యకమయి యున్నది. పరిశోధనలు సహితము తదితర జంతుజాలము ఎంతో వివిధములయిన ప్రవర్తనా విధానములతో జన్మించుచున్నారు. జంతుజాలముల యందు కొన్ని మాత్రమే కొన్ని విషయములను అభ్యసించగలిగి యుండును. అవరణ యందు ఈ జంతువుల ప్రవర్తన సహితము నియమితమయి యుండునని గుర్తించవలయును. కాని మానవ మాత్రులగు జీవుల యొక్క ప్రవర్తన మాత్రము నియమితము గాజాలదు. మానవమాత్రులగు ఈ ప్రాణులు మాత్రము సాంస్కృతికమయిన వివిధ ప్రబోధనలను గలిగియుండును. ఈ విధమయిన సాంస్కృతికమయిన ప్రబోధనల వలననే అనేక విషయములయందు పరిశోధన చేయవలయుననియును. నూతనాంశములను గనుగొనవలయుననియును అభిలషింతురు. మానవులు తమ అనుభవముల వలన శ్రేయస్సును ఆపాదించుకొనగలిగిన శక్తి గలిగియుందురు. మానవులు తమకు అవగతమయిన భావములకును, నూతన భావములకును మధ్యగల ఒడిదొడుకుల సంబంధమును అవగాహన చేసికొను శక్తిని గలిగియుందురు. మానవులు వయోవంతులయి పరిపక్వదశ నందిన కొలదియు గతానుభవము వలన అవగతమయిన అంశముల వలన ఆయా మానవుల ప్రవర్తన నియమితముగా జరుగుచున్నదిగా గుర్తించవలసియున్నది. కనుక మానవులు ఏ విధమయిన అనుభవమును కలిగియుందురను విషయము అతి ప్రధానమయిన విషయముగా గుర్తించవలయును. పిల్లలు, యువకులు కేవలము ఒక నిర్దిష్టమయిన విషయములను అనుసరించుచుందురు బాలురు యువకులగు వ్యక్తులు వాస్తవమగు క్రమముగ బాహ్యముగా ఆయా వస్తువులను పరిశీలించి గుర్తించుచున్న అంశములను స్వకీయముగా అంగీకృతము చేసి సహజతనాపాదించుటకు చేయు ప్రయత్నము వలన గలిగిన ఆయా అనుభవముల మధ్య గల సంబంధము మాత్రము సదా మారుచుండును కాని ఆయా

# సూర్య గ్రహణము  రచన: "శాంతాకృష్ణులు"

తే॥ గీ॥ చంద్రుడా ! నీవు సూర్యుని సకల కాంతి
అకట ! భూదేవి నంటక ప్రకటమగుచు
నుండఁగలవాడవే ? నీ ప్రచండ శక్తి
సూర్యుఁడిచ్చినదే గదా సూక్ష్మమరయ ॥ 1

తే॥ గీ॥ రెండు నిముషాల కాలమే రెచ్చిపోయి
భాను కిరణాలఁ గప్పిన పనికె నీవు
గొప్ప వానిగ గర్వివై చెప్పుకోయి
అడియు కూడను భూమిపై నంతలేదు ॥ 2

తే॥ గీ॥ కొద్ది నిముషాలు సూర్యుని గొప్పతనము
కప్పిపుచ్చిన యది గొప్పఁగాదు చంద్ర !
సూర్యకాంతినిఁ బోలెడు శౌర్యగుణము
నీకుఁ గలదేని తెల్పుమా నిజముఁ గనుచు ॥ 3

తే॥ గీ॥ ఎవని యాశ్రయమందున నింతయైన
కాంతినీకున్నదో దానిఁ గాంచియైన
విఱ్ఱవీగకు పొగరేల వెఱ్ఱివాఁడ !
సూర్యుడుండగ నీ కేది చూడకాంతి ॥ 4

తే॥ గీ॥ ఎప్పుడో సూర్యభగవాను నిప్పు కణపు
కాంతులను నీవు నడ్డమై కప్పవచ్చు
నందుచేతనె గొప్పవాడగుట కల్ల
కొన్ని నిముషాల తర్వాతె గొప్పపోయె ॥ 5

కం॥ ధగ ధగ మెరిసెడు భానుని
తగుదువ కప్పంగ నీవు తర్కము మానుమ్ !
నగుదురు గొప్పలు పలుకఁగ
వికటపు బ్రతుకేల నిజము వెలవెలబారన్ ॥ 6

తే॥ గీ॥ సూర్యకిరణాల నీ వడ్డ చూచి జనులు
ప్రార్థనంబులఁ జేయునిన్ పాపద్రోల
నీవు సూర్యుని కిరణాల నిలువలేక
వదలి పోవంగ జనులెల్ల మునుఁ గంద్రు ॥ 7

తే॥ గీ॥ నీవు సూర్యుని కిరణాల నేలమీద
వ్రాలకుండఁగఁ జేసిన పాపమునకు
జనులు స్నానాలఁ జేతురు జపములాది
తపములను గూడఁ జేతురు తలుతె నిజము ॥ 8

తే॥ గీ॥ చంద్ర ! నిమ నీవు గొప్పగా జగతిఁబాట
ఎవరు నమ్మరు రిపుడైన నెరిగి నిజము
సూర్య కిరణాల నడ్డంగఁ జూడవయ్య
గ్రహణమున్నంత సేపైన గడియ కూడ
కులుక వలదయ్య నమ్రతన్ మెలఁగుమయ్య ॥ 9

(16-2-80 న సూర్య గ్రహణము రోజున 4-00 P.M. కు వ్రాసినవి).

# రంగనాథ రామాయణ కర్తృత్వము

## సత్యాన్వేషి

ఆంధ్ర వాఙ్మయమున రంగనాథ రామాయణమునకు విశిష్టమైన స్థానము కలదు. ఈ రామాయణ పూర్వ భాగమును తన తండ్రి విట్ఠలక్ష్మీపతి ఆజ్ఞననుసరించి గోన బుద్ధ భూపతి రచించినట్లు, బుద్ధ భూపతి కుమారులైన గోన కాచభూపతి విట్ఠల రాజులు ఉత్తర కాండను రచించినట్లు రంగనాథ రామాయణములో స్పష్టముగ నున్నది. రంగనాథ రామాయణ కర్తృత్వమును గురించి, గ్రంథకర్తల కాలమును గురించి, పండితుల మధ్య వాదోపవాదములు జరిగినవి. రామాయణమును రచించిన గోన బుద్ధ భూపతి మొదలగు వారు రెడ్డి కులీనులని కీ.శే. పింగళి లక్ష్మీకాంతం గారు భావించిరి. కీ. శే. చాగంటి శేషయ్య గారు గోన భూపతులు రెడ్లనియే తలంచిరి. ఇంకను మరికొందరు పండిత ప్రకాండులు ఈ చర్చలలో పాల్గొని తమ యభిప్రాయములను తెలియజేసిరి. రాయలు అండ్ కో, కడప వారు 1957 లో ప్రకటించిన రంగనాథ రామాయణమునకు కీ॥ శే॥ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు విపులమైన పీఠికను రచించిరి.

గోన కాటభూపతి, రుద్ర నరేంద్రుడు, బుద్ధ విభుడు, విట్ఠలభూవరుడు అను వారిని తన పూర్వులుగా రంగనాథ రామాయణ కర్తయైన గోన బుద్ధ భూపతి పేర్కొనెను. రంగనాథ రామాయణ కర్త తన వంశజుల పేర్లను భూపతి, నరేంద్ర, భూవర మొదలగు ఉపనామములతోడనే పేర్కొనుట సహృదయులు ప్రత్యేకముగ గుర్తుంచుకొన వలెను. తాము రెడ్డి కులీనులమని గ్రంథకర్తలు గ్రంథమునందెచ్చటను సూచింపలేదు. "రెడ్డి కులము వారు తమ కుల సూచకమైన రెడ్డి పదమును పేరు చివర చేర్చుకొనుచుండుట కడు ప్రాచీనాచారము" అని సోమశేఖర శర్మగారు సెలవిచ్చిరి. రెడ్డి రాజ్య చరిత్ర అను ప్రామాణిక గ్రంథమును రచించిన శర్మగారు తెలియజేసిన పై అభిప్రాయము శిరోధార్యమగును కదా!

క్రీ॥ శ. 1292 నాటి రాయచూరు శాసనములోని గన్నారెడ్డియు, వర్ధమాన పురములో బయలు వెడలిన అప్రకటితములైన క్రీ॥ శ॥ 1223, 1228 నాటి రెండు శాసనములలోని గణపయ రెడ్డి గోన వంశజులైన రెడ్డి నాయకులని సువిదితమే. మల్లంపల్లి వారి అభిప్రాయమును పురస్కరించుకొని చూచినచో రెడ్డి పదమును తమ పేర్లతో చేర్చుకొనని రంగనాథ రామాయణ కృతికర్తయైన గోన బుద్ధ భూపతికి ఆయన పూర్వులకు, రాయచూరు, వర్ధమాన పురము శాసనములలోని గన్నారెడ్డి, గణపయరెడ్డి నాయకులకు ఎట్టి సంబంధము లేదని సిద్ధాంతమగుచున్నది.

ఇక బూదపూరు శాసనములను గురించి ఆలోచింపవలె. ఇంతవరకు రంగనాథరామాయణ కర్తృత్వమునకు సంబంధించిన చర్చలో పాల్గొన్నవారు క్రీ. శ. 1259, 1262, 1276 సంవత్సరములనాటి బూదపూరు శాసనములను మాత్రమే స్వీకరించి తమ విమర్శలను కొనసాగించిరి. బూదపూరు మహబూబనగరు జిల్లాలో ఉన్నది. కాకతి గణపతిదేవ చక్రవర్తి సేనానాయకుడైన మల్యాల గుండయ దండ

నాథుడు చేసిన రెండు దేవాలయ నిర్మాణములు మొదటి శాసనములో వివరింపబడినవి. రెండవ శాసనములో మల్యాల గుండయ తటాకమును నిర్మించినట్లున్నది. మూడవ శాసనములో మల్యాల గుండయ నాయకుని భార్య కుప్పాంబిక తన స్వర్గీయ భర్తపేర బూదపూరులో గుడి కట్టించినట్లున్నది. కుప్పాంబిక గోన వంశజుల ఆడుపడుచు. ఈ శాసనములో కుప్పాంబిక కొడుకులు బాచయ, బొప్పండు, గణపతిదేవుండు, పర్వతము మల్లయలు పేర్కొనబడిరి. కుప్పాంబిక సోదరులగు మల్లయ, బుద్ధయ, విట్ఠయ, కాటయ కొడుకు గుండీయలుకూడ పేర్కొనబడిరి ఈ శాసనములోనే కుప్పాంబిక తండ్రి గోన బుద్ధయ యని ఉన్నది. ఈ శాసనమందలి వారిని, రంగనాథ రామాయణములోని వ్యక్తులను పోల్చి చూచినచో కుప్పాంబిక సోదరుడైన విట్ఠయయే రంగనాథరామాయణ కర్తయగు గోన బుద్ధ భూపతి తండ్రి యనియు, కుప్పాంబిక తండ్రియగు బుద్ధయయే వంశవృక్షములోని మొదటి బుద్ధభూపతి యనియు భావింపవచ్చును. మల్యాలగుండ దండాధీశ్వరుని తండ్రి బాచ వరూధినీశుడనియు, తల్లి బాచాంబిక యనియు, క్రీ. శ. 1259 నాటి బూదపూరు శాసనమువలన తెలియుచున్నది. కుప్పాంబిక కుమారుని పేరుకూడ బాచయయే. అందుచేత ఇతనికి తాతపేరు పెట్టిరని నిశ్చయింపవలెను.

"తెలంగాణా శాసనములు" ద్వితీయ సంపుటిలో మహబూబునగరు జిల్లా వర్ధమానపురములో క్రొత్తగా బయలు వెడలిన ఒక శాసనము ముద్రింపబడి యున్నది. ఈ శాసనము క్రీ. శ. 1245 సంవత్సరమునకు చెందినది. దీనియందుకూడ మల్యాలగుండ దండాధీశుడు, ఆతని భార్య కుప్పాంబిక, పేర్కొనబడిరి. ఈ నాలుగు శాసనములలో నెక్కడముకూడ మల్యాలవారు కాని, గోనవారు కాని, తెల్లని చెప్పబడలేదు. ఆయా వ్యక్తుల పేర్లతో రెడ్డి అను పదము చేర్చుటయు జరుగలేదు. అందుచేత బూదపూరు, వర్ధమానపురము, శాసనములకు సంబంధించిన వ్యక్తులు రెడ్డి కులీనులు కాదని సుస్పష్టమగుచున్నది. అట్లయినచో బూదపూరు, వర్ధమానపుర శాసనములు వేయించినవా రెవరు? అను ప్రశ్న జనించుట సహజమే "చతుర్థ కులజులే అయినచో గోనవారు ఒక్క రెడ్లలోనే కాక ఇతర కులములలోను ఉండవచ్చును కదా?" అని అచ్చమైన చరిత్రజ్ఞుడు అనవలసిన మాటనే పూజ్యులు సోమశేఖరశర్మగారు తమ పీఠికలో అనిరి.

మల్యాలవారు, గోనవారు, నేడు కూడ "పద్మనాయక వెలమ" కులమునందున్నారు. డెబ్బదియేడు గోత్రములు కల పద్మనాయక వెలమ కులీనులు కాకతీయ చక్రవర్తుల తొలిరోజులనుండి కూడ స్వామిభక్తి పరాయణులై కాకతీయ సామ్రాజ్యమునకు పట్టుగొమ్మలై విలసిల్లినట్లు చరిత్రజ్ఞులు ఎరిగిన విషయమే. విరియాల, మల్యాల, రేచర్ల, పసుపుల, విప్పర్ల, కొమరవెల్లి, వెదుళ్ళ గోత్రజ్ఞులైన పద్మనాయకులు కాకతీయ చక్రవర్తుల జైత్ర యాత్రలలో పాల్గొనినవారే. కాకతీయ ప్రతాపరుద్రుడు పద్మనాయకుల డెబ్బదియేడు గోత్రములలోని డెబ్బదియేడుగురిని సన్మానించి, వారిని ఏకశిలానగర శిలాప్రాకారమునకు గల డెబ్బదియేడు కొత్తడంబులపై మండునట్లు చేసి, డెబ్బదియేడు గురు పద్మనాయకులకు తన రాజ్యములో ఒక్కభాగము పంచిపెట్టినట్లు ఏకామ్రనాథుడు రచించిన ప్రతాపరుద్ర చరిత్ర అను వచన గ్రంథమునందు కలదు.

పైని పేర్కొనబడిన బూదపూరు, వర్ధమానపురము శాసనములలోని గోన వంశజుల బంధువులైన మల్యాల నాయకుల శాసనములు మరికొన్ని గలవు. "తెలంగాణా శాసనములు" ప్రథమ సంపుటిలో వరంగల్లు జిల్లా కొండిపర్తిలో బయలు వెడలిన క్రీ. శ. 1181, 1240 నాటి శాసనములు

ప్రచురింప బడినవి. ఈ శాసనములు మల్యాల చౌండ సేనాని. మల్యాల కాటచమూపతి వేయించినవి కరీంనగరు జిల్లా హుజూరాబాద్ తాలూకా కటుకూరులో క్రీ శ. 1250 నాటి శాసనము ఒకటి కలదు. ఈ శాసనమును "తెలంగాణా శాసనములు" ద్వితీయ సంపుటిలో ప్రకటించిరి. ఇది కూడ గణపతి దేవ మహారాజు కాలము నాటిదే. కొండపర్తిలోని రెండు శాసనములందు, బూదపూరు, కటుకూరు, వర్ధమానపురము శాసనములందును, మల్యాల నాయకుల కున్న "పెదముద్దు గండ" అను బిరుదము ప్రసక్తమై యున్నది. ఈ బిరుదమును బట్టి శాసనములందలి ఆ యా వ్యక్తుల పేరులను బట్టి, కొండిపర్తి, బూదపూరు, కటకూరు, వర్ధమాన పురము శాసనములందలి మల్యాల నాయకులు ఒకే కుదురునకు చెందిన వారని స్పష్టమగుచున్నది. కటుకూరు శాసనములో అమూల్యమైన విశేషములనేకమున్నవి. ఇందులో మల్యాల వారికి విరియాల వారికి ఉన్న బంధుత్వము వర్ణింపబడినది. విరియాల అన్నయమ్మపతి కూతురగు మైలమ మల్యాల చౌండ సేనాని భార్యయని ఈ శాసనము వలన తెలియుచున్నది. విరియాల గోత్రజులు ఏ వర్ణమునకు చెందినవారో తెలుసుకొనినచో మల్యాల వారు, వారి బంధువులైన గోన వారు ఏ వర్ణమునకు చెందిన వారో స్పష్టమగును. కాకతీయుల ప్రారంభ దశ నుండి కూడ విరియాల నాయకులు సుప్రసిద్ధులు. "కమ్మవారి చరిత్ర" రచించిన కీ. శే. కొత్త భావయ్య చౌదరి గారు విరియాల గోత్రజులు "పద్మనాయక వెలమ" కులమునకు చెందిన వారు అని తమ గ్రంథమున వ్రాసిరి. విరియాల వారు "పద్మనాయక వెలమ" వారనే నా అభిప్రాయము అని ఒకానొక సందర్భమున కీ. శే. [illegible]శేఖర శర్మగారు సెలవిచ్చిరి. [illegible] జిల్లా [illegible] సంస్థానాధిపతులు విరియాల గోత్రజులు. వారి గృహ నామము [illegible] [illegible]

మూషిక మార్జాలము," "మలరాజు గండారాయణో పాఖ్యానము" దిట్ట కవి నారాయణ కవి రచించిన "రంగరాయ చరిత్ర" గ్రంథములను పరిశీలించినచో విరియాల గోత్రజులైన మలరాజు వారు పద్మనాయకులని తెలియును. పూర్వులు నివశించిన గ్రామమును బట్టి, తమ పూర్వులలో ప్రసిద్ధులైన వ్యక్తులను బట్టి తెనుగు వారి గృహ నామములు ఏర్పడును. కటకూరు శాసనములో వివరింపబడిన విరియాల వారి వంశములో ఇద్దరు మలరాజులున్నారు ఈ యిద్దరిలో ఒకడు శూరాగ్రగణ్యుడుగా వర్ణింపబడినాడు. ఈ మల్లనృపతి వంశజులు అటని తర్వాత మలరాజు అను ఇంటి పేరును వహించుట చేత విరియాల గోత్రజులలో ఒక శాఖవారు మలరాజు వారైరి పై వివరణను బట్టి విరియాల గోత్రజులు పద్మనాయక కులమునకు చెందిన వారని సిద్ధాంతమగుచున్నది. అందుచేత విరియాల వారి బంధువులైన మల్యాల వారు. మల్యాల వారి బంధువులైన గోనవారు పద్మనాయకులగుదురని చెప్పుటకు ఏ విధమైన అభ్యంతరము లేదు గోన గృహము నామము గల పద్మ నాయకులు ఇప్పుడు కూడ ఆంధ్రప్రదేశములో చాలమంది కలరు తెలంగాణా ప్రాంతములో ఆదిలాబాద్ జిల్లాలో వీరు ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. ఆదిలాబాద్ జిల్లాలోని వంసపూరు సంస్థానాధిపతుల గృహ నామము గోనవారే. ఇట్లే గోన వారు శ్రీకాకుళము జిల్లాలోను, రాయలసీమలోను, మద్రాసు రాష్ట్రములోని చెంగల్పట్టు జిల్లాలోను కలరు.

గోనవంశజుల గోత్రము పసుపుల గోత్రము, పసుపునూళ్ళ గోత్రమనియు వ్యవహారమునందు కలదు. డెబ్బది యేడు గోత్రములు గల పద్మనాయకులలో ఒక్కొక్క గోత్రమునకు వారి వారి పితృకృత్యములను తెలియ జేయు బిరుదులు కలవు. ఆ బిరుదావళి మద్రాసులోని ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో నున్నది. ఈ బిరుదావళిలో గోన

వారి గోత్రమైన పసుపుల గోత్రము వారి బిరుదులు కూడ నున్నవి. ఆ బిరుదులివి :- "అరిగండ భైరవ, మణికొంటి నారాయణ, దళల చెదిరిరావు జింగు దళపతి మాద్భాన్లు, మేదిని మీస గండ, స్వర్గ మర్త్య పాతాళ త్రిభువన దాతల శిరోమణి, రాచూరి దుర్గ ప్రతిపాలన, ముదిగంటి వీరక్షేత్రాణో భారతీక మల్ల, గోసంగి మువనని మీసాలతో తలద్రుంచిన మీసా మండలీకరిగండ, ఝట్టి భల్లాణ హల్లి కల్లోల చరుకుమురారన్న సప్తాంగహరణ, కత్తెర గండకరిశిరచ్ఛేదన, కలుబరిగె చూరకార, కాకతి గణపతి రాజు అంగరక్షకా, గోనెగండ్ల పూర్వ సింహాసనాధీశ్వర, దేవశేశ్వరు వంశ పారావార పారిజాత, శ్రీమద్రామాయణ కృతి నాయంకులైన పసుపుల కులాన్వయ బిరుదు విజయ ప్రశస్తి విభవ విజయీభవ, దిగ్విజయీ భవ" ఈ బిరుదులను పరి శీలించినచో పసుపుల గోత్రజులైన వారికి సంబం ధించిన అనేక చారిత్రక విషయములు స్పష్టము కాగలవు. "వనిపూని అరిగండ భైరవు పేర,ఘను పేర మీసరగండని పేర, నాతత కృతి పేర సతి పుణ్య పేర, మా తండ్రి విట్ఠలక్ష్మపాలు పేర" అని రంగనాథ రామాయణము ప్రారంభములోను కాండాం తములలోను గోన బుద్ధ భూపతి తన తండ్రిని పేర్కొనెను అరిగండ భైరవ, మీసరగండ అను రెండు బిరుదులను, పైని పసుపుల వారి బిరుదు లలో నుండుట చేత, గోనబుద్ధ భూపతి గోన గృహ నామము గల పసుపుల గోత్రజుడైన పద్మనాయక కులీనుడని నిర్ణయింపవచ్చును. గోనవారు రాచూరి దుర్గ ప్రతి పాలన చేసిన వారని, కలుబరిగె చూర కారులని కూడ తెలియుచున్నది. గణపతిదేవ చక్ర వర్తి జైత్ర యాత్రలలో పసుపుల వారు రాచూరు, కలుబరిగె లను జయించి యుందురని ఊహింప వచ్చును. ఆ కాలముననే మల్యాల వారు,గోనవారు వర్ధమాన పురము, బూదపూరు ప్రాంతముల స్థిర పడియుందురు. "గోనెగండ్ల పూర్వ సింహాసనా ధీశ్వర" అను బిరుదు వలన రామాయణ కర్తలైన గోనవారి రాజధాని గోనెగండ్ల అని నిర్ణయింప వచ్చును. ఈ గోనెగండ్ల గ్రామము కర్నూలు జిల్లా పత్తికొండ తాలూకాలో ఉన్నది. "శ్రీమద్రామాయణ కృతి నాయంకులైన పసుపుల కులాన్వయ" అను వాక్య మన్నిటి కంటె ముఖ్యమైనది. ఇక్కడ చెప్ప బడిన రామాయణము నిస్సందేహముగా రంగనాథ రామాయణమే. కృతి నాయకులనగా కృతిపతులనియే కాని కృతికర్తలను అర్థము రాదు. అందుచేత పసు పుల గోత్రజులైన గోనబుద్ధ భూపతి రామాయణ కృతిపతియే కాని, కృతికర్త కాదని నిర్ణయము చేయ వలసి వచ్చును కాని కవి సార్వభౌముడైన శ్రీనాథుడు తన పితామహుడైన కమలనాభామాత్యుడు పద్మ పురాణమును రచించెనని చెప్పు సందర్భమున "పద్మపురాణ సంగ్రహ కళాకావ్య ప్రబంధాధిపున్" అని ప్రయోగించెను. ప్రబంధాధిపుడనగా కృతిభర్త అనియే అర్థము పద్మ పురాణమును కమలనాభా మాత్యుడు రచించెనని అతడే కృతికర్తయని పండితు లంగీకరించుచున్నారు కదా? అటువంటప్పుడు శ్రీమద్రామాయణ కృతి నాయకులనగా కృతికర్త లని చెప్పవచ్చును. కమలనాభామాత్యుడు పద్మపురాణ కృతికర్తయే అని అంగీకరింపబడినచో గోన భూపతులు కూడ రామాయణ కృతికర్తలగుటలో విప్రతిపత్తి ఉండదు రామాయణ కావ్య ప్రారం భములోను, కాండాంతములలోను, తానే కృతి కర్తనని గోనబుద్ధ భూపతి కంఠోక్తిగా చెప్పి యుండుటం జేసి పై బిరుదులలో ఉన్న "శ్రీమ ద్రామాయణ కృతి నాయకులైన" అను వాక్యమునకు శ్రీమద్రామాయణ కృతికర్తలైన అను అర్థమును చెప్పుకొనుట సముచితము

పై బిరుదులందలి వాక్యమును బట్టి గోన బుద్ధ భూపతి రామాయణమునకు రంగనాథ రామాయణ మను పేరు అక్కృతి అవతరించిన కాలమున లేదనియే తెలియుచున్నది. ఇట్లే తంజావూరు గ్రంథా

లయమున కూడ బుద్ధ భూపతి కృతరామాయణము నకు ముందు రంగనాథ శబ్దము లేదు. ఈ కృతి అవతరించిన అనంతరము చాలాకాలమునకు ఏ లక్షణ గ్రంథకర్తయో, లేఖకుడో రంగనాథ శబ్దమును బుద్ధభూపతి రామాయణమునకు ముందు చేర్చి పుణ్యము కట్టుకొని యుండును.

"పురుషాక్షరములతో ఆరంభమైన పదములు కొన్ని సరళాక్షరాదిమ పదములైనవి పూర్వము హూర్వంధియు గసడదవాదేశము తప్పక పొందింప బడుచు వచ్చినవి. ఈ కారణముల ననుసరించి వంశము పేరు నిజముగా కోనయైనను అది గోనగా వ్రాయబడి యుండుటయు సంభవమే" అని సోమ శేఖరశర్మగారు బుద్ధభూపతి ఇంటి పేరును గూర్చి వ్రాయుచు నగిరి. కకారముసకు ముందు ఒక పద ముండినప్పుడు సరళాదేశము వలననో, గసడదవా దేశమువలననో కకారము గకారముగామారుటతెలుగు భాషలో సంభవమే కాని ముందే పదము లేకుండ కకారము గకారముగా మారుటకు వీలులేదు కోనసీమ గోనసీమ కాదు. ఆదిలాబాద్ జిల్లా ఆదిలా బాద్ తాలూకాలో గోనయను గ్రామమున్నది. గోన అను గ్రామము పేరునకు ముందే పదమును లేదు కాబట్టి కోనయే గోనగా మారినదని చెప్పుటకు ఏ మాత్రము వీలులేదు. అందుచేత శాసనములలోను, రంగనాథ రామాయణములోను కోన శబ్దము గోనగా మారియుండవచ్చునని చెప్పి గోన వంశజులను కోన సీమను పాలించిన కోన వంశజులైన క్షత్రియులుగా చెప్పుటకు మల్లంపల్లి వారు ప్రయత్నించుట సము చితముగ లేదు గోన అను గ్రామము ఆదిలాబాద్ తాలూకాలో తప్ప ఆంధ్రప్రదేశములో మరెక్కడను లేదు. అందుచేత గోన గృహ నామము గలవారు మొట్టమొదట ఈ గోన గ్రామము నుండి వచ్చి ఆంధ్ర దేశమున ఎల్లయెడల వ్యాపించియుందురు. గోన గ్రామము నుండి వచ్చిన వారగుట చేత గోనవారైరి కాని, కోన శబ్దము గోనగా మారుట చేత వారు గోన వారు కాలేదని గ్రహింపవలెను. వరంగల్ జిల్లాలో గోనెపల్లి, నల్లగొండ జిల్లాలో గోనెరల్ (కల్సి) శ్రీకాకుళము జిల్లాలో గోనెపాడు అను గ్రామములు మాత్రము కలవు.

[illegible] ఈ గ్రంథమున వాడిన భూప పర్యాయ పదములు ననుసరించి చూడగా వీరు క్షత్రియులని అనుమానింప నవకాశము కలదు" అని మల్లంపల్లి వారు తమ పీఠికలో వ్రాసిరి. మల్లంపల్లి వారికి ఈ అనుమాన మెందులకు కలిగినదో తెలి యుట లేదు. రంగనాథ రామాయణ కర్తయైన గోన బుద్ధ భూపతికి అయన పూర్వులకు జోడింపబడి యున్న భూవరుడు, భూవిభుడు, నరేంద్రుడు, భూపతి శబ్దములు ఆ యా వ్యక్తుల కులమును సూచించుటకు ఉపయోగపడవు ఆ పదములు రాచరికమును మాత్రము స్ఫురింపజేయును. పద్మనాయక ప్రభువుల కనేకులకు భూపతి, మహీపాల మొదలగు శబ్దములు జోడింపబడియుండుట సాహిత్యవేత్తలయిన వారికి తెలిసిన విషయమే. కవి సార్వభౌముడగు శ్రీనాథుడు "రావు సింగ మహీపాలు దీవిగాలు" అని సింగమ నాయకుని సింగ మహీపాలుడని చెప్పెను కదా! ఇట్లే సింగ పృథ్వీపతి యని విశ్వేశ్వర కవి చంద్రుడు, సింగ భూపాలుడని బొమ్మకంటి అప్ప యార్యుడు తమ గ్రంథములందు ప్రయోగించి యుండిరి ఇంత ఎందులకు పద్మ నాయకులు కృతి పతులుగనో, కృతికర్తలుగనో గల సంస్కృతాంధ్ర గ్రంథములు దాదాపు ఎనుబది ప్రాచీన గ్రంథము లున్నవి. వాని యందు పద్మ నాయకుల పేర్లతో భూవరుడు, భూవిభుడు, నరేంద్రుడు, భూపతి, శబ్దములను జోడించి ప్రయోగింపబడిన పద్యములు శతాధికముగ నున్నవి. పద్మనాయకులైన విరియాల గోత్రజులలో బుద్ధిరాజు, మల్రాజు, గృహ నామ ములు కలవారు ఉన్నారు. ఇట్లే పసుపుల గోత్రజు లలో పాపరాజు అను ఇంటి పేరు గలవారు ఉన్నారు అందుచేత భూపతి, భూపుడు రాజు అను పదములు గోనవంశజుల కుండుట చేత గోన బుద్ధ భూపతి మొదలగు వారు క్షత్రియులని అనుమా నించుటకు కూడ ఏ మాత్రమవకాశము లేదు.

గోన గృహ నామము గల వారికి సంబంధించిన పసుపుల గోత్రము యొక్క బిరుదులను బట్టి, గోన వారికి, మల్యాల వారికి, విరియాల వారికి మధ్య నున్న బంధుత్వమును తెలియ జేయు శాసనము లను ఆధారము చేసికొని, ఊహించినచో గోన బుద్ధ భూపతి ప్రభృతులు పద్మనాయక కులీనులగుదురని సిద్ధాంతమగును



# 'ఖండకావ్యము' - ఒక పరిశీలన

డా॥ బి. భాస్కర చౌదరి

జాతీయ సంచలనం, రాజకీయ పరిణామం, ఆంగ్ల సారస్వత సంపర్కం మొదలైన కారణాలవల్ల ఈ శతాబ్ది ప్రారంభంలో నవ్యాంధ్ర కవితా స్రవంతి బహుముఖాల ప్రవహించింది. వానిలో ఖండకావ్యం ఒక ప్రథమ గణ్యమైన ప్రక్రియ నవ్యాంధ్ర కవులచే అది ఒక విశిష్టమైన ప్రక్రియగా తీర్చిదిద్దబడింది. రాశిలోను, వాసిలోను ఒక ప్రత్యేకతను సంతరించుకొన్న అది నవ్యాంధ్ర సాహిత్యలోకంలో అవతరించడానికి దారితీసిన పరిస్థితుల్ని సంగ్రహంగా పరిశీలించడం అవసరం.

ఈ శతాబ్ది ప్రారంభంలో ప్రజల సాంఘిక జీవన విధానంలో కలిగిన మార్పు, నవ్యాంధ్ర కవులపై ఆంగ్ల భాషా సారస్వతాలు నెరపిన ప్రభావం, విషయ ప్రచురణలో పత్రికలకున్న పరిమితి, కవి పండిత పరిపోషకులైన సంస్థానాధీశులు లేని లోటు ఖండ కావ్యం ఒక ప్రక్రియగా రూపుదాల్చడానికి సమష్టిగా కారణాలైనవి "ఇట్టి సందిగ్ధ కాలమున సుద్గ్రంధ రచన కుత్సహించు వాఁడెవఁడు ? వ్రాసినఁ చదువు నోపిక పాఠకుల కెక్కడిది? కావునఁ బ్రకాశిరుచికి నుచితములగు చిన్న చిన్న వ్యాసములు గల భారతి వంటి పత్రిక లవతరించినవి. నేఁడు పరాధీనుఁడైన తెలుఁగు వానికిట్టి ఖండ కావ్యములు నిమిషముల మీఁద మునిగిసి లేఱుబడి వేళల నింపుసేయుచుండును"[1] అని ఖండకావ్య నిర్మాతగా లబ్ధప్రతిష్ఠుడైన జాషువ పేర్కొన్న మాటలు ఖండకావ్య సృష్టికి దోహదం చేసిన అప్పటి పరిస్థితుల్ని చక్కగా ఆవిష్కరిస్తున్నాయి.

ఇరువదవ శతాబ్ది ప్రారంభంలో ప్రస్ఫుటమైన రూపురేఖల్ని దిద్దుకొన్న ఖండకావ్యం నవ్యాంధ్ర కవిత్వలోకంలో వెలసిన ఒక అపూర్వమైన ప్రక్రియ అని చెప్పడానికి వీల్లేదు. ప్రాచీన సంస్కృత లాక్షణికులచే ఒక కావ్య భేదంగా గుర్తింపబడిన అది సంస్కృత సాహిత్య ప్రపంచంలో కొంత అస్తిత్వాన్ని కూడ నిలబెట్టుకొన్నది. సంస్కృత సాహిత్య రీతులతో పరిచయమున్న నవ్యాంధ్ర కవులకు అది అపరిచితమైనది కాదు కాని ఆంగ్ల సారస్వత పరిచయ ప్రభావాల వల్లనే వారు దానిని ఒక విశిష్టమైన ప్రక్రియగా పరిపుష్ట మొనర్చడం జరిగింది సంస్కృత సాహిత్య రీతుల తోడి పరిచయం, ఆంగ్ల సారస్వతాధ్యయనం అన్న రెండు అంశాలు ఖండకావ్య ఆవిర్భావ వికాసాలకు దోహదం చేశాయి. అందువల్ల ఆధునిక విమర్శకులు ఆవిష్కరించిన ఖండకావ్య స్వరూపాన్ని పరిశీలించ డానికి పూర్వం సంస్కృతాలంకారిక నిర్దిష్టమైన తల్లక్షణాన్ని సంగ్రహంగా అనుశీలించడం అవసరం.

ప్రాచీన సంస్కృత లాక్షణికులు ఛందోబద్ధమైన శ్రవ్య కావ్యాల్ని నిబద్ధాలు, అనిబద్ధాలు అని విభజించి ఉన్నారు. సంధి సామగ్రియుతమై, ప్రకృష్టమైన బంధాన్ని కలిగి, విస్తృతము, ఉదాత్తము ఐన ఇతివృత్తంతో కూడినదే నిబద్ధ కావ్యం. దానినే దండి సర్గ బంధమని పేర్కొన్నాడు.[2] తద్భిన్నంగా సంస్కృతాలంకారికులు పేర్కొన్న ముక్తకము, యుగ్మకము, సందానితకము, కలాప

క్రము, కులకము వంటి రచనలు[3] అనిబద్ధ కావ్య జాతిలో చేర్చదగినవి. ఇవి కావ్యాంతర్గతాలై కూడా కనిపిస్తున్నాయి.[4] ఇంకా సంఖ్య పరిణామాన్ని అనుసరించి రూపుదాల్చిన రత్నావళి, విశ్వావళి, తారావళి, శతకము, సప్తశతి మొదలైన లఘు రచనలు కూడా ఈ జాతిలో చేరేవే. ఈ ప్రభేదాలన్నీ మహాకావ్య లక్షణాలు పట్టని స్వయం సంపూర్ణాలైన అనిబద్ధ కావ్యాలుగనే పరిగణింపబడ్డాయి. సంస్కృత సాహిత్య ప్రపంచంలో ఇటువంటి రచనలు సాహిత్య గౌరవానికి అంతగా నోచుకోలేకపోయాయి అమరుకము, మేఘ సందేశము వంటి కొన్ని రచనలు మాత్రం ఆస్వాద యోగ్యాలైన రసఘటికలవలె సమాదరింపబడ్డాయి.

సంస్కృత లాక్షణికుల్లో ఖండ కావ్యాన్ని ఒక విశిష్టమైన ప్రక్రియగా గుర్తించి దానికొక లక్షణాన్ని నిర్దేశించిన మొదటి అలంకారికుడు విశ్వనాథుడు. అతడు 'ఖండ కావ్యం భవేత్కావ్యస్యైకదేశానుసారిచ' అని నిర్వచించి 'యథా మేఘదూతాదిః' అని వివరించి ఉన్నాడు. అతడు పేర్కొన్న లక్ష్య లక్షణాలను సమన్వయ పరిస్తే కావ్య లక్షణాలన్నీ లేకపోయినా స్వయం సంపూర్ణమై, పూర్వాపరాకాంక్షా విరహితమై, రస పర్యవసాయి కాగలిగిన కావ్యైకదేశం ఖండకావ్యం అవుతుందని చెప్పవచ్చు. 'కావ్యాదర్శము' న వ్యాఖ్యానిస్తూ జీవానంద విద్యాసాగర భట్టాచార్యులు అగ్ని పురాణము నుండి ఉద్ధరించి పేర్కొన్న 'సంఘాతము' కూడా ఇంచుమించు విశ్వనాథుడు పేర్కొన్న ఖండకావ్యం లక్షణంతోనే సంవదిస్తూ ఉంది. 'యత్ర కవిరేకమర్థం వృత్తేనైకేన వర్ణయతి కావ్యే సంఘాతః సనిగదితః బృందావన మేఘదూతాదిః'[5] అట్లే ధ్వన్యాలోక లోచనంలో ప్రస్తావించబడిన 'పర్యాయ బంధము' కూడా ఖండ కావ్య సంఘాతముల లక్షణాలకి సన్నిహితంగా ఉంది 'అవాంతర క్రియా సమాప్తావపి వసంత వర్ణనాదిః ఏకవర్ణనీయోద్దేశేన ప్రవృత్తః పర్యాయ బంధః'[6] పూర్వాపర ఆకాంక్ష విరహితమై వర్ణనీయమయిన ఏదో ఒక విషయాన్ని గూర్చి చెప్పిన శ్లోక సముదాయాన్నే ఖండకావ్యమని, సంఘాతమని, పర్యాయబంధమని ఆ యా లాక్షణికులు పేర్కొని ఉన్నారు. సాహిత్య దర్పణమున నిర్దేశింపబడని వృత్తి నియమం కావ్యాదర్శ వ్యాఖ్యలోను, అందులో ప్రస్తావింపబడని వర్ణనీయ విషయ సూచన లోచనంలోను పేర్కొనబడడం గుర్తింపదగి ఉంది. లక్షణ నిర్దేశంలో ఈషద్భేదం కన్పిస్తున్నా మూలతత్వంలో మాత్రం అవి అన్నీ సామ్యాన్నే కలిగి ఉన్నాయి ఆధునిక విమర్శకులు కొందరు సంస్కృత లాక్షణికులు నిర్దేశించిన లక్షణాలను మనస్సున ఉంచుకొనే ఖండకావ్య ప్రక్రియ స్వరూపాన్ని ఆవిష్కరించడానికి యత్నించి ఉన్నారు.

"మహాకావ్యముల నుండి రసవద్ఘట్టములు కాని, ఒక ఏక విషయమును గురించి వ్రాసిన కొన్ని పద్యములు కాని విడిగా తీసినచో అవి ఖండకావ్యము లగును"[7] అన్న విశ్వనాథ సత్యనారాయణగారి నిర్వచనం సాహిత్య దర్పణకారుడు నిర్దేశించిన లక్షణాన్నే అనుసరించింది. "మహా కావ్యములలో ఏకదేశములైన రసవత్ సంఘటనలనుగాని, నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయాదులలో నేదైన ఒకటిగాని తీసికొని రసభావ బంధురములైన రమణీయ రచనలు చేయవచ్చు అట్టి వానికే ఖండకావ్యము లని పేరు[8] అన్న ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి నిర్వచనానికి కూడా సంస్కృత లాక్షణికోక్తులే ప్రేరకాలైనవి.[9] ఇక సంపత్‌గారు చేసిన నిర్వచనం కూడా దీనికి భిన్నంగా లేదు. "ఖండ కావ్యము కావ్యములో ఏక దేశమని తాత్పర్యము. దీనికి ఉదాహరణము మేఘదూతమట. ఈ లక్ష్య లక్షణ సమన్వయం చేస్తే, కావ్యలక్షణములన్నీ లేక

వారందరూ చక్కని ఖండ కావ్యాలను వెలయించి ఉన్నారు. నవ్యాంధ్ర కవిత్వ మహోదయానికి వైతాళికత్వం వహించిన గురజాడ అప్పారావు కొందరి అభిప్రాయంలో 'ఖండ కావ్య రచనా వ్యాప్తికి మూల పురుషుడు.'[15] ఆయన రచించిన 'దేశ భక్తి', 'మనిషి', 'కాసులు', 'పూర్ణమ్మ' మొదలైనవి చక్కని ఖండ కావ్యాలు వానిలో 'దేశ భక్తి' గేయంపై "Love thou the land" అన్న మకుటంతో టెన్నిసన్ రచించిన దేశ భక్త్యాత్మక గేయం, పూర్ణమ్మపై వర్డ్స్ వర్త్ రచించిన "Lucy Gray" అన్న గేయం ప్రభావాన్ని కనబరచి ఉన్నాయి. అల్లే నవ్యాంధ్ర కవితోద్యమానికి ఒక యుగకర్తగా పరిగణింపబడుతున్న రాయప్రోలు సుబ్బారావు గారి 'కోయిల' పై షెల్లీ రచించిన "To a Skylark" ప్రభావాన్ని నెరపింది. ఆంగ్ల సారస్వత పఠనం వలన ఉత్తేజితులైన వారు గోల్డ్ స్మిత్ రచించిన "Hermit" ను "లలిత"గను, టెన్నిసన్ రచించిన "Dora" ను "అనుమతి" గను తెలుగులో రూపొందించినారు. దిఙ్మాత్రంగా ప్రదర్శింపబడిన ఈ లక్ష్యాలే నవ్యాంధ్ర కవిత్వంలో వెలసిన ఖండ కావ్యాలపై ఆంగ్ల కవిత్వం ఎలాంటి ప్రభావాన్ని కనబరిచిందో నిరూపిస్తున్నాయి ఆత్మాశ్రయ కవితా రీతికి ప్రతీక అయిన 'Lyrical Poetry' కి గురజాడ 'దేశభక్తి', 'కాసులు' చక్కని ఉదాహరణలు. వాటిలో మొదటిది 'Lyric of Patriotism', రెండవది 'Lyric of Love' అన్న ప్రభేదాలకు లక్ష్యాలై ఉన్నాయి. వస్తు కవితలో ఒక భేదంగా గుర్తించబడిన కథనాత్మకమైన చిన్నకావ్యానికి (Short story in verse గురజాడ 'లవణరాజు కల'. రాయప్రోలు 'లలిత', 'తృణకంకణము' లు చక్కటి లక్ష్యాలై ఉన్నాయి. ఇంతవరకు ఉదాహృతాలైన గురజాడ, రాయప్రోలుల రచనలు నేడు ఖండకావ్యాలుగనే లెక్కింపబడుతున్నాయి. ఆంగ్ల కవిత్వంలోని 'Lyrical Poetry' ని, దానిలోని భేదాలను; వస్తు కవితా శాఖకు చెందిన కథనాత్మకమైన చిన్న కావ్యాలను (Short story in verse) దృష్టిలో ఉంచుకొని నవ్యకవులు వెలయించిన రచనలను పెక్కింటిని ఖండకావ్యాలని వ్యవహరించడం పరిపాటి ఐపోయింది అనేక భ్రమప్రమాదాలకు లోనైపోయి అటువంటి రచనలన్నీ ఖండకావ్యాలన్న ముద్రకు గురయ్యాయి, ఈ ప్రక్రియను మరింత సూక్ష్మంగా విభజించడానికి ఉన్న అవకాశాన్ని చర్చించడానికి ముందు ఆంగ్లంలోని 'Lyrical Poetry' ని, దాని శాఖల్ని సంగ్రహంగా అవలోకించడం అవసరం

ఆంగ్ల విమర్శకులు కవిత్వాన్ని ఆత్మాశ్రయమని (subjective), పరాశ్రయమని (objective) స్థూలంగా విభజించి ఉన్నారు. ఈ ఆత్మాశ్రయ కవిత్వమే 'Lyrical Poetry' అని సాధారణంగా వ్యవహరింపబడుతూ ఉంది. వ్యుత్పత్తిరీత్యా 'Lyre' అనే ఒక జంత్రవాద్యంతో కలిసి పాడడానికి అనువైన గీతాన్ని 'Lyre' అని చెప్పవలసి ఉంటుంది. కాని ఆంగ్ల సారస్వతంలో ఈ అర్థం చాలాకాలం క్రిందటే తొలగిపోయింది ఇప్పుడది గీతిప్రధానమైన, ఆత్మభావ వ్యక్తిరూపమైన కవిత్వమనే అర్థంలో రూఢమైపోయింది. ఎంతో వైవిధ్యాన్ని సంతరించ జేసికొన్న దాని రూపురేఖల్ని W H. Hudson అన్న ఆంగ్ల విమర్శకుడు ఈ విధంగా ఆవిష్కరించి ఉన్నాడు. "In such simpler forms this personal poetry is almost unlimited in range and variety, for it may touch nearly all aspects of experience, from those which are most narrowly individual to those which involve the broadest interests of our common humanity. Thus we have the convivial or bacchanalian lyric: the lyric which skims the lighter things of life. as in

the so-called versde Societe: the lyric of love in all its phases and with all its attendant hopes and lon.ings: joys and sorrows; the lyric of patriotism: the lyric of religions emotion: and countless other kinds which it is unnecessary to attempt to tabulate."[16]

వ్యక్తీకరణలోని వైవిధ్యాన్ని పురస్కరించుకొని ఈ ఆత్మాశయ కవిత్వంలోనే Ode, Elegy Epistle, Satire, Sonnet వంటి ప్రభేదాలు కూడా చోటుచేసుకొన్నాయి. వాటిలో ఏ ఒకటి రెండు ప్రక్రియా భేదాలో తెలుగులోకి ప్రవేశించకపోయినా మిగిలిన ప్రభేదాలన్నీ నవ్యాంధ్ర కవిత్వ లోకంలో విరాజిల్లిన భావకవితా వృక్షంలో అనేక శాఖలుగా ప్రవర్ధిల్లినవే. ఆంగ్లంలో ప్రవర్తిల్లిన Lyrical Poetry లోని ప్రభేదాల్ని దృష్టిలో ఉంచుకొనే తెలుగులో కొందరు విమర్శకులు ఈ కవిత్వంలో కన్పించే భిన్నరూపాల్ని పేర్కొని ఉన్నారు. ప్రణయ గీతములు (Love lyrics), రాజభక్తి, దేశభక్తి గీతములు (Patriotic lyrics), తత్వ గీతములు (Philosophical and Mystical lyrics) స్మారక గీతములు (Elegies), హేళన గీతములు (Satires), ప్రకృతి వర్ణనలు (Natural descripti ns) అని ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు చేసిన వర్గీకరణ ఈ సందర్భంలో గమనార్హం.[17] "వీటన్నిటికిని గీతములని పేరు పెట్టుటచే అవి గీతపద్యము లేయనిగాని, పాడదగిన గేయములేయనిగాని అర్థము కాదు. ఇవి ఏ పద్యములైనను కావచ్చును" అని వారే 'గీతమ' న్న పదానికి అర్థ వివరణ చేసి ఉన్నారు.

ఆంగ్ల సారస్వతంలో పరిఢవిల్లిన ఈ Lyrical Poetry ని దృష్టిలో ఉంచుకొనే నవ్యాంధ్ర కవులు 'రసఘుటికల' వంటి రచనలను వెలయించినారు; ప్రసిద్ధాంగ్ల కాల్పనిక కవులు రచించిన భావవైవిధ్యంతో వెల్లివిరిసిన Lyrics ను చదివి ఉత్తేజితులైనవారు ఆ ధోరణిలో తెలుగులో వెలువరించిన రచనల్ని మొదట 'భావ గీతములు' ని పేర్కొని ఉండడం[8] గమనార్హమైన ముఖ్యవిశేషం, గురజాడ 'దేశభక్తి', రాయప్రోలు 'కోయిల', జాషువ 'శ్మశానవాటి', దువ్వూరి 'గతిక', వేదుల 'కాంక్ష' మొదలైనవి భావగీతాలకు (Lyrics) చక్కని లక్ష్యాలు. ఏదో ఒక అంశాన్నిగూర్చి కవి ఎదలో పొంగిపొరలిన భావమే వానిలో ప్రసరింపబడుతుంది. పాత్రల ప్రమేయంగాని, పూర్వోత్తర కథానుసంధానంగాని వాటిలో ఉండదు. వాటిలోని వస్త్వైక్య పరిధికి శీర్షికయే కేంద్రబిందువు. ఈ దృష్టితోనే నవ్యాంధ్ర కవులు ప్రారంభ దినాలలో వాటిని భావ గీతాలని పేర్కొన్నారు. తరువాతి కాలంలో అటువంటి కవిత్వమే భావ కవిత్వమన్న ముద్రకులోనైంది భావ కవిత్వంలోని వివిధ శాఖలకు ప్రతీకలైన అవి ఖండ కావ్యాలుగా వ్యవహృతం కావడం జరిగింది. వీటన్నిటినీ ఖండ కావ్యాలని పేర్కొనడం అంత సమంజసం కాదు. కవితా ఖండిక అన్న పదాలు తెలుగు సాహిత్య లోకంలో వ్యవహారూఢమైనవే అల్పార్థంలో చేరేక ప్రత్యయం వానికొక సంకుచిత పరిధిని నిర్దేశిస్తున్నది. కాబట్టి ఇటువంటి రచనల్ని కావ్యఖండిక లని వ్యవహరించడం ఉచితంగా ఉంటుంది. ఒకానొక అంశాన్ని గూర్చిన భావచాలనమే వాటిలోని మూలతత్వం కాబట్టి అవి సహజంగానే సంక్షిప్తాలై ఉంటాయి. కాని ఈ సంక్షిప్తత ఎంతవరకన్న విషయాన్ని గూర్చి ఏ విమర్శకుడూ ఇదమిత్థంగా చెప్పలేదు. అలా చెప్పటం సాధ్యం కాదు కూడ. ఆచార్య కె ఆర్. శ్రీనివాస అయ్యంగార్ వెలిబుచ్చిన అభిప్రాయం ఈ సందర్భంలో గుర్తింపదగి ఉంది. "H w lon; Should-or could - a lyric be? The answer to this question

(difficult enough in any case) would largely depend on what the lyric is about. William Ernest Henley described the "Lyric" as a simple emotion temperamentally expressed in terms of poetry; something, shall we say, analogous in Poetry to what the one - act play is in drama and the short story in prosefiction. If a central idea a single emotions - or an isolated unit of experience is to be the theme of a lyric, it naturally follows that it should be "short". [19] ఖండ కావ్య రచనకు, మహా కావ్య రచనకు గల భేదాన్ని నిరూపిస్తూ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారు పేర్కొన్న మాటలు ఈ విశేషాన్ని తెలియజేస్తున్నాయి. "ఖండ కావ్యములలో అతి ముఖ్యమైన విషయములు తప్ప తక్కినవి విస్తరింపనీజలేదు. సంగ్రహము వీనికిని, విస్తరము వానికిని స్వాభావిక లక్షణము. పరికి మాలిన విస్తరము మహా కావ్యములలో నెంత దోషమో పని చెరచు సంగ్రహము ఖండ కావ్యము లలో నంతటి పెన్న దోషము. కావ్యము కొలతను తగ్గించుటలో నందలి విషయ తీవ్రతను గూడ తక్కువ పఱచు నపాయము కలదు"[20]. ఈ అభిప్రాయాల్ని పురస్కరించుకొని 'సంక్షిప్తత' ఖండ కావ్యానికి జీవభూతమైన అంశంగా పేర్కొనవచ్చు కాని అది ఎంతవరకన్న సంగతిని నిర్ధారించడం మాత్రం కష్టం. "We should not be eager to prescribe the maximum or minimum length of a lyric. Nothing succeeds like success and nothing fails like failure" [21] అన్న మాటలు నూటికి నూరుపాళ్ళు నిజం. రస సిద్ధిని కలిగించడమే దాని పరమ ప్రయోజనం. అది ఒక పద్యంలో కూడా సిద్ధింపవచ్చు. 'ఆముక్తక శ్లోకః ప్రబంధశతాయతే' అన్న ప్రాచీన అభ్యుక్తి ఈ విషయాన్నే నిరూపిస్తున్నది.

ఆంగ్ల సాహిత్యంలోని వస్తుకవితా శాఖకు చెందిన కథనాత్మకమైన చిన్ని కావ్యాలను (short story in verse) దృష్టిలో ఉంచుకొని నవ్యాంధ్ర [illegible] ఖండకావ్యాలని పేర్కొనడం పరిపాటిగా ఉంటుంది. "ఖండకావ్య మనగా చిన్ని కథ, కొన్ని పాత్రల, పరిమిత సన్నివేశములు [illegible] ఆశ్వాస విభక్తము కాని రచన కావచ్చును." అన్న [illegible], నారాయణరెడ్డిగారి అభిప్రాయము కూడా దీనికి ఉపస్కారకంగానే ఉంది. గురజాడ "లవణరాజుకల", రాయప్రోలు "తృణకంకణము", జాషువ "గబ్బిలము" మొదలైనవి ఈ ఖండకావ్య ప్రక్రియకు చక్కని లక్ష్యాలుగ కన్పిస్తున్నవి.

ఈ వ్యాసంలో ఇంతవరకు చర్చించబడిన అంశాలు "ఖండకావ్యం" అని స్థూలంగా వ్యవహరింపబడుతున్న ప్రక్రియను "కావ్యఖండిక", "ఖండకావ్యం" అని విభజించుకోవడానికి అవకాశాన్ని కల్పిస్తున్నవి. ఏదో ఒక అంశాన్ని ఆధారంగా చేసికొని కవి ఎదలో పొంగి పొరలిన భావపరంపరే ప్రాధాన్యం వహించే రచనను 'కావ్య ఖండిక' అని పేర్కొనవచ్చునని ఈ పరిశీలనలో నిరూపించడం జరిగింది. ఇది ఆత్మాశ్రయ రీతికి చెందిన ఆంగ్ల కవిత్వంలోని "Lyric" అన్న ప్రక్రియకు తుల్యమైంది. ఒకటి రెండు పాత్రలతో, పరిమితమైన కథతో, ఆశ్వాస విభక్తం కాక రచింపబడిన దానిని 'ఖండ కావ్యం' అని వ్యవహరింప వచ్చునని వివరింపబడింది. ఇది ఆంగ్ల కవిత్వంలోని వస్తు కవితా శాఖకు చెందిన "Short story in verse" అన్న ప్రక్రియకు సన్నిహితమైంది. ఖండకావ్యం వస్తు కవితా శాఖకు చెందినదని అన్నంత మాత్రాన దానిలో ఆత్మాశ్రయ రీతి బొత్తిగా ఉండదని అర్థం

కాదు. ఆ విధంగానే కావ్య ఖండికలో వస్త్వాశ్రయ రీతి పూర్తిగా ఉండదని చెప్పడం సరికాదు. ఒక గిరిగీచి ఆ రెండింటికీ భిన్ని బేధాన్ని విస్పష్టంగా నిరూపించడం సాధ్యం కాదు Hudson ఈ అభిప్రాయాన్నే వ్యక్తం చేసి ఉన్నారు "The boundary lines between these two divisions cannot, ofcourse, be drawn with absolute precision and in much poetry, especially in our extremely composite modern poetry, personal and impersonal elements continually combine"[22].

అథో జ్ఞాపికలు

1) విజ్ఞప్తి - ఖండ కావ్యము రెం భా.)
2) కావ్యాదర్శము - ప్రథమ పరిచ్ఛేదము శ్లో. 14 - 19.
3) ఛన్దోబద్ధ పదం పద్యంతేన ముక్తేన ముక్తకమ్
ద్వాభ్యాంతు యుగ్మకం సాందానికం త్రిభిరిష్యతే
కలాపకం చతుర్భిశ్చ పంచభిః కులకంమతిమ్
సాహిత్య దర్పణము కారిక 314
4) "రఘువంశము" లోని గంగానది వర్ణన దీనికొక చక్కని లక్ష్యంగా ఉన్నది. సర్గ 13 - శ్లో. 55 - 58.
5) కావ్యాదర్శము - పు. 5, వావిళ్ళ ప్రచురణ - 1952.
6) ధ్వన్యాలోకము - లోచనము, 111-7
7) ఆంధ్ర పత్రిక - జన 5, 1938.
8) మేఘ సందేశము మహాకావ్యమట - భారతి - నవం, 1939.
9) దండి "కావ్యాదర్శము" న సర్గబంధ లక్షణాన్ని వివరిస్తూ చెప్పిన "నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః" అన్న శ్లో॥ భాగాన్నే ఇంద్రగంటి వారు గ్రహించి ఉండడం గమనార్హం
10) "ఖండ కావ్యము - భావకవిత్వము" - విజ్ఞాన సర్వస్వము - సంపు 4
11) "పింగళి కాటూరుల "సౌందర నందము" ఆశ్వాస విభజన వలన కావ్యమైనది" - ఆచార్య సి. నారాయణ రెడ్డి - ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు : ప్రయోగములు - పు. 177.
12) Ibid పు. 176, 77.
13) Ibid పు 175.
14) ఆంధ్ర పత్రిక - జనవరి 5, 1938.
15) సంపత్ - "ఖండ కావ్యము - భావ కవిత్వము" - విజ్ఞాన సర్వస్వము. సంపు 4.
16) An introduction to the study of Literature P. 96, 91.
17) "భావ కవిత్వము" - సాహిత్య శిల్పసమీక్ష - పు. 208.
18) "పాదపమ్మ గీతా సఖీ భావ పదము" - "తెనుగు తోట" - రాయప్రోలు "ఈ ప్రణయ భావగీతము లివియు" - విశ్వనాథ - "గిరికుమారుని ప్రేమ గీతాలు" - పు. 48.
19) Introduction to the study of English Literature by Prof K.R. Srinivasa Iyengar and Premananda kumar P 198.
20) "మహా కావ్య రచన - ఖండకావ్య రచన" - ఆంధ్రభూమి - ఆగ 1934.
21) Introduction to the study of English Literature P 199.
22) An introduction to the study of Literature P. 96.

❀

# జీవిత శిల్పం

## ముదివేడు ప్రభాకరరావు

1

జీవితమే కావ్యం ! కావ్యమే జీవితం !
ఎందులో ఏముందో సందేహిస్తూ
ఎప్పుడూ వెతకడం ఎందుకు ?
జిజ్ఞాస జీవుని స్వభావం ! అందుకు ! !
జీవుని కడగండ్లను సుందరంగా శిల్పించేదే కావ్యం !
ఆ శిల్ప రహస్యాన్ని సజీవంగా అనుభవించేదే లోకం ! !
ఏకాంత జీవితమే ఉజ్జ్వల భవితవ్యానికి పునాది !

ఇది యోగి మార్గం ! అనాది ! !
పది మందితో నడిచి పడరాని పాట్లు పడి
పదిలంగా జ్ఞానాన్ని పంచిపెట్టే త్యాగి !
గృహస్థుడైన గురువు ; కర్మయోగి ! !
పుట్టించిన వాడు పూరిమేపడు !
జన్మించిన ప్రతి జీవుడూ జాగరూకుడు కాడు ! !
జీవితం ఆద్యంతాలు తెలియని సనాతన గ్రంథం !
ఆ గ్రంథ గ్రంథిని విప్పి చెప్పేదే వేదాంతం ! !

2

జీవితం ఓ అద్భుత శిల్పం
ఎల్లోరాలో మిథున శిల్పంలాగా
అజంతాలో పద్మపాణి యశోధరలాగా
అద్భుత శిల్పం ! అపురూప చిత్రం ! !

ప్రణవమూర్తి విఘ్నాధిపతీ...
లతావనితల కలయిక సాలభంజికా...
ద్యావా పృథివీ దంపతులు అర్ధనారీశ్వరులూ...
ఓహో! విశ్వజనీన సత్యాలు!
వినూత్న శిల్ప ఖండాలు!!
జీవిత కళా పరమార్థాలు
ఎలిఫెంటాలో సదాశివ త్రిమూర్తి!
ముఖలింగంలో ద్వాదశ హస్తనటరాజమూర్తి!!
ఏకైక విశ్వకళా రహస్యాలు!
నాన్యతో దర్శనీయాలు!!

3

ఈ అనంత కాల గమనంలో
జీవిత అల్పకాలంలో
అనల్ప శిల్ప కల్పనా ప్రపంచాన్ని
సృష్టించిన దెవరో అతడు?
కళారాధనా తత్పరుడు!
నిరంతర జిజ్ఞాసారతుడు!!
జీవిత కళా సమన్వయ దురంధరుడు!!!
"అతడే... అతడే...
ఆ అవ్యక్తుని అత్యద్భుత శిల్పం!
మానవుడు!!"



# నవభారతి సాహితీ సమితి

# ప్రథమ మహాసభలు

నవభారతి సాహితీ సమితి 1980 మే నెల ఆఖరు వారంలో రాష్ట్ర స్థాయిలో ప్రథమ మహాసభలు రాజధాని నగరమైన హైదరాబాదులో జరపడానికి నిర్ణయించడమైనది. బహు భాషా వేత్తలు, విద్యా వివేకమూర్తులు, సజ్జన శేఖరులు, భారత విదేశ వ్యవహార శాఖా మాత్యులు అగు మాన్యశ్రీ పి. వి. నరసింహారావు గారు యీ మహాసభలకు అధ్యక్షులుగా విచ్చేయడానికి అంగీకరించారు. రాష్ట్రంలోని విద్యావేత్తలు, సహృదయులు, కళాప్రియులు, కవులు, సాహితీ వేత్తలు, రచయితలు, యీ మహాసభలలో సభ్యులుగా చేరి సభలను జయప్రదము చెయ్యాలని కోరుచున్నాము. మహాసభలు జరిగే తేదీలు, స్థలము మొదలైన వివరాలు త్వరలో ప్రకటించగలము.

ఇట్లు,

కన్వీనర్స్

చిదలవాడ పిచ్చయ్య

బూదరాజు రాధాకృష్ణ

డా. దిగొండ వీరభద్రశాస్త్రి

డా. కురాల రామారెడ్డి

నున్నగొప్పుల శివరామమూర్తి

గ్రంథ సమీక్ష:

# ఆనంద తీర్థకృత ఏకదేవతావాదార్థ ప్రతిపాదక ఋగ్వేదము - తెలుగు

వాఙ్మయ మహాధ్యక్ష

**డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య**

క ళా — ప్ర పూ ర్ణ

టీక - వ్యాఖ్య - భాష్యం - ఉత్తరోత్తరాధికంగా విషయ విస్తృత వివేచనా వైపుల్య బలాలతో నిండి వుంటాయి. టీక ప్రతిపదార్థ ప్రతిపాదకంగానూ - వ్యాఖ్య ప్రతిపదార్థాలు మాత్రమే కాక శబ్ద విశేషాది విషయ ప్రతిపాదకంగానూ - అంటే వ్యాకరణ ఛందో లంకారాది విశేష విషయ ప్రతిపాదకంగానూ వుంటుంది. భాష్యం అనేక విషయ వివరణలతో పూర్వ పక్ష - ఉత్తర పక్ష సిద్ధాంత చర్చాపూర్వకమైన వివేచనతో బహుముఖంగా తర్కసహంగా వాదప్రతివాద ప్రతిపాదకమై వుంటుంది. "భాష్యతే సర్వం స్ఫుటతయా అనేనేతి భాష్యం" అని ప్రాచీను లందుకే పేర్కొన్నారు. "సర్వం స్ఫుటతయా" అన్నదానికి యెంత విస్తృతార్థమైనా చెప్పవచ్చు - యెంత సంకుచితార్థమైనా చెప్పవచ్చు. అందువల్లనే యాస్కుడు, స్కందుడు, నారాయణాచార్యులు, ఉద్గీథాచార్యులు, హస్తామలకాచార్యులు, వెంకట మాధవుడు, లక్ష్మణాచార్యులు, ధానుష్కయజ్వుడు, ఆనందతీర్థుడు, ముద్గలుడు, దేవస్వామి, చతుర్వేదస్వామి, భట్టస్వామి, భట్టభాస్కరుడు, సాయణుడు, ఉవ్వటుడు, మహీధరుడు మొదలైన వారు వ్రాసిన వివిధ వేదటీకలన్నీ భాష్యాలుగానే ప్రసిద్ధి చెందాయి. మామూలు టీకలు కూడా తరతమ భేదంలేకుండా భాష్యాలుగా పేర్కొనబడడంవల్ల అసలు సార్థక భాష్యాలై అత్యధిక విషయ విస్తరణ వాద ప్రతివాద చర్చాపూర్వకాలై అవతరించిన గ్రంథాలు - తరువాత తరువాత - మహాభాష్యాలుగా పేర్కొనబడ్డాయి. 'మహాభాష్య' శబ్దం యెప్పు డవతరించిందో అప్పుడే 'భాష్య' శబ్దం టీకకు దీటువచ్చేదిగా ధ్రువపడిపోయింది. దానిస్థాయి పడిపోయింది. కాగా భాష్యం - వ్యాఖ్య - టీక అన్నీ ఒకేవిధంగా యేదో అర్థ ప్రతిపాదకత్వాన్ని నిర్దేశించే పదాలన్న భావం అనేకమందిలో కలిగింది.

అసలు వేదాలు యే కాలం నాటివో సాధికారికంగా నిర్ద్వంద్వంగా - తిరుగులేని విధంగా చెప్పడం సాధ్యమయ్యే పనికాదు. అయితే వేదాలు అవతరించిన కొంతకాలానికే వేదవిజ్ఞానం చాలావరకు దెబ్బతిన్నట్లు కనిపిస్తున్నది. అందువల్ల వేదాలను వేదాలుగానే చదివి అర్థం చేసుకొనే దశ యెప్పుడో చెయి దాటిపోయింది. కాలక్రమేణా పురాణాలు భారత రామాయణాలు చదివి వాటిలోవున్న వివిధ కథలతో యేదోవిధంగా సమన్వయాన్ని కుదుర్చుకుంటూ వేదాలలో భ్రాంతిమదంగా వున్నాయనుకునే కథలతో పాత్రలతో సమన్వయాన్ని కుదుర్చుకుంటూ వేదార్థం చెప్పుకొనే దుర్గతిలోకి పండిత లోకం దిగజారింది. కాగా పురాణ భారత రామాయణ గ్రంథాలు చదువుకున్నవారు వేద పండితు లయ్యారు. వేద విజ్ఞాను

లయ్యారు. యింక గ్రాంఫోను ప్లేటుల్లాగ వేదాన్ని కంఠస్థం చేసిన వేద పండితులు వేద విజ్ఞానంతో మహర్షిత్వంతో సంబంధం లేకుండా కొందరు పవిత్రమైన ఘనాపాఠిత్వంతోను-వేద విజ్ఞానులుగా మరికొందరు వేదాధికారాన్ని సంఘంలో పొందారు యిది యిప్పటి మాటకాదు బ్రాహ్మణాలు ఉపనిషత్తులు అవతరించిన కాలంనాటి మాటే.

"అనంతా వై వేదాః" అన్నది వేదవాక్యం. అనంతత్వం వున్నదనుకున్నప్పుడు అనాద్యంతత్వం కూడా వుంటుంది అనంతమైన దానికి ఆది వున్నదనుకోవడం ఒక విధంగా ఆకాశానికి నిచ్చెన వెయ్యడం మరొక విధంగా అంతుతెలియని దానికి ఆది వున్నదని నిర్దేశించడం సర్వజ్ఞత్వాన్ని పాక్షికంగా ఆపాదించుకోవడం - అయినా ప్రాచీన కాలంనుంచి మనవాళ్లు ప్రథమ మండలం - ప్రథమాధ్యాయం - ప్రథమానువాకం-ప్రథమసూక్తం అంటూ వేద ఆదిని గురు శిష్య పరంపరగానో అనువంశికంగానో నేర్పుతూ వచ్చారు. ఆ క్రమం ప్రకారంగానే వేదాలు ఉపలభ్యమానాలయినంతవరకూ ఆద్యంతాలతో రూపు దాల్చాయి. అనాద్యంతాలైన వేదాలను ఆద్యంతాలైన పరిమితులతో కూడిన గ్రంథరాజాలుగా మన ప్రాచీనులు మలచి మనకందించారు ఈ పరిస్థితి యాస్కునికి పూర్వమే యేర్పడింది. అగ్నిసూక్తం ప్రథమసూక్తం అని సహేతుకంగా నిర్ణయిస్తూ యే భాష్యకర్తా తమ భాష్యంలో వ్రాయలేదు. కనీసం వారు ఋషివ్యవస్థ గురించి సాధికారికంగా చర్చించనైనా చర్చించలేదు. ఆధునిక పరిశోధకులు వేదవాఙ్మయ పూర్వాపరాల గురించి కొందరు చర్చించారు. కాని అసలు అగ్ని సూక్తం తొలిసూక్తమౌనా కాదా అన్న విషయం యెవరూ చర్చించలేదు. చర్చిస్తే అగ్నిసూక్తానికున్న ఋషి విషయమై మౌలికమైన వూహాలు కొన్ని వచ్చి ఉండేవి. లభించిన ఋగ్వేదంలో తొలి సూక్తానికి "ఋషిః మధుచ్ఛందా వైశ్వామిత్రః" అని ప్రాచీన కాలంనుంచి అనేకమంది పేర్కొన్నారు. దీనినిబట్టి విశ్వామిత్ర పుత్రుడైన మధుచ్ఛందుడు యీ సూక్తానికి ఋషిగా భావించారు. మధుచ్ఛందుని గురించి విశ్వామిత్రుని గురించి భారత రామాయణాది గ్రంథాలలో రకరకాల కథలున్నాయి. వీరికి సంబంధించిన శునశ్శేపుని గురించికూడా కొన్ని కథలున్నాయి. వీటిల్లో పరస్పరం వైరుధ్యంకల కథలుకూడా ఉన్నాయి. ఈ పరస్పర విరుద్ధాలైన కథలు చూచినప్పుడైనా మనకాలానికి అసలీ మధుచ్ఛందుడెవరు? అతని పేరదేనా? విశ్వామిత్రుడెవరు? ఈ పేరుతో యెంతమంది ఋషులున్నారు? యీ విశ్వామిత్రుడూ రామాయణ కాలంలో రామలక్ష్మణులకు వేద విద్యలను అస్త్ర శస్త్రాదులు నేర్పిన విశ్వామిత్రుడూ ఒక్కరేనా? రామాయణ కాలానికే వేద సంస్కృతం రకరకాలుగా ప్రభ్రష్టమై అలౌకికమైన సంస్కృతం లౌకిక భాషగా రూపొంది రామాయణ మహాకావ్యం అవతరించింది కదా! అయినప్పుడు రామలక్ష్మణులకు గురువైన విశ్వామిత్రుడూ వేద ఋషియైన విశ్వామిత్రుడూ విభిన్నులు కారా? పురోహితుడైన ప్రతి వ్యక్తీ వశిష్ఠుడుగా పేర్కొనబడ్డాడన్నది చారిత్రకమైన అనుభవ పూర్వకమైన సత్యం. కాగా రామాయణంలో దశరథుని పురోహితుడైన వశిష్ఠుడు యీ చరిత్రకు పురాణకథలకు అడ్డురాడు. రామాయణ కాలంలో వేదం అవతరించలేదు కాబట్టి దానికి చాలా పూర్వకాలంలోనేవేదము అవతరించింది. కాబట్టిరామాయణవిశ్వామిత్రుడూవేదవిశ్వామిత్రుడూ ఒక్కరు కారనేది విస్పష్టం. కాగా ఐతరేయ బ్రాహ్మణంలో వున్న "తస్యహ విశ్వామిత్రస్యైక శతం పుత్రా ఆసుః. తద్వైవ్యజ్యాయాం సోనతేకులం మేనిరే. తాన్ అనువ్యాహారన్ తాన్వః ప్రజాభక్షిష్టేతిత ఏతేఽంధ్రాః పుండ్రాః శబరాః పుళిందామూతిబా ఇత్యుదంత్యా బహవోభవంతి వైశ్వామిత్రాదస్యూనామ్ భూయిష్ఠాః" + అన్న కథకు సంబంధించిన వేదకాల విశ్వామిత్రుడు రామాయణ విశ్వామిత్రుడు

---

+ ఐ. బ్రా. 3. అ. 6.

ఒక్కరు కారు. ఇక్ష్వాకువు కాలంలో మాధవిని భార్యగా స్వీకరించిన విశ్వామిత్రుడు వేరు. ఇక్ష్వాకు వంశంలోని రాముడికి విద్యలు నేర్పిన విశ్వామిత్రుడు వేరు. తెలుగులో మధుచ్ఛందుణ్ని మధుచ్ఛందుడు - మధుచ్ఛందస్సు - మధుచ్ఛందసుడు అని త్రివిధ రూపాలలో వ్యవహరిస్తాము సకారాంతమైన "మధుచ్ఛందస్" శబ్దంమీద యీ మూడు రూపాలూ రూపొందుతాయి మధుచ్ఛందసుడు—మధుచ్ఛంధసుడు—మధుచ్ఛంధుసుడు అని కూడా రూపాంతరాలున్నాయి. తొలుత సంస్కృతంలో మధుచ్ఛందస్" సకారాంత శబ్దం ఒకటే వుండగా తరువాత కాలంలో "మధుచ్ఛంద - మధుచ్ఛందస" అని విభిన్న అకారాంత శబ్దాలు కూడా చోటు చేసుకున్నాయి.

ఏది యేమైతే నేమి? ఋగ్వేదం తొలిసూక్తమైన అగ్ని సూక్తంద్రష్టగాని కర్తగాని అయిన మధుచ్ఛందుడు వేద వాఙ్మయంలో తొలి ఋషిగా పీట వేసుకుని కూర్చుంటాడు. అప్పుడు వేద ఋషియై మధుచ్ఛందుని తండ్రియైన విశ్వామిత్రుడు వేద ఋషి కాకుండా పోతాడు. కాగా మధుచ్ఛంద విశ్వామిత్ర కథలకు వ్యాఘాతమూ వస్తుంది. అందువల్ల మధుచ్ఛందుడు తొలి ఋషి కాడు. పైగా విశ్వామిత్రుని తండ్రి తాతలయిన గాధి మహర్షులు వేదర్షులుగా వున్నారు కాబట్టి అసలు విశ్వామిత్రుడే తొలి ఋషి కాడు. అయినప్పుడు తొలి ఋషి మధుచ్ఛందుడనేది యే పరిస్థితుల్లోనూ నిలవనేరదు. అసలు మధుచ్ఛంద శబ్ద విషయంలో ఐతరేయ బ్రాహ్మణ కాలానికి పూర్వమే తికమక లేర్పడినట్లు కనిపిస్తున్నది. ఋగ్వేదం కొన్ని వ్రాత ప్రతుల్లో "ఋషిరాద్యో మధుశ్ఛందా వైశ్వామిత్రః" అని స్పష్టంగా కనిపిస్తున్నది. విశ్వామిత్ర పుత్రుడైన మధుచ్ఛందుడు చారిత్రకంగా గాని వేద ఋషి పరంపర ప్రకారం కాని తొలి ఋషి కానే కాడు. బ్రాహ్మణాల కాలం నాటికి విశ్వామిత్రుణ్ణి అవతల పెట్టి అతని కుమారుడైన మధుచ్ఛందునికి వేద తొలి ఋషిగా పీట వెయ్యడం జరిగిందనడం పొరపాటు మధుచ్ఛంద—విశ్వామిత్ర—శునశ్శేపుల కథ లీ రూపంగానే భాంత రామాయణాల విశ్వామిత్రుణ్ణి వేదర్షిగా పేర్కొన్నాయి గదా! కాగా విశ్వామిత్రుణ్ణి విడిచి అతని కుమారుడైన మధుచ్ఛందుని ఆది ఋషిగా బ్రాహ్మణంలో ఉటంకించబడ్డాడనడంలో వాస్తవికత లేదు కొన్ని ప్రాచీన ప్రతులను బట్టి చూస్తే ఋగ్వేదంలోని తొలి సూక్త దశకానికి ఋషి మధుచ్ఛందుడూ కాడు అక్కడ విశ్వామిత్ర పితృత్వ ప్రసక్తి లేదని అనిపిస్తుంది. ఈ సూక్తాలకు అద్యుడు (ఆద్యః - ఆద్యుడనే ఋషి) మధుడు (మధుః) చంధుడు (చందస్) శ్వామిత్రు (శ్వామిత్రః) అనే నల్గురూ ఋషులుగా స్పష్టపడుతున్నది. వీరి తండ్రి పేరు యిక్కడ ప్రసక్తం కాలేదనే చెప్పాలి. "ఋషిరాద్యో మధుశ్ఛందా వైశ్వామిత్రః అన్నప్పుడున్న "వై "అన్న దానిని "శ్వామిత్ర" శబ్దంతో కలిపి "రాముని తోక"వలె విభజించి విశ్వామిత్ర పుత్రుడని అర్థం వచ్చేటట్లు "వై శ్వామిత్ర"గా పొరపాటున భావింపబడింది. సంస్కృతంలో "చ-తు"ల వలె "వై" అనేక చోట్ల ప్రయుక్తమైంది. "కదా" అనే అర్థంలో కూడా యీ "వై " ప్రయుక్తమైంది. ఇంకా ఆహా - అలాగా ఇత్యాద్యర్థాల్లో కూడా ప్రయుక్తమైనది. ఇంతకూ యిక్కడ శ్వామిత్ర మహర్షి వేరు విశ్వామిత్ర మహర్షి వేరు అని గ్రహించడంతోపాటు ఋగ్వేదం మొదటి పది సూక్తాలలోనూ విశ్వామిత్ర ప్రసక్తి లేదని "శ్వామిత్ర" మహర్షి ప్రసక్తి ఉన్నదని మనం గ్రహించాలి వేద వాఙ్మయానికి తొలి ద్రష్టగా చారిత్రకంగాను సృష్టి వ్యవస్థ ప్రకారమూ అంగిరస మహర్షి (అంగిరసుడు) కనిపిస్తున్నాడు. ఈ "అంగిరస" మహర్షి పేరు తొలి సూక్తం ఆరవ ఋక్కులోనే వున్నది. ఈ సూక్త ద్రష్టలైన ఆద్య-మధు-చంద-శ్వామిత్రులు నల్గురూ అంగిరసుని

పుత్రులై వుండవచ్చును. ఆద్య శబ్దం ఋషి నామంగా కాక అంగిరస మహర్షి జ్యేష్ఠ పుత్రుడు కాదట్టి తొలి పుత్రుడు కావట్టి ఆ అర్థంలోనే ప్రయుక్తమై వుండవచ్చును. అందువల్ల ఋగ్వేదంలో తొలి దశ సూక్తాలకు విశ్వామిత్రుని పుత్రుడైన మధుచ్ఛందుడు ఋషి కాదని గ్రహించాలి.

బ్రాహ్మణుల కాలం నాటికే ఋషినామ వ్యవస్థలోనే ప్రవరల్లోనే వ్యత్యాసాలేర్పడినప్పుడు వేదార్థ ప్రతిపాదకత్వం సవ్యంగా జరిగిందని చెప్పలేము. సంస్కృతం లక్కవంటి భాష - లక్కను వేడిచేస్తే యే రూపంలో దాన్ని మలచాలనుకున్నా మలిస్తే మలచవచ్చు. అందుకే పరస్పర విరుద్ధాలైన అన్ని మతాలకూ వేదమే ప్రామాణికమై కూర్చున్నది. చివరికి ఎందుకూ పనికిరాని సంఘ వ్యవస్థకు సైతం అదే ప్రతిబింబమై కూర్చున్నది. భారతం చదివి ఆ గాథకూ వేద దేవ ఋషులకు సంబంధం ఉన్నదని ముడి పెట్టడం వల్ల - అసలు వేద ధర్మ విరుద్ధమైన భారతం "చండాల భారతం" అన్న దృష్టితో పంచమ భారతం అనబడిన చరితం - అయిదవ వేదంగా పంచమ వేదంగా పరిగణించబడింది. ఒకే ఒక చిన్న అసత్యంతో యెన్ని జన్మల్లో చేసిన పుణ్యమైనా హరించుతుందన్న వేద ధర్మం "ప్రాణ మాన విత్త భంగాల్లో బొంకవచ్చు అఘము పొంద దధిపా" అని బోధించే స్థితికి తార్మారయ్యింది. ప్రాణ మానాలు విడిచి పెడదాం - విత్త భంగంలో కూడా బొంకవచ్చంటే లక్షలు కోట్లు కానక్కరలేదు. ఒక్క నయాపైస కోసమైనా బొంకవచ్చునన్నమాట. అంటే యిక సత్యానికి అసత్యానికి తేడా లేదనే కదా! పతివ్రతా ధర్మానికి భిన్నమైన బహుపతివ్రతా ధర్మాన్ని మాతృమూర్తి ఆజ్ఞమేరకు ధర్మంగా మార్చినట్లే సత్యం- అసత్యం రెండూ పుణ్యప్రదాలే అయ్యాయి. కాగా పంచమ (చండాల) వేదమైన మహాభారతం పంచమ (అయిదవ) వేదమయి కూర్చున్నది ధర్మాల వారి యేమైనా వేదాలు మూలకంగానే సర్వమతాలూ అవతరించాయి. జైత్ర యాత్రలు జరిపి విజయశ్రీలు చేపట్టిన త్రిమతాచార్యులు ముగ్గురూ ఒకే కాలంలో పుట్టి పోవడం వారి అదృష్టం.

శంకర - రామానుజ- మధ్వాచార్యులు ముగ్గురూ ఒకే కాలంలో పుట్టి వాద ప్రతివాదాలు జరిపి వుంటే యెవరు విజయశ్రీ చేపట్టేవారో? అని జరగలేదు- వారి వారి అనుయాయులు అభిమానులైన వారు నిరుత్సాహ మూల ప్రవక్త అనిపించుకొన్న వారి ఓటమిగా చిత్రీకరించడం జరిగింది శంకరుని మాయా వాదాన్ని కాదనడానికి మధ్వాచార్యులు ఏక దేవతా వాద ప్రతిపాదన చేశారు. మాయా వాదం శంకరాచార్యులు సృష్టించింది కాదు అదే విధంగా ఆనందతీర్థుడు సృష్టించిందేమీ కాదు ఏక దేవతా వాద ప్రతిపాదకమైన విష్ణు మతం - రెండూ వేద ప్రతిపాదితాలే - రెండింటికీ మూలం వేదమే ఈర్ష్యా ద్వేషాలకతీతమైనది దైవ జ్ఞానం. కాని ఆనందతీర్థులకు మాయావాదమంటే మహా ద్వేషం వుండడం విచారకరం. ఈ ద్వేషానికి ప్రతీకలుగా- ఆనంద తీర్థ పుంసింహో మాయావాది దితే స్సుతాన్ విద్యాస్య యుక్తినఖరై రప్రతీకోభిఒభి భాసతే ॥ పలాయధ్యం పలాయధ్యం త్వరయా మాయి దానవాః సర్వజ్ఞ హరి రాయాతి తర్కాగమ దరారిభృత్ ॥ ఇత్యాదిగా గల శ్లోకాలు అవతరించాయి. మాయా వాద ప్రతిపాదకులు రాక్షసులనడం గర్హ్యణీయం. ద్వైతం లేకుండా అద్వైతం లేదు - అద్వైతం లేకుండా ద్వైతమూ మనజాలదు. ఇవి రెండూ లేనిదే ద్వైతాద్వైతమూ లేదు.

మాయా విరహితంగా యే సృష్టి లేదు సూర్య కాంతి అణుమాత్రమైనా తగలని కేవల అంధకార గోళాలు వుండవచ్చును గాని సంపూర్ణంగా మాయ మాత్రమే ఏకైక మనడం తొందరపాటు - మాయ కూడా యామం వలె లాలి (నిద్ర) వంటి లీల మాత్రమే. దీర్ఘ నిద్ర కూడా లీలయే మాయ-లీల- పడుగు పేకవంటివైనా పర్యాయపదాలవంటివి కూడా.

వేదబద్ధమై వేదాంతమనదగిన ఏక దేవతావాదాన్ని ఆనంద తీర్థులు పండితుల దృష్టికి ప్రముఖంగా తీసుకొని రావడం మహత్తరమైన విషయం - కాని వేద మంత్రాలన్నీ ఏక దేవతా వాదార్థదాయకాలనీ విష్ణుపరాలనీ మంత్రాలన్నింటికీ విష్ణుపరంగా అర్థాలు వ్రాయబూనడం సమర్థనీయం కాదు. పైగా వేద ద్రోహం - ఋగ్వేద మంత్రాలకు - ఇతర వేద మంత్రాలకు అన్నింటికీ విష్ణుపరమైన అర్థం చెప్పుకో వాలని ఆనంద తీర్థుల వారు మార్గదర్శకంగా ఋగ్వేదంలోని మొదటి నలభై సూక్తాలకూ అర్థం వ్రాశారు. ఋగ్వేదంలో మొత్తం 1028 సూక్తా లుండగా కేవలం నలభై సూక్తాలకు మాత్రమే విష్ణు పరంగా అర్థం వ్రాసి యిదే విధంగా మిగిలిన సూక్తాలన్నిటికీ అర్థం చెప్పుకోవాలనడం సమంజసం కాదు. పైగా యిది వేద విజ్ఞాన లక్షణ లక్ష్యాలకే విరుద్ధమైనది. వేద మంత్ర ప్రయోగ పూర్వకమై వేద విజ్ఞాన లక్షణ లక్ష్యాలకు మూర్తిత్వాన్ని ప్రతి బింబించే ప్రయోగ విజ్ఞానం లోపించడం వల్ల నిర్థకమైన వేద మంత్రార్థ ప్రతిపాదకత్వం వచ్చింది. ఆనందతీర్థులు అగ్ని సూక్తానికిచ్చిన అర్థం సర్వతోముఖమైనది కానేకాదు. అది ప్రయోగ పూర్వకం కాదు ఆనంద తీర్థులిచ్చిన కేవల స్తోత్ర పూర్వకమైన విష్ణ్వర్థాన్ని దృష్టిలో పెట్టుకుంటే రాఘవేంద్రస్వామి అగ్ని సూక్త ప్రయోగంతో తమ మహిమ అంటే మంత్ర మహిమ చూపించ గలిగేవారే కాదు.

ప్రయోగదృష్టిలోవరుణ సూక్తం-వాయుసూక్తం-శ్రీ సూక్తం - పురుష సూక్తం - మొదలైన వాటికి చివరికి మండూక సూక్తం వంటి వాటికి కూడా ప్రయోగదశలో ప్రత్యేకత లున్నాయి. ఈ ప్రత్యే కతలు ఒకదానితో ఒకటి పొంతన కలవి కావు. మంత్ర ప్రయోగాత్మకాలయిన ఈ విజ్ఞాన విషయాలు విలుప్తం కావడంవల్ల వేదాలు పరాభూతాలైనట్లుగా దెబ్బతిన్నాయి. ఆర్ష సంప్రదాయాలను విస్మరించడం వల్లనే వేద విజ్ఞానం మరుగున పడింది.

నానాత్వంలో ఏకత్వాన్ని ఏకత్వంలో నానాత్వాన్ని చూడగలిగింది చూపించ గలిగింది మన వేదవిజ్ఞానం. ఈ అర్థం కూడా చెప్పవచ్చునని ఋగ్వేద మంత్రా లన్నింటికీ ఏక దేవతావాద ప్రతిపాదార్థాన్ని వ్రాసి చూపించవచ్చును. కాని ఏక దేవతావాదం ప్రతిపా దించడం మాత్రమే వేదాల లక్ష్యమనడం సరికాదు. సర్వసమ్మతమూ కాదు ఈ దృష్టితో వేద గౌరవమే దెబ్బతింటుంది. వేదాలకు మూలకారకుడు విష్ణువేనని ఋగ్వేదం ప్రథమ మండలం లోమ్మిదవ సూక్తం లోని నాల్గవ ఋక్కు-యిన "అస్యగ్రయుస్త్రిః తే గిరః" ఇత్యాది ఋక్కు-కు మధ్వాచార్యుల వారు వ్రాసిన అర్థమే చెపుతుంది. దీన్ని కాదనలేము కాని వేద మంత్రాలన్నీ విష్ణుస్తోత్ర రూపాలనడం, ఈ స్తోత్రా లన్నిటికీ కర్త విష్ణువే ననడం - ఆత్మస్తుతి యావ కారాదు కాబోయినా) యితరులు తనను స్తుతించినట్లు విష్ణువే తన స్తుతులుగా మంత్రాలను పలవాడనడం- ఆమోద యోగ్యం కాదు. వివిధ వేద మంత్ర ప్రయోగ పూర్వకమైన శబ్ద నిశ్శబ్ద శక్తులనేకం వున్నాయి. నానాత్వ ప్రతిపాదకాలయిన యీ వివిధ శక్తులన్నీ ఏకత్వ ప్రతిపాదకాలయిన శక్తి మూలం కాలు. అయితే యీ శక్తి విరాడ్రూప-విశ్వరూప ప్రదర్శనకు - సందర్శనకు మూలమైనది- వాదం ఏకతా వాదమనేగాని కేవలం నామ వాచకాలకే కాక వేదాలలో వున్న శబ్దాలన్నింటికీ విష్ణువనే అర్థం చెప్పవచ్చు. అయితే దానివల్ల ప్రయోగ పూర్వకంగా సాధించేదేమిటి? మహా విష్ణువు ఆధిక్యాన్ని చెప్ప దానికి వేద ప్రతిపాదితమైన ఏకతా వాదాన్ని ఆనంద తీర్థులు ప్రతిబింబించారే గాని అంత మాత్రం చేత నానాత్వ స్థితికి స్థానం లేదని కాదు.

మంత్ర ప్రయోగ దృష్టితో వేద మంత్రాలకు అర్థాలు వ్రాయబూనడం హాస్యాస్పదమైన విషయం. అసాధ్యమైన విషయం.

ప్రయోగోపసంహారాలకై సిద్ధిపొందే మార్గాలను లక్షణ లక్ష్యాలను వివరించడం అసలు వేద భాష్య లక్ష్యం కావాలి. ఈ లక్ష్యానికి భిన్నంగా నిర్దిష్టమైన వేదభాష్యాలెన్నో అవతరించాయి. అటువంటివాటిలో ఏక దేవతా వాద ప్రతిపాదార్థకంగా ఋగ్వేద ప్రథమ మండలంలోని తొలి నలభై సూక్తాలకూ భాష్యం కావ్య భాష్యం టీకను ఆనందతీర్థులు (మధ్వాచార్యులు) రచించారు. ఈ టీక సామాన్య దేవతాపరంగాను-విష్ణుపరంగాను - ఆధ్యాత్మ పరంగాను సాగింది. దీనికి జయ తీర్థాదులు భాష్యమనదగిన విస్తృతార్థాలనువివరించారు. శుక్ల యజుర్వేదానికి శ్రీదయానంద సరస్వతి వ్రాసిన భాష్యం శ్రీ అన్నే కేశవాచార్య గారి చేతిమీదుగా తెలుగులో వెలువడింది. ఋగ్వేదానికి సాయణాచార్యులు వ్రాసిన భాష్యానుగుణంగా కావ్య తీర్థ శ్రీ నేమాని వెంకట నరసింహశాస్త్రిగారు చంపువుగా వ్రాసిన కృతి వెలుగు చూడలేదు.

మిగిలిన భాష్యాలేవీ తెలుగులో రానేలేదు. ఆనంద తీర్థుల వారు ఋగ్వేదంలోని ప్రథమ మండలంలో వున్న తొలి నలభై సూక్తాలకూ వ్రాసిన భాష్యాన్ని దాని వ్యాఖ్యలనూ దృష్టిలో పెట్టుకొని డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్యులు ఎం. ఏ పి. హెచ్. డి (లెక్చరర్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం సంస్కృత శాఖ - తిరుపతి) తెలుగులో అర్థ తాత్పర్యాలు వ్రాశారు. (ఋగ్వేదము, ఏక దేవతావాద ప్రతిపాదకమగు ప్రథమాంధ్ర వికృతి - ప్రచురణ శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ ప్రాచ్య పరిశోధనాలయము తిరుపతి 1/8 డెమ్మి సైజు 370 పుటలు- వెల తెలియదు) తెలుగు సరళ గ్రాంధికంలో అర్థ తాత్పర్యాలువ్రాసిన యీ గ్రంథంలో ఋగ్వేదంలోని తొలి నలభై సూక్తాలకు చెందిన 489 ఋక్కులు కూడా వున్నాయి. విద్వద్వరేణ్యులైన ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తిగారు తిరుపతి విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్‌గా వున్న కాలంలో యిచ్చిన ఆజ్ఞ మేరకు డాక్టర్ రఘునాథాచార్య గారు యీ తెలుగు టీకా తాత్పర్యాలు రచించారు. ఆనంద తీర్థులు అతి సంక్షిప్తంగా ఋగ్భాష్యం రచించారు. జయతీర్థుల వారు చాలా విస్తరమైన వివరణాత్మకమైన టీకను ఆనంద తీర్థుల భాష్యానికి వ్రాశారు డాక్టర్ రఘునాథాచార్యుల వారు తమ భూమికలో తెలుగు టీకా తాత్పర్యాలు "ఆనంద తీర్థుల భాష్యం మీద- ఆ భాష్యానికి అవతరించిన జయ తీర్థాదుల టీకల మీద- ఆధారపడి వ్రాసినట్లు వ్రాశారు గాని అది కొంత వరకు మాత్రమే యదార్థం. జయ తీర్థుల వ్యాఖ్యానాన్ని గాని కనీసం శ్రీ రాఘవేంద్ర స్వామి మంత్రార్థ మంజరిని గాని వారు యథాతథంగా అనుసరించి తెలుగు టీక వ్రాసి వుంటే యింకా న్యాయం జరిగి వుండేది. జయ తీర్థులు పేర్కొన్నట్లు "ఋగర్థశ్చ త్రివిధోభవతి ఏకస్తావత్ ప్రసిద్ధాగ్న్యాది రూపః - అపరస్తదన్తర్గతేశ్వర లక్షణః - అన్యోఽధ్యాత్మ రూపః- తత్త్రిత్రయ పరం చేదం భాష్యమ్"- త్రితయపరంగా తెలుగు టీకా తాత్పర్యాలు వ్రాసి వుంటే ఆనంద తీర్థులకు జయతీర్థులకు కొంతైనా న్యాయం జరిగి వుండేది.

తెలుగు లిపిలో ఋగ్వేద మంత్రాలను అర్థ తాత్పర్యాలతో సహా వ్రాసి ప్రకటించదలచినప్పుడు వేద మంత్రాలకు ప్రాణప్రదాలయిన స్వరాలను విడిచిపెట్టకుండా వుంచే దేవ వేదానికి యెంతో సహజత్వాన్ని ఇచ్చినట్లయ్యేది.

ఆచార్య సచ్చిదానంద మూర్తి గారు ఈ గ్రంథానికి సాయణాచార్య కృత ఋగ్వేద భాష్య విషయాలను దృష్టిలో పెట్టుకుని ఉత్తమమై అవశ్య పఠనీయమయిన ఉపోద్ఘాతం విరచించారు. ఇది యీ గ్రంథానికి మకుటాయమానం. మంచి కాగితం మీద గ్రంథాన్ని చక్కగా ముద్రించడంలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు యెంతో శ్రద్ధ వహించారు. అందుకెంతైనా అభినందించవలసిందే.

